# ప్రాచీనాంధ్ర మహాకవుల సంగీత ప్రతిపత్తి

## శ్రీనాథాది రఘునాథ పర్యంతము

పిహెచ్. డి. పట్టము నందిన సిద్ధాంత వ్యాసము


రచయిత్రి

శ్రీమతి భూపరాజు వేంకట శారద M.A. M.Phil. Ph.D

ప్రధానాధ్యాపకురాలు

తెలుగుశాఖ

ప్రభుత్వ మహిళా కళాశాల

గుంటూరు

పర్యవేక్షకులు

ఆచార్య శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తం M.A. Ph.D

ప్రధానాధ్యక్షులు తెలుగుశాఖ

నాగార్జున విశ్వవిద్యాలయము

న నగరము - 522 510

# ప్రణాళికా ప్రస్తారిణి

రాలలో రాగాలు ప్రతిధ్వనించినట్లు
శిలా స్తంభాలలో సప్తస్వరాలు వినిపించినట్లు
ఆంధ్ర సాహితి గీతి ప్రతిపత్తిని పల్కరించినట్లే
ప్రణాళికా ప్రస్తారము కవి గాయకులకు నివేదితమ్ము

# ప్రకాశికా పరిస్తార నివేదిని

# ధ్యానమ్

శ్రీ నాటాద్యనంత రాగ సహితామ్
స్వర వర్ణ సంశోభితామ్
శ్రీనాథాది మహాకవీంద్ర వినుతామ్
వందే సదా భారతీమ్

కావ్య ప్రబంధ గీత బహుళాం
ఆంధ్రీం కల్యాణ ప్రదామ్
వీణా వేణు మృదంగ గాన రసికాం
వందే చ్ఛంద ప్రదామ్ శారదామ్

రఘునాథాది కావ్యశ్రీ కల్హార
మాలాధరామ్
అంబత్వా మనిశం నౌమిసాహితీ
గీతి సంగతామ్

ఇతి
రచయిత్రీ
బూదరాజు వేంకట శారదా

# సమర్పణము



ఇతః పూర్వము నా పరిపూర్ణ జీవిత పరమార్థముగ
ప్రస్తుత చరమ జీవన భారమునకు జ్ఞాపకార్థముగ
నిలిచిపోయిన నా భర్త కీర్తిశేషులు శ్రీ చదలవాడ
సుబ్బయ్యనాయుడు B.A.,B.L.గారికి అనంతసాయుజ్యానంద
ప్రాప్తి ననుగ్రహింపుమను నభ్యర్థనతో మా కులదైవమగు
శ్రీ భావపురి భావనారాయణ స్వామివారికి
సిద్ధాంత వ్యాస మాలిక యగు
ప్రాచీనాంధ్ర మహాకవుల సంగీతప్రతిపత్తి
మనస్సుమన నమస్రజిముగ
సమర్పితము

అభినవ తిక్కన
తెలుఁగు లెంక
—డా॥ తుమ్మల సీతారామమూర్తి

# ఆశీర్వాదము

పెద్దలు కూర్మిమై నిడినపేరు ఫలింప ననేక విద్యలన్
దద్దయు డస్సిగెల్చి కవితానిధు లాద్యులు నన్నయాది ధీ
మద్ధి విశద్వరుల్ నుడువు మంజులసాహితిఁ త్రచ్చితచ్చియం
దుద్దవిడిన్ దసర్చు కళ సుక్తి నిబద్ధపు గానమున్ జగం
బద్ధిర నేర్పనన్ మెఱసినట్టినిసున్, గొనినాళ్ల నాకడన్
విద్దపుఁ బేర్మిమైఁ జదువు నేర్చిన దాని నహంత కేన్నఁడో
యొద్దడిచూపి కీర్తి గడియించినదానిఁ గనంగ నామదిన్
హద్దులులేని హర్షము బయల్పడుచున్నది కొమ్మమంత్రికిన్
ముద్దుల పట్టియైన కవిముఖ్యుఁ దెలర్చిన మేటి పీటిలో,
ప్రొద్దులు పుచ్చునాఁడు సురపుంగవుఁడై శరణార్థినొవ్వలన్
బ్రద్దలుసేయు శ్రీహరిహరప్రభుఁ డాదట నిల్చి చొక్కపున్
గద్దెగ నీపునం బలరు కాలమునందు నపూర్వశోధ నం
బిడ్డి పొసర్చునీ వల ఋషీంద్రుఁడు తిక్కనకైతలోని పె
న్నొద్దికలన్ వెలార్పఁగఁ బ్రయోగమునల్పిన భాషయం దహో!
స ద్దొఁరించుఁటో! హరుఁడు నల్పు నుదాత్తకపాలగాన మా
పెద్దస భూషణుల్ తెనుఁగు పెంపున చిన్నెగ సంతరించి రే
గద్దలిత్త్రైత, దాని స్వరకల్పనతో వెలయించి నిన్ గడున్
దిద్దిన యట్టి తల్లిని సతీమణి సత్యవతిన్ రసజ్ఞులై
పద్దుగడించువారు పలుభంగుల మెచ్చెద, రీవు త్రపపున్
ముద్దకు సుద్ది వచ్చు యిశముం గని యాయు రనామయమ్ములన్
పెద్దెల మేడలన్ బరిణమించెద పీనుడి నమ్ము! శారదా.

PROF. BODDUPALLI PURUSHOTTAM
NATIONAL LECTURER

PROFESSOR & HEAD OF THE
DEPARTMENT OF
TELUGU ORIENTAL LANGUAGES
NAGARJUNA UNIVERSITY
NAGARJUNANAGAR

# అభినందనము

శ్రీమతి డాక్టర్ బూదరాజు శారద సాక్షాత్తుగా శారదా స్వరూప సంగీత సాహిత్యములు రెండును ఆమె లోకమునకు ప్రసాదించి, లోకము సమృద్ధము గావించును.

ప్రాచీనాంధ్ర కవులు కేవల కవులే కాదు. సంగీతాది వివిధ కళా నిష్ణాతులు. కథా కథన శిల్పంలో ప్రత్యక్షంగాను, పరోక్షంగాను సంగీత కళా రహస్యాలెన్నో నిక్షేపం కావించారు. డాక్టర్ శారద ఆ రహస్యాలెన్నో ఈ సిద్ధాంత వ్యాసంలో సరసంగాసమున్మీలించారు — ఎంతో నిపుణంగా! ఇటువంటి రచన ఇంతకు పూర్వం ఆంధ్ర సాహిత్యంలో పుట్టలేదు. ఆ కొరత తీర్చి డాక్టర్ శారద ఆంధ్ర లోకానికెంతో మహోపకారం కావించారు. ఈ కృషి నా పర్యవేక్షణలో జరగటం నా కానంద దాయకం.

—బొడ్డుపల్లి పురుషోత్తం

Prof. **S. V. JOGA RAO,** M.A Ph.D., D.Litt. (Hons.), A.U.
Hon. Cultural Doctorate in Literature
WORLD UNIVERSITY, U.S.A.
NATIONAL PROFESSOR, Dept. of Telugu
ANDHARA UNIVERSITY, WALTAIR
Formerly Professor, U.S.S.R. 1965-'67 &
Principal, A.U. College of Arts, Commerce & Law

5-40, SIRIPURAM
WALTAIR
VISAKHAPATNAM-530 003

# సహృదయ భూమిక

సంగీత సాహిత్య విశారద మా శారద. అన్వర్థ సంజ్ఞిత. ఆ కళలు రెండును ఆమెకు మాతృశ్రీ వరప్రసాదములు. ఆ తలి ఈ బిడ్డకు ఉగ్గుపాలు కుడిపినదో లేదో కాని చిన్నప్పటినుండి తత్కళలయందు అభిరుచిని అభినివేశమును తథాపి కౌశలమును అలవడ జేసిన ఉత్తమ విదుషి.

ప్రకృతమిది శారద డాక్టరు పట్ట పరిశోధన నిబంధము. ప్రాచీనాంధ్ర మహాకవులెందరో ఛందస్సుందరములైన ప్రౌఢకవితలను పరిఢవించుటయేకాదు. ఛందస్సునకును కవితకును సంగీతమునకును గల సహజము సనాతనము సమీచీనము సమంజసమునైన అనుబంధము నాకళించుకొన్నవారు. అంతేకాదు కొందరు సంగీతకళా రహస్యనిధులును, వారివారి కావ్యసాహిత్యమునందలి సంగీతకళాసురభిళములైన సందర్భములను క్షోదక్షమమైన పరిశ్రమము చేసి తన అభిజ్ఞత చొప్పున చతురముగా శాస్త్రీయముగా కళాకౌశలపేశలముగా అవిష్కరించినది శారద. ఆమె చేసిన ఈ సరస్వతీ వరివస్య ఆంధ్రసాహిత్య పరిశోధన చరిత్రలో ఒక అనర్ఘ సన్నివేశము. ఆమెకు నా సాధువాద కృతానేక మంగళాశాసనములు.

స్వస్తి

Professor G.V. Subrahmanyam M.A. Ph.D.
Professor and Head of the Dept. of Telugu
University of Hyderabad,
Hyderabad A. P.

# అభిప్రాయం

శ్రీమతి బి.వి. శారద పి.హెచ్.డి. పట్టము కొరకై సమర్పించిన 'ప్రాచీనాంధ్ర మహాకవుల సంగీత ప్రతిపత్తి' (శ్రీనాథాది రఘునాథ పర్యంతము) అను సిద్ధాంత వ్యాసమును సమగ్రముగా పరిశీలించినాను. రచన సంతృప్తికరముగా నున్నది. నాలుగైదేళ్ళుగా వచ్చుచున్న సిద్ధాంత వ్యాసములలో ఉత్తమ ప్రమాణములతో వెలువడిన గ్రంథములలో నిది యొకటియని నేను నిర్ద్వంద్వముగా భావించుచున్నాను.

లయబద్ధమైన ఛందోరచనలలో సంగీతము అంతర్వాహినిగ నుండుట సహజము. కాని, అట్టి రచనలు సంగీతపు శాస్త్ర మర్మజ్ఞుల చేత రచింపబడినచో సంగీతము సాహిత్యమునందు సర్వాంగ సుందరముగా సంపదింపబడి పద్య రచనలో ప్రతిఫలించుటకు నెంతయు అవకాశమేర్పడగలదు. సంగీత సాహిత్య రంగములలో ప్రవేశమేకాక పరిశోధన పాటవముగల పరిశోధకులీ సమన్వయాత్మకాంశమును సామర్ధ్యముతో నిర్వహింపవీలగును. శ్రీమతి బి.వి. శారద అట్టి సామర్ధ్యమును సముపార్జించుకొనిని విదుషీమణియగుటచే నీ సిద్ధాంత వ్యాస రచనము గాఢ పరిశీలనకు ఫలమై సార్ధకమగుచున్నది. ఇట్టి సమన్వయాత్మక పరిశోధనాంశము నెన్నుకొనుటయే ప్రశంసనీయము. దానిని సాధికారముగా నిర్వహించుటయు అభినందనీయము.

ఈ సిద్ధాంత వ్యాసరచనలో పాటింపబడిన ప్రణాళికా ప్రస్తారము పరిశోధనాంశములలోని సూక్ష్మాంశములను పట్టియిచ్చునట్టిదిగాను. ఇంతకు పూర్వము విమర్శకు లెత్తిచూపని అంశములను వెలికి తీయుటకు వీలగునట్లుగను అమరియున్నది. మొదటి నాలుగు అధ్యాయాలు సిద్ధాంత వ్యాస విస్తర రచనకు ప్రస్తావన వంటివి. అందును 'లయ' అను అధ్యాయము ఆంధ్రభాషలోని ఛందో

నియతి. ఇలంకార రీతి, వ్యాకరణ సంస్థితి మొదలైన అంశములు సంగీత ప్రతిపత్తి కెట్లు సహజాలంకారములుగా నొప్పియున్నవో సోదాహరణముగా నిరూపించినది. అధ్యయనమునకు అనువైన అనుశీలన వ్యవస్థను పరిశోధకురాలు రూపొందించుకొనిన వైఖరినీ అధ్యాయము వాఖ్యానించుచున్నది. ప్రాచీనాంధ్ర మహాకవుల కావ్యముల సంగీత ప్రతిపత్తిని పరిశీలించుట సిద్ధాంతవ్యాస పరిధి యగుటచే శ్రీనాథ మహాకవి మొదలుకొని రఘునాథ భూపాలుని వరకుగల సాహిత్య చరిత్రలో పేరెన్నికగన్న కవుల నెన్నుకొనుట సమంజసముగానున్నది. అయినను అట్టి కవులను దాదాపు అరువది మంది నెన్నుకొనుట జరిగినది. అనగా దాదాపు కావ్య, ప్రబంధ, దక్షిణాంధ్రయుగ సాహిత్యములందు వెలసిన సంగీత ప్రతిపత్తిని సమీక్షించినట్లైనది. విస్తృతమైన ఈ సాహిత్యమును విశేషముగా అధ్యయనము చేసి అందులో సారవంతములైన అంశముల నన్నింటిని సాంగముగ సశాస్త్రీయముగా పరిశోధ వ్యాసమునందు ప్రపంచించుట ప్రశంసార్హమైన అంశము. శ్రీమతి బి.వి. శారద ప్రదర్శించిన ప్రజ్ఞా వైదుష్యముల కీ సిద్ధాంత వ్యాసరచన తార్కాణము.

ఈ వ్యాసమునందు ప్రత్యేకముగా పేర్కొన దగిన అంశములు :

1. ప్రాచీన మహాకవుల కావ్యములలో సంగీతమునకు సంబంధించిన అంశములెన్ని, యేయే పట్టులయందు ప్రసక్తమై యున్నవో వానిని పరిశీలించి సమీక్షాత్మకముగా వాని వైశిష్ట్యమును వివరించుట.

2. మహాకవులు సంగీత శాస్త్ర రహస్యములను కథార్థములందు కాని, వర్ణనావసరములందు కాని, సూక్తి విశేషములందు కాని, పద్యరచనయందు కాని అలంకార సంపత్తియందుకాని నిక్షిప్త మొనర్చి యున్నచో వానిని శాస్త్ర ప్రమాణములతో వివరించి వివేచించుట.

3. నాట్యశాస్త్ర సంబంధులు, దేశి కళాసంబంధులు, వాద్యవాద సంబంధులు, రూపక ప్రయోగ సంబంధులు, అయిన అంశములను కూడ ప్రత్యేకించి పేర్కొని వానిని వివరించుట.

4. మను వసు చరిత్రలలోని పద్యములకు స్వరకల్పనము చేసియు, రాగములకును రసములకును గల సంబంధమును వివేచించియు గావించిన పరిశీలనము పరిశోధననిష్ఠను పట్టి యిచ్చుచున్నది.

5. ఈ సిద్ధాంత వ్యాసమునకనుబంధముగా నుంచిన యం. ఫిల్ పరిశోధన వ్యాసము కూడ విలువైనది. ఈ రెండింటిని కలిపి చదివినచో క్రీ. శ. 11వ శతాబ్ది నుండి 17వ శతాబ్దివరకు వెలసిన ఆంధ్ర సాహిత్య చరిత్రలోని ప్రముఖ కవుల రచనలలో సంగీత ప్రతిపత్తిని తెలిసికొనుటకు వీలగుచున్నది. ఈ పరిశ్రమ ప్రశంసావహము.

ఇంతటి ఉత్తమ సిద్ధాంతమును సమర్పించిన శ్రీమతి బి.వి. శారద గారిని, పరిశోధన పర్యవేక్షకులు ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తముగారిని హృదయపూర్వకముగా అభినందించుచున్నాను.

— జి.వి. సుబ్రమణ్యం

Professor G. Appa Rao M.A., Ph.D.
Professor & Head of the Dept. of Telugu
MADRAS University
MADRAS
Tamil Nadu

I have had the pleasure of going through the thesis submitted by Smt. B. V. Sarada M.A., M.Phil, Ph.D.

Telugu language is reputed to be melodious. It goes with out saying that when music is clothed in Telugu language, the melody that one's auditory sense received is beautiful and enjoyable.

The thesis entitled "PRACHINANDRA MAHAKAVULA SANGEETHA PRATHIPATTI" is a classic example of this quality. The scholar has done some thing unusual in the writing of Telugu thesis and dissertations. There has not been, so for as I know, such an innovation as the present thesis. It is praiseworthy that a new dimension is given to research work in Telugu where phonology is blended with Telugu literature.

The distribution of material in the parts and paragraphs in an orderly manner makes this thesis a peace of art.

The illustrations made here and there by the scholar are not only relevant but they reveal the author's deep sense of involvement in the artistic process.

The foot-notes and other references in Telugu and Sanskrit prove that the scholar has wide knowledge of the subject, besides a researchers proven skill.

Prof. Purushottam who supervised the thesis writing is to be congratulated for his scholarly guidance. Thesis of this kind is not often met with.

Prof. G. Appa Rao

Professor C. Radhakrishna Sarama M.A., Ph.D.
Professor & Head of the Dept. in Telugu
MADURAI University
MADURAI
Tamil Nadu

I have gone through the Ph.D. thesis submitted by Smt. B.V. Sarada.

The Researcher has tried her best to prove that the old Telugu poets beginning from Srinatha to Raghunatha had exhibited in their poems their acquaintance with music. She has ably and successfully illustrated her view point. She has proved that among the old poets, Srinatha, Srikrishnadeva Raya and Ramarajabhu-shana were well acquainted with music and their deep knowledge in describing different raagas is brought out. For instance, the Rese archer has proved that the Emperor-poet Sri Krishnadeva Raya had favoured the raagas like Megha ranjani, Vasantha and Mangala Kaisiki.

The fact that the researcher has deep interest in the topic is evidenced by the notetion brought out by her. The notetion gives some select verses called from the classics Manu charitram and Vasu Charitram as they were sung some fifty years ago in music concerts.

I Congratulate the Researcher and the guide for this excell-ent work.

C. Radhakrishna Sarma

Dr. S. PINAKAPANI, M.D.
CONSULTANT PHYSICIAN &
Vidwan in Karnatic Music & Musicology

SRINIVASA NAGAR.
KURNOOL - 518 004

I have great pleasure to state that Smt. B.V. Sarada, M.A. M.Phil,F.I.P. Scholar, Telugu department, Nagarjuna University,has discussed with me Various topics in Classical Carnatic Music in Connection with her research for Ph D. Degree in Telugu literature on "Pracheena Andhra Kavula Sangita Pratipatti". She has revealed quite a good grasp on musical aspects Concerning the topic of her research.

Dr. S. Pinakapani

# శ్రుతి

శిశుర్వేత్తి పశుర్వేత్తి, వేత్తి గానరసం ఫణీ
కోవేత్తి కవితారస మీశ్వరో వేత్తి వా నవా

*　　　*　　　*

సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయమ్
ఏక మాపాత మధురం అన్య దాలోచనామృతమ్

అను సర్వజన సంవేద్యములగు నీయాభాణకములు, సర్వప్రాణి సమ్మోద జనకమగు సంగీతతత్త్వమును విశదమొనర్చునవి. సాత్త్విక గుణ సంభరితముగా అప్పుడే పుట్టిన శిశువులకు, రజోగుణోపేతములై పగబట్టిన పాములకు, తామస గుణాన్వితములై యజమానికి కట్టుబడని పశువులకుఁగూడ సంగీతము సమ్మోహన జనకమగుచుండగా కవిత్వ తత్త్వము సర్వ సృష్టి విధాయకుడైన పరమేశ్వరునకు గూడ సమ్యక్పం వేద్యమగునో కాదో అనుట సంశయాస్పదమట. అట్టియెడ సర్వజన సకవేద్యమగుటవలన సంగీతము సర్వ లలితకళలను అతిగమించి సర్వ జనామోదమై నెగడుచున్నది అనుట నిర్వివాదాంశము.

అట్టి యీ సంగీతమునకు ప్రతిద్వంద్విగ నిలువగలిగినది సాహిత్యమొక్కటియే. స్థూల దృష్టికి జనసమ్మోహనత్వ ప్రతిపాదనమందు సంగీత సాహిత్యములు ప్రతిస్పర్థులు. సూక్ష్మేక్షిక కవి పరస్పర పరిపోషితములుగా, అవినాభావ సంబంధులుగా గోచరించుచున్నను, సంగీతమునందు సాహిత్యము వ్యక్తము. సాహిత్యమునందు సంగీతము అంతర్నిహితము. సాహిత్యమునందలి శ్రవణ సుఖము, తాళ లయాన్వితత్వము, అక్షర సమత్వము, తంత్రీలయ సమన్వితత్వము మున్నగునవన్నియు సంగీత లక్షణములే. సంగీత స్వరత్వమునందలి అపార మాధుర్యమునకు, ఆలోచనామృతత్వమును ప్రతిపాదించునది సాహిత్యమే. కావుననే మనవారు ఆ సంగీత సాహిత్యముల రెంటిని జగన్మాతయగు బ్రహ్మాణీ వక్షోజాత క్షీర సమములనిరి. స్తనంధయ శిశువు మాతృ స్తన్యమును ఇరుపైపుల కడుపు నిండుగ తనివార గ్రోలనిదే, ఒకవైపు త్రాగుచు మఱియొక త్రేవ స్పర్శింపనిదే తుష్టిని, పుష్టిని పొందనట్లే, కావ్యాంతరిత సంగీత

సాహిత్యముల రెంటిని ఆస్వాదించి ఆనందింపజాలని పాఠకుడు తప్పు సహృదయుడుగా రూపొందజాలడను అభిప్రాయము పైని ఉట్టంకించినచాటు శ్లోక మభివ్యక్త మొనర్చును ఈ శ్లోకాంతరిత భావమును మెచ్చి, తమకు నచ్చిన రీతిలో మన ఆంధ్ర కవి వతంసులందరు, తమ కావ్యములందు గీతిసాహిత్యులకు ఏదియో యొకరీతినున్న అనుబంధమును సమ్యక్ సంభావితము గావించినారు. కొందరు ప్రత్యక్షపద్ధతిలో సంగీతసాహిత్యాను బంధమును దృఢముగ వ్యక్తీకరించినారు. మరికొందరిద్దానిని పరోక్షపద్ధలో భంగ్యంతరముగ సుట్టంకించనారు.

ఈ రీతిని నన్నయనుండి నాచన సోమనార్యుని వఱకుగల ప్రాచీనాంధ్ర కవుల సంగీత ప్రతిపత్తిని ప్రత్యక్ష పరోక్ష పద్ధతులలో పొడగట్టుచున్న రీతిని బట్టి అనుశీలించి యం ఫిల్. పట్టమునకై లఘు సిద్ధాంత వ్యాసముగా సమర్పించితిని.

పిదప అదే రీతిలో శ్రీనాథ కవిసార్వభౌముని నుండి రఘునాథ నాయక కవిశేఖరుల వరకు వారి యుగాంతరితులగు కవివరుల కావ్యములందలి సంగీత ప్రతిపత్తిని పరిశోధనాంశముగ గైకొని సిద్ధాంత వ్యాసరచనమును పిహెచ్.డి. పట్టమునకై సమర్పింప వ్యాసంగమును సాగించినాను. ప్రాచీనాంధ్ర కవుల సంగీత ప్రతిపత్తిని అనుశీలించుటయందు వ్యక్తము గావించిన సంగీత పారిభాషికములు చర్విత చర్వణములు కాకుండుటకై ఆ ప్రథమ భాగమును సిద్ధాంత వ్యాస గ్రంథమునకు అనుబంధించినాను.

అర్ధ శతాబ్దము క్రిందట గాయకులు వైణికులు సంగీత సభా కార్యక్రమాంతమును సాహితీవిదులనుగూడ నలరించుటకై వీణానుగతముగ నాలపించెడి మను వసు చరిత్రాంతరిత పద్యరీతి యొకటి యుండెడిది. అది రానురాను మసకవారి నేడది పూర్తిగ అప్రచలితమై పోయినది. ఏబది లేక అరువది సంవత్సరముల పూర్వమునాటి సంగీత సభా కార్యక్రమముల విని ఆనందించిన గాన రసికులగు ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారు, ఆచార్య గంటి జోగి సోమయాజులుగారు, ఆచార్య కాకర్ల వేంకటరామ నరసింహముగారు, బ్రహ్మశ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు, శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యుల

వారు వంటి సహస్రసమాసాధిక జీవులగువారు కొందరు ఈసంప్రదాయము నెఱిగి యున్నారు.

వీరిలో మా ప్రాచార్యులగు ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారు రెండున్నర దశాబ్దముల క్రిందట ఆకాశవాణి సాహితీప్రయోక్తలుగ విజయవాటిక యందున్నపుడు నేనొకసారి ఆకాశవాణి సంస్కృత నాటక కార్యక్రమమున పాల్గొనుట కేగితిని. అపుడు ఆచార్యదేవులు నాతోపాటు వచ్చియున్న సంగీత విదుషియగు మా అమ్మతో చిన్ననాటి సంగీత సభా కార్యక్రమముల గురించి ముచ్చటించుచు సభాంతమున వీణానుగతముగ గానము చేయబడెడు మను వసు చరిత్రల పద్యముల నాలపించురీతినిగూర్చి ప్రస్తావించిరి. ఆనాటికే సంగీత సాహిత్యానుబంధము ననుశీలించుచు పరిశోధనము గావింప ఉత్సుకతను ప్రదర్శించిన నన్నాశీర్వదించిరి. ఆ సందర్భమున మను వసు చరిత్ర పద్యగాన సంప్రదాయము నెరిగిన మా అమ్మగారిని సంభావించిన, నా పరిశోధన వ్యాసమున మను వసు చరిత్రాంతరిత పద్యగాన రీతిని స్వరపరచి అనుసంధింప వలయునని ఆదేశించిరి. వారి ఆశీర్వాదము నేటికి ఫలించినది. మజ్జనని ఆనాటి ఆచార్యోపదేశమును శిరసావహించి కొన్ని మను వసు చరిత్రములందలి పద్యములను తాను గురుకుల సంప్రదాయములో నేర్చిన విధానము ననుసరించి స్వరపరచినది. వానిని ఈసిద్ధాంత వ్యాసమునకు అనుబంధముగాజేర్చి చరితార్థ నైతినని భావించుచున్నాను.

ఈ పరిశోధన వ్యాసము కవిసార్వభౌముని కర్ణాట గాన ప్రతిపత్తితో వల్లవిత మగుచున్నది. శ్రీనాథుడు ఆంధ్ర సాహిత్యమునందు కావ్యరీతికి శ్రీకారము చుట్టుటతోపాటు గీతి ప్రతిపత్తికి నాందీ శ్లోకమునుగూడ పఠించినాడు. తన కవితా సుందరిని గాన రసికనేగాక నాట్య మోహినిగఁకూడ గావించి తానే సూత్రధారుడై నేపథ్యమున నిలచి తెరపెడలించినాడు. ఇట్టి గీతిసాహితీప్రతిపత్తి ఈ కవిసార్వభౌముని కవనమున నిబిడమై కర్ణాటరీతీ సమన్వితమై ప్రతిభాసించి తీరు తీయములతో నృత్య గానరీతులలో సమ్యక్సం భావితమైనది. ఇట్టి తౌర్యత్రిక పాండితి శ్రీనాథునికే సాధ్యమని, అట్టిది తదితరా సాధ్యమని మా ఆచార్యదేవులు డా॥ శ్రీ కాకర్ల వెంకటరామ నరసింహముగారు విద్యార్థినీ దశ

యందే నన్నాదేశించిన రీతిలో నాట్యశాస్త్ర సహాకృతితో పల్నాటి వీరచరిత్ర మందలి నాట్యశాస్త్రోదీరిత లక్షణానుశీలనమును ఆవిష్కరించుచుని ఇతర గ్రంథ పరిశీలనమునుగూడ గావించినాను శ్రీనాథుడు మూలమై నిలుపగ ప్రఫుల్లమైన గీతిసాహితీ సమంచిత వసంతగానమునకు సర్వ ప్రకృతి పరవశింప క్రీడాభి రామమై వల్లభుని హృద్గత గీతితో సంవాదముచేసి గీతికల నాలపించి "మాగిలి మాగిలి వృక్షపు పూగొమ్మల నుండి షడ్జము ప్రకాశింపనాతే గొంటము నెమలియై" "నటనమాడి సాపాయనుచు శ్రుతి బట్టెనట" అనుచు వల్లభామాత్యుని కవితను గూడ పలకరించినాను.

శ్రీనాథుని యుగమునందున్న కవిపటలలో పిల్లలమర్రి పినవీరనాచార్యుడు, వల్లభామాత్యుడు తాళ్ళపాకపు కవివరులు మున్నగువారందరు. శ్రీనాథ కర్ణాట రీతిచే ప్రభావితులై అటు దేశిని, ఇటు మార్గమును ఇరువైపుల నిలుపుకొని గీతి సాహితి సమంచిత కవనరీతిని నిర్వహించినారు. ఇట్టి కవన గాన రీత్యను శీలనమున శ్రీనాథయుగాంతరిత కవులు ప్రదర్శించిన పలుపోలడలను ప్రకరణాం చితముగ దర్శించునాను. ఆంధ్ర విశ్వవిద్యాలయాంధ్రశాఖా విద్యార్థినిగానున్నప్పుడు మా గురుదేవులు డా॥ శ్రీ భద్రిరాజు కృష్ణమూర్తిగారు (ఇప్పుడు హైద్రాబాద్ విశ్వవిద్యాలయోపాధ్యక్షులు) నాదృష్టిని గౌరన, కొరవి గోపన, జక్కనార్యాదుల గీతవాద్య నృత్యపాండితిపై కేంద్రీకరింపజేసిరి. అద్దానిని పరిశోధనాపధిలో సమ్యగను శీలనాలక్ష్యముగ సమసంధించితిని. శ్రీనాథ యుగమునకు తరువాతి దయిన కృష్ణరాయల యుగమున ఆంధ్ర కవివతంసుల సంగీత ప్రతిపత్త్యను శీలనమున ప్రత్యక్ష పద్ధతి చోటుచేసికొనినది. శ్రీనాథ యుగాంతము వరకు వ్యక్తావ్యక్తమైన కవితాకన్య రాయల యుగమున పూర్తిగ నవగుంఠనమును దొలగించుకొని గానవినోదముల, నృత్యవిశేషముల రంగమున నిలచి ప్రదర్శించి నది. రాయలవారి సాహితీ భువన విజయాస్థాన మంటపమున తొలిసారిగ నిషాద స్వర బృంహిత ధ్వానమును పెద్దనార్య దిగ్గజము గావించినది. ఆ మహాత్ముని గీతిసాహితీ సమంచిత రసనాభినందనము గావించుటతోనే రాయలనాటి సంగీత రసికతకు శ్రుతి సంతరింపబడినది.

రహిపుట్ట జాత్రగాత్రముల రాల్గరగించు విమలగాంధర్వ విద్యానిధియైన

వరూధినిని ఆలాపగతింజొక్కియుండగా సాహితీ ప్రవరాఖ్యులు యెట్ట ఎదుట సాక్షాత్కరింపజేసి గీతిచే సాహితిపై సవాలు చేయించిన ఘనకీర్తి పెద్దనకే దక్కినది.

"వాలాయంబు కొనగోళ్ళ నీ వలసతన్ వాయించుచో నాటకున్
మేళంబైన విపంచినిన్న మొదలున్ నీవంటమింజేసియా
యాలాపంబె యపేళ బక్కెడుం బ్రభాతాయాత వాతాహతా
లోల త్తంత్రుల మేళవింపగదవే లోలాక్షి! దేశాక్షికిన్"

అని నిద్రాముద్రిత పోరె అన్యమనస్కయైన వాజ్మయిని వైతాళిక గీతినాలపించి హెచ్చరించినాడీ కవీంద్రుడు. ఆ హెచ్చరికల కులికిపడి ఆయత్తయెలేచి అతని సాహితి.

"కరమకర సంకటహ రత్న కటక యుంయుణ ధ్వని స్ఫూర్తితో
తాళ ప్రౌఢిమను ప్రకటించిన తీరుతీయులను సమ్యక్సంభావితము గావించినాను.

రాయలవారి ఆ ముక్త మాల్యద మధుర భక్తి భరిత స్వాంతయై, విష్ణుగా మనియై మేఘరంజనిని నిజశ్లేషము గోరి పాడినది. ఇట్టి మధుర భక్తియుత జీవేశ్వరైక్య విషయక విరహగీతికా గానము గీతి సాహితి సమరాంగణ సార్వ భౌమోద్దీపితముగ ఆ ముక్త మాల్యదాంతరముగ విని, సంగీత రసికులకు సాహితి విదులకు నివసింప గల్గితినను మదావహము.

ఇక ముక్కుతిమ్మనార్యుని ముద్దు పలుకులలో పారిజాతాపహరణ కావ్య మున 'సరిగమ పదని' సప్తస్వరముల మహతి నధో వాయు నిహతి మొర యించుచు నారదుడు సాక్షాత్కరింపగా ఆ కావ్యనాయక యగు సత్య 'బాల పల్లవ గ్రాస పోషిత కంఠ కల కంఠ వధూ కల కాకలీ ధ్వని యుతముగ అనాహత నాదమును పూరించినది. క్రొవ్వాడి గోళ్ళ తంత్రుల వీణియల మీట గల సమర్థలగు ఆమె చెలులైన అంతఃపురాగనలు ఆ సంగీతమునకు అనుగత ముగ జంత్రమును నిర్వహించినారు. ఇయ్యది రాశిలో స్వల్పమైనను వాసిలో

యందే నన్నాదేశించిన రీతిలో నాట్యశాస్త్ర సహకృతితో పల్నాటి వీరచరిత్ర మందలి నాట్యశాస్త్రోదీరిత లక్షణానుశీలనమును ఆ మ్మహామహుని ఇతర గ్రంథ పరిశీలనమునుగూడ గావించినాను శ్రీనాథుడు మూలమై నిలువగ ప్రఫుల్లమైన గీతిసాహితీ సమంచిత వసంతగానమునకు సర్వ ప్రకృతి పరవశింప క్రీడాభి రామమై వల్లభుని హృద్గత గీతితో సంవాదముచేసి గీతికల నాలపించి "మాగిలి మాగిలి వృక్షపు పూగొమ్మల నుండి షడ్జము ప్రకాశింపన్లే గొదమ నెమలియై" "నటనమాడి సాపాయనుచు శ్రుతి బట్టినది" అనుచు వల్లభామాత్యుని కవితను గూడ పలకరించినాను.

శ్రీనాథుని యుగముననున్న కవివరులలో పిల్లలమఱ్ఱి పినవీరనార్యుడు, వల్లభామాత్యుడు తాళ్ళపాకపు కవివరులు మున్నగువారందఱు శ్రీనాథ కర్ణాట రీతిచే ప్రభావితులై అటు దేశిని, ఇటు మార్గను ఇటువైపుల నిలుపుకొని గీతి సాహితీ సమంచిత కవనరీతిని నిర్వహించినారు. ఇట్టి కవన గాన రీత్యను శీలనమున శ్రీనాథయుగాంతరిత కవులు ప్రదర్శించిన పలుపోలడలను ప్రకరణాం చితముగ దర్శించునాను. ఆంధ్ర విశ్వవిద్యాలయాంధ్రశాఖా విద్యార్థినిగానున్నపుడు మా గురుదేవులు డా॥ శ్రీ భద్రిరాజు కృష్ణమూర్తిగారు (ఇప్పుడు హైద్రాబాద్ విశ్వవిద్యాలయోపాధ్యక్షులు) నాదృష్టిని గౌరన, కొరవి గోపన, జక్కనార్యాదుల గీతవాద్య నృత్యపాండితిపై కేంద్రీకరింపజేసిరి. అద్దానిని పరిశోధనావధిలో సమ్యగను శీలనాలక్ష్యముగ ననుసంధించితిని. శ్రీనాథ యుగమునకు తరువాతి దయిన కృష్ణరాయల యుగమున ఆంధ్ర కవివతంసుల సంగీత ప్రతిపత్త్యను శీలనమున ప్రత్యక్ష పద్ధతి చోటుచేసికొనినది. శ్రీనాథ యుగాంతము వరకు వ్యక్తావ్యక్తయైన కవితాకన్య రాయల యుగమున పూర్తిగ నవగుంఠనమును దొలగించుకొని గానవినోదముల, నృత్యవిశేషముల రంగమున నిలచి ప్రదర్శించి నది. రాయలవారి సాహితీ భువన విజయాస్థాన మండపమున తొలిసారిగ నిషాద స్వర బృంహిత ధ్వానమును పెద్దనార్య దిగ్గజము గావించినది. ఆ మహాత్ముని గీతిసాహితీ సమంచిత కవనాభినందనము గావించుటతోనే రాయలనాటి సంగీత రసికతకు శ్రుతి సంతరింపబడినది.

రసిపుష్ట జాత్రకగాత్రముల రాల్గరగించు విమలగాంధర్వ విద్యానిధియైన

వరూధినిని ఆలాపగతింజొక్కియుండగా సాహితీ ప్రపరాఖ్యులు యెట్ట ఎదుట సాక్షాత్కరింపజేసి గీతిచే సాహితిపై సవాలు చేయించిన ఘనకీర్తి పెద్దనకే దక్కినది.

"వాలాయంకొనగోళ్ళ నీ వలసతన్ వాయించుచో నాటకున్
మేళంబైన విపంచినిన్న మొదలున్ నీవంటమింజేసియా
యాలాపంబె యపేళఁ బల్కెఁడుఁ ప్రభాతాయాత వాతాహతా
లోలత్తంత్రుల మేళవింపగదవే లోలాక్షి! దేశాక్షికిన్"

అని నిద్రాముద్రిత హోత్ర అన్యమనస్కయైన వాఙ్మయిని వైతాళిక గీతినాలపించి హెచ్చరించినాడీ కవీంద్రుడు. ఆ హెచ్చరికల కులికిపడి ఆయత్తయైలేచి అతని సాహితి.

"కర్మకర సంకరుహ రత్న కటక ఝుంఝుణ ధ్వని స్ఫూర్తితో
తాళ ప్రౌఢిమను ప్రకటించిన తీరుతీయులను సమ్యక్సంభావితము గావించినాను.

రాయలవారి ఆ యుక్త మాల్యద మధుర భక్తి భరిత స్వాంతయై, విష్ణుగా మునియై 'మేఘరంజిని'ని నిజక్షేమము గోరి పాడినది. ఇట్టి మధుర భక్తియుత జీవేశ్వరైక్య విషయక విరహగీతికా గానము గీతి సాహితి సమరాంగణ సార్వ భౌమోద్దీపితముగ ఆ ముక్త మాల్యదాంతరముగ విని, సంగీత రసికులకు సాహితి విదులకు నివసింప గల్గితమనుట ముదావహము.

ఇక ముక్కుతిమ్మనార్యుని ముద్దు పలుకులలో పారిజాతాపహరణ కావ్య ము 'సరిగమ పదని' సప్తస్వరముల మహతి సథో వాయు నిహతి మొర యించుచు నారదుడు సాక్షాత్కరింపగా ఆ కావ్యనాయక యగు సత్య 'బాల పల్లవ గ్రాస పోషిత కంఠ కల కంఠ వధూ కల కాకలీ ధ్వని యుతముగ అనాహత నాదమును పూరించినది. క్రొవ్వాడి గోళ్ళ తంత్రుల వీణియల మీట గల సమర్థలగు ఆమె చెలులైన అంతఃపురాగనలు ఆ సంగీతమునకు అనుగత ముగ జంత్రమును నిర్వహించినారు. ఇయ్యది రాశిలో స్వల్పమైనను వాసిలో

అనల్పమైనంసి తిమ్మనార్యుని సంగితాభిరుచికి ప్రతీకగా పారిజాతాపహరణ కావ్య విషయకముగ నుట్టంకికము గావించితిని.

రాయల సమకాలికుడు కాకున్నను, రాయల యుగాంతర వర్తియైన పింగళి సూరనార్యుని "కళాపూర్ణోదయ" మందలి కథ అంతయు గానామృత వర్షిణీ రాగాలాపనా నేపథ్యముతో ఎట్లు నడచెనో నిరూపింప యత్నించితిని. ప్రభావతీ ప్రద్యుమ్నము నందు మాటు నడని సంగీత ప్రభావమును గూడ యథాశక్తిని వ్యక్తీకరించితిని.

కళాపూర్ణోదయనాయిక కలభాషిణి కీర్తనా పాత్ర చిత్రమృదుగీత కళా కలన ప్రవీణ గాన కళలో నెవ్వారిని బోరించక యొక క్షణమేని తరింపగా నేరని అనుసాక్షాద్వాణీబ్రహ్మల తనయుడైన నారదుడే యిందు సూత్రధారుడు. ఆ నారదుని పాత్రమున పింగళి సూరనార్యుని సంగీత కళా వైదుష్యము ప్రదర్శితము. జాంబవతీదేవి సంగీత పాండితి ప్రశంసనమున సూరనార్యుని గాన విజ్ఞానము ప్రవ్యక్త మొనర్చితిని.

రాధామాధవ కవి మధుర భక్తి గీతికగా నాలపించిన రాధామాధవ కావ్యాంతరిత గానాసూన రీతిని గూడ అనుశీలించితిని.

కేవల సంగీతాభిజ్ఞతను మాత్రమే గాంచి మురిసిపోవుట గాక సంగీత కళా రహస్య విధులను జూపించి తరించిపోవు నదవకాశమును గీతి సాహితీ ప్రియులకు గల్గించి ఘనకీర్తిని దక్కించుకొన్న ఏకైకాంధ్ర గీతి సాహితీ సార్వభౌముడుగ భట్టుమూర్తికి పట్టము గట్టవచ్చును. ఆ మహాకవి వరుడు తన వసు చరిత్రారంభమున తాను సంగీత కళా రహస్య నిధినని చెప్పికొనినాడు. అమ్మహామహుని గీతి సాహితి కళా చణత్వమునకు యథాశక్తిని నీరాజనమెత్తితిని గురుదేవులు ప్రాచార్య డా॥ యస్. వి. జోగారావుగారు వసు చరిత్రాంతరిత పద్యతతియందు ప్రతిభాసించిన రాగము దాలంకార సంతత శాస్త్రరీతులపై నా దృష్టిని కేంద్రీకరింప జేసిరి. అయ్యాచార్యోపదేశమును పరిశోధనావధి యందు గూడ మనసు నందిడుకొని పరిశ్రమించి రాగ విధులను గాంచి తరించితిని. ఇమ్మహాకవి పదునిడైన ద్వ్యర్థి కావ్యమగు హరిశ్చంద్ర నలోపాఖ్యానమున

అలంకార శాస్త్ర గ్రంథమగు నరసభూపాలీయమున గూడ క్వాచిత్కముగనైనను ఎంతో కొంత సంగీత ప్రస్తావన లేకపోలేదు. కాని గ్రంథ విస్తరణభీతిచే ఆలంకారిక దృక్పథి అప్పాయదీక్షితాది చిత్ర కావ్యముల పొంతకు పోనైతిని.

వసుచరిత్ర కారునివలె సంగీతరీతి సంభావితముగ చరిగొండ ధర్మనార్యుడు, ప్రౌఢకవి మల్లనార్యుడు, ఎడపాటి ఎల్లనార్యుడు తమతమ కావ్యముల నెట్లు నడిపించిరో పరామర్శించితిని.

దక్షిణాంధ్ర సారస్వతమున గీతియే సాహితిని పాడించి కవ్వించి నవ్వించినది. ఇంతకు ముందు సాహిత్యము నందలి సంగీత రీతిని శోధించిన ఈ యుగమున సంగీతమునందలి సాహిత్యమును పరిశోధింపవలెను ఈ దక్షిణాంధ్ర యుగమున రాజులు రాజకవులై, కవిరాజులై ఆ స్థానమున సాహితీ గీతికలనాలకించి ఆలపించినారు. రఘునాథనాయకుడు వాగ్గేయకారకుడై గోవింద దీక్షితాచార్యుడను సంగీత శాస్త్ర కారునకు శిష్యుడై వేంకటమఖి పండితుడను బయకారునకు సతీర్థ్యుడై సంగీత ప్రాధాన్యము గల కావ్యములను, సంగీత సుధయను శాస్త్ర గ్రంథమును కూడ రచించినాడు. ఇట రఘునాథనాయకుని కావ్యములను అతని మెప్పు నందిన చేమకూర వేంకట కవి విజయ విలాస కావ్యముకూడ వ్యాసమున ప్రస్తావించినాను.

శ్రీనాథునినుండి రఘునాథుని వరకు సాగిన కవనగాన రీతినిఅనుశీలించుట నా పరిశోధనా వ్యాస ధ్యేయముగ ప్రవర్తిల్లినదిగాన విజయరాఘవాస్థాన కవయిత్రియైన రంగాజమ్మ గానరీతిని, చెంగల్వ కాళ కవి సంగీత పద్ధతిని గూడ పరిశోధనా వ్యాసమున ప్రస్తావించినాను.

ఖండశర్కరాయుతమగు పానకమున తిపి ఏపాటిదొ విత్కరించుటవంటిది యక్ష గానాంతరిత సంగీత రీతిని వెదకుట. యక్ష గానముల యందలి సంగీత రీతిని అభినందించుటనక్క సాహిత్య రీతినీ అనుశీలించుట తగినట్టిపని. నా పనీ సాహిత్యాంతరిత మగు సంగీత రీతిని ప్రస్తావించుట అగుటచే యక్ష గానముల చెంతకెపోనైతిని.

నా నేర్చినంతవరకు శ్రీనాథుని నుండి రఘునాథుని పర్యంతము ప్రవర్తిల్లిన సాహిత్యాంతరిత సంగీత స్ఫూర్తి పండిత జనామోదమె నిలచిన నా జన్మకదియే మన్నన.

నా పరిశోధన విషయకముగ నాకు గలిగిన సంగిత సాహితీ విషయకము లగు సందేహములను తీర్చి సలహాలను నొసంగిన వారు ఆచార్య వర్యులు, హితైషులు శ్రీ గంటి జోగి సోమయాజులుగారు, శ్రీ డా॥ దొణప్పగారు డా॥ S.V. జోగారావుగారు కూడ నున్నారు. చరిత్ర కారులు సంగిత సాహిత్య ప్రవీణులునగు నేలనూతల కృష్ణమూర్తిగారు, శ్రీమతి శ్రీవాత్సవ పౌలస్యగారు కుమారి R.H. లీలగారు కూడ నాకు సహకరించినారు. వారికి నా కృతజ్ఞతలు.

ఉగ్గుపాలతొ నాకు సంగితాభిరుచిని మా అమ్మ కల్గంపగా భయ భక్తులలో సాహిత్యోపాసనా నిరతిని బాల్ల శ్రీ సరస్వతి స్మారకోన్నత పాఠశాలా విద్యార్థిని నున్నపుడు నాలో ప్రవేశపెంచిన మా గురుదేవులు శ్రీమతి భీమరాజు వర లక్ష్మమ్మ గారికి కీ॥ శే॥ పేరలి వెంకట క్రిష్ణయ్య గారిక శ్రీ బి. ఆర్. ఎ. దీక్షితులుగారికి నానమస్సులు. గుర్తపురి ప్రభుత్వ మహిళా కళాశాల విద్యార్థినిగా నున్నప్పుడు నన్ను సంగిత సాహిత్య వ్యాసంగమున తీర్చిదిద్దిన కుమారి M. సరోజిని శ్రీమతి T. స్వరాజ్యలక్ష్మి, కీ॥ శే॥ శ్రీమతి జి. కనకమ్మ గార్లకు (ఆనాటి కళాశాలాధ్యాపికలు) నా నమస్సులు.

ఈ నా పరిశోధనా వ్యాసంగోపయుక్తముగా అనేక సంగిత శాస్త్రజ్ఞులతో ముఖాముఖిని నిర్వహించితిని. అట్టి వారిలో శ్రీ మంచాళ జగన్నాధరావుగారు, డాక్టర్ అరిపిరాల సత్యనారాయణగారు శ్రీ S. పినాకపాణిగారు, శ్రీమతి కోటంరాజు సీతాభాయిగారు, విద్వాన్ శ్రీ శిష్టా సత్యనారాయణ రాజశేఖరంగారు మున్నగు వారెందరో మహానుభావు లున్నారు. వారందరికి నా వందనములు.

ఓపినంత మేరకు ఆంధ్ర వాఙ్మయాంబుధిని, గీర్వాణ భాషాంచిత సంగిత శాస్త్ర మంధరాచల సహకృతితో మధించి తదంతర్గత సంగిత సుధాకలశమును వెలార్చుటకు గావించిన నా ప్రయత్నములో నేనెంత మేఱకు కృతకృత్యురాల నైతినో సుధీసుమనజ్ఞలే నిర్ణయింతురు గాక.

ఇట్లు
గీతి సాహితీ సహృదయ విధేయ
బూదరాజు వేంకట శారద

# అనుశ్రుతి

కవనగాన రసికులైన మాతండ్రిగారు కీ.శే. బూదరాజు హనుమంతరావు గారు చిన్ననాటినుండి నాకు సంగీతసాహిత్యాభిమానమును కల్గించినారు. మా తల్లి శ్రీమతి బూదరాజు సత్యవతమ్మ నాకు అమ్మయేకాక ఆచార్యయునై విద్యా విషయికమగు ప్రోద్బలమొసగినది.

సాహితీరీతిలోనేగాక సంగీతవిషయికముగాగూడ సతీర్థ్యులైన గురు వర్యులు డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తమార్యుల నిశిత పర్యవేక్షణ, మాఅమ్మ సంగీతపర్యాలోచన గానసదృశమగు పరిశోధనకు శ్రుతిలయలను ప్రకల్పించినది. నా భర్త శ్రీ సి. సుబ్బయ్యనాయుడు, బి.ఏ. బి.ఎల్. గారి నిరంతర ప్రోత్సాహము, కర్తవ్యజ్ఞాపనము రాగమయమగు నా సిద్ధాంత వ్యాసరచనమున స్వరప్రస్తారమై భాసించినది. ఈ పరిశోధనమున నాచే నిరంతరాయముగ సాహిత్యానుశీలనము గావింపజేసిన ఈ ముగ్గురికి కృతజ్ఞతలు తెలుపుటకు శక్తిచాలదు.

ఇతః పూర్వము నాగార్జున విశ్వవిద్యాలయ ప్రాచార్యులుగ ఆంధ్ర శాఖాధ్యక్షులుగ నున్నపుడు నాకు పరిశోధనావకాశము నొసగి సంగీత విషయక ములగు నా సందేహములను గొన్నింటిదీర్చి మూడేండ్లు నిరంతరాయముగ పరి శోధనగావించు సౌకర్యమును కలిగించినందులకేగాక నా సిద్ధాంత గ్రంథ ప్రచురణార్థమై ఆర్థిక సహకారమునందించి ప్రోత్సహించిన తెలుగు విశ్వ విద్యాలయ ఉపాధ్యక్షులు ఆచార్య శ్రీ తూమాటి దోణప్ప D. Litt. గారికి నా కృతజ్ఞతాంజలులు.

"గీతం వాద్యం తథా నృత్తం త్రయం సంగీతముచ్యతే" అను సటుల సమగ్ర సంగీతానుశీలనము గావింపనెంచి భరతనాట్యశాస్త్ర, నృత్తరత్నా వళ్యాదులనుగూడ పఠించితిని. అపుడు ఆచార్య శ్రీ జమ్ములమడక మాధవరామ శర్మ, ఆచార్య శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావు, ఆచార్య శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారల వివరణాత్మకాభి భాషణములు నాకు ఉపయుక్తములైనవి. ఏతద్రాగరసాత్మక నాట్యశాస్త్రవిధులకు లక్ష్యములు కాదగినరీతులను ప్రదర్శనా

లక్ష్యములుగ డా॥ S. V. భుజంగరాయశర్మగారిచే రచితములైన కూచిపూడి నాట్య రూపకముల ప్రదర్శనములను ఆచార్య శ్రీ వెంపటి వారి అధ్వర్యమున దర్శించి నెల్లూరి నాట్యాచార్యులు శ్రీ కోటసుబ్రహ్మణశాస్త్రిగారు, గుంటూరులో నాట్యాచార్య గుంటూరు లక్ష్మీనరసింహశాస్త్రులుగారు తమ విద్యార్థులకు ఉపదేశించుచుండగా గాంచి, నాట్యాచార్య శ్రీ నటరాజ రామకృష్ణగారు ఆలయ నృత్యాదికములను గూర్చి పత్రికాముఖమున గావించిన రచనములనుచూచి వివేచించుకొనినాను. కాన గురుతుల్యులగు ఈ నాట్యశాస్త్రకారులకు, నాట్యకారులకు నా నమస్కృతులు. గీర్వాణభాషా రచితములగు అనేక సంగీత నాట్యశాస్త్ర గ్రంథములను అనుశీలింపదగిన అవగాహనమును నాకు కల్గించిన నా సంస్కృతాంధ్రత గురువులు కీ.శే. ఇనపకుతిక శంకరశాస్త్రిగారు, కీ.శే. దువ్వూరి వేంకట రమణశాస్త్రిగారు, శ్రీతుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు, శ్రీ మధుసూదన షడంగిగారు, శ్రీమాన్ శ్రీమత్తిరుమలగుదిమెట్ల నరసింహాచార్యులవారు సదావందనీయులు గీతి సాహితీ చరిత్రచార్యులు డా॥ ఓ. రామచంద్రయ్యగారు వంద్యులు.

మూడేండ్ల గురుతరమగు సిద్ధాంత వ్యాసరచనా బాధ్యతను స్వీకరించిన నేను గృహనిర్వహణమున కృతకృత్యను గాలేనేమోనని సందేహింపక, అడ్డు చెప్పక అనుమతించి ఆశీర్వదించి ప్రోత్సహించుచున్న మా మామగారు శ్రీ చదలవాడ కుమారరావు, బి.ఏ. (రిటైర్డు డిస్ట్రిక్టు రిజిష్ట్రారు) గారికి నా నమస్కారములు.

తాను విద్యాధికుడు గావలెనని ఆరాటపడక తన చెల్లెలు విద్యావతియైన చాలునని తృప్తిపడి నన్నీ పరిశోధనము సాగింపుమని ప్రోత్సహించి దీవించుచున్న మా అన్నయ్య శ్రీ బూదరాజు పాండురంగారావు వ్యాసు గారికి నా నమస్కృతులు.

నాగార్జున విశ్వవిద్యాలయమున ప్రధానధ్యేయముగ పరిశోధనము నుగ్గె కొని పరిశ్రమించు అవకాశము గల్పించి వేతనాదిక సౌకర్యములను సమకూర్చి అనుమతించిన ఆనాటి ప్రభుతోన్నత విద్యాసంచాలకులు డా॥ వి రామచంద్రన్‌గారికి, యూనివర్సిటీ గ్రాంట్సు కమీషన్ ఉపాధ్యక్షులు ఆచార్య బి. రామచంద్రరావు గారికి, మా దొడ్ల కౌసల్య మహిళా కళాశాల అధ్యక్షిణులు కుమారి ఎం.వి.

రంగమ్మగారికి, శ్రీమతి కె. హేమలతమ్మగారికి (నేడు ప్రభుత్వోన్నత విద్యా సంయుక్త సంచాలకులు) నా వందనములు.

నా సిద్ధాంత వ్యాసగుణ నిర్ణాయకులుగా వ్యవహరించి అభినందనలనందించిన ఆచార్య శ్రీ G.V. సుబ్రహ్మణ్యము (Professor and Head of the Dept. of Telugu University of Hyderabad) గారికి ఆచార్య శ్రీ గంధం అప్పారావు (Professor and Head of the Dept. of Telugu, University of Madras) గారికి ఆచార్య శ్రీ చల్లా రాధాకృష్ణమూర్తి (Professor and Head of the Dept. of Telugu Madhurai University Madhurai) గారికి నా కృతజ్ఞతా పూర్వక నమస్కృతులు.

ప్రభుత్వానుమతితో పరిశోధనముగావింప నేను నెల్లూరునుండి నాగార్జున నగరమునకేతెంచునపుడు సమర్పించవలసిన ధ్రువపత్రమును నేసి పనిని సక్రమముగ నిర్వహింతునని విశ్వసించి నిర్భీకముగా ధ్రువీకరించిన నా సహోద్యోగినులు, మిత్రురాండ్రు శ్రీమతి బి. కనకదుర్గావతి, కుమారి ఆర్. హెచ్. లీలగార్లకు తమ ఆరాధ్యదేవి శారదను నిరాజనమొసగు నవకాశము నొసంగిన శ్రీమతి పిండిప్రోలు వసంతాదేవికి (శారదానికేతనప్రాచార్య) కు నా స్నేహ పూర్వక కృతజ్ఞతలు.

పరిశోధనకాలావధిలో నేను తిరుపతి ప్రాచ్యపరిశోధన పుస్తకభాండాగారమును, శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ గ్రంథాలయమును, హైద్రాబాదు ఉస్మానియా విశ్వవిద్యాలయ పుస్తకభాండాగారమును, కర్నూలు మాకసిరెడ్డి వెంకటరెడ్డి ప్రభుత్వ మహిళా కళాశాల గ్రంథాలయమును, నెల్లూరు మాదొడ్ల కౌసల్య మహిళా కళాశాల గ్రంథాలయము గుంటూరురాష్ట్ర ప్రాంతీయ గ్రంథాలయమును, మా నాగార్జున విశ్వవిద్యాలయ గ్రంథాలయమును, మా ప్రభుత్వ మహిళా కళాశాల గ్రంథాలయమును దర్శించి అందలి సంగీతసాహిత్యగ్రంథముల నెన్నిటినో అనుశీలించినాను. ఇవియేకాక నాపరిశోధనమునకు వలసిన ప్రాచీన కావ్యప్రబంధములు పరశ్శతములు నెల్లూరు రేబాలవారి పురమందిరగ్రంథాలయమున పుట్టినింట నున్నట్లు తనివితీర చదివికొనినాను. కాన ఈ ప్రాచీన

పుస్తక భాండాగారాధిపతులగు రేబాలవారికి ఆద్యముగ తదితర గ్రంథాలయాధినేతలకు క్రమముగ నా కృతజ్ఞతల నర్పించుచున్నాను.

నా సిద్ధాంత వ్యాసరచనమున మేలుప్రతిని సంతరించుటకు సహకరించిన పుత్రసముడు చి. డా॥ సిహెచ్. బాబావలిరావుకు, పుత్రికవంటిదైనచి. సిహెచ్. లక్ష్మి లంకమ్మకు, సోదరి చేరాల జానకమ్మకు నా అభినందనలు.

నా సిద్ధాంత గ్రంథమును సర్వాంగ సుందరముగ ప్రచురించి యిచ్చిన గుంటూరు - శ్రీ లక్ష్మి ప్రెస్ అధినేతలగు శ్రీ కాట్రగడ్డ బ్రహ్మయ్యగారికి, చి॥ శ్యాంబాబుకు నా అభినందనములు.

ఇట్లు

గురుజన విధేయ

బి.వి. శారద

# లయ

తెనుఁగు భాష సంగీత యోగ్యత : సహజ శ్రావ్యతాగుణమువలన స్వదేశీయులచే "దేశ భాషలందు తెలుగు లెస్స" యనియు, విదేశీయులచే The Itation of the East" అనియు మన్ననలనందినది మా తెలుగు భాష ట్టి యాంధ్రభాషయందలి చందోనియములందు అలంకారక స్థితియందు వ్యాకరణ తియందు అంతర్నిహితమైయున్న సంగీత యోగ్యతానుశీలనము గావించుట హాడ పరిశోధన వ్యాసమందు అవశ్యకమే.

ఆంధ్రభాషాచ్ఛందమునకు సంగీతమందలి లయాత్మికతను బోలిన గుణ మున్నది. ఇది ఈ భాషకు మూదలయైన సంస్కృత భాషాచ్ఛందము నందును ఉన్నది. ఆదికవి వాల్మీకి నోట మొదట వెల్వడిని మాట "మానిషాద" శ్లోకమైనది. అది మాటగా పాటగా ముత్యాల పేటగా కవితాగాన మోహిని శసీమ నలంకరించినది. ఈ శ్లోకపు ఎత్తుగడలోనే మానిషాద. "మగ సస్సమా" అను స్వరాక్షరములు వెలువదుట ఒక విశేషము. ఇందలి మా మధ్యమమునకు 'ని' నిషాదమునకు "షా" షడ్జమునకు "ద" ధైవతమునకు గ' గాంధారమునకు ప్రతీకలు వీనిని ఆరోహణాక్రమమున సవరించి, "సగమ ధనిసా" యగును. దానికి అవరోహణాక్రమమున "సానిధమగాసా" యగును ఇది హిందోళమను నొక మార్గ రాగమునకు ప్రస్తారము మానిషాద శ్లోక మును హిందోళమున గానము చేసిన అలనాటి యా ఆదికవి హృదయాందోళము హిందోళరాగ భావాన్వితమై గమ్యమానమగును.

"మానిషాద ప్రతిష్ఠాంత్వమగమమః శాశ్వతీః సమాః
యత్ క్రౌంచమిదునాదేకం అవధీః కామ మోహితమ్.

అనుచు తన హృదయాంతరముల ఆవిర్భవించిన శ్లోకము శ్లోకమై తన చెవులకే వింత గావించినవుడు ఆదికవి అద్దాని ప్రవృత్తినిట్లు వితర్కించుకొనినాడు.

"తాళబద్ధోక్షర సమస్తంత్రీలయ సమన్వితః
శోకార్తస్య ప్రవృత్తోమే శ్లోకోభవతు నాన్యథా"

ఈ తొలి శ్లోకము గీతికి ఆధారషడ్జమై అనంత ప్రణవ నాదమైన మలి శ్లోకము తాళలయాశ్రితమై, గణయతి సంస్థితి బద్ధమై కవితకు ఛందనమై గీతికి అందమైనది. ఆవు కంచె మేసిన దూడ అంచున మేయదు గాన-అన్నిట సంస్కృతము ననుసరించిన ఆంధ్రభాషకు సంస్కృతచ్ఛందోరీత్యను కరణము గూడ ఆది నుండియే అలవడినది. అయినను కొన్ని కవితా ప్రక్రియలలో చందోరీతులు గాన సహకృతిలో చక్రనేమి క్రమమున వేఱొకవంకకు జరిగి పోయినవి. వృత్తములు మారి నృత్తములు గావించి ద్విపదలతో చిందులు వేసినవి. అది శివకవి యుగమై గీతి తన సహకృతిలో సాహితిని శివాలాడించినది. శ్రీనాథ యుగములో కోటలో గంభీర ముద్రతో కావ్యగానము గావించిన గీతి సాహితులే పేటలో వీరపదములపాడి ప్రజల నాడించి పాడించుట జరిగినది ప్రబంధయుగమున సంగీత కళా రహస్యములను కాంభోజిరాగ విపంచికార వసుధాపూరంబుతోరంబుగా వెల్లడించిన సాహితియే దక్షిణాంధ్ర యుగాంతమున యక్ష గానముల సయితము మాని లక్ష్యమొక్కటి లేక వీధిభాగవతముల నాడుట ప్రారంభించినది. అట్టియెడ రగడలు తాళాధ్యాయము నారంభించి లాక్షణికు గూడ కవ్వించి 'సై'' అనిపించుకొని లక్షణ గ్రంధముల కెగబ్రాకినవి. అప్పక వ్యాడులు దేశి రచనలను మార్గ పద్ధతిలోని తాళముల కన్వయించి లక్షణ లక్షితము గావించినారు. ఆధునిక యుగమున భావములు అభావములై గేయములే గాయములై కట్టుబాట్ల కట్లను సైతము పట్టించుకొనక మొరాయించినవి. "ఛందో సర్ప పరిష్వంగాలను చట్‌ఫట్‌మచే తెంపేస్తామని ప్లేట్లు ఫిరాయించినవి. పద్యములు పద్యగ్రంధి గద్యములై గజ్జలు కట్టుకొనినవి. వచన పద్యములు వస్తాదులై పూర్వ పద్యముల నడుములు విరుగదంతామని బెదిరించినవి. ఇట్లు డీలాపడిన సాహితీకి తన చేయినందించి ఇక గీతియే స్వాతంత్ర్యోద్యమములో వందేమాతరమ్మని మంత్రములో ధైర్యము చెప్పి మా కొద్దీ తెల్లదొర తనమని మధ్యమములో మాటలు గలిపి స్వాతంత్ర్యము మా జన్మ హక్కని తారముతో గొంతెత్తి చాటినవి. అపుడుసాహితి వైష్ణవ్యగీతికాతాదాత్మ్య మందినది. కవిత లోని ఛందోరీతి గీతిలోని లయాత్మకంగా శిలాక్షరమైన నిత్యమైన అనాదినుండి ముద్రాక్షరమై నేటివఱకు నిలిచియే యున్నది.

ఇట్టి పరిస్థితులలో ప్రత్యేకముగ ఆంధ్ర భాషలోని ఛందోనియతియందలి

సంగీతరీతిని అను శీలనము గావించుకొనవలసియున్నవి. తెనుగు భాషా చ్ఛందస్సులలోని సజాతీయ వర్ణావృత్తి యతిగా నియతి నందినది. సమానమగు ద్వితీయా వ్యంజనావృత్తి ప్రాసగా ప్రాసయతిగా పద్యరచనలో నిబంధింప బడుటచే ఈ సాహితికి విశేషమైన సంగీత యోగ్యత ఒక విశేషముగా సంతరింప బడినది. సంస్కృత శ్లోక రచనలో ఈ యతి ప్రాసల నిర్బంధము లేదు. ఇది యైచ్ఛికమైన నిషేధముకాలేదు. అటయతి కేవలము విరామము. ప్రాసశబ్దాలంకార మాత్రముగ తెలుగు ఛందోనియతి కలవాటుపడిన కవి సంస్కృత రచన చేయునపుడు ఐచ్ఛికముగ వానిని నిబంధించుకొనుట కద్దు. యతి ప్రాసలకు పోలి అక్షర ప్రమోదములు తెలుగు భాషా వాసన ఇసుమంతయేని లేని సంస్కృతకవి కవితలో గూడ పొడగట్టుట గూడ గన్పట్టును. ఇవి యిట సొబగులను సంతరించు పట్టుల మాత్రమే ఇట్టి విజయదేవుని రచనల కునికి పట్టైనవి.

ఉదా :— "లలిత లవంగ లతా పరిశీలన కోమల మలయ సమీరే"

భాషా సహజమగు మార్దవాధిక్యతను బట్టియే సంస్కృతమున కన్న మిన్నగ తెలుగున ఈ యతి ప్రాసాది నియమములు నియతములైనవి. అట్టియెడ కోమలతా విరహితములగు భాషలలో ఈ నియములు ప్తమై యుండుటయు సహజమే. అసంఖ్యాకములుగా వెలువడిన ఆంధ్ర జానపద గీతిలకందు సామెత లందు శిలాక్షరములందు గూడ యతిప్రాసలు ఆమెతలై చవులూరించినవి. అవి మధుర మధురములై భావభరితములై నిసర్గ సుందరములైన . అట్టి రీతికి ఉదాహరణముగ మొదట ఒక జానపదగేయము.

"అగ్గి మెరుపుల చీరె ఆ భామ గట్టె
అద్దాల రైకానుఆ బామ దొడిగె
తల యంటులార్చింది తల సిక్కెదీసె
ఎండి సిక్కంటితో ఎలిసిక్కదీసె
పగిడి సిక్కంటితో పాపిడ్లె దీసె"

తరువాత ఈ తెనుగు జాతీయములు ఉదాహరింపదగును.

"శ్రుతి లేని పాట మతిలేని మాట"

"నారుపోసిన దేవుఁడు నీరు పోయక మానడు"

ఇట్లు ఆంధ్ర భాషాచ్ఛందో నియతి యందలి లయాత్మికతను అను శీలించిన పిదప ఆంధ్ర భాషాలంకార స్థితియందలి సంగీత నియతిని గూడ పరిశీలింపవలెను.

ఆంధ్ర సాహిత్యమందలి శబ్దాలంకారములకు సంగీతమందలి స్వరాలంకారములకు చక్కని పోలికలున్నవి. ఇందలి శబ్దాలంకారములతో సంగీతములోని స్వరకల్పనమునందలి రాగ ప్రస్తారమునందలి దశవిధ గమకములందలి చమత్కృతులున్నవి.

"నకాంతమపి నిర్భూషం విభాతి వనితా ముఖం"

"అథాలంకార రహితా విధవేవ సరస్వతీ" అనుచు నిట్లు ఆలంకారికులు సాహిత్యమందలి ఆలంకారికావశ్యకతను ఉగ్గడించిరి.

"శశినా రహితేవ నిశా విజలేవ నదీలతా విపుష్పేవ

అవి భూషితేవ కాంతా గీతి రలంకారహీనా స్యాత్" అని వర్ణాలంకార ప్రకరణమున భరతముని వక్కణ సంగీత రత్నాకర వ్యాఖ్యలో ఉదాహృతమైనది. సంగీతమందలి స్వరాలంకారముల ఆవశ్యకత గమ్యమానమైనది. కవిత్వమందలి శబ్దాలంకారములగు అనుప్రాసము క్తపద గ్రస్తాలంకారాదికములందలి ఛాయలు సంగీతమందలి స్వరాలంకారములందున్నవి. గీతి సాహితులు రెండును శ్రుతి సుఖ ప్రతిపాదకములే యను ప్రాథమిక లక్షణమునకివి తార్కాణములు.

కవిత్వమందు ప్రయుక్తములగు శబ్దాలంకారములలో అను ప్రాసమన్న కవుల కనురాగము ఆలంకారికులకు ఆమోదము మిన్న. అందలి ఛేకానుప్రాసము సామాన్యముగ శాబ్దిక చండ తాండవమునే గాక సుకుమార పదలాస్యముగ గూడ ప్రయుక్తమగుచుండును.

"అడరడనెడ లేక రెండు రెండక్షరంబు

లెనయు నియమంబు ఛేకమా నెల్లటన్న"

"స్ఫురత్కృపాచల ప్రతాప..................
ర్చి రంగ దానబుద్ధి వైఖరిన్ హరిన్ హరిన్ సుధా
హరున్ హరున్ గిరిన్ గిరిన్ మహోనలున్ నలున్ రమా
గురున్ గురున్ జయింప................

ఇందు హరిన్ హరిన్, గిరిన్ గిరిన్ ఇత్యాదిగా రెండేసి అక్షరములు ఆవృత మగుటలో ఊర్మి యను స్వరాలంకారము ప్రతిపాదితమైనది.

ఇట్టి శ్రవణ పేయధ్వని సముపాదనయందు సంగీతమందలి స్వరాలంకార మగు ఊర్మికి ఛేకాను ప్రాసముతో సామ్యమున్నది. అద్దాని లక్షణమిది.

"తుర్యగానే కల్లైకైకహానాద్యత్రా పరాస్తథా
సః ఊర్మిః స్యాత్"

"సమ సమరిప రిప గధ 3 గధ గధ 3 మని" మని ఇందలి స్వరావృత్తిలో హరికిన్ హరికిత్యాది అక్షరాకృతి పొడ కట్టుచున్నది.

"త్రిస్స్వరాఃచేత్ కళాః పూర్వపూర్వత్యాగోర్ధ్వ సంక్రమైః"
తదాక్షేపః

"సరిగ రిగమ గమప మపద పదని" అను లక్షణముగల ఆక్షేపమను స్వరాలంకారమునకు లక్ష్య మిట్లుండును.

"సరిగ రిగప గపని పనిస సనిప నిపగ పగరి గరిస" ఇత్యాదిగ సాగిపోవు స్వర ప్రస్తారములోని స్వర స్తబకములలో సరిగలోని రిగ మున్నిట్టై 'రిగమ'లో రిగ మాటల గ్రస్తమగు రీతిలో శబ్దాలంకారముల ముక్తపద గ్రస్తాలంకారము ధ్వనించుచున్నది. ప్రసిద్ధమగు ఈ అలంకారమును తెలుప పనిలేదు. లక్షణములు కోకొల్లలు. అయినను ఒక లక్షణమును మచ్చునకిచ్చిన చాలునట. ముక్తపదగ్రస్తరీతిని శీలనము గావించును.

"మదనాగతురంగ...............మణి మయ సదనా
సదనామయ................రదనా
రదనాగేంద్ర..................................."

iii)

"కలాం ప్రముచ్య మంద్రాదీ ద్విరుక్తోర్ధ్వ స్వరాన్వితం"

అను లక్షణముగల స్థలితమను స్వరాలంకారమునకు లక్ష్యమిటులుండును.

సగరి మమరిగస రిమగ పపగ మరి

గపమ ధధ మపగ మపగ పప గమగ

ఇట్లు సాగిపోవు స్వరావృత్తిలో పలుమారులు గాంధార స్వర మొక్కటి పునరావృత్తి నందినది.

దీనిని పోలిన ఒక్క అక్షరావృత్తికే ప్రాధాన్యమిచ్చెడి వృత్త్యను ప్రాస మనెడి అలంకారము కవిత్వ మందున్నది. అద్దాని లక్షణమిది.

"ఒక్క వర్ణంబు కడదాఁక నుద్ధరింపఁ

బరగు జృంభణ వృత్త్యను ప్రాసమయ్యె"

దానికి లక్ష్యమిది.

"సమద విపక్ష శిక్షణ విచక్షణ దక్షిణ............

ఇందలి క్షకారావృతి స్ఖలిత స్వరాలంకార లక్ష్యమందలి గాంధాసర స్వరా వృతికి సంవాది. ఇట్టి పోలికలను నేనింతకన్న మిన్నగ సాహితీ కోవిదులకు సంగీత కోవిదులకు మనవి చేయనవసరము లేదు. స్వరత్వము నందలి సుఖ మయశ్రుతి అక్షరత్వమునందలి శ్రవణ పేయత్వమునకు సాజాత్యము నెత్తి చూపుట చర్విత చర్వణమే యగును.

గీతి సాహితులకు రామరాజ భూషణునిలో నున్న బంధుత్వము అందఱు ఎఱిగినదే. అట్టియెడ నేను ఉదాహరణములనందులకే కావ్యాలంకార సంగ్ర హమునుండి గైకొంటిని.

తెలుగు భాషాచ్ఛందోలంకార రీతులలోని గీతి సామ్యములను పరిశీలించిన పిదప తెనుగు భాషా వ్యాకరణ వియతి యందలి సంగీత పద్ధతిని అను శీలనము గావింపవలెను.

అజంతతా మార్దవము విదేశీయ భాషలలోని ఇటాలియన్ భాషకు భూష ణము. దానిని మించిన అజంతతా పరిణామము తెలుగు భాషణములో సహజ

ముగా గలదు. అందులకే "The italian of the East" అని ఆంధ్ర భాషను కొనియాడుట.

ఇదియే కాక మన భాషకు స్వర సమీకరణమను రీతిగూడ మాధుర్యమును ప్రతిపాదించినది. దీనికే భాషా శాస్త్ర పరముగ "The law of vowel hormony లేక vocalic assimilation అనియు అందురు. దీని లక్షణము కాల్డువెల్ పండితునిచే ఆంగ్లమున నిట్లు చెప్పబడినవి. దీనికుదాహరణముగ ఈ క్రిందివానిని చెప్పవచ్చును.

కత్తి + లు > కత్తులు, రవి + లు > రవులు
కలికి + లు > కలుకులు, రాముని + కు > రామునికి
అరు + తి > అరితి, చూచితి + వు > చూచితివి

స్వర సమీకరణము అన్ని భాషలకన్న తెనుగులో పరాకాష్ఠనందినదని కాల్డువెల్ పండితుని అభిప్రాయము. ఈ పద్ధతివలన ఉచ్చారణ సౌలభ్య మధికమ్తై మన భాష గాన యోగ్యమైనది. శ్రుతి మాధుర్యమున కనువవుట వలననే ఆంధ్రభాషలో గీతి సాహితుల కితోధిక సహకృతి నిబిడమైనది.

భిన్నములగు వ్యంజనములు సమాన వ్యంజనములుగ మారుటయే వర్ణ సమీకరణము. ఈ పద్ధతి సహజ మార్దవమును ఆంధ్ర భాషకు చేకూర్చి సంగీతమునకు ఈ భాషకు దగ్గర చేసినది. సంస్కృతమునుండి అసంఖ్యాకములుగ తత్సమ పదములు తెనుగు భాషలోనికి ఈ పద్ధతిలోనే ప్రవేశించినవి. సంస్కృత బాషా సహజమగు ఉచ్చారణ కాఠిన్యము ఈ వర్ణ సమీకరణరీతి వలననే విడనాడి సౌలభ్య సంపాదితమైనవి.

అగ్ని > అగ్గి భక్తి > బత్తి సత్యము > సత్తెము

అన్యము > అన్నెము పుణ్యము > పున్నెము ఇవన్నియు సంపూర్ణవర్ణ సమీకరణమునకే కాదు సంపూర్ణ గాన యోగ్యము లగుటకును ఉదాహరణములే.

"అగ్గి మెరుపుల చీరె ఆ భామ గట్టె" అని పాడు పలుకుబడిలోని సౌలభ్యము అగ్ని మెరుపుల చీరె ఆ భామ గట్టె అనుటలో లేదు గదా; అన్నెమో

పున్నెమో అదీ నేను ఎఱుగ" అని ఆలపించుటకు బదులు అన్యమో పుణ్యమో ..........అని అని యుచ్చరించుటలో సౌలభ్యము కాదుగదా.

వర్ణ సమీకరణము వలన శ్వాసములగు వ్యంజనములు మృదుత్వమును పొంది నాదములుగా మాఱి ఉచ్చారణకు విశేష సౌలభ్యమును చేకూర్చుచున్న వని బ్లూంఫీల్డ్ మొదలగు భాషా వేత్తలు భావించుచున్నారు.

తీగ ▷ తీవ: మామ > మా(వ మున్నగు రూపములలో నాదములైన వర్ణములు నాదతరములుగనో, నాదతమములుగనో మాఱుచున్నవి. వ్యాకరణ సిద్ధములగు నీ మార్పులు భాషకు విశేష కోమలత్వమును చేకూర్చుచున్నవి. తీగ > తీవ, పగలు > పవలు మొదలగు వానిలో నాదమగు గకారము నాదతమమగు వకారముగా మాఱినది.

మామ>మా(వ, మామిడి > మావిడి: చీమ>చీ(వ ఇత్యాదులలోని అనునాసికము, నాదతరమును అగు మకారము నాదతరమగు అను నాసిక వకారముగ మాఱినది .ఇట్టి వ్యాకరణ సిద్ధ మగు మార్పు భాషను మృదుత్వ యుక్తముగావించి సంగీతమునకు అనుకూలతను సాధించినది.

అడగు ▷ అణగు: పుడక > పుణక మొదలగు రూపములతో 'ద, కారము 'ణ' కారముగా మారుట యూఫెనీ అను నొక రీతి పద్ధతివలన సంతరింపబడినది. సంగితానుకూల్యతను సంపాదించుచున్నది.

కొన్నిచోట్ల పాక్షిక వర్ణసమీకరణముగూడ భాషామార్దవమునకు విశేషముగ తోడ్పడుచున్నది. ఇది ఏకదేశమందుగాని, సంధింపబడిన రెండు పదముల కలయికతోగాని పొడగట్టి మృదుత్వమును ప్రతిపాదించుచున్నది. దీనినే ఆంగ్లమున **Partial assimilation** అందురు.

వాక్+మయము > వాఙ్మయము
నిండు+వెల > నివ్వెల
నెల+మనము > నెమ్మనము
మూడు+జగములు > ముజ్జగములు

వేడి+నీళ్లు > వేణ్ణీళ్ళు
చలి+నీళ్ళు > చన్నీళ్లు
పూచెను+కలువలు > పూచెన్గలువలు

తోచెను+చుక్కలు > తోచెన్జుక్కలు మున్నగు ఉదాహరణములందు. మార్పు మఱొక విధముగా జరిగినది. అది పార్శ్వమందున్న మహానాదమగు అనునాసిక వర్ణప్రభావమున శ్వాసమగు కకారము గకారముగ మారినది. అనగా ప్రక్కనున్న వర్ణగముల లక్షణములను కొంతగా పొందుటచే నిదియు పాక్షికవర్ణ సమీకరణమే అయినది. గసడదవా దేశసంధిలోని మార్పును ఇట్టిదే. ఇవన్నియు ఉచ్చారణసౌలభ్యముతోపాటు శ్రుతిసుఖమునకు తాళ సౌలభ్యమునకు ఉద్దిష్టము లైనవే ఇట్టి మార్పుగూడ వర్ణసమీకరణమేయని ఇందు శ్వాసములగు వ్యంజనములు మృదుత్వమునుపొంది నాదములుగ మారి ఉచ్చారణసౌలభ్యమును పొందుచున్న బ్లూమ్ ఫీల్డు మహాశయుని ఆశయము. ఇంతకు ముందిది ముచ్చ టించుకొన్న మాటయే.

అక్షరముల నాదత్వములోని భేదమును వివిధవర్ణమునుబట్టి ఇట్లు పరిశీలింప వచ్చును.

"గ జ డ ద బ" (Sonents) నాదతరములు.

ఙ ఞ ణ న మ (More sonents) నాదతమములు. ఇవి వ్యంజనములు అయినప్పటికి స్వరమునకు దగ్గరగానుండును. అచ్చులు మహానాదములు. ఇందు "అ, ఆ" లు మహోత్తమనాదములు. ఇందలి నాదములు, "నాదతమములు, మహానాదములు, మహోత్తమనాదములు అను శబ్దములనుబట్టి వీనికి సంగీతముతో నెంతటి దగ్గరి చుట్టరికమున్నదో నిర్ణయింపవచ్చును. సంగీతము నాదాత్మకము గదా! కాబట్టి "నాదతనుమనిశం శంకరమ్మ" ని గానముచేయుట జరిగినది. అందుకే ఆ యనంతలయాత్మకుని అనాహత నాదస్వరూప పరమాత్ముని నుతించుటకు తానమును ప్రకల్పించుకొన్నారు సంగీతవిదులు. ఆ రూపగుణవర్ణ రహితుని స్తుతించుటకు భాషచాలదు. భావములందవు. అందులకే అనంతా యనియే అనంతగానము నొనర్చుచున్నారు. తను విస్తరణే అనుభావ్యప్రమ చెప్పుకొన్నను ఆ పరమేశ్వరుని తనమే తానమైనదని అనుకొనవలెను. ఈ

అనంతతానమున "అ ఆ" లు మహోత్తమనాదములు మహోదాత్త ప్రాణములై భాసించినవి. నకారము ఆ వెంట నాదతమమై ప్రతిభావించినది. తకారమొక్కొక్కచో 'తదరిన' గా మారుటలో దకారము నాదితమైనది. 'అనంతాదరిన' అను అక్షరముల ఆంధ్రసాహితి దరిన సంగీతమై తానమైనది. అది అనంతుడు అచింత్యుడనగు నా పరమాత్మకు ప్రతీకయై మనోధర్మ సంగీతరీతికి పతాక అయినది

ఇట్లు ఆంధ్రభాషలోని ఛందోవియతి అలంకారరీతి వ్యాకరణ సంస్థితి సర్వము సంగీత సర్వస్వమేయని ఆంధ్ర సాహితియందలి గీతిప్రవృత్తిని స్థాలీపులాకన్యాయమున నాకున్నంత లఘుపరిజ్ఞానముతో నా పరిశోధన వ్యాసారంభమున వివరింపబూనుకొన్నాను.

# కవి గాయక సార్వభౌమ యుగము
# శ్రీనాథోక్త కర్ణాట బాణి

"శివుడుద్దండ తాండవ గురుండౌని
శాబ్దిక చండ తాండవమ్ము నిర్వహించి
లలన పార్వతి సుకుమార లాస్య జననియని
లలిత మౌస్వరాక్షర నృత్యమ్ము గూర్చి
పార్వతీ పరమేశ్వరార్చనమును
కర్ణాట కవన గానమున నిల్పిన
శ్రీనాథ కవి గాయక సార్వభౌమ
యుగవాణి నమశ్శతంబునీకు"

# కవిగాయక సార్వభౌమ యుగము

## శ్రీనాథాను వర్తులగు మహాకవుల సంగీత ప్రతిపత్తి

1. శ్రీనాథ మహాకవివరుని సంగీతసార్వభౌమము.
2. వల్లభామాత్యుని గాన వాల్లభ్యము.
3. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని సంగీత భద్రత.
4. దగ్గుపల్లి దుగ్గన సంగీత పరిచితి.
5. కొఱవి గోపన సంగీతాలాపన.
6. జక్కనాచార్యుని చక్కని కవనమున చిక్కని సంగీతము.
7. అనంతుని కవితలో కొంతసాగిన సంగీత సాంకేతిక ప్రసక్తి.
8. ఎఱ్ఱయ్య నృత్యగాన పరిచితి.

# శ్రీనాథ మహాకవివరుని సంగీత సార్వభౌమము

శ్రీనాథ కవిసార్వభౌముని కవితాగానమున కనుగతముగ ఒక రసహేలగ రాగలీలగ వినుతగీర్వాణవాణి తనచేతి పసిడి కిన్నర వీణను కర్ణాటముగా పలికించినది. ఆవాణీవీణాప్రక్వాణము కవిసార్వభౌముని వివిధ సాహితీప్రక్రియ లందు నిలిచిపోయినది. అది రాగమాలికగా మార్గదేశీయరీతులలోతును తెలిపిన కావ్యపురాణములలో కూడ అంతర్గత ప్రభావము నెఱపినది. గానమునకు ఆలాపినీ ఝాంకృతివలె సంగీతము శ్రీనాథుని కవనమునకు అనుశ్రుతిఅయినది.

పురాణసంహిత శ్రీనాథకవితలో అగ్రతాంబూలమందుకొన్నది. అపుడపు సాహితితోపాటు గీతియును తిష్ఠవేసినవి. శ్రీనాథుని పురాణరచనలలో భీమేశ్వర పురాణము ఆద్యము. ఇందాతని ఆరాధ్యదేవత వాగ్దేవి పలికించిన వీణాప్రక్వాణ నినదము అడుగడుగున వినవచ్చును. ఆదక్షవాటి మహాపుర మధ్యంబున "గంధర్వాప్సరో భామినీ చరణాంభోరుహనూపురస్వనముల జంకించు ఝంకారములు" ఆకవితా నాట్యసంరంభమున స్వరజతులై, ఉలికిజతులై పలికినవి. అది మృందగ ఝాంకృతివలె నినదింపగా కవిసార్వభౌముని హృదయము స్పందించినది. ఆయానందాతిరేకముతో కవిరాజు గాయకసార్వభౌముడై ఇట్లాలపించినాడు.

"ప్రౌఢి పలికింప సంస్కృత భాషయండ్రు
పలుకు నుడికారమున నాంధ్రభాషయండ్రె
వ్వరేమనుకొన్న నాకేటి కొఱత
నాకవిత్వంబు నిజము కర్ణాటభాష"*

ఈపద్దియమున కవిసార్వభౌముడు సలక్షణమైన తన తెలుగు కవితను తానే కర్ణాటమనుకొనుటకు పరమార్థమేమై యుండుననునది పరిశీలనార్హము. అర్థానిని పర్యాలోచించిన శ్రీనాథుడు తనకవితలో గానరీతిని కర్ణాటముగ ధ్వనింపజేసెనేమో అని యనుకొనుటకు అనువున్నది. శ్రీనాథుడు తన కవిత్వప్రౌఢిమ సంస్కృతరీతి సముచితమని అందలి పలుకు నుడికారము ఆంధ్రభాషానుగత

* భీ.పు. I.15.

సహజమార్దవసమన్వితమని అందరి శ్రుతిసుఖత్వము కర్ణాటరీతి ప్రవృత్తితమని సూచించినట్లనిపించును. "కర్ణే లటతీతి కర్ణాటః" అను వ్యుత్పత్తిని కర్ణాట పదమునకు చెప్పుకొన్నచో అది గీతికి, సాహితికి కూడ అన్వర్థమగును. ఇది గీతికి బాహిరకముగ, సాహితికి ఆంతరంగికముగ నుండవలసిన ధర్మము.

శ్రీనాథుని కాలమున సంగీత సరస్వత్యారాధనము తెలుగునాట తెలివిమీఱ సాగినది. కాటయ వేమవిభుడు సంగీతరత్నాకరమును వ్యాఖ్యానింపదొడగొనుట జాయపసేనాని నృత్తరత్నావళి గీతరత్నావళుల రచించుట శ్రీనాథయుగముననే జరిగినది. గానమునకు కర్ణాటములో జతగూడుట భాస్కరరామాయణముననే పొడకట్టినది.

> "లాటీ ఛందన చర్చలోల మహిళా లావణ్య సామగ్రిక
> ర్ణాటీ గీతకళా సరస్వతి కళింగాంతః పురే పల్లికా
> వాటీ మంజరి గౌడవామనయనావక్షో జహారావళియై
> పాటింపందగు నీదుకీర్తి రఘునీపాయాగ్రణీ సాహిణీ!"
>
> భా.రా. కిష్కింధ.

ఇందలి కర్ణాటగీతి, కళాసరస్వతి అను పలుకుబడి గమనార్హము. కవి సార్వభౌముడు అలవోకగా సంగీత సాంకేతిక పదజాలమును పాల్కురికి సోమనాథునివలె ఎక్కడను ఏకరువుపెట్టలేదు. అతడు అనుభవ రసికుడు గాన తాను వినిన, చూచిన తౌర్యత్రిక రీతులను మాత్రమే అర్థవంతముగ నుట్టంకించును. కనులారగాంచి హర్షించి చెవులారవిని ఆనందించిన సంగీతకళా విశేషములను గ్రంథోపస్థిత మొనర్చెను. కవి కర్మకవి అసహజము గాదుగాన కేవల సాధారణోక్తులను ఉదాత్తీకరించును. తాను బాలారామమునగాంచిన నట్టువరాంధ్ర ఆటపాటలను గంధర్వోపనిషద్రహస్యములుగా వక్కాణించిన ఈపద్యమే ఇందులకొక ఉదాహరణము.

> "గంధర్వోపనిష ద్రహస్యములు వక్కాణింతురాలాప సం
> బంధప్రస్ఫుట ఝుంఝుం ఝుంఝుం పదగుంభస్థాన వర్గావళీ
> సంధాన క్రమవిన్యాసమంత్రములన్ సాయాహ్న కాలంబులన్
> గంధర్వాప్సరసల్ మహోపవనికా కల్పద్రుమచ్ఛాయలన్"

ఇది గంధర్వోపనిష ద్రహస్యములను ఆలాపసంగతితో ఝుంటు ఝుంటు అని లయాత్మకముగ వెలయించిన గానమున ప్రసిద్ధులు, నాట్యమున సిద్ధహస్తులు నగు గంధర్వాప్సరల పదగుంభనను ఉదాత్తీకరించిన మచ్చుట, దానికి సాధారణీకరణము ఆనాటి దాక్షారామ విలాసినుల పదక్రమములలో మువ్వలరవళి ఝుంట ఝుంట అని నినదించినదనుట మాత్రమే. నృత్యగీతములేగాక వాద్యములు నైతము శ్రీనాథుని భావనలో మహోదాత్తములైనవి. సాధారణ వాద్యవిశేషములగు కిన్నెరలను, కాహళలను కావ్యమున "పసిడి కిన్నెర వీణలని హేమకాహళలని స్వర్ణమయములు గావించను. కాంచినది సాని ఆటయే. అయినను అద్దానిని ఈశాని లాస్యమని సంభావించును. స్వానుభూతల కావ్యాంతరిత నాయికా నాయకుల మానసికానుభూతుల నన్వయించుకొన్న పట్టుల కవిసార్వభౌముడు గాయక కవిసార్వభౌముడునయినాడు.*

మునిసార్వభౌముని బాదరాయణుని కాశికావియోగము సురనదీ సైకత చక్రవాక విప్రయోగము వలె నుండెనని ఉపమించుటలో చక్రవాక రాగభావన వ్యంజితమొనర్చెను.**

---

* విరుల దండలతోడి వేణికా భారంబు
ఝొంకరంబు పెఱుఁదుఱుఁబొరవి యాడ

* మణితులాకోటి కోమల ఝణత్కారంబు
రవలి మట్టెల మ్రోఁత యనుకరింపఁ
.... .... .... .... .... ....
సాని యీశానియై మహోత్సవమునందుఁ
గేల నవచంద్రకాంతపు గిన్నె పూని
వీధి భిక్షాటన మొనర్చు వేళఁ జేయు
మురుల నృత్యంబు జగముల మరులుకొలుపు   భీ.పు. I-105.

** కామినీ విప్రయోగ దుఃఖమునఁ గుంది
చక్రవాకంబు సురనదీ సైకతమున
కాశికా విప్రయోగమునఁ గుందు
బాదరాయణముని సార్వభౌము కరణి

కేవల గానమునేకాక యక్షగాన సరణినిగూడ గంధర్వుల ముఖతః ఇట్లు ప్రస్తావించి యక్షగాన ప్రక్రియను తొలిసారిగ గ్రంథోపస్థితము గావించిన కవివరుడును శ్రీనాథుడే అయినాడు.*

శ్రీనాథుడు తన సంగీత కళాభిమాన నిధులను దక్షారామ భీమేశ్వర పుణ్య క్షేత్రమునసే నిక్షిప్తము గావించిన నిదర్శనము లనేకములు. అందులకే బెండపూడి అన్నయామాత్యుండు గట్టించిన మొగసాల వాటికి మహోత్సవ మండపమునందు భీమనాథేశ్వరేశ్వరస్వామి మూర్తి పేరోలగంబుంచి కుండలాదండ లాసక ప్రేరణీ ప్రేంఖణ కందుక ........ మత్తల్లీ హల్లీ సకాది నృత్యంబుల వలోకింపఁజేసినాడు సంప్రాచాటు నాటకోదాహరణ జయ ఘోష చక్రవాళ చతుష్పద చతురాది ప్రబంధము లాకర్ణింపజేసినాడు. వీణామృదంగ కాంస్య తాళ వ హఢక్కా హుడుక్కా హుడుక్కా నర ఝల్లరీ హృద్యవాద్యాను షంగంబు లాదరింపఁజేసి సంగీతరంగంబు లంగీకరింపజేసినాడు. వివిధ విద్యా కలాపంబుల వినోదింపజేసి అలరించినాడు. ఇందుకుండలీదండ లాసక ప్రేరణీ ప్రేంఖణాదికములను నాట్యరీతులతోపాటు గీతసాహితీ ప్రబంధములు వాద్య విశేషములుఅసంఖ్యాంకములుగా ఉట్టంకితములైనవి. ఇట్టివిశేషములకు ఆటపట్టగు పుణ్యక్షేత్రమున కరవగుటచేతనే అంధ్రభీమేశ్వర పురాణము రసపరిప్లావితమగు కావ్యముగ రూపొందినది. అచట పుట్టిన చిగురుకొమ్మైన చేవయనినట్లు ఇందలి ప్రత్యణువు సంగీతకళావిలాసములకు తాణాచియైనది.

భీమేశ్వర పురాణాంతర్గత ముఖ్యపాత్రలను పాత్రములగావించి అచ్చర విలాసినులతోపాటు ఈశ్వరుని, వ్యాసమునిశిష్యులనికూడ నాట్యకుశలుల గావించినాడు. ఆద్యముగ ఈశుని తాండవకేళిని తన శాబ్దిక చండతాండవ సహకృతిలో కమనీయముగనెట్లు బొమ్మకట్టించినాడో వీక్షింపుడు.

---

* కీర్తింతురెప్పాని కీర్తిగంధర్వులు
గాంధర్వమున యక్షగాన సరణి — భీ.పు. III - 64.

"ఆడెందాండవమార్భటీవశ హరీలాటోపవిస్ఫూర్జిత
క్రీడాడంబర ముల్లసిల్ల గరళగ్రీవుండు జూటాటవీ
క్రోడా ఘూర్ణకరోరకోటర రటీకోటీలుఠచ్ఛింఘుపీ
చీడోలావళులీవరి స్ఫుటతర స్ఫీతధ్వని ప్రౌఢిమన్"*

మహానటుని తాండవమునకు సంవాదియగు వ్యాసమహాముని నాథుని తాండవకేళిని గూడ తానే సూత్రధారుడగుచు శ్రీనాథుడు తన నృత్యాభినివేశము అనితరసాధ్యమని నిరూపించుకొనినాడు.

"అనుచుం దాండవమాడుచుండె శివభక్త్యావేశలీలార్భటి
న్మని శార్దూలము దక్షవాటికడు సన్మోలజ్జటాభానుడై" **

ప్రబంధములలో విరివిగ యిత్తుపట్టిన సంపద్భ్రమున, గానమగు హిందోళ రాగ ప్రసక్తిని శ్రీనాథుడు తనకావ్యములలో గావించుటవలన రాగవివేకమున ప్రబంధకవుల కిమ్మహాకవియే మార్గదర్శకుడాయెననవచ్చును.

"సందుగ్ధార్ణవ చంద్రచుంబిత శిఖిజ్వాలా తటిద్వల్లరీ
కందర్పేషుశరాసన చ్యుతతనూ గంధర్వవంశోద్భవల్
హిందోళంబునఁబాడిరచ్చరలు భీమేశుంద్రిలోకాధిపున్

మందారద్రుమ వాటియందు సుమనోమైరేయముల్ గ్రోలుచున్" ***

ఇది అలవోకగా దొరలిన హిందోళమనురాగ నామప్రస్తావన అనుకొనరాదు. సంగీతశాస్త్ర గతరాగలక్షణ మధుమధనమది. "శిశిరస్య వసంతస్య సంధౌ హిందోళకః" అను తచ్ఛాస్త్రనిర్ణీతి. హిందోళ రాగాలాపము శిశిరమునకు భరతవాక్యము. వసంతమునకు నాంది. ఈ విధికి తగినట్లు అచ్చరలను సుమనోమైరేయమును త్రాపుచు పాడిరనినాడు. సుమనములనగ పుష్పములు,

* భీ.పు. IV - 148.
** భీ. పు. iii 213.
*** "

సుమనోమైరేయమనగా పుష్పాసవము, పుష్పోద్గమము అతివేలమై వసంతమున భాసించినప్పుడే. తనివితీర పుష్పాసవమును గ్రోలుటకవకాశము కల్గును. కావున ఇట్టి వసంతర్తు శోభతోపాటు హిందోళరాగ భావము కూడ చక్కగా అతికిపోయి నది. ఇంతేకాక హరవిలాసమున కూడ హిందోళనము నిట్టి సమయముననే అచ్చరలచే పాడించుట కానవచ్చును. సౌందర్యవరాసీమలగు అచ్చరలేమలచేత * ** హిందోళముననే పాడించుట బట్టి శ్రీనాథునకు ఈ హిందోళరాగమభీష్టరాగమని అభివ్యక్తము. హిందోళనము తరువాత ఈ కవికి తదితర రాగములు రుచించును. నన్నెచోడుని కాలమున శంకరు నంకమాలికలును గీతికలవలె శ్రీనాథుని ప్పుడు చర్చరీగీతలు ప్రసిద్ధములై యుండవచ్చును. *** ఈచర్చరీ గీతికలు వసంతోత్సవములలో హిందోళనమున గాన మొనర్చవలెనని సంగీత రత్నాకరశాసనము. కాని మైరేయ పానావశస్థితిలో మదవతులు ఈ గీతికలను పాడుటలో రాగసాంకర్యము చేసియుందురు. కావుననే చంద్రిక మున్నగు రాగములను రాగముద్రలంకృతులుగ నావద్యమున పొదవినాడేమో శ్రీనాథకవివరుడు. ఏలాపదములకు "ఏలో ఏలేలో" అను నూతపదమువలె చర్చరీగీతలను జాదర జాదురనుట వల్లవిగా వచ్చును. కాని, చర్చరీగీతికలను గూర్చి వివరణ ఈకవికి పూర్వులగు సోమనాథాదులుగాని అర్వాచీనులగు రామరాజ భూషణాదులుగాని చేయలేదు. నాగరికులలో నాగరకుడైన శ్రీనాథుడు జానపదులలో జానపదుడై తద్గేయ విధానమును విని, జ్ఞాపకముంచుకొని అద్దానిని కావ్యస్థ మొనర్చుట అతని వ్యక్తిత్వములోని ప్రత్యేకత.

భీమేశ్వర పురాణమున నున్నంతగ నృత్యగాన వినోదములకు విపులావకాశము కాశీఖండ శివరాత్రిమహాత్మ్యములలో లభింపలేదు. కాశీఖండమునకంతటికిని మకుటాయమానమైన నృత్యగాన ప్రసక్తి విష్ణుమూర్తి పట్టాభిషేక సందర్భమున కన్పట్టుచున్నది.

---

* "జాదుర జాదురంచు ప్పుదు చర్చరి గీతలు వారుణీరసా
స్వాద మదాతిరేకముల - జంద్రిక కాయగ దక్షవాటికా
కనకవీణలు మీటుచుఁబాడిరచ్చరల్" భీ.పు. V-102.

** సమగ్రాంధ్ర సాహిత్యము- vol-iv-

*** చూ. సం. ర. I 250-261

"చాముండి యొనరించు ఝంపెతాళము
నట భృంగిరిటుండాడె ప్రేంఖణంబు
వెనుక దిక్కున నుండి కనకభూషలు మ్రోయ
సూర్యుండు శశియు వీచోపులిడిరి
వెండికట్లతోడి వేత్రదండముపూని
సందడి వెడఁగల్గఁజేసె జముఁడు
గాలోచితంబుగాఁ గైవార మొనరించెఁ
బలుకుఁదొయ్యలి గద్యపద్యసరణి,
నఖిలలోకంబులకును బ్రహ్మాండములకు
నాధిపత్యముపూని సింహాసనమున
మునులచే వేల్పులచేత మ్రొక్కఁగొనుచు
నిత్యుఁడుండోలగంబున్న యవసరమున" *

ఈ ప్రదర్శనమందు ఆర్భాటమంతయు కేవలము ఊహా జనితముగాదు. పాత్రములు పౌరాణికములే అయినను ప్రదర్శనము మాత్రము కొండవీటి కోటలో తాను కనులార దర్శించిన దృశ్యమే. మార్గ-దేశి పద్ధతులకు మధ్యేమార్గముగ నడుచు కర్ణాటమార్గము అనిన శ్రీనాథునకు మక్కువ ఎక్కువ. క్రొత్తప్రాతల మేలుకలయికకు ప్రాణప్రతిష్ఠయే కర్ణాటబాణి. ఇట్టి పద్ధతి ఈపద్యమున అణువణువున తొణికిసలాడినది. ఇందలి సన్నివేశముల పాత్రలు పౌరాణికములు. ఆడిన ఆటమాత్రము దేశిపద్ధతికి చెందిన నాట్యవిశేషమగు ప్రేంఖణము. అది నడచినది ఝంపెతాళమున. ధ్రువమఠ్యత్రిపుట రూపక ఝంపె అట ఏక తాళములను ఆద్యములగు సప్తతాళములలో ఝంపె కష్టసాధ్యము. పదిఅక్షర కాలములలో నిర్వహింపవలసిన అవధాన పరత్వమిందు ఆవశ్యకమగుట వలననే ఝంపెనను జంపె సుడిగాడము సంగీతవ్యవహారమున చోటు చేసికొనినది. అంతటి క్లిష్టమైనదగుటవలననే చాముండి ఆనాట్యమునొనరించెను. చాముండి సప్తమాతృకలలో ఝంపె సప్తతాళములలో ప్రముఖతనందుటలోని సామ్యమిట వ్యక్తము.

---

* భీ. ఖం. iv-298.

సుకుమారలాస్య మొనర్పవలసిన లలిత పార్వతి శక్తి స్వరూపిణియైన చాముండేశ్వరియై కష్టసాధ్యమైన ఝంపెతాళమును నిర్వహించినది. దానికి తగినట్లు భృంగి, రింగి, రిటి, తుండి, నందిక, నందికేశ్వరులలో నాద్యుడగు భృంగి ఉద్ధతమగునీ తాండవసమమగు ప్రేంఖణము నొనరించినాడు.* ఇంతటి ఉద్ధత నృత్తమును భృంగి కావింపగా వెనుక దిక్కునుండి కనకభూషలు మ్రోయగా సూర్యుడు శశియును వీచోపులిడిరట. వీచోపులకు నై ఘంటుకార్థము వింజామరలని మరి యీ వింజామరలు వేయునప్పుడు పనిగట్టుకొని శ్రీనాథుడు కనక భూషలు మ్రోతనెందుకు ధ్వనింపజేసినాడు? అని ప్రశ్నించుటకనువున్నది. అది లయాత్మిక వాద్యధ్వాన ప్రతిపాదితమనుట అద్దానికి సమాధానము. కాలము అనంతము. అది లయాత్మికము. సూర్యచంద్ర గమనాధిష్ఠితము. చామరసేవకు కర్మసాక్షులను వియోగించుకొని శ్రీనాథుడిట నిజముగా శ్రీనాథుడై సాక్షాత్కరించి కాలాధీశుడైనాడు. శ్రీమన్నారాయణుని పట్టాభిషేక సందర్భమున నొనరించు ప్రేంఖణనృత్య ప్రదర్శనము గాన ఆసన్నివేశముగాంచ దిదృక్షువులై అఖిలలోకాగతులయిన మునులు వేల్పులు గుమిగూడినారు. కావుననే అక్కడ యెనలేని సందడి యొదగూడినది. దానికి నెడగల్గజేసినాడట, వెండికట్టులతోడి వేత్రదండము పూనిజముడు. ఇక జముని పాత్రసార్థక్యము అటగూడిన సందడిని గమ్యమాన మొనర్చుటయే, నాట్యప్రయోగము, విజయవంతమౌట ప్రేక్షక సమూహపుసందడి వలన ధ్వనింపజేసినాడు కవి. కేవలము పాటాక్షరములనబడు జతులచేతనే నిర్వహింపబడవలసిన తాళలయాశ్రితమైన నృత్యము, ప్రేంఖణము ఇందు భావాత్మికతను కాలోచితంబుగా గద్యపద్య సరణిలో బలుకుతొయ్యిలి కైవార మొనరించుటతో ప్రతిపాదించినాడు కవి. దేశిరీతికి చెందిన జాతరచిందు

---

*"ఏషాం పాటాక్షరైః స్తుల్యముత్ప్లుతైః కరణైః కృతమ్
భ్రమరీభిస్తథా చారీమండలై రుద్ధతై రవి
నర్తనం ప్రేక్షణం ప్రోక్తం చమత్కారైక కారణమ్"

నృత్తరత్నావళి. vii.79.

గీతప్రబంధములను పాటాక్షరములతో సమముగా, ఉత్ప్లుతకరణములతో, భ్రమరులతో, ఉద్ధితమైన చారీమండలముతో నర్తించుట ప్రేక్కణము. ఇది ముఖ్యముగా చమత్కారము గలిగించును.

వంటి ప్రేంఖణనృత్తము శ్రీనాథసూత్రధారుని దర్శకత్వమున గద్యపద్యసరణితో భావాత్మికతను బొదివికొనుట వలన మార్గరీతికి చెందిన నృత్యసరణికి నెదిగినది. ఈమార్గ, దేశిపద్ధతుల కలగలుపులలోనే శ్రీనాథుని కర్ణాటకమున్నది. అంతేకాదు పలుకుఁదొయ్యలి గద్యపద్యసరణిలో కైవారమొనర్పులలో గీతమును సూర్య చంద్రుల కనకభూషానినాదములలో వాద్యమును భృంగీశ్వరుండాడిన ప్రేంఖణమున నృత్యమును ప్రతిపాదించి ఒక్క పద్యములో గీతవాద్య నృత్య త్రయియైన తౌర్యత్రికరీతిని ప్రతిపాదించిన శ్రీనాథుని ప్రతిభ నాస్వరో వర్ణనీయము.

ప్రేంఖణమునేగాక గొండ్లినిగూడ నీగ్రంథముననే మఱియొకచో నిట్లు నిర్వహింపజేసినాడీ కవివరుడు.

“కొదమ మెగిళ్ల చెరలను దడంబడు పలుదవడగం
డ్లు పుష్పాంజలులను నురుము పప్పళ్ల మద్దెళ
ధ్వనులునుగా గగన రంగస్థలంబున గ్రొమ్మెఱుగు
మెఱుంగు బోడిగొండ్లి పరిఢవించె”*

జాయపసేనాని నృత్తరత్నాకరమందు ఈగొండ్లి నృత్యపు పుట్టుపూర్వోత్తరములను తెలిపియున్నాడు. గొండ్లిని కుండలి యనికూడ అందురని ఇది మహారాష్ట్రదేశీయాతమని తెలియుచున్నది. రాగవిబోధకారుడగు సోమనాథుడు దీనికి రూపుదిద్దినాడు. అంతేగాక ఈనృత్యమును పార్వతీదేవి సుందరీ అను నృత్యసుందరికి నేర్పినదిగాన నీగొండ్లికి కుండలి యనియు నామాంతరమున్నది. ఏది ఎట్లయినను ఇదియొక సుకుమారలాస్యము. స్త్రీ ప్రయుక్తమనుట స్పష్టము. రసవన్నాట్యప్రయోక్తయగు శ్రీనాథుడిద్దానిని క్రొమ్మెరుంగు మెరుంగుబోడిచే నాడించుట ఔచితీసమంజసము. ఆనాట్యపదర్శనమునకు కావలసిన నైపథ్య విశేషము నంతటిని గగనరంగస్థలముననే సంతరించి శ్రీనాథుడు ఇట్టి వర్ణనతో అర్వాచీనుడైన ఆనాట్యప్రదర్శనమునకు కావలసిన నైపథ్య విశేషమునంతటిని గగన రంగస్థలముననే సంతరించి శ్రీనాథుడు ఇట్టి వర్ణనతో అర్వాచీనుడగు రామరాజ భూషణునకు ఆరాధ్యుడైనాడు. ఇంతటి గీతవాద్యనృత్యత్రయి అయిన సమగ్ర సంగీత పద్ధతిని తాండవ విద్యాప్రధానుడైన పరమేశ్వరుని సుకుమార లాస్యజననియైన పార్వతిని ఆరాధించి సాధించినాడెమో అనుటకీ పద్యపాదము తార్కాణము.

---

* గొండ్లి వివరణమునకై 14వ పేజీ పాదసూచికను వీక్షింపుడు.

ఇక శివరాత్రిమాహాత్మ్యమునందు సంగీత ప్రసక్తులకాస్కారము కథాను సారిగగూడ తక్కువయే. అందులోను లభ్యమైన గ్రంథము సమగ్రముకాదు. అయినను నాధ్యేయముతో నెమకిన కొన్ని దొరికినవి. కథానుసారిగ యజ్ఞదత్తుని ప్రథమకళ్యాణవేళ సంగీతమున కవకాశము లభించినది. అది ప్రవర్తితమయి నది కర్ణాటీగానమగుట గమనార్హము. ఆ కర్ణాటకమలముఖులకు శ్రీనాథుడు తెలుగువారి ధవళప్రబంధ గానమును వారిచే నిట్లు పాడించినాడు.

> హరిదంభోరుహలోచనల్గగనరంగాభోగరంగత్తమో
> భరనేపథ్యము నొయ్యనొయ్య సడలింపన్ రాత్రి శైలూషికన్
> వరుసన్ మౌక్తికపట్టమున్ నిటలమున్ వర్ణింబునన్ దోచెనా
> హరిణాంకాకృతి పొల్చురేకయి సగంబై బింబమై తూర్పునన్
>
> వసుచరిత్రము - iv - 17.

"తానుద్దండ తాండవగురుండయినను పార్వతి సుకుమారలాస్యజనని
కాశీఖండము -

---

> కల్యాణకటకే పూర్వం భూతమాతృమహోత్సవే
> సోమేశః కౌతుకాత్ కాంచిత్ ఖిల్లీవేషము పేయుషీమ్
> నృత్యంతీమథ గాయంతీం స్వయం ప్రేక్ష్య మనోహరమ్
> ప్రీతో నిర్మితవాన్ చిత్రగోండ తివిధి నృత్యయమ్
> యతో ఖిల్లీ మహారాష్ట్రీ గోండలీత్యభిధీయతే
> కుండలీం నామ మృద్వంగీం సుకేశీం దివ్యయోషితమ్
> సంగీతం కోమలం నృత్తం శిక్షయామాస పార్వతీ
> తన్నృత్తం కుండలీ మాహుః తత్సంబంధాత్ పురాతనాః
>
> నృత్యరత్నావళి VIII - 162 - 146.

"వేడ్క నృత్యంబులాడిరి వీథులందు
పాడిరొత్తిరి ఏకతమహా పంచటముల
పంజరంబుల ధవళప్రబంధ గీత
కముల యవ్వల కర్ణాటకముల ముఖలు"*

సుకుమారుడు వలచిన చండాల కన్యకనుగూడ సంగీతమును నేర్చిన దానినిగ చిత్రించి ఆమెచే సుకుమారునితో 'సంగీతబాణి'లోనే మాటాడించినాడు. ఆమె సంగీతక మొనరించియే సుకుమారుని ఆకట్టుకొనిన జాణయై ఆతనితో నిట్లనినది.

"ప్రాణనివారము కష్మని
ప్రాణము నెరజాణ దేవరా వినవలదా
వీణావాద్యము పాటయు
వేణుస్వానంబువేసవే బృందములన్" **

తా నెమ్మెచ్చిన సానిని ఈశానినిగా భావించి తన కావ్యమున తావచ్చిన చండాలినికి సంగీతకాసక్తిని కల్గించి శ్రీనాథుడు ధంగ్యంతరమున తన సంగీత సహృదయతను నిట వెలార్చినాడు. ఈ శివరాత్రిమహాత్మ్య కీర్తనముతో శ్రీనాథుడు మధ్యమావతిని ఆలపించి పౌరాణిక కర్ణాటగాన ఫణితికి స్వస్తివాక్యమును రాగమయముగా పలికినాడు.

## కవిరాజు కావ్యకర్ణాట సంగీతరీతి

పురాణసాహితికి మంగళముపాడి కావ్యరీతికి శ్రీరాగప్రస్తారమును కర్ణాటముగా ప్రారంభించి కవిసార్వభౌముడు గాయకసార్వభౌముడునై గీతి సాహితీ ప్రపంచమున చిరంజీవి అయినాడు. పురాణానువాదమున పూర్వకవుల

---

* శివరాత్రి మహాత్మ్యము ii - 13

** " ii - 60.

Early in the 12th centry Somasekhara Bhulokamaile, a ruling Chieftain in the Deccan (1116-1127 A.D), the author of Manasallasa lailid the music of South India as Karnataka Sangeetha (Carnatic Music) What a Mugic!

ఖాతి తన సంగీత ప్రతిపత్తిని పరోక్ష పద్ధతిగ కథానుగత సన్నివేశముల ననుసరించి సమకూర్చినాడు. ఇక కావ్యరచనా వ్యాసంగమున కావలెనని సన్నివేశముల కల్పించుకొని ప్రత్యక్ష పద్ధతిలో తన సంగీత సరణిని ప్రవర్తింపను ప్రారంభించినాడు. అది కేవలగానముగాక అట్లని వాద్యనృత్యములుగాక గీత వాద్యనృత్యత్రయీరూపమును సంతరించికొని ప్రవృత్తమగుట ముదావహమైనది.

గాంధార గ్రామము నెలవుగ గగనాంగణమున నధివసించిన నైషధ గీర్వాణిని తన కర్ణాటగానరీతియుత నాదోపాసనతో ప్రసన్నను గావించుకొనినాడు తన కవితాగాన రీతులకు ఆవాగ్దేవి ప్రముదితస్వాంతయై తవనుగత శ్రుతిలో షడ్జ మధ్యమ గ్రామములనుగూడ తన కచ్ఛపిపై పలికించినట్లు గావించుకొనినాడు. తెలుగు మీఱిన ఆదేవిని దివినుండి భువికి దింపి అభినవ భగీరథుండై నాడిట శ్రీనాథ కవిసార్వభౌముడు. అపుడు శ్రీనాథుని స్వాంతవీథిలో నిండు వేడుకతో ఆగీతిసాహితీ విశారద, శారద ఇందు కుంద చంద్ర చందన సారవర్ణయై విహరించి శ్రీనాథకవివరుని కీర్తిస్ఫూర్తి కర్పూరములను దశదిశల వికీర్యమాణము గావించినది. అపుడామె సత్కవుల స్వాంతమను తనకునుబద్ధమును చూచుకొనుచు సంగీతవిదుల హృదయారామమున విరిసి గుబాళించిన చిన్నిచుక్కల రాజను కేళీసుమంబు నవతంస కుసుమంబు గావించుకొని అలంకృతమైనది. పసిడి కిన్నెరవీణను పలికించి పాటకచ్చేరి చేసినది. అట్టి శుభ సమయమున కవిగాయక సార్వభౌముడగు శ్రీనాథునిచేత స్వర్ణఘంటలయాత్మకత నెలవుగ కవితాగానము గావించుచున్న పసిడి ఘంటముతో శ్రుతి కలిపి నైషధ కావ్యకన్యచే నాట్యమాడించినది.

కృతి కర్తయగు శ్రీనాథ కవిసార్వభౌముని సంగీతాత్మక స్వాంతరీతికి తగిన కృతిభర్తయే అయినాడు మామిడి సింగనార్యుడు అతడు కొలువుండినది కళాభవనము. ఆతనిని పరివేష్టించిన వారు గీతిసాహితుల కిద్దరికి దగ్గరివారగు కళాకుశలులగు కవిగాయకులు కళావంతులును. ఇట్లు కొలువుండి ఆసకల విద్యాపారీణుడు మామిడి సింగనామాత్యుండు సరససాహిత్య విద్యాగోష్ఠీ ప్రసంగంబున అనఘ శ్రీనాథాఖ్యునింబిల్చి సత్కారంబొప్పగా గారవించి నైషధ సత్కావ్యమాంధ్ర భాషనొనరింపు నాపేరనంకితముగ ననినాడట. అట్టి

కళాభ్యర్చనుని అభ్యర్థనానుసారము రచితమైన నైషధము మూలధాతువునను సరించి విద్వదౌషధమయ్యెను సంగీతమను తెలితేనెలో తెలుగుతేనెలో కూడ రంగరింపబడుటవలన ఆంధ్రరసిక కిశోరముల కాస్వాదయోగ్యమై పుష్టిని తుష్టిని గూర్చినది. అందులకే తన పాండితీభేషజము నొలికించి అనువైన పట్టుల నెల్ల సంగీతామృతమును చిలికించి అందరి సహజ కాఠిన్య పటుత్వముల మటుపించినాడు. శ్రీనాథ భిషగ్వరపండితుడు.

ఇక కావ్యాంతరిత సంగీత ప్రసక్తులననుశీలించిన నింపు వీణావాద్యమున కాద్యమగు స్థానము నొసగి తద్వారమున హర్షాతిరేకమును మతితలకు గల్గించినాడు. అభ్యాసవశమున వీణపై ప్రాణేశ్వరుని కీర్తి ఇంచు గీతముల వాయించు దానినిగ దమయంతిని చిత్రించుట ఇమ్మహాకవి ఉపజ్ఞత. నారద పర్వతులింద్రు దర్శింపనేగిన సన్నివేశమున నారదుని రూపవర్ణనముతో పాటు అతని మహతి ధ్యానమును మహత్తర మొనర్చుటయు శ్రీనాథుని మహిమయే

“...... బలసూదనుం జొడగోరి నాకలోకంబు కరుగ నంగ సమకట్టి పితామహు కార్మిపట్టి హస్తాంబురుహాంగుళీ నఖరిఖాంతరకోటి వివంచి మీటుచున్*

“ఆమహా సంమహాద్యా నిఘట్టనముల శత తంత్రి
మూర్ఛనాస్వరములీన......”**

ఇట దొరలిన ఈవాద్యప్రశస్తివలన నారదుని మహతి నూఱుతంత్రుల వీణయేయని తేటపడుచున్నది. అది గాలితాకుడు మాత్రముననే మూర్ఛనా స్వరములీనునట్టిది యనియు విశదమగుచున్నది. ఈవీణా ధ్యానమున కనుశ్రుతుల నీను వీణాధ్యానమున పెద్దన తిమ్మనాదులు పరిగ్రహించిరి. *** **** ఈ వీణ

---

Spelt the title has cost over successive generations for eight Centuries, "History of South Indian Music" By

Sriman R. Rangaramanja Ayyangar, Page - 141.

* శృం. నై. III - 3

** శృం. నై. III - 6

*** వాలాయమంగొనగోళ్ల వేళ్ల పెద్దన

**** సరిగమపదని సప్తస్వరమ్ముల మహతి పారిజా.

ఆంగ్లేయులు **Harp** వలె మన ప్రాచీనవాద్యమగు స్వరమండలమువలె తంత్రులే ఆయారాగములకు మేళవింప అనువైనదనిపించుచున్నది.

చిన్నగాలి రివటయైనను తీగకు సోకినచో రాగచ్ఛాయ అందులకే గోచరించును. ఇక దమయంతి అంతిపురము సంగీతరమునకు స్థానకమైనట్లు హర్షాభిభాషణమునకు ప్రతిగ శ్రీనాథుడిట్లనినాడు "ప్రతోళి రత్నవేదికా మధ్యాసీన సిద్ధ గంధర్వాంగనా ప్రవర్తిత సంగీతకంబు" అట ప్రవృత్తమైనదట. అంతేగాక అక్కడి అరుగులపై ఆసీనులై సిద్ధగంధర్వదులు "అరుదగు గాంధార గ్రామ మూర్ఛనా సహితముగ సంగీతకమును గీతవాద్య నృత్యములను" నిర్వహింతురట. శ్రీనాధుడు ఎడనెడ సంగీతశాస్త్ర పారిభాషికమగు మూర్ఛనను తడపుచుండును. ఈపదము సంగీతశాస్త్ర సహాకృతిలో ఇంతఃపూర్వము వివృతమె. దానినే సంగీత దామోదరకారుడు ఒకించుక స్పష్టముగ ఒకచోనిట్లనినాడు.

"స్వరః సమ్మూర్ఛితో యత్రరాగతాం ప్రతిపద్యతే
మూర్ఛనామితితామాహుః కవయో గ్రామసంభవామ్"*

ఒకచో దమయంతినిగూర్చి సవిశేషముగ ప్రస్తావించిన సందర్భమున శ్రీనాథుడు గానవాద్య ధ్వానమిట్లు కర్ణాటకముగ ధ్వనింపజేసినాడు.

"దీని కంఠమునందు వాగ్దేవి యుండి
వీణ మొఱయించుచున్నది వీనులలర
నదియ ముఖమున వాగ్ధార మాత్రయించి
యమృతధారా ప్రవాహరూపముగా నిచ్చ"**

---

* సంగీత దామోదరమ్ : తూ.ప్రా.అం. 5. సం.ప్ర. Vol-1-పుట.

** శృం నై. III - 173.

"కవితా గానప్రియమా
స్వరజ సీమా విభాగవిధ రేఖయనా
ధవళాక్షి కంఠసీమం
బ్రవిమల రేఖాత్రయంబు ప్రస్ఫుటమయ్యెన్"*

ఈ రెండుపద్యములలో ఇట కంఠమునుండి వెలువడు మధుర ధ్వానముతో పాటు కంఠసీమన ప్రవ్యక్తమై గోచరించు సాముద్రిక లక్షణానుసారి త్రిరేఖలను ప్రతీకలుగ కవితాప్రియ వాగ్విభవణంతోపాటు గానముకూడ ప్రతిపాదితమైనది.

దమయంతీ స్వయంవర వైభవ వర్ణనలో సంగీతమునకూడ చోటుచేసి కొనుట విశేషము. స్వయంవరాగతులలో నొకడుగానేతెంచిన వాసుకి ఫణా పర్యంత మాణిక్యమంజు మయూఖాంకుర కంజామంజుల నభమ్మండై భుజగాంగనాసముదాయంబు లనంత యశస్సంగీతగాథావళుల్ పాడుచుండగ"** స్వయంవరంబునకే తెంచినాడట.

ఆ వైదర్భీ స్వయంవర వైభవమునుగాంచ "సముత్తుంగ మంగళ మృదు మృదంగ నినాద భంగీ తరంగిత ప్రసంగంబై విబుధ వారాంగనాజనంబు సభా రంగంబునకు బ్రవర్తించె"నట

ఇక ఈ ఆశ్వాసాంతమున కృతి భర్తనుద్దేశించి ప్రవర్తిల్లిన సంబుద్ధిలో గూడ సంగీతమే ధ్వనించి ఆశ్వాసమంతయు రాగరంజితమైనది.

"లాటీ చిత్తసరోమరాళకబరీ లావణ్యలోలాత్మక
ర్ణాటీ నృత్యకళావిలోకన సమారంభ ప్రియంభావుకా"***

ఇటు దొరలిన గీతవాద్యనృత్త్రయి అయిన సంగీతములో నొకటియైన నాట్యప్రసక్తి కర్ణాటీయను పదముతో సమాయుక్తమైనది. శ్రీనాథుని యభి

---

* శృం. నై. III - 786.
** " IV - 127.
*** శృం. నై. IV - 141.

ప్రేతార్థముగా భాషాపరముగ నిది కర్ణాటభాషయగుచో నాద సంగీతపరముగ కర్ణాటీనృత్యకళా విలసనమనుట ప్రవ్యక్తము. ఇది ఆచార్య పింగళి లక్ష్మీ కాంతముగారి కర్ణాటానురాగ భావనకొక మూర్ఛన.

స్వయంవర నేపథ్యమంతగ రాగమయముగ సంతరింపబడిన అనంతరము దమయంతి స్వయంవరస్థానమున కేతెంచిన తీరులోగూడ సంగీతకమే యిట్లు వెల్లి విరిసినది.

"చతురత్వంగొప్పగా నప్సరసలు పార్శ్వంబులన్ బాడుచున్" రాగ దమయంతి ఏతెంచగ ఆమె "పార్శ్వంబులందున్న శతపత్రాక్షికరా బ్జోచ్చలిత ధవళరుక్చామరాళీ మరాళీకృత లీలాలాస్యకేళీ కిసలాయిత కళాఖేలనం బొప్పు" మీరినదట.* ఇట మరాళీ అనుపదము హంసకు పర్యాయమగుటయేగాక దేశీ, భౌమచారి ప్రక్రియలకు సంసూచిక మగుచున్నది.

నృత్తరత్నావళీకారుడీ మరాళీరీతిని తన నృత్తరత్నావళిలో విశద పరచినాడు. వేదమువారి సర్వంకషవ్యాఖ్యలో నిద్దానికి మూలమున్నట్లు సంసూచితముకాలేదు. కావుననిది శ్రీనాథోపజ్ఞమనుకొనవలెను. అట్టిదే మరియొక స్వకపోల కల్పనము శ్రీనాథకర్ణాటరీతికి దర్పణమై నలదమయంతుల వివాహ వినోద సందర్భమునయున్నది. కైశికవృత్తిని గురించి తిక్కనార్యుని గానాభిరుచిలో వివరముగ పర్యాలోచితమైనది. ఆలంకారిక శాసనానుసారము.

**"శృంగారే కైశికీ వీరే సాత్వత్యారభటీపునః।
రసే రౌద్రేచ బీభత్సే వృత్తి సర్వత్ర భారతీ॥
చతస్రోవృత్తయో హ్యేతాః సర్వేనాట్య ప్రమాతృకాః।" అని
యున్న,

---

* నృత్తరత్నావళి - vi - 76. మరాళీరో లక్షణం (భా ఖండా ప్రతి చూ.శ్లో. సంద్యావర్త...."

** "నంద్యావర్తే స్థిత యుగ్మస్థితయుగ్మ పార్శ్వ పాదాగ్రయోరపి రేచితా చరణౌ యత్ర సర్వతస్సామరాళికా"

నృత్తరత్నావళి - VI - 76.

*"స్త్ర్యాన్నాయకాది వ్యాపార విశేషాఃనాటకాదిషు
యాశ్చ నేపథ్య విశేషచిత్రా స్త్రీ
సంకులా పుష్కల నృత్యగీతా
కామోపభోగ ప్రభవోపచారతాం కైశికీ వృత్తిముదాహరన్తి".

దీనిని బట్టి కైశికీవృత్తి శృంగారరస సంబంధమని గమ్యమానము. ఇక ధ్రువయనునది ప్రబంధప్రక్రియలలో నొకటి. భరతాచార్యుడిద్దానినిట్లు వివరించినాడు.

"ధ్రువాతుగతిభేదోఽయం బృంద సామానిబధ్యతే
తత్రప్రావేశికా జ్ఞేయా ప్రవేశే గానయోగతః"

ఇంతేకాదు ధ్రువాస్వారస్యము నీక్రింది బాలరామాయణ శ్లోకముగూడ ఇట్లు చాటుచున్నది.

"ధ్రువాహి నామ నాట్యస్య ప్రథమ ప్రాణాః
తథాహి ప్రద్యయతి పాత్రవిశేషానపి
సామాజిక మనాంసి రంజయతి
అనుసంధధాతిచ రసాన్నాట్య విశేషాషే ధ్రువాగీతిః"**

కాబట్టి ఇంతటి ప్రముఖములగు ప్రావేశిక మంగళధ్రువలు వీనులకింపుగ నంగనలు పాడిరని వానిని ఆసన్నివేశానుసారముగ అనాటి బయకారులు అనగా వాగ్గేయకారులు రచించిరని మాత్రమే శ్రీనాథుడన్నాడని అనుకొనరాదు. ఆ పాటలోని స్వారస్యమగు శ్రీనాథాభిప్రేరిత కర్ణాటశబ్దార్థ వివేచనలోనే ఆచార్య దేవులు పింగళివారి కర్ణాటశబ్ద వివేచనమాత్రమేడితమైనది. ఆచార్యదేవులు పలనాటి వీరచరిత్రా రంభమున ఒనర్చిన నాట్యవిషయ కర్ణాటశబ్ద ప్రస్తావనమే ఇట గానవిశేషమునకుగూడ చక్కగానతికి పోవుచున్నది. అంగనలు ప్రావేశిక ధ్రువలు వీనుల కింపుగఁ బాడిరనగా కర్ణాటముగా పాడిరని ఇట అన్వయించు

* సాహిత్య దర్పణం - (చౌకంభా ప్రతి)
** బాల రామాయణము (చౌఖంబా ప్రతి)

కొనవలెను. అప్పుడట కర్ణాటమనుటకు "కర్ణే అటతీతి కర్ణాటకః" అను వ్యుత్పత్తిని అనుసంధించుకొనక తప్పదు. ఇక ఆ ప్రాపేశిక సంగళ ధ్రువలను ఆ యతివలు పాడిన బాణిలో దేశివిధమేగాక మార్గమునందలి తేటయున్నదని శ్రీనాథుడొక మెలిక పెట్టినాడు. సామాన్యముగ మార్గమునందు క్లిష్టతయున్నదని పించును. కాని శ్రీనాథుని బాణిలో ఈ క్లిష్టత రాచిపడకొట్టబడి తేట తేర్చబడి నది. ఆపైన మార్గదేశి విధములు రెండునొక్కట సాళగింపబడినవి కూడ. సాళగమనగ రాగసంబంధిగ సంగీతశాస్త్రమున ఛాయాలగమునకు పర్యాయ పదముగ వివరింపబడినది. జనక రాగచ్ఛాయనేగాక అన్యరాగచ్ఛాయనుగూడ ఛాయామాత్రముగ గల్గిన రాగమును ఛాయాలగమందురు. కావున మార్గపద్ధతి యైన ప్రాపేశిక సంగళ ధ్రువలో దేశివిధంబు ఛాయామాత్రావతీతమైనదనుటలోని విధము పర్యాలోచనార్హము. అబలా బాలగోపాల క్షితిపాలాదులచే నిజేచ్ఛాను సారముగ గానము చేయబడెడి రీతి దేశియని, బృహద్దేశియందుక్తమైన సారాంశము. కాని శ్రీనాథప్రోక్తమగు కర్ణాటగీతి రీతిలో దేశిలోకూడ ఒక నియత మైన విధమున్నదని వ్యక్తము. ఇది కేవలనిజేచ్ఛానుసార ప్రవృత్తిమనుకారాదని చెప్పక చెప్పినట్లైనది. ఇక మార్గరీతి సంగీతశాస్త్రమున బృహద్దేశోద్దిష్టమై భరతోక్తమైన దనియును అది క్లిష్టమయ్యును శిష్టజనసమ్మతమనియును చెప్ప బడినది. ఇక శ్రీనాథాంతేవాసులగు బయకారులు ఈ ప్రాపేశిక సంగళ ధ్రువా గీతికలను వీనులకింపుగ సుగమములుగ రచించిరని భావింపవలెను. అవి పెండ్లి పాటలుగ గానము చేయవలయునుగాన మార్గికిఁజెందినను తేటపలపరచుకొనినవి. కావుననే దేశివిధంబు మార్గమున తేటనొక్కట సాళగింపబడినవి. అవి తిల తండుల న్యాయమున రాగమేళనము నొందినవి. ఈ గీతికలలో శుద్ధరాగముల రీతి దేశిరాగముల ఛాతిచ్ఛాయాలగ రాగస్థితి యొక్కట గోచరమై ఒక వింతరీతి ప్రతిపాద్యమైనది. అందులకే అవి ఒక్కట దేశిగ మరియొక్కట మార్గిగ విభాసమానమైనది. అదియే శ్రీనాథుని కర్ణాటగాన ప్రతిపత్తియని ఆయన స్వీయ భాష్యముగ ఈపద్యము మనకు మూదలగ నిలుచుచున్నది. దీనిని "ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోఽనుధావతి" యని ప్రమాణీకరించుకొనుట కను వున్నది.

ఇక నైషధము తరువాత పర్యాలోకించదగినది హరవిలాసము ఈ ఈ హరవిలాసకావ్యమున వస్తువైవిధ్యమున్నట్లే సంగీతమునగూడ నిందు వివిధభంగులు వివేచనమందినవి. శ్రీనాథరచిత పార్వతీపరిణయగాథ కాళిదాసీయ కుమారసంభవమునకు తీర్చినదిగ్గు. ఈ కావ్యరచనమున శ్రీనాథ కవివరుడు ఒక్కొక్కచో మూలానుసరణము గావించినను గానవిషయమునందే మాత్రము మూలవిధేయతను చూపించలేదు. ఇట్టి పట్టులను స్వేచ్ఛగా మలచుకొని తన యిష్టానిష్టముల ననుసరించి గీతిరీతి నిందను సంధించుకొనినాడు. కాళిదాసీయమున తృతీయసర్గలో అకాలవసంతావిర్భావ ఘట్టమున

> "గీతాంతరేషు శ్రమ వారిలేశైః
> కించిత్సముచ్ఛ్వసిత పత్రలేఖమ్
> పుష్పాసవ ఘూర్ణిత నేత్రశోభి
> ప్రియాముఖం కింపురుషశ్చుచుంబె॥ * అను దీనిని

శ్రీనాథుడు,

> దేశికగాని (గాన) మార్గములఁదిన్నని రీతులఁబాడపాడ యా
> శ్వాసమునొంది సోలియర వాడిన యంగన మోముఁదమ్మిఁబు
> ష్పాసవ ఘూర్ణ తేక్షణములల్లన। జుంబన మాచరించియు
> ల్లాసమొనర్చె కిన్నర విలాసి హిమాచల కందరంబునన్". **

అనుసరించినాడు.

కాళిదాసీయమున సంగీత సంబంధిగ నిట ప్రస్తావింపబడినది "గీతాంతరేషు" అను పలుకుబడిమాత్రమే. కాని శ్రీనాధుడు దానిని తన స్వేచ్ఛాప్రవృత్త్యను సారము కర్ణాటక బాణిని ప్రతిపాదించినాడు. "కర్ణే అటతీతి కర్ణాటకః"-అను ఏతత్పదార్థ వ్యుత్పత్తికిట ఆచార్యపింగళి లక్ష్మీకాంతముగారి భావనయగు దేశిమార్గరీతుల నడిమి వాట ప్రక్రియయగు కర్ణాటక మార్గరీతిని అను సంధించు కొనవలెను. కావుననే కర్ణాటకముగా ఆ కిన్నెర విలాసి పాడిన పాటను కవి

---

* కుమారసంభవము —

హరవిలాసము— III—62,

యిట పలచినాడు. దేశిక గాన మార్గమునగాని, దేశికగాని మార్గమునగాని ఎటులైనను తిన్నని రీతులతో బాడిపాడి ఆ శ్వాసము నొందవలసిన పాటయిది. దానికి బాటయునదియే. పాడినచే పాడినట్లయి వినుపుగొల్పగ చవులూరించుచు అనగననగ నతిశయిలిన రాగమయ్యెది. కిన్నరనారి పాలిటికి నాదోపాసనాపధిగ అనంత తానముగ, ప్రణవధ్యానముగ ప్రవర్తిలి ఆమెను అరవాడి సోలిపోవు నంతటి పారవశ్యస్థితికి తెచ్చిన దివ్యగానమది. ఆ ప్రణవధ్యానము కిన్నర విలాసికి ప్రణయ మువ్వతిల జేసినది. ఇదియే శ్రీనాధప్రోక్తమగు కళా రహస్యము అది నృత్యగాన వాద్య విలాసములలో ఏదియైనను కానిండు. కేవలము ఒక ప్రక్రియకు ఒకకోపమ ఒకేఒకరీతికి కట్టుబడియుండుట నీరసమని పించునని శ్రీనాధుని భావన. *అందులకే నవప్రియయుతైన కళాపిపాసువులకు సంగీత రసికులకు కవితావిలాసులకు చవులూరించు పై సిద్ధాంతమును తన కవనమున కాశీఖండమున గూడ ఇట్టిరీతినే ప్రదర్శించినాడు. అదియే ప్రౌఢి బరికింప సంస్కృతభాషగ, పలుకునుడికారమున నాంధ్రభాషగ ప్రవహించిన యీ భావమును భజించి కర్ణాటకమైనది. అదియే శ్రీనాథ ముద్రగ గానమున నాట్యమున వాద్యమున కవనమున గూడ ఇమ్మహాకవి కావ్యప్రపంచమున ప్రత్యక్షమగుచున్నది.

ఇట్టి విపుల భాష్యాపేక్షిగ ఇంకొక పద్యమున్నది

"అచ్చరులపాడు హిందోళమాలకించి
యిందువేళ ప్రసంఖ్యాన్ మెడలడయ్యె
నిర్జితేంద్రియులయిన నియమపరుల
నంతరాయంబులేమి సేయంగ గలవు"

దీనికి కాళిదాసీయమున మూలశ్లోకమిటులున్నది.

---

* ముని చూడామణి యెల్ల సత్కళలకున్ మూర్ధాభిషిక్తుండు గా
వున, జారి కరణాంగ హారముల్ తాపుతేమించి కీర్తించుచున్
శనివారోత్స వవేళ। గగ్గొనియెనా స్థానంబునన్ రాజ సం
దనుడుందానును దేశిమార్గమున గంధర్వాప్సరోద్వృత్తముల్

కా. ఖ। III. 19,

"శ్రుత్వా స్వరో గీతిరపి క్షణేస్మిన్ హృష్టః ప్రసంఖ్యానపరో బభూవ
ఆత్మేశ్వరాణాం నహి జాతు విఘ్నాః సమాధిభేదప్రభవో భవంతి"

ఇందలి గీతము తన సూక్ష్మ శ్రవణశక్తిని మెచ్చించి అలరించి శ్రీనాథుడు అప్సరసలిద్దానిని హిందోళమున గానము చేసిరని తెల్పుకొన్నాడు. శ్రీనాథుని మనోప్రవృత్తికి అనువైన రాగము హిందోళము. అది సంగీత శాస్త్రోక్తముగ మార్గిసంబంధియగు శుద్ధరాగము. అయ్యది మార్గి ప్రక్రియలకు చెందిన ఇతర రాగములగు భైరవినాట శ్రీరాగాదులవలె కేవల శాస్త్రీయ సంగీతముగ శ్రోతలకు వినిపించదు. అట్లని కేవల లలితసంగీతమని దేశ్యగానమని కూడ అనిపించదు. ఆ రాగము కేవలము దాక్షిణాత్య సంగీతపు నిధికాదు. అట్లని ఔత్తరాహిక సంగీతపు పెన్నిధియుగాదు. ఇది కర్ణాట హిందూస్థానీ సంగీత బాణీల రెంటికి రాణాచి. ఉభయత్ర దీనికి ప్రచయమున్నది. రసికులకిద్దానిపై ఆదరమున్నది. అభిమానమున్నది.

* ఈ హిందోళరాగమే తొలి కవితలో ఆదికవి వాల్మీకి నోట నొలికిన మానిషాద శ్లోకమున స్వరాక్షర సంపుటితో నిక్షిప్తమైనది.

స్వరములు ఈ రాగము ప్రణయ సమావేశమున శృంగారరస, ప్లావితమై ఆనందబాష్పముల నొలకించును. శోకమయ సన్నివేశమున కరుణ రసాత్మకమై కన్నీటిని చిలికించును. కావుననే ఈ రాగము శ్రీనాథుని కవనమున రాణాచియై కర్ణాట బాణిని పండించుమాగాణమైనది.

---

*"మా ని షా ద! ప్రతిష్ఠాం త్వమగమః శాశ్వతీస్సమాః
యత్క్రౌంచమిథునా దేకమవధీః కామమోహితమ్॥" ఇందలి "మానిషాద! మగమః సమాః" అను స్వరములు హిందోళరాగమున ప్రవృత్తములగు స్వరములు.

ఇవి శ్లోకాక్షరములేగాక స్వరాక్షరములగుట గమనార్హము. కావున వాల్మీకి హృదయాందోళనమే హిందోళమున వ్యక్తమైనదని భావించుటకనువైనది.

"నైషధమున వాద్యములకు అద్భుతగతి స్థానమిచ్చి, హరవిలాసమున గానమునకు ప్రాధాన్యమిచ్చి, పల్నాటి వీరచరిత్రమున నాట్యమునకు అగ్రాసనాధిపత్యమిచ్చి శ్రీనాథుడు గీతవాద్య నృత్యత్రయియైన సమగ్ర సంగీత తౌర్యత్రిక రూపమును తన కవితయందు పంచికొనినాడు. ఇట్టియెడల ఈ మహాకవి కవిసార్వభౌముడగుటయే కాక సంగీతసార్వభౌముడుకూడ నెంచినాడు.

శ్రీనాథ కవిసార్వభౌముడు కన్న కావ్యసుతలందరిలో కడగొట్టు చెల్లెలు పలనాటి వీరచరిత్రౌపదాఖ్యాయిక. చివరి బిడ్డ యగుటవలన గోముగ శ్రీనాథ కవివరుడు ఉగ్గుపాలతో ఈ కావ్యకన్యకకు సంగీతామృతమును రంగరించి పోసినాడు. ఆమె నడచిన నడక లయాత్మకమై, ద్విపదయైనది. ఆమె పలికిన పలుకు రాగాన్వితమై కథాఖ్యాయిక యైనది. ఈ వీరకథాకావ్యకవిగ శ్రీనాథ కవివరుడు కళాప్రదర్శనమును ప్రథమ విషయముగ నుంచుకొని సంగీతమునందు విశేషముగ పరిపోషించినాడు. ఈ ధ్యేయముతో నొక క్రొత్తపుంతను త్రొక్కినాడు. అది అనువున్నచోట ఆ పాదకంఠదఘ్నముగ సంగీతప్రసక్తిని గుప్పించుట. లేనిచోట ఆ పొంత పోకుండుట. శ్రీనాథుని కంతుపట్టిన కళా విదగ్గత ఈ కావ్యమున దర్శనమిచ్చినది. ఇట్టి వైదగ్ధ్యమునకు పలనాటి వీర చరిత్రము దర్పణమగుచున్నది.

ఈ పల్నాటి వీరచరిత్ర సంగీతమునంతటిని ఆచికొని ఆ కవివరుని హృదయ గ్రంథి విచ్చుకొనగ స్రవించిన తేనెలసోన గావున సంగీతపు తియ్యదనము అణువణువున ఇందు తొణికిసలాడినది. ఇందలి ఛందస్సు ద్విపద యగుటవలన తాళాత్మక విన్యాసమిందు పుట్టుకతోనే ఊపిరిపోసికొనినది. ద్విపద రచనమున పాల్కురికి సోమనాథుడు పట్టిన ఓంకారము శ్రీనాథుడు చుట్టిన శ్రీకారమైనది. అదిమొదలు ద్విపద తాళబద్ధము, అక్షరసుము తంత్రీలయ సమన్వితమై గీతికి పొత్తిళ్లబిడ్డయైనది. సాహితికి పొత్తులచుట్టమైనది. ఆ బాంధవ్యమే ప్రగాఢమైనది ఈ ప్రబంధముగ రూపుదిద్దుకొనినది. అందులకే ఈ కావ్యము పండితపామరజన రంజకమైనది. పురాణకావ్యకవిగ కోటలో గౌరవాధిక్యతగన్న శ్రీనాథకవిసార్వభౌముడు ఈ ద్విపదకావ్యముచే పేటలో ప్రజాకవి గాయకసార్వభౌముడైనాడు. అందుచేతనే పండితపరిషత్తులందు జయంత్యుత్సవములు పామరుల రచ్చపట్టులందు ఈవీరదాఖ్యాయిక గానములు

శ్రీనాథకవికి సహజసన్నిహితముగ సమకూడుచున్నవి. పాదపరజనపాణిలో నీపదా ఖ్యాయిక భాషావిషయమున లపభ్రంశమైనను సంగీతవిషయమున రాగరసస్థిత తాళలయాత్మకతయందు చెక్కుచెదరక చొక్కజేయుచునే యున్నది. అత్యంత పామరులగు జవనీలు, పిచ్చుకుంటలు, జంగమదేవరలు ఒగ్గువారలు పరంపరగ నీపల్నాటి వీరకథ నాలాపించుచున్నారు. తరములు మారినను తాళములుమార్చక లయాత్మకతకు తగినట్లే తమ గుమ్మెట్లను చిటితాళములను మొరయించుచున్నారు. లయతప్పక, శ్రుతినిపోనీయకనే రాగములను నిర్వహించుచున్నారు. వీరినోట పలుకుచున్న పలనాటి వీరులపాటలోనుపయుక్తములగుచున్న రాగములు మార్గి రాగములు కాకపోవచ్చును. శుద్ధరాగములై స్థిరముగ నొకబాణిలో నిల్వక పోవచ్చును. సాళగసంకీర్ణరీతులలో మార్గిదేశ్యరాగములుకూడ సాంకర్యమునంది వినిపింపవచ్చును. అయినను అట రసవ్యక్తికి రాగరక్తి తగినట్లు అతుకుటే అందలి ప్రత్యేకత. అయ్యది శ్రీనాథ సంకల్పస్థితరాగో ద్దిష్టవేళావిశేషమో! లేక ప్రప్రథమముగ నద్దానిని ఆలపించిన గాయక గానప్రభావమో తెలియదు. ఏదియైనను దాని ప్రత్యేకతనది నిలుపుకొనుచు కర్ణాటమై ధ్వనించుచున్నది. ఇట కర్ణాటమునకు ఆచార్య పింగళివారి మార్గదేశి ప్రక్రియల కలగలుపు నను సంధించు కొనవలెననుట సహృదయ విమర్శకులకు పరిచితమే.

ఈకావ్యమందలి సంగీతాన్వితస్థితివలన గీతావాద్యనృత్యత్రయియైన తౌర్యత్రికరీతి ఇట ఒక్కచో పుంజీభవించి వెల్లివిరియును. అందువలన ఈ కావ్యము ప్రయోగావస్థలో గీతవాద్యములకు సాధారణలక్ష్యమై నృత్యరీతికి విశేషస్థానమై విలసిల్లును. కథకుని రాగాత్మకాఖ్యానకము వలన గానమునకు, అతని సహాయకులగు వంతలవారు, గుమ్మెట్లు చిటితాళములు మ్రోయించుట వలన వాద్యమునకు కథానుసారిగ వారొనరించు అభినయమువలన నృత్యమునకు ఇయ్యది ఆస్కారకమై తౌర్యత్రికరీతి ఇట ఒక్కసారిగ వెల్లివిరియును.

ఇక కావ్యప్రకరణౌచిత్రీ సమంచితముగ నిందలి సంగీతకప్రస్తారము ననుశీలించిన అయ్యది రాశీభూతముగ నలగామునికొలువులో నధివసించినది. ఈరాజు సభాస్థానమున కంజలోచన యను ఆస్థాన నర్తకి నృత్యము ప్రవర్తిత మైనది. అందునాట్యశాస్త్ర పద్ధతి శతశాతసమగ్రమముగ ప్రదర్శితమైనది.

సంగీతశాఖాంతరితమైన భరతనాట్యశాస్త్ర ప్రక్రియాపై విధ్యమంతటికి అది లక్ష్య భూతమై లక్షణవిశేషభాష్యాపేక్షియైనది.

నలగాముని *కొలువుకూటపుటలంకృతిలోనే ప్రత్యేకతయున్నది. ఆ కళాభవనము తీర్చిదిద్దబడుటలోనే కళాత్మకత ఇట్లు వెల్లివిరిసినది.

ముత్యాలచోడుత ముగ్గులు బెట్టి
కప్పురముదకమ్ము కలిపియంతటను
జల్లిరి కలయంపి సత్వరమ్ముగను
.... .... .... .... ....
కాంచన నవరత్న ఖచితమైనట్టి
పీఠమొక్కటి దెచ్చి పెద్దకొల్వునను
నిలిపిరి కాంతులు నిండుగాదిశల"*

ఇట్టి సభాభవనాలంకృతికి తగిన వైభవములో సింగారించుకొని నలగాము డేతెంచినాడు సభకు. పాకశాసను కొల్వుపగిది నున్న ఆసభలో సముచితాసనము లలబందుగులు, ఉద్యోగులు, వేదశాస్త్రజ్ఞులు విద్వాంసులు ఆసీనులైరి. అపుడు ముందుగా

"వింతగా గాయకుల్ వీణలుపూని
తంత్రులు బిగియించి తగ శ్రుతిజేసి
సరిగ మేళనమై సప్తస్వరములు
ఆరోహణావరోహణ భేదములకు
బహురాగ సంస్ఫూర్తి పట్టగాజేసి
సంచారి సంస్థాయి సరసభావములు
మృదుతర శబ్దార్థ మిళితమైనట్టి
ఘనతరాలంకార గతి పరంపరలు
మూర్ఛనల్ మొదలైన ముఖ్యధర్మములు

* పల్నాటి వీరచరిత 660-675. (కల్లు ప్రతిష్ఠ)

జంత్ర గాత్రంబులు జంటగావించి
ఎండిన మ్రాకులు ఇగిరించుచునట్లు
పాడిరి తమతమ ప్రౌఢి మీఱంగ" *

ఇదికవిసార్వభౌముడు వ్యక్తీకరించిన సంగీతసభా వినోదవిధానము ఆనాడే కాదు. ఏనాడైనను ప్రతి సంగీతసమావేశములో ఈ కార్యక్రమము సాగవలసినదే. కాని ఆనాటి ప్రత్యేకత ఒకటి ఈనాడతి సకృత్తుగా మారిపోయినది. అది ఈనాడసలు లుప్తమైనదన్నను తప్పుకాబోదు. జంత్రగాత్రంబులు జంటగాచేసి ఎండినమ్రాకులు ఇగిరించునట్లు పాడుట ఆనాటి గాయకులలో కాననగు ప్రత్యేకత. అది ఈనాడు బొత్తుగా కానరానిగానమైనది. అనగా ఈనాడు సంగీత సభలలో వీణాదికములు వాయించువారు పాడరు. పాడెడివారు. వాయించరు. రెండింటిని ఒకే సమయమున నిర్వహించు సవ్యసాచులు అతిసకృత్తుగ నుందురేమో! నాటికి నేటికి సంగీతసభలలో కేవలగానము వాద్యసమాగతము కాకుండ మాత్రము ప్రవర్తితములగుట లేదు. కాని కేవల వాద్యములుగ వీణావేణు వాయులీనాదికములు లయవాద్యమాత్రానుగతములై వినిపించుచునేయున్నవి.

నేడేదేని సంగీత సమావేశమున గానసభ జరుగుచున్నప్పుడు ప్రధాన గాయకునకు ప్రక్కవాద్యగాండ్రు సహాయకులుగ నుందురు. అనగా గానమునకు వాద్యములు అనుగతములగుచుండుననుట స్పష్టము. కాని శ్రీనాథుని వర్ణనలలో వింతగా గాయకులె వీణనుపూని తంత్రులు బిగించి తగ్గ్రుతిఁజేసినట్లు కలదు. నేడును సంగీత సభాకార్యక్రమ ప్రారంభమున శ్రుతి చూచుకొను 'రివాజు' మాత్రము కన్పట్టుచునేయున్నది. గాయకుడు శ్రుతిచూచుట ననుసరించి ప్రక్కవాద్యములవారు శ్రుతిసంచుకొనుట నేటి పద్ధతి పూర్తిగ నిర్దుష్టముగ శ్రుతి యుండవలెనను బట్టుదలగల గాయకుడు తన తంబురకు శ్రుతి సరిగాజేసికొనునే గాని ప్రక్కవాద్యగాండ్ర వాద్యములకు తాను శ్రుతిచేయడు. సామాన్యముగా లలితసంగీత కార్యక్రమములలో లేక జంత్రగాత్ర సమ్మేళనములందో (ఆర్కెస్ట్రా) మాత్రమే వీణలు గాయకునకు అనుగతవాద్యములు గానుండునే గాని "మామూలు" సంగీతసభలలో గానమునకు వీణ ప్రక్కవాద్యముగనుండుట

* హ. వి. చ — నలగాముని కొలువుహామ ము వర్ణన.

అతిసకృత్తుగ గోచరమగును. ఆనాడు శ్రీనాథుని నాటి గానమున కనుగతవాద్యముగ నేటి వాయులీన స్థానమున వీణియయుండి యుండనోపును. తన గానమున కనుగతములగు ఆవీణియలనుగూడ గాయకులేపూని తంత్రులు బిగించి తగు శ్రుతి చేసెడివారు కాబోలు. అది ఆనాటి పద్ధతి ఏమో! ఇక సరిగమేళనమైన సప్త స్వరములు ఆరోహణావరోహణ భేదములను బహురాగసంస్ఫూర్తి పట్టుగాఁజేసి అనుపాదములను వివరణ చేతలే. ఆనాటి వీణలు నేటి రఘునాథ మేళవీణియల వలె ఇరువదినాల్గు మెట్లతో అన్ని రాగములను అలవోకగా పలికించుట కను వైనవికావు. కావున వీణావాదనముగల్గించుటకు ముందు వైణికులు రాగానుసారిగ వీణియపై ఆయాస్వరప్రస్తారములననుసరించి సప్తస్వరములలో నాయాస్వరములగు స్వరస్థానములను తంత్రులతోనే అనుసంధించుకొనెడివారు. దానినే మేళగించుట, మేళనములు అనియనుకొనవలెను. అట్టాని భావనయే ఇట "సరిగమేళనమైన సప్తసర్వములు ఆరోహణావరోహణ భేదములుపట్టుగా చేసిరనుటలో ప్రవ్యక్త మైనది. శ్రీనాథుడీ మాటలనుబట్టి ఈ కవివరునకు సంగీతలక్షణ వివేకమేగాక శ్రుతిజ్ఞానముతోపాటు లక్ష్యశుద్ధియునున్నట్లు విదితము. ఆ గాయకులు పై పాదములలో సప్తస్వరములకు బహురాగ సంస్ఫూర్తిని పట్టుగాఁజేసిరనుటయు జరిగినది. రాగానుసారిగ తత్ప్రస్తారము నావైణికగాయకులు చూచికొనిరనుట ప్రధాన విషయము. ఆరాగానుసారిగ అనగా అది సంపూర్ణరాగమో షాడవ రాగమో ఔడువరాగమో నిర్ణయించుకొని తదనుసారిగ వీణియపై ఆయాస్వర స్థానములను ఏడుగ ఆరుగ, ఐదుగ నిలపిరని అవలుకుబడివలసి వ్యక్తము. ఇక తరువాతిది "సరసభావముల మృదుతరశబ్దార్థమిళితము గావించుట అనుమాటలలోని అంతరార్థము. సరసభావములు సాహిత్యపరముగ రసవంతములైన భావములు. అద్దానికి సంగీతాపరమైన అర్థముగ రసానుసారిగ విదితములైన రాగములలో ధాతుమాతువులను మేళగించి గానముచేయుటయని యనుకొనవలెను. సంగీత సాహిత్యములకు రాగరసపరమైన అన్యోన్యతయున్నది. బయకారుడు కూర్చిన గీతి శృంగార రససంబంధమైన దానిని గానము చేయవలసిన రాగము మోహన, కల్యాణి, ఖమాస్, కామవర్ధని మున్నగునవియే కాక శృంగార భావవ్యంజక రాగములను మఱికొన్నింటిని క్రమశః రాగమాలికగగూడ కూర్పవచ్చును. అదియే భక్తి కరుణరసాన్వితమైన ముఖారి, వరాళి, సావేరి, నాదనామక్రియ, భాగేశ్వరి మున్నగు శోకరాగములలోనుండును, లేక యది విప్రలంభశృంగా

రాత్మకమైన హిందోళమో, కాంభోజియో, కానడయో అయియుండవోపును. కావుననే శ్రీనాథుడిట సరసభాషములని రాగరసవ్యక్తిని స్మరింపజేసినాడేమో! ఇక మృదుతర శబ్దార్థమిళితమైనట్టి అనుభావన ప్రయుక్తము కావలసిన భాషను గూర్చి శ్రీనాథుడిట ప్రస్తావించినాడని కొనవలెను. భాష మృదుతరశబ్దార్థ మిళితముగావలెననుటలో శయ్యాదిఆలోచనాత్మకత్వమును పొడనికానియుండుటయే కాక ఆపాతమధురమునైయుండవలెననుట విదితము. ఇక "ఘనతరాలంకారగతి పరంపరలనని పలుకుబడులలోని భావన పర్యాలోచించవలెను. సాహిత్యవిదులు ఈమాటలలో గొప్పవియగు శబ్దార్థాలంకారములకుఅనువైన నైఘంటికార్థము మాత్రమే దర్శింతురు. కాని సంగీతశాస్త్రకోవిదులకీ పదములలో ఘనరాగములగు 'నాట, గౌళ, అరభి, వరాళి, శ్రీరాగములలో ప్రవృత్తములగు స్వరప్రస్తార సంబంధులగు స్వరాలంకారములు స్ఫురించును. ఈ అలంకారములను సామాన్యముగ సంగీతము నభ్యసించు విద్యార్థులు ప్రాథమికసాధనలో పాఠముచేయు సప్త తాళ బోధకములగు స్వరసంపుటములని భ్రమింపరాదు. పద్యరచనమునందలి శబ్దాలంకారములు శాబ్దికచండతాండవ జటిలపద గుంఫనాదిక సహకృతితో ప్రవర్తితమగును. అట్లే ఈ అలంకార స్వరస్తబకములు పుంఖాను పుంఖములుగా స్వర గుంఫనముతో ప్రవర్తితములగును. ఇదియే సంగీతశాస్త్రమున చెప్పబడిన స్వరాలంకారప్రక్రియ. కవిత్వమునందలిశబ్దాలంకారములకుప్రథమావధిపరమావధికూడ శ్రుతిసుఖ ప్రతిపాదకత్వమే. అప మంద్రాది, మధ్య మంద్రాంత, ప్రసాద, వ్యావృత్తస్ఖలిత, ఆక్షేపాదికములనిసంగీతశాస్త్రములందు వర్ణాలంకారప్రకరణమున చెప్పబడినవి. ఈ స్వరాలంకారములకు కవిత్వమునందలి శబ్దాలంకారములగు ఛేకానుప్రాస, వృత్త్యనుప్రాస, ముక్తపద గ్రస్తాదులకునున్న సామ్యములను నన్నెచోడ పోతనాదుల కవనము నందలి గానరీతిని పర్యాలోచించు పట్టుల వివరించుటయైనది. ఈ స్వరాలంకారపు సొబగులను శ్రీనాథుడు ఎఱుగనివాడు కాదు. కావుననే దాని ప్రసక్తి ఈపలుకుబడులందు తెచ్చియుండవచ్చును. ఇక గతి పరంపరలు మూర్ఛన మొదలైన ముఖ్యధర్మములను పై మాటలలోని ఆంతర్యము. ఈగతి పరంపరలు, మూర్ఛనలు అనునవి సంగీతశాస్త్ర సంబంధ సాంకేతిక పదములు. సంగీతశాస్త్రపాండితి పరాకోటిని ముట్టిన మనోధర్మసంగీతపు మేరలీ పదములు. గతిపరంపరయను నిసాంకేతికపద సంపుటి తాళాన్విత స్వరకల్పనా సంబంధి. మూర్ఛనయనునది శ్రోతృచిత్తసుఖావహమగు పారవశ్యస్థితిచి

గల్గించు రాగాలాపనావధికి పరాకాష్ఠ. "మూర్ఛర్యతేయత్ర శ్రోతృచిత్తం సామూర్ఛనా" అని సంగీతశాస్త్రజ్ఞుల వక్కాణ. ఈ మూర్ఛన సాహిత్యము నందలి రసానందస్థితికి సహోదరి. విగళిత వేద్యాంతరము అవశమునగు పారవశ్యస్థితి ప్రతిపాదకమగు రససాక్షాత్కృతికిమూర్ఛనాస్థితికింగిచిన చిత్రమగును. యోగిజన యోగ్యమగు బ్రహ్మానందమునకు రసానందమేకాక మూర్ఛనోద్బుద్ధమగు రాగానందముకూడ సబ్రహ్మచారియే. ఇట్టి మంజరీద్విపద సావద్యయమున ఇంతటి రాగరస ప్రక్రియాప్రౌఢిని నిర్వహించి ఆప్రకరమునంతటిని "ఎండిన మ్రాకులిగిరించునట్లు" అను ఉపమానముతో గమ్యమానమొనర్చి శ్రీనాథకవి సార్వభౌముడిట రాగరస సామ్రాజ్యపుటేలికయగు మహాగాయక సార్వభౌముడును అయినాడు.

ఇంత దనుక గానపాండితిని ప్రవ్యక్తమొనరించిన గాయక సార్వభౌముడు ఆ తరువాతి పాదములలో తన నాట్యశాస్త్రాభిజ్ఞతను ప్రదర్శించి నటసార్వభౌముడు కూడ అయినాడు. ఇట శ్రీనాథ కవిసార్వభౌమ ప్రవర్తిత నాట్యవేద పాండితి ప్రాచీనులగు పాలకురికి సోమనాథనాచన సోమనాథాదుల నతికరించినది. కృష్ణరాయ రఘునాథాదులకును ఇది అందని మ్రానిపండైనది. ఈ శ్రీనాథావిష్కృత నాట్యలక్షణ ప్రదర్శనము, 'నభూతోనభవిష్యతి' యని గీతిసాహితీవేత్తలిరువురిచే, నివాళులంద దగినది. తనపెన్నిధియైన కర్పూర వసంతరాయని సంగీతపాండితిని, ఆతని సన్నిధినుండిన తన సహోద్యోగినియగు లకుమాదేవి నాట్య ప్రతిపత్తిని ఈ సన్నివేశమున పుంజీభవింపజేసి శ్రీనాథ కవివరుడు పాఠకుల మనోనేత్రములందీ సన్నివేశమును బొమ్మగట్టించినాడు. ఇట శ్రీనాథుడనిన మాటలు ఉబుసుపోక కనిన పలుకులుకావు. నాట్యవేదంపు ఋక్కులను ములుకులుగా నొనరించి విరిసిన బాణప్రయోగపు కొలదులివి. అవియంతట వాడియైనవి గావుననే వానికంతటి లక్ష్యశుద్ధి కుదిరినది.

ముందుగా నలగాముని కొలువున గానసభా కార్యక్రమము నిర్వహింపబడినది. దానికనంతర కృత్యముగ నాట్యప్రయోగము ప్రవర్తితమైనది.

"చెలగినాటక జనులుచేరి జోహారు గావించి నిలిచిన వెనుక" కామవిభుండు నవ్వుచు సెలవిచ్చినాడట కంజలోచనయను నాద్యనుందరికి నాట్యంబు చేయుటకు. ఆమెనాట్యము ఆమె యొక్కతె వలననే నిర్వహింపబడదగిన అపూర్వ కార్యములేదు.

ఆమెవెనుక ఇరుప్రక్కల కావలసినంత నేపథ్యము, హంగునున్నది. కావుననే వారందరు ముందుగ నాట్యశాస్త్రవిహిత స్థానములలోనే నిలచినట్లు శ్రీనాథుని వర్ణనము వలననే వ్యక్తము.

“వరమృదంగము లెస్స వాయించు మేటి
కుడిభాగమందు కుదురుగా నిలచె
తాళమానజ్ఞుడు తగనెడమదెశను
నిలచె నుత్సాహంబు తగమది నిండ
ముఖవీణ వాయించు ముఖ్యుడొకండు
రాగజాలము పాడు రమణులిద్దరును
నిండు వేడుకతోడ నిలచిరి వెనుక”

* నృత్తరత్నావళ్యాది నాట్యశాస్త్రములలో పదితములైన బృందవిన్యాసాది లక్షణములలో విదితములైన పద్ధతులకీ పాదములు కుడియెడములుగ సంవాదులు. ప్రధానపాత్రమగు నర్తకి నైపథ్యము ప్రక్కవాద్యములవారు నిల్వదగిన స్థానములు నేపథ్యగాన మొనరించు నట్టి వాంగము వారు పాటింపవలసిన విధులు సహితము జాయపార్యుడు వివరించినాడు. వాని కించుక పదమైనను సంవాదిగనే శ్రీనాథుడీ సన్నివేశమును గూర్చినాడు.

** జాయపార్యసూచితములగు వాద్యబృందం నిర్వాహకులు నిలువవలసిన స్థానములలో కొన్ని చిన్ని చిన్ని వ్యత్యాసములు శ్రీనాథ ప్రదర్శితాస్థాన నృత్య

---

ప్రధాన నర్తకి నైపథ్యము :

* రాజ్ఞః (జ్ఞా) పూర్వేద్యురావిష్టా పాత్రః స్నానవతీతతః

.... .... .... ....

సజ్జాభూయ తతస్సర్వం బృందం రంగభువం విశేత్”

నృత్తరత్నావళీ—viii 33—47.

** నృత్తరత్నావళీ - VIII 48-64.

అథ బృంద విన్యాసః:

“పాత్రస్య దక్షిణే పార్శ్వే ముఖరీ స్యాత్సుఖస్థితః।

.... .... .... ....

రాజ్ఞాం (జ్ఞా?) విద్యావతాంచాగ్రే వైభవఖ్యాపనాయవ” 48-52.

3)

సన్ని వేశమున గోచరించు చున్నవి. మొత్తము మీద అన్నియును కాకపోయినను కొన్నిటినైనను నాట్యశాస్త్ర లక్షణానుసారము ఈకవివరుడు విదగ్ధతతో ప్రదర్శించుట ముదావహమగునేకాని అన్యముకాదు.

* కంజలోచన రంగప్రవేశముగావించి సలగామున నాట్యమునసొప్పించి నిష్క్రమించుదనుక. శ్రీనాథకవిశేఖరుడు ప్రదర్శించిన నాట్యసంగీత పాండితి నాన్యతో దర్శనీయము. అందలి ప్రతిపదము నాట్యశాస్త్ర విషయక వ్యాఖ్యాపేక్షి యగు పారిభాషికమే. కావుననే ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారీ విషయమున జరుగవలసిన పరిశోధనము శ్రీనాథుని నాట్యశాస్త్ర విషయకమగు వ్యుత్పత్తికి నికషోపలమగునని భావించినారు.

ప్రధాన పాత్రమగు కంజలోచన రంగప్రవేశము చేయునప్పుడు ఆమెను నాట్యశాస్త్ర విహితలక్షణలక్షితగా పరిచయముచేసి 'నాట్యకర్త్రియ' ప్రధాన లక్షణములిట్లు సమన్వయపరచినాడు. శ్రీనాథకవివరుడు.

"కంజలోచన యను ఘనమైన పాత్ర
మదను పట్టపుదంతి మంజులవాణి
భరతశాస్త్రోచితప్రాణముల్ పదియు
కలిగిన యక్కాంత కంతుబాణంబు
వలె వచ్చి సభవారు వర్ణించిచూడ" నిలిచినదట.

---

**అథ ఆతోద్యమేళనమ్ :**
భావిర్గాంగాంశ భూతేన మధ్య సప్తక వర్తినా
ప్రయోగస్సుభగః సాంద్రః సమ్మతశ్చ సభాసదామ్ 53-55.

**శుష్కవాద్యం - పూర్వోక్తలక్షణాత్**
గీత నృత్తవిహీనత్వాత్ వాద్యం శుష్కమితిస్మృతమ్ . 56-64
కంజలోచనయను ఘనమైన పాత్ర
మదను పట్టపుదంతి మంజులవాణి
.... .... .... ....
చూచి రంభాదులు చోద్యంబునంది
శిరసులు వంచియు సిగ్గును చెంది" హ. వీ. చ. కల్లుప్రతిష్ఠ
751-8.00

మానవకాంతలందరివలె ప్రాణములైదు కల్గియుండక ఈ కంజలోచన ప్రాణములు పది కలిగియుండుటలోని ఆంతర్యము, అందలి పైలక్షణ్యము విచారణీయము. విద్యావతికి విద్య, గానమోహినికి గానము జీవమైనట్లే ఈలాస్య సుందరికి లాస్యమే ప్రాణమనుట నిర్వివాదాంశము. లాస్యమునకు ప్రధానాంగము లను లాస్యాంగములని, అవి పదియని భరతాచార్యుడు నాట్యశాస్త్రమున చెప్పి నాడు. జాయపసేనానియు ఈలాస్యాంగములు దశసంఖ్యాకములనియే అనినాడు. కావుననె కవితాచతురుడైన శ్రీనాథుడు కేవల నాట్యశాస్త్రకారునివలె లాస్యాంగముల లెక్కచెప్పక రసావహచమత్కృతి పరిప్లావితముగ శాస్త్ర సత్యము కవితాసత్యమై ధ్వనించి స్ఫురించునట్లు "భరతశాస్త్రోచిత ప్రాణముల్ పదియు కలిగిన కాంతగ కంజలోచనను సంభావించినాడు. ఇంతకు ఆలాస్యాంగము లెట్టివి? అని ప్రశ్నించిన సమాధానమొసగుటకు జాయపసేనా నియేయున్నాడు. ఆయన 1. గేయపదము 2. స్థితపాఠ్యము 3. ఆసనము 4. పుష్పగంధిక 5. ప్రచ్ఛేదకము 6. త్రిమూఢకము 7. సైంధవము 8. ద్విమూఢకము 9. ఉత్తమోత్తమము 10. ఉక్తప్రత్యుక్తము అను ఈపదింటిని పేర్కొనినాడు. ఈ లాస్యాంగములగు పదింటియందు నాట్యకర్త్రియగు విదగ్ధురా లుండవలెనని భరతజాయపాది నాట్యశాస్త్రవేత్తలందరు నిర్దేశించినారు. తదను సారమె శ్రీనాథుడును ఈలాస్యాంగములు పదియని అవి ప్రాణతుల్యములని గ్రహించి వానిని పదియగు భరతశాస్త్రోచిత ప్రాణములుగ ప్రతిపాదించినాడు. జీవధాతువుల వంటి ముఖ్యాంగములను ప్రాణతుల్యములని సంభావించుట సహజమేకదా! తాళమునకు ప్రాణతుల్యములైన దశాంగములను తాళదశ ప్రాణములని లాస్యమునకు ప్రాణభూతములైన ఈపదింటిని లాస్యాంగములని సంగీతశాస్త్రమందలి తాళాధ్యాయమున నృత్యాధ్యాయమున వ్యవహరించుట శాస్త్ర మర్యాదాన్వితమేకాని అన్యముకాదు. కావున ఇట్టి ప్రాణపదములైన ఈదశవిధ లాస్యాంగముల విధానమును గుర్తెరింగిన నాట్యసుందరిని భరతశాస్త్రోచిత ప్రాణముల్ పదియుగల్గిన కాంతగ వ్యవహరించుట శ్రీనాథుని నాట్యశాస్త్ర పాండితికి ప్రతీకయేయగును. అట్టి నాట్యప్రగల్భయైన ఆ నాట్యసుందరి నృత్య ప్రారంభమీ తెలుగున వర్ణితమైనది.

"నాట్యంబునందతి నేర్పరియైన
వేత్రపాణికిఁదగ విసయంబుఁజూపి
ఆతఁడొసంగిన గజ్జలతి భక్తితోడ
పదములగట్టుక పంచవన్నియల
కాసె గట్టిగగట్టి కడు జపంబమర
మద్దెల తాళంబు మధ్యనిలుచుండి
ఓరజూపులఁబ్రభు నొయ్యనంజూచి"

కంజలోచన నాట్యమును చేయదొరకొనినదట. శ్రీనాథుఁడు వర్ణించిన ఈ ఔపచారికవిధులు ప్రతినాట్యారంభమున నేడు నయితముగానవచ్చుచునేయుండును. పేముబెత్తమునో, చేతికఱ్ఱనో పట్టుకొని ఠీవిగ సూత్రధారికి ప్రతీకగ వేత్రధారియై ఈనాటి నాట్యశాస్త్రోపధ్యాయుఁడగు నయ్యవారు నిలచియుండగ శిష్యురాండ్రగు నట్టువరాండ్రు తమ అయ్యవారికి మొదటి మ్రొక్కుగ గురునమస్కారమును తెరలోపలే గావింతురు. అపుడా నట్టువాంగుడగు గురువుగారు ఆశీర్వాద పురస్సరముగ నొసగిన గజ్జెలను భక్తిభావముతో కనులకద్దుకొని ఆ నృత్యసుందరులు ధరింతురు. ఆ గజ్జెలను ధరించుట వెంటనే అయ్యవారు నట్టువాంగము వారందఱితో వచ్చి రంగస్థలముననొక ప్రక్కగ తమకు విహితమైన స్థానములలో ఆసీనులగుదురు. ఆ పిదప జతికి కొనుగోలుగ పాటకు ఎత్తికోలుగ * "తత్తై తాహి త్తతాం తెహి ఇధాత్తాంత" అను శబ్దములు వినవచ్చును. తాళము కొట్టుచు జతులను పలుకు ప్రధాననట్టువాంగుడె మృదంగ వాద్యానుగతముగ ఈ పాటాక్షరములనుద్ఘాటించును. దానికితగినట్లు నాట్యగత్తియ వేగాన్వితముగ నాట్యమునల్పుచు మెఱపుతీగవలె నాట్యరంగమును క్షణకాలములో ప్రవేశించును. ఈ తతంగము నాడేకాదు నేటికిని పరిపాటియే. నాట్యప్రదర్శనమందలి ముఖ్యోద్దేశ్యము సభాపతికి, సభకు మనోరంజనము గలిగించుట. ఆసభారంజనము

---

* ఇయ్యది సర్వత్ర విహితముకాదు సంప్రదాయమునుబట్టి ఈజతులు మారుచుండును. నృత్తరత్నావళి vii - 18, 19.

నాట్యసుందరి శాస్త్రప్రాగల్భ్యమునకై నికషోపలము *రాజాస్థానమున నాట్యము చేసిన నాట్యసుందరికి కూడ మానసమున తిష్ఠవేసిన ఊహాసుందరుడో, జీవితమున రసనిష్ఠను ప్రతిపాదించిన వాస్తవసుందరుడో జీవన సహచరుడుగ నుండకపోడు. ఒక్కొక్క తఱి ఆ మనోహరుడు ఆమె నాట్యము చేయుచున్న ఆస్థానమునకే రాజుగా వచ్చును. కాకపోయిన అందొక సామాన్యసభ్యుడైన గావచ్చును. అట్టి తఱి రంగస్థలమధిరోహించి నాట్యము చేయునట్టి ఆలాస్య సుందరి తన ప్రాణేశుని స్వమానసమున భావించుచు గీతార్థముచే గలుగు భావముల వెలార్చుచు సభాపతిని మెప్పించి సభారంజనము నొనర్చవలెనని నాట్య శాస్త్రమున విదితము.

కావుననే మనకంజలోచన ఓరజూపుల ప్రభున నొయ్యని జూచినది. అందాల సుందరి ఓరజూపులతో ఆ నలకాములు సైతము అనురంజనమొందు చుండ ఆనలగాముడు రంజితుడు కాకుండునా? అస్తుఅందులకే శ్రీనాథుడు ఈ ప్రసక్తినితెచ్చి నాట్యశాస్త్రవ్యపదేశిత విధినిస్వానుభవ పూర్వక, లకుమావసంత రాజీయ నాట్యహేవాకప్రతీకగ ఆమ్రేడించినాడు. అది పఠితల మనోనేత్రములకు మానితమగు కర్పూర నీరాజనోపమమై మిఱుమిట్లు గొలిపినది.

ఇట్టి శ్రీనాథ కవిసార్వభౌముడు కంజలోచనా నాట్య సంరంభమున రంగ స్థల సార్వభౌముడై ఆమూలాగ్రముగ నాట్యశాస్త్రము సుందరి యొడుపుల నెన్నింటినో లక్షణానుసారిగ లక్ష్యాన్వితముగ ప్రతిపాదించుచున్నాడు. ఆ కంజలోచన నిలచిన నిలుపులో చూచిన చూపులో తిరిగిన తిరుపులో, ఇదియది యననేల ఆమె ప్రతి కదలికలో నాట్యశాస్త్రహేవాకములు వెల్లివిరిసినవి. మొదటిదిగ ఆకంజలోచన నిలచిన తీరుస్థానక స్థితికి లక్ష్యమైన నాట్యహేలగ నిట్లురూపొందినది.

---

ప్రాణేశం భావయంతీస్వం మానసే సభాపతిం
గీతార్థాన్ పతితాన్ భావాన్ వ్యంజయంత్యనురంజయేత్।
యేషుయేషు ప్రయోగేషు ప్రేక్షకాణాం రుచిర్భవేత్
సమ్యగ్ జ్ఞాత్వేంగితైః కామం తాంస్తాన్ ప్రదర్శయేత్"

* సమపాదయుతమైన స్థానకస్థితిని
అఖిల దేవతలకు అలరులతోడ
పుష్పాంజలి యొసంగి పూని నాట్యంబు
సమరట్టి వాద్యంబు సభయెల్లఁ గ్రమ్మ

** "గైకోలు విడుదల లీలానటనాశైలి" లో అరంజలోచన నాట్య ప్రారంభము సలిపినది. సమాగ్రతల సంచారసంచితోద్ఘట్టితాదులు భరతముని సమ్మతములగు స్థానకస్థితులుగ సుత్తమములైనవి.

ఇట రంజలోచన సమపాదయుతమైన స్థానకస్థితికి లక్ష్యభూతమౌ తీరుగా నిలచినది. ***సమస్థానము నేలమీద చక్కగ నూనినయడుగని ఇది స్వభావస్థితి యందు గానవచ్చునని నృత్తరత్నావళియందు వ్యక్తము. ఇట్లు అన్నృత్యసుందరి

---

*పాదలక్షణమ్ :

"సమాగ్రతల సంచారసంచితోద్ఘట్టితాంచితాః
ఇతి పాదభిదాః పంచభవేయుః మునిసమ్మతాః
సమస్థానే స్వభావేన భూమిసంస్థః సమోన్నతః
యత్రోక్తిస్తోభవేత్ పార్ష్ణిః అంగుష్ఠాంగులయోఽంచితాః"

** స. వీ. చ. కల్లుప్రతిష్ఠ 964 - 969.

*** "స్యాదగ్రతల సంచారీ సవిక్షేపే నికుట్టనే
.... .... .... .... .... ....
అతిక్రాంతక్రమోదారగత్యా వ్యావర్తిత వర్తితే
స్థిత్వా యత్ర తలాగ్రేణ పార్ష్ణితో ఘట్టయేత్ క్షితిః
ఉద్ఘట్టితః తదాఖ్యేషు కరణేషు సకీర్తితః
ప్రయోగానుకృతే చారీ ప్రసారేచా సకృత్ సకృత్
ఊర్ధ్వమగ్రతలం భూమౌ పార్ష్ణి రంగులయోఽంచితాః
యస్మిన్పాదేఽంచితః సస్యాత్ పాపదాగ్రతః చంక్రమే
వర్తితోద్వర్తితే పాదాహతా భ్రమరకేఽపిచ"

నృత్తరత్నావళి — ii 412 - 17.

సమపాదయుతమైన స్థానకస్థితిలోనిలిచి అఖిలదేవతలకు అలరులతోడ పుష్పాంజలి యొసగిపూని నాట్యంబుచేయుటలో కర్ణాటరీతియే ప్రవృత్తమైనది. సమపాదయుతమైన స్థానకస్థితిలోనిలుచుట భరతశాస్త్రోక్తమైన మార్గపద్ధతికిచెందినది. అఖిలదేవతలకు అలరులతోడ పుష్పాంజలియొసగి నాట్యముచేయుటయను దేశిరీతి ప్రాచుర్యము నందినది. కావుననె ఆయలివేణి మార్గదేశిపద్ధతుల రెంటిని ననుసరించిన శ్రీనాథుని హృదయ సంభవ ఆతని కర్ణాటబాణిని అలవరచుకొనినది. భరతనాట్యోద్దీపిత శాస్త్రరీతిలో పుష్పాంజలి నొసగు పద్ధతియున్నను భరతనాట్యము నాడించు వారికంటె దేశిపద్ధతిలో కూచిపూడి నాట్యమును గావించువారే నేటికిని ఈపద్ధతిని నాట్యప్రారంభమున పాటించి పుష్పాంజలి పట్టుచున్నారు. అందులకే జాయ పాఠ్యుడు ప్రేరణాది దేశినృత్తముల భ్రమరించు పట్టున అలరులతోడ అంజలించు రీతిని ప్రస్తావించినాడు. దేశివిద్యావిశారదులు కుటిలములతో పుష్పాంజలి గావింప వలెననిరిగాన పుష్పాంజలి యనుపేరు ఔపచారికముగ సిద్ధికి సంక్రమించిన దనినాడు.

ఇట కంజలోచనచే శ్రీనాథుడు కర్ణాటబాణిలో మార్గదేశిరీతుల కలగలుపుగ నాట్యమాడించుటలోని అంతర్యము వితర్కార్హము. భరతాభినయాదులు కేవల మార్గపద్ధతిలో నిర్వహించిన అందు ఇంపుతగ్గును. అట్లని జాతరచిందులవలె పూర్తిగ దేశ్యనృత్తరీతిలోనాడినది జాతరచిందులవలె నుండి రసరంగము ప్రాశస్త్య మట్లే నొంపుతేనిదగును. ఇట్టిశుద్ధనృత్తము సభాస్థానస్థాయికి తగనట్టిదకాదేమో. కావునసే సభారంజకముగ మార్గదేశి ప్రక్రియల సమపాళములు మేళగించిన ప్రౌక్తపాతల మేలుకలయికను శ్రీనాథుడు నాడే తనదైనముగ సంకల్పించి దానిని కళాత్మకముగ నాట్యరీతిగా మలచినాడు. శ్రీనాథుని పలుదేశ నాట్య ప్రయోక్తముగుపవలెను అటు కవికులమునకును ఇటు కళాకారులకును కర్ణాటబాణి అలవరచుటలో అతడు ఆద్యుడై ఆరాధ్యుడైనాడు. పుష్పాంజలి నొసంగు తొలిమెట్టుముగిసిన పిదప మలిమెట్టుగ *"కైముడి కట్టుమల్ కనిపింపజేసి కంజ లోచన యొక నాట్యహేవాకమును ప్రదర్శించినది. ఇదియును దేశిరీతికిచెందినదే. కంజలోచన పాదములకు గజ్జెలుకట్టుకొనిన పిదప వేగాన్వితముగ అంజలినిండుగ అలరులు నింపికొనివచ్చి రంగస్థలమున నిలిచిదేవతలకు పుష్పాంజలి నొసంగి

* హ. వి. చ. — 769–779 ....

* సమపాదయుతమైన స్థానకస్థితిని
అఖిల దేవతలకు అలరుచుతోడ
పుష్పాంజలి యొసంగి పూని నాట్యంబు
సమకట్టి వాద్యంబు సభయెల్ల గ్రమ్మ

** "గైకోలు ఏడుదల దీపనకళాశైలి" లో ఆకంజలోచన నాట్యప్రారంభము సలిపినది. సమాగ్రతల సంచారకుంచితోద్ఘట్టితాదులు భరతముని సమ్మతములగు స్థానకస్థితులుగ నుక్తములైనవి.

ఇటి కంజలోచన సమపాదయుతమైన స్థానకస్థితికి లక్ష్యభూతమౌ తీరులో నిలిచినది. ***సమస్థానము నేలమీద చక్కగ నూనినయడుగని ఇది స్వభావస్థితియందు గానవచ్చునని నృత్తరత్నావళియందు వ్యక్తము. ఇట్లు ఆనృత్యసుందరి

---

*పాదలక్షణమ్ :

"సమాగ్రతల సంచారకుంచితోద్ఘట్టితాంచితాః
ఇతి పాదభిదాః పంచభేదయుః మునిసమ్మతాః
సమస్థానే స్వభావేన భూమిసంస్థః సమోపతః
యత్రోత్క్షిప్తోభవేత్ పార్ష్ణిః అంగుష్ఠాంగులయోఽంచితాః"

** స. పీ. స. కల్లుప్రతిష్ఠ 964 - 969.

*** "స్యాదగ్రతల సంచారీ సవిక్షేపే నికుట్టనే
.... .... .... .... .... ....
అతిక్రాంతక్రమోదారగత్యా ద్వర్తిత వర్తితే
స్థిత్వా యత్ర తలాగ్రేణ పార్ష్ణితో ఘట్టయేత్క్షితిః
ఉద్ఘట్టితః తదాశ్లేషు కరణేషు సకీర్తితః
ప్రయోగానుకృతే చారీ ప్రసారేవా సకృత్ సకృత్
ఉద్వృత్యగ్రతలం భూమౌ పార్ష్ణి రంగులయోఽంచితాః
యస్మిన్పాదేఽంచితః సస్యాత్ పావదాగ్రక్షత చంక్రమే
వర్తితోద్వర్తితే పాదాహతౌ భ్రమరకేఽపిచ"

నృత్తరత్నావళి — ౹౹ 412 - 17.

సమపాదయుతమైన స్థానకస్థితిలోనిలిచి అఖిలదేవతలకు అలరులతోడ పుష్పాంజలి యొసగిపూని నాట్యంబుచేయుటలో కర్ణాటరీతియే వ్యక్తమైనది. సమపాదయుతమైన స్థానకస్థితిలోనిలుచుట భరతశాస్త్రోక్తమైన మార్గపద్ధతికిచెందినది. అఖిలదేవతలకు అలరులతోడ పుష్పాంజలియొసగి నాట్యముచేయటూనుట దేశిరీతిలో ప్రాచుర్యము పందినది. కావునసె ఆయలిపేణి మార్గిదేశిపద్ధతుల రెంటిని సమసరించిన శ్రీనాథుని హృదయ సంభవ ఆతని కర్ణాటబాణిని అలవరుచుకొనినది. భరతనాట్యోక్తరీతి శాస్త్రరీతిలో పుష్పాంజలి నొసగు పద్ధతియున్నను భరతనాట్యము కావించు వారికంటె దేశిపద్ధతిలో కూచిపూడి నాట్యమును గావించువారే నేటికిని ఈపద్ధతిని నాట్యప్రారంభమున పాటించి పుష్పాంజలి పట్టుచున్నారు. అందులకే జాయ పార్యుడు ప్రేరణాది దేశినృత్తముల వివరించు పట్టున అలరులతోడ అంజలించు రీతిని ప్రస్తావించినాడు. దేశివిద్యావిశారదులు కుటిలములతో పుష్పాంజలి గావింప వలెననిరిగాన పుష్పాంజలి యనుపేరు ఔపచారికముగ నీవిధికి సంక్రమించిన దనినాడు.

ఇట కంజలోచనచే శ్రీనాథుడు కర్ణాటబాణిలో మార్గదేశిరీతుల కలగలుపుగ నాట్యమాడించుటలోని ఆంతర్యము ఏతద్వ్యాఖ్యాతము. భరతాభినయనము కేవల మార్గపద్ధతిలో నిర్వహించిన అందు ఇంపుతగ్గును. అట్లని జాతరచిందువలె పూర్తిగ దేశ్యనృత్తరీతిలోనాడినది జాతరచిందువలె నుండి ఈరంగము త్రొక్కి నప్లే సొంపులేనిదగును. ఇట్టిశుష్కనృత్తము సభాస్థానస్థాయికి తగినట్టిదికాలేదు. కావుననే సభారంజకముగ మార్గిదేశి ప్రక్రియల సమపాళముగ మేళగించిన క్రొత్తపాతల మేలుకలయికను శ్రీనాథుడు నాడే కవితాపరముగ సంతరించి దానిని కళాత్మకముగ నాట్యరీతిగా మలచినాడు. శ్రీనాథకవి వరుడే ఈ నాట్య ప్రయోక్తమగుటవలన అటు కవికులమునకుఇటు కళాకారులకుకూడా కర్ణాటబాణి అలవరుచుటలో అతడు ఆద్యుడై ఆరాధ్యుడైనాడు. పుష్పాంజలి నొసంగు తొలిమెట్టుముగిసిన పిదప మలిమెట్టుగ *"కైముడి కట్టుముల్ కనిపింపజేసి కంజ లోచన యొక నాట్యహేవాకమును ప్రదర్శించినది. ఇదికూడ దేశిరీతికిచెందినదే. కంజలోచన పాదములకు గజ్జెలుకట్టుకొనిన పిదప వేగాన్వితముగ అంజలినిండుగ అలరులు నింపికొనివచ్చి రంగస్థలమున నిలిచిదేవతలకు పుష్పాంజలి నొసంగి

---

* హ. వీ. చ. — 769-779.

నది. అంతవరకు నిండుగనున్న పూలదోసిలి యిప్పుడు రిక్తమైనది. ఇచ్ఛాపూర్వకముగ నైవేద్యానిమైన సమర్పణము గావించుటయే కైకోలు అందురు. ఆమె దోసిలి నిండుగనున్న పుష్పములను కళాహృదయముతో సర్వసమర్పణముగావించుటకు ప్రతీకగ సర్వదేవతల కంజలించుటతో వెదజల్లినది. ఇప్పుడామె హస్తములు రిక్తములైనవి. ఆరిక్తహస్తములను అతిరిక్తముగ ప్రదర్శించిన అందగించదు. కావుననే ఆ నాట్యసుందరి చాతుర్యముతో తనయాట మెచ్చినవారు కప్పములుగ ఘంటా కంకణాదికములు బహూకరింపగ వానితో పాటు తన ముంజేతులను కైముడియను నాట్యహేలతో ప్రదర్శించినది. ఈ ఔపచారికవిధిని ఇట్లన్వయించుకొనవచ్చును. ఆమె గాజులను గలగలనాడించిన ఝుళం ఝుళధ్వని ప్రయుక్తముగ మణిబంధనరేఖాయుతములగు తనహస్త ప్రకోష్ఠముల నొకదానితో మఱి యొకదాని నానించి మెలిత్రిప్పి చేతులనాడించినది. ఈ ఆంగికానుభవమే కైముడిగ అన్వితమగుచున్నది. కయియనగ చేయి అని ముడియనగా కూర్పు అని అర్థము చెప్పికొనవలెను. అప్పుడు ఈ రెండుపదముల సమాహారముతో ఈ నాట్యహేలకము గమ్యమానము గావించుకొనుట దూరాన్వయంబుగాబోదు.

అటు తరువాతి పాదములలో కంజలోచన నాట్యాభినయమును వ్యక్తము గావించిన తీరులో శ్రీనాథుడు తన భరతశాస్త్రపాండిత్యమైన నిగ్గును తేర్చిమూసలో పోసిజూపినాడు. ఈ పాదములలో పారాడిన నాట్య శాస్త్రోదీరిత పదసంపుటి అపారము. ఈనాట్యశాస్త్రపరిజ్ఞానము ప్రప్రథమమున పాల్కురికి వశమై తదనంతరము శ్రీనాథునకు వశమై భాసించినది.

"వెలయంగ తొమ్మిది విధములైనట్టి
భూచారినాట్యంబు పొందుగానల్లి
పదపాట విధములఁ బరగిన యట్టి
ఆకాశచారియు నమరంగనాఁడి
అంగహారాఖ్యచే నమరు నాట్యంబు
విదితమే తొమ్మిది విధములనాడి
గతిభావభేదమ్ముల్ గనుపడునట్లు

భ్రమణ సంయుతదీప్తి పటిమమీలంగ
పాణి భేదంబులు పదభేదములును
స్థానక సంచయసంయుక్తులమర"* నాడి ఆకంజలోచన తన అపార నాట్య వేదపాండితిని ప్రదర్శించినది. ఇట శ్రీనాథుడు నాట్యాచార్యుడై కంజలోచనా నాట్యప్రయోగమున తచ్ఛాస్త్రపారంగతుడై అందలి హావాకములకు లక్ష్యలక్షణ వివేచనసల్పినాడు ఆనాట్యము సల్పిన తీరులో భౌమ్యాకాశాది చారీ భేదము లెన్నియో వెల్లివిరిసినవి. **భరతముని మతానుసారముగ జాయసార్యుడు ఆ సిద్ధాంతపు మేరగచారి,కరణ, భ్రమణ;మండలాదులను నృత్తరత్నావళియందు వివరించినాడు. ఒక కాలితో చేయుపని చారియనియు; రెండు పాదముల కార్యము కరణమనియు, మూడుకరణముల చాపము ఖండమనియు తెలియుచున్నది. ఈ ఖండములు మూడో నాలుగో చేర్చిచేయునది మండలమగునట. నడకయందు యుద్ధమున, బాహుయుద్ధమున చక్రము మున్నగువానిని ప్రయోగించుటయందు ఈ చారిప్రచాలనము లేక నాట్యమే సాగదట. ఇట్టిచారిభేదములలో ఆకాశచారులు పదునారని భూచారులు పదునారనియు భరతజాయపాది నాట్యశాస్త్రజ్ఞులన్నారు. కాని శ్రీనాథుడు మాత్రము వెలయంగ తొమ్మిదివిధములైనట్టి భూచారి నాట్యంబులను బొందుగ నాకంజలోచన సలిపినదనినాడు. బహుశః ఆ సుందరి నాట్య ప్రదర్శమున బొందుగ తొమ్మిదింటిని మాత్రమే ప్రదర్శించినదనుట శ్రీనాథాభి ప్రేరితార్థము గావచ్చును. అంతేగాని భూచారి నాట్యములు నవసంఖ్యాకములుగ శ్రీనాథుడు చెప్పినాడనుటకు మూదలఇదమిత్థముగ గోచరించుటలేదు. తరువాతి

---

* వ. వీ. చ. 769-779

** "కేతితో ద్విత్రిచతుః.........ఖండ సంఘాతకాభిధాన్
కరణానాంయిథా కామం షట్కం సప్తకమష్టకమ్
నవకం యావ దేతేషాముంగ హారోపత స్తదా"
నృత్తరత్నావళి IV-246-47.)

నృత్తరత్నావళి 10-1
" 3-1; 6-7
" 10-1, 2, 3,4.

పాదములలో నీ కపిశేఖరుడనిన అంగహారాఖ్యచేనమరు నాట్యంబు విదితముగా తొమ్మిదివిధముల నాడినదనుటలోని పరమార్థము పర్యాలోచనార్హము. పాదముల చేతనేగాక తదితరావయవముల సంఘాతముచేతఁగూడ కరణవైవిధ్యమును ప్రదర్శింపవచ్చును. కావుననే కరణములు రెండు, మూడు; నాల్గుగాగాని లేక ఇచ్ఛానుసారముగ అంగహారముల సంఖ్యనే గాక నేతత్పదార్థమును గూడ పర్యాలోచించుట ఆవశ్యకము. దీనికి నృత్తరత్నావళియందు వివరణయున్నది. అంగములను అర్హస్థానములకాహరణముగావించు ప్రక్రియగాన ఇదిఅంగహారమైనది. అంతేగాక ఇది హారకపయుక్తమైనది. హారసంబంధియగునది కావున నిద్దానిని అంగహారమని తచ్ఛాస్త్రజ్ఞులు వ్యవహరించుచున్నారట. *అంగములను హారముగ గూర్చి ఇదియొక ఆరాధనావిశేషముగా ఆత్మసమర్పణముగా నాట్యమున నటరాజును సమర్పించుచున్నాడుగాన నాట్యకోవిదులు ఇద్దానిని అంగహారమని పిలుచుకున్నారట. కావుననె ఈశ్వరార్చన కళాశాలియగు శ్రీనాథ కవిసార్వభౌముడు ఇద్దానిని ప్రత్యేకించి చెప్పినాడు. **అంతేగాక ఆకంజలోచన ఇట్టి అంగహారములను పాదభేదంబులు, పదభేదంబులు నమరునట్లాడినదనుటలో పాదరేచక పదరేచకస్థితులుస్ఫురించుచున్నవి ఈ పాదరేచకములనుగూడా జాయపసేనానియే వివరించినాడు. ఆ పిదప "గీతాచారి భేదముల్ గనఁబడునట్లు భ్రమణ సంయుతదీప్తి పటిమ మీరంగ" ఆ కంజలోచన ఆడినదనియు అనినాడు. అంగహారములు తాళానుసారముగు రీతిననుసరించి చతురస్ర త్ర్యస్ర గతులమార్పుతో రెండుపదునాలుగ వింగడింపవలెను. అప్పుడవి ముప్పదిరెండు అగును.

---

* అంగానాం యోగ్యదేశేషు హరణేన నిరుచ్యతే
అంగహారోఽథవా హారః ప్రయోగో హరయోగతః
అంగనిర్వర్తనీయత్వాత్ అంగహారః ప్రకీర్తితః
నృత్తరత్నావళీ-iV-249.

** పాదహస్తకటిగ్రీవారేచకాంశ్చతురో బ్రువే
ఉభయోరథవైకస్య పాదస్యధరణీతలే
నృత్తరత్నావళీ-iV-358.

దానిని ఆ కంజలోచన సమగ్రముగ నిర్వహించి ప్రత్యేకపటిమ మీఱు నట్లు భ్రమణసంయుత దీప్తిని ప్రదర్శించినదని నాడీ కవివరుడు. చతురస్రగతిలో నడుచు నంగహారములలో స్థిరహస్త పరిచ్ఛిన్న పార్శ్వభేద అపరాజిత పర్యస్త భ్రమరాదికములగు ఒక ప్రభేదము భ్రమరము. ఈ భ్రమరమే భ్రమణమని వ్యవహృతమై యుండనోపును.

ఇకపాణి భేదములు, పదభేదములు స్థానకసంచయములమర నా కంజలోచన నాడినదని శ్రీనాథుదనుటలోని లక్ష్యలక్షణ వివేచన మిగిలియున్నది. అందును ముందుగ పాణిభేదంబులు, పదభేదంబులన నేమియో విచారింతము. నాట్యకారులు పాణిభేదములు అనంతములనినారు. "అనంతా వైరసాః"* "అనంతా వైరాగాః" అను ఆభాణకములున్నను ఆయాశాస్త్రకారులు ముఖ్యరసములను ప్రధానములగు రాగములను పేర్కొని వివరించియేయున్నారు. అట్లే ఈపాణిభేదములలో ముఖ్యములగు వానిని కొన్నిటిని సంయుతహస్తములని, అసంయుతహస్తములని వింగడించి ఆయాజాతులను విభజించిరి. ఇక పదభేదముల గురించి భరతునినుండి జాయపసేనాని వఱకునున్న నృత్తతత్త్వలక్షణజ్ఞులందరు చెప్పియేయున్నారు అవి పదివిధములుగ చెప్పబడియున్నవి. ** వీనినన్నింటిని ఆ కంజలోచన ప్రదర్శించినదని శ్రీనాథుడిట శాస్త్రోక్తముగ ఆక్షేపించినాడు.

స్థానక సంచయ సంయోగములమర నాసుందరి యాడినదనియు శ్రీనాథుడన్నాడు. స్థానకములకే స్థానములనియు వ్యవహారమున్నది. ***ఆ నలగాము

---

* "అభినేయం జగత్సర్వమనంతో ఽభినయో ఽప్యయం
యఏవ యుజ్యతే హస్తో.... తత్తేషామప్యనంతతా"
నృత్తరత్నావళి ii - 287

** "సమాగ్రతల సంచార కుంచితోద్ఘట్టితాంచితాః
ఇతి పాదభిదాః పంచ భవేయుర్మునిసమ్మతాః"

*** తాడితోద్ఘట్టితో ల్పేదో ఘట్టితో మర్దితో ఽగ్రగః - పార్శ్వగః
సూచీసంజ్ఞకోఽంగులి పృష్ఠగః
తలాహతిరితి ప్రాహూరస్యభేదాన్ వరేదశ"
నృ.ర. ii - 418-19.

"శరీరస్యాంగ విన్యాస విశేషో భావ (యోగవత్) - నేత్రయోః
సహాగతకోఽపి నిశ్చలః స్థానముచ్యతే" నృ.ర. iii - 72

నాస్థానస్థకి స్థానకప్రసాదగును ప్రదర్శించులోని హొయలును శ్రీనాథుడు ప్రవ్యక్తముగావించినాడు అని ఈపాదములందలి భావవిశేషముచేత సువ్యక్త మగును. చేయబోవు చారికనుకూలమగు రీతిలోనే దీనిభావమును జూపుటకై కనుచూపులు శరీరాంగములు సైతము ఒక నిశ్చలస్థానమున నిలిపియుంచుటయే స్థానకము. ఇవి పురుషస్థానకములు, స్త్రీ స్థానకములు, నృత్తస్థానకములు అని వానివాని అవాంతరభేదన్యాయాదికములతో నాట్యశాస్త్రములందు నిర్వచింప బడినవి. ఇవికాక దేశిస్థానకములని వేఱుగ ఇంకొక ప్రభేదముకూడ చెప్పబడి నది. అవి సమపాద వరావృత్త స్వస్తిక వృషభాధికములగు ఇవి ఇరువది మూడుగ లెక్కింపబడినవి. ** వీనినన్నింటిని స్థానకసంచయ సంయోగమమర ఆకంజలోచన నిర్వహించినదని శ్రీనాథుడు పలికినాడు. ఆ తరువాత ఆలాస్య సుందరి నృత్తరీతిని మఱలదేశికి తరలించినదనుచు శ్రీనాథుడు మఱల కర్ణాట బాణిని అందుకొనినాడు. కేవల మార్గిపద్ధతినిగాని పూర్తిగ దేశిప్రక్రియనుగాని అనుసరింపక కవితలో సంగీతసామగ్రిమను గీతవాద్య నృత్యత్రయిగ తౌర్యత్రిక రీతి సంయుతముగ శ్రీనాథుడు సమపాదించుట ఇటగోచరించుచున్నది.

దానికను శ్రుతిగ ముందు మార్గి ప్రక్రియానుసారమా కంజలోచన ప్రదర్శించిన నాట్యవిహారకము ఏతచ్ఛాస్త్రపారిభాషిక పదజాలముచే సువ్యక్తము గావింపబడినది. పిదప పాఠకులకు వినువుగొల్పకుండ పద్ధతినిమార్చి దేశి నృత్యములను ఆకంజలోచనచే కర్ణాటబాణీ విశారదుడగు శ్రీనాథకవివరుడు ఈ రీతిగ ఆడించినాడు.

---

త్రయోవింశతి దేశిస్థానకాని

** సమపాదం వరావృత్తం స్వస్తికం వృషభాసనం - బ్రాహ్మవైష్ణవ
శైవాని గారుడం సంహతాభిదమ్
వృష్ణోత్తాన తలం వర్ధమానం కూర్మాసనాహ్వయం _ ఏకపార్శ్వ
గతం నంద్యావర్తాహ్వ చతురశ్రకే
పాణిపార్శ్వగతాభిఖ్య మేకజానుగ (న?) తాహ్వయమ్ - పార్శ్వ
(పార్ష్ణి) విద్ధైకపాదాఖ్యే నాగ బంధంబదంతకః
సమే సవిషమేనాతఖండే నోవవదేనచ - యుక్తం సూచిత్రయేణేతి
వింశతిస్త్రిభిరుత్తరా - నృ.ర. v - 12 - 15.

"ప్రేరణి దేశిని ప్రేంఖణశుద్ధ
దండికామండలతగ బహుచారి
సప్తతాండవములు సల్ప, చిత్రముగ
సభవార లాశ్చర్యసంయుక్తులయిరి"

ఈ దేశినృత్యప్రక్రియలు 'ప్రాచీనాంధ్ర కవుల సంగీత ప్రతిపత్తి' ప్రథమభాగమున వివరింపబడినవి. * ఇట్లు దేశినిమార్చి మార్గిని, మార్గిని జార్చి దేశిని నవత్వతత్త్వరీతులలో ప్రతిపాదించుటలోని శ్రీనాథుని ఆంతర్యము జాయపార్యుల భావనలో వ్యంజితమైనది. ** అనాటి కవిపండిత కళాకారులు నృపాలుని అనుమాయులు గాన అన్నృపాల మనోరంజనార్థము క్రొత్త క్రొత్త రీతులు దేశినాట్యపద్ధతిలో ప్రకల్పించుటకు అవకాశముండును. మార్గిలో మార్పునకు తావుండదు. కావుననే ఆనాట్యసుందరి దేశినృత్యములను సరవి ప్రదర్శించి సభారంజనియైనది. మార్గిప్రక్రియాను సారియగు లాస్యమున సౌకు మార్యము ప్రకటితము. దేశిపద్ధతి సంయుతమగు నృత్తమున ఔద్ధత్యము ప్రస్ఫుటము. ఈదేశి నృత్తములో క్కొక్కచో పురుషప్రయుక్తములు గాదగి నంత ఉద్ధతములుగ తాండవ సమములుగ నుండును. అయినను కంజలోచన నలగామ ధరణిపాలునకు క్రొత్త చవులూరింప ఔద్ధత్యము నలవరచుకొని అబల యయ్యు తాండవసమములగు ఆ నృత్తములన్నింటిని సరవి ప్రదర్శించినదని శ్రీనాథ సూత్రధారుడిట ప్రకటించినాడు. ఈరీతిగ దేశినృత్త ప్రదర్శనము ముగియగ అభినవ ప్రియుడగు నృపాలునలరింప అభినవవిధాతయగు శ్రీనాథుడు నృత్తప్రక్రియను మరల మార్గికిట్లు మరలించినాడు.

---

* నాచన సోమన — ప్రా.ఆం.క.సం. ప్రతిపత్తి పుట. 156-62.

** భవంతి ధరణీపాలాః ప్రాయేణాభినవప్రియాః
అతస్తత్ప్రీతయేఽద్యాపి యద్యదుత్పాద్యతే నవమ్
నృత్తంతతః స్మృతం దేశీ తత్తద్దేశానుసారతః" - నృ.ర. V-3.

"తరువాత నియమేల తగు వెలుపలను
సంయుతాసంయుత పటిమ సంకులిత
నానార్థకరములు నాట్యహస్తములు
శిరమును జూపులు చెక్కుల్లబొమలు
దంతోష్ఠకంఠముల్ తగుచుబుకంబు
ముఖమును వక్షము మొదలుగా నెన్ను
అంగంబు లాఱు ఉపాంగములాఱు
ప్రత్యంగ సముదాయంబాఱునకు కూడ
ఎనిమిది పదియగు నెసగునంగంబు
లమరంగ నభినయం బాశ్చర్యముగను
మాచెర్ల చెన్నుడు మహిమంబు తెలుపు
ఆంధ్ర సంస్కృతభాష నమరుగీతముల
భావంబు లెస్సగా ప్రకటనచేయ
చూచి రంభాదులు చోద్యంబునొంది
శిరములు వంచియు సిగ్గునుచెంది
రపుడా భూమీశుఁడాదరంబొప్ప
వస్త్రభూషణములు వారలకిచ్చె" నట *

ఈపాదములలో కవిసార్వభౌముడు నటసార్వభౌముడై హస్తప్రభేద ములను, అభినయ పద్ధతులనన్నింటిని తన మానసనందినియగు కంజలోచనచే పాతక హృదయరంగమున నభినయింపజేసినాడు. ఇందుమున్నగా ఆకంజలోచన తానొక్కతేయ కాక నాట్యబృంద సహకృతితో తగు చెలులమర నాట్యము చేసినదని, తెల్పినాడు. పిదప ఆనాట్యసుందరి సంయుతాసంయుత నాట్య హస్తాదిక విన్యాసము ప్రకటించినదనినాడు. ఈహస్తప్రభేదములు నాట్య శాస్త్రములన్నింటియందు వివరింపబడినవి.

---

* పలనాటి వీరచరిత్రము — 780 - 800.

* నృత్తరత్నావళియందు జాయపాఖ్యుడుకూడ హస్తప్రభేద పద్ధతుల నన్నిటిని వివరించి వాస్తవలక్షణమును జలధితో బోల్చి అందలి ఉత్తుంగతరంగి తత్వజలజంతు సంకులరీతిని హస్తపంచ చాలనాదికముల కన్వయించి బొమ్మ కట్టించినట్లి ప్రక్రియను పాఠకహృదయముల హత్తుకొనజేసినాడు. ఇట్టి నాట్య లక్ష్యలక్షణానుసారమా కంజలోచన హస్తాభినయనము ముగించి చతుర్విధాభినయన

---

* నృత్తరత్నావళి - పు. 72.

"హస్తలక్షణాని

చతురమకరరాజి ప్రోల్లసత్పద్మకోశం - భ్రమరచలితలీలం హంసపక్షాభిరామమ్।
ప్రవిచలదలపద్మం కర్కటాద్యైనరుపేతం - జలధి జలమివేదం బ్రూమహే
హస్తలక్ష్మ॥

అసంయుతహస్తాః

పతాకాత్రిపతాకాఖ్యే భుజంగ మృగశీర్షకే - కర్తరీకటకాసూచీశుక హంస
ముఖాభిధాః
కపిత్థశిఖరే పద్మకోశకాంగుల ముష్టయః - చతురభ్రమరారాల హంసపక్షార్థ
చంద్రకాః
సందంశముకులాభిఖ్యే ఊర్ణనాభాల పల్లవే - తామ్రచూడశ్చ వియుతాః చతుర్వింశతి
రిత్యమీ

సంయుతహస్తాః

అంజలిః కటకావర్ధమాన స్వస్తిక్ కర్కటాః - కపోతనిషధోత్సంగ గజదంతా
వహిత్థకాః
దోలః పుష్పపుటో వర్ధమానో మకర ఇత్యమీ - త్రయోదశవిధాః యుగ్మహస్తాః
స్యుర్మునిసమ్మతాః

నృత్తహస్తాః

చతురశ్రావధోద్వృత్తౌ తలాతలముఖాభిధే - స్వస్తికా ప్రకీర్ణాఖ్యే అరాల
కటకాముఖే
అవిద్ధవక్రే సూచ్యాస్యౌ రేచితా పక్షరాతిరా - ఉత్తాన వంచితాభిఖ్యే పల్లవే
నవితంబకా" నృ.ర. 164 - 171.

భేదముల ప్రకటింప దొరకొనినది. ఆకంజలోపల గావించిన అభినయము సామాన్యము. అది అష్ట ఆశ్చర్యములు ప్రవృత్తిల జేయునంతటిది. ఇంతటి మహాత సంభరితమగు నభినయరీతిని అంచలి ప్రభేదములగు ఆంగిక, ఆహార్య, వాచిక, సాత్వికములనుగూర్చి ముందుగా ననుశీలనము జేయుట నిట ఆవశ్యకము. శ్రీనాథప్రయుక్తమగు నభినయ సంబంధియైన నాట్యసంరంభమునకు మొదటిదిగా ఆంగికాభినయముల్లేకింతము. ఈ ఆంగికాభినయనములనుగూర్చి నాట్యవేద ప్రాతిశాఖ్యమున జమ్ములమడక మాధవరామశర్మగారి అభిభాషణసారము సంయుతా సంయుత నాట్యహస్తలక్షణములు.

కేశబంధే లలితాసంజ్ఞే కరిహస్తాభిధేతతః
పక్షవంచితకే పక్షప్రద్యోతే తార్క్ష్యపక్షకౌ
దండపక్షౌ ద్వావూర్ధ్వమండలే పార్శ్వమండలే
ఉరో మండల హమానౌ ఉరః పార్శ్వార్ధమండలే
ముష్టిక స్వస్తికావన్యౌ నలినీ పద్మకోశకౌ
అలపల్లవ నిస్పన్నౌ వుల్బణౌ లలితౌ తథా
వలితే చకరాః స్మృత్తే వింశతిః స్యుర్నవాధికాః
యద్యేవం మిలితాస్సర్వే షట్షష్టి స్త్రివిధా అపి
చతుష్షష్టి కరాహ్యేతే నామతో ఒభిహితాః మయా
ఇత్యుక్తం బ్రహ్మపుత్రేణ భరతేనాపి తత్క్రమమ్
అయుక్తేషుచ సూచ్యాస్యః స్వస్తిక స్సంయుతేష్వపి
తావేవాత్ర సమానాఖ్యౌ నృత్తహస్తౌ ప్రకీర్తితౌ
యత్తు 'నామత' ఇత్యాహమునిః సత్యం నచాన్యథా
పల్లవావేవ లలితే లతాఖ్యౌ వలితావితి
విశ్చిత్య నృత్తహస్తేషు హిత్వా తద్ద్వితయం పునః
సోమేశ్వరాదయః కేచిత్ సప్తవింశతి మాచిరే.

వివరణమునకు రాళ్లపల్లివారి నృత్తరత్నావళి వ్యాఖ్యను 2వ అధ్యాయమున అనుశీలించునది.

శ్రీరాళ్ళపల్లివారి నృత్తరత్నావళీ వ్యాఖ్యాంతరితమగు 'అభినయ' వివరణానుసారము ఈ సన్నివేశమునకు గచ్ఛద్వ్యాఖ్యను ప్రకల్పింపనగును. అనుభావ

విశేషములచే రసభావములు అభినీతములు కాగా అభినయము సర్వార్థ భావములకు సహృదయ సమాస్వాదనము నందించుచు రసాత్మకసంవేదనము ఉల్లసిల్లజేయును. శాఖాంగోపాంగ సంయుక్తమైన అభినయము నానార్థముల విభావింప జేయునది ఆయ్యును మహార్థమును నిరూపించును. కావున సాంగోపాంగముగ శిరోహస్త కటీవక్ష పార్శ్వపాదములగు షడంగములలో నాట్యసంగ్రహమున్నది. ఆంగికాభినయము, శారీరము, ముఖజము, చేష్టాకృతమనియు మువ్విధములు. శాఖాంగోపాంగ ప్రత్యంగములచే దర్శనీయమగునది శారీరము. ఉపాంగములచే మాత్రము నిర్మితమగునది ముఖజము. గతిచారి భేదములచే స్థానక సంపయముల వలన వ్యక్తమగునది చేష్టాకృతము. శారీరాభినయమందు శిరస్సు, హస్తములు, వక్షము, పార్శ్వము, కటి పాదాదికములు సంయుతాది నాట్యహస్తాదిక ప్రభేదములు దర్శనీయములు. ముఖజాభినయమున దృష్టులు "బొమలు, నాసిక, ఓష్ఠ, చుబుక, కపోలాదికములు ప్రదర్శితములగును. ఈ అవాంతర ప్రభేద సంయుతాంగికాభినయ పద్ధతి నంతటిని శ్రీనాథ సూత్రధారుడు 'శిరము'ను చూపులు, చెక్కిళ్ళు, బొమలు మున్నగు నెనిమిది పదియుగా నెసగు సంగంబులమరంగ కంజలోచనచే ప్రదర్శింప జేసినాడు. ఆనాట్య సుందరి రంగప్రవేశ సందర్భమున ప్రవ్యక్తమైన నేపథ్య విశేషణముచే ఆహార్యము రూపుదిద్దుకొనినది. ఇక మిగిలినవి వాచిక సాత్వికాభినయములు. ఈ వాచికాభినయము ద్వివిధ భాషాసంయుత గీతికా గానముచే నిర్వహింపబడివలెనని ఆ ద్వివిధభాషలు సంస్కృత ప్రాకృతములై యుండవలెనని జాయపాచ్యుడనినాడు. కాని శ్రీనాథుని కవనరాజ్యాంగ తంత్రమెపుడు సర్వతంత్రస్వతంత్రము పూర్తిగా ఏ శాస్త్రకారుని ఆశాసనము నాతడు పాటింపడు. అట్లని విశృంఖలముగా వ్యవహరింపడు. కొంత అటు ఇటుగ తిలతండుల న్యాయముగా ఏతచ్ఛాస్త్రోపదేశమును గమనించి దానికి ఒక వింతస్వతంత్ర ప్రవృత్తిని గమింపజేసి ఒక చెంతకర్ణాట ధ్యానమును నినదింప జేయును. కావుననే సంస్కృత ప్రాకృతములకుబదులు ఆంధ్రసంస్కృతభాషనమరు గీతములవిట వాచికాభినయమున ప్రయోగించినాడు. ఆగీతములందంతర్గమగనున్న సంగీతనాదంబు సభయెల్ల క్రమ్మ ఆకంజలోచనతోపాటు శ్రీనాథుని మందము కూడా విట నాట్యమాడినది. ఇంతటి మహోన్నతాప్యశైలికి నోచుకొన్న అభినయమున కేవలనృత్తమే ప్రవృత్తమైన అది భావాత్మకమైన నృత్యస్థాయికిగాని,

రసప్లావితమైన నాట్యరీతికిగాని ఎదుగదు. కేవలము ఐయాత్మికమై జాతరచిందు వలె నుండిన నృత్తము కలకాలము సాగదు. కనుకలిలో అందగించదు. అందులకై నాట్యార్థమైన అత్యున్నతరసస్థాయిని అది అందుకొనవలెననిన దానికి తగిన గానసహకృతి ఆవశ్యకమగును. గానాను గతమైనపుడే గదా నృత్తము భావర సాశ్రయమై నృత్యముగ నాట్యముగ పరిణతమగును. అట్టియెడ నది వచేశిమమై రసబ్రహ్మమునకు చేరువ చేరుపై అనంతత్వము నాచికొనును. కావుననే తన హృదయ సంభవయగు కంజలోచన ప్రదర్శించిన నృత్యమునకు నట్టువాంగము నెరపుచు సూత్రధారుడై నిలచినది జాలక వాగ్గేయకారకుడు కూడ తానేఅయి గీతి ప్రతిపత్తిని ప్రకల్పించినారు. ఆగీతికలు సుసాంస్కృతికములగు మార్గ ప్రక్రియలుగావు. అట్లని కేవల దేశ్యములగు జానపదగీతికలు కావవి. మాచర్ల చెన్నుని మహిమను తెల్పుఆంధ్ర సంస్కృతభాషనమరు గీతికలట అయ్యవి. పురందరదాసుని కాలమునకు కొంచెమటునిటుగ హరిదాసపద్ధతిలో ఆంధ్రదేశము కావలమున్న ప్రదేశములలో భగవన్నుతులను భజనగీతికలుగ గానముచేయు పద్ధతి ప్రాచుర్యమునంది ప్రబలినది. శ్రీనాథకవి సార్వభౌముడును వీభక్కికలో మాచర్ల చెన్నుని మహిమను తెల్పుగీతికలు రచించి వానినే ఇట ప్రస్తావించియుండవచ్చును.

ఇట్లు ఈవల్లునాటి వీరచరిత్రము సందలి సలగామ కొలువు కూటమున ప్రవృత్తమైన కంజలోచన నృత్యమున నాట్యశాస్త్ర ప్రావిణ్యము నంతటిని విరియింపజేసినాడు కవిసార్వభౌముడు. ఇట ఆస్థాన నేపథ్యమున ఆహార్యమును రూపించి గీతరచయితయై వాచికము నెఱపి నాట్యప్రయోక్తయై సూత్రధారత్వము నిర్వహించి కంజలోచనా నాట్యహేలలో ఆంగికము ప్రదర్శించి కవిసార్వభౌముడై పాఠకులకిక సాత్వికానుభూతిని అనుభవైకవేద్యముగ నందించు చున్నాడు. నాట్యప్రయోగము వలన గలిగెడు రసానుభూతిని ఆనందపర్యవసాయిగ అందుకొనెడివారు ద్రష్టలు నటించుపాత్రము సాత్వికము నభినయించి వసు చోద్యముగ సత్వస్థితినుందుకొని రసానందము నందెడువారు మాత్రము ప్రేక్షకులే. కావుననే శ్రీనాథమానసపుత్రికయగు నాకంజలోచన నాట్యాంతరిత భావముల లెస్సగా ప్రకటనచేయగా చూచి రంభాదులే చోద్యమందిరట. చతుర్విధాభినయములలో సాత్వికాభినయ పరిపూర్తిని పటిష్ఠముగ ప్రకటించు

సామర్థ్యము అందటికుండదు. అది అభ్యాసమువలన లభ్యముకాని సహజగుణము శ్రీనాథహృదయనందినియగు కంజలోచన ఈ సాత్త్వికాభినయమున గూఢ నిష్ణాతృత్వమును ప్రకటించియుండును. కావుననె ఆ అభినయపరాకాష్ఠను దర్శించి రంభాదులే చోద్యమందిరి. ఆ అప్సరసలు తదభినయమునకు తురీయమైన పరాకోటి ముట్టిన దగునట్టి సాత్త్వికాభినయమును తాము గావింపలేమైతిమేయని శిరస్సు వంచి సిగ్గిలిరని శ్రీనాథుడిట ధ్వనింపజేసినాడు. అమరపురి కరుగు సన్నాహమునున్న సహస్రసమానజీవియై అలరారిన శ్రీనాథుడు తన ప్రస్థాన భేరీభాంకృతిని తుదికృతియగు పల్నాటివీరచరిత్ర కావ్యమునందే కర్ణాటముగ నినదింపజేసి ఉండవచ్చును. దివిజకవివరు గుండియల్ దిగ్గురనగ అమరపురి కరుగుటకు ముందుగ ప్రస్థానపాథేయముగ నీవీరవదా కథాఖ్యాయికను సంతరించి రంభాదులు తన మానస సుతయగు కంజలోచనకు తీసికట్టనిపించి వారిని నాట్యహేవాకమున సిగ్గిలజేసినాడు. కవిరాజు అప్పటినుండియే దివిజకవి వరుగుండియలు దిగ్గురనుట ప్రారంభమైయుండును. కావుననే శ్రీనాథుడు మనవింతకాలము నిశ్చయముగ సాహితీరాజ్యమునకు అరికవివీరభయంకరుడై కవిరాజేంద్రుడైనాడు. గీతి సామ్రాజ్యమునకు సార్వభౌమము రాగమయముగ నెలపినాడు అతని సహచరులగు వల్లభామాత్యపినవీరభద్రులీ ప్రాజ్యకవన రాజ్యమును శ్రీనాథముద్రానవాథముగ విస్తరిలజేసినారు. ఇమ్మహా కవిరాజు రాజ్యాంగము గావింప రాజభాషగ తీర్చిదిద్దికొనిన ఆంధ్రసంస్కృత భాషనమరు కర్ణాటవాణి కర్ణాటబాణి. సహృదయహృదయవాల్లభ్యముంకొనినది.



# వల్లభామాత్యుని సంగీతవాల్లభ్యము

కవిసార్వభౌముని కర్ణాటకావ్యభణితికి అను ప్రతియనదగుకృతి వల్లభుని క్రీడాభిరామము. శ్రీనాథముద్రాసనాథమైన కర్ణాటభాష వల్లభుని వాణిలోనే గాక సంగీతప్రసక్తియందు సైతము సమృద్ధమైనది. ఎత్తికోలు నుండి ముక్తాయింపువరకు వల్లభునిగాన వాల్లభ్యము ఉల్లము ప్రవహించి వెల్లివిరిసినది.

"గతి రసికకంఠగాన కళాకమనీయయో మధు
వ్రత పికచారపంచ వనవాటికనేమిటికింబరిత్యజిం
చితివటపీ ప్రదేశమునఁజెట్టులఁజేమల నేమిగల్గినన్
చితినిటు సంచరించెదవు ప్రాఁబడి పోయెనె నీ వివేకమున్" *

ఇందు షట్పదుని గానకళాకమనీయునని వల్లభుడు సంభావించి తన కళావాల్లభ్యమును గోచరింపజేసినాడు. తరువాతిదియగు శకునవివక్షలో షడ్జము మయూరభాషితమను సంగీతలక్షణమునకు లక్ష్యమునిట్లు భాసింపజేసినాడు.

"మాఁగెలి పూఁగెలి వృక్షము
పూఁగొమ్మన నుండి షడ్జము ప్రకాశింపన్
వేఁగొంచు నెమలి పల్కెడు
గేఁగోయని వైశ్య మనకుఁ గెలుపగు జుమ్మీ" **

సంపెంగనూనె అమ్ముకొను ఇంతికంఠస్వరము కూడ వల్లభుని కర్ణకుహరములో నిట్లు కర్ణాటముగనే ధ్వనించినది. అది శతానందగేహినీ కరరుహ ప్రరోహాంకుశముఖర వీణాక్వాణ పాణింధమంబై మధుర స్వరంబున గానసనాథమై కోకిల పంచమ శ్రుతిని గొనరినట్లు శ్రీనాథవాణిని జ్ఞప్తికెలయించి పలికినపుడు తేనియలొలికించినది.

ఇంకొకచో నొకపడతి పల్నాటివీరుల పాడినపుడు ఆమె అద్దానిని ఆలపించి, అభినయించిన తీరులో సంగీతశాస్త్రపునిగ్గు వెల్లివిరిసినది. అది

---

* క్రీడాభిరామము—కథాప్రస్తావన—39

** " శకునము—51

వీక్షించుచున్నను ప్రేక్షకులలో సాంగోపాంగముగ అభినయస్ఫూర్తి వెల్లివిరిసినది. "ద్రుతతాళంబున వీరగుంఫిత తకఝంఝం కిటత్కారసం" అను సంగతి ధ్వనించినతీరులో లయాత్మకత వాద్యప్రవృత్తిలో వెల్లడికినది. ఈ యొక్క పద్దియములోనే వల్లభుడు గీతవాద్యనృత్యత్రయియైన సంగీతసమగ్ర స్వరూపము నిట్లు ఇమిడించినాడు.

> "ద్రుతతాళంబున వీరగుంఫిత తకఝం ఝం ఝం కిటాత్కారసం
> గీతి వాయింపుచు నాంతరాళిక యతిగ్రామాభిరామంబుగా
> యతిగూఢం ద్విపద ప్రబంధమున వీరానీకముండాడె నౌ
> క్కాత ప్రత్యక్షముంగుమారకులు ఫీట్కారంబునందూలఁగన్" *

ఇందుతాళము ద్రుతగతిలో నడచినదని ఇట ప్రయుక్తమైన "తకధుం ఝం కిట" యను జతిలో ప్రవ్యక్తమైనది. ఒక దెబ్బ యొక్క ఉనికి దీని నడక వెంగడింపబడినది. ఇక నిందు సంగీతపారిభాషిక పదములు అంతరాళిక యతి గ్రామాభిరామము అనునవి వివరణార్హములు. స్రోతోవహ, గోపుచ్ఛ, డమరుక, మృదంగ, పిపీలికాదియతులు సంగీతశాస్త్రమున నున్నవి. కాని ప్రత్యేకించి అంతరాళిక యతియను నామము మాత్రమే శాస్త్రమునందు మృగ్యము. అంతరాళిక మనగా అంతరాళనివాసియగు పిపీలిక యని అన్వయించుకొనినచో దానిని పిపీలికాయతిగ పేర్కొనవచ్చును. అంతేగాక నాట్యశాస్త్రమున అంతరాళమును నాట్యహేవాక మొకటి కన్పట్టుచున్నది. ఈ అంతరాళగహేలతో గూడిన యతి గ్రామాభిరామత్వమియ్యది కావచ్చు ననుకొనుట కనువున్నది. ఇక గ్రామాభిరామంబుగ యతిగూఢంబాడుట యనుపలుకుబడిలో శ్రుతిలయ సమాహితత్వము వ్యక్తమగుచున్నది. యతిప్రభేదము తాళసంబంధియగు అక్షర కాలముల ప[రి]గణమునకు జెందినది. గ్రామమనునది స్వరకల్పనావధియగు మనోధర్మ సంగీ[త] పద్ధతి సంబంధియగు ఒడుపు. ఇందు స్వరాత్మికత, లయాత్మికతలో పర్యవసించుచున్నది.

---

* పల్నాటివీరులకథ —116.

"శ్రుతిభ్యస్స్యుః స్వరాస్సర్వే
స్వరేభ్యో గ్రామ సంభవః
గ్రామేభ్యో జాతయో జాతః
జాతిభ్యో రాగసంభవః" అనునీ సంగీతశాస్త్రపద్ధతిని బట్టి శ్రుతి నుండి స్వరములు, స్వరములనుండి గ్రామములు, గ్రామములవలన జాతులు, జాతులనుండి రాగములు ప్రవర్తితములైనట్లు తెలియుచున్నది. "గ్రామః స్వర సమూహః" అని సంగీతశాస్త్రము గ్రామమున కర్థము చెప్పుచున్నది. * ఈగ్రామ ములు మూడని అందలి రెండు భూలోకమున విశ్రుతములని ఒక్కటిమాత్రము స్వర్లోకమునకు పరిమితమని తెలియుచున్నది. ఈపద్ధతిలో అంతరాళిక యను యతి గ్రామాభిరామంబుగ యతిగూడను ద్విపద ప్రబంధముగా నాయుపతి పాటులో వల్లభుని కవితలో సంగీతశాస్త్ర పద్ధతియేగాక శ్రీనాథుని కవిత యొందరిడుపను కర్ణాటరీతిగూడ ప్రవ్యక్తమైనది. మొదటిపాదములో దేశిరీతిలో సప్తముడదమున తాళము నిర్వహించుచు పలనాటి గాథను పాడుట ప్రారంభించిన ఆ నెరజ కేవలము దేశిబాణితో ఆగలేదు. మార్గరీతికి కూడ తనపాటను మార్చి నది. అంతేకాదు ఏతన్మార్గరీతికి పతాకమనదగిన అంతరాళిక యతి గ్రామాభి రామంబుగా నద్దానిని స్వరసంయుతముగ నిర్వహించుచు గానము చేయనారం భించినది ఇది ఒక్కట మార్గప్రతేట మఱియొక్కట దేశి తెలితేనియ యూట ప్రవర్తిల్లజేసి వల్లభుడు శ్రీనాథుని అనుయాయినని చెప్పక చెప్పుచున్నాడు.

పిదప కథానుసారముగ ఒక బవనీడు ఏకవీరమహాదేవి ఎదుటనిలచి పరశురాముని గాథలనెల్ల ప్రౌఢి పాడిన సందర్భమునుగూడ వల్లభుడు రాగమయమే కావించినాడు.

---

ద్వౌ గ్రామౌ విశ్రుతౌలోకే షడ్జ మధ్యమ సంజ్ఞకౌ
గాంధార గ్రామమాచష్ట తదాతం నారదో మునిః
ప్రవర్తతే స్వర్గలోకే గ్రామాసౌ నమహీతలే॥
సంగీతరత్నాకరము. కల్లినాథవ్యాఖ్య- స్వరగతాధ్యాయః.

"కక్ష నిక్షిప్త వికస్వరవిలాస శ్రీనివాసంబు జవనికందుఁ
గట్టిన తంత్రికిఁ గంఠశ్రుతికిఁ గూడఁ బొక్కంబుగా నాతి సొంపుమీఱ
నాలాపముల శుద్ధసాళగ సంకీర్ణ వివిధరాగంబుల చవులుచూపి
ధమ ధమ ధ్వనులఁ బొంకారించి యెడనెడఁ గత్తెరమార్గంబు బిత్తరిల్ల
వాద్యపై ఖరిఁగడు నెఱవాదియనఁగ నేకవీరామహాదేవి యెదుట నిల్చి
పరశురాముని కథలెల్లఁ బ్రౌఢిఁ బాడెఁ జారుతర కీర్తి బవనీలచక్రవర్తి"*

ఈ పద్యమునందు వల్లభుడు బవనీని స్వరూపసాక్షాత్కృతితోపాటు ఆతని సంగీత విద్యావైశారద్యమును ప్రవ్యక్తమొనరించెను. పావిళ్లవారి క్రీడాభిరామ ప్రతిలో జవనికందు గట్టిన తంత్రియనియున్నది. ఇది బవనీనిగూర్చిన ప్రసక్తి. కాన నాతడు పట్టినవాద్యము జవనికగాక బవనికయైయుండనోపునని తోచుచున్నది. ఇకనా బవనిక తంత్రీవాద్యమని అయ్యది కక్షనిక్షిప్త వికస్వర స్వర విలాస శ్రీనివాసంబని వల్లభుడే అనినాడు. ఆవాద్యమునందు ఒకే ఒక తంత్రి కట్టబడియుండునని ఆ తంత్రీశ్రుతికి కంఠశ్రుతికి పొంకంబు కుదిరిన ఆగానము సొబగు మీఱునని వల్లభుని మాటలవల్లనే వ్యక్తమైనది. కావున ఈబవనిక శ్రుతికుపయుక్తమగు ఏకతంత్రి వాద్యమని ఆయొక్క తంత్రి ఆధారషడ్జమునకో మధ్యమ శ్రుతితో పాడవలయునన్న మధ్యమమునకో శ్రుతిచేయుటకు అనువుగానేయున్నదని పించుచున్నది. బవనికవంటి ఏక తంత్రివాద్యమును జోగులు, సాధులు ఏకతార యను పేరుతో తత్త్వములు పాడునపుడు మీటుచుందురు. బవనికయందు గట్టిన నారి ప్రసక్తి ఈపద్యమునందున్నది.** ఈనాటియను పదమునుబట్టి ఈవాద్యము

---

* బవనీడు — 130.

** Villupathi : The Leader sits in formt of a long bow (Villan) about six feet long and provides a shythmeie accompaniment by str.king the cord of the bow with a pair of sticks. The bow is made to rest on a pot. A fews bells are suspended from the bow and their rythmic jingling adds interest to the general effect. The prose discaurse is interspessed wine s.ngs.

A Diction ary of South Indian Music and Musicians Vol. II, By P. Sambomoorthy.

పిల్లవట్టు ఉండెనాయని అనుమానించుటకు అనువున్నది. ఆచార్యసాంబమూర్తి గారు తమ నిఘంటువున పిల్లవట్టు అనునొక వాద్యమునుగూర్చి తెలిపినారు. అదియు నిట్టిదియా? ఇదియే అదియా యను విచికిత్సకును ఆస్కారమున్నది.

ఈబవనీక స్వరూప స్వభావములనటులుంచి ఆబవనీడు కథనడిపిన విధానమునుగూర్చి పర్యాలోచింపవలసియున్నది. జానపదుడైన బవనీడు కథ నడిపిన వ్యవహారములోకూడ వల్లభుడు శ్రీనాథుని కర్ణాటబాణిని నిక్షిప్తమొనరించి నాడు. ఈబవనీడు దేవరదేశీరీతిలో గాలిపాట పాడక మార్గసంగీత పద్ధతిలో రాగములు మార్చుట ప్రారంభించినాడు. అతడు మార్చిన రాగములలో శాస్త్రీయ మైన మార్గప్రక్రియా సంబంధములగు శుద్ధరాగములున్నవి. దేశిపద్ధతికిచెందిన ఛాయారాగములుగు కూడానున్నవి. ఈత్రివిధరాగములను కేవలము పాడుటేగాక అతడు ఆలాపములు ఉపబృంహింప నిర్వహించినాడు. ఆలాపన లేక ఆలప్తి లక్షణము ప్రబంధ సంప్రదాయమున విస్తృతము.

ఇంతేకాక బవనీని గానవాల్లభ్యమును ప్రదర్శించి వల్లభుడా పిదప అతని వాద్య వైదుష్యమును గూడ ప్రవ్యక్త మొనరించినాడు. ఆబవనీడు

"ధమ ధమ ధ్వనులఁబోటాడించి
వెడనెడ గత్తెర మార్గంబు విస్తరిల్ల
వాద్యవైఖరి గడు నెఱపావె" యె భేష్ అనిపించుకొనినాడు.

తంత్రీవాద్యమునుబట్టిన బవనీడు ధమధమవాద్య ధ్వనులనెట్లు వెలువరించియుండు నని విచారించవలెను! అతడు అభినయించు వైఖరిలో రసానువాదిగ సన్నివేశమును ప్రకల్పింప యత్నించుచు ఆనద్ధ వాద్యమునుకూడ మెడకో భుజమునకో కట్టుకొని యుండి అద్దానిని ప్రయోగించియుండును. తన అడుగులను గట్టిగానూనివైచుచు కాళ్లకుగట్టిన గజ్జెలను గంగలాడించి యుండును. ఇక తదనువాదిగ తనచేత నున్న తంత్రీవాద్యముపైగూడ ధమధమ ధ్వనులకు సంవాదియగు ధ్వానమును ప్రకల్పించుటకు కత్తెరమార్గమును విస్తరిలజేసియుండి యుండవచ్చును. తంత్రీ వాద్యములను మీటు తీరులో 'మామూలు మీటు' 'కత్తెరమీటు' అని రెండు విధములగు పద్ధతులున్నవి. తీగను గోటితోగాని, లోహనిర్మితమగు గోటితోగాని పైనుండి క్రిందకు మీటుట మామూలుమీటు. వీణపై ఈ కత్తెరమీటు వేయ

పలెనన్న కుడిచేతితో తంత్రిని మీటుచు ఎడమచేతి తర్జనిని, మాధ్యమికను ప్రక్క ప్రక్కనయున్న రెండుమెట్లపైనుంచి మీటువేసి తర్జనితో ముందు మెట్టుపై తట్టి రెండవమెట్టుపైకి వచ్చిన తర్జనిని, మాధ్యమిక ప్రక్కనజేర్చవలెను. ఈయొడుపు సమగ్రముగ ప్రారంభదశలోనున్న విద్యార్థులకు అనువుపడదు. కత్తెర మార్గంబు బత్తిరిబజేయుటకు వల్లభుడన్నట్లు వాద్యవైఖరి కడుసెఱవాది యగుచు తీవ్రసాధన సల్పినవారికే ఇది యనువగును. ఈవాద్యవైఖరి ప్రవ్యక్తము గావించినతీరునుబట్టి వల్లభుడుకూడ వాద్యవైఖరిలో గడుసెఱవాదియై సంగీత శాస్త్రమున అభ్యస్తపాండితియేకాక దానికి లక్ష్యశుద్ధినొడగూర్చు సాధన సంపత్తిని సమకూర్చుకొనిన వాడనిపించుచున్నది.

అటు పిదప వల్లభుడు జనంగమ ప్రమద పాడిన పాటలోగూడా సంగీత స్వారస్యమువింపె శ్రోతల కట్లు వినిపింపజేసినాడు.

"అలరుంభోండి జనంగమ ప్రమద మధ్యానద్ధఘంటాధ్వనుల్
చెలంగంజాడె సమస్తలోక జననిన్ శ్రీమేక వీరాంబికన్
వలరాజోక్కాక మూర్ఛనా స్వరమున్ బ్రాణంబు గల్పింపఁగా
కలకంఠీ కలకంఠ కోమల కుహూకారంబు తోరంబుగన్"*

ఇట జనంగమ ప్రమద మధ్యానద్ధ ఘంటధ్వనుల్ చెల్యంగ సమస్తలోక జననిని శ్రీ ఏకవీరాంబికను స్తుతించుచు బాడినది. ఆపాట కనుగతముగ లయాత్మకత వెలయింప ఘంటాధ్వనులు ఆనద్ధవాద్యధ్వనులు కూడ చెలగినవి. తత, ఘన, శుషిర, అనద్ధములు నాబడు చతుర్విధవాద్యములలో ఘనానద్ధములిట ప్రయుక్తములైనవి. ఘనములగు ఘంటాదికముల ధాతునిర్మితి లోహసంబంధి. ఆనద్ధవాద్యముల ధాతునిర్మితి చర్మసంబంధి. మర్దళాదికములు ఆనద్ధములే కావు: నే ఆమాలెత పద్యమున లోహనిర్మితమగు క్షుద్రఘంటికలతో గూర్చిన యొడ్డాణము వంటి మొలనూలును ధరించియుండును. అందలిమువ్వలు తాను గానించు భావప్రకటనానుసారి లాస్యమునకనుగతముగ మ్రోగుచుండగా ఇంకను లయాత్మకతను ప్రతిపాదింపనెచ్చి మెడకు తగిలించుకొనిన డోలకువంటి

* మాలెత - 131.

పద్దీశమును మొదలుపెట్టియుండును. అంతటి లయాత్మికతా నిర్వహణము గావించును భావము వెల్లివిరియగా అతడు పాడిన పాటలో వలరాజు ఒక్కొక్క మూర్ఛనా స్వరములో నొక్కొక్క ప్రాణమును ప్రతిష్ఠించెననిపించును. శ్రోతృ చిత్తమునకు సుఖావహమగు తన్మయీభవనయోగ్యతను గల్పించి యద్దానికి మూర్ఛితస్థితిని బోలిన సమ్మోహనావస్థను ప్రకల్పించు స్వరప్రరోచనయే మూర్ఛనయని సంగీతరత్నాకరాది గ్రంథకారులున్నారు. అట్టి అవశస్థితికి ప్రాణ ప్రతిష్ఠనిడ వలరాజుగావించినాడు. సన్నివేశానుతతముగ అవగతమగు నీఅర్థమునే గాక రాగవివేచనా పద్ధతిలోగూడ ఈపద్ధతిని పర్యాలోచింపవచ్చును. ఒక్కొక్క రాగమునకు ఒక్కొక్క స్వరము వాదిగ మఱియొకటి సంవాదిగ, యింకొకటి అనువాదిగ, వేఱొక్కటి వివాదిగ నుండును. ప్రభువునకు మంత్రి, సామంత, దండనాథ, శత్రునృపులతోనుండుననుబంధము ఆయాస్వరములతో నాయారాగముల కుండును, సంవాది, వాది, అనువాది స్వరములు ఒక్కొక్కచో ఆరాగచ్ఛాయను గమ్యమానమొనర్చి వ్యాపకత్వమును గూర్చి రంజకత్వమునొన గూర్చును. అదియ వివాది స్వరమైన దాటు స్వరము. గ, *కణ స్పర్శనము ప్రవృత్తమైన ఒక్కొక్కచో క్వాచిత్కముగ రక్తిదమగును. అట్లని వివాదిస్వరము ప్రత్యేకించి స్ఫుటముగ నుచ్చరించిన అయ్యది ఆరాగప్రవలత్తికి భంజకమగును. కావుననే సంవాది స్వరప్రయోగమున రాగము ప్రాణితమగును గాన ఆసంవాది స్వరమును జీవస్వరమని, అంశస్వరమని వ్యవహరించుచున్నారు. ఉదాహరణమునకు భైరవి రాగము నాలపించినపుడు 'నీపదమపగారీస' అనుస్వరస్తబకమును గాయకుడు గానముచేసినను వాద్యముపై పలికించినను అందలి నిషాద గాంధారముల అను వాద సంవాదమున ఆరాగమున ఆ జీవస్వరములు గమ్యమానములై ఆరాగచ్ఛాయ ప్రాణితమగును. కావుననే వల్లభుడు సంగీతశాస్త్రాన్వితరాగ వివేకస్వాంతుడై జీవస్వర ప్రతిష్ఠను మూర్ఛనా ప్రరోచనమును ప్రాణితము గావించుచు మూర్ఛనా స్వరముల్ ప్రాణంబు గల్పింపగా అని ప్రస్తావించియుండును. ఇంతవఱకు వల్లభుడు అభివర్ణించిన మార్గి సంగీతశాస్త్రరీతియగున నాహతనాదపద్ధతియున్నది. కేవలము మార్గిగాక అట్లని అవి పూర్తిగ దేశికి చెందక నడిమివాటముగ నడిచెడి రీతి శ్రీనాథవల్లభుల రచనాంతరిత జీవసరాగమునకు జీవస్వరమగును. కావుననే

---

* సంగీత పారిజాతము. రాగసంబంధి వ్యాఖ్య

పద్యమునందతట మార్గి ప్రక్రియను ప్రదర్శించి ఆఖరి పాదమున మాత్రము "కలకంఠీ కలకంఠకోమల కుహూకారంబుతోరంబుగాన్" అని పూరించినాడు. ముందటి పాదములలో సంగీతశాస్త్రప్రసిద్ధప్రక్రియలగు మూర్ఛనాదుల జెప్పి అంతమున సహజసిద్ధమగు కోకిల కుహూకారము ననాహతనాదము వినిపించుటలో ఆహత, అనాహత నాదరీతులకు మార్గి, దేశి, ప్రక్రియలకువలె ఒక్కొక్క కర్ణాటనాదశైలి ప్రతిభాసించినది. ఇట్లు కర్ణాటబాణిని శ్రీనాథునినుండి పుణికిపుచ్చుకొని వల్లభుడు కవిరాజు సంగీత పాండితికి తన గానవైదుష్యమునకు నెయ్యమును దీయగగూర్చుకొనినాడు.

* అకలంకస్థితిఁగోరి కాల్పెదరు బ్రహ్మానందభావంబునన్
సకలానందమయైక మాతలనుచున్ సంతోష చిత్తంబునన్
తక దుందుమ్ములు తాళముల్ జవనికల్ తందానలమ్మయ్యకున్
ఎక వీరమ్మకు మాహూరమ్మకు సఖోహ్రీంకారమధ్యాత్మకున్"

అనునీ పద్దియమున ఆకలంకస్థితిగోరి బ్రహ్మానందభావంబులో "ఏకవీరమ్మను మాహూరమ్మను భక్తజనులు వివిధవాద్యములు మెరయించి అనేకవిధ ధ్వానములు ప్రచలితములగు చుండగ కొలుతురని వల్లభుడు చెప్పెను. ఈ సకలానందమగు హృదయగ్రంథి విచ్ఛేదనమున దహరాకాశావరణమున నాదోపాసనాత్మకసాధనవలన సులభసాధ్యము. కావుననే ముముక్షులీనాదోపాసనారీతి నెన్నుకొనిరి. ఇందు వల్లభుడు వినిపించినది శుష్కగానముగాదు. అదితకధిమ్మలగు జతి విన్యాసములతోను, ఏకతాళాదిక తాళప్రభేదములతోను జవనికలు మున్నగు వాద్యములలో ననుగతమై తందాన పదపల్లవి నూతగా గొనినవి. ఇట వల్లభునిగానవాల్లభ్యము కేవలచేశ్యమై పెల్లివిరిసియు అకలంకస్థితిగోరి బ్రహ్మానంద భావాత్మకమై అసత్తునుండి సత్తునకు, తమస్సునుండి జ్యోతికి, మృత్యువునుండి అమృతత్వస్థితికి నెగబ్రాకినది. ఇట్లు ఏకవీరమ్మల మాహూరమ్మల ముచ్చట్లును ముగించి వల్లభుడు ఆపిదప జక్కుల పురంధ్రినికొనివచ్చి పతితలమనోరంగమున నిలపినాడు. ఈ జక్కుల సుందరీ వర్ణనమునందీ కవిగీతవాద్య నృత్యత్రయమైన

---

* మాపెత - 132. తకదుమ్మల్ మెకతాళముల్ - పాఠాంతరము.

సంగీత సమగ్ర శాస్త్రత్రితకీర్తిని ప్రదర్శించినాడు. అంతేగాక ఈపద్ధియమునందు శ్రుతి, స్వర, తాళ, రాగ విన్యాసభరిత సంగీతశాస్త్ర పారిభాషికములన్నిటిని ఒక్కెడో ప్రవృత్తము గావించినాడు.

> కోణాగ్ర సంఘృష్ట ఘుమ ఘుమధ్వనితార
> కంత స్వరంబుతో గారవింప
> మసిబొట్టుతో నానదసలు కొల్పిన కన్న
> కొడుపు చేఁదాటించు నెడపదనప
> శ్రుతికి నుత్కర్షంబుఁజూపంగ వలయుచోఁ
> జెవి ద్రావు బిగియించు జీవగజ్జ
> గిల్కుగిల్కున మ్రోయు కింకిణీ గుచ్ఛంబు
> తాళమానంబుతో మేళవింప
> రాగమునందుండి లంఘించు రాగమునకు
> మరు మయూర ద్వయంబుపై నొత్తిగిల్ల
> కామవల్లీ మహాలక్ష్మి కైటభారి
> వలపు పాడుచువచ్చె జక్కులపురంధ్రి"*

ఇట జక్కుల పురంధ్రి ఉరుమయను నానద్ధవాద్యమును ధరించి అది తన పాటకనుగతమగునట్లు మ్రోయింపుచున్నది. ఈ ఉరుమను కొడుపుతో దాటించి మొరయింపవలయును. దీనిని ఆచార్య పి. సాంబమూర్తిగారు ఉరిమ యనుపేరుతో వివరించినారు. ఆనద్ధవాద్యములగు మృదంగాదికములు సులభముగ వినిపించుటకు ఒకవైపున చర్మమధ్యమున బోనమునుంతురు. ఈ బోనమును మెత్తగా ఉడికించిన అన్నమును చిదిపి మసితో గూడిన బూడిదతో కలపిచేయుదురు. అద్దానివి ఉరుము కొకవైపు చర్మమునకు మధ్యగా నలికించుటచే వల్లభుడు అద్దానివి మసిబొట్టు బోనమనినాడు. దానిని కొడుపులేక కోణాగ్రముచే దాటించుచు అవ్రమదధ్వనిచేయుచున్నది. అంతేగాక శ్రుతికినుత్కర్ష ప్రతిపాదనము గావింప వలసినపుడు అనగా హెచ్చుస్థాయిలో తానుపాటనందుకొని నడుమబిగియించియుంచి

---

* జక్కుల పురంధ్రి – 136.

చెవిత్రాడును చర్మపుపటకానులాగును బిగిని గల్గించుచున్నది. అంతేకాక ఆమె ధరించిన కింకిణీగుచ్ఛము వంటి కింకిణియను వాద్యవిశేషము సంగీతరత్నాకరమున నుట్టంకితమైనది. అంతేకాక కింకిణీగుచ్ఛమునకు సమానార్థకముగ ఆచార్య సాంబమూర్తిగారు కింకిణి జాలమను పేరుతో వివరించినారు. ఇట్లామె ఊరుమును దాటించుచు కింకిణీగచ్ఛమును గిల్కుగిల్కుమని మొరయించుచు సుకుమారమును నుత్కర్షాన్వితమునునగు తన గానమునకన్వితమగునట్లు అభినయించుచున్నది కూడను. ఇట్లు నృత్యవాద్యానుగతముగ ఆమె అందుకొన్న గానము కేవలమైన గాలిపాటకాదు. అది రాగ వివేక సమన్వితమై ఒక రాగము నుండి అలవోకగ వేరొక రాగమునకు లంఘించు రసఝరి. అనగానామె రసోత్కర్షానుసారిగ రాగముల మార్చుచు రాగమాలికలగూర్చుచు కథాకథనము గావించుచున్నదని గమ్యమానమగుచున్నది. ఆకథాకథనమున నడచిన ఇతివృత్తము ఉదాత్తము అది కామవల్లీ మహాలక్ష్మి కైటభారుల వలపుపాట. ఇట్లా మహాలక్ష్మి స్వయంవర సన్నివేశమును వల్లభుడు తన గానవాల్లభ్యసంయుత చాకచక్యముతో అద్దానిని నిరూపించినాడు.

ఇట్లు జక్కుల పురంధ్రిని దర్శించిన పిదప టిట్టిభుడు గోవింద మంచన శర్మ అటనుండి కదలి ముందుకు సాగినాడు. అపుడొకానొక చోట వెల్లివిరిసిన వాద్యసమ్మేళనాత్మిక ఉద్ధతినిగాంచి టిట్టిభుడు మంచననిట్లు ప్రశ్నించినాడు.

"మంద్రమధ్యతార మానత్రయాభిన్న
మహిష శృంగ నాదలహరిఁగూడి
డమరు డిండిమంబు డమడమ ధ్వని మ్రోసె
నద్భుతంబిదేమి యార్భటంబు" *

ఈ పద్యమున వల్లభామాత్యుడు ప్రకటముగ మెరయించిన వాద్య ప్రఘోషమును తన మనోశ్రవణములలో తానువిని మన చెవులలో నద్దానిని ప్రతిధ్వనింపజేసినాడు. అది వివిధ వాద్యముల సమ్మేళనము. అందు మెరయించిన వద్యములలో మహిషశృంగ నిర్మితమగు శృంగవాదములు, డమరుకములు,

* అక్కలు - 140.

డిండిమములు మొదలగు సుషిరానద్ధములగు వాద్యములున్నవి. అందు ఉద్భూతమైన ధ్వానము మంద్ర, మధ్య, తార, మానత్రయాభిన్నము. అట్లగా నీవాద్యప్రఘోషమునొకటి మధ్యస్థాయిలో, మరియొకటి మంద్రస్థాయిలో, వేరొక్కటి తారాస్థాయిలో పలికొన్ని మంద్రమధ్యతార అనుమందర అతితారస్థాయిలో కూడ ఒక్కపరి మొరయుచున్నది. ఇది కష్టసాధ్యమగు వాద్య సమ్మేళనము. ఇట్టిది అత్యంత సాధనామూలకమునగాని నిర్దుష్టముగ నిర్వహింపవలను పడదు. నేడిది మనవాద్యసమ్మేళనములందు లుప్తమై ఔత్తరాహుల బృందమేళనమున సత్ప్రవృత్తిగ నిలచియున్నది. ఆంగ్ల సంగీతరీతిలో క్రైస్తవ క్వైర్ గానమున నీ రీతినివారి ఆలయగీతికల నాలపించుపట్టుల విననగును. బృందగానమున 'మెలొడీ' యును వాద్యబృందమున 'హార్మొని' యును పరిపోషితము గావలయుననుట ప్రాచ్యపాశ్చాత్య సంగీత విదులందరకు ఒప్పుకొనినమాటయే.

ఇట్లా సన్నివేశమున మంద్ర మధ్యతార మానత్రయాభిన్నమై అనుమందర అతి తారస్థాయీ సమన్వితమై మొరసిన వాద్యప్రఘోషమున వల్లభుని గాన వాల్లభ్యమేగాక శ్రీనాథుని కర్ణాట ధ్వానముకూడ ఇమిడియున్నది. అది శాస్త్ర వ్యపదేశితముగాదు. శ్రుతి సుఖప్రతిపాదితము.

ఆ పిదప మైలారభటుడు గొండ్లి యాడించుచున్న సన్నివేశము వర్ణితమైనది. ఈ గొండ్లి 'నాచన సోమన నాట్యవినోదము'న* వర్ణింపబడినది. నృత్తరత్నావళ్యాది నాట్య శాస్త్రగ్రంథములలో చెప్పబడిన లక్షణమునకు వల్లభుని క్రీడాభిరామమున లక్ష్యశుద్ధి కుదిరినది.

ఈపద్యమున ప్రస్తావింపబడిన గొండ్లిని వేటకత్తె నృత్యమనియునందురు. ఇందు గొరగవడుచు గొండ్లియాడుచు మూర్ధాభినయనము గావించుచున్నది. ఆమె మతుమారలఘుదేహమై యుండును. కావుననే వల్లభుడు గోముగ ఆమెనునెట్టిక కిలింతగాని లేదమమ మురిసిపోయినాడు.

---

* ప్రాచీనాంధ్ర కవుల సంగీత ప్రతిపత్తి. ప్రథమ భాగము.

"వీరు మైలాదేవర వీరభటులు
గొండ్లి యాడించుచున్నారు గొరగపడుచు
నాడుచున్నది చూడు మూర్ధాభినయనము
తానుసెట్టిక శీలంతగాని లేదు" *

ఈపద్యము తరువాత కొంత గ్రంథపాతమై యుండును. తరువాతిదిగ ప్రచురింపబడిన పద్యమున కోల్లాట నృత్యము వర్ణితమైనది. కాని యది కొల్లాటమని ఉక్తముకాలేదు. ఈ కోల్లాట నర్తనమునే 'దొమ్మరియాట' యనియు నందురు. దీని లక్షణమునుగూడ నాచనసోముని నాట్యవినోదమున వివరించితిని. దానికి లక్ష్యసిద్ధిగ నీపద్యము నిలుచును.

"వెనుకకు మొగ్గ వ్రాలికడు విన్నను వొప్పంగ దొట్టె నీళ్లలో
మునింగి తదంతరస్థమగు ముంగర ముక్కున గ్రుచ్చికొంచువే
చెను రసనాప్రవాళమున శ్రీభ్రమ గ్రుచ్చెను నల్లపూసవే
రనుపమలీల నివ్వడుచు పాయములిట్టిని యెట్టునేర్చెనో?" **

నృత్తవశీకారుడు వివరించిన భావము నంతటిని ఈ సంగీతరత్నాకర కారుడు ఒక్క శ్లోకములోనే ఇమిడించినాడు.

"భార స్వభూయసో ఓథా ప్రాధా భ్రమరి కాదిభు
రజ్జు సంచార చతురాళ్చరికాన ర్తనే కృత
శస్త్ర సంకట సంపాతపటుకోల్హాటినోమతః" ***

---

* మైలారభటులు - 142.
గరగ నృతము పేరిట ఇటీవల ఆకాశవాణివారి సౌజన్యముతో ప్రదర్శితమగుచున్న గీతానుగతలయాత్మకము (డప్పులతో మ్రోగించునది) నగు నృత్తమున వాద్యకారులు మూర్ధామున కుండికలను ధరింతురు గానవిది మూర్ధాభినయనమైనది.

** మైలార భటులు - 144.

*** సంగీతరత్నాకరము - iv భాగము.
vii 2330.

ఇం యొత్తము మునివొక్కరింటిపా: నాడెను తాళము గడకెక్కి నర్తించుచు అడుగుండి మిడికి క్రిందపడ్డ నీళ్లతొట్టెలో మునిగితేలెడివాడు. ఆ పిదప వెనుకకు ప్రొగ్గ్రాలి అందరి ముంగల సుక్కునకు గ్రుచుకొనెడివాడు. ఆ పిదప నాలుకతో నల్లపూసలు గ్రుచ్చెడివాడని ఈపద్యమువలన తెలియుచున్నది. ఇంతకుముందొకటి రెండు పద్యములందే తెలిపితిని. అంతే బొమ్మరిసాని గడకెక్కి ఆడుట, ఖడ్గముపైని నడచుట ప్రాణసందేహజనకములగు శస్త్రాస్త్రపాతములనుండి తనుదాను రక్షించుకొనుట వర్ణితమైయుండనోపును. ఈ కోలాహలనృత్యారంభమున వాద్యప్రఘోషముతో లయప్రాయమలయునని జాయపాదుఁడవిన "తాహత్రైర్మార్గవంహై".... ఇత్యాది శ్లోకార్థము నిరూపించుచున్నది. ఇట్టి కోలాహలప్రారంభమగు పద్యము ఒకటి పైలాటభటులాడించు గొండ్లికి ముందున్నది. అట్టిదే మరియొకటి ఆర్యాపసంచూచకమైనది ఈ కోలాహల నృత్యారంభమునమున్నట్లయిన బాగుగా అతికియుండెడిది. వర్ణించుట్టి సన్నివేశమును రక్తికట్టించునట్టి మహాప్రఘోషవర్ణనము చేయుటలోదిట్ట. కాని నాతడు అట్టి పద్యమును వ్రాసియుండినను గ్రంథపాత్యమున లుప్తమైయుండనోపును.

ఇట్లు గొండ్లివి, కోలాహలమును పేక్షించిన పిదప శోభన దిట్టిమలు ముందుకు సాగి యూనా(సా)వి వాకొనరించు నృత్తానుసారి వాద్యసమ్మేళనమును దరిసిరి. అవి ఈపద్యమున వర్ణితము.

> "అకలంకస్థితి శీథుపానరుచులై యసాదులు పొంగి యో
> యకరోయమ్మకరో యమక్కరోయదీ యట్టిటకోయంచుఁబా
> యకతప్పెట్లునుఁదళ్లై తాళములు నింపై సొంపురంజిల్లఁగాఁ
> ఝకఝాంఝాంఝక ఝంఝుఝుమ్మ మనుచున్ సాగుంగడున్
> వాద్యాముల్" *

ఇటు వర్ణితము అప్రాకృతుల పామరభాషణములతోపాటు వాకొనరించు తప్పెట్లును, ఆనద్ధవాద్యములను, తళియ తాళములను (వళ్లెరములవంటి వానిని) ఘనవాద్యములను మ్రోయించునపుడు ఉద్భూర్ణమగు ఝకఝం ఝంఝకఝం

---

* పైలాట భటులు - 148.

జుంప్మను ధ్యానమునకుకూడ కావ్యోపస్థితికి కల్గించినాడు. ఇందు యనాదులనుట కన్న యానాదులనుట తగునేమో! నేటికిని యానాదులు తదితరానావి జాతులకంటె సంగీత ప్రియులుగ శిథుపానావస్థితిలోకూడ తప్పెట్లను మ్రోయించుచు నృత్తము సల్పుచు గోచరింతురు.

ఇంకొకచో వల్లభుడు లక్ష్మణవరుల యింటిబోనముకంటె వారింపనున్న వితంతురత్నంపు రాగమాధురిని గొనియాడి చవులూరించినాడు. ఇట వల్లభుడు వ్యాఖ్యాతగానేగాక సంగీత సహృదయుడైన శ్రోత్రగాగూడ దర్శనీయుడైనాడు.

> "కోయిల పంచమస్వరము క్రోల్చిన భంగిని గంఠమెత్తి రా
> మాయణ మాఱుకాండములు నత్యుతజాగరవేళఁబాడెనా
> రాయ వితంతు రత్నమను రాగముతోడ "నమశ్శివాయ శాం
> తాయ సమస్త దోషహరణాయ" సమానమెదానికెవ్వరున్" *

ఇందారాయవితంతురత్నము, అనురాగముతోడ బాడినదను సామాన్యర్థము నేగాక ఆరాయవితంతు+రత్నమను+రాగముతో పాడినదను సంగీతసవిశేషార్థమును గూడ విఱుపుతో సాధించుటకనువున్నది. ఈరత్నమనురాగము అచ్యుత జాగరీ వేళ బాడినదనుటలో నారాగప్రవృత్తికి అనువైన వేళ సంసూచితమైనది. రాగ వేళావేళల నెఱుగంగగల సంగీతసమయసారాన్విత ప్రజ్ఞ వల్లభునికి కలదని రాగరసోత్కర్షా సంసూచితములగు మఱికొన్ని సన్నివేశములుకూడ ధృవపఱచు చున్నవి. మంచన, టిట్టిభులు ఒక్కచో పాములాటలోని 'నాగసౌరము'ల మ్రోతలు సంగీతము వినినారు.

> "కేలి సఖుఁడును దానాలకించి చనియె
> నాగసౌరముల మ్రోత యన్నాగరికుఁడు" అపుడు,
> "నాగస్వర సుషిరసర
> న్నాగ వరాళ్యాదివివిధ నానారాగ
> ప్రాగల్భ్యప్రకట ఫణా
> భోగములై యాడఁజొచ్చె భోగీంద్రంబుల్" **

---

* హూటకూటి యిల్లు — 170.

** పాములాట — 220.

జాంపమును ధ్యానమునకుకూడ కావ్యావస్థితికి కల్గించినాడు. ఇందు యసాదులనుట కన్న యానాదులనుట తగునేమో! నేటికిని యానాదులు తదితరానాది జాతులకంటె సంగీత ప్రియులుగ శీధుపానావస్థితిలోకూడ తప్పెట్లను మ్రోయించుచు నృత్తము సల్పుచు గోచరింతురు.

ఇంకొకచో వల్లభుడు లక్ష్మణవఝుల యింటిలోనముకంటె వాయింపనున్న వితంతురత్నంపు రాగమాధురిని గొనియాడి చవులూరించినాడు. ఇట వల్లభుడు వ్యాఖ్యాతగానేగాక సంగీత సహృదయుడైన శ్రోత్రగాగూడ దర్శనీయుడైనాడు.

> “కోయిల పంచమస్వరము క్రోల్చిన భంగిని గంతమెత్తి రా
> మాయణ మాఱుకాండములు సత్కృతజాగరవేళఁ బాడెనా
> రాయ వితంతు రత్నమను రాగముతోడ “నమశ్శివాయ శాం
> తాయ సమస్త దోషహరణాయ” సమానమెదానికెవ్వరున్” *

ఇందారాయవితంతురత్నము, అనురాగముతోడ బాడినదను సామాన్యార్థము నేగాక ఆరాయవితంతు+రత్నమను+రాగముతో పాడినదను సంగీతసవిశేషార్థమును గూడ విఱుపుతో సాధించుటకనువున్నది. ఈరత్నమనురాగము అచ్యుత జాగరి వేళ బాడినదనుటలో నారాగప్రవృత్తికి అనువైన వేళ సంసూచితమైనది. రాగ వేళావేళల నెఱుగంగగల సంగీతసమయసారాన్విత ప్రజ్ఞ వల్లభునికి కలదని రాగరసోత్కర్షా సంసూచితములగు మఱికొన్ని సన్నివేశములుకూడ ధృవపఱచు చున్నవి. మంచన, టిట్టిభులు ఒక్కచో పాములాటలోని ‘నాగసొరము’ల మ్రోతలు సంగీతము వినినారు.

> “కేలి సఖుఁడును దానాలకించి చనియె
> నాగసొరముల మ్రోత యన్నాగరికుఁడు” అప్పుడు,
> “నాగస్వర సుషిరసర
> న్నాగ వరాళ్యాదివివిధ నానారాగ
> ప్రాగల్భ్యప్రకట ఫణా
> భోగములై యాడఁజొచ్చె భోగీంద్రంబుల్” **

---

* పూటకూటి యిల్లు — 170.

** పాములాట — 220.

ఇటు మొత్తము మదనీదొమ్మరియాట నాడెడు జాణలు గడలెక్కి నర్తించుచు అటనుండి దుమికి క్రిందనున్న నీళ్లతొట్టెలో మునిగిలేచెడివారు. ఆ పిదప వెనుకకు మొగ్గవ్రాలి అందలి ముంగర ముక్కునకు గ్రుచుకొనెడివారు. ఆ పిదప నాలికతో నల్లపూసలు గ్రుచ్చెడివారని ఈపద్యమువలన తెలియుచున్నది. ఇంతకుముందొకటి రెండు పద్యములుండి తీరవలెను. అందీ దొమ్మరిసాని గడలెక్కి ఆడుట, పగ్గములపైని నడుచుట ప్రాణసందేహజనకములగు శస్త్రాస్త్రచాలనములనుండి తనుదాను రక్షించుకొనుట వర్ణితమైయుండనోపును. ఈ కోలాటనృత్యారంభమున వాద్యప్రఘోషముతో లయప్రమోయవలయునని జాయపార్యుడనిన "కాహలైర్మార్గపటహై".... ఇత్యాది శ్లోకార్థము నిరూపించుచున్నది. ఇట్టి కోలాటవ్యంజనమగు పద్యము ఒకటి మైలారభటులాడించు గొండ్లికి ముందున్నది. అట్టిదే మరియొకటి అర్వాటసంచూచితమైనది ఈ కోలాట నృత్యారంభమునమున్నట్లయిన బాగుగా అతికిపోయెడిది. పల్లవుడిట్టి సన్నివేశమును రక్తికట్టించునట్టుల మహాప్రఘోషవర్ణనము చేయుటలో దిట్ట. కాని నాతడు అట్టి పద్యమును వ్రాసియుండినను గ్రంథపాత్యమున లుప్తమైయుండనోపును.

ఇట్లు గొండ్లివి, కోలాటమును వీక్షించిన పిదప సోమన భట్టినులు ముందుకు సాగి యానా(సా)ది వారొనరించు నృత్తానుసారి వాద్యసమ్మేళనమును దరిసిరి. అది ఈపద్యమున వర్ణితము.

> "అకలంకస్థితి శీధుపానరుచులై యసాదులు పొంగి యో
> యకరో యమ్మకరో యమక్కరో యదీ యట్టిట్టకో యంచుఁటా
> యకతప్పెట్లుమద్దళ్ళె తాళములు నింపై సొంపునంజిల్లఁగాఁ
> జకజాంజాంజక జుంజుజామ్మ మనుచున్ సాగుంగదున్
> 'వాద్యాముల్'' *

ఇట్లు వల్లభుడు అప్రాకృతుల పామరభాషణములతోపాటు వారొనరించు తప్పెట్లను, ఆనద్ధవాద్యములను, తళియ తాళములను (పళ్లెరములవంటి వానివి) ఘనవాద్యములను ప్రయోగించునపుడు ఉద్ఘూర్ణమగు. ఝకఝం ఝంఝకఝం

---

* మైలార భటులు - 148.

జృంభ్మను ధ్యానమునకుకూడ కావ్యోపస్థితికి కల్గించినాడు. ఇందు యసాదులనుట కన్న యానాదులనుట తగునేమో! నేటికిని యానాదులు తదితరానావి జాతులకంటె సంగీత ప్రియులుగ శిథుపానావస్థితిలోకూడ తప్పెట్లను మ్రోయించుచు నృత్తము సల్పుచు గోచరింతురు.

ఇంకొకచో వల్లభుడు లక్ష్మణవర్యుల యింటిభోనముకంటె వారింటనున్న వితంతురత్నంపు రాగమాధురిని గొనియాడి చవులూరించినాడు. ఇట వల్లభుడు వ్యాఖ్యాతగానేగాక సంగీత సహృదయుడైన శోత్రగాగూడ దర్శనీయుడైనాడు.

"కోయిల పంచమస్వరము క్రోల్చిన భంగిని గంఠమెత్తి రా
మాయణ మాలుకాండములు నత్యుతజాగరవేళఁబాడెనా
రాయ వితంతు రత్నమను రాగముతోడ "నమశ్శివాయ శాం
తాయ సమస్త దోషహరణాయ" సమానమెదానికెవ్వరున్" *

ఇందారాయవితంతురత్నము, అనురాగముతోడ బాడినదను సామాన్యర్థము నేగాక అరాయవితంతు+రత్నమను+రాగముతో పాడినదను సంగీతనవిశేషార్థమును గూడ విఱుపుతో సాధించుటకనువున్నది. ఈరత్నమనురాగము అచ్యుత జాగరీ వేళ బాడినదనుటలో నారాగప్రవృత్తికి అనువైన వేళ సంసూచితమైనది. రాగ వేళావేళల నెఱుగంగగల సంగీతసమయసారాన్విత ప్రజ్ఞ వల్లభునికి కలదని రాగరసోత్కర్షా సంసూచితములగు మఱికొన్ని సన్నివేశములుకూడ ధృవపర్చు చున్నవి. మంచన, టిట్టిభులు ఒక్కచో పాములాటలోని 'నాగసొరము'ల మ్రోతలు సంగీతము వినినారు.

"కేలి సఖుఁడును దానాలకించి చనియె
నాగసొరముల మ్రోత యన్నాగరికుఁడు" అపుడు,
"నాగస్వర సుషిరసర
న్నాగ వరాళ్యాదివివిధ నానారాగ
ప్రాగల్భ్యప్రకట ఫణా
భోగములై యాడఁజొచ్చె భోగీంద్రంబుల్" **

---

* పూటకూటి యిల్లు — 170.

** పాములాట — 220.

ఇట్లు పాములాటయందలి నాగస్వరముల మ్రోతలో నాగవరాళి రాగాలాపన వినవచ్చుటలో మార్గిదేశి పద్ధతుల కలగాపులగముగా శ్రీనాథకర్ణాటమున్నది. శ్రీనాథసఖుడగు వల్లభుడు ప్రయోక్తగానాలపించిన దేశిరీతియగు పాములాటలో మార్గిప్రక్రియకు చెందిన నాగవరాళి రాగము శ్రుతిసుఖ ప్రతిపాదనమై కర్ణాటమై చెలగినది. అది చక్షుశ్రవములచేగాక కథానాయకులగు వేశ్యాభుజంగుల వలరించి చెవులపండుగ నొనరించినది. పై పద్యమునందలి నాగస్వరము. తత ఘనసుషిరానద్ధవాద్య ప్రభేదములలో సుషిరజాతికి చెందిన వాద్యమగుచున్నది. అద్దానిని ప్రయోగించు విధానము ఆ తరువాతి పద్యమున ప్రవ్యక్తముగావించి వల్లభుడు తన వివిధ వాద్యవాదన పరిచితిని వెల్లడించినాడు.

"పూత్కారపవనంబు పూరించు పుక్కిళ్ల
మునిఁడి పండులతోడ ముద్దుఁగురియ
సందిటి సంకుపూసల పద్దుకట తుంబి
నాద స్వరోజ్జృంభణముల నడఁప
నేడు రంధ్రమ్ములు నిరుఁగేల్వ్రేళ్లను
వివృతి సంవృతి లీల విస్తరింప
నాలాప తాళాం తరాంతరంబులయందు
విక్కను శబ్దముల్ చొక్కటముగ

నాగసింధుప్రభేద నానావరాట
రాగ గంధర్వల హరికారాంభణముల
మిహిపదంబుగఁ బాముల వెంగఁడూదె
భోగిరాజులు వర్తింప నాగసారము"*

ఈపద్యమునందు నాగస్వరవాద్య సంబంధియగు నాదోత్పత్తిక్రమము ప్రవ్యక్తమైనది. అందలి సప్తస్వరస్థానములగు సప్తరంధ్రములతీరు వివిధరాగ సంబంధులగు నాలాపములరీతి, తాళాంతరితములగు పద్ధతులు సూచనామాత్రము గవ్యమానములైనవి. ఇందునాగసింధు ప్రభేద నానా(ట) వరాట, రాగ,

* పాములాట - 224.

గంధర్వలహరి కారంభములు పాముల మెంగడూదుటవలన జానపదరీతికి లభ్యము లైనవి. పాములాటయనునీ దేశ్యప్రక్రియలో మార్గిరాగతాళ పద్ధతి ప్రసక్తమౌట వలన కర్ణాటరీతి వెల్లివిరిసినది. ఇటు తరువాత కొంత గ్రంథమున్నది. కాని అందంతగా సంగీత ప్రసక్తిలేదు. చిట్టచివరగ మంగళాచరణమువలె నాగస్వర మూదించి వల్లభుడుసంగీతప్రస్తావననుముగించినాడు. "శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసంఫణీ కోవేత్తి కవితారసం ఈశ్వరో వేత్తివానవా" అను అభాణకమునకు ఈపాములాట లక్ష్యమై భాసించినది. సంగీతము సర్వప్రాణులకు సామాన్యము. సాత్వికగుణ సంజాతులగు శిశువులకు, రజోగుణసంభరితములైన సర్పములకు తమోగుణసమన్వితములైన పశువులకుకూడ గానము ఆనందజనకమై భాసించు చున్నది. గానాభినందనమునకు జాతితో, భాషతో సంబంధములేదు. అట్టి మహత్వము సంగీతమునకున్నది. కావుననే కవితాకళ ఈ ధర్మమున సంగీతమునకు తీసికట్టగుచున్నది. అందులకే "కోవేత్తి కవితారసం, ఈశ్వరో వేత్తి వానవా" అనుచు సమాధానపరచుకొని గానరసాస్వాదనతో చతుర్విధ పురుషార్థార్జనగావించిన యోగులు, భోగులుకూడ ఉన్నారు. శ్రీనాథ వల్లభులు ఇట్టి కోవకు చెందినవారు కనుకనె భోగమున యోగమును, యోగమునభోగమును కవనమున గానమును సాధించి కృతార్థులైనారు, ఇట్లు వల్లభుని కవితలో సంగీతము అటు మార్గిగాక ఇటు దేశిగాక మార్గిదేశి ప్రక్రియల మేలుకలయికయై కర్ణాటముగ ధ్వనించి కృతార్థతనొందినది. సాహితియేగాక గీతికూడ శ్రీనాథాను గ్రహమున వల్లభుని వాల్లభ్యముపొంది మురిపెములు, ముచ్చటలు తీర్చుకొని సర్వతో భద్రతనందుకొన్నది.

—౦—

# పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని సంగీత భద్రత

"పేరు మాత్రమే పిల్లలమఱ్ఱిగాని పేరుపలెగాదు శారదాపీఠకంబు" అని తమ పిల్లలమఱ్ఱి వారిలోగిలినే నలువరాణి కొలువుకూటముగావించి అందు సాహితితోబాటు గీతికికూడ సర్వతోభద్రతను ప్రతిపాదించిన చతురాననచతురుడు పినవీరనార్యుడు. వాణి అతని ఆరాధ్యదేవత. ఆతనిని ఏలికొను రాణి. అంతే కాదు ఆతని జిహ్వాగ్రగీర్వాణికూడ. అందువలననే ఆమె అతని మధురకవనమునకు తన వీణాప్రక్వాణ వినదములతో నేపథ్యమును సంతరించినది.

ఈ కవి పనికట్టుకొని సంగీతశాస్త్ర పారిభాషికములను తన కవనమున వల్లింపలేదు. అయినను నన్నయ, తిక్కనల కవితయందువలె నీతనికవితలో సంగీతాంతర్గత ప్రభావము సన్నివేశగతముగా గోచరించుచునే యుండును. ఇమ్మహా కవిమౌళి కవితాలక్ష్మితోపాటు గీతిలక్ష్మిని నన్నపార్యప్రౌఢరచనా సంపత్తితో తిక్కయజ్వ వాక్సిక్కా మోదమును సంతరించుకొనుటముదావహము. కావుననే ఈ కవి సంగీతాభిమానమిట భంగ్యంతరముగ వ్యంగ్యరీతిలో తిక్కనార్యుని కవితయందున్నవె ఆశ్వాసాది పద్యములయందుకూడ దర్శన మొసగినది.

"శ్రీవత్సాంకుడు భక్తవత్సలుడు లక్ష్మీప్రాణనాథుండు"* అను మంగళా చరణాదిలో శ్రీరాగము ధ్వనించినది.

"శ్రీసదన సదారాధిత
వాసుకి కేయూరవంశవర్ధన ...." ** అను ద్వితీయాశ్వాసాది పద్యమున వర్ధనరాగము వినిపించినది. ఇట్లే

"శ్రీకరపతి హితకార్యని
శాకర సౌందర్యబంధు సత్కవిజన ప
ద్మాకర సూర్యపయోర
త్నాకర గాంభీర వెన్నయప్రభువర్యా!"***

---

* i - i.

** ii - i.

*** iii - i.

ఇక, "శ్రీహస్తముకుర లీలా
మోహన ముఖపంకరుహా....''* అనునీ చతుర్థాశ్వాసాదిలో కూడ శ్రీరాగమే వినవచ్చినది. ఇట్లొక్కొక్క రాగనామము ఒక్కొక్కచో గోచరించుటయేకాక రాగమాలికయందు పల్లవితో ప్రారంభింపబడిన రాగము అనుపల్లవచరణములందు పునరుక్తమౌనటుల శ్రీరాగనామము అన్నిట ఆమ్రేడితమైనది. ఇట్టి రాగనామ నిక్షేపణ సాభిప్రాయమేనని అప్రయత్న సిద్ధముగ దొరలిన మామూలు మాటలుకావని తిక్కనార్యుని సంతతీరీతియందు వివరించితిని. ప్రాచీనకవులు సంగీతశాస్త్రజ్ఞులు కాకపోయినను తదనుభవశూన్యులు మాత్రముకారు. వారు తమ కవితను కర్ణాటముగా శ్రుతిసుఖావహముగ పఠితలు గానముచేయవలయునని ఆశింపనంతటి అరసికులని మనమీనాడు భావింపబూనుట అపచారమే యగును.

కేవలము ఆశ్వాసాదులకాక కథాగానముతో పాటు సాగిపోవు వర్ణనములందు కొన్ని రాగనామములను శ్లేషాలంకారఫణితిలో ధ్వనింపజేయుట నన్నెచోడుని నుండి పురాణప్రబంధకవులు గ్రహించినారు. ఆ బాణిలోనే పినవీరనార్యుడు కొన్ని పద్యములలో రాగనామములు వ్యంజింపజేసినాడు.

"మునిమనో మోహనయు క్తినటీ నాట్య
రంగంబులగు హేమశృంగములను
కనకాబ్జకైరవ కల్హార సౌరభో....
....మరాళిక మంజుల మంజరీ పుంజంబులగులతా
కుంజములును....''**

"సౌధాగ్ర రత్నపంజరముల రంజిల్లు
రాజకీరమనోజ్ఞరవము కంటె
భోగ్యవకుళాగ్రముల మోహసంభైన వలి
మానవీణారవంబు కంటె
కల కంఠ కంఠుల కలస్వరంబులఁగొల్పు
రమణీయ సంగీతరవము కంటె''

---

* iv -

** ii - 101.

"చామర గ్రాహిణీజనముల కరరత్న
వలయమంజరీ రావంబుకంటె
అంచితోద్యానకాసార మధుప భవ్య
వాక కలహంస మధుర రవంబులకంటె
నుత్తమ క్షత్రకులజులు చిత్తగించి యాచ
రింతురు కరుణతో నార్తరవము" *

ఈ పద్యపాదములందలి కొన్నిపలుకుబళ్ళలో రాగనామములు కొన్ని వ్యంజితములు మఱికొన్ని నిర్దేశితములు. అవి హేమ, కల్హార, కలహంస అనునవి. వీనిలో కొన్ని వ్యంగ్యరీతిలో గోచరములు. మఱికొన్ని వాచ్యములుగ అభిప్రేరితార్థసంయుతములు.

కేవలమిట్లున్నవేకాక ఇమ్మహాకవి సంగీతాభిరుచిని రాగాభిమానమును సూటిగ వ్యక్తముగావించిన పట్టులను కొన్నియున్నవి. అట్టి విమచ్చునకు కొన్ని

"ఏతెంచెన్మధుమాసలక్ష్మి తరుణీ హిందోళ రాగధ్వను
ల్వేతెంచెన్పటు మీనకేతనములతో విల్లంది పూఁదేనిపైఁ
దోతెంచెన్దలిరాకు గైదువులు దోర్దోదాత్మిచేఁదీగల
న్వీతెంచెజ్జగదేక విక్రమ కళావీరుండు మారుండొగిన్" **

ఈ పద్యమునందలి రాగప్రసక్తివలన వీరనార్యునికి శ్రీనాథునివలెనే హిందోళము ఇష్టరాగమని వ్యక్తమైనది. అంతేకాక ప్రకరణాంచిత సంయుతమై ఇయ్యది "శిశిరస్య వసంతస్య సంధౌ హిందోళరాగక"మ్మను సంగీతసంప్రదాయమును జ్ఞప్తి కెలయించి వీరనార్యుని సంగీతసమయ సారాన్విత పరిచితిని ప్రదర్శించినది.

"మానముదప్పకుండ సమానదరీముఖ ధాయమాన హే
లానిల పూర్ణరంధ్ర నిచయంబయి కీచకరాజిమ్రోయగా
వానగరాజు కిన్నరుల యంచిత గానవినోదవేళలన్
దానొక వాపికాడువల్లెఁదక్కిన మూల్కొనఁజేయు తానముల్"***

* iii - 97

** ii - 101

*** ii - 105.

అనునీ పద్యమునందు పినవీరన హిమవన్నగ శేఖరుని సంగీతాభిజ్ఞతను తన సంగీతాభిరుచికొలది వెలయించినాడు. మానముదప్పకుండ అనుటలో "శ్రుతిః మాతాలయఃపితా" అను నాట్యశాస్త్రన్యాయానుసారిగ శ్రుతిలయమానము దప్పని గానరీతి ద్యోతకమగును. అంతేకాక అనాహతనాదరీతిలో అక్కడ వాద్యవిన్యాస నిర్వహణము. అది "అసమానదరీముఖతాయమాన హేలాన్విత మాటలో సంసూచితము. వాయువు కీచకరాజిలో సాజముగనేర్పడిన రంధ్రములలో ప్రసరించినపుడు సప్తస్వరములు వేణునాదాన్వితములై ధ్వనించి ప్రవ్యాప్తములైనవి. దానిని అనిలుడు గావించిన తాయములుగ నుపమించినాడుకవి. అంతేకాక అట కిన్నరులు ఆయాహేవేళలలో గానవినోదము గావింతురనియు అనినాడు. ఇక హిమవంతుని గానమున వాసికాడుగ మలచుటలో పినవీరనార్యుని సంగీతప్రజ్ఞయే వెల్లివిరిసి ఇట ద్యోతకమైనది. హిమవంతుడు అటనున్న కీచక రాజికన్న అటునిటు సంచరించుచున్న కిన్నరులకన్న అసమానదరీముఖతాయ మాహేలా విలసితుడైన అనిలునికన్న గానమున తానొక వాసికాడు కావలెనని కవి ఆశయము. కావుననే అనిలునిచే అనాహతనాదాన్వితముగ కీచకరంధ్రోద్భిత నాద సహకృతితో రాగాలాపనమును చేయించినాడు. దేవయోని విశేషాన్వితులు గాన కిన్నెరులచే గాంధారగ్రామ ప్రకల్పనాయుతముగ పల్లవిని పాడించి యుండును. ఇక వీరందరిని మించిన వాసికాడగు హిమవంతుని రాగపల్లవుల నతకరించు తానమునందుకొనుమనినాడు గాబోలు. రాగాలాపనము పల్లవిగానము ఐహికపరిధిలో సాధించు జపతపానుష్ఠానాదికములగు ప్రాథమిక సాధనముల వంటివి. వీనిని అతిగమించిన ధ్యానాను సంధానమున పరబ్రహ్మ సాక్షాత్కారము నందుకొన్న స్థితియందలి మాటలకందలి మైమరపును ముముక్షువుపొందిన స్థితి వంటిది తానము. అనంతానంతయనుచు ఆయనంతుని తనమును అనుభవైక వేద్యముగ భావమున భద్రపరచుకొనిన అనిర్వచనీయగానోపస్థితికి బీజాక్షరయుత మంత్రజప సంయుత ఘోరతపమునకీ తానము సహోదరము. దీనికి సంగీత శాస్త్రమున తనువిస్కరణే అను భూతార్థానహకృతిలో వివరణము లభ్యము. కాని శాస్త్రమునతికరించిన అనుభూతి సాక్షికముగ నీతానము ఉపాసనాపరాకాష్ఠగ ఉపాస్య దైవసాక్షత్కృతి పరామృష్టగ ముముక్షువులచే భావితమైనవి.

శ్రుతిలయజ్ఞులగు గానవిశారదులు నాదోపాసనా మార్గమున అనాయాసముగ పయనించి మోక్షగాములై పరంధామమున పరమాత్మునితో సాయుజ్యానుసంధానమునందుదురని వేదవేదాంగములన్నియు ఏకగ్రీవముగ ఉద్ఘోషించినవి ఇందువల్లనే. కావుననే ఇట్టి నాదోపాసనాసిద్ధియగు పరబ్రహ్మసాక్షాత్కృతిని సంగీతశాస్త్ర సహకృతితో పినవీరభద్రుడు సర్వతోభద్రముగ వ్యక్తీకరించినాడు. బ్రహ్మణియే రాణియై ఆతని కవనమున రాజ్యమునకు ఏకలిసానియైనది కావున అంతటి పరబ్రహ్మను సంధానము ఆతనికి అనుభవగమ్యమైనదేమో!

ఇట్టి అలౌకిక పరిధికిచెందిన వానిని తానొక వాసికాడై వ్యక్తీకరించుచు లౌకికపరిధికి అందిన వానినికూడ వీరనార్యుడొక వన్నెకాడై వివరించినాడు. "నవ్యగీతులఁబ్రేంఖణమును వికసింపజేసి", "నమదరాగస్థితి సంపెంగను విరియింపజేసి" గీతిసాహితీవనమున ఉద్యానవృక్షదోహద క్రియల పచరించినాడు. **

"గాణలై వచ్చు కోకిల గాయకులకు నాఁతి
కంఠంబు దలప సంగీతశాలఁగ" గూర్చినాడు ***

"పూర్వమునందార్యయెరింగిన తెరంగును ఆగిరికన్యచేత బాణుపుత్రి నేర్చినరీతిని ఆరక్షోరాజనందనచేత ద్వారవతిగోపికాపిక వాణులభ్యసించిన తీరును అట్టి శుద్ధదేశి నృత్తంబుల విశేషంబులను.... భిత్తిభాగంబులు చిత్తరువులుగ చిత్తరంజనముగ ప్రత్యక్షభంగి నంగీకరింపజేసి విలసిల్లు నాట్యశాలల" ప్రసక్తులను గూడ తెచ్చినాడు.

మొత్తముమీద పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని శకుంతలా పరిణయమను శృంగారశాకుంతలమున సంగీత సరస్వతి వాణీవీణాక్వణాసపనేశిమను సంతరించుకొనినదనుటలో అతిశయోక్తిలేదు.

---

* శృంగార శాకుంతలము - ii - 138.

** " - ii - 182.

*** వీణావాదన తత్వజ్ఞ శ్రుతిజాతి విశారదః
"తాళజ్ఞ ప్రయాసేన మోక్షమార్గం నియచ్ఛతి"
సంగీతపారిజాతము - i - 15.

ఇదికాక వీరనార్యుని మరియొక రచన జైమిని భారతమున్నది. ఇది వీర రసప్రధానము. అందువలననే సుకుమారమై లలితలలితమై భావభరితమైనరీతిలో సంగీతక ధ్వానమందు వినరాలేదు. సందీతమందలి లాలన ప్రచోదనములను వివిధశక్తులలో లాలన శాకుంతలమున శృంగారరసాత్మకమున పరిప్లావితమైనది. ప్రచోధన జైమినీ భారతమున వీరరసాన్వితమై పరిఢవిల్ల ప్రవర్తిల్లినది. అందుచే యుద్ధనన్ని వేశములనుసరించి వాద్యసముజ్జృంభణము జైమినీయమున ధ్వనించినది.

ఉపాస్యదేవి ఇమ్మహాకవి మనోమందిరమును నలువరాణి కొలువు కూటముగ తీర్చిదిద్దికొనినతీరు ఈ కావ్యావతారికయందలి వాణీస్తుతిలో నిట్లు ప్రవ్యక్తమైనది.

"ప్రణవపీఠమున మంత్రపరంపర గొల్వుండు
నేదేవి పేరోలగంబు
భావజ్ఞులకు పరాపశ్యంతి మధ్యమావై ఖ
రులు ఏదేవివర్ణ సరణి
జపహారకీర పుస్తకవిపంచి సమంచితంబు
నేదేవి హస్తాంబుజములు
కుందేందు మందార కందళీ బృందంబు
చందమే దేవియానందమూర్తి
కాంచనేదేవి కాంచన గర్భచతురపూ
ర్వదంతీ కవాట విస్ఫుటమనోజ్ఞ
చంద్రకాంత శిరోగృహస్థల విహార
మమ్మహాదేవి వాగ్దేవి నభినుతింతు" *

ఓంకారరూపమగు ప్రణవము సంగీతమునకు సాహిత్యమునకు కూడ బీజము. ఆనందము, ఆగీతిసాహితుల రెంటికి కలుగు ఫలస్వరూపమగు పరాకాష్ఠ. కావుననే ప్రణవస్వరూపిణి ఆనందమయియగు ఆవాగ్దేవిని సాహిత్య సంగీత

---

* జైమినీ భారతము - అవతారిక.

ప్రతీకలగు పుస్తక విపంచికలను హస్తాంబుజముల ఘటించిన దానిగ నుతించి నాడు కవి. కాబట్టి అతని కవితలో ఆపాతమాధుర్య, ఆలోచనామృతత్త్వములు సురుచిరసుమధురములై వెల్లివిరిసినవి.

వీరరస సంయుతమైన ఈగ్రంథప్రారంభమందలి మొదటి సంగీతప్రసక్తి కూడ వీరరసపరిప్లావితమే అయినది. కిన్నరీజన విద్యాలాప పరిపఠిత దిగ్భ్రమ శాసనగీతి ప్రబంధ సంబంధుడుగ కృతిభర్త సాళువనరసింహరాయుడు అభి నందితుడైనాడు. ఆయభినందనమందలి గీతప్రబంధములు రెండు సంగీత సంబంధులే.*

కథసాగినపిదప నీరుద్రావ నేతెంచిన హరులగందడి ద్వితీయాశ్వాసమున భీమకర్ణసుతుల "కల్పాంత రుద్రఢక్కారావాధికారి సముద్రి వాద్యఘోషముగనే వినవచ్చినది.** అక్కడే ప్రవర్తిలిన సేనాఘోషము బహువాద్యనినాదభీషణ మైనది. అట్లే పవనాశ్వుండు భీమాదులతో పురంబున కరిగిన సందర్భమున ధ్వనించిన వివిధ వాద్యములు హృద్యములు సుకుమారనినదయుక్తములుగాన భీషణ ప్రఘోషణయుక్తములు*** అందంద ముందటంగ్రందుకొని చెలంగు మృదంగ ఢక్కాహుడుక్కానక ఝల్లరీ మురజకాహళారవంబులు భైరవంబులై మొరయసాగినవనినాడు కవి. ఇందు సుషిరానద్ధ వాద్యములు భైరవములగుటయే కాక భైరవీరాగానుగతములైనవని యనుమానించుటకనువున్నది.

మొట్టమొదట ప్రమీలార్జునులు రణరంగమున కలసికొనినపుడు వాద్య సంకృతులు వినవచ్చినట్లే వారి దాంపత్యఫలమగు బభ్రువాహనుడు రణరంగ మునకు బయలుదేరినపుడు ఆతడు తండ్రిని కలసికొనినపుడు వాద్యఘోషణమే ప్రవర్తిలినది. సాజముగ మమతలల్లుకొనవలసిన భార్యభర్తల, తండ్రికొడుకుల సమాగమములలో నేపథ్యమున నాటకీయముగ వాద్యఘోషము ప్రకల్పించిన అది

---

* శుద్ధైః ఛాయాలగైర్యద్వారాగైరాలప్తి సంయుతాః - ప్రబంధాయత్ర గాయంతే గీతాతిదభి ధీయతే.

** జై - భా. ii - 14.

*** " ii - 97.

లాలనా సంయుతమగును. కానీ ఈ కావ్యముననది [illegible] సంభరితమై ప్రచండభేరీ మృదంగ శంఖబిరుద కాహళాసంయుతమై మొరసినది. కథాగమనమట్టిది. కావ్యానుగత వీరరసస్థితి దానికి సంవాదికావలెను. కాన సంగీత మిందు భీషణమై వాద్యానుగతమై ధ్వనించినది. వాద్యమేగాక నృత్యముకూడ ఇందు వీరరసాన్వితమై దేశీయనత్యరీతులలో చిందులు ద్రొక్కినవి.

* "నృపకళేబరంబు మింటికివైచి కందుకక్రీడ నర్తించుచు ఢాకిని యొకర్తు
దంతి దంతమ్ము లాతమ్ముగఁద్రిప్పుచునాడు జౌపదమ్ములకుఁబిశాచ
మొకటి
యజనంబు చెఱఁగుగానభినయించుచు నీచపాత్రమైయొక ప్రేతపాత్రలాడు
భుజమునఁగూచిరంబుధరించుకొని నోలుదరిచేసియగుచు భేతాళుడొకడు
భూతగణములు కరతాళములు ఘటింపఁచిత్రగతినోర్తు చకచకయుం
కృతులకు
దోచు దువాళులు నఖిలదిక్కులు చలింపఁదాండవంబాడు నటభైరవుండు
బోలి"

---

* జై. భా. v - 196.

కందుక నృత్తాదికములు జాయపార్యునిచే నృత్తరత్నావళియందు నిర్దేశితము లైనవి. దీనికి విపుల వ్యాఖ్యానయుతమగు శ్రీజమ్ములమడక మాధవరామశర్మ గారి నృత్తరత్నాకరవ్యాఖ్యనులి శ్రీ కీ.శే. రాళ్లపల్లివారి వ్యాఖ్యనుగాని అను శీలించినగును.

**అథకందుక నృత్తం :**

పద్మగోమూత్రికా నాగచక్ర ప్రభృతిషు స్ఫుటమ్ - వాద్యమానేషు ప్రబంధేఁషు
నానాపాటేషు వాదకైః
దేశీయనర్తన ప్రోక్తప్రబంధేష్వథతాక్రమాత్ - నర్తకీవేషధారిణ్యః సుమధ్యాః
దీర్ఘలోచనాః
పీవరోరుకటీభారాః పీనోన్నతపయోధరాః - స్పర్ధమానాఃమిథః కాంతిరూప
యౌవనవిభ్రమై
హేమ్నా రూప్యేణ కాంస్యేన రచితాన్ దారుణాఽథవా - అంతశ్ఛలదయోగోల
నిక్వాణ ముఖరీకృతాన్
దత్వాఽన్యాసాం నిజాన్ (తద్వత్) గృహీత్వః పరతఃపరాన్ - మిథో వినిమయే
నైతాన్ స్వీకుర్యకదాచన
కుచ వక్త్రీకృతాసక్తాన్ శకుంతానివ కందుకాన్ - కరైరుద్గాపయంత్యస్తాన్
కౌతుకోత్కూల కుంచితాః

ఇతఃపూర్వము పినవీరనార్యుని గీతవాద్యపరిజ్ఞానము ప్రదర్శితము కాగా ఈపద్యమున నాతని నాట్యశాస్త్రప్రజ్ఞ దర్శనీయమైనది. మొదటిపాదమున డాకిని గావించిన నృత్తమున కందుకనృత్తము ప్రస్తావింపబడినది. కందుకనృత్త లక్షణము జాయపార్యుడు నృత్తరత్నావళియందు ఇట్లు వివరించినాడు. దీనిని ప్రమదలు లోహాదిక నిర్మితములగు కందుకములను (గుండ్లను) ఒకరికొకరు విసరికొనుచు నేపథ్యమున వాద్యానుగతముగ గానముచేయబడుచున్న ప్రబంధముల ననుసరించి నర్తింతురు. కావుననే ఢాకినీపిశాచి కందుకముగా నృపకళేబరమును ముద్దగావించి మింటకి విసరుచు నర్తించినదనినాడు కవి.

---

ఉల్లలత్కందుక ప్రాప్తిధావల్లోలాక్షి లీలయా
రచయంత్యవాకాశం సరోమీనాబ్జసంకులమ్
చారీభిర్గతిభిః పాదైర్లాస్యాంగైరపి కోమలైః
నృత్యంతి వనితా తత్ర తత్స్యాత్ కందుకనర్తనమ్
vii — 118 - 125.

అథ దండరాసకమ్ :

"పాత్రాణ్యష్టౌ సమారభ్యవర్ధంతే దండరాసకే
క్రమాత్ చత్వారి చత్వారి నాయకేచ్ఛానుసారతః
చతుష్షష్టిర్భవేద్యావత్ యావత్స్యాద్ధ్వి గుణావరైః
అరత్ని సమ్మితౌ దైర్ఘ్యాత్ అంగుష్ఠపరిణామినౌ
దండౌ కనకబద్ధౌతౌ మదనాదిద్రుమోద్భవౌ
సువృత్తౌ మసృణౌ నానావర్ణకైశ్చారు చిత్రితౌ
దధీరన్ పాణిపద్మాభ్యాం అథవాదండచామరే
ఛురికా దండకాయద్వా తత్తద్దేశీయ-భంగిభిః
ఉత్తేషు వాద్యమానేషు చిత్రబంధేషు వాదకైః
లాస్యాంగ భ్రమరీ పాదచారీభిశ్చారు చంక్రమమ్
సవ్యాపసవ్యతశ్చక్రభ్రాంత్యా ఖండప్రయోగజైః
సకలం పంచభిర్గాతైః కుర్వీరన్ దండఘోటనమ్
నర్తకీ నర్తనే ప్రోక్తా ప్రబంధాస్సకలా అపి
[illegible] వాద్యతేఽత్రయథా నర్తక శిక్షితమ్"
vii - 101 - 107.

ఇక రెండవ పాదమున దంతి దంతమ్ములాతమ్ముగ ద్రిప్పుచు చౌవ దమ్ములకు నాడు పిశాచినీ నృత్తము వర్ణితమైనది. అది నాట్యశాస్త్రలక్షణానుసారిగ పర్యాలోచించిన దండరాసకమగును. దండరాసకలక్షణమును జాయపార్యుడు నృత్తరత్నావళియందు వివరించినాడు. పైని చెప్పిన చెలదాట దండరాసకములు పలువురుగూడి చేయవలసిన నృత్తములు. కాని వీరనార్యుడు వీనిని పిశాచిని, ఢాకిణియను ఒక్కొక్క పాత్రముచే ఆడించినాడు. అట్లు చేయుటకు కారణము విచారణార్హము. వీరనార్యుడీ నృత్తరీతులలో అభిజ్ఞుడైయుండకపోయినచో వాని పేర్లనుకూడ తడివి ఉండెడివాడుకాదు. అట్టియెడల ఏతన్నృత్తరీతిజ్ఞుడైన వీరనార్యుడు బృందనాట్యమును ఏకైక పాత్రముతో నెందులకాడించినాడు అను ప్రశ్నముదయించక తప్పదు. దానికి సమాధానముగ నాకిదితోచుచున్నది. ఇట వీరనార్యుడు వర్ణించినది ప్రకృష్టమైన నాట్యప్రదర్శనముగాదు. అది కేవలము నాట్యాభాసము మాత్రమే. అట్లనుటకు మూదల అద్దానిని నిర్వహించిన పాత్రములు శాకినీ ఢాకిన్యాది భూతగణములగుటయే. ఆభూతప్రేతములైనను ఏతన్నాట్యమును సంపూర్ణముగ నిర్వహింపక వాని వాలకములనుగట్టి ఆడినారు. అంతమాత్రమే బృందము నందైనను విదగ్ధులైన పాత్రములు ఒక్కొక్కరే ముందుండి ఆడుచుండినపుడు తదితరపాత్రములు వారిననుకరింతురు. ప్రాధాన్యత

---

అథఘటిసణినృత్తం

"హుడుక్కాం స్కంధసంసక్తాం వాదయంతీ సఖీమి వ-గాయనైర్గాయసీభిశ్చ వాంశికైశ్చసమన్వితా
చండాల నర్తకీ వేషా(ష?) ధ్వనిశారీరపేశలా - చర్యాప్రభృతిభిర్గీతైః సూడస్థితైరపి
గాయంతీ ధన్వినం క్రీడాకిరాతం పార్వతీపతిం - కాహవైర్మర్ధలైః కాంస్యతాలైః కరట యాంచితైః
వాద్యేషు వాద్యమానేషు యతిప్రహరణాదిషు - గతిభిస్సుకుమారాభిః తాలచ్ఛంద మనోహరమ్
యత్ర నృత్యేదిదం ఖ్యాతం నృత్తం ఘటిసణీవిధిః - ఏవం విధగుణేనైతత్ ప్రయోజ్యం పురుషేణవా॥ నృత్తరత్నావళి 130-134.

ఎట్లైనను ప్రధానపాత్రమునకే యుండును. ఆ తరువాతిపాదమున అజనంబు చెరగుగాధరించి ఒక ప్రేతము దేశీయరీతిలో పాత్రలాడిన లక్షణమునుబట్టి అది భామాకలాపమని అనుమానించుటకు అనువగుచున్నది. వసుచరిత్రమున భట్టుమూర్తి "హరిదంభోరుహలోచనల"ను పద్యమున ఇట్టి తెరగాబట్టిన నేపథ్యమును ఒయ్యనొయ్యన సడలించుటనే సూచించినాడు.

ఆ తరువాతి పాదమున భుజమున కూబరము ధరించుకొని పోలుభేతాళని నటనము ప్రవృత్తమైనది. *ఇది ఘటిసజీనృత్తమని పోల్చుకొనవచ్చును. దీనిని కూడ జాయపార్యుడు వివరించినాడు. ఇందు హుడుక్కావాద్యముభుజముపై మోచికొని పాత్ర నాట్యమాడవలయును. కావుననే హుడుక్కా వాద్యమునకు బదులు కూబరమును ధరించుకొని భేతాళుడు ఆడినాడు. ఈనటనమును స్త్రీ పురుషులెవరైనను చేయవచ్చును. కావున భేతాళని నాట్యమాడించినాడు కవి

**ఇక తరువాతి పాదములలో భూతగణములతో నొర్త కరతాళములు ఘటించుచుండగ చిత్రగతి చకచక ఝూంకృతులతో నఖిలదిక్కులు చలింపగ నటించినదనినాడు. ఇందలి కరతాళములు మున్నగు అట్టహాసములనుబట్టి ఇది భాండిక నృత్తమని వ్యక్తమగుచున్నది. ఈ నృత్తలక్షణమును కూడ జాయ పార్యుడు వివరించినాడు. ఇందు పాత్రము నటభైరవునిపోలి నర్తించినరీతి

---

అథ భాండిక నృత్తం

"వక్త్రోద్భవేషు వాద్యేషు వాద్యానుకరణేషు చ - వర్తమానేషు తాలేన హస్త తాలయుతేన చ

ఖంజ వామన పోగండ వానరాద్యనుకారిణః - శిఖిసారసహేమాక్ష(?) శుకాదిరుతకారిణః

ఖరోష్ట్రసారమేయాది వాశితాను విధాయినః - తైస్తైర్వచోభిః అశ్లీలైః చేష్టితైశ్చ తథావిధైః

ఉత్సారజాయ జాడ్యస్యహాసయుతో విరంతరం - అత్యంతం వామనీభూతః పాత్రైరత్యంత దుష్కరః

యత్ర నృత్యంతి భండాస్తత్ భాండికం నర్తనం మతమ్" -

నృత్తరత్నావళి 126-129.

ఘటిసజీనృత్త నిర్వచనమునకై 77వ పుటను వీక్షింపవలయును.

హేమాక్షమను గ్రామీణులెరిగిన పైడికంటి పక్షి కానోపును.

ప్రోక్తమైనది. ఈ పలుకుబడినిబట్టి ఈనృత్తమున నటభైరవరాగము ప్రయుక్తమగునేమో యనిపించుచున్నది. కొన్ని దేశీయనృత్తములలో నేటికిని ఆనందభైరవిరాగము వినిపించునేమో!

మొత్తముమీద పినవీరనార్యుడీ పద్యమున ప్రకృష్టమైన నాట్యప్రదర్శనమును ప్రవర్తిలజేయకపోయినను ఏతన్నాట్యరీతుల ఆభాసములగు వాలకములగట్టించి యైనను కృతకృత్యుడైనాడు. ఆతని నాట్యాభిజ్ఞత పరితలకవగతమైనది.

ఆ పిదప ప్రసక్తానుగతముగ లవకుశ వృత్తాంతము ప్రవృత్తమైనది. అందు సీతా గర్భరక్షణార్థము గావింపబడిన పుంసవనము వర్ణితము. అట్టియెడ చెలరేగిన వాద్యధ్వానములో భవిష్యత్కథా సంసూచనముగావింపబడి సంగీతక నేపథ్యము ప్రాముఖ్యతనందుకొన్నది. అపుంసవనమున మొరయించిన వాద్యరవము మోహనమై సుకుమారమై చెలగలేదు. అది భేరి, కాహళ, ఝల్లరీ, మురజ గంభీరధ్వనులు దిక్కులందోరమై చెలగినట్లైనది. అది రాబోవు సీతారాములను భవింపవలసిన వియోగభీషణత్వమును సంసూచితముగావించినది.

సీత కుశలవులగన్నపుడు పుష్పవృష్టి మురిసికొని మురజధ్వని పెల్లెగయ విసరినది. కుశలవులు పెరిగి పెద్దవారై వాల్మీకి సన్నిధిని విద్యాభ్యాసముగావించి సంగీత శాస్త్రాన్వితముగ రామాయణగానము గావించిరని తెలుపుచు కవి యిట్లనినాడు.

*"మౌని జల్పితంబైన రామాయణంబు స్వరలయగ్రామమూర్ఛనలసంతు తెలిసి
పాడిరాలాపములన్ ద్రిశక్తకములమెరసి కుశుడు వీణయుతాళంబుగొని లవుండు"

ఇందు ప్రసక్తములైన స్వర, లయ, గ్రామ, మూర్ఛనలు సంగీత సాంకేతిక పదములు ఇతః పూర్వము వివృతములే.

---

* జై. భా. vi - 96.

రామాశ్వమేధయాగమున అశ్వరక్షకుడుగ శత్రుఘ్నుడు చనునపుడు ఘన వాద్యనినాదములు దిశలు వీడ్వడి మ్రోయన్విను వీథులబరచెనని వర్ణితము. చతుర్విధవాద్యములలో ఘనములో హాదిక నిర్మితము.

యుద్ధానంతరము తండ్రికొడుకులుగు రాఘవ లవకుశులు కలిసికొనునపుడు పొగిన వర్ణనలో సంగీతమునకిట్లు ప్రాధాన్యమీయబడినది.

"సంతసమునొంది మునిశిష్యసమితియనుప
నతుల కోదండవల్లకి హస్తులగుచు
జానకీ సుతులరుగుదెంచిరి సమయమెఱిగి
కౌతుకంబున గురుసమక్షమున నిలచి"*

**"ఘోర దురితాపహంబగు శ్రీరామాయణము చదివిరి వివిధమగునా
నా రాగరచనఁదుంబురు నారదులన నఖిలజనమనః ప్రమదముగన్"

జానకీసుతులు సమయమెఱిగి కౌతకమున గురుసమక్షమున నిలిచి ఘోర దురితాపహరమగు వివిధమగు నానారాగరచన తుంబురునారదులవలె చదివిరనుట లోనే పినవీరనార్యుని సంగీతసమయసారాన్వితప్రజ్ఞ ప్రవ్యక్తము.

ఇది తిక్కనార్యుని నిర్వచనోత్తర రామాయణాంతర్గతమగు "ఏమిభంగి యైనను బాడుదు తగుసమయమెఱిఁగి" యను పలుకుబడికి సంవాది.

ఆ పిదప కథానుసారిగ పాడిన పాతాళవర్ణనమున గానరీతి "హాటకేశ్వర భవత దోలాధిరూఢగూఢ పాతకన్యకా గానగుంభమాన తాళకోలాహలముగ [illegible]***

* జై. భా. vi - 248.

** జై. భా. vi - 249.

*** " ii - 70.

అది నాగాధివాసమైనను అట ప్రవర్తిలిన రాగములు దిక్తటములుక్రాలించిన శంఖభేరీమృదంగ విక్వాణభయదరావములైనవేగాని నాదస్వర సుషిర సుకుమారనాదములు కాలేదు. దీనికి కారణము కావ్యగతి వీరరసాన్విత ప్రచోదనా శక్తిభరిత సంగీతప్రవర్తనమే.

కావ్యము ఆదినుండి వీరరసాన్విత ప్రచోదనాశక్తిసంయుత సంగీతము నాలపించినను అంతమున మాత్రము ఏతత్సంగీతబాణిని హర్చిలాలనాసంయుత గానమును ఎత్తుకొన్నది. గీత్యంతమున ప్రవర్తిల్లు మూడు ముక్తాయింపులతోడి మృదంగనాదమువలె కవిత్రయపద్ధతియైన ఆశ్వాసాంత పద్యాంతరిత రాగనామ నిక్షేపణ ధ్వానమిట్లు వినవచ్చినది.

> "గౌళీమానస రాజహంసకు కరీకందర్ప చౌశీకవి
> లాలంకార శశీకరాన్విత విలాసా కల్పలాట కళా
> కేళీ కౌతుక మాళవీ మధుర సంగీతాదరస్వాంతనే
> పాళీ కుంకుమపంకలిప్త కుచకుంభవ్యస్త హస్తాంబుజా" *

ఇట్లు పినవీరనార్యుని రెండుగ్రంథములలో ఒకటి సంగీతకమందలి ప్రథమ శక్తియగు లాలనయును, రెండవది ద్వితీయశక్తియగు ప్రచోదనముతోను నిండారినది.

ఈ గ్రంథ ద్వయాంతరితమున విరించిరాణి సీణాక్వాణనము లలిత లలితముగ భీషణఘోషణముగకూడ ధ్వనించి వీనులకు విందొనర్చినది. పినవీర భద్రుని కవితయందలి సంగీతభద్రతను సర్వతోభద్రముగా వింవినట.

—o—

* జై. శా. viii - 220.

## దగ్గుపల్లి దుగ్గన సంగీతపరచితి

శ్రీనాథునకు బావమఱది దుగ్గుపల్లి దుగ్గన. కవిసార్వభౌమ సకలవిద్యా సనాథ శ్రీనాథమహాకవీంద్ర ప్రసాదలబ్ధ కవితావిశేషుడితడు. కాని శ్రీనాథకవి నాథుని అభిమాన శాస్త్రమైన సంగీతమందు ఏమాత్రము అభిజ్ఞతను ప్రదర్శింప లేదు దుగ్గనార్యుడు.

మామూలు మాటలతో కవిసమయములతో నటనట సంగీతప్రసక్తులు కొన్ని మాత్రమీ గ్రంథమున దొరలినవి.

కృతిభర్తయైన గంగనామాత్యుని సంగీతజ్ఞుడు సకలసాహిత్యకళాసంగత మతియని నుతించియు * తన గ్రంథమున ఎక్కడ సంగీతపాండితిని ప్రదర్శింపకయే ఆతని మెప్పించినాడు.

ఉద్దాలక మహర్షి ఘోటక బ్రహ్మచర్యవ్రతోద్యాపనము చేయింపవలెనని పిప్పలాదబ్రహ్మదేవులు ప్రయత్నించినారు. ఆపట్టున చతుర్ముఖుడదిరోహించి ఏతెంచిన విమానవర్ణనమిట్లున్నది ** "అవ్విమానంబు క్రమక్రమంబున ప్రత్యాసన్నంబగుటయు దన్మధ్యంబున అప్సరోనృత్యంబులు గిన్నరగానంబులు దివ్యదుందుభి నిర్ఘోషంబులుదుంబురు నారదవిపంచీ స్వన కిలకించితంబులు...... గలిసి వింగియంతయు శబ్దమయంబైయుండెనట. ఇంతగ తౌర్యత్రికమునెఱపిన పిదపనది శబ్దమయంబైయుండెననుటకు బదులు నాదమయంబైయుండెననవచ్చును. కాని దుగ్గనార్యుని కంతటి సంగీత హృదయత్వములేదు.

---

* "శృంగారచారుమూర్తికి
సంగీతజ్ఞునకు సకలసాహిత్య కళా
సంగీతమతికి ననంతయ
గంగామాత్యునకు రూపకందర్పునకున్" - నా.కే. i-79.

** నా. కే. పా. - i.

గర్భవతియైన పిదప చంద్రవతి తండ్రియాజ్ఞచే విపినాంతరమున.... పరిత్యక్తయైన పట్టుననాకిన్నర కంఠి విముక్తకంఠియై కెరలెడు దుఃఖఖాపమున నేద్వఁజొచ్చినది. అట మాటవరుసకు ఆమెను కిన్నరకంఠి యనినాడుకవి. అంత మాత్రమేగాని విశేషములేదు.

చంద్రవతికి తృణబిందుడను రాజర్షీంద్రుని ఆశ్రమములో 'ఉభయవంశ తారకుండగు దారకుండు అవతరించిన సమయంబున

"అఖిల భూజనములు నానందమునుబొంది
రమరులు కుసుమవర్షము గురిసి
రప్సర స్త్రీలుసోయగ మెువ్వనాడిరి
క్రమమునఁ గిన్నరాంగనలు పాడి

రురుశుభధ్వనుల నిర్ఝరదుందుభులు మ్రోసె"* నని ప్రస్తావించుటలో గీత వాద్య నృత్యత్రయిగా సంగీతసమగ్ర ప్రసక్తి వినవచ్చినది. శాస్త్రపాండితి మాత్రము ఎక్కడనులేదు. ఇక్కడనులేదు.

ఇక చంద్రవత్యుద్దిలకుల వివాహసమయమున రఘు మహారాజు రాజధాని నలంకరించినతీరులో సంగీతకము కొంతచోటు చేసికొన్నది. అన్నిటితోపాటు నాట్యమందిరములను, గాయకాగారములనుగూడ తారమౌక్తి హారతోరణాదులతో నలకంరించిరట.

"దేవగేహముల భూదేవ సద్మములు
.... .... ........ .... .... .... ........సభా
............ .... ..........వందిమగధ

గాయకాగారమాటు శృంగాటకముల" ** అని నిట నాట్యమందిరములు వేఱుగ, వందిమాగధ గాయనీగాయకాగారములు వేఱుగ చెప్పబడినవి. అం సరస సంగీత మురళీరవములు ఘనఘర్జిత స్ఫూర్తినమకరింపబడినవట. ***

---

* నా. కే. పా. i - 234.

** " ii - 159.

*** " ii - 164.

ఇక సరస్వతీ చతుర్ముఖుల త్తమామలై చంద్రవతీ వధూరత్నమునకు ఆభరణప్రసాధన ద్రవ్యంబులొసగిరట. అపుడామెను సరస్వతీసావిత్ర్యాదులుకై సేసిరి.

> "వారును నట్టులసేయగ
> భోరన సురమద్యదుందుభులు మొరసెను మిం
> పారెడు బర్హిర్ముఖ సర
> నారీ మాంగల్యగీతనాదము నెలమిన్" * అని చెప్పబడినది.

ఇక తల్లిదండ్రుల పెండ్లిలోనచికేతుడు ఒనర్చిన ముచ్చటలు ముద్దుగా ప్రస్తావింపబడినపుడు నాడు పెండ్లిళ్లలో పాడెడు దేశ్యగీతులు ప్రస్తావన ఇటుల వినబడినది.

> "పరిణయద్రవ్య సంపాదనపరులైన వృద్ధపురంధ్రులు నేగుదెంచు........
> తరుణీ జనులు పెండ్లి ధవళంబులు వాడంగ నాగీతములు దానునమవదించు"

ధవళములు, శోభనములు, మంగళములు అనెడివి వివాహాదిశుభకార్యముల నారీజనములు గానముచేయు గీతిరీతులు. అది ఆనాటికి పాలకురికి కాలమునుండి యున్నవియే. బ్రహ్మ్యమగు వివాహమున బాడిన దేశ్యగీతికలలో శ్రీనాథుని కర్ణాటరీతి గోచరించుచున్నది.

వివాహానంతరము పితామహుడు కొడుకును కోడలిని సంబంధిని అభినందించినాడట. అపుడు

దివ్యదుందుభులగు వాదిత్రంబులు విచిత్రధ్వనులం జెలంగి గంధర్వ గానంబులు నప్పరోనృత్యంబులు నుల్లసిల్లెనట.

ఇంతకన్న నెక్కుడగు సంగీతప్రసక్తులీ నాసికేతోపాఖ్యానమున మృగ్యములు. దగ్గుపల్లి దుగ్గనార్యుడు కవిప్రముఖుడైనను ఆతడొనర్చిన సంగీత ప్రస్తావనమాత్రము అప్రముఖము. కావున ఇకమీదట కవిప్రముఖతనుబట్టిగాక సంగీత ప్రతిపత్తియందలి ప్రముఖతనుబట్టి ప్రాధాన్యత నొసగుట సమంజసమగునేమో.

---

* నా. కే. పా. ii - [illegible]

## కౌ అవిగోపన సంగీతాలాపన

అసాధారణ ప్రతిభాశాలియై బహుశాస్త్రప్రజ్ఞాధురంధరుడై ఒవ్వు గోప రాజు సంగీతమునగూడ అందెవేసిన చేతితో తన సింహాసనద్వాత్రింశకలో దర్శన మిచ్చుచున్నాడు. ఎడనెడ శాస్త్రపాండితికి గీతిప్రసక్తులను జోడించుటలో నీకవి ప్రజ్ఞ ప్రదర్శితము.

"మంత్రములేని సంధ్యయును మౌనములేని తపంబు వేదవి
త్తంత్రములేని యాగముఁబదజ్ఞతలేని కవిత్వము వృధా
తంత్రులులేని వీణయును దానకరాగములేని గీతమున్
మంత్రులులేని రాజ్యము సమానములన్నియు వ్యర్థకార్యముల్" *

"సంగీతంబు కవిత్వతత్త్వము సౌజన్యంబు భావంబు స
త్సాంగత్యంబు నెఱుంగడేని భువినాశ్చర్యంబుగా వాలమున్
శృంగద్వంద్వములేని యెద్దతండనఁజెల్లుంద్రు ణంబాతఁడ
య్యాంగీకంబునమేయడా పసుల భాగ్యంబచ్చటఁగల్గుటన్" **

ఈ పద్యములలో మొదటిదానిలో "తంత్రులులేని వీణయు" రాగతాన రహితమగు గీతమును మంత్రులులేని రాజ్యము నిరర్థకమనినాడు. తానకరాగ యుతముగా గీతముండవలెనని గోపనార్యుడనుటలో అంతరార్థమున్నది. గీతము సంగీత ప్రక్రియా విశేషములలోనొకటి. అయ్యది నాడేగాక నేడును ప్రచారములో భంగ్యంతరముగ నిలచియేయున్నది. ఈగీతములలో భగవద్భక్తి గీతములకున్న విలువ మిగిలిన ప్రేమగీతికలకు, విరహవిషాదగీతికలకు ఉండదు. అయినను ఆ గీతము భక్తిభావయుతమగుటయేగాక అయ్యది సంగీత ప్రక్రియా విశేషరాగ స్వరూపము నావిష్కరించు రాగగీతమో, లక్ష్యణ గీతమో అయివుండవలయునని గోపనార్యుని భావన. ఈరాగ గీతములను సక్రమమైన సంప్రదాయపద్ధతిలో గురుముఖతః అభ్యసించిన సంగీత విద్యార్థికి ఆగీతములోనే ఆరాగలక్షణము అద్దాని ఆలాపన అందలి తానప్రకల్పనావకాశము అవగతమగును. తానమనునది

---

* సి. ద్వా. త్రి. i - 101.

** " i - 172.

సంగీతక సాంకేతికము. ఇది ఇతః పూర్వము వివృతమే. తానకరాగయుతముగా గీతియుండవలయునని యుద్దేశించుటలో గోవనార్యుని సంగీతశాస్త్రాభిజ్ఞత వ్యక్తము. ఇక రెండవ పద్దియమున "సంగీత సాహిత్య కళానభిజ్ఞః సాక్షాత్పశుః పుచ్ఛవిషాణహీనః" అను సంస్కృతాభాణకము మఱింత చమత్కృతిసమంచిత మైనది.

కేవలమిట్టి సూక్తిముక్తావళుల గీతిసహకృతితో గూర్చుటేకాక గోవనార్యుడు కథాగతిలో సాగిపోవు సంగీతప్రస్తావనముకూడ సంతరించినాడు. కమలాకరుడను విప్రపుత్రుడు సకలవిద్యల నేర్చి వివేకినైగాని జనకుని వక్త్రముగాంచనని ప్రతిజ్ఞగావించి ఇల్లువెడలి ఎందేనిజనినాడు. ఆ పిదపనాతడు సకలవిద్యలనేర్చి గృహోన్ముఖుడై చనుదెంచుచు మధ్యేమార్గమున నరమోహినియను సుందరిని గాంచి మోహించినాడు. కాని ఆమెను కామించినవాడు ఆమెను ఆశించిన రాక్షసునిచే మడియునని ఎఱిగి ఏమియుచేయలేక తనయింటికే మఱలినాడు. సకల విద్యాపారంగతుడైన తనయునిగాంచి తండ్రియానందించి ఆతనిని పరీక్షించుటకని రాజుకడకుగొంపోయినాడు. రాజసభాస్థానమున ఆతడు అకంపితుడై శాస్త్రపురాణ కావ్యనిగమస్మృత్యర్థములను, సంగీత సంగతిమర్మములను ప్రసంగించినాడు. ఇట్టి శాస్త్రపరిజ్ఞాన విషయములనుగూర్చి ప్రస్తావించినపుడు గోవనార్యుడు శాస్త్రము లన్నిటితోపాటు సంగీతశాస్త్రమునుగూడ చెడవక మానడు. ఈతనికి జ్యోతిశ్ఛంద సంగీతశాస్త్రములు కరతలామలకములు.

ఈ కావ్యమందలి ప్రథమభాగమున రంభా, ఊర్వశుల నాట్యప్రావీణ్య నిర్ణయము విక్రమార్కుడు గావించిన ఘట్టమున్నది. అనంతామాత్యుడు, జక్కనార్యుడుకూడ తమ విక్రమార్క కథాకావ్యములలో ఈ సందర్భమును ప్రస్తావించిరి. కాని గోపరాజు మాత్రము వీరిద్దఱిని మించిపోయి గీతవాద్య నృత్య త్రయాత్మక సంగీతపరిజ్ఞానము పొంపిపోవ ఈ సన్నివేశమును వెలయించినాడు. ఈ నాట్యారంభమునకు ముందుగ ఇంద్రుడు "సాంగ సంగీత విద్యాది కృత్యములమ అమవు మెఱయగడగి నిలువుడనుచు గంధర్వులకుజెప్పి"* ముందు రంభను ఆడుమనినాడట.

---

* సిం. ద్వా. ౧-1-129.

"గంధర్వుల్వడు నాల్గుదోషములు దక్కందాళమానంబులన్
గాంధర్వంబు ధ్రువాప్రబంధసరణిన్ గావింపఁగా వాద్యముల్
ధిం ధిం ధిక్క ధిమిక్క తక్కధికతోం ధిక్కత్తకోజ కిణం
ధింఘాఁయుంకకుయుక్క దిగ్ధాగూడ ధాధీయంచుం బ్రమోసెన్ వెసన్" *

"జంభారి యెదుట నాట్యారంభమ్మున నూర్వశీపరాజయకృతసం
రంభము నూరుద్వయజిత రంభయునై రంభనిలచె రంగస్థలిపై" **

"సురపతి పంపునఁగూడిన మురజధ్వనుల ప్రతిశబ్దములుగా శృంగా
రరసముగురియ నాడెను దిరువుల మురిపెముల యొఱపుఁదీగయుఁబోలె"***

ఇవి నాట్యసంరంభమును వర్ణించు పద్యములు. ఇందలి మృదంగ ధ్వనులను పల్కించిన తీరులో కొరవి గోపరాజు గానము నందెవేసిన చేతితో మృదంగముపైగూడ జతులను పల్కించగల్గిన మహామార్దంగికుడని వ్యక్తమగు చున్నది. ఈ పద్యములకు ముందున్న ప్రస్తావనలో గంధర్వులను సాంగ సంగీతవాద్యాది కృత్యములననువు మెఱసినిలువుడని ఆదేవించియున్నది. సంగీత సమగ్రసాంగో పాంగస్వరూపము గీతవాద్య నృత్యత్రయీ విశేషము. కాన గీతముల గానముచేయువారిని వాద్యముల మెఱయించువారినికలిపి బృందమందురు. అందు వాద్యబృందమందలి వారికుండవలసిన ప్రతిజ్ఞానము, వాద్యమేళనము, దక్షత, అన్యోన్యత, ముఖరియను వాద్యప్రధానిని ముఖ్యాంగకుని తదితరుల ననుసరించుట మున్నగులక్షణములిందు వ్యక్తములు. ఈ బృంద లక్షణములను జాయపార్యుడు నిర్దేశించినాడు. ఇందు ప్రత్యేకముగ ముఖ్యగాయకునిలక్షణములను గూడ జాయపార్యుడు వివరించినాడు. ముఖ్యగాయకునకు సర్వగీతప్రబంధముల పాడగల్గిన దక్షత, తాళధారితదక్షత, ధీరత సమంచిలాతారావప్రభృతి ముఖ్య లక్షణములు అవశ్యకములు. తదనుసారమె గోపరాజు ఈపద్యమునందు లక్షణ

---

* సిం. ద్వా. త్రి I - i - 129.
** " i - 130.
*** " i - 131.

నిర్దేశముగావించినాడు. ఇట రంభానాట్యానుగీతముగ వాద్యముల వాయించువారే గాక పాడెడు గంధర్వులున్నారు. "వారు పదునాలుగుదోషము దక్కంబాడినార" నుట మొదటి అంశము.

సంగీతరత్నాకరాది శాస్త్రగ్రంథానుసారి గుణసందష్ట, ఉద్ఘష్టసూత్కారాదులు గాయనదోషములని అవి యిరువదిఐదని ఉట్టంకితములైనవి. కానిగురికి బెత్తెడు దూరమన్నట్లు గోపరాజు ఏలనో వీనిని పదునాల్గనినాడు. సంగీతశాస్త్ర కోవిదులదృష్టిలో ఇరువదియైదుగ కన్పట్టిన దోషములు సాహిత్యవిదులకు పదునాల్గుగా తోచియుండవచ్చును. పదునాలుగు మాత్రమే పరమదోషములని మిగిలినవి అంతముఖ్యముగావని గోపరాజు భావన ఏమో!

ఇక "తాళయానంబులన్ గాంధర్వంబు ధ్రువాప్రబంధసరణిన్" గావించుట లోనే ఔచితి. జాయపాది సంగీతశాస్త్రకోవిదులు ముఖ్యగాయకునకు సర్వగీత ప్రబంధగాతృత్వము, తాళధారిత ముఖ్యార్హత అనినారు. గోపనార్యుడు గంధర్వులు తాళమానజ్ఞులై ధ్రువాప్రబంధసరణిన్ గాంధ్వరము నెరపిరనుట తల్లక్షణానుసారియె. ప్రబంధములలో ఉద్గ్రాహ, మేళాపక, ఆభోగ, ధ్రువాదికము లవి ప్రభేదములున్నవని సంగీతశాస్త్రమున చెప్పబడినవి. వీనిలో ధ్రువా ప్రబంధమును శార్ఙ్గదేవుడు ప్రబంధములన్నిటికన్న ఖ్యాతిగాంచి అన్వర్థ నామత్వమునందినదనినాడు. ఈ ధ్రువాప్రబంధమున కనుగతముగ ఒక జతి ప్రయుక్తమైనది. అద్దానియందు వినవచ్చిన ధిం ధిం ధిక్క ధిమిక్క తక్క ఇత్యాది మృదంగతక్కారధ్వనులు వాద్యబృందమునందలి ఘనానద్ధవాద్యకారులు ధ్రువా ప్రబంధసరణిలో పాగినపాటకు ఎత్తికోలుగ తాళమునకు కొనుగోలుగ గావించిన

---

1\. అథవాద్య బృందలక్షణమ్ :

"కృతానాం వాద్యకవిభిః వాద్యానామనుశిక్షణం
శ్రుతితత్వంచ స్వవాద్యే గ్రహమోక్షయోః"
"తాలామగత్వ ఐకాగ్ర్యముభయో (గ్యంపుటయో) ర్మేలనజ్ఞతా
వామదక్షిణ దక్షత్వమన్యోన్యస్తుతికారితా
ముఖామవృత్తి (వర్తి?) తాచేత్ వాద్యబృంద గుణామతాః"

నృత్తరత్నావళి - vii - 180 - 81.

లయవిన్యాసమైయుండును. ఇక అద్దానికి ముక్తాయింపు ధిధి గూడ ధాధియంచు మోపెన్ అనుటలో సంపన్నమైనది. గోపనార్యుని తాళమానజ్ఞత నాట్యవిద్యా వైశారద్యము ఇందు ప్రతిధ్వనించినది. తరువాత పద్యములలో రంభయాడు నపుడు మొరసిన మురజధ్వనులు అభ్రశబ్దములగు నురుములవలె ధ్వనించినవని వర్ణితమైనది. వానలేని వరద, వినుకుపడని ఉరుము ఉండదుకదా! కాన అభ్ర శబ్దములై ధ్వనించిన మురజధ్వనుల కనుగతముగ శృంగారమురసమై వర్షింప నారంభింప తిరువుల మురిపెములు మెఱుపులుకాగ మెఱుపుతీగయై రంభ నర్తించినదట. ఈ తిరుపు తిరువస్ఫురితాదులగు దశవిధగమకములలో ఒకటి యగుటయేగాక నాట్యశాస్త్ర సాంకేతికమగు నొకనృత్య హేవాకముగూడ.

ఇంతదనుక మన శ్రవణకుహరములలో వాద్యవిన్యాసమును ప్రతిధ్వనించి దానికనుగతముగ గాంధర్వంబునెఱపి కొరవి గోపరాజు వినుకలిని సమగ్రముగ నిర్వహింపజేసినాడు. లోకమున వినుకలికన్న కనుకలికి ప్రాధాన్యమిచ్చె. కావున రంభానాట్యమున వినుకలికి ప్రాధాన్యమిచ్చి ఊర్వశీనృత్యమున కనుకలికి అగ్రాసనమొసగి కథానుసారిగ అట నటించిన ఆనాట్య పాత్రముల న్యూనతాధిక్యతల చెప్పక చెప్పినాడు.

---

2. అథ ముఖ్యగాయక లక్షణం :
బృందమేలన చాతుర్యం రానిక్యమనురంజనం
త్రిషుస్థానేషు గమకప్రాణగీతి ప్రవీణతా
గంభీర మధుర స్నిగ్ధశ్రావక ధ్వనిశాలితా
శాద్భృక్శారీర సంపత్తి వివిధాలప్తి నైపుణమ్
సర్వగీత ప్రబంధానాం గాఢృత్వం తాలధారితా
విజితశ్రమతా ఉయత్త కంఠతా సావధానతా
నర్తకీ సుకలా.... సేన సమతా (వమిత) స్థాయకారితా
శుద్ధసాలగ రాగేషు భాషాంగాదౌచ కౌశలం
గ్రహేమోక్షేచ దక్షత్వం ధీరతా ఉపాస్త
సర్వరీతిషు వెదగ్ధ్య వశ్చమత్వం సురేఖతా
నృత్తరత్నావళి - vii - 182 -86.

3. ప్రా. ఆం. క. సం. ప్ర. పుట - 40.

సంగీతమున నేపథ్యమునకన్న స్వయంపారథ్యమునకు మన్ననమిన్న రంభానాట్యసంరంభమున మెచ్చతగినది గంధర్వులు నెఱపిన వాద్యవిజ్ఞానము. తదనుగతముగ ప్రయుక్తమైన గంధర్వగానము మాత్రమే. కాని ఊర్వశీ నాట్య విజ్ఞానమున నేపథ్యమునకన్న ఆమె స్వకీయాభినయ వైశారద్యము వ్యక్తము.

కాపురము జేయుతీరు కాళ్లగోళ్లనాదే వ్యక్తమగునను జాతీయమువలె నాకలోక భూలోకనాయకులు అవసరంమిచ్చి సభకేతెంచి సంగీతశాస్త్రిను పారముగ నిలచి విలక్షించుచు నాట్యప్రారంభము గావించుటలోక ఊర్వశీనాట్య శాస్త్రప్రావీణ్యత నిట్లు వ్యక్తమయినది. ఆమె,

**"తనువున గీతాలంబనమును జేతులనర్థ ప్యుషితమును నేత్రయుగంబున భావముంబదములఁదాళ నిర్ణయమ్మును మెఱయఁగ లాస్యమునెఱపెన్.

సురకామిని తన నయనములరుదుగఁదలచుట్టి వచ్చుననుట నిజముగ దిరుగుచు పరిమండలితాంబర వల్లవియై నటించె మరుగొడుగుక్రియన్. ఇది అభినయదర్పణ ప్రతిబింబము.

ఇందు ఊర్వశి నాట్యముచేసినతీరు నభివర్ణించుటలో గోవనార్యుని నాట్య శాస్త్రపరిజ్ఞానము ప్రదర్శితము. ఊర్వశి సుశరీరముతో స్వయముగ గీతాలం బనముగావించినది. చేతులతో అర్థపుష్టిని ప్రకటించినది. అనగా నిందు సంయుతం సంయుతా హస్తప్రభేదములతో పతాక త్రిపతాకాది ముద్రలతో అర్థ పుష్టితము పత్యక్షీకృతము గావించినదనుట స్పష్టము. ఇక నేత్రయుగమున భావముమకూడ ఆమె ప్రకటించినధనుటవలన ముప్పదియాఱు దృష్టులనుబట్టి సాత్వికాది భావములను ప్రకటించుచు ఆయారసములనట ఆమె ఉప్పతిల్ల చేసినదని తెలిసికొనదగును. ఇక పదములఁదాళ నిర్ణయము గావించినదనుటబట్టి

---

"ప్రబంధేషు ధ్రువత్వేన ధ్రువ ఇత్యభిధీయతే"

సం. ర. ప్రబంధాధ్యాయము.

* పి. దా. 1వ. భా. I 133 - 134.

తాళగతిననుసరించి ఆమె నడకలను, అడుగులను సాగించినదను కొనవలెను.*
ఆ పిదప తననయనములరుదుగ తలచుట్టి వచ్చుననుట నిజముగ(దిరుగుచు పరి
మండలితాంబర పల్లవయై మరు గొడుగుక్రియ నటించినదనుటవలన నాట్య
శాస్త్రోక్త శిరోభ్రమరిరీతి ప్రవ్యక్తము గావింపబడినది. మరుగొడుగుక్రియ
నర్తించుటలో ఛత్రభ్రమరి లక్షణముకూడ వ్యక్తమైనది. ఏతల్లక్షణములకు
సంవాదిగ అయ్యప్సర తననయనములరుదుగ తలచుట్టి వచ్చుననుట నిజముగ
పరిమండితాంబరపల్లవయై పరిభ్రమించుట గోపనార్యుడు ప్రస్తావించినాడు. అది
గాక ఊర్వశి ఆహ్వానమున ప్రవ్యక్తమైన కాసెపోసికట్టిన అంబరవిన్యాసయుత
పరిభ్రమణమున వ్యక్తమైన విలాసమున ఛత్రభ్రమరికాలక్షణము సమ్యక్సం
వేదితము. ఈ క్రియ ఊర్వశి ఆడిన విక్రమవరుడిదియ వెఱవరి అనినాడు.
దానికి శక్రుడు ఇది నీవెట్లెఱింగితివని ప్రశ్నించినాడు. అందులకు విక్రముని
సమాధానమిది.

---

* "తదాశిరోభ్రమరికా కథితా నృత్తకోవిదైః - అథవా నిశ్చల తిష్ఠన్
భ్రమయేత్ కేవలం శిరః v - 99
త్వరితం పాణియుగ్మంభ్రమితోత్ఫుల్లపద్మవత్ - ఏషాపి కాథితాత
జ్జ్ఞైః కిరోభ్రమంకీత్యా"
విష్ణుక్రాంతవదుత్క్షిప్య వామాంఘ్రిః కుంచితః పునః - పతనోత్ప
తనైః నల్ప్యైః పాదస్య భ్రమణంజ
యత్రాత్రదక్షిణం కుర్యాత్ సాఛత్రభ్రమరీమతా— v - 87

నేలమీద తలమోపినిలిచి ఆపైకాళ్లు రెండును మీదకెక్కి అడ్డముగత్రిప్పుట
కదలక నిలచి శిరస్సుమాత్రము నిండుగవికసించిన తామర పూలను తిరుగు
చున్న చేతులతో వేగముగ త్రిప్పుట శిరోభ్రమరి అందురు. విష్ణుక్రాంతము
నందువలె. ఎడదుకాలు కుంచితమైయుండగ ఇంకొకపాదము పతనోత్ప
తనములతో వేగముగ అప్రదక్షిణముగ తిరుగుట ఛత్రభ్రమరి అగును.

"ఇద్దరును నాట్యమును సరిపత్తురిందుకా
స్త్రీవగత ప్రసంగముల సాంగముగానిది యాడెగాననే
నల్లే వివరించి యూర్వశియ యెక్కుడుగ
గైకొంటిసన్న సద్దేవుఁడు మెచ్చ"* ఇందు విక్రముని ముఖతః గోపరాజు సంగీతశాస్త్రపరిజ్ఞానమే ఇట ప్రవ్యక్తము.

తదుపరి జీమూతవాహనుని కథనుగూడ సంగీతభంగీ తరంగితముగనె నడపినాడు గోపనార్యుడు. నాయకుడగు జీమూతవాహనుడు "సంగీతాకర్ణనముస జరియింపక వేడ్కఁగనవుమేయకున్న కురంగముల" గాంచినాడు. ఆతడు ఏతత్సంగీత ప్రసంగసాంగత్య కారణముగనుగొనదలచి ఆలయమున ప్రవేశించినాడు. ఇందు హరిణములు సంగీతశక్తిచే మంత్రముగ్ధముల భంగినుండుటలో

"శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తిగానరసంఫణీ
కోవేత్తి కవితారసం ఈశ్వరోవేత్తివానవా" అను సంగీతరత్నాకరకారుని ఆభాణకమునకు లక్ష్యము కుదిరినది. ఈశ్వరునికికూడ అగమ్యగోచరముగానున్న కవితారసముకన్న శిశువులకు, పశువులకు, పాముఁకుకూడ అనుభవైకవేద్యమైన గానరసప్రభావమిట సురుచితమై నాయకునకు ప్రరోచనయైనది. అదియే నాయికాకర్ణనాదిక శృంగారరసాత్మక ప్రచోదనకు కారణమైనది. ఎత్తుగడలోనే నాయికయగు మలయవతిని సంగీతసర్వస్వస్వరూపిణిగ తీర్చిదిద్ది ప్రదర్శించి గోపన అర్వాచీనులగు పెద్దన రామరాజభూషణులకు నాయికలకు ఇట్లు మేలుబంతినొడ గూర్చినాడు. **

---

* వి. ద్వా. త్రి. i - 136.

** వరూథినీ వృత్తాంతము- "తతనితంబాభోగ ధవళాంశుకములోని.."
గిరికావృత్తాంతము : "పీఁబదగుబ్బలు ప్రసేవకవృత్తిదగు గుబ్బి కాయలు కసరంజి: చాయథోనగ" ii - 30.

"చిన్ని చనులమీఁదఁ జేర్చిన వీణియ
చేఁదోడుగా శ్రుతిస్థితులఁదీర్చ
సరిగమపదనుల సప్తస్వరంబుల
గమకంబులయ విభేదములనెఱపి
నాహాఃపృతంబు నవచిత క్రియన్ దంత్రిఁ
బెనగొనె నఖకాంతి గొనలుసాగ
రాగకదంబకంబు రంజిల్లజేయుచు
నాలప్తి వీనులకమృత మొసఁగ
గానరసవశముసఁగనుగవ మోడ్చుచుఁ
బోటిఁగూడవాణి బోటిఁబోలి" * గౌరిబాడుచున్న కన్యకా

రత్నమును చూచెనట బాలఖేచరుండు. ఇది మలయవతి రూపదర్శనముతో పాటు సాగిన సంగీతపాండితి ప్రదర్శనము. ఆమె తన యుత్సంగశాయినియైన వీణియను వక్షస్థలమున హత్తుకొని శ్రుతులఁదీర్చుచున్నది. 'సరిగమపదని' యను సప్తస్వరముల ప్రస్తారమున.... స్ఫురితాది దశవిధగమకంబుల నెఱపుచు లయ విస్ఫూర్తిని నిర్వహించుచున్నది. అపుడామె కొనగోరుమీటిన వీణాతంత్రినుండి ప్రవ్యాప్తమైన నాదము ప్రతిధ్వనించి అమృతము గురియుచున్నది. సూడాది ప్రబంధ విశేషములు సంగీతశాస్త్రములందు ద్వాత్రింశత్సంఖ్యాకములుగ చెప్పబడినవి. అందులో గజలీల, తురగలీల, కలహంసలీల గాథ, క్రౌంచపదాదికముల రాగ కదంబక మొక్కటి. అమలయవతి రాగకదంబకమును రంజిల్లజేయుచు రాగాలప్తులను చేయుచున్నది. ఈ ఆలప్తిలేక ఆలాపనము ఇతఃపూర్వము వివృతము. ఆగానము వీనులకమృతోపమై పండువు చేయుచున్నది. స్వకీయ గాన మాహాత్మ్యమున ఆమెయే కనుగవ మోడ్చుచున్నది. ఇందు సంగీతమందలి వివిధశక్తులగు లాలన ప్రచోదనలలో లాలన పరివ్యాప్తము. ఈ మలయవతీ గానపాండితి ప్రదర్శనమున గోపనార్యుడు సంగీతశాస్త్రనిష్ణాతుడుగనేగాక సంగీత సరసహృదయుడుగగూడ దర్శనీయుడగుచున్నాడు. మలయవతీజీమూతవాహనుల వివాహమును సంఘటితము గావించిన సంగీతము వివాహమందీ రీతిగా ప్రవృత్తమైనది.

---

* సిం. ద్వా. త్రి.-I -v·114.

"అప్సరస్త్రీలు కల్యాణగానంబుల
తెలుఁగొనఁబాడగా....
× × × × × ×
సురలుపరిణమింప సురదుందుభులు మ్రోయ
నారదుండున్ దీవెనలుగఁబాడ
విశ్వమెల్లఁబొగడ విశ్వావసుని కూతుఁ
బరిణయించె ఖచరవరసుతుండు" *

మఱియొకచో గ్రహిలుని కథలో సంగీతకమే ఇట్లు చోటుచేసికొన్నది. మంత్రికుమారుడగు నీగ్రహిలుడు తండ్రిమీద అలిగి దేశద్రిమ్మరియైచని ఎట్టకేలకు సకలకళాప్రవీణుడై శ్రీశైలమునకేగి మఱిగివచ్చుచు ఒక్కచో ఉష్ణకుండమునుగాంచి అందుజనులకువెరచి కెలనంగల శిశిరవారిలో స్నాతుండై యొక్క గుడికేగి అందారాత్రి గడుపనిశ్చయించి అట విశ్రమించెను. అంత అర్ధరాత్రమున ఆయుష్ణకుండమునుండి సాంగోపాంగసంగీతలై ఎనమండ్రు కన్నియలేతెంచి శశిమౌళినర్చించిరి. అపుడు వారు నాట్యసన్నాహము చేయుచో ముందుగానొకతె "నాదవిశోధన (నాదవినోదము) చేయుచుండెనాఁగాహళవట్టి గానగమకశ్రుతి తానవిధానమానఁగన్" ** ఆపిదప "గానభిక్షవేఁడ హీనపర్వంబున వదరుకాయలనంది వచ్చినట్టి పీఱియలకు లయలు విప్పిచెప్పెడు తంగినందు మగురు వాడిరందముగను. ***

ఇంతు వీణానాదానుగతముగ గానము ప్రవర్తితమైనది. ఆపిదప మఱియొక వనిత కాహళమను సుషిరవాద్యవిశేషమునుబట్టి గానగముక శ్రుతి తానవిధానమానగ సన్నాహముగావింపగా ఇంకొక వనిత నాట్యసన్నాహము గావింప గీతవాద్యనృత్యత్రయమైన సంగీత సమగ్రతౌర్యత్రికరీతి యిట్లు వెల్లివిరిసినది.

---

* సిం. ద్వా. త్రి. i - iv - 183.

** " ii - viii - 167.

*** " ii - viii - 168.

"సూళాది గీతములును సుతాళము ధ్రువ
గురులఘు యుతంబులుఁదమలో
మేళనమునఁజెడ కుండఁగఁదాళము
వాయించెనొకతె తద్గతి కొలది" *

"గళరవంబులమర గమకంబులోఁ జేర్చి
. రాగమున మనంబు రంజిలంగఁ
బ్రియుఁడువోలె నధరబింబంబు చుంబించు
నాళ్రగోలునట్టి వనితయోర్తు" **

"మూర్ధునైనబట్టి ముఖరునిఁజేయుదు
ననినభంగి సతిమృదంగమంది
కంకణములు తాళగీతి మ్రోయవాయించెఁ
దొయ్యలులకునెద్ది దుష్కరంబు" ***

"తత ఘనమర్దళాదినినదంబులు నర్వదినాల్గు హస్త....
గతులును దృగ్విలాసములుఁగన్నుల పండుగగాఁగ దాళసరి
గతులు చెలంగఁబాదకటకంబులు మ్రోయగఁబాడియాడెనొ
క్కతె తొలుకాబు క్రొమ్మెఱుఁగుకైవడి దద్రసభావపుష్టిగన్" ****

"ఎలనాగలు మతితమలోపలి నృత్తాంగములు లీదువడనాడుచున్ క్రొన్నెలకాల్వ నీకియఁగొల్పి"రని ఈపద్యములలో సంగీతసమగ్ర స్వరూపము విట్లు ప్రదర్శించినాడు గోవన. మొదటిగా ప్రస్తావించిన సూళాదిగీతములో సుతాళమున ధ్రువగురు లఘుయుతంబుగ తమలో మేళనము చెడకుండ తాళము నొకతె తద్గతి కొలది వాయించుటలో శ్రుతిలయల సమ్మేళనము వానిప్రాధాన్యము

---

* సి. ద్వా. త్రి. II - viii - 170.
** " 171.
*** " " 172.
**** " " 173.

వ్యక్తము. ఇందు గోపనార్యుడు ప్రస్తావించిన సూళాదిగీతములనుగూర్చి ఇంచుక విచారింపవలెను. సూడ ప్రబంధమును సంగీతరత్నాకరకారుడు చెప్పినాడుగాని అది వివరణార్థముగలేదు.

ఇక నృత్తరత్నావళికారుడు చెప్పినది మాత్రము కొంతవరకు అర్థమగుచున్నది. * నర్తనమునచూడ శుద్ధమని సాళగమని రెండువిధములు. ఏలా కరణము, వర్ణసరము, కైవారము ఝూంబడము, త్రిభంగి, వర్తని, ప్రాంత రాసకము, ఏకతాళియనునవి తొమ్మిది శుద్ధసూడ ప్రబంధములు. వీనిని స్వరాక్షరములతో సమముక ధాతుకాకువురు తగినట్లు నిర్మించిన వాద్యములకు సరిగ నృత్తము చేయవలెను. ధ్రువము, మంఠమని, ప్రతిమంఠము, నిస్సారువు, అట తాళము, రాసకము ఏకతాళి. ఇవియేడు సాళగసూడాదిప్రక్రియలు. ఇట్టి సూడాది గీతములను ధ్రువాసహితముగ తాళయుతముగ వాద్యమేళనము చెడకుండ నొక యువతి గీతాంతరిత గీతిభేదములగు విలంబితద్రుతగతుల ననుసరించి తాళము వాయించిదానిని లయాత్మకము గావించినది. మఱియొక యువతి గళరవములమరి యున్నట్లు రాగాలాపమును గమకాన్వితముగ గానము చేసినది. ఈగమకములు తిరుపస్ఫురితాదికములగు దశవిధములని ఇతఃపూర్వము వివృతము. ఆపైన

---

ద్వివిధః చూడః

"శుద్ధశ్చసాలగశ్చేతి చూడః స్యాన్నర్తనే ద్విధా
ప్రాగేలా కరణం వర్ణసరః కైవార ఝూంబడౌ
త్రిభంగిర్వర్తనీ ప్రాంతే (?) రాసకోఽథైక తాలికా
ఇత్యేతే శుద్ధచూడేఽస్మిన్ ప్రబంధాః కీర్తితాః నవ.
ఏషాం స్వరాక్షరైస్తుయం సదృశం ధాతుకాకుభిః
వినిర్మితస్య వాద్యస్య సమానం నృత్తమాచరేత్
సంగీతస్య యదాప్ష్మతం తదా సంగీతముచ్యతే
ధ్రువోమట్ఠః ప్రతిమట్ఠః - నిస్సారుః పాటతాళకః
రాస కశ్చైకతాళశ్చ చూడేస్యుః సప్తసాలగే"

నృ. ర. vii - 80 - 83.

మరియొక ముదిత వాసెగ్రోలు అనగా వేణువు అను సుషిరవాద్యమునుబట్టి అద్దానిని ప్రియునివలె అధరబింబము చుంబించురీతిగా ధ్వనింపజేసినది. మరియొక సతిమూఢునైన ముఖరునిజేయుదునననిన భంగి కంకణములనే తాళగతిగ మ్రోయునొక వాద్యవిశేషముగ మార్చివాయించినది ఇట్లీ పదస్తబకములలో గోవ నార్యుడు రాగాలాపనాయుత గమకాన్విత విశేషసంయుతగానమును అద్దాని కను గతముగ ఒక మహావాద్య సమ్మేళనమును నిర్వహింపజేసినాడు.

ఆ తరువాతి పద్యములలో తతఘన సుషిరానద్ధాది వాద్యనినాదములు సర్వగ అరువదినాలుగు సంయుతా సంయుత హస్తములు దృగ్విలాసములు కన్నుల పండువుగాగ తాళసంగతులుగ పాదకటకంబులు మ్రోయ ఒక్కతె పాడియాడుట వర్ణితమగుటలో గీతవాద్యములకు తగిన నాట్య సన్నాహము సమ కూరినది. అపుడాపాటలో, ఆటలోకూడ రసపుష్టి తొణికిసలాడినది. ఆ నృత్త గానముల సమాచారమును గ్రహిలుడు విక్రమునకు నివేదించినాడు. విక్రముడది విని స్వయముగ అద్దానిని గాంచనేగినాడు. అపుడుకూడ ఆ సుందరీమణులు ఆరీతిగ నేతెంచి నృత్యగానముల గావించిరి. అట్టియెడ

"పంచమాది స్వరంబుల శ్రుతులయాది తాళగతుల యతుల
నాగగేయ గీతగాంధర్వ భేదంబులలవరించి పాడియాడునపుడు" *

విక్రమునికి దృష్టికి ఆ సుందరులు గోచరులైనారు. ఇందు పంచమాది స్వరములు, శ్రుతులు, లయలు, తాళములు, యతులు పరిస్ఫూర్తినొంది పరిఢవ మొందుట ప్రస్తావితము. సంగీతమున శ్రుతిలయలకు కుటుంబమున తల్లి దండ్రులకున్నంత ప్రతిపత్తి యున్నది. "శ్రుతిర్మాతా, లయః పితా" అను సంగీతమున ప్రథమ సిద్ధాంతము. ఇక ఆ సుదతులు గానగేయ గీతగాంధర్వ భేద ముల లవరించి ఆడిపాడిరనుటలోని పరమార్థము, పదపార్థక్యము స్థూలముగ గాంచిన ఏకార్థ బోధకములుగ గానవచ్చును. కాని, ఈ గానగేయ గీతగాంధర్వ

* సిం. ద్వా. త్రి. viii - 186

ములకు సూక్ష్మార్థ వివేచన గావించిన విస్తృతార్థ వివరణమున్నది. గానము నిబద్ధమని, అనిబద్ధమని ద్వివిధము. నిబద్ధము శాస్త్రకార లక్షణాంచితము వాగ్గేయకార లక్ష్యాన్వితము, అనిబద్ధము గాన కాళాకార మనోధర్మ సంయుతము, అది పౌరుషేయమై దేశిరాగములలో కూర్పబడి జనరంజకమగును. గేయము గానానుకూలము. అది ప్రబంధ ప్రక్రియకు చెందిన ధాతువను గానార్హవా ప్రక్రియ, "గేయం నామ సకల ప్రబంధాను గీతోధర్మః" అని సంగీతరత్నా కర వ్యాఖ్య. అది నిబద్ధమైన రాగతాళములలో నుండక ఇష్టానుసారముగ అబలాబాలగోపాలురచే గానముచేయబడును. ఇక గీతమనగ నిబద్ధమైన గాన ప్రక్రియ. "రంజక స్వరసందర్భో గీతమిత్యభిధీయతే" అని సంగీత రత్నా కరకారుడనగ నృత్త రత్నావళికారు డద్దాని.

"శుద్ధైః ఛాయాలగైః యద్వా రాగైరాలప్తి సంయుతాః
ప్రబంధాయత్ర గాయంతే గీతం తదభిధీయతే" అనినాడు. *

ఇక గాంధర్వము అనాది సంప్రదాయమని గంధర్వ ప్రకల్పితమని తెలియుచున్నది. దానికి నృత్తరత్నావళి యంతరితమగు మూమూదలయిది.

"అనాది సంప్రదాయః యద్గంధర్వైః సంప్రయుజ్యతే
నియతం శ్రేయసో హేతుస్త ద్గాంధర్వం జగుర్బుధాః" **

ఇక యతి అనునది తాళసంబంధి. తాళదశ ప్రాణములగు తాళమార్గ క్రియ అంగ గ్రహ జాతి కళ యతి లయయతులలోనిది యొకటి. అంగముల వ్యత్యాపితమైన వేరిక యతియైనది. అది సమ (పిపీలిక) స్రోతోవాహ, గోపుచ్ఛ, డమరుక, మృదంగ విషమములుగా వివిధములు. ఇట్టి సంగీత శాస్త్రాన్విత రీతిలో గీతములు ఆలాప సంయుతముగ తాళగతుల కన్వితముగ నాసుందరులు గానము చేసిరని ప్రశస్తివిడుపులతో గోపవార్యుని సంగీతశాస్త్ర పై దుష్యమే ప్రదర్శితము."

* నృ. ర.

** ఆ. vii - 58

ఇట్లు మహత్తర సంగీత శాస్త్రరీతిలోనేగాక సంగీత ప్రస్తావనలను గోపనార్యుడు కథాగతి ననుసరించి సామాన్య రీతిలోగూడ కొన్ని పట్టుల గావించినాడు:

"దుందుభిమద్దళ ప్రముఖ తూర్యరవంబులు నింద నేర్పున
న్సుందరులాటపాటల వినోదము సూపిరి తీపులంటగన్" *

ఇది వనితల వనవిహార సంరంభమున ప్రయుక్తమైన వాద్యానుకూల గాన ప్రసక్తి.

తెల్లవారినయట్లి తెలుఁగున నావేళఁ
దనమేళనంబెల్ల జనులు వొగడ
హంసనాదములు కాహళులుగఁ దత్ప్రత్న
లఘుతాడనములు తాళములు గాఁగ
మదములఁ గ్రాలు తుమ్మెదల ఝుంకారము
లమరిన వీణాస్వరములో యనంగ
యోగనిద్ర జెందియున్న విష్ణుని మేలు
కొలుపఁగఁ దగు గాయకుండన
బంధు జీవహర్ష భరమూనుఁ దద్రాగ
మయముగా శరత్సమయ మొనర్చె" **

ఇది కథాను గీతముగ సాగిన శరత్కాలిక వర్ణనాంతర్గత సంగీత ప్రస్తావన, హంసనాద రాగములో హంసల కూజితము కాహళ ధ్వనిగా, తత్ప్రత్న లఘుతాడనములు తాళములుగ తుమ్మెదల ఝుంకారము వీణాస్వరముగ వినగల్గిన రాగహృదయుడు సంగీత సహృదయుఁడు గోపనార్యుడు. అందు వలననే తన. అమాన సంగీత శాస్త్ర వైదుష్యముతో సాహిత్యంతోపాటు గీతిని తన ద్వాత్రింశిక గాథలలో సింహాసనా ధిష్ఠతము గావించినాడు.

---

* సిం. ద్వా. త్రి. I - vii - 26.

** సిం. ద్వా. ప్ర. viii-87.

## జక్కనార్యుని చక్కని కవనమున చిక్కని సంగీతము

విక్రమార్క చరిత్ర రచయితయగు జక్కనార్యుడుకూడ కథానుసారిగ 'సంగీతవక్కణ' గావించినాడు. అవతారికనుబట్టి కృతికర్తకేగాక కృతి భర్తకుకూడ సంగీతాభిరుచి కలదని ఆతని సభాస్థాన వర్ణన చాటుచున్నది.

> "దత్తిల భరత, మతంగ, కోహళ ప్రముఖ సంగీత పారంగతులును
> మహిమఁ గొలువగ నాస్థాన మండపమున
> జనితమౌ సాహిత్య సరసగోష్ఠిఁ
> జిత్తంమగురార్త జన్నయ సిద్ధమంత్రి కొలువు
> కూర్చుండి ననువేడ్కఁ బిలువఁబంచి"

"సంగీత విద్యాప్రసంగ పారంగత గాయకేంద్రులు సముఖమున మెలయ" *. జక్కనార్యుని విక్రమార్క చరితమును తనకు కృతి ఇమ్మని అభ్యర్థించినాడట కృతిభర్త. అట్టి కృతిభర్తకు తగిన కృతికర్తగాన కథోప క్రమణమున గాయక గుణవర్ణనమునందే విక్రమార్కుని విద్యాభ్యాసమును సంగీతమయముగ మట్టించినాడు.

> 'ధర్మార్థ కామశాస్త్ర ప్రపంచంబులు
> వల్లవిపాటగా పరిచయించి **

స్ఫూర్తి గీతవిద్యాప్రౌఢి విర్వహించి" **. విక్రముడు మించినాడట; అంతేకాక తన సమగ్ర తౌర్యత్రిక ప్రజ్ఞను విక్రమార్కుడు రంభా, ఊర్వశుల వాట్య శాస్త్ర పరిజ్ఞాన స్పర్థలో చక్కగ వ్యక్తీకరించినాడు.

---

* వి. మా. చ. I-19

** అ. I-106

"అమరపతి పనుపున నమ్మదవతీమణుల రప్పించి తన నర్తన ప్రవర్తన ముల నియోగించినం నంకావ్యలంగోర్వర్థ కావ్యవయవముల చతుర్విధవాద్యముల కమవుగాను, గానంబున కనుతానంబుగ నిట్లు ప్రక్రమించి

"కలికి కన్నుల సోయగము మించుఁ దళుకుల
చెలగెడు మగమీల చెలువునొంద
నభినవస్ఫురణమై నభినయించు కరంబు
లలరుఁగెం దమ్ముల ననుకరింప
నిటలంబున నటించు కుటిలకుంతల కాంతి
కొదమ తుమ్మెదల యొప్పిదముచూప
వలప కంచెలలోని వలచనుంగ నమించి
జక్కనకవభంగి సంభ్రమింప
మంజుమంజీర కంకణ శింజితమున
మదకలహంస నినాదములు దొరయ
సరసగతింబూచి సరసులు సరియన

రంభ సురరాజు ప్రోలన ర్తనమొనర్చె" * ననుటలో జక్కనార్యుడు చతుర్విధాభి నయనములలోని ఆంగి కాహార్యములకు ప్రాధాన్య మొసగినాడు. ఇందు రంభానాట్యములో ఆమె సన్నద్ధమై వచ్చిన తీరులో ఆహార్యపుటింపు అంగికపుసొంపు గోరించినదేగాని నోరెత్తి పలికెడి వాచకపు పెంపగు గానముగాని తద్గీతాను గతాభినయనముగాని వెలయింపలేదు. నాట్యము నందలి ఉత్తరోత్తరోత్కర్షా భావము వ్యక్తము చేయుటలోనే తుది నిర్ణయము ముడివడి యుండును. కావున ఊర్వశీ నాట్య సంరంభమును ఈ తీరున ప్రదర్శింప జేసినాడు జక్కనార్యుడు.

శృంగార మేపార నంగవల్లికయందు
గీతసామగ్రి యంగీకరించి

* వి. మా. చ. ii-90.

కరతలామలకంబుగాఁ గరాంబుజముల
    నర్థమాద్యంతంబు నభినయించి
భావింపనరుదైన భావ మర్మంబులు
    మెఱుగుచూపులలోన మేళవించి
తానమానములలో తాళనిర్ణయలీలఁ
    జరణపల్లవముల సంగ్రహించి
యఖిలముమెచ్చ ప్రత్యక్షమైన యన్వర్థనా
    ట్య విద్యాదేవత నాదనర్చి
భరతశాస్త్ర మర్మజ్ఞతా ప్రౌఢి మెఱసెనూర్వ

శీకాంత వేల్పుబేరోలగమున". * ఊర్వశీ నాట్య సంరంభ వర్ణనమగు నీ పద్యపుఎత్తు కోలులోనే నాచికాభినయము శృంగార మేపార అంగవల్లికయందు గీతసామగ్రి యంగీకరించి యనుపలుకు బడిలో ప్రస్తావింపబడినది. తరువాతిమూడు పాదములలో ఆంగికాభినయనముతోపాటు సాత్త్వికాభినయనపు నిగ్గు తీర్పబడినది. ఊర్వశీకాంత కరాంబుజములలో నమలకమట్లు సంయుతా సంయుత హస్త చాలనాత్మక ముద్రాధారణమున గీతానుగతార్థము ఆద్యంతమభినయింపబడినది. ఇక తరువాతి పాదమున సాత్త్వి కాభినయహేళి ఆమె నిలచి చూచిన చూపులోని హేవాకములో నిట్లు "భావింప నరుదైన భావమర్మంబులు మెరుగు చూపులలోన మేళవించుట"లో ప్రవ్య క్తము. చతుర్విధాభినయనములను వేర్వేరుగా విదగ్ధులుగాని నర్తకులుకూడ నిర్వహింపగలరు. కాని పండిత పాత్రములాడు తీరులోనే ప్రతి చలనచాలన ములో ఈ చతుర్విధాభినయములు ఏకత్ర గోచరించును.

"తానమానములలో దాళనిర్ణయలీలఁ

జరణపల్లవముల సంగ్రహించిన" రీతిలో ఊర్వశీకాంత హెందర్యోత్కర్షాపంయుతముగ పరిపోషితమైనది. సంగీతశాస్త్ర పాండితిలో పరాకోటి ముట్టిన పండితులు తానము రాగాలప్త్యనంతరము నిర్వహించి

* వి. మా. చ. i-91.

తదనంతరము సర్వకల్పనమగు స్వరమానముతో కూడిన పల్లవిని నిర్వహింతురు. ఇది స్వరముల వింగడింపులోని లెక్కనరి ననుసరించి యుండును. అయ్యది త్రిస్ర, చతురస్ర, ఖండ, మిశ్ర సంకీర్ణగీతులలో స్వరస్తబకములు మూడుగ, నాలుగుగ, ఐదుగ, ఏడుగ, తొమ్మిదిగ సాగును. స్వరస్తబకము లను ఆకుకవిత్వమునందువలె వడివడిగ కల్పించుచు దానికనుగతముగ తాళ నిర్ణయలీల ప్రకల్పించుట గానమునందు సాగును. ఇట ఊర్వశీ గానముతో పాటు నృత్యముకూడ నిర్వహింపలెనుగాన తాను ఆ తాళలీలా నిర్ణయమును చరణ పల్లవముల సంగ్రహించినది. అది కేవల గానమైన అట తాళము హస్త పల్లవములతో అమరియుండెడిది. చరణపల్లవములతో అది సంగ్రహింపబడుట వలన ఊర్వశి తాళమును అడుగులతో, నడకలతో నిర్వహించినదనుట గమ్యమానమైనది. ఆ పిదప భావింప నరుదైన భావమర్మంబులు మెఱుగు చూపులలోన మేళవించినదని ప్రస్తావించి రాగాలాపనా సంయుత రాగ భావ మునుగూడ జక్కన చక్కగ వ్యక్తము గావించెను. అటుపిమ్మట తానమాన మను పలుకులలో రాగాలప్తి పిదప తానము గావించుటతోపాటు తాళనిర్ణయలీల చరణపల్లవముల సంగ్రహించి అను పలుకుబడులలో చరణ పల్లవములతో నృత్యవిషయిక తాళమాన నిర్వహణమునే గావించుటేకాక పల్లవియను గాన ప్రక్రియకుగూడ విస్ఫూర్తి నందించినాడు. అంతేగాక ఈ చరణ పల్లవమను మాటలో చరణములకు పాదములను అర్థములుగాక గీతమందలి పల్లవి ప్రతి చరణాంతమున ప్రవృత్తమగుట గమ్యమానము. కావుననే ఇంతటి గీత నృత్య ప్రౌఢిని ఊర్వశి ప్రదర్శించినదనుటకు ప్రతీకగా "అఖిలములను మెచ్చ ప్రత్యక్షమైన నాట్యవిద్యా దేవతగ నాదనర్చినది." భరతశాస్త్ర మర్మజ్ఞత ప్రౌఢి మెఱసె నూర్వశీకాంత వేల్పుపేరోలగమున"నని కథానుగతముగ తన తౌర్య త్రిక ప్రతిభాస్వాంతముతో ప్రస్తావించినాడు జక్కన. అది విక్రముని తుది తీర్పుగ నిట్లు రూపు దిద్దుకొనుటకు మూదలయైనది.

"సర్వజగంబులన్ నటనచాతురిఁదాఁగడు బ్రోడనంచు దు
ర్గర్వముపూని శాస్త్రనీతిగ్రైకొనన్నొల్లక రంభయాడె నీ
యూర్వశి శాస్త్రసమ్మతసముజ్వల మార్గము దప్పకుండగాఁ
బర్వమొనర్చె నిప్పటి సుపర్వుల కెల్లఁ గళాప్రవీణన్" *

---

* వి. మా. చ. ii-93.

ఈ ఒక్క సన్నివేశమేగాక ఎడనెడ కొన్ని సంగీత ప్రసక్తులనుగూడ కవి కథానుగతముగ గూర్చినాడు. ఒక చోవర్షర్తు వర్ణనమును నాట్యరంగోప మానముతో మనోజ్ఞముగ తౌర్యత్రికరీతి నిట్లు సంతరించినాడు.

"లలిత గీతిన్మయూరికలు లాస్యమొనర్పగ భేక జంపతుల్
కలకలనాదముప్పెలగ గర్జన వాద్యములుల్లసిల్లంగం
దళకుసుమాంజలుల్ వెలయ నర్తనశాల యనందనర్చనీ
తలము విచిత్రవారిద వితాన తిరస్కరణీ సమేతమై" **

ఇట్లు చక్కని కవనమున చిక్కని 'సంగీత వక్కణ'ము గావించి జక్కనార్యుడు, తన విక్రమార్క చరిత కావ్యమును తౌర్యత్రిక సంయుత ముగావించి చరితార్థుడైనాడు.

---

** ,, iv.35.

## అనంతుని కవితలో కొంతగ సాగిన సంగీత సాంకేతిక ప్రసక్తి

గోపన జక్కనవలెనే అనంతుడు తన భోజరాజీయమున విక్రమ కథా సంధానమును సాగించినాడు. ఈ కవి కథాకథనమందు జరిపిన ఆసక్తి కళా పోషణమున జూపలేదు. అట్లని సంగీతమున నాతడు పూర్తిగ అనాసక్తుడనుటకు వీలు కాకుండ ఒక్కచో ఒక్కుమ్మడిగా మౌలికములైన నాలుగు సంగీతశాస్త్ర సాంకేతికములను రెండు రాగనామములను ప్రయుక్తము గావించినాడు. శాంభు డనువాడు

* "వధూ మృదుగీతనాదముల్విని"** "ఇవ్విధంబుగ రాగపోషణచేసెడి కీరవాణి యెవ్వరి తీయని ప్రశ్నించినాడు"

"ఈ రాయముల్ సేయులతాంగి యాంగిరస"యని యొక యవ్వ సమాధాన మొసగినది. ఇట సంభాషణములో విన్పించిన గీతము, నాదము, రాగపోషణము, రాయము అనునవి స్వచ్ఛములగు సంగీతశాస్త్ర పారిభాషికములు, కీరవాణి లతాంగి యనునవి రాగనామములు. ఈ సాంకేతిక పదములు ఇతః పూర్వము వివృతములు, రాగనామములు ప్రసిద్ధములు. ఇంతకు మించిన సంగీత ప్రస్తావన ఈతని కృతిలో నా పరిశీలనమునకు అగోచరమైన అయినను ఈ కవికి సంగీతమునగల ప్రజ్ఞ చిలుక పలుకులవలె శ్రుత పాండిత్యమను సాహసమే యగునుగాని సత్యము కాజాలదు.

---

* భో. రా. v-222

** ,, v-223

*** ,, v-224

# ఎఱ్ఱయ నృత్యగానపరిచితి

కొఱవి గోపన సమకాలికుడగు ఎఱ్ఱయామాత్యుడు "సకల నీతికథా విధానమ"ను పేరుతో విక్రమార్క కథలనే రచించినాడు. కవి ధ్యేయము కథా గానము. కావుననే కళావిషయ మునంతగా దృష్టినుంచలేదు. ఈతని తోటి కవు లగు గోపజక్కనలు ద్వాత్రింశత్పుత్రికా సింహాసన ప్రాప్తి విక్రమార్కునకు గల్గిన పట్టున కథాఖ్యానము గావించినపుడు సమగ్ర సంగీత తౌర్యత్రిక రీతిని వెలివిరియింప జేసినారు. ఎఱ్ఱయ ఈ పట్టున సంగ్రహముగ నాట్యరీతిని మాత్ర మిట్లుట్టంకించినాడు.

> "భరతాచార్య మతంబున
> నౌర వట్టగరాని నృత్య మూర్వశి చూపెన్
> వరుసన్ దత్తిళమతమున
> పరసముగ నాడె రంభ శక్రుడుచూడన్" *

"అపుడు ఇంద్రుడు విక్రమార్కుని చూచి ఈ యిద్దరిలోన శాస్త్ర సిద్ధంబయిన నృత్యం బెవ్వరిదనిన నతండిట్లనియె"

> "అంగములు ప్రధానమ్ములు
> పాంగప్రత్యంగములు రసాస్పద భావం
> బంగికరింపవని యిది
> పంగతి గాదనిరి భరతశాస్త్రవిధిజ్ఞుల్" **
> "అంగప్రత్యంగములే
> యంగీకరణంబుగాగ నాడెనురంభా
> భంగులు శాస్త్రక్రియలను
> భంగంబగునంద్రుచూడ భరతవిధిజ్ఞుల్" ***

---

* న. నీ. క. వి. i.333

** „ i.335

*** „ i.336

మఱియు రంభశుద్ధాంగ విధాంగ దేశిమార్గ నృత్యముల నిపుణత చూపినది. "ఊర్వశి మత్తల్లి, హల్లీసక, ప్రేక్షణి, ఫేరణి కుండలి దండలాసకాది నృత్యములచూపినది. విధాంగ లక్షణంబగుటకు శుద్ధాంగములు ఉత్తమములగుట ఊర్వశి మేలనిరి.

ద్వాత్రింశత్పుత్రికాయుక్తంబైన సింహాసనమిచ్చి అనిపిన విక్రమార్కుడు పురమునకు వచ్చి తత్సింహాసనారూఢుండై రాజ్యముచేయుచుండెను.

ఇందు ఎఱ్ఱయామాత్యుడు భరతాచార్య మతము వేఱని, దత్తిళ మతము వేఱని నాట్యమున రెండు తీరులున్నవను విషయమును ఎవరు చెప్పనిరీతిలో చెప్పినాడు. అదిగాక అంగ ప్రత్యంగోపాంగములు అంగికరణంబగుడు అట్లాడుటలోని గుణవిశేషములోని న్యూనాధికతలను ప్రత్యేకముగ చెప్పినాడు. మఱియు శుద్ధాంగ, విధాంగ దేశీమార్గ నృత్యములని నృత్య రీతులలోని విశేషములనుగూడ చెప్పెను. ఈతనికి గీతవాద్యముల మీదకన్న నృత్యముమీదనే మక్కువ ఎక్కుయనిపించెడిని. ఇంతకుమించి ఈ కావ్యమున సంగీత ప్రసక్తులు మృగ్యములు. ◻

## కవిగాయక సార్వభౌమయుగము పోతనార్యాంధ్రీకృత నాదాంతర్వాణి

"పలికెడిది భాగవతంబని పలికించెడి వాడు రామభద్రుండని
పలికిన ప్రతిపలుకున రసఝురులొలకించి నింపిన
శబ్ద స్వరాలంకార రస శిల్పిశ్రీరామనామ నాదోపాసకా!
మధుర భక్తకవి గాయకా! పోతనార్యా! నమస్కృతులు నీకు"

## పోతనార్యయుగాంతరితులగు మహాకవుల సంగీత ప్రతిపత్తి

1. పోతనాది మహాకవుల నాదోపాసనారీతి.
2. వెన్నెలకంటి సూరనార్యుని విమల సంగీత విజ్ఞత.
3. పద్మపురాణకర్త మడికి సింగన సంగీత పరిచితి.
4. ప్రథమాంధ్ర యుగళకవుల సంగీత ప్రీతి.
5. గౌరన గాన గౌరవము.
6. కదిరిపతి రవ రాగరమ్యత.
7. వెన్నెలకంటి అన్నయ్య గానాభిరుచి
8. తాళ్ళపాక తిరువేంగళ నాధుని సంగీతపరిష్కారములు.

# పోతనాది భాగవతకవుల నాదోపాసనారీతి

భక్తిజ్ఞాన- వైరాగ్యములను నీ త్రివిధ మోక్షసాధన మార్గములలో భక్తి ఆద్యము. ఇది ముముక్షువును పరంధామమునకు చేర్చు చక్కాని. రాజ మార్గము. ఏతన్నిర్వాణ ప్రస్థానమున పాథేయము నాదోపాసనయైన దాని కుపాదేయము -సంగీతము. భక్తి భావ భరిత నిర్మలస్వాంతుడై పోతనార్యుడును అతని యనుయాయులును భాగవత రచనమును నారాయణ భజనకు ప్రతీకగ నిర్వహించిరి. కావుననె యిందు సంగీత ప్రభావము అంతర్గతమై భగవద్గుణ గానయుతమై పలుకుబడికారమున పదసంయోజనమున రాగరస సమంచితమై ధ్వనింపినది. అట్టి భావన భాగవతమందెల్లెడఁ గాననగును. ఈ భావన కాకరము మొదట నారద చరిత్రమందే గోచరము.

"వారల్ కృష్ణచరిత్రముల్ చదువఁగాఁబాడఁగా
నారావంబు సుధారసప్రతిమమై యశ్రాంతమున్ వీనులం
దోరంబై పరిపూర్ణమైన మది సంతోషించి నేనంతటం
బ్రారంభించితి విష్ణు సేవకితరప్రారంభ దూరుండనై" *

ఇట్లు విష్ణు గుణగానమున నారదుడు "మహావిష్ణుని యనుగ్రహంబున నడ్డంబులేక ఈశ్వరదత్తమై బ్రహ్మాభి వ్యంజకమైన సప్తస్వరంబులు దమ యంతన మ్రోయుచున్న యీ వీణాలాపనజేసి నారాయణ కథాగానంబు సేయుచుఁ జరియించుచుండె" నట.

"తీర్థపాదుండైన దేవుండు విష్ణుండు
తన చరిత్రమేన దవిలిపాడఁ
జీరఁబడ్డ వాని చెలువున నేతెంచి
ఘనుఁడు నామనమ్మునఁ గానవచ్చు" ***

---

* భాగ. i.197

** ,, i.129

*** ,, i.130

ఇది కేవలము నారదుని స్వానుభవమగుటయేకాక పోతనార్యునకుగూడ స్వానుభూతి యగునేమో యనుపించుచున్నది. ఇందు సంగీతము సాహితీ సహకృతమగునపుడు వ్యక్తమగు ప్రత్యక్ష ప్రభావము వ్యక్తము. ఇంతటి సంగీత సమంచిత భక్తిభావ భరిత స్వాంతుడగుటచే నారదుడు సూతునిచే గొనియాడబడినాడని చెప్పుచు పోతనార్యుడు సాహితీవిదులగు సంగీత కోవిదు లందరికి నన్వయించు రీతిలో నుతించి తన గానాభిమానమును ఇట్లు వ్యక్తము చేసెను.

"వాయించు వీణనెపుడు
ప్రోయించు ముకుంద గీతములు జగములకుం
జేయించు జెవుల పండువు
మాయించు నఘాళి నిట్టి మతి మఱిగలఁడే" *

ఏదేని యొకశాస్త్ర ప్రభావము కళాప్రభావముగాని మఱియొకదానిపై నాల్గు రీతులలో ప్రసరించును. అవి ప్రత్యక్ష, పరోక్ష, అతి పరోక్షాంతర్గత ప్రభావములనుట పరిశోధకులందరు ఎఱిగినదే. ఈ చతుర్విధ రీతులలో పోత నార్యుని కవితపై సంగీతము ప్రత్యక్ష ప్రభావము నెఱపి నాదోపాసనా రీతియై సాక్షాత్కరించినది. పరోక్ష, అతి పరోక్ష ప్రభావములు రాగనామముల రాగ ముద్రాలంకార ప్రతీకలతో నిక్షేపించుటలోను సాంకేతిక పదజాలముల సార్థకతను నిర్వహించుటలోను నియంత్రితములైనవి. ఇక నంతర్గత ప్రభావము పోతనార్యుని కవితలో నన్నపార్యుని కవితయందున్నవె అక్షత నాచరమ్యమైనది. అది పదసంయోజనములో శబ్దాలంకారములను, స్వరసంయోజనమున స్వరా లంకారములను దలపించుటలో సార్థకమైనది. ఈ కవివరుని కవితలో శబ్దాలంకార ములగు ఛేకానుప్రాస; వృత్త్యనుప్రాస, ముక్తపదగ్రస్తాలంకారముల ఛాయలలో సంగీతమందలి స్వరాలంకారముల యొదుపులు ధ్వనించినవి. సహజముగ కవిత్వమునందు అనుప్రాసాది శబ్దాలంకారములు ప్రయుక్తములైన కవులకు మోదము, అలంకారికుల కామోదము మిన్నగా నుండును. వీనియందు సాజమగు

* భాగ. i-134

శాబ్దికచండ తాండవమేక శ్రుతి సుఖ ప్రతిపాదకమగు సుకుమార పదలాలి త్యముగూడ లయానిత్యమై ప్రర్శితమగుట యొకవిశేషము భగవద్గుణ గాన మున కనుగతముగ తంబుర ధ్వనించుచుండగ చిటితాళములు మొరయించుచు భక్తి భావావేశములో నుతులను స్తుతులను కీర్తనలుగ కూర్చి పాడుటకు అనువగు శబ్దాలంకారశ్రుతి పోతనార్యుని కవితయందు శ్రుతితోడి లయవలె. అంతర్గతమై అనవరతము భాసించును. ఇట్టి శబ్దాలంకారములలో ప్రసిద్ధములగు ఛేకానుప్రాస, వృత్త్యనుప్రాస, ముక్తపదగ్రస్తాదికములన్నియు స్వరాలంకారము లకు దగ్గరిచుట్టములై పోతనార్యుని కవితలో ప్రతిభాసించినవి. అట్టిని కొన్ని మచ్చునకు.

"ధరనెడలేక రెండు రెండక్షరంబు

వెనయ నియమంబు ఛేకమౌనెట్లటన్న" * అను లక్షణము కలిగిన ఛేకమునకు లక్ష్యము పోతనకవితలో నిట్లమరియున్నది.

"పల్లవ వైభవాస్పదములు పదములు
కనక రంభాతిస్కారులూరు
ఆలరుణ ప్రభామనోహరములు గరములు
గంబు సౌందర్యమంగళము గళము
మహితా భావాభావ మధ్యంబు మధ్యంబు
చక్షురుత్సవదాయి చన్నుదోయి
పరిహసితార్ధేందు పటుంబు నిటలంబు
జితమత్తమధుకరశ్రేణి వేణి
బావజాశుగముల ప్రాపులు చూపులు
కుసుమ శరునివిడుల కొమలు బొమలు
చిత్తతోషణములు చెలువ భాషణములు
జలజనయన ముఖము చంద్రసఖము" **

ఈ ఛేకాలంకారమునకు సంగీతమందు "ఊర్మి" యను అలంకారమునకు

---

* కాం. సం. iv - 75.

** భాగ. x - 1711.

పోలికయున్నది. ఈ ఊర్మి లక్షణము సంగీతరత్నాకరమున వివృతము. ఇద్దాని స్వరావృత్తి "సమత సమరిపత గద్యత గధమనిత" అని యిట్లు సాగిపోవు సమత సమరిపత రిపలరెపరెపలలో ఛేకమందలి ఊటలూరుటు మంగళము గళము అను నక్షరవృత్తి పైని నుదాహృతమైన పద్యమున గోచరించును. అట్టిదే ఆక్షేపమను నది మఱియొక స్వరాలంకారమగును. దాని లక్షణముకూడ సంగీతరత్నాకరము నందేయున్నది. దానికుదాహృతమగు స్వరవల్లరియిది. "సరిగ,రిగమ-గమప-మపధ-పధని-ధనిస" అనుచు నిద్దాని స్వరప్రస్తారము సాగిపోవుచుండును. ఈ స్వర స్తబకములలోని సరిగలోరిగము క్తమై గమలో రిగగమఅల గ్రస్తమైనది. ఈ ముక్త స్వరగ్రస్తరీతిలో కవిత్వమందలి ముక్తపదగ్రస్తాలంకారము స్ఫురించును. ప్రసిద్ధమగు నీ అలంకారమునకు పోతనార్యుని కవనమందుదాహరణములసంఖ్యా కములు అయినను మచ్చునకొకటి రెండు.

"పున్నాగ కానవే పున్నాగవందితు
బంధూక కానవే బంధుమిత్రు
మన్మథ కానవే మన్మథాకారుని
వంశంబ కానవే వంశధరునిఁ
జందన కానవే చందనశీతలుఁ
గుందంబ కానవే కుందరదను"
"మానినీ మన్మథు మాధవుఁగానరే
సలలితోదార వత్సకము లార
సలలితోదారవత్సక పైరిఁగానరే
సుందరోన్నత లతార్జునములార
సుందరోన్నత తతార్జునభంజుఁగానరే
ఘనతరలసద శోకంబులార
ఘనతరలసదశోక స్ఫూర్తిఁగానరే
నవ్యరుచిరకాంచనంబులార" *

---

భాగ. x - 108 - 112.

ఈపద్యములలో స్ఖలితమను స్వరాలంకారము గోచరించును. దానిలక్షణము కూడ సంగీతరత్నాకరమందున్నది. ఇద్దాని స్వరావృతి "సగరిమమగరిస రిమగ పపగమరి - గమమధధమపగ - మపగసపగమగ" ఇట్లు సాగిపోవు స్వరావృతిలో పలుమారు గాంధార స్వరమొక్కటే పునరావృతి నొందినది. దీనిని పోలిన ఒక్క అక్షరావృతికే ప్రాధాన్యమిచ్చెడి వృత్త్యనుప్రాసమను నలంకారము కవిత్వమునందున్నది. దాని లక్షణమిది.

"ఒక్క వర్ణంబు కడదాక బరగుజృంభణ వృత్త్యనుపాసమయ్యె" * ఈ లక్షణమునకు లక్ష్యములుగ పోతనార్యుని కవనమునుండి మచ్చునకు ఒకటి రెండు—

"బాలరసాల సాలనవ పల్లవ కోమల కావ్యకన్యకం
గూళలకిచ్చి యప్పడుపుఁగూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైననేమి గహనాంతర సీమలఁగందమూలకౌ
ద్దాలికులైననేమి నిజదారసుతోదర పోషణార్థమై"**

"మందార మకరంద మాధుర్యమునఁదేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మల మందాకినీ వీచికలఁదూఁగు
రాయంచచనునె తరంగిణులకు
లలితరసాల పల్లవఖాదియై చొక్కు
కోయిల చేరునే కుటజములకుఁ
బూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరకం
బరుగునే సాంద్రనీహారములకు"***

ఇందలి ప్రథమ పద్యమందలి లకారావృతి, ద్వితీయ పద్యమందలి మకారావృతి స్ఖలిత స్వరాలంకార లక్ష్యమందలి గాంధార స్వరావృతికి సంవాది.

---

* కా. పం. - iv.

** భాగ. 4 పు. (వావిళ్లప్రతి).

*** ,, vii - 150.

పరిపాకమును నిర్ణయించుటకు అన్నమునంతటిని పట్టిచూడవలసి అక్కర యుండదు. కావున పోతనార్యుని కవనమందలి శబ్దాలంకారములు, సంగీతమందలి స్వరాలంకారములకాప్త బంధువులని ఇంతకన్న మిన్నగ సాహితీవిదులకు, సంగీతకోవిదులకు మనవి చేయనక్కఱలేదు.

ముముక్షువులైన పోతరాజ త్యాగరాజాదుల కవనమునందలి శబ్దాలంకారములలో మంత్రజపములోని ఒడుపులు సిద్ధించినవి. అదికూడ వారి నాదోపాసనారీతికి సహకృతములైనవి. అలవోకగ సిద్ధించిన సంగీతగుణమేకాక పోతనార్యుని కవనములో నాతని సంగీతశాస్త్రపాండితికూడ ఎడనెడ వ్యక్తమైనది. శ్రీకృష్ణుని రాసకేళి వర్ణనముగావించు సందర్భమున ప్రదర్శితమైన ఏతచ్ఛాస్త్ర పాండితి పరిశీలనార్హము.

> "సాంద్ర శరచ్చంద్ర చంద్రికా ధవళిత
> విమల బృందావన వీథియందు
> రాసకేళీ మహోల్లాసుఁడై యుత్ఫుల్ల
> జలజాక్షుఁడొక నిశా సమయమునను
> దనరారు మంద్రమధ్యమతారములనింపు
> దళు కొత్త రాగభేదములఁజెలఁగి
> దైవత ఋషభగాంధార నిషాదపం
> చమషడ్జ మధ్యమ స్వరములోవిఁ
>
> గళలు జాతులు మూర్ఛనల్ గలుగ వేణు
> నాళ వివరాంగుళిన్యాసలాలనమున
> మహితగీతిఁబాడెనవ్యక్త మధురముగను
> బంకజాక్షుండు దామపుఁబంకురింప"*

ఈ పద్యమునందు సంగీతశాస్త్రసాంకేతిక పదజాలములెన్నో ఉట్టంకితము లైనవి. పల్లవిగా పాడుకొనుటకు ప్రథమపాదములో చంద్రికారాగనామము "చంద్రికా ధవళిత విమల బృందావన" మను పలుకుబడిలో సంసూచితమైనది.

---

* భాగ. 11 - 188 - 89.

ప్రాచీన కవులకు తమ పద్యములను గానము చేయవలసిన రాగములను తామే సంసూచనముచేయు అలవాటున్నది. అదినన్నె పార్యుని సారమతినుండియున్న పద్దతే. ఈ పద్యమునందు పల్లవిగా చంద్రికారాగము ప్రారంభమైనను పాడెడు వాడు బ్రహ్మగాంధర్వకోవిదుడగు జలజాక్షుడుగాన దానిని రాగమాలికగాగూర్చిన గాని ఆయితని స్థాయికి సరిపోదు. అందులకే ఆ జలజాక్షుడు మంద్రమధ్యమ తారస్థాయిలతో నింపు తళుకొత్త త్రిస్థాయీ సంచారముచేయుచు,రాగభేదముల జెలగి మ్రోయించినాఁడనినాడు. అపుడు దైవత, ఋషభ, గాంధార, నిషాద పంచమ షడ్జ మధ్యమ స్వరములు వ్యత్యస్తములుగ నుండుటగాక ఓలిగ అనగా ఆరుగ ప్రస్తారము ననుసరించి క్రమానుసారము పలికినవట! అనగ ఈ స్వరములగోలి పలికించుటలోనే ఆరోహావరోహణములేర్పడి వివిధరాగములు పాడుటకు అవకాశము కలుగును. అపుడాయా రాగములలో కళలు, జాతులు, మూర్ఛనలుగల్గవేవేణువృత్తిదారువులంకురింప బూరించినాడట ఆనాదమహాయుడు గోపాలబాలకుడు. ఈ పలుకుబడులలో నుత్తములైన కళ, జాతి,మూర్ఛనయను సాంకేతిక పదములవెనుక నెంతయొ వివరణము దాగియున్నది. సామాన్యముగ జనసామాన్య వ్యవహారమున కళలను పైచుటయనగ సంగతులు వేయుటయే. కాని సంగీతశాస్త్రమున కళయనునది తాళాంగముగ తాళదశ ప్రాణములలో నొక్కటిగ విహితమైయున్నది. అది అత్యంత సునిశితమైన తాళాక్షరకాలమును సంసూచించును. ఈ కళలు ఏకకళ, ద్వికళ, చతుష్కళలని ఒకటి రెండు నాలుగుగ అక్షరకాలముల భాగములను తెలుపును. దీనినిబట్టి గోపాలస్వామివారు ఆ నృత్యమును లమాత్మికముగ నిర్వహించిరని అట మ్రోగిన మురళీరవము తాళలయాత్మికమై అందలి లవలేశభాగముకూడ సమగ్ర నిర్వహణమున కృతార్థ మైనదని అనుకొనవలయును.

ఇక జాతి. దీనికి సంగీతశాస్త్రమున శ్రుతి రాగ తాళ విషయకము త్రిభంగుల వివరణములున్నది. ప్రప్రథమమున శ్రుతి విషయకముగ వివరింపదొరకొనిన సంగీతశాస్త్రమున ద్వావింశతి శ్రుతులకు పంచజాతులలో రీతులు క్తములైనవి. అవి దీప్త, ఆయత, కరుణ, మృదు, మధ్యమములనునవి. ఇక తాళానుగతమను జాతి లక్షణము. తాళదశ ప్రాణములగు కాలమార్గ క్రియాంగగ్రహజాతి కళాలయ యతి ప్రస్తారములలో జాతి ఆఱవది. ఇద్ధి లఘువులతోగూర్చిన తాళమానముల

మాత్రము తెలుపును. ఈ లఘువులు ఐదుజాతులుగ విభజింపఁబడియున్నవి. అవి యివి.

1. చతురస్రజాతి లఘువు : నాలుగు అక్షరకాలములుగ 'తకధిన' అని పలుకబడునది.

2. తిస్రజాతి లఘువు : మూడక్షరకాలములలో 'తకిట' అని పలుకబడునది.

3. ఖండజాతి లఘువు : ఐదక్షరకాలములలో 'తకతకిట' అని పలుకబడునది.

4. మిశ్రజాతి లఘువు : ఏడక్షరకాలములలో 'తకిటతకదిమి' అని పలుకబడునది.

3. సంకీర్ణజాతి లఘువు : తొమ్మిదక్షరముల కాలములలో 'తకధినతకతకిట' అని పలుకబడును. ఇవి లయవిన్యాసమునకు ఆద్యమును ఆధారమునుకూడ. చివరి జాతిని ప్రాచీన సంగీతపద్ధతియందలి రాగాత్మకరీతికి లక్షణముగ చెప్పవలయును. ప్రథమ రాగపద్ధతిలో జాతిరాగమునకు పర్యాయముగ చెప్పబడినది. అవి సప్తజాతులుగ ఉత్తములైనవి. అవి షాడ్జి, నిషాది, ధైవతి, ఆర్షభి అనునవి. అది షడ్జగ్రామమునకు చెందినవి. గాంధారి మధ్యమ పంపమము మధ్యమ గ్రామనకు చెందినవి. ఇవి రాగోత్పత్తికి మూలములైనవి. ఇంతటి సంగీతశాస్త్ర విహిత ప్రక్రియను అలవోకగ జెప్పగలిగిన పోతనార్యుడు కవనమునేగాక గానమునఁగూడ సహజ పాండిత్యుడను బిరుదమున కర్హుడనవలె. కాని, ఆతడీ శాస్త్రపాండితిని ప్రకర్షించుటకెక్కడ ప్రయత్నింపక దానినిగూడ నాదోపాసనారీతి కుపకర్షముగ వినియోగించుకొనినాడు. తృతీయ స్కంధమందలి స్వాయంభువ చరిత్రమున ఆతడు ఒకర్చిన హరిసంసేవనారీతిని వర్ణించు సందర్భమున పోతనార్యుడు తన ధ్యేయమును నాదోపాసనారీతినే ఇట్లు సంసూచికము గావించెను.

> "అతి భక్తింబ్రతి వాసరంబును హరివ్యాసంగుఁడై మాధవాం
> కిత గంధర్వ వివంచికాకలిత సంగీత ప్రబంధానుమో
> దితుఁడై యిష్టవిభూతులందు ననురక్తింబొందలే బ్రొద్దున
> చ్యుతసేవైక పరాయణుండగుచు ననోక ప్రభావోన్నతిన్"*

---

* భాగ. iii - 798.

"వెండయునమ్మేటి విష్ణుమంగళ కథాకర్ణన ధ్యానానుగానసుతులు సలుపుచు
ఏక సప్తతియుగముల స్తోత్రచరితుఁడగుచు వర్తించె సమ్మోదమతిశయిల్ల" *

కేవలము సంగీతము పోతనార్యుని కవనమున అలౌకిక పరిధిలోనే ధ్వనించునని లౌకికపరిధిలో నరాలేదని అనుకొననక్కరలేదు. పోతనార్యుడు కవనమును నిర్వహించిన కర్షకుడుగదా! కావుననే లౌకికపాసన ఆతని కవిత యందు జీవనవిధాన వర్ణనయందు నెడనెడ గోచరించినట్లే సంగీతముకూడ విన వచ్చినది. భాగవతమునందక్కడక్కడ ప్రయాణ సన్నివేశములందు ప్రస్థాన ప్రఘోషముగ సంగీతము ధ్వనించినది. సతీదేవి తన తండ్రిచేయు యజ్ఞమును కాంచనేగునపుడు.

"మానిని ఛనుఘంట మణిమన్మదాదిన హంసనంఖ్యాక్ష రుద్రానుచరులు ... శర్వాణిగతి
శంఖ, దుందుభి, వేణునిస్వనములొప్ప
మానితంబైన వృషభేంద్రయానఁజేసి
యజ్ఞభూమార్గులైయర్థి నరిగియరిగి" ** రట.

అట్లే ధ్రువుడు శ్రీహరి పుత్తెంచిన విమాన శ్రేష్ఠంబు నధిరోహించి నిజ జనని తోడఁగూడి పోవునపుడుగూడ

"ఘనతఘుందుభి ఘణఘణనల్
మురజాదులు మొరసె విరుల మునురుగురిసెన్
వర గంధర్వుల పాటలు
భరితములై చెలఁగెనపుడు భవ్యచరిత్రా!" ***

---

* భాగ. iii - 781.
** ,, iv - 79.
*** ,, iv - 375.

మద్రపతిసుతను వివాహమాడ హరిగైకొని చనునపుడు ఆ వివాహ ప్రస్తావనలో సంగీతమిట్టుల చోటుచేసికొన్నది.

"కొలదికి మీటగాడమరు, గోముఖ, డిండిమ, మడ్డు, శంఖకా
హాళమురళీ మృదంగ పణవానక దుందుభి ఢక్క కాంస్యమ
ర్దళ మురజాది వివిధ ధ్వనులేపున ఘూసభోంతరం
బులఁ జెలఁగెన్ నటీనటనముల్ దనరారె మనోహరాకృతిన్" *

రుద్రుడు ప్రచేతసులకు యోగాదేశమను స్తోత్రమును దెల్పిన సందర్భమున ఒక సరసి యందా ప్రచేతసులు ఒక దివ్య పురుషునింగనిరట. అతడు

"సమధ శ్రీక మృదంగ వేణుముఖ భాస్వన్నాదమై దివ్యమా
ర్గ మనోరంజకమై తనర్చు విలసద్గాంధర్వగానంబునె
య్యము సంధిల్లగ వించుఁదన్మహిమల కత్యాశ్చర్యముం బొంది వే
గమునందక్కమలా కరంబు వెడలెం గౌతూహలోల్లాసియై" **

ఇందు భగవంతుని దర్శనమున ప్రత్యుత్థానముగూడ సంగీతమంతెంత ఆవశ్యకమో నిరూపించి భగవంతుడు నాదమయుడని చాటినాడు పోతనార్యుడు

షష్ఠస్కంధమున చిత్రకేతు వృత్తాంతమున నాతడు నారాయణార్చన శీలి యనుటకు పాటించిన నాదోపాసనారీతి ఇట్లు వ్యక్తమైనది.

"ఆడించున్ హరిదివ్య నాటక గుణవ్యాపార నృత్యంబులం
బాడించున్ జలజాత నేత్రబిరుద ప్రఖ్యాత గీతంబులం
గూడించున్ సతతంబు జిహ్వలతుదిన్ గోవింద నామావళుల్
క్రీడంగిన్నర యక్షకామిమలచేఁగృష్ణార్పిత ప్వాంతుఁడై" ***

---

* భాగ. x - 1100.

** ,, iv - 693.

*** ,, vi - 484.

"వాసించునాత్మలో వైష్ణవ జ్ఞానంబు
నాశించు భాగవతార్చనంబు
భూషించునే ప్రౌద్దఁబుండరీకాక్షని
భాషించు హరికథా ప్రౌఢిమెరసి
ఘోషించు హరినామ గుణనికాయంబులు
పోషించుఁబరతత్త్వ బోధమరసి
సేవించు శ్రీకృష్ణదేవకనికరంబు
సుఖమునఁజేయునీయనకు బలులు'' *

ఇది ఏర్చూరి సింగయ కవితగాగూర్చిన స్కంధము. ఆతడును పోత నార్యుని అనుయాయియేగాన నాదోపాసనారీత్యనుసారమె భగవద్భజనమును నిర్వహించెను.

"ఘన యమునానదీ కల్లోల ఘోషంబు
సరసమృదంగ ఘోషంబుగాఁగఁ
సాధుబృందావన చరచంచరీకగా
నంబుగాయక సుగానంబుగాఁగఁ
గలహంస సారసకమనీయ మంజుళ
ధ్వంబులు దాళశబ్దములుగాఁగఁ
దివినుండి వీక్షించు దివిజగంధర్వాది
జనులు సభాసేనజనులుగాఁగఁ
పద్మరాగాది రత్నప్రభాసమాన
మహిత కాళీయ ఫణిఫణా మండపమున
నళినలోచన విఖ్యాత నర్తకుండు
విశ్వనైపుణమునఁజేసె నృత్యమాడె'' **

ఇందు నాట్యము గావించినవాడు నళినలోచనుడట, నాట్యరంగము కాళీయ

---

* భాగ. iv - 485.

** „ x - 664.

ఫణీఫణాశియట. ఇక నాట్యానుగతము కావలసిన గానము చంచరీకచయము నిర్వహింపగ నద్దానికి కలహంస సారసములు తాళములు వేసినవట. దీనికి నాఘనయమునవాదీ కల్లోలఘోషమె సరసమృదంగ ఘోషము నిర్వహించినదట. ఇంతటి గీతవాద్య నృత్యత్రయి అయిన తౌర్యత్రిక శోభను ఆభయదకల్లోలస్థితికి ప్రకల్పించి ఆ సన్నివేశమును రౌద్రమంజులావహముగ తీర్చినదీ సంగీతమే.

పోతనార్యుడు ద్వితీయ స్కంధమున ఒకపరి శ్రీకృష్ణపరమాత్మని రాసకేళీ నృత్యలీలను వర్ణించియు తనివి జనక మఖల దశమస్కంధ పూర్వభాగమున ఆ రాసకేళీ వర్ణనావిధికి నిట్లు దొరకొనినాడు. ఇందు సంగీతకరీతి తచ్ఛాత్ర పాండితీ విలసితమై గీతవాద్య నృత్య సమగ్ర స్వరూపమై ఇట్లు వెల్లివిరిసినది.

"కర్ణావతంసిత కర్ణికారప్రభ
గండభాగద్యుతిఁగడులు కొలుప
భువన మోహనమైన భ్రూవిలాసంబుతో
వామభాగానత వదనమొప్ప
నవ సవ్యకరమృదులాంగుళి చాతురి
షడ్జధ్వనికి మర్మసరణిఁజూప
డాకాలిమీద నడ్డముసాఁచి నిల్పిన
పదనఖద్యుతి భూమిఁ బ్రబ్బికొనఁగ
మౌళిపింఛముఁగంఠదామమును మెఱయ
విలసిత గ్రామముగనొక్క వేణువందు
బ్రహ్మగాంధర్వగీతంబు పరఁగఁజేసెఁ
జతుర వటమూర్తి గోపాలచక్రవర్తి" *

"ఇట్లు హరి వేణునాదంబు పూరించిన మారవికారహేతువగు తద్గీతం బాలించి సిగ్గులు సాలించి మక్కువలు నెక్కొలొత్త గోపికలోపికలులేక.... జిలిబిలి ముచ్చటలకుంజొచ్చి తమలోన" **

---

* భాగ. X - 769.

** ,, X - 770.

"భ్రూవిన్యాసములంగుళీ క్రమములుం బొల్పార షడ్జంబుగాఁ
గావించెన్ నటుభంగి బ్రహ్మమగు తద్గాంధర్వ సంగీతమున్" *

"నవగోస్థానక రంగమందుఁ బరమానందంబుతోఁ జూతప
ల్లవ నీలోత్పల పింఛపద్మదళమాలా వస్త్రసంపన్నులై
కవలై వేణువులూఁదుచున్ బహునటాకారంబులం గేళితాం
డవముల్ సేసెదరీకుమారకులు వేడ్కం గామినుల్ గంటిరా" **

"ముదితాయే తటినీవయః కణములన్ మున్ వేణువింతయ్యెనా
నది సత్పుత్రుని గన్నతల్లి పగిదిన్ నందంబుతో నేఁడు స
మ్మద హంసధ్వని పాటగా వికచ పద్మశ్రేణి రోమాంచమై
యొదవం దుంగతరంగ హస్తనటనోద్యోగంబు గావింపదే" ***

ఈ పై పద్యములలో గీతావాద్యనృత్యసమంచిత సమగ్ర సంగీత స్వరూపము ప్రవ్యక్తము గావించుటయేకాక పోతనార్యుడు వానియందు గొన్ని రాగముద్రాలంకార....నుంచి వానిని గానము సేయవలసిన తీరును సంసూచితము గావించినాడు. ఇందలి మొదటిపద్యమున భువనమోహనమైన భ్రూవిలాసంబను పలుకుబడిలో భువనమోహినీ రాగనామము ఉట్టంకితము. ఏతద్రాగభావనకు తరువాతిదానిలో వివరణము నందుకొన్నది. మారవికారహేతువగు తద్గీతం బాలించి యనుమాటలలో తద్రాగభావన వ్యక్తమైనది. ఈ భువనమోహినీ రాగము అలౌకికపరిధిలోనేగాక లౌకికపరిధిలో కూడ ప్రేయసీప్రియులకు సమ్మోహన మొనర్చు తీరులో మారవికారహేతువై శృంగారరసోద్దీపనమును గల్గించు రాగమని ఏతద్రాగనామము ముద్రితికూడ గమ్యమానమగుచున్నది. తరువాతిదియగు "నవ గోస్థానకరంగ"మను పద్యమున సుకుమారపల్లవ (పల్లవి) కలితముగ నీలోత్పల్లి రాగము సంసూచితము.

** భాగ. X - 772.

** „ X - 776.

*** „ X - 780.

ఆపిదప "ముదితాయేతటిన్" అను పద్యమున హంసరాగముఖరి ధ్వనిగ గమ్యమానము-అటుపిమ్మటిదియగు "మురళీనాదాభినందనసంయుత...." మొదలగు పద్యములలో సంగీతమునకున్న సర్వప్రాణిసమ్మోహజనకము 'లాలన' యను గుణము వ్యక్తమై "శిశుఃవేత్తి పశుఃవేత్తి వేత్తిగానరసం ఫణీ" అను అభాణకమున కిది సంవాదియైనది. ఇక చివరిదియగు వేణునాదలోలుని బ్రహ్మగాంధర్వ గానమునకు సర్వప్రకృతి పరవశించిన రీతిని పోతనార్యుడొక చిన్న పద్యమున చెప్పి గానమహాత్మ్యమునకు పరాకాష్ఠ చేకూర్చినాడు.

> "గిరులెల్ల జలములయ్యెన్
> దరులెల్లను బల్లవించె ధరణీ గగన భూ
> చరులెల్లను జొక్కిరి హరి
> మురళీరవామృతమునొక ముద్దియ కంటే"*

ఈ పూర్వభాగమునందే రాసక్రీడాభినందనమున గానమును వాద్యమును మించిన నాట్యమొక్కచో ఉత్తరోత్తరోత్కర్షను గమించినది. ఇట పోతనార్యుడు నృత్తవిద్యార్ణవతర్తుకాములగు నావికులపాలిటికి కర్ణధారియై సాక్షాత్కరించినాడు. ముందు గానవిద్యావినోదము ప్రవర్తితమైనది.

"కళంకరహిత చంద్రవదన లిద్దరు ముద్దియలుద్దుకొని వీణలందుకొని ప్రవీణలై సొంపుమెఱసి ఇంపుగ వాయించి" రట. దానికి తగినట్లు మురళివాయించుటలో నృత్తవిద్యామహార్ణవవేలావలయితంబయిన .... రాసమండలంబు గల్పించినాడట నందగోపాలుడు. ఆ సన్నివేశమున ప్రఖ్యాత నాట్యశాస్త్రాదికములంజెప్పబడిన శంఖ, పద్మ, వజ్ర, కంధుక, చతుర్ముఖ, చక్రనాళ, చతుర్భద్ర, సౌభద్ర, నాగనంద్యావర్త, కుండలీకరణ, ఖురరీబంధ ప్రముఖంబులైన విశేషవాసబంధంబులన్నియునిట ఉక్తంబులైనవి... తానకంబులు ...భేదంబులు, వ్యోమచారి, పార్థివచారిభేదంబులు, కరాభావంబులగు హస్త వైభవంబులు, ముద్రలు, కుండలభేదంబులు, చూడ్కులు, ముఖరాగంబులు అవి యనియనేల, నాట్యశాస్త్రంపు నిర్దేశితములన్నియు తీర్చెనిట పోతనార్యుడు.**

---

* భాగ 'x' 792

** భాగ. 'x' - 1082 - 1088

"నడుములు వీఁగియాడఁ జిఱునవ్వులు నివ్వటిలంగ హారముల్
ముడివడ మేఖలల్ వదలఁ జూడ్కి మెఱుంగులు పర్వ ఘర్మముల్
తొడఁగఁ గురుల్ చలింప శ్రుతిభూషణముల్ మొఱయన్ సకృష్ణలై
పడఁతుక లాడుచుం జెలఁగి పాడిరి మేఘ తటిల్లతా ప్రభన్"*

"అంకరహితేందు వదనలు
పంకజలోచనునిఁ గూడి పరఁగ నటింపం
గింకిణుల నూపురంబుల
కంకణముల మ్రోఁత లెసఁగెఁ గర్ణోత్సవమై"**

ఇట గోపాంగనలు కృష్ణమేఘరంజనులగు తటిల్లతలై గానము చేసిరట. ఇందు వాద్యముగ మేఘరాగము గమ్యమానము. కాగా వ్యంగ్యముగా మేఘ రంజన రాగముగూడ స్ఫురించుచున్నది. మేఘరాగము శ్రీకృష్ణప్రతీకమై పురుషరాగముగాగ మేఘరంజని రాగిణి యగుట ఇట గమనార్హము.

అంతేకాక అట ప్రవర్తిల్లిన నాట్యము గానానుగతమేగాక ఆ గానము వాద్యానుగతముగకూడ గావించుటవలన సంగీత సమగ్ర స్వరూపమగు తౌర్యత్రిక రీతి ఇట సశాస్త్రీయముగ వ్యక్తమగినది.

"ప్రమద యొకర్తు నాద విపంచి ధరించి కేల సం
శ్రమమున నంగుళీముఖంబుల చిరంబుగ తాయము సేసి యొక్క రా
గము దగ నాలపించి సుభగస్వరజాతులు వేఱక వేఱక
తెఱఁగుగఁ జూపెదన్ రమణుఁ డౌనన దారువులంకురింపగన్"

ఇట మాధవుడు వేణునాదలోలుడేగాక గాయకుడుగకూడ దర్శనమిచ్చుచున్నాడు. అచ్చటనొక ప్రమద విపంచి మీటుచు చిరంబుగ తాయముచేసినదట. తాయము సంగీతమున స్థాయీసంచార ప్రతీకగ వ్యవహరించుచున్నారు. ఈ తాయము రాగాలాపన ప్రశస్తితమగును. దీనినిబట్టి ఆ ప్రమద రాగాలాపనము గావించి, స్వరజాతులను వేఱు వేఱుగ పల్లవులనుగూర్చుచు రాగమును, తానమును,

* భాగ. 'X' - 1083

** భాగ. 'X' - 1084

వల్లవినికూడ నిర్వహించినదని గమ్యమానమగుచున్నది. గోపసుందరి ఎద సంగీతశాస్త్రాభిధీతికి పరాకాష్ఠయగు మనోధర్మ సంగీతమును అలవోకగ నాలపించుట ఎక్కడ? బ్రహ్మయంతటి కవి తలచుకొనిన తిమ్మని బమ్మని గావించునుగాన ఇవి త్రేతల సంగీతవిద్యగాదని పోతనార్యుని సమగ్ర సంగీత పాండితియని అనుకొనవలెను. ఇట్టివి మనమనుకొనగలమేకాని పోతనార్యుడు మాత్రము తన గీతిసాహితీపాండితీవిభవమును బనిగట్టుకొని ప్రదర్శింప దొరకొననే లేదు. కస్తూరిని మూటగట్టి మూలదాచుకొన్నను పరిమళము దాగనట్లు ఆ మహానుభావుని జన్మజన్మాంతర వాసన దాగక సహజపాండిత్యమై అభివ్యక్తినందినది.

"పోతరాజు పలికెడిది భాగవతమట పలికించెడువాడు రామభద్రుండట" యని అనుకొని నిమిత్తమాత్రుడై సాహితీవిదుడైనాడు. నిర్లిప్తుడై ఆ నిరంజనుని భజించుచు గానమునే తత్సాధనముగా గైకొని సంగీతవిదుడైనాడు. ఇట్టి భాగవత కవుల నాదోపాసనాధ్యేయము వారి మాటలలోనే ఇట్లు వ్యక్తమైనది.

సతతంబును గృష్ణసంకీర్తనంబులు
    వీనులకింపుగా వినఁగ వలయు
హర్షంబు తోడుత హరినామ కధనంబు
    పాటలనాటలఁబరఁగ వలయు
నారాయణుని దివ్యనామాక్షరంబులు
    హృద్వీధి సతతంబు నిలుపవలయు
గంజాక్షులీలలు కాంతారములనైన
    భక్తియుక్తంబుగాఁబాడవలయు
వెఱ్ఱిమాడ్కిని లీలతో విశ్వమయుని
నొడువుచును లోకబాహ్యత నొందవలయు
నింతయును విష్ణుమయమని యెఱఁగవలయు
భేదమొనరింపవలదు...."**

---

* భాగ. 'x' - 1094

** భాగ. xi - 44

ఇట్టి నాదోపాసనాయుతమగు భాగవతము సాహితీవిదులకు, సంగీత కోవిదులకిని ఉభయతారకమై భక్తిముక్తిదాయకమై ఇహపర సుఖసాధకమైన మార్గమును జూపించుననుట అతిశయోక్తిగానేరదు.

పోతనార్యుడును అతని యనుయాయులును గలసి భగవన్నామభజనమునకు ప్రతీకగ నిర్వహించిన భాగవతమేకాక పోతనార్యుడొక్కడే రచించిన వీరభద్రవిజయమను కావ్యమొకటి లభ్యమగుచున్నది. అందు కొన్ని సంగీత ప్రసక్తులున్నవి. ప్రథమాశ్వాసమున పుట్టినింటికిపోయి సంరంభమున దాక్షాయణి వీణనుకూడ గొంచుబోనెంచినపుడు "వీణియ నీవు దేవీణా సుభాషిణి"* అని ఆశాసించినదట. ఆట్లే అమరావతిఁ విభవవర్ణనముఁజేయుచు కవి అది "బహువాద్యములచేఁ బరగునట్టిది" యనినాడు.

మదనుని శివునిపైని బాణప్రయోగము చేయుమని ఇంద్రుడు అర్థించుటలో కూడ సంగీతకము చోటుచేసికొని నాదస్వరూపము ప్రముఖమగునట్లు ఈరీతిగ ధ్వనించినది.

కలకంఠ గణముల కలనాదములతోడఁ
    గలహంస నాదంబులు గడలుకొనగ
అరయదాకాలి పెండెరము నాదముతోఝుం
    కారనాదంబు జరణి కొనగ
భూరిసుందర రాజకీరనాదములతో
    వెడవింటినాదంబు నుడికొనంగ
వందండుఁ జెలరేగి యార్పు నాదములతో
    శరవేగ నాదంబు జడలుకొనగ"**

మదనుడు దండెత్తిపోవుటకు ఆయత్తముచేసిన అళిబలముల అలజడిలో కూడ సంగీతధ్వానమే వినవచ్చినది.

---

* వీ.వి. i - 125

** వీ. వి. ii - 91

'భేరీమృదంగాది చా...నాదంబులు నెనయఁదుమ్మెదల మ్రోయింపఁబంపె'*

ఇక మదన విజృంభణములోకూడ సంగీతకవిజృంభణము ఇట్లు కానవచ్చినది. "ఆ త్రిభువనసుందరుడు కాముడు సోమజూటునిపై రంగభృంగ మంగళ సంగీతపాఠానేక నిర్మలమహనీయ నినదమోదితమానసుండై కలహంస నాదగణ పరివృతుండై విజృంభించినా"డట.**

పార్వతీ పరిణయ సందర్భమున ప్రవర్తిలిన వేడుకలలో సంగీతమే ప్రముఖపాత్ర వహించినది.

"కమనీయగతుల వాద్యముల మ్రోయించిరి"***

"పుణ్యకాహళులును పుణ్యదుందుభులనుఁ
బుణ్యశంఖంబులు పొలచి మ్రోయ
మంగళపాఠక మాగధ వంది జ
నంబులు శుభకీర్తనములు సేయ
కదిసి పేరంటాండ్రు కల్యాణములఁబాడ
పరిజనంబులు తన్ను వలసి కొలువ"****

హిమవంతుడు వరమేశుని నెదుర్కొలనేతెంచిన ముచ్చటలో లగ్నవేళలోగూడ దుందుభి, కాహళ, ధ్వనులు తూర్యరవంబులతో గణాధిపుల్ సందడిచేయ మునిపుణ్య వధూజనకోటి గ్రంతలుకొని పాడుచుండ జరిగినదట.*****

వీరభద్రుఁడ ఇంద్రాదులలో పోరుసందర్భమునగూడ వీరరస విజృంభణమునకై సంగీతమందలి ప్రచోదనశక్తియే ఇట్లు ప్రకాశించినది.

---

* వీ. వి. ii - 91

** వీ. వి. ii - 95

*** వీ. వి. iii -

**** వీ. వి. iii - 128

***** వీ. వి. iii - 169

"అందంద వీరకాహళ
దుందుభినిస్వాన శంఖతూర్యరవంబుల్
క్రందిల్లె వీరసారధి
బృందారక బృందమెల్లఁబొరిఁబొరి వణకెన్"*

ఇట్లు పోతనార్యుని గ్రంధములలో ఆతని సహజపాండితిరీతికి సరిపోయి నట్లే సంగీత ప్రసక్తులున్నవి. పోతనార్యుఁడు గ్రహించిన భాగవతకథనేగైకొని అర్వాచీనుడగు దోనూరి కోనేరునాథకవి బాలభాగవతమను పేరులో రచించినాడు. ఈ బాలభాగవత రచనమున కోనేరునాథుడు అగస్త్యుడై మహాభాగవత పారావారమును కుడిపెడుగచేపి ఆపోశనముపట్ట జూచినాడు. కళావిశేషణముల నట్టంకించుటలో శబ్దాలంకారాదులతో శైలికి మెరుగులు దిద్దుటలో పోతనాదుల కవనమున సంగీతము చోటుచేసికొన్నది. కాని యీ కోనేరునాథుని కావ్యము కోనేరుమాత్రముగ పరిమితమైనది. పోతనార్యుని కవనసముద్రమునందువలె అనర్ఘరత్నములు వెలికితీయుటకు అందనువులేదు. పోతనయేగాక ఎఱ్ఱన, వెన్నెలగంటి సూరన, తాళ్ళపాక తిరువెంగళనాధాదులు కూడ కృష్ణచరిత్రము నేకరువుపెట్టునపుడు కాళీయమర్దన, రాసనృత్యాది సన్నివేశములలో సంగీతము నకు విశేషప్రాధాన్యము నిచ్చియున్నారు. కాని యీ కోనేరునాధుడు ఆయా పట్టులలో సంగీతకమునకెట్టి ప్రాధాన్యమునీక కథాగమనముమీదనె దృష్టిని కేంద్రీకరించినాడు. సామాన్యరీతిలో సంగీతమునుజేర్చి ఇట్లు ప్రస్తావించినాడు.

"ఒకవాడు శౌరిచంద్రోదయవేళ చి
త్రంబుగ వేణునాళమును పేయ"**
"వేణువంశనాదముచేఁ గీతములరాగము సేయుచు"***
"రాసమండలమనుపమముగ నింపి"****

---

* పో. వి. iv - 162
** బా. భాగ. v - 146
*** బా. భాగ. v - 147
**** బా. భాగ. v - 148

"ఆడిరి పాటల్ మట్టున నాడుచు నతిసంఘట్టిత బహువిధ విలాస
కమనీయముగన్''*

''ఆడెన్ దాండవమయ్యహీంద్రుతలలందాసక్తులై కిన్నరుల్
పాడన్''**

ఇట్లు అత్యంత సామాన్యముగనున్న సంగీతప్రసక్తులేగాని ఈ గ్రంథమున మచ్చునకైనను సంగీతశాస్త్రాన్విత పాండితీప్రకర్ష గోచరముగాకపోవుటచే ఈ కవి సంగీతశాస్త్రాభిజ్ఞుడనుట సాజమేగాని సాహసము కానేరదు. మొత్తముమీద భాగవత రచనమున సంగీతకము పోతనాదుల సంగీతాభిరుచివిబట్టి చోటుచేసికొని అదియొక నాదోపాసనాత్మకరీతియై భాసిలి గీతిసాహితీరంగములో రెంటియందు ఇహపరసాధనకేకలక్ష్యమై అలరారినది. □

* భా. భాగ. v - 149

** భా. భాగ. v - 116

## వెన్నెలకంటి సూరనార్యుని విమలసంగీతవిజ్ఞత

"శ్రీకాంతాకుచహేమకుంభములపైఁ జెల్వారు కాశ్మీర ప
ఙ్క్తోకంబై తన పేరురంబునఁగడుశోభిల్ల దీప్తిచ్ఛటా
వ్యాకోచంబుగఁగౌస్తుభంబునకు జోడై యున్న మోదించు సు
శ్లోకుండబ్జసవేంద్రు రాఘవునికిచ్చున్ సుస్థిరైశ్వర్యమున్"*

ఇది వెన్నెలకంటి సూరనార్యుని కావ్యాదిమంగళశాసనము. ఇందు సంప్రదాయసిద్ధముగ వినిపించెడి శ్రీరాగముతోపాటు 'కాంతాహేమ' రాగ నామములను స్ఫురించుటచే రాగమాలిక అల్లుకొన్నది.

అవతారికలో ఇష్టదేవతానమస్కృతులలో వినాయకునికి నాట్యాభిరుచి ప్రకల్పితము. పద్మపురాణమునందును ఇట్టి పద్ధతి గలదు.

"జననీస్తన్యము గ్రోలు ప్రాయమున నందుత్సాహంబుతో దేవతా
వనితల్ వేడుకపుట్టఁదాళగతులన్ వాయించుచున్ బాడఁగాఁ
గనదుల్లాసముతోడ బొజ్జగదలంగానాడు లంబోదరుం
డనురాగంబున రాఘవప్రభుని నిత్యశ్రీయుతుంజేయుతన్"**

కృతిభర్త వంశవర్ణన సందర్భమున ఆతని వంశస్థులైన సంగీతజ్ఞుల నెందటినో ప్రస్తుతించెను. కృతిపతి ఆస్థానమే సంగీతసాహిత్య కళానిలయమని పేర్కొనినాడు.

"లింగభూమిభర్త సంగీతసాహిత్య సరసవిద్యలందు చతురుడయ్యె"***

"సంగీత సాహిత్య సర్వజ్ఞులొకవంకఁ
బొక్కపు భరతజ్ఞులొక్కవంక"****

---

* విష్ణుపురాణము పీఠిక - 1

** ,, ,, - 41

*** ,, ,, - 45

**** ,, ,, - 17

"చూడనేర్చిననాడె చూడంగనేర్చునగిలి
గాయకుల యిండ్లఁగలిమిగలుగ" *

"సంగీతసాహిత్య సరసత చిత్రమే
తలపోయ రాయపితామహునకు"

"వాలుచూపులచే నివాళించి యొక సీమ
కాళింజిపూని చెంగటనటింప
పంచమస్వరమున పద్మాక్షియొక్కతె
యవధారు చిత్తేశయనుచు బలుక"**

శ్రీదేవి జన్మించిన శుభసందర్భమున విశ్వావసు ప్రభృతులైన అప్సరో గణంబు నృత్యమును అలవోకగా పల్కినాడు. అట్లని సంగీతశాస్త్రపు నిగ్గు నెఱుంగనివాడని పలుకరాదు. సునిశితముగ పరిశీలించిన ఈతడు సంగీతాభిజ్ఞుడను కొనుటకనువున్నది.

అవసరమైన పట్టులందు ఎఱ్ఱనార్యుని మించు సంగీతాభిరుచిని ప్రదర్శించెను. ఇతడు వర్ణించిన కృష్ణుని వేణుగానరీతిచే ఈతడు కాకలుదీరిన సంగీతజ్ఞుడనవలయుననిపించును.

అది యమునాతటి. ఆనాడు షోడశకళాపూర్ణచంద్రికాసాంద్ర సమస్తమై భువనతలమెల్ల పరవశమైపోవుచున్నది. అట్టి శరత్కాలమున కృష్ణుడు గోపికా జనమనోహార్యంబైన సౌకుమార్యంబుతోడ వినోదించుచుండి ఒక్కనాడు నిశా సమయమున

"తన సంగీతవచోవిలాసము సుధాధారాప్రవూరంబుగా
వనజాతాక్షుడు పర్వమోహనకళావర్ధిష్ణువై పెంపుతోన్"***

---

* విష్ణుపురాణము పీఠిక - 62

** „ - 18

*** „ iii - 275

"పరగషడ్జాది స్వరంబులు మంద్రమధ్యతారక మార్గములను
పురుషాంగనా రాగములు ముప్పదిరెండు వాని మొత్తంబులు వరుసనెఱిఁగి
కాలక్రమామానగతులతోఁదాళంబులెఱిఁగి మూర్ఛనవృత్తులేర్పరంచి
గీతంబు దరువు జక్కిణి బిందు మొదలుగ నొక్కొక్క వర్ణంబునుగ్గడించి
శుద్ధసాళగ సంకీర్ణశోభితములు శ్రుతులుజెడకుండ చెవులకు సొగసుగలుగ
వేణునాదంబు మొరయించె రాణమెరయ మదనగోపాలమూర్తి
యమ్మాధవుండు*

ఇప్పట్టున సూరనార్యుని గానపాండితి నిగ్గులుపారెను. ఇట సంగీతము సర్వమోహనకళావర్ధిష్ణుడైన వనజాక్షుని పరముగా పెంపొందెను. ప్రథమ పాదమున కవివరుని సంగీతమగు పరిజ్ఞానము ప్రవ్యక్తము. షడ్జాది సప్త స్వరంబులు మంద్రమధ్యతారక మార్గముల ధ్వనించి, మోహనరాగమాలపించి ఆనందతానముగ పరిణమించెనట. ఒక్క రాగమే కాదు పురుషాంగనా రాగములను రాగరాగిణులు ముప్పదిరెండు మిత్రరాగముల వరుసక్రమంబు లెఱిఁగిన రీతిలో నాలపింపబడినవని తెలియనగును. స్వరములో వాది, వివాది, సంవాది, అనువాది స్వరములున్నవి. రాగానుసారిగ దాని ఆరోహణావరోహణములనుబట్టి రాగాలప్తి నొనరింపవలెను. అట్టితఱి అందలి స్వరములలో కొన్నిటికి కొన్ని వివాదులగును, కొన్ని సంవాదులగును, కొన్ని అనువాదులు వాదులగును. అనగా రాగమునుబట్టి కొన్ని స్వరములకు మిత్రత్వశత్రుత్వములు, తటస్థములుండును. కాన వాని నిమిత్తములను వరుసనెఱిగి ఆ గాయకసార్వభౌముడు గానము చేసినాడనుకొనవలెను. ఈతీరున సూరనార్యుని రాగవివేకము వ్యక్తము. ఇట తాళపరిజ్ఞానమును వెల్లివిరిసినది.

తాళమునకు కాలమార్గక్రియాంగాదులు ప్రాణములు. వీని ననుసరించియే తాళగణముల నియతి ఏర్పడినది. తాళవేగము ముఖ్యముగా నాల్గు రీతులుగ వింగడింపబడెను. అదిత్రిస్ర, చతురస్ర, ఖండ మిశ్రములు తాళక్రమమునందు గతులాహింపదగును. మూర్ఛనాదికముల వృత్తుల గురించికూడ చెప్పబడెను.

* విష్ణుపురాణము iii - 276

శ్రోతృచిత్త సుఖావహత్వము ననుసరించి సమ్మోహనజనకమైన మూర్ఛితస్థితిని శ్రోతకు కల్గించు రాగపు 'రసపట్టు' మూర్ఛనమగును. దానినెరిగి మోహన వంశీగానమును కృష్ణుడు గావించినాడని యిందు వర్ణితము.

నాల్గవ పాదమునందు గానప్రక్రియలగు మార్గదేశిభేదములన్నియు చెప్పబడెను. మార్గప్రక్రియలుగా గీతములు వ్యక్తములు, దేశిప్రక్రియలుగా దరువులు, జక్కిణులు, చిందులు మున్నగు నాట్యోపయోగి గానప్రక్రియలుగూడ ఆ అనంతనాదబ్రహ్మస్వరూపుడు తన వేణువుపై పలికించి రాసలీలకాహ్వానించినాడని భావింపనగును.

అతడొనరించిన రాగాలాపములలో శుద్ధరాగములు, సాళగ (ఛాయాలగ) రాగములు, సంకీర్ణరాగములుకూడ శోభించెను. వాని శ్రుతులు చెడకుండ చెవులకు సొగసుగులుక కర్ణాటముగ (కర్ణాఅటతీతి కర్ణాటః శ్రవణ సుఖ ప్రతిపాదితముగ సాగెనవిపించునట్లు కవి అభివర్ణించెను.

ఆ మధుర నాదమున పశుపక్షిమృగాదులతోపాటు వృక్షలతాగుల్మాదులు గూడ పరవశించినవి. చిత్రరూపముల చందముననుండినవి. అపుడు

"ప్రాణేశ్వరుని శయ్యపైనుండి యొక యింతి
 కృష్ణులీలలు సాళగించి పాడె
నత్తమామలు చూడ నలివేణి యొక్కతె
 తతకారములుచేసి తాళమెత్తె
తల్లిదండ్రుల మ్రోలఁదమకించి యొక లేమ
 లీలాగతుల సమాళించి పాడెఁ
జుట్టంబులెల్లనుజూడ నొక్క మృగాక్షి
 మెల్లనఁదలయూచి మెచ్చెనతని"*

ఇందు సాగళించి పాడుట, తతకారములుచేసి తాళమెత్తి లీలాగతుల సమాళించి పాడుట సంగీతపద్ధతులకు సంబంధించినవి. ఛాయాలగములగు

* వి. పు. vii . 279

రాగములలో రాగమాలికలగూడి పాడుట సాళగించి పాడుటలో వ్యక్తము. తతకారములుచేసి తాళమెత్తుటలో తత, ఘన, సుషిరానద్ధాదికములగు వాద్య విశేషముల వాద్యాధ్యాయపద్ధతి వెలువరింపబడినది.

1. తతము : వీణలోనగు తంత్రవాద్య విశేషములను వాయించుట

2. ఘనము : కంచుతాళములు లోనగు లోహవాద్య విశేషముల మొరయించుట

3. సుషిరము : వేణువు మున్నగు గాలినూది వాయించెడి వాద్యముల ప్రమోయించుట

4. ఆనద్ధములు : మృదంగాది చర్మమర్దన వాద్యముల ధ్వనించుట

ఇట వంశీధరుడు పూరించిన సుషిరవాద్య సన్నాహమునకొక వల్లవాధర తంత్రీవాద్యముల మీటి తాళక్రమమును చూపించినదనుకొనవలెను. ఒక లేమ లీలాగతులతో వాద్యము నిర్వహించి సుమాళించి పాడుట గమ్యమానము. ఇట్లు మురళీనాదముచే మోహముపుట్టించుచు తన సంగీతపాండితిని ప్రదర్శించి రాస క్రీడా సంగీతమును ఆ బృందారకచక్రవర్తిచే తాళమానముగ నిర్వహింపజేసెను. ఇంతటి గీతవాద్యనృత్యత్రయియైన కార్యత్రిక సంగీత ప్రతిభను ప్రదర్శించిన సూరనార్యుడు ప్రశంసార్హుడు. □

## పద్మపురాణకర్త మడికి సింగన సంగీతపరిచితి

"శ్రీరమ్యంబగు దుగ్ధవార్ధినడుమన్ శేషాహితల్పంబుపై
నారూఢంబుగ నిందిరాసహితుడై యానందలీలం గుణా
ధారుండై వరసంయమీంద్రులకు నాత్మజ్ఞానరూపంబు దా
నై రంజిల్లెడు వేద్యుఁ డిచ్చుఁ గృపఁ గుండామాత్యునెల్లప్పుడున్"*

ఇది మంగళాశాసన రూపమగు ప్రథమపద్యము పురాణసంప్రదాయ రీతిలో శ్రీరాగాంచితముగనే ప్రారంభింపబడినది.

తొండము మీదికెత్తుకొని దోర్యుగళంబునఁదాళగించుచు
న్గండ మదాంబుధారలంకుంగ్రమ్మెడు తుమ్మెదలొత్తుకాఁగాఁ
గొండలజేని కూర్మిసుతకుం బ్రియమందగ నాడుచున్న వే
దండముఖుండు నవ్యకవితారససూక్తులు మీకు నీవుతన్"** ఇది యిందలి గణేశస్తుతి. ఇందు గణనాయకుని పరముగ సంగీత సమగ్రస్వరూపము గమ్యమానమైనది. తుమ్మెదల ఝుంకృతి ఒత్తుకాఁగ శ్రుతియుతముగ నాలపించుచుండుటలో గానమున్నది. దానికి తగిన తాళమును వేయుచు వేదండముఖుండు నృత్యమొనరించినాడు. కావునిట ఆటపాటలు రెండును ప్రదర్శితములు.

ప్రథమాశ్వాసమున భృగువిద్యాధర సమాగమన విద్యాధరుడు హృద్యతరమగు గానమున అనవద్యుండగు వాడనియు అతని మనోహారి నవ్యవీణానాద దివ్యగానంబుల మృడుని నారాధించి మెప్పువడసినదనియు కథానుసారిగ చెప్పబడినది.

సుందోపసుందుల చరితమున తిలోత్తమ "వీణక మీటుచున్ వట్టిమ్రాకులు ఇగురులు పెట్టబాడిన"దని చెప్పినాడు. పెక్కు రాగములు గైకొని పాడుచున్న ఆ దివ్యగానంబు మధురంబుగా నేతెంచిన సుందోపసుందుల సహవర్తులగు అసురులనుకూడ ఆకర్షించినదని చెప్పినాడు.

---

* ప. పు.

** ప. పు.

గంధర్వకన్యకల వృత్తాంతమున ఈ కవి తన సంగీతపరిచితిని ఏతచ్ఛాస్త్ర సాంకేతిక పదజాలముల నడుపుటలో వ్యక్తీకరించెను. ఇట్లు ఆ వనితలకు మవ్వంబగు జవ్వనంబులు నివ్వటిల్ల స్వరగ్రామతాన మూర్ఛావిశేషంబుల వీణా వాదన నైపుణములు మెరయ మధురగానము చేయుచు చతుర్విధ నృత్తముల ప్రగల్భులై సమస్త విద్యాకళాభిజ్ఞలగుచు పితృలాలనంబున పెరిగిరని కథాను సారిగ వ్యక్తీకరించెను.

నవమాశ్వాసమున కాళియమర్దనమున కటిసూత్రఘంటికా ఘణఘణ నాదముల్ మొరయగా వెస పల్లవాగ్రణి "తాండవమాడె"నని పలికెను. మఱల గోపాలదేవుడు వేణుగానము చేయుటనుకూడ నిట్లు వర్ణించెను.

"మదన శశికోటి లావణ్యమహిమనొప్పి కృష్ణుడు"

"వలపలిపాదమడ్డమిడి వామపాదంబు ధరిత్రిమోపి మలచి త్రిభంగిమై నిలచి మానుగనర్ధనిమీలితాక్షుడై .... అలనతదోవనంగుళములార్చుచు నింపెసలార వేణువున్ వెలయగ నొత్తెను కృష్ణుడు అరవిందదళాయతాక్షుడు సౌమ్యమూర్తియై" అని నాట్యగానహేవాకమును ప్రదర్శించెను. ఆ గానమహాత్మ్యమునిట్లభి వర్ణించినాడు.

"వట్టి మ్రాకులు చిగురులుపెట్టె నచటి
ఘనశిలావళి మడుగులుగట్టెఁగరిగె
మృగసమూహంబు వినుచు మెలఁగ మఱచి
మించి కృష్ణుడు మురళిఁ బూరించునపుడు"** అంతేకాక

"ఘ్రూత్తులు చాచి కన్నుగవమోడ్చి చెవుల్వ్యసలీలవైచి.... వ్రాసిన చిత్ర రూపులట్లై మేతల్మాని గోవులు పైతము ఆ దివ్యగానమునకు పరవశించినట్లు" వివరింపబడ్డలో "శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తిగానరసంఫణి" యను సంగీతాను శాసనము జ్ఞప్తికెలయించును.

---

* వ. పు.

** వ. పు. ix - 200-210 మధ్య

బలరామకృష్ణుల వివాహసందర్భమున తననాడు వాడుకలోనున్న రీతిగా పేరంటాండ్రు పాటలు పాడిరని దేశిగానరీతినిగూడ తెల్పెను.

మొత్తముమీద పర్యాలోచించి చూడగ సింగనార్యునికి సంగీత పరిచయమే గాని ప్రాగల్భ్యము లేనట్లు, అభిమానమేగాని అభిజ్ఞత లేనట్లు పద్మపురాణము వలన సువ్యక్తము. □

# మడికి సింగన ద్విపద భాగవతము

పద్మపురాణ కర్తయైన మడికి సింగన రచనముగ ద్విపదభాగవత దశమ స్కంధము మఱియొకటి యున్నది. పద్మపురాణమున ప్రదర్శించినంతటి సంగీతోపజ్ఞత సింగనార్యుడేలనో ఈ గ్రంథమున చూపలేదు. మామూలు మాటలలో ఎడనెడ గీతవాద్యముల పేర్కొనినాడు.

రుక్మిణీ వివాహఘట్టమున "వందిసన్నుల గీతవాద్యముల్ మోసిన"వని నాడు*

"పటహకాహళశంఖపణవాదులొాలసిన"వనినాడు.**

రుక్మిణీ వర్ణనమున

"కనకకాహళకాంతిఁగడచి చూపరకుఁ
గనుపట్టు కాంతజంఘలు ధన్యమగుచు"*** అని వర్ణించినాడు.

ఆమె వివాహసమయమున

"ఘంటామృదంగ మంగళతూర్యరవములంతట మ్రోసిన"వని**** నాడు.

"రసికకళమేర పేరటాండ్రు పాడిరవి"*****నాడు

జగదభిరక్షకాండమున వసంతర్తు వర్ణనమున నీమాటలున్నవి

"పాటలు చెవివిని పాటలీతరులు
పాటిల్లె నతులయాపాటలనలరి"******

---

* ద్వి. భాగ. కల్యా. కాం. - 63

** ,, - 63

*** ,, - 87

**** ,, - 247

***** ,, - 257

****** ద్వి. భాగ. జగ. ర. 73-74

గుంపులై యలరెడు గొదసుతుమ్మెదలు
పానాభిరతిఁజొక్క పతులును సతులు
గానంబులొనరించు గతిని జూపట్టి"*

అదే కాండమున శ్రీకృష్ణుడు "పటహశంఖకాహళారావములు"** విని మేల్కాంచెనన్నాడు.

ఇంతకన్న నెక్కుడుగ సంగీతశాస్త్ర ప్రసక్తులీగ్రంథమున లేవు. □

---

* ద్వి. భాగ. జగ. ర. 76-77
** " " " 427.

# ప్రథమాంధ్ర యుగళకవుల సంగీతప్రీతి

నంది మల్లయ ఘంట సింగయలు ప్రథమాంధ్ర యుగళకవులేగాక సంగీత సంప్రదాయము నెఱిగిన కుటుంబములయందు జనించిన మేనమామ మేనయల్లుం డగుట ఒక విశేషము. నంది మల్లయ తండ్రియైన నంది సింగయామాత్యుడు "సారస్వతాభినంది"గా "సంగీతనంది"గా మన్ననలనందినాడట. దీనినిబట్టి నందివారి యింటి ఆడబడుచునకు పుత్రుడైన ఘంట మల్లయకుకూడ మాతృవంశాయాతమైన సంగీతాభిరుచి యుండుననుట స్పష్టము. ఈ వరాహపురాణమున తొలి పద్యమగు మంగళాశాసనమున "శ్రీ, లీల, కాంతి" రాగములు ధ్వనితములగుటయు*, మలి పద్యమైన ఈశ్వరనమస్కృతియందు పరమశివుడు సంధ్యానటుడుగ ప్రస్తుతింపబడుట** గాంచిన ఈ కవులు సంగీతప్రియులని తెలియుచున్నది.

అవతారిక పిదప ప్రథమాశ్వాసమంతటికి చెప్పుకొనదగిన సంగీతకపుముచ్చట యియ్యది.

"అచ్ఛోటందపమాచరింపఁగఁదదీక్షాయత్త చిత్తంబునన్
విచ్చేసెన్ సురమౌని నారదుఁడు పాణిన్వీణ తంత్రుల్నభ

---

* "శ్రీలీలాస్పదమైన కొమ్మున, ధరిత్రీకాంతఁగారుణ్య ల
క్ష్మీలోలాత్మతనెత్తి లీల బలదాశ్లేషైక శృంగోన్నమ
త్కైలాసంబునుబోలెనున్న జగదేకస్వామి వారాహదే
హాలంకారుఁడు ప్రోచునీశ్వర నృసింహాఖ్యావధూవల్లభున్"

** తావానందముతోడఁ గుంకుమ వసంతంబాడెనో నాఁగ సం
ధ్యావాట్యావసరభ్రమీగళిత మస్తన్యస్త నాకస్రవం
తీ వీరేరుహరేణువుల్ తనువుపై నిండ్రగ, దీపించు గౌ
రీనాథుండొనఁగున్ గృపన్నరసధాత్రీభర్తకైశ్వర్యముల్

స్వచ్ఛారంబున మూర్ఛనాస్వర విశేషంబుల్ వెదజల్లగా

నిచ్చన్ మెచ్చుచు దేహచంద్రికలు రాకేందుచ్ఛవిక్కిరగాన్''* ఇట్లు నారదుని స్వరూపచిత్రణముతోపాటు ప్రవ్యక్తమైన అతని నాదస్వరూపము నారదుని చేతిమహతి ప్రక్వాణప్రక్వణ ధ్వనుల నించుచు మూర్ఛనాస్వర విశేషము లను వెదజల్లినదట. ఇందలి ఈ పలుకుబళ్ళనుబట్టి నారదుడే రాగమునో, తానమునో, పల్లవినో వీణపై పల్కించినాడనుకొనవలెను. ఆ దివ్యగానమున స్వరము సంగీతశాస్త్రోక్తమైన రీతిలో స్వరోరంజితమై భాసిల్లినదనుకొనవలెను. అందు మూర్ఛనావిశేషములుకూడ వెదజల్లబడెను. ఏదేని ఒక రాగమును ఆలపించునపుడు రాగానుసారిగనున్న రాగరంజక ప్రయోగములను గాయకుడు గాని వాద్యమును పలికించువాడుగాని శ్రోతృచిత్తసుఖావహమగునటుల సకృత్తుగ పలికించును. అద్దానిని వినినపుడు శ్రోతృ చిత్తము సమ్మోహితమై ఒక విధమగు మూర్ఛితస్థితిని పొంది అవశమైన ఒక వివశస్థితిని పొందును. ఎంతటి మహా సంగీతశాస్త్రవేత్త అయినను అతిసకృత్తుగ నిర్వహించెడిది మూర్ఛన, అట్టి మూర్ఛవలను వెదజల్లినాడనుటలో భంగ్యతరముగ జంటకవుల సంగీతప్రీతియే వ్యక్తమైనది.

**ద్వితీయాశ్వాసమున బ్రహ్మ కొలువుతీర్చియుండగా వాటిని దర్శింప

---

* వ. పు. i-89

మూర్ఛన యనునది ప్రాచీన గ్రంథములందు ''మూర్ఛర్యతేయధా శ్రోతృ చిత్తం సా మూర్ఛనా'' యని చెప్పబడగా కాలక్రమమున అది స్వర చారమునకు పర్యాయముగా రూఢినొందినది.

** నడిచె నింద్రుడు కిన్నరకాహళులు మ్రోయ

గమకించె శిఖిడిండిమమ్ములు మ్రోయఁ

జనియె దండధరుండు జయదుందుభులు మ్రోయ

వెళ్ళె దైత్యుఁడు గిడిగిళ్ళు మ్రోయఁ

బోయె నంబుధిరాజు బూరగొమ్ములు మ్రోయఁ

జరగె వాయువు మురజములు మ్రోయ

నరిగె యక్షుండు కిన్నెరవీణియలు మ్రోయఁ

గదలె రుద్రుండు శంఖమ్ములు మ్రోయ ii-8

సుధాంధసులేగుదెంచిరని తెల్పుచు అటకేతెంచిన దిక్పాలుర విభవానుసారి వాద్య ధ్వానమును ఈ యుగళకవులు మనకు విన్పించినారు. *ఈ గ్రంథమునకు పీఠికను సంతరించుచు గురువర్యులు శ్రీ పుట్టపర్తి కళాప్రపూర్ణులు "ఇంద్రునిలో మురజములెందుకు రాలేదు. అంబుధి రాజునకు కాహళులెందుకు లేవు. దండ ధరునకు జయదుందుభులెందుకు లేవ"నుచు ప్రశ్నవర్షమును కురిపించి వానికి జవాబులు కవులే చెప్పవలయుననిరి. చమత్కరించుటకు సరస్వతీ పుత్రులట్లనిరే గాని లేనిచో సమాధానములను వారే చెప్పియుండెడివారు. నాకు తోచిన రీతిలో అద్దానికి సమాధానమియ్యది ** మన సంగీతనృత్య గ్రంథములలో బృంద మేళన చాతుర్యము ప్రశంసింపబడినది.

సుకవివంటి ఉత్తమ వాగ్గేయకారకుఁడు బృందమేళన చతురుడగుట హర్షింపదగినట్టిది. కావుననే సంగీతసంప్రదాయమును జన్మతః ఎఱిగిన ఈ యుగళకవులిట బృందవాద్యధ్వాన కాహళులను, డిండిమములను, జయ దుందుభులను, గిడిగిళ్ళను, బూరగొమ్ములను, మురజములను, కిన్నెర వీణియలను శంఖములను ఒకపరి తతఘనసుషిరావనద్ధములను చతుర్విధ వాద్య సంఘాతమగు 'వతోద్యమేళనము'గ మొరయింపజేసిరి. ఇంద్రుడు కిన్నెర కాహళులు ధ్వనించుచుండగనేతెంచిన యక్షుడు కిన్నెరవీణియలు మ్రోయగ తరలి వచ్చినాడట. చెప్పిన వాద్యనామమును చెప్పక చెప్పిన ఈ కవులు రెండుచోట్ల ఒకేవిధమగు కిన్నెరవాద్య విశేషమును దడవియుండిరని మొదట చెప్పినది మార్గివాద్య ప్రభేదమగు కాహళయని అద్దానిని మొరయించినవారు కిన్నరులని చివరిదిగా చెప్పినది కిన్నెరయను దేశ్యవాద్యమని యెఱుగనగును. ఇవియేకాక ఈ వాద్యములందు కొన్ని అనూచానముగానున్న మార్గివాద్యములున్నవి. మఱి కొన్ని జానపదులుకూడ మొరయించెడి గిడిగిళ్ళు, బూరగొమ్ములు, కిన్నెరలు వంటి వగునవికూడ కలవు. ఈ యుగకర్తయగు శ్రీనాథుడు కర్ణాటబాణిని పరిపోషించినాడు. మార్గిదేశి ప్రక్రియలకు నడిమివాటముగ నడచు శ్రవణసుఖ

---

* వ. పు. పీఠిక 'x''x'

** "గాత్రవాదకసంఘాతో బృందమిత్యభిధీయతే
ఉత్తమం మధ్యమమధో కనిష్ఠమితి తత్త్రిధా"

ప్రతిపాదితమగు శ్రీనాథకర్ణాటబాణిని యీ యుగళకవులు బృందవాద్యమేళనము నందుకూడ ప్రతిపాదించి తమ తౌర్యత్రిక ప్రజ్ఞను వెలయించినారు.

"గీతం వాద్యం తథానృత్తం త్రయం సంగీతముచ్యతే" అనునటుల ఈ యుగళకవుల సమగ్రసంగీత పరిజ్ఞానము మఖిల చతుర్థాశ్వాసమున గౌరముఖుని కథలో పొడగట్టినది. అట ఆ మనుజేంద్రశేఖరుడు మణిపీఠిమీద యధివసించిన తఱి ఆతనిని వినోదపరచుటకు ఒక సమగ్రసంగీత సభాకార్యక్రమము సంఘటిత మైనది* ఇట ఒక పద్యమున నట్టువరాంధ్ర ఆహార్యవిశేషములు వ్యక్తముకాగా

---

* "సరసిజద్వయముపై మొరయు తుమ్మెదపిండు
వలెఁగాళ్ళగజ్జెలు గులకరింప
కంతుని బాణంబు గరి చందమునఁ బింజె
లిడుచుఁగట్టిన చీర గుదుసుపడగ
హిమముగప్పిన రథాంగముల చందమున గం
చెలలోని మెఱుఁగుఁ జన్నులు చలింప
చదలఁబ్రాకిన మెఱసంజభావమునఁ గ్రొ
మ్ముడి మీదఁజెంగావి ముసుగు నిలువ"

సంగముల గీతమర్థంబు హస్తముల దృ
గంచలంబుల నాకూతమంఘ్రి పల్ల
వములఁదాళంబు దెలియ మార్గమున దెలిసి
ముద్దియలు గొందరాడిరి మోహనముగ iv - 128
హరిణీనయనలు గొందఱు
మొరయించిరి కాలమానమునఁ బ్రవీణా
మురజపణవ ఢక్కా ఝ
ల్లరికా ఝర్ఝరులు ద్రుతవిలంబిత గతులన్ iv - 129
వాళీకముఖులు గొందఱు
పాళగసంకీర్ణ శుద్ధపద్ధతి మెఱయగా
నాళతుల నేసి పాడిరి
తాళగతులు మంద్రమధ్యతార శ్రుతులన్ iv - 130

మఱి మూడు పద్యములలో నృత్తవాద్యగీత రీతులు వ్యక్తములైనవి. నాట్యగత్తియొక్క కట్టు, బొట్టు, కాళ్ళగజ్జెలు మేలిముసుగులో సహితముగ సంపూర్ణ ఆహార్యరీతిని విశదముగా వర్ణించిన ఈ కవుల నాట్యవైశారద్యమభినందనీయము.

అందానాట్యసుందరి అంగముల గీతము అర్థము హస్తముల, దృగంచలములాకూతమును అంఘ్రిపల్లవముల తాళమును మార్గరీతినంగీకరించి గావించిన నాట్యరీతి భరతప్రోక్తమగు సిద్ధాంతరీతికి సంవాది* ఆ పిదప నున్న పద్యమున ఆ నాట్యప్రదర్శనమునకు వలసిన నేపథ్యవాద్యరీతియందలి ద్రుత విలంబితగతులలో సాగిన ఆతోద్యమేళనారీతి వ్యక్తమైనది. నాట్యమునకు వాద్యము అనుగతముకాగా ఏతద్వాద్యసహకారము నందుకొనిన గానపద్ధతి కూడ అత్యంతశాస్త్రరీతియందే యిట ప్రతిపాదితమగుట ముదావహమగు విషయము. ఆ గానము రసమయమగు నాట్యమునకనుగతమగుట వలన వివిధ రాగరీతులిట వెల్లివిరిసినవి. అంతేకాక ఆ నాట్యము లయాత్మకము శ్రుతిసుఖ ప్రతిపాదక మగుట వలన అందు వివిధ తాళగతులు మంద్రమధ్యతార శ్రుతులలో ధ్వనించి ఆనందబ్రహ్మ సాక్షాత్కారమును కల్గించినది. ఇట్టి ఈ ప్రథమాంధ్ర యుగళ కవుల అపార తార్యత్రికపాండితి తదనంతర యుగమునందలి సంగీతజ్ఞులగు రామరాజభూషణ, రఘునాథాదుల కారాధ్యమైనదనుట తథ్యము.

దశమాశ్వాసమునందొకచో రుద్రస్థానమిటుల వర్ణితమై నృత్తగానములకది పఠాస్థానమై విలసిల్లినది.

> "రహిగల రుద్రకన్యకల రాగము వినుచున్
> సహసితలీల భృంగిరుతి నాట్యముగనుచున్
> ద్రుహిణకపాలపాలికలు గ్రుచ్చిన గద్దియపై
> మహిమ సుపర్వకోటి....మాకొలువై నిలువన్"

వారటుని వర్ణనమున విరిసిన సంగీతప్రసక్తిలో నాతని మహతీస్వరూపము

---

* కలితాలంబయేద్గీతం - హస్తేనార్థం ప్రదర్శయేత్
చక్షుర్భ్యాం దర్శయేద్భావం - పాదాభ్యాం తాళమాచరేత్
వ. అభినయకళ. అ. [illegible]

సుస్పష్టమై భాసించెను. నారదుని మహతీనాదమును వర్ణించినవారు ఎందఱున్నను ఆతని మహతిలోని ప్రత్యేకతను గూర్చి సుస్పష్టముగా చెప్పినవారు వీరు ఇరువురే అనవచ్చును.

"ప్రౌఢమై నూరుతంత్రులవీణ వాయించు
సరిలేని జగజెట్టి జంత్రగాఁడు
గానప్రభవాఢ్యులైన తుంబురు పర్వ
తులతోడి కూరిమి చెలిమికాఁడు"* గ నారదుఁడు వర్ణింప

బడెను. దానితోపాటు నారదునిది నూఱు తంత్రుల వీణయని మనకు తెలియుచున్నది.

ఏకాదశాశ్వాసమున వైష్ణవిపఖాస్థానము నలువరాణి కొలువుకూటమునకు దీప్తై భాసించి గానప్రభావాఢ్యమైనది.

"శ్రుతులాకృతులుదాల్చి నుతులు గావింపంగ
నానానిలింపులు నుతులుసేయ
మునులాగను రహస్యములఁబూరనలునల్ప
నప్సరస్త్రీలు నాట్యంబు చూప"

ఇట్లు తపశ్చర్యనొనరించుటకేతెంచిన నారదుడు కథానుసారిగ ఒకచోటఁజూచిన కొన్ని వైచిత్రులను గూర్చి చెప్పుచు శ్వేతదీపమును గూర్చి ఇట్లు చెప్పెను.** విశ్వమోహనకృతిక్కిన్నర కామినీమధుర నానాలాపములు నిరంతరము వినవచ్చుచున్నవనినాడు. ఇట్టి నాదాత్మికమైన వర్ణన చేయుటకు కవులకు నాదోపాసనాభిరంస ఉండితీరవలెను. నారదునిగాంచి సావిత్రీదేవి పరిహసించినది. దానితో నారదుని వివేకముతోపాటు ఆతని గానవిద్యానైపుణ్యము గూడ చెడిపోయినదని తలంచుటలో కవులదైన గానాభిమానమే వ్యక్తము.

---

* వ. పు. x - 9

**

బ్రహ్మహత్యాపాతక దోషమున విరక్తుడైన నృపతి ఒకచో ప్రకృతులచే సామభూతిపూర్వకముగా నిట్లు వృచ్ఛింపఁబడెను. ఆస్థయందేగాక నిరాస్థయందు గూడ సంగీతము చోటుచేసికొనుట యొక ప్రత్యేకత.

"ఉబుసుపోకకునైన నొల్లవు చెవిఁజేర్ప వైణికవల్లకీ వాదనములు"

మఱియొకచో వసంతవర్ణనమున అళిబృందము పాటలు పాడినట్లు వర్ణిత మైనది. వనితల మంజుభాషణములును వర్ణింపబడినవి.

"కమలగర్భగేహినీహస్తమణివల్లకీ వినాదబాంధవములైన మంజు భాషణములతో వోల్చబడినవి.

ఈ కవులు ప్రబోధచంద్రోదయమున ఈమాత్రముకూడ సంగీతాభిరుచివి ప్రదర్శించలేదు. ఈ గ్రంథము సాహిత్యరీతిలోనే కథాకథనవిషయమున "తం తిరిగి మాచారమునకు బొమ్మనుచున్న"ట్లున్నది. అందువలన కవులు సంగీత హృదయులయ్యును తమ పాండిత్యమును అంతగా ప్రదర్శించలేదు.

# గౌరనార్యుని గాన గౌరవము

ఈ కవి కృతులుగ హరిశ్చంద్రోపాఖ్యాన నవనాథచరిత్రములు లభ్యములు. గానానుకూలమగు ద్విపదమునందు కావ్యరచనము చేయుటయందీ కవి సిద్ధహస్తుడగుటచే ఈతని రచనము ఆపాతమధురమై గానామృతదిగ్ధమైనది.

నవనాథ చరిత్రము ప్రథమమునుండి సంగీత తరంగితమైయున్నది. ప్రథమాశ్వాసమునందే కథితమైన ముక్తశాంతభిక్షావృత్తి రాముని వైభవమున సంగీతవిదుల విభవము ప్రత్యేకించి ఇట్లు పరిపోషితము—

"అలరాగదోషంబులు ఆఱునెనిమిదియు
తొలగించు గుణము లైదును రెండు నెలమి
దలకొని గాత్రజంత్రములనేర్పు
గలగి వాసికినెక్కు గాయకోత్తములు
ననుపమంబగు సరసాంతరంగ కవిత
వినుతాభినయ చతుర్విధ నాట్యములందు
సరిలేని నటీనటులు"* అభిక్షావృత్తిరాముని పరివేష్టించియున్నారని నాడు. ఇందు ప్రథమముగా గాయనదోషములు గుణములు ఉట్టంకితములైనవి. ఈ గాయనదోషములు ఇతఃపూర్వవివృతములే. ఈ గాయనదోషములు సంగీత శాస్త్రకోవిదులు పాతికవఱకు నుట్టంకించినను సాహితీవిదులు వానిని తగ్గించి చతుర్దశసంఖ్యాకములుగ నిరూపించిరి. ఇక ఆ దోషములనపాస్తములు గావించు గుణములు ఐదును రెండని నెలమిన ఏడని అన్నాడేమో గౌరనార్యుడు. గాయన గుణములను సంగీతశాస్త్రజ్ఞులు

"హృద్యశబ్దః సుశారీరో గ్రహమోక్ష విచక్షణః
రాగారాగజ్ఞ భాషాజ్ఞ క్రియాజ్ఞా ప్రాజ్ఞకోవిదః
ప్రబంధ గాననిష్ణాతో వివిధాలప్తి తత్త్వవిత్"** ఇత్యాది ఏడుకు

---

* న.నా.చ. i-

** గాయనదోషములు చూ. ప్రా.ఆం.శ.సం.ప్ర. పుట

మించి చెప్పియున్నారు. ఈ గౌరనార్యునకా దోషములలో ముఖ్యములుగ పదునాలుగు కన్పించినట్లే గుణములు ఏడుగ దోచియుండవచ్చును. సంఖ్యను బట్టిగాక చెప్పిన లక్షణములనుబట్టి చూడవలయును. ఈ కవిగాయకునకు జంత్ర గాత్రములలో నేర్పను గుణము ముఖ్యమను భావనతో అద్దానినే యుట్టంకించి నాడు. సంగీతరత్నాకరకారుడుకూడ ఇద్దానికే ప్రాముఖ్య మొసగి ఇట్లు గ్గడించినాడు.

"తౌర్యత్రితయ చాతుర్యం హృద్యశారీర శాలితా" వాగ్గేయకారునకు ముఖ్యగుణమనినాడు. తౌర్యత్రితయములనగా గీతవాద్య నృత్యములు.

ఇక నాట్యాభిజ్ఞులు ఆంగికాహార్యవాచిక సాత్వికాభినయములందు ప్రౌఢలై యుండవలెననుట సాజమేగదా! అందులకే వినుతాభినయ చతుర్విధ నాట్యముల పరిలేని నటీనటులనుగూర్చి ప్రత్యేకించి ప్రస్తావించినాడు గౌరనార్యుడు.

ఇక తరువాతి సంగీతప్రసక్తి శివుని కొలువునుగూర్చిన వర్ణనము విట్లు గానవచ్చినది. పరమశివుడు గంధర్వ కిన్నరచారణ కింపురుషప్రమథులు పరమ యోగీంద్రులు కొలువగా చింతామణి భద్రపీఠమునఁజిలకొండ కూతును వామాంకమునెనుంచి కొలువున్నాడట.

"భరతకళా ప్రౌఢిఁబరగ వృషేంద్రు
కరమునఁబరిపరి గతులను మొరయ
మురజనాదంబు తుంబురు గీతరవము
నారదరచిత వీణానినాదమును
ఱలహూరు వీనుల పండువు సేయు
విలసిల్లు నచ్చరలో విభ్రమగతులు
దలకొని లోచనోత్సవము సేయ" *

ఖేచర విద్యాధర కామినీ రచిత చారువీణారవశ్రవణము సేయుచున్నాడు. అపుడు మురజనాదమ్ము పరిపరిగతుల మొరయుచున్నది. అది కేవల మురజ [illegible] మొరయింపవలసిన అవసరముండదు. కాని అది వృషభేంద్రుని కరమున భరతకళాప్రౌఢిని పరగుచున్నదిగావున తాండవమొన

* వ.శా.చ. 1 - 8 పు.

రేంభచు నందికేశుడట భరతమును పట్టుచున్నాడనుకొనుటకు నందికేశ భరత నాట్యశాస్త్రము మొదలయగును. కావుననే నందికేశుడట లక్ష్యలక్షణ సంయుతముగ తాండవించుచున్నాడనుట కత్యంతరముండదు. ఆ మురజనాదము తాళలయాన్వితమై తాళదశ ప్రాణములలో ఒకటియగు "గతి" యను తాళాంగముతో నూవిరిబోసికొనుచున్నది. ఈ గీతియను తాళాంగమునకు త్రిస్ర, చతురస్ర, ఖండ, మిశ్ర సంకీర్ణములను ప్రభేదములున్నవి. అవి స్వరాక్షరకాలముల వింగడింపునకు సంబంధించియుండును. ఇక ఈ తాళానుగతముగ గీతవాద్యములు ఆవశ్యకములు గాన ఆతుంబురు గీతరవమున లభ్యమైనది. దాని కనుగతవాద్యరవము నారదరణిత వీణానినాదముగాగ అద్దాని ననుసరించిన తాండవలాస్యములు నందికేశుడును అప్సరోగణములును నిర్వహించినారు పురుషప్రయుక్తమగు తాండవమునకు లలనాప్రయుక్త లాస్యమనుగతమైనట్లే నారదప్రయుక్త మహతీ మహన్నాదమునకు ఖచర విద్యాధర కామినీరణితచారు వీణారవము సహకారమైనది. ఈ విధముగ శివుని కొలువున సంగీత సమగ్ర స్వరూపములుగ తౌర్యత్రితయమును ప్రతిపాదించి గౌరనలోచనోత్సవముతోపాటు వీనులవిందు గావించెను. అవియేగాక ఆహతానాహత నాదములను ఆ నాదమయుని కొలువులో ఉపాసనారీతిగా ఏకత్రా ప్రతిపాదించెనోయన పటహ భేరీ శంఖపణవ మృదంగ పటుఘంటికా ముఖ్య వాద్యరవముతోపాటు పంచమ శ్రుతిచేయు పరభృతముల అనాహతనాద మాధురినిగూడ సముపాదించినాడు గౌరనార్యుడు.

హరిశ్చంద్రోపాఖ్యానము మఱియొక ద్విపద కృతి. నాదాత్మకుడగు పరమశివుని ఉపాసించు గౌరన కావ్యరచనమునుగూడ నాదోపాసనా రీతియుత లయాత్మికతలో ఉరకలువేయు ద్విపదికాచ్ఛందమున సాగించినాడు. దానికి మొదలగ కావ్యాదిలో ఈ కవిగావించిన పరమేశ్వర స్తుతి.

"శ్రీగిరిజాధీశ శ్రీగిరినాథ
గంధర్వ కిన్నర గాంధర్వలోలః
గంధర శ్యామల కంధరోదార" *

* హ.పా. i - 1.

ఈ ద్విపద పాదములలోనే కావ్యాదిలో పుట్టిన శ్రీకారములో 'శ్రీ' రాగము ధ్వనితమై కంధరశ్యామలోదారు అను పలుకుబడిలో 'శ్యామ' కంధర రాగములు వినవచ్చినవి. కావ్యాదిలో ఉద్దేశ్యపూర్వకముగ ఒకటికిమించిన రాగ నామముల సంసూచనముగావించిన కవి ఉత్తరోత్తర కావ్యరచనలో గానకళా చతురుడుగా గోచరించుట సవిశేషము. ఈ పద్ధతి కవిత్రయము వారినుండి అను శ్రుతముగా సాగుచున్న విశేషమని ఇతఃపూర్వము వివరించితిని.

గౌరనార్యునికి సభావర్ణనమున నిజవిభవానుసారముగ సంగీతకమును ప్రతిపాదించుట అలవాటు. నవనాథచరితమున శివుడు కొలువును తీర్చినట్లే హరిశ్చంద్రమున ఇంద్రుడు భద్రపీఠాసీనుడై సంగీతమునిట్లు వినుచున్నాడు.

"పరమ సమ్మదమునఁబాక శాసనుఁడు
.... .... ... .... .... ....
నిరుపమనిజ సభానిలయంబునందుఁ
బరగు చింతామణి భద్రపీఠమునఁ
దనరనాసీనుఁడై తగు ప్రియంబెసఁగ
నారదరణిత వీణావినాదాను
కారియై తుంబురు గానమింపెసఁగ
వినుత రంభానృత్య విభ్రమగతులు
వితానంబునెరప నొనరంగ గొలువుండి" *

సంగీత సమగ్ర తౌర్యత్రితయమును తుంబురుగానమున నారద రణిత వీణావినాదమున తదనుగత రంభానృత్యమున సమగ్రముగ ననుభవించుచున్నాడు. ఇట్లీ కావ్యమున తౌర్యత్రికరీతి అనేకత్ర గమ్యమానము గావించుటతో గౌర నార్యుని గానగౌరవము ప్రదర్శితమగును.

విశ్వామిత్ర ప్రేషితలైన మతంగ కన్యలు హరిశ్చంద్రు మోహింప వేతెంచి ఆడి పాడుదురు. వారు గావించిన సంగీతకమునగూడ గౌరనార్యుని సంగీతాభిజ్ఞతయే యట్లు వ్యక్తము.

---

* హ.పా. i - 1 - 194 - 198.

ఆ మతంగకన్యలు నడిచివచ్చిన తీరులోనే ఒకలయాత్మికతను వ్యంజకము గావించి వారి వీణానుగత గానమున సంగీతామృతమును ఒలికించినాడు గౌరనార్యుడు.

"మదహంస గతులను పుణపించునడలఁ
దడలు మద్దెలు తాళగతులకుఁదాఁక
గతినందియలు గల్లు గల్లన మ్రోయ
మొలనూళ్ల గజ్జెల మ్రోఁతకు రత్న
కలిత కంకణములు గమకంబు సూప"* ఆ కన్యలు కళావేదియైన నృపుని చేరవచ్చి,

తివిరి మీకృప నేర్చితిమి వీణె మీఁట
నవధారు నృపచిత్తమవధారు దేవ
యని సన్నుతించుచు నాకళావేది
మనసు వేడుకఁగని మాతంగ సతులు
పవడంబుగల మంచి పసిడి వీణియల
గవుసెనల్ వెడలించి కాంతిరాఁదుడిచి
బాగుగా కుచములపై మోపిదగిన
రాగసంగతులకుఁదా సారెలొత్తి
తుదగోటి కొనలఁదంత్రులగూడ మీటి
ముదమున జీవాళి మొరయఁబట్టించి
నవరత్నకాంతులు ననలొత్త క్రొత్త
రవల కంకణములు రవరవలెసఁగ
నలరునంగుళుల నల్లార్చుచు వీణె
వెలయ వాయించి ప్రవీణతఁజూపి
మతి మాయూరాదులు మహినెలుగింప
బరగు షడ్జాది సప్తస్వరంబులును
గ్రామత్రయంబును మూర్ఛనలు ముయ్యేడు
నా ముప్పదియు రెండునైన రాగములు

వాని మిశ్రంబులు వాని భేదములు
వానికి వేళలు వరుసతోఁదెలిసి
తగమంద్ర మధ్యమ తారమానముల
మొగియు గాయక దోషములు దొలఁగించి
యాలాపములుసేసి యారాజుమీఁది
సూళాదులింపులు పొగయఁబాడుటయు
నానవ్యమై గీతామృతలహరి
నూని మహైశ్వర్య మొదవెనవ్వేళ
మొరయు వీణాదండమును జిగురొత్తి
నిరుపమమహామాణిక్యముల్ గరఁగె
వలఁకుల వ్రాసినవన్నె చిత్రములు
దలయు గదల్చె చైతన్యముంబొరసి
క్షోణీవిభవుండును క్షుదదీరినట్లు
రాణించుటకు ననురాగమునొంది
వేయుభంగుల రసావేశంబుదాల్చి
మాయురేయని పలుకూఋను మెచ్చి" *

ఈ పాదములలో గౌరనార్యుడు వీణావాద్యమందలి ఆనాటి మెళకువుల వెన్నిటినో తెలిపినాఁడు. వీణియ మెఱుగుపోకుండ గవుసెన బిగించికట్టి యుండెడివారని అవసరమగు పట్టున అగౌసిన తీసి తుడిచి వాయించెడివారని ప్రథమముగ తెలిపినవాడు కవి. ఈనాటి ఇరువదినాల్గు మెట్ల వీణవలెగాక పారెలమ (మెట్లు) రాగానుసారిగ షాడవ, ఔడవ, సంపూర్ణముల ననుసరించి అమర్చుకొనెడి వారనియు ప్రస్తావించినాడు. అంతేకాక ఝుమ్మను నాద ప్రాదుర్భావముగూడ వచ్చుటకు ఆనాడు వీణియకు నైతము నేటి తంబురాకువలె జీవాళిమంచెడివారని గౌరన పలుకులవలన తెలియుచున్నది. ఈ సామాన్య ప్రస్తావనలేకాక ఈ కవి వీణావాదనమున కొన్ని మెళకువల నెఱిగినవాడని "శదగోటి కావలఁదంత్రులగూడ మీటుటలోనలరు నంగుళుల నల్లార్చుచు వీణ

---

* హ.పా. 1 - 942 - 75.

వెలయగాయించి ప్రవీణత జూపుట" లోను తెలియుచున్నది. తుదగోటి కొనతో అనగా చిటికెన వ్రేలిగోటితో మూడు తంత్రులంగూడ మీటుట అనునీ వీణా వాదనమందలి ఒడుపు బాగుగా వీణవాయించుటయో, లేక వీణవాయించుచుండగా అవధానతతో కాంచుటయో ఎఱిగినవాడు మాత్రమే అనగల్గును. నేటికికూడ వీణా వాదన ప్రక్రియలో తాళలయాత్మికతను ఈ మీటుతోనే వైణికులు నిర్వ హింతురు.

ఆ పిదప "మయూరాదులు మహినెఱిగింపఁబరగు షడ్జాది సప్త స్వరములనుగూర్చి" * ప్రస్తావించుట సంగీతరత్నాకరాది శాస్త్రగ్రంథ సంవాది. అట్లే "గ్రామత్రయములు, మూర్ఛనలు ముయేడ, ముప్పది రెండునైన రాగములు" అనునీ ఈ కవి పలుకుబడులన్నియు సంగీతశాస్త్ర విదితములే. గ్రామములు షడ్జమధ్యగాంధారములు మూడు ప్రసిద్ధములు. అందు గాంధార గ్రామము మాత్రము దేవలోక విశ్రుతము. ఒక్కొక్క గ్రామమునకు ఏడు మూర్ఛనల చొప్పున ఇవి ముయ్యేడగుట సంగీతశాస్త్ర వివృతము. ఇక రాగ సంఖ్యా విచారమున ముప్పదిరెండు ముఖ్యరాగములని రాగ రాగిణీవివక్షా విషయమున సూచితమైనది. అదియే గౌరనార్యుడును వ్యక్తము గావించినాడు. రాగములకు మక్రామిశ్రములు, వేళావేళలు సంగీతశాస్త్రమున చర్చింపబడినవి. శుద్ధసాళగ సంకీర్ణములని, రాగాంగ ఉపాంగభాషాంగములని మార్గదేశి విధానము లని రాగప్రభేదములెన్నియో గలవు. అవియన్నియు గమ్యమానమగునట్లు గౌరనార్యుడు రాగభేదములన్ని ఒక్క కొలికితో పదిపూసలు గుచ్చినాడు. వానికి మంద్రమధ్యమ తారస్థాయిలున్నవని ప్రస్తావించి గాయకదోషములను ఆలాప లక్షణములనుగూడ తడవినాడు. ఈ గాయక దోషములు, ఆలాపలక్షణములు ఇతఃపూర్వము వివృతములే.

సంగీత శాస్త్రసాంకేతికముల తల్లక్షణములు దెలిసినపుడు ఏతత్సంగీత శాస్త్రమహాత్మ్యమునుగూడ ఉగ్గడించనిదే తచ్ఛాస్త్రపాండితీ సామగ్ర్యమందదుగావ

* "మయూరశ్చాతకచ్ఛాగక్రౌంచ కోకిల దర్దురాః
గజశ్చ సప్తషడ్జాదీన్ క్రమాత్ ఉచ్చారయంత్యమీ"
సం.ర. స్వరగతాధ్యాయము . 46.

గౌరనార్యుడు సంగీతమాహాత్మ్యమును కొన్ని ప్రస్తావనల ద్వారమున గమ్యమానమొనర్చినాడు. ఆ గీతామృతలహరియందు తేలియాడుటవలననే వీణా దండమిగురొత్తినది. హారమాణిక్యములు గరగినవి. పలకుల వ్రాసిన వన్నె చిత్రములు చైతన్యవంతములైనవి.

కడకు కాశీపురమునందు విన్పించిన పటహభేరీశంఖ పణవ మృదంగపటు ఘంటికా వాద్యప్రభేదికా ప్రఘోషమును ప్రతిపాదించుటలో గౌరనార్యుని వాద్యానుగత గానగౌరవము శతధా ప్రఘోషింపబడినది.

గౌరనార్యుని గానగౌరవమునకు ఆకరములైన ఈ హరిశ్చంద్రోపాఖ్యాన నవనాథచరితములు సహృదయ హృదయ వీణాతంత్రులను మీటుచున్నవనుట అనుభవైక వేద్యమగు నిజమేకాని అన్యము గాజాలదు.

# కవి భైరవ రాగరమ్యత

ఈ భైరవకవి సకలకళాచణుడు. విశేషించి సంగీతశాస్త్రము ఆమూలాగ్ర ముగా, నెఱిగినవాడు. కావుననే కవులందఱివలె శ్రీకారముతో పద్యము నారంభించుటేగాక అద్దానిని శ్రీరాగమయంబుగా నిర్వహించినాడు.

"శ్రీమన్మూర్తిరుచుల్ తతద్యుతిఘన శ్రీనామతింపన్
సీమన్ వామకరంబు సాచివలచే శీర్షోపధానంబుగా
రామంబైన ఫణీంద్ర తల్పమున శ్రీరంగంబునందాశ్రిత
క్షేమస్థేమమతిన్ సుఖించు హరిఁబూజింతున్ దయాంభోధిన్"*

శ్రీరాగము ఘనపంచకములలో ఒకటి. ఇది శుభప్రదమైన రాగము. విష్ణుప్రీతికరమైనది గావున ఈ లక్షణములను ఉపశ్రుతిగ భైరవార్యుడు శ్రీరంగ నాథుని వర్ణనము నిందుగూర్చినాడు. దానికి మొదలగా ఈ పద్యమందలి "ఘన శ్రీనామతింపన్", "క్షేమస్థేమమతిన్ సుఖించు హరిన్" అని పలుకుబళ్లలో శ్రీరాగము, ఘనరాగమనుట భంగ్యంతరముగ ధ్వనితమైనది. కృతినాయకుని అన్వయక్రమ ప్రస్తావనలో అతని వంశమువాడైన బాబాజీని గూర్చి ఇట్లనినాడు.

"వినుత సత్యప్రభావిభవ సత్కాంతుల
భీమురుద్ధాము సుత్రాము సోము
.... .... .... ....
.... .... .... ....
సౌందర్య సంగీత చాతుర్య జయముల
మరుని దుంబురుని వాగ్వరుని [illegible]"** బోలునట ఆ బాబాజి భవ్యలక్షణవిరాజి.

---

* i - 1.

** - i,

అఖిల కళ్యాణ మోహనలవాలమగు శ్రీరంగావిర్భావ సంరంభవేళ ప్రణవ స్వరూపంబును ప్రభూత వైభవాభిరామంబునునగు శ్రీరంగధామంబున దృగ్గోచరంబగు సంరంభంబున,

"రావించె నిరవద్యరావ నారద వాద్య
కలితే తుంబురు హృద్య గానవిద్య
మొరసెఁగింకిణీరావ మిళితమై దితిదేవ
సుతుల న ర్తన భావగతులు లేవ" *

అనుచీ పద్యమున సంగీతకమునందలి తౌర్యత్రికరీతి చోటు చేసికొన్నది.

ఇక ద్వితీయాశ్వాసమున ఇక్ష్వాకుని కథలో ఉగ్రతపవ ర్తియగు మార్తాండ కుల మండను తేజోనుభావంబు భావంబులుగలంప నిలుంపు లాత్మపదభ్రంశనాశంక నందరుపురందరు పాలికింజని య త్తెరంగెఱింగించి శతమఖుండుతద్వ్రతభంగంబు సేయనుపాయంబు విచారించి మదనుని అప్సరోబృందమును అటకంపినాడు.

అప్పుడా యప్సరాంగనలు
"సమధరాగంబుల చంపకంబులు
ననమ పదగీతముల హరిప్రియాళములను" ** రాగయుక్తముగ నాదరంబారతంబడల్లబోడి చేసిరట. ఆ పిదప సంగీతకమును నిర్వహించి ఆముని రాయని చి త్తంబునాకర్షింప నిట్లు కోలాహలము గావించిరట.

"సరిలేని బంగారు జలపోసనము వీణె
మెఱుగుడాచఘుగుబ్బ మీఁద నిల్ప
తులలేని వజ్రకాంతుల పెల్లు పెదజల్లఁ
గొనగోళ్ల తంత్రులు గూడ మీటి
నిగ్గులు దులకించు నిడువాలుఁగన్నులు
తళుకు [illegible] మీఁదఁదడఁబడంగఁ
[illegible] ఘల్లుఘల్లున బహుతాళ
గతులు వాయించు సంగతులు నెఱపఁ

* [illegible]

**

గ్రమముతో మంద్రమధ్య తారకలశుద్ధ
మిశ్రసాళగముల రాణమీఱరాగ
వితతిఁదగు పాత్రములు మేళవించి పాడెఁ
దెరవయొక్కతె సంగీత దేవియనఁగ'' *

''నిరుపమ వీణావాద్య -
త్వరనితర కుచంబుగదలెఁదరుణీ మంచాం
తరితోన్నత వామపయో
ధర సందర్శనములేమిఁదావడఁకు గతిన్''**
''క్రీడా మయూరంబు నాడించెఁగంకణ
క్వణ చారుకరతాళగతుల నొకతె''***

ఈ పద్యములలో సంగీతశాస్త్రోమోదిత ప్రసక్తులెన్నియోగలవు. ఇందు భైరవార్యుని సంగీతాభిజ్ఞత బహువిధముల వ్యక్తమైనది. వాద్యములన్నిటిలో గీతముతోపాటు తాళమును తప్పనిసరిగా నిర్వహింపవలసిన వాద్యము వీణ యొక్కటియే కావున కంకణములు ఘల్లుఘల్లన బహుతాళగతులలో సంగతులు నెఱపనొక తెరవ వాయించినదనినాడు. ఇక ఎత్తుగీతిలో తనదైన రాగ వివేకమును ప్రవ్యక్తమొనర్చి రాగనామయుతముగా సార్థకనామధేయుడైనాడు ఈ కవి భైరవకవి. క్రమముగా మంద్ర మధ్యతారములలో అనుటలో రాగ విశోధనమునందలిస్థాయిస్థితులు వ్యక్తములైనవి. శుద్ధమిశ్రచ్ఛాయాలగ రాగముల ప్రసక్తియునిట ఉట్టంకింతమైనది. రాగవితతిలో తగు మిశ్రమముల మేళవించి పాడుటలో ఆయతివ సంగీతదేవియగుటయేకాక భైరవార్యుడు సంగీతదేవుడై నాడనుటలో అతిశయోక్తిలేదు.

ద్వితీయాశ్వాసమున విభీషణుడు శ్రీరంగశాయికి శ్రీరంగమున ఉత్సవ మాచరించిన ప్రసక్తికలదు. ఆ వైభవమున దొరలిన మాటలలో సంగీత ప్రసక్తులున్నవి.

---

* ii - 20.

** ii - 23.

***

"భేరీమృదంగ శంఖారావముల మించి
చారణస్తోత్ర నిస్స్వనములెసఁగ
.... .... .... ....
.... .... .... ....
ధ్వజరణత్కింకిణీ తాళసంగతి నింపు
దనరు నచ్చరలనృత్యములు మొఱయ" *

ఈ పద్యపాదములలో గీతవాద్యనృత్యత్రయియై సంగీతకము సాక్షాత్కరించి తాళసంగతి నింపులుగులికినది.

ఇక తృతీయాశ్వాసమున చిత్రసేనుని కథలో భైరవార్యుని సంగీతాభిజ్ఞత విరాట్స్వరూపమును దాల్చి ఇట విశ్వరూప ప్రదర్శనమునే గావించినది. కథాను పారిగకూడ సంగీతమునకిచట మహోన్నత స్థానమున్నది. చిత్రసేనుడు శ్రీరంగ విమానచ్ఛాయను మదిరాపానమత్తుడై దాటి శాపోపహతుడైనట్లు నేలగూలినాడు. ఏ తదపరాధమునకు నిష్కృతిని కాశ్యపమహాముస్యుపదేశమును పొంది చంద్ర పుష్కరిణిలో అవగాహనముచేసి విష్ణుబిరుదాయుతములైన గానములుపాడి విష్ణుని కృపకుపాత్రుడై పూర్వశక్తిని పొందినాడు. ఈ గానమునాతడు గావించుటను గూర్చి ప్రస్తావించుటలో భైరవార్యుడు తన సంగీతశాస్త్రాభిజ్ఞతను ఒక్కపుటలో వెల్లివిరియించినాడు.

"చిత్రరథుండు అభంగ సంగీత ప్రసంగమున నారదమామనోహర చిత్తంబు ప్రసన్నతాయత్తంబు చేయబూని....సముద్భవంబులై మంద్రమధ్యమ తారభేదంబులందమవలన....ద్వివిధంబులైన శ్రుతులకు ఆధారంబులై మయూరాది రుతంబులచేత సంకేతంబగు షడ్జాది సప్తస్వరంబుల పరస్పరమేళనంబు, నభిధామంబగు గ్రామత్రయంబు నవలంబించి మతంగ తుంబురు నారద కోలాహలాది తంబగు మతంబులననేక ప్రకారములైన మూర్ఛనల నింపుగడలొత్తు చతురుత్త రాశీతి తానంబులవమానంబులై సంపూర్ణషాడవ సమేతంబులగు చతుర్వర్ణంబులు ఆశ్రయంబుగఁజెప్పంబడిన ప్రసన్నాది ప్రభృతి కాలంకారికంబులు పదమూడును

బరిస్ఫురింపఁగంపిత స్ఫురితాహత తాందోళితంబులలోనుగాగల సప్తగమకములు మొరయ అష్టాదశ జాతిప్రభూతములై శుద్ధభిన్నగౌళ దేసరి సాదారీతోపరాగ సంజ్ఞల ప్రసిద్ధంబులైన శుద్ధరాగంబులు ముప్పదియాఱును రాగాంగములు ఇరువదియును. భాషాంగములు నలువదియేడును ఉపాంగములు ముప్పదియొకటి క్రియాంగములు మూడునుగా పది తెఱంగుల నూటముప్పదియేడగు రాగంబులు వేళావిభాగంబులతో నాలాపంబుచేసి సమతాళ, పదక్రమ బంధరంబులగు నాసింధుపరదు బిరుదాంకితములైన ప్రబంధములు పాడఁదొడగనెనపుడు కర్ణామృతాయమానంబగు గంధర్వ రాగము నాకర్ణించి"*

ఇందు శ్రుతుల లక్షణము "షడ్జం మయూరోవదతి" ఇత్యాదిగా చెప్పబడిన సప్తస్వరసంకేతకములు షడ్జ, మధ్యమ, గాంధార గ్రామత్రయంబులు ఏనుబదినాలుగు తానంబులు సంపూర్ణ షాడవ ఔడవాదికములైన జాతులు అద్యములగు రాగస్వరూపములు మంద్రాది ప్రసన్నాది నామంబులతో ప్రసిద్ధులైన స్వరాలంకారంబులగూర్చి కంపితస్ఫురితాహతాదికంబులగు శ్రోతృచిత్త సుఖావహంబులగు 'స్వరకంపనాయాతములగు గమకములనుగూర్చి రాగములలోని అవాంతరప్రభేదములైన శుద్ధరాగాంగ, భాషాంగ, ఉపాంగ, క్రియాంగాదిక రాగలక్షణములగూర్చి వానిని గానము చేయదగు వేళావిభాగంబులంగూర్చి ఇట ప్రస్తావితమైనది. ఇవియన్నియు ఒక్కొక్కటి కొక్కొక్క ప్రధానశీర్షికగా సంగీతరత్నాకరాది శాస్త్రగ్రంథములందు చర్చింపబడియున్నది. వానినన్నిటిని ఒక్కపుటలో నిమిడ్చి ఏకధాటిగ నేకరువుపెట్టిన భైరవుని సంగీతపాండితి నిరుపమానము. కేవలము సంగీతశాస్త్రమునేకాక సంగీతమహత్వమునుగూడ భైరవుడు అభినందనాయుతముగా నిట్లు వ్యక్తమొనరించినాడు.

"పెలవులంబులు రాలఁజెవులొగ్గి మృగములు
తరలక మేపులు దలఁగి నిలచె
గగనవీధులఁబారు ఖగములు పాంతభూ
జములపైబ్రాలి నిశ్చలతనొందె

* iii - 265 వచ.

మంజుప్రాసాదమణి కుట్టిమంబులు
　　గఱగి నీరై జాలుగట్టిపాఱె
దరులతాపంక్తులు మరలఁ బ్రాయము వచ్చి
　　చిగురు.... జెలువుమిగిలె

నచటి జనమెల్ల వితరకార్యములు దక్కి
సంతతానంద పరవశ స్వాంతులగుచుఁ
జిత్రరూపులకైవడి చేష్టలుడిగి
యున్నవారున్న చోటనే యుండిరపుడు''*

చతుర్థాశ్వాసమున ఒక్కచో శశిపుష్కరిణీ వర్ణనా సందర్భమున అటగల ఆరామ వర్ణనమున.

''సామంబులంచిత స్వరముగ మునికుమా
　　రులఁజది వించు కోకిల కులంబు
హరిబందు కిన్నర వరులకు నాలాప
　　విధములాపించెడి మధుకరములు
నమరవిలాసినీ సముదయంబునకు లా
　　స్యగతులొజగరపు శిఖావళములు''

ఇట్లు తిర్యగ్విలాసములలోఁగూడ ఈ భైరవకవి స్వర, ఆలాప, లాస్య గతుల విధానముల మెరుగునుదిద్దుట మరువలేదు. మొత్తముమీద ఈ భైరవార్యుని శ్రీరంగమాహాత్మ్యము సంగీతతత్త్వమునుగూడ వెలయించుచు మహా మహత్వపూర్ణమై భాసించుచున్నదనుట నిక్కము.

---

# వెన్నెలకంటి అన్నయ గానాభిరుచి

వెన్నెలకంటి అన్నయ రచించిన షోడశకుమారచరితమున కథాకథనమే ముఖ్యమైయున్నది. కళావిలాసములకు ఎక్కువ ప్రాధాన్యము లేదు. కాని, ఎడనెడ ప్రసక్తానుప్రసక్తముగ ఇంచుక సంగీతకరీతి ప్రస్తావితమైనది.

ప్రథమమున కమలాకరుని జన్మసందర్భమున ప్రవర్తిలిన శుభశకునములలో సంగీతకమిట్లు చోటుచేసికొనినది.

> "మంగళతూర్య సమాజంబునకు మున్న
> నభమున సౌరదుందుభులు మ్రోసె
> నర్తకీ మోహన నాట్యంబునకు మున్న
> నిర్ఝరీ నృత్యంబునింగిఁ జెలఁగె" *

తరువాత ద్వితీయాశ్వాసాద్యంతములనున్న కృతికర్తసంబుద్ధిలో వాద్యానుగతమైన సంగీతప్రసక్తి ఇట్లు వినవచ్చినది.

> "శ్రీమద్విరించి తరుణీ
> కోమల వీణావినాదకూలంకష వా
> గ్భామాభిరామ సుకవి
> స్తోమ కృతౌన్నత్యయన్న సూరామాత్య" **

> "శరదమృత మయూఖశ్లాఘ తేజోమయాంగా!
> హరిహర పద్మ ధ్యానధన్యాంతరంగా
> నరపతి హృద్యనర్తన - నాట్యరంగా
> పరబల తిమిరాశి ధన్యనోజ్యపతంగా" ***

ఇక షష్ఠాశ్వాసమున ఒకశ్లోకము సలక్షణలక్షితమైన చెప్పి షుదు అద్దానికి మధురాకువిస్తర చిత్రకవితలు చెప్పు చేర్పుతోపాటు

---

* షో.కు చ. i - 30.

** ,, ii - 1.

*** ,, ii - 186.

"నూతన రీతుల ధాతువిభ్రమముల
రసములు మెఱయవర్ణకముల్పాడు" * నేర్పరితనము కలదని పలికినాడు. ఇందు సంగీత రచనావిధానమున ప్రధానమైన ధాతుమాతు ప్రసక్తి వినవచ్చినది. స్వరరచనయగు ధాతువునకు విభ్రమముగూర్చు రీతిలో రసములు మెరయ ఆళుకము వర్ణకము పాడునని యిట తెలిసికొననగును. ఈ నాటికిని సంగీతశిక్షణమున గీతములను, వర్ణములను గురుపరంపరా పద్ధతిలోనే నేర్పు సంప్రదాయము నిలచియున్నది. ఈ ఆశ్వాసమునందే కృతిపతి సంబుద్ధికై కూర్చిన మందారదామములో సంగీతము ఒకసుమమై వాసించి "సంగీత సాహిత్యసారస్యలోల" అను సంబుద్ధిగా భాసించినది. ఆశ్లేష సప్తమాశ్వాసమందున్న సంబుద్ధిలో

"వీణావాదన చలదలి
వేణీ వీణాప్రసూన విహరన్మధుప
శ్రేణీగానా కర్ణన
ఘూర్ణీకృతనేత్ర హరిత గోత్రపవిత్రా" ** అనుచు కృతిభర్త అన్నయాచార్యుని రసికతను, సంగీతాభిరుచిని వ్యక్తపర్చెను.

ఇక అష్టమాశ్వాసమున ప్రవర్తిలిన పెండ్లి వేడుకలో పెండ్లికొడుకు తరలి వచ్చు ముచ్చటలో

"వాంశిక వైణిక పాణవిక బృందానేక
వేణు వీణాస్తుతి క్వాణములను
లాపిక మోహన లాస్యకేళీలోచిత
మృదంగ ఝర్ఝరాది మహితరవము" *** అని వినవచ్చుటలో సంగీత తౌర్యత్రికక్రీడ సంకీర్ణమై మెఱసినది. ఆశ్వాసాంతమున కృతిభర్త సంబుద్ధితో ఆతని కళాభివృద్ధి వ్యక్తమై కృతికర్తకన్న కృతిభర్తకే సంగీతశాస్త్ర పాండితి మిన్న యనిపించుచున్నది.

---

* శో.తు.చ. vi - 13.

** శో.తు.చ vii - 129.

*** ,, viii - 91.

నాటక ముఖకాహ్లాద నాట్యరహస్యా
ధాటన నిపుణ ప్రజ్ఞా
పాటవ చాతుర్యనూత్న భరతాచార్యా!" * ఇట్లీ 'షోడశకుమార
చరిత' కృతిభర్త కృతికర్త లిరువురు సంగీతాభిరుచికి విధానమైరి. కథాప్రధాన
మగుటవలన కవికి సంగీతశాస్త్ర ప్రసంగములనెక్కువగ గావించునవకాశము
కలుగకయుండి యుండవచ్చును.

---

* షో.కు.చ. viii - 91.

# తాళ్లపాక తిరువేంగళనాథుని సంగీతపరిపాకము

తాళ్లపాక అన్నమాచార్యుని చిన్నిమనుమడు ఈ తిరువేంగళ నాథుఁడు. ఈతని రచనలలో ఉషాకల్యాణమొకటి. ఇందీతడు ఉషాకన్యారచిత వీణావాదన ప్రస్తారము, రాగసమ్మేళన రచనాది ప్రకారమనునొక ప్రకరణమున ప్రత్యేకించి తన సంగీతపాండితిని ప్రవ్యక్తమొనర్చినాడు.

ఉషాకన్య సౌధారోహణముగావించి వెన్నెలరేయిలో రమణీయ శయ్యపై ఉపవసించి వీణావాదనమిట్లు గావించినది.

"గవిసెనయూడ్చి చక్కని నవ్వుమోము
సువిదోర్తు కిన్నెరయొసఁగ నావేళ
వలకేలఁ గీలించి వలుద జక్కనల
బలుమాపు దెగడు గుబ్బలమీఁద మోపి
మొనవ్రేళ్ల శ్రుతి తంత్రిముట్టి జీవాళి
పనుపడ జీఁబనఁబలుకంగఁబెట్టి
సరిగమపధనిస - సనిధపమనుచు
బహువిధాలంకృతుల్వాదు కానంగ
రహిమించి మెయిఁ గ్రామ సంతతులలర
మేళముల్సేసి సమ్మేళముల్గాగ
యాలాప మార్గంబులలర జోపుచును
సంకీర్తనము చిందు జిక్కణిగీత
ముంబెంచి శుద్ధంబులలర మీటుచును" *

ఉషకు చక్కని నవ్వుమోముగల యువిదయోర్తు గవిసెనయూడిచి కిన్నెర అందించినది. దానిని అందుకొని ఉషాసుందరి వలకేలగీలించి వలుదజక్కనల బలుమాపు దెగడు గుబ్బలమీద మోపినది. ఈ వర్ణనను బట్టి చూచిన - కిన్నెర నేటి వీణకన్న ఆకారమున చిన్నదని, దానిని ఆనాటివారు పలికించునపుడు వక్షస్థలమున కీలించుట కమరునని విదితము. ఇక దానిని మునివ్రేళ్ల ముట్టెడివారని,

* ఉ.క. I - 413 - 25.

ముందు శ్రుతితంత్రిని పలికించి పిదప మిగిలిన తంత్రులను జీవాపసవడ జీఙనబలుకంగ మున్టెడివారని తెలియుచున్నది. ఈ కిన్నెర 'తంబుర' వలె కేవలము శ్రుతి వాద్యముగాక స్వరప్రస్తారము ననుసరించి వాయించుటకనువగు వాద్యమని తరువాతి ఈ పాదములనుబట్టి ప్రవ్యక్తము.

"సరిగమపదనిస - సనిదపమగరి
సరిగమ రిగమప - సనిదప" మనుచు

బహువిధాలంకృతుల్పాడు కొనగ రహిమించి వాయించుటలోని ఆరోహణా వరోహణములలో శంకరాభరణ రాగసంచారము వినవచ్చుచున్నది. ఈ సంపూర్ణ రాగమును వివిధాలంకృతుల్పాదు కొనంగ ఉషాకన్య రహిమించి వాయించినది. ఈ రాగము శంకరాభరణమగుట దానిని వాయించుటతో ఉషాసుందరికి ఆమె ఇలవేల్పు ఉమాసుందరి వరప్రాప్తి గల్గించుట సవిశేష సంభరితము. బహువిధా లంకృతులు పాడుకొనఁగ సంగీతశాస్త్రాంతరితమగు అలంకారప్రక్రియావిశేషము లన్నియు ఆ ఉషాసుందరి వీణావాదనమునఁ బలికించినదనుటయు గమ్యమానము. సాహిత్యమున శబ్దాలంకారములకున్నంతటి ప్రతిపత్తి సంగీతమున స్వరాలంకార ములకున్నది. సంగీతరత్నాకరకారుడు అలంకారమును.

"విశిష్టం వర్ణసందర్భం అలంకారం ప్రచక్షతే"* అని నిర్వచించినాడు. అంతేకాక ఈ సంగీతరత్నాకర వ్యాఖ్యాకారుడు ఈ అలంకార విశిష్టతను ఇట్లు గ్గడించినాడు.

"శశినా రహితేవ నిశా విజలేవనదీ లతావి పుష్పేవ
అవి భూషితేవకాంతా గీతిరలంకారహీనా...."**

ఈ అలంకారములు ప్రసన్నాది ప్రసన్నాంతాదికములుగ వివిధములుగ ఉక్తములైనవి. ఇవి స్వరకల్పనమందలి యొదుపులుగ మనోధర్మ సంగీతోప కారులుగ చెప్పవచ్చును. ఇవియేగాక

---

* సం.ర. వర్ణాలంకారప్రకరణం - 3.

** ,,

"....గ్రామ సంతతులు
మేళముల్సేసి సమేళముల్గాగ
యాలాప మార్గంబులలరజూపుచును
సంకీర్తనము చిందు జక్కిణి గీత

మంకించి శుద్ధంబులలర మీటుచు" గూడ పాడినదనినాడు. గానము చేసి స్వరకల్పనము గావించుట పాండితీప్రకర్షకు పరాకాష్ఠ. సంగీతరత్నాకర కారుడు "గ్రామః స్వరసమూహః" అనినాడు. అద్దానిని వ్యాఖ్యాకారుఁడు.

"గ్రామవద్గ్రామః యధా లోకే జనసమూహో
గ్రామ ఇత్యుచ్యతే ఏవ యత్రస్వరసమూహః
గ్రామ ఇతి వివక్షితః స్యాద్గ్రామౌ
విశ్రుతే లోకే షడ్జ మధ్యమ సంజ్ఞికౌ"* అని వ్యాఖ్యానించినాడు.

దీనినే మఱియొక వ్యాఖ్య అయిన సుధాకరమున తద్వ్యాఖ్యాత ఈ గ్రామమును గూర్చి—

"లోకాశ్రయభూతోహి గ్రామ ఇత్యుచ్యతే. తదుక్తం మతంగేన. యథా కుటుంబినః. సర్వ ఏకీభూతా వసంతి హి సర్వలోకస్య సగ్రామోయత్రనిత్యం వ్యవస్థితిః" అని వివరించినాడు. ఇట్టి వ్యాఖ్యల పిండితార్థముగ గ్రామము స్వర సమూహమని భూలోకమున ద్వివిధములైన షడ్జమధ్యమ గ్రామములే విశ్రుతములని తెలియుచున్నది. ఈ గ్రామములను మేళములుచేసి సమ్మేళములుగాగ ఆలాప మార్గములు చూపుచు ఉషాకన్య కిన్నెర వాద్యానుగతముగ గానముచేసినది. ఆమె గానము కేవలము స్వరకల్పనముతో ఆగలేదు. మేళకర్తలలో ప్రచురమగు శంకరాభరణ రాగాలాపముగూడ సాగినది. ఆయాలాపలక్షణము ఇతఃపూర్వము వివృతము. ఇంతేగాక ఆయుషాకన్య "గ్రామఘటితముగ వివిధ మేళముల్సేసి" అనగా వివిధ మేళకర్త రాగములతో సంకీర్తనము జక్కిణిచిందు మున్నగు వివిధ గీతప్రక్రియలనుగూడ గానముచేసినది. ఇందలి సంకీర్తనములు తాళ్ళపాక వంశము వారి గానపాండితికి బిరుదావళుల వంటివి. జక్కిణీపదములు జక్కులపురంధ్రుల

స్వంతములుగ ప్రారంభింపబడి సామాన్యులకందరికి మాన్యములైనవి. చిందు నృత్తానుగతమగు గీతిరీతి. దీనిని జాయపసేనాని,

"ద్రవిడదేశీయైః క్లప్తైః సత్కాకు రీతిభిః
గీతార్థాన మోపేతైః ద్విపదైః చిందుసంజ్ఞకైః" * అని నిర్వ

చించినాడు.

ఈ చిందు సంజ్ఞకగీతములు ద్రవిడదేశీయాగతములు. ఇట్టి గీతములన్నిటిని శుద్ధరాగములలో అలరునట్లుగా కిన్నెరమీటుచు ఉషాకన్య గానముచేసినది. ఈ ప్రకరణానంతరము సంగీతప్రస్తావన ఉషాకన్య కల్యాణ ఘట్టముననే గోచరించినది.

"పాడరే ధవళంబు పాడవేడ్కనిన
కవగూడి యిద్దరు....
ధవళంబువాడి .... నిలువ
బొమ్మపేరంటాండ్రు తోడనే వేడ్క ...
ఘుమ్మన పల్లవుల్ గూడి పాడంగ" **

ఇందు దేశిరీతినగానప్రక్రియయైన ధవళము గానముచేయబడుటయేగాక మార్గి సంగీతపద్ధతియైన పల్లవిగూడ ఘుమ్మనికూడి పాడబడినది. ఈ ఉషా పరిణయము మార్గిదేశిప్రక్రియల సమపాకములో ప్రవర్తిల్లి తాళ్లపాకవారి గాన పరీపాకపు రుచులలో పాఠకులకు చవులూరించుననుట నిత్య సత్యము.

ఉషాపరిణయమేకాక తాళ్లపాక చిన్నన్న రచనలే మఱిరెండు ద్విపద కావ్యములున్నవి. అవి పరమయోగి విలాస, అష్టమహిషీ కల్యాణ ద్విపదలు. వీనిలో పరమయోగి విలాసమున సంగీతము అవకాశమున్నట్లు అమర్చియే సవిలాసముగ దర్శనమొసగినది. కావుననే మొదటి రెండాశ్వాసములలో తానంతర్ధానమొందిన సంగీతసరస్వతి తృతీయాశ్వాసమున ప్రత్యుత్థానమునంది

** ఉ.క. ii - 1841—45.

నిచుళానగరస్థుడగు తిరుపాణయోగి సంగీతోపాసనమున ప్రత్యక్షమైనది. ఈతనిని కవియే గాయకమునియని వ్యవహరించి ఆతని సంగీత చణత్వమును ప్రవ్యక్తము గావించినాడు. ఆతడు గాయకుడేగాక వైణికుడగుట సవిశేషము. అది ఆతని వీణావాదానుగతముగ శ్రీరంగనాథ కల్యాణ గుణకీర్తనమున నిట్లతిశయిల్లినది.

“ఉదయమొందిన నాటనుండి రంగేశు
పదచింతనామృతపానంబు సేసి
.... .... .... ....
లాలిత సకల కళావ్యాప్తియయ్యు
నాళీకకుక్షి గానవిలోలుఁడగుచు
వేణువాదనము సల్పు వెన్నుఁడోయనఁగ
వీణాప్రవీణుఁడై వీణచేఁబూని
యరుదెంచి నిచ్చట నాగరికభూమి
హరి దివ్యమూర్తిగా నాత్మ భావించి
.... .... .... ....
ఆలరంగ విభునకు నభిముఖంబుగను
నిలచి తత్పదభక్తి నిరతిఁబెంపొంది
తలంపు నెత్తమ్మిలోఁదద్దివ్యమూర్తిఁ
బలుకుఁదద్గుణ దివ్యభవ్య కీర్తనము
నిలపి హస్తముల వీణియఁగీలుకొలిపి
కలయంగఁదంత్రులొక్కటఁజిందు పఱచి
కొనవేలు శ్రుతి తంత్రిఁగూడంగ మీటి
మహిమ మంద్రమధ్యమములు దారకమును
నిరవందజూపి యాయత మొనరించి
స్వరలయ గ్రామమూర్ఛనల పంచులెఱిగి
స్ఫురిత కంపిత ముఖ్యముల బాగులెసఁగ
వర రసలీల భావములు చొప్పడఁగ
ఘనశుద్ధమును సాళగమును సంకీర్ణ
మును దేటపడగ జగన్మోహనంబౌవ

వీనుల విందు గావింతగా సాహ
గానలోలునకెంత కర్ణామృతముగ
సతతంబు నీగతి సవరేయి దనుకఁ
బ్రతిలేని కూర్మివిపంచి మీటుచును
ఎడపడకుండఁబెక్కేడులీగీతిని
గడివోని కూర్మికైంకర్యంబు సేయ
నామహాయోగి గానామృతంబునకు
శ్రీమానిని యెరిగి శ్రీరంగవిభుని
చిత్తంబులోన రంజిలి పద్మమోము
నెత్తమ్మి మిగుల నూనిన ప్రేమఁజూచి
నటులయ్యోగి నాథుగానంబు
వింటిరే వీనుల విందులయ్యేడివి
అమితమై నాకు నయ్యమరులు గ్రోలు
నమృతంబుకంటె మోహనమును చూపెడును" అని నాడట.

దానికా పద్మవాసిని

*దేవతావక దయాదృష్టిఁజెన్నొందు
భావింప నీ ప్రాణప్రదమైన వానిఁ
బరిపూర్ణమైన నీ పదపద్మ భక్తిఁ
బెరపి దేవరకెంత ప్రియమైన వానిఁ
బరువి సంగతి వెలువలనుంపఁదగునె
పరమాప్తుఁగాఁగఁ జేపట్టి నీ కరుణఁ
దిలకింప నికటవర్తినిజేసికొనఁగ—"వలయును" అవినదట.

దాననారంగవిభుఁడు మోదించి లోకసారంగాఖ్యునితో

**"నా సద్గుణములు వీణను దెల్పికొనుచు
నానేస్తుడైన గాయకసార్వభౌము

* వ. యో. వి. కాకినాడ ముద్రాక్షరశాల ప్రతి 1928) III-251-253
** ,, III-254

నలవాని వేగనీయంసంబునందు
నెలమియై నిడికొని యిటకుఁదెమ్ము"* అనెను.

ఇట్లు నాదోపాసనాకైంకర్యముతో శ్రీరంగశాయిని మెప్పించి ఆ ప్రభునిచే గాయకసార్వభౌముడని వ్యవహరింపబడినాడు శ్రీ తిరుపాణుడు. ఈ గాయకమౌని గావించిన వీణావాదనానుగత గానకైంకర్యము కేవల భక్తి సంభరితమేగాక సంగీతశాస్త్ర సిద్ధమైనట్లున్నదనుట వలన తిరువేంగళనాథుని సంగీతాభిమానము వ్యక్తమగును. ప్రథమమున ఆ గాయకమౌని హస్తముల వీణియఁబాదు కొలిసి కలియంగ తంత్రులొక్కట నెలకొల్పినాడట. ఆతడు వీణియను శ్రుతిచేసి కొనుటయేగాక ఆ పిదప కొనవ్రేళ్ళ శ్రుతితంత్రి కూడంగ మీటినాడనుట తాళమును నిర్వహించుటకు సూచన నేటికిని వీణియలో లయానుసారిగ ఒక్కట మీటు మూడు తంత్రులను శ్రుతితంత్రులనుటకద్దు. ఇవి శ్రుతిచూచుకొనునపుడు పలుకు పాపాసాలకు అనగా మంద్రమందలి షడ్జమునకు మధ్యస్థాయిలో పంచమమునకు తారాస్థాయిలోని షడ్జమునకు శ్రుతిచేయబడియుండును. కావున వీనిని శ్రుతి తంత్రులను వ్యవహారము తగిపోయినది. ఈ మూడు తంత్రుల నొక్కపరి కొనవ్రేలి గోటితో గూడంగ పలికించుటనే మీటువేయుట యందురు. ఈ మీటులో శ్రుతిలయలు రెండు ఇమిడియున్నవి. ఈ పద్ధతి నంతటిని తిరువేంగళనాథుడు "మును మంద్రమధ్యములు దాటకమును నిరవొందఁజూపి యాథ్యత మొనరించుటలో" సంసూచితమొనరించినాడు. వీణావాదన చతురిమను తరువాతి పాదముల లోని "స్వరలయగ్రామమూర్ఛనల రంచులెఱింగి స్ఫురితకంపిత ....ముల బాగులెసఁగ వరరసలీల భావములు చొప్పెసగ ఘనశుద్ధమును సాళగమును సంకీర్ణము దేటబడట జగత్మోహనంబొదవ వీనులవిందుగా గానముచేయుటలో అతిశయిల్లినది. స్వతః రంజిల్లునది స్వరము. భాషకు అక్షరము మూలధాతు వైనట్లు గానమునకిది మూలాధారము.

ఇక లయయనునది కవితకు ఛందమువలె గీతికి అందమునుగూర్చు ప్రాణము. ఇది కాలప్రమాణమును తాళదశప్రాణములతో సూచించును. ఇక [illegible] సంగీతప్రక్రియలలోని స్వరకల్పన రాగాలాపనమ్ములందలిది.

---

* త. యో. వి. కాకినాడ ముద్రాక్షరశాల ప్రతి (1928) III—255

గ్రామమూర్ఛనలు. సంగీతశాస్త్ర సాంకేతికములు. ఒకే స్వరమును పౌనః పున్యము నొనరించి ఆమ్రేడించుట గ్రామమనబడును. అది గాగ రిగరిసరిగాగ దపగరి గాగదప గరిగాగ ఇత్యాదిగా స్వరస్తబక రచనములో స్వరకల్పనమును సాగించుట గ్రామముగావించుట యందురు. ఇక మూర్ఛన యనునది "మూర్ఛర్యతే యత్ర శ్రోతృచిత్తః సామూర్ఛనా" యని నిర్వచింప బడినది. వినువారలకు సమ్మోహస్థితిని బోలిన పారవశ్యమును ఘటించు రాగ రంజక ప్రయోగమియ్యది. ఇక పాడునపుడు సాహిత్యమునందలి సభంగాభంగ శ్లేషలవలె ధాతుమాతువుల విఱుపులో రాగభావమును తదంతరితార్థమును ప్రవ్యక్తముగావించి ప్రక్రియను గమకమందురు. ఈ గమకము దశవిధములుగ వింగడింపబడినది. అవియే స్థిరకంపితతాదికములు. తిరువేంగళుడు ఈ గాయకముని "స్ఫురితకంపిత ముఖ్యముల బాగులెసఁగ వరరసరీతి భావములు చొప్పడగ గానము చేసినాడనుటలో ఈ పద్ధతినంతటిని పనిగట్టుకొని చెప్పి తన గానాభిమానమును వెలార్చినాడు. ఇక ఆ గాయకమౌని విష్ణుగానసంకీర్తనమును కేవల సంకీర్తనమువలె గానరాగమాలికగ నిర్వహించినాడను విశేషము "ఘన శుద్ధమును సాళగమును సంకీర్ణమును తేటపడ జగన్మోహనంబొదవ గానము గావించినాడనుటలో ప్రవ్యక్తము. ఇందు ఘనరాగములు సాళగ లేక ఛాయాలగ రాగములు సంకీర్ణరాగములు, అనురాగవిశేషములు సవిశేషములై భాసించినవి. ఈ రాగప్రభేదములు ఇతఃపూర్వము వివృతములు. ఈ రాగము ఫణితి జగన్మోహనముగ నున్నదనుటయేగాక ఇందు జగన్మోహినీ మోహనరాగముల నామములు వినవచ్చుట సవిశేషము. అంతేకాక ఆ మహాయోగి గానామృతములో అమృతవర్షిణి శ్రీరాగనామములు వినవచ్చి అది మోహనము చూపెడుననుటలో మోహనరాగము ఆమ్రేడితమైనది. ఇంతటి శాస్త్రసిద్ధఫణితిలో గానకైంకర్యము గావించిన గాయకమౌనిని రంగశాయి గాయకసార్వభౌముడని వ్యవహరించుట సార్థకము. ఆతని మూపుపై నెక్కించుకొనిరమ్మని లోకసారంగాఖ్యుని ఆదేశించుటలో గీతికి ఘనసన్మానము గావించుటయైనది.

ఆ తరువాత సంగీతప్రసక్తి విప్రనారాయణచరిత్రమున దేవదేవి విమలేంద్రు కొలువున వీణాదివిద్యాప్రవీణత జూపినపట్టున ఇట్లు చోటుచేసికొనినది,

"విమలకుసరిగి యానృపకులోత్తంసు
విచుశేంద్రుఁబొడగాంచి నేర్పునపుడు
రాణించు రాగవర్ణములలోఁగూడ
వీణానువిద్యాప్రవీణతఁజూపి
తక్కిన కళలయందలి నేర్పునెఱపె"*

ఇది దేవదేవి రాగవర్ణాదికముల గానముచేసి తదనుగతముగ వీణావాదనము గావించి ప్రదర్శించిన సంగీతపాండితిని ప్రవ్యక్తము గావించినదను విషయమును దెలిపినవట్టు. త్యాగయాది సంగీతత్రిమూర్తులు అవతరింపకముందు సంగీత పాండితీ ప్రదర్శనమగు సంగీతసభా కార్యక్రమమున ప్రధానాంశములు గీత వర్ణములుగనే యుండెడిది. సంగీతత్రిమూర్తులు కృతులు రచించిన తరువాత సంగీతసభలలో కీర్తనలను గానముచేయు పద్ధతి ప్రాచుర్యమునందినది.

ఇక తదనంతర సంగీతప్రసక్తి అష్టమాశ్వాసమున నాదమునిపై గావించిన విద్వత్పరీక్షణమున గోచరించినది. ఇందు విచిత్రమగు తాళధ్వనిగణనపరీక్షణ మిట్లు ప్రస్తావితము. మానవగానరీతిని గానముచేయు వారలిరువురు చోళనాథుని దరికేతెంచి తమ గానవిద్యలతాంతములు క్రమమేర్పడ అవధరింపుడనినారట. అపుడు సభవారెల్లరు విబుధగానంబు నెఱుంగక మెచ్చుకుండిరట. అట్టిసమయమ్మున ఆ మానవగాయకుడు "తన విద్య ధరలోన నాథముని దక్కఁగా........ ఎఱుగరమమ" అపుడా భూజాని ఆ నాదమునిని వినయమేర్పడంగ రావించి "అమవమ సింహాసనాసీనుఁజేసి వీరి పాటలందలి మేలు దేవర విని వాదుదీర్పంగ వలయుననుచు". అందులకామాని గాయకుడు

"వెలయ వారల పాట విని దేవగీతి
పలిపెడివాని మెచ్చుఁగఁజేయునపుడు
సామాజికులు కొంత సందేహపడిన
నా మాటలన్నిని యానాధమౌని
యామెత్త వంచల్లోఘంటైవ యట్టి

* ప్రా. శా. చ. IV - 436, 44. పుట - ...

వేయి తాళములు వేవేగఁ దెప్పించి
యాయెడ నొక్కమాటన్ని తాళములు
వాయించుమనుచు నావాదమాలించి
తలకొని యొక్కొక్క తాళమున్నేసి
పలములటంచుఁ జొప్పడగఁ జెప్పుటయు
సరియైన ముదమంది సభ్యులతోడ
ధరణీవిభుండు పాదములను 'నెఱింగె"* నట. ఆ పిదప ఈ సన్ని వేశమున నాదముని అనుపమసింహాసనాసీను గావించుటలో గీతియును సింహాసనాసీనమైనంతటి ప్రపూజ్యత నందుకొన్నది.

ఇక ఈ గ్రంథమున ముగింపులోనున్న రామానుజాచార్యచరితమునఁగూడ సంగీతమునకవకాశము లభించినది. లక్ష్మణగురుడను గాయకుడు

వరదుడు పరిజన వైభవస్ఫూర్తి
యమచారల గొలువున్న యత్తరి వచ్చె
ఘనమైన తన దివ్యగానంబు పొగను
వినిపించి యానాదవేదిఁ బొక్కింప
వలనుగా మెచ్చనా వరదుఁడు....
ఫలదు వేడుము నీకు వలయునర్థమ్ము
లన విని రామానుజాచార్యుని నాకు
వనమాలి వరద..............."** అని ప్రార్థించి పొనవిపించుకొనెను.

ఈ గానామానశక్తి భగవంతునికి, భక్తులకు, మహారాజులకు, పరమ యోగులకు సామాన్యమై మెప్పుగొలిపించి.. పరమయోగివిలాసమేగాక పరమ గానయోగవిలాసమై మాన్యమైనది.

---

* వి. నా. చ.

** ,, viii - 12152 - 12160

ఈ తిరువేంగళార్యుని రచనయే అష్టమహిషీకల్యాణముకూడ. ఇది కల్యాణాత్మకమగు విష్ణుగాథగాన అయ్యవతారమూర్తియైన వేణుగోపాలదేవుని మురళీనినాదము సమయోచితముగ నీకావ్యకథానుగమనమున నేపథ్యగానమై ప్రతిధ్వనించును. కవి, తాను, తన వంశస్థులందఱు సంగీత శాస్త్రవేత్తలేయని సగర్వముగ కావ్యాదిలో చెప్పికొని ఇందు సంగీతము ప్రాముఖ్యతను వహించునని చెప్పక చెప్పికొనినాడు. తన వంశకర్తలలో ఆద్యుడు పదసంకీర్తనాదికర్తయగు అన్నమాచార్యుని ఇట్లు ప్రశంసించినాడు.

"పరమ విద్యాసింధు పారంగతుండు
....వనజాత సర్వసురేంద్రముఖులు
గనలేని వేంకటశ్రీనాథనాథు
....పదములు శోభనాస్పదములౌ తనదు
పదములు బహుదేశపదముల జనులఁ
గనఁజేసి పంచమాగమసార్వభౌముఁ
డనఁ బ్రసిద్ధికినెక్కు డఖిల విద్యలను
నన్నయాచార్యుండె యనఁదాళ్ళపాక
యన్నమాచార్యుండె యతికీర్తిఁ జెలఁగె"*

అన్నయాచార్యునికి పుత్రుడగు నరసింహగురుని గూర్చి ఇట్లు ప్రస్తావించినాడు.

"అరయఁదిమ్మాంబకు నాత్మసంభవుఁడు
పాడఁజెప్పగ వర్ణపద్ధతి నీడు
జోడు లేడని సభజొచ్చి వాదించి
పరిగిన ధీశాలి ప్రతివాది దైత్య
నరసింహుఁడనఁగల్గె నరసింహగురుడు"**

* అ. మ. క. i - 58 - 66

** ,, i - 70 - 75

ఇక ఆతని పుత్రుడగు తిరుమలాచార్యవర్యునిగూర్చి చెప్పికొనుచు ఆతడు

"సంగీత సాహిత్య సార్వజ్ఞగత్వ
మంగళసామ్రాజ్య మహితుఁడై యలరె"* ననినాడు.

తుదకు తననుగూర్చి చెప్పికొనుచు తాను సంగీతసత్కళాధికుడనని పలికినాడు.

"అన్ని విద్యలయందు నరయ మిన్నంటి
యన్నయాచార్యుఁబోలు నన్నయాచార్య
సాత్త్విక శుభమూర్తి సంగీత సత్క-
విత్వాధికుని తిరువేంగళాహ్వయుని
జయయుత శ్రీలబ్ధ సహజకవిత్వ
నయు తిరువేంగళనాధుని నన్ను"**

ఈ ప్రథమాశ్వాసాంతరితమగు వంశగుణగానాంతరము కథాగమనమున కాళియమర్దనాది సన్నివేశములన్నియు సంగీతప్రధానములే.

"బక శుక చక్రశాబక పికధ్వనుల
ప్రకటన ర్తక తాళపద్ధతుల్గాఁగ
పంచదా సంచార చంచరీకములు
యంచితరవము గానాళియై పరగ
............ .... షక్షి పక్షాగ్ర
రటనముల్పటహ సంగ్రాముల్గాగ
విషపావకావృత విపులాంతరిక్ష
కషణ ఫణాళి రంగస్థలిగాగఁ
జంఢ పద్ధతి భోగసత్యంబు బెదర
చండమరీచి చండత్కుండలములు
మండిత నిజగతిత మండలీయుగళి
తాండవంబాడఁగఁ దాండవంబాడె*** నాడట కాళీయఫణి ఫణాళిపై గోపాలదేవుడు.

---

* అ.మ.క. i - 97 - 98.

** ,, i - 111 - 116.

*** ,, ii - 1630 - 1641.

ఇక యమునానదీ తరంగములలోకూడ సంగీతధ్యానమునే ప్రతిపాదించి తన సర్వజ్ఞతను తిరువేంగళనాథుడీ పాదములలో మలచికొనినాడు.

"సంగీత పంచమ షడ్జల్పాడు
లంగీకరించెనో యనఁ జెంతఁబల్కు
కలకంఠముల భుజంగ గ్రాస నిరత
కలకంఠములతోడఁగడు నొప్పుదాని" *

ఈ ద్వితీయాశ్వాసముననే గోవర్ధనోద్ధరణ ఘట్టమున్నది. జడివానకు జడియక గోవర్ధనమును కొనగోటితో ధరియించి గోపగోపికాజనముల రక్షించి ఇంద్ర గర్వభంజనము గావించినాడు గోపాలదేవుడు. పురుషోత్తముని చేత రక్షణనందిన ప్రకృతి పులకించి రాగమయియై భ్రమరఝాంకృతి ఆలాపినీధ్వని ........రాగయుతముగ.

"అలరు విల్తుమామయగు చందమామ
కళలలోఁబూర్వనగంబుపై విలచె
.... .... .... ....
ఉడురాజుగాంచి పయోధిమిన్నంట
వడిఁబొందెనో యనివలచెఁజంద్రికలు
పొదలఁబూపొదల నింపుదలర్పఁజిలగి
మొదలు తుమ్మెదలెల్ల మొఱపివా దించె"**

ఇట్లు అనురాగమయుడై భ్రమరఝాంకృతిని ఆలాపినీధ్వానమును గావించు కొని చంద్రికాలాపనము గావించుచున్న ప్రకృతికాంత పాటవిని పరవశించి గోపపురుషుడు పురుషోత్తముడై తన వేణుగానామృతమును వర్షింపజేసి సర్వ జగత్తును పరవశింపజేసినాడు. సామాన్య మానవుడు సహితము ఏదేని ఒక చిన్నకార్యమును నిర్వహించిన ఒక కూనిరాగమునుదీయును. అదియాతని ఉత్సాహమునకు ప్రరోచనయగును. ఇట్లు గోపాలదేవుడు కొండంత ఘన కార్యమును కొండనే ఎత్తి నిర్వహించినాడు కావుననే ఆ విజయోత్సాహ ప్రరోచన గానముగ బ్రహ్మగాంధర్వముగ పలికించినాడు.

---

* అ.మ.క. ii - 1792 - 96.

** ,, ii - 2235 - 41.

“...............................గోవిందు
దమిత జగన్మోహనాకారుఁడనుచు
మోదించి కల్పకములేందు కాంత
వేదియై సత్కళావేదియై నిలచె
....  ....  ....  ....  ....
చరణంబుపై నొక్క చరణంబు నిలిపి
మరుని నవ్వెడు భంగి మలఁగి త్రిభంగి
సంగీకరించి మోహనభావ మొదవు
గాంగేయ మురళిఁ జక్కగ మోవిఁజేర్చి
వివరంబుగా వేణువివరంబులందు
సవరగా వరకరశాఖలల్లార్చి
ఘనరత్న కంకణాంగణ కాంతివదన
వనజాతమునకు నివాళియై వరఁగఁ
....  ....  ....  ....  ....
మాయురేయున మంద్రమధ్యతారములు
నాయతంబొనరించి యణుకువమీఱ
రంగురక్తియు మధురము లుట్టి పడఁగఁ
బొంచెడి రసముల పొలుపుదీపింప
వివిధంబులగునేకవింశతి శ్రుతుల
జవకట్టినట్టి యా సప్తస్వరముల
కులమేర్పరించి తద్గోపికా శ్రవణ
ముల కలంకృతులుగా మొగినలంకృతులు
రూపించి గ్రామరాగారోహావరోహ
నైపుణ్య వివిధ వర్ణములు చూపుచును
సమశుద్ధసాళగ సంకీర్ణగతులు
క్రమమున నెదుట రాగములు నర్తింప
నాణమై మిగుల విన్నాణమై యొప్ప
వేణునాదము గావించెనవ్వేళ

గానంబు విమలగానంబు సేయ
తానంబులమృత సంతానంబులొసఁగ
జగతిపర్విసపూరసగమేనిమేసి
మొగి మృగంబులు మోదంబులు మీదికెత్తి
యరగన్నులిడి మేఁతలాత్మలో మఱచి
సురభులు మోదించి చూపంగఁదొడఁగె
నురగనాథుడు చొక్కుచుండె నీరసపుఁ
దరువులిగిర్చె శిలాతలములు గరఁగె
రాగమోహనమంత రాజంబు సకల
భోగ కన్యకలనాగభోగి కన్నెకల
నరిది నాదరించి హర్షింపఁజేసి
నరనాథ భువనమంతయుఁజొక్కఁజేసి
భువనమోహన రసస్ఫూర్తిచే సకల
భువనముల్మఱపును బొందుటేమరుదు
హరియుఁదన్మయుఁడయ్యెనయ్యెడ నాద
గరిమనేమని చెప్పగావచ్చు?"*

ఇంతగా శ్రోతలకేగాక జగత్కర్తయైన స్థితికర్తకు కూడ మైమఱపు గల్పించిన ఆ మహత్తర గానమహాత్మ్యము అంతరిత శాస్త్రపద్ధతి నించుకనను శీలింతును.

ఆ వంశీమోహనుడు గాంగేయమురళిని మూతిపై నిలిపి త్రిభంగి భంగిమలో వ్యత్యస్తపాదారవిందుడై నిలచినాడట. ఆతని మురళిలో మోహనభావ మొదవుచున్నది అనగా భంగ్యంతరమున ఆ గానమున మోహనరాగచ్ఛాయ గమ్యమానమగుచున్నదనుకొనవచ్చును. ఆ మురళీమోహనుడు ఎత్తుగడలో ఆ రాగాలాపనయందు మంద్రమధ్యస్థాయిలుగూడ పలికించినాడు. ఆ పిదప రక్తిని కలిగించునట్లు రసోద్దీపకముగ ఏకవింశతి శ్రుతులలో జతకట్టినట్టి సప్తస్వర విన్యాసముమకూడ నిర్వహించినాడు. సంగీతశాస్త్రమున శ్రుతులు ద్వావింశతిగ

---

* అ. మ. క.

చెప్పబడగ ఈ తిరువేంగళుడు ఈ శ్రుతులు ఏకవింశతి సంఖ్యాకములనినాడు. ఇక ఆ గానలోలుడు గావించిన వేణుగానమున తద్గోపికా శ్రవణములకు అలంకృతులుగ స్వరాలంకారములు రూపింపఁబడినవి. ఈ స్వరాలంకారముల గూర్చి మరల వివరింపబనిలేదు. ఇది ఇతఃపూర్వము వివృతములే. స్వరకల్పనాయుత గానము వివిధాలంకారయుతముగ గానము చేయబడిన తదనంతరము ఆరోహణావరోహణాయుత క్రమపద్ధతిలో వివిధ వర్ణముల గానము కూడ వేణుగాన సహకృతిలో ఆ గోపబాలుడు గావించినాడు. ఆ పిదప శుద్ధరాగములు, సాళగ రాగములు, సంకీర్ణరాగములు కూడ మూర్తిమంతములై ఎదుట నర్తించునట్లు ఆన్నృత్తము మిగుల విన్నాణము నొందినది.

వివిధ రాగప్రభేదయుతముగ రాగాలాపనము సాగి అలంకార విశేష సంయుతముగ స్వరకల్పనారీతిలో పల్లవి సాగిన పిదప మిగిలినది తానము. తానమును గూర్చి వివరించుట జరిగినది గాన నిపుడు మరల దానిని వివరింప పనిలేదు. ఆ బ్రహ్మగాంధర్వవిదుడొనర్చిన తానములు అమృత సంతానములను ఒసగినవి. ఇంతవఱకు వేణుగానసహకృత బ్రహ్మగాంధర్వ మహాత్మ్యమును వర్ణించిన తిరువేంగళనాథుడు అది శ్రోతృగతముగ నెట్లు భాసించినదో ఇట్లు పర్యాలోచించినాడు. సంగీతమునకు లాలనప్రచోదనలను ద్వివిధ శక్తులున్నవి. ఆ శక్తులతో సంగీతము సత్వగుణమును, తమోగుణమును, రజోగుణమును క్రమముగ గల్గిన శిశువులను, పశువులను, ఫణులను గూడ ఆకర్షించి పరవశింప జేయును. అంతేకాక చైతన్యరహితములగు స్థాణువులను సహితము కరిగించును. ఈశ్వరునకు గూడ ఏమాత్రము అంతుబట్టని కవితారసమును గానరసము ఈ విశిష్ట గుణముచే సర్వోపభోగ్యమై మించిపోయినది. సంగీతశాస్త్ర ప్రతిపాదితమగు నీ త్రిగుణాత్మక మహాత్మ్యమును ఆ తిరువేంగళుడు వేణుగోపాలుని మురళీగాన మహిమాన్వితరీతిలో ఇట్లు వివరించినాడు. తమోగుణాత్మకములగు మృగములు, సత్వసంభరితములగు సురభులు రజోగుణోపేతములగు ఉరగములు ఆ వేణుగాన మహిమలో పరవశించినవనినాడు. భోక్తకేగాక గానము కర్తకు గూడ తుష్టి నొసగి పారవశ్యమును ఘటించునను అంశము ఈ వర్ణనమున ప్రతిపాదితము.

భువనమోహన రసస్ఫూర్తిచే సకల
భువనముల్మఱుపును బొందుచేమరుదు

హరియుఁదన్మయుఁడయ్యెనయ్యెడ నాద
గరిమనేమని చెప్పగా వచ్చు* ఇట్లు నాదగరిమను ఏమని చెప్పగావచ్చు నని కవి ప్రశ్నించిన తీరులోనే ఏతన్మాహాత్మ్యమును ప్రస్తుతించి సమాధాన మొసగినాడు.

ఆ పిదప మురళీరవళితో తనివితీరనట్లు ఈ ఆశ్వాసముననే తిరువేంగళార్యుడు రాసకేళివినోదవర్ణనమున ఇంకొకపరి గోపాలదేవుని వేణుగానమునిట్లు వినిపింపజేసినాడు.

"రాసమండల మహారంగ మధ్యమునఁ
బలుమాఱుఁజెలఁగి త్రిభంగిగా మెలఁగి
నిలచి యొయ్యారి వన్నియ వేణువంది
లీల నాలోలాంగుళీ పల్లవముల
మేళముల్జేసి సమేళంబుఁగాగ"**

మురళీరవళిని మొరయింపగా ఆ వేణుగానలోలునితోఁ గలిసి రాధ విపంచి మీటి జోడుగానమిట్లు గావించినది.

"శౌరినిచ్చలు విలాస ప్రసూనముల
నారాధనము సేయు నారాతాగదిసి
యంచితగతిఁ బట్టినట్టి విపంచి
పంచివైచిన రీతిఁ బలికించి తోడ
జోడుగానముగా నొగసుగాఁగూడి"*** పాడినది.

ఆ పిదప రాధ

పాడగా నాబాలగోపాలబాలకుఁడు
చంద్రికల్ వొలసిన జాతిగా వెలదలి
మంద్రమధ్య స్వరమార్గమూల్బూపి

---

* అ. మ. క.
** " ii_2751_56
*** " ii_2785_95

వరుసలేర్పడి నిజావళియు భజావళియు
సరసి సాగళము తాయము లేర్పరించి
మార్గదేశిక తాళమానముల్వింత
మార్గంబులై యొప్ప మధురతల్లల
వేళలు జాతులు వేర్వేరఁదెలిసి
దాలుగా గాణ దొడరు మల్లు డిట్లు
వేణునాదంబు గావించె నవ్వేళ

.... .... .... .... ....

చారునాదముల సంచారభేదములు
నీరీతి నటియించి రెంతయు వేడ్క
సరసిజన్ముఁడు విలాసమున రాసమున
సరసనాట్యముఁజూపఁజరఁదె వెండియును
త్వరితాంగ సంగబంధుర రాగబంధ
ములఁ బ్రవర్తిల తానములు నిల్పి నిల్పి

.... .... .... .... ....

అంగహారములుయ్యాల లూగుచుండ
నంగహారములనలవు చూపుచును
నీరీతి నటియించె నెంతయుఁబ్రీతి"*

ఆ రాసనృత్యమునకనుగతముగ గోపాలదేవుడు సంగీతశాస్త్ర ప్రసిద్ధ.... రీతులలో వేణుగానము గావించుచు అంగహారాదిక నాట్యహేవాకములతో నటించి మించినాడు. నశాస్త్రీయచ్ఛాయాలగాది (సాళగ) రాగములలో తాయములేసి మార్గదేశిక తాళమానముల ననుసరించి లయాన్వితరీతిలో ఒక్కొక్క రాగమును గానము చేయవలసిన వేళలు జాతులు వేర్వేరఁదెలసి తద్రాగ సంచారానుసారముగ మురళిగానము గావించినాడు. గోపాలబాలుడు అపుడా మురళీనాదానుగత వాద్యాను సారిగ ఒక సుందరి కిన్నెర మీటుచు తన వాద్యప్రతిభను ప్రదర్శించినది. ఈ సన్నివేశములో తిరువేంగళనాథుడు గీతవాద్యనృత్యాత్మకరీతినిట్లు ప్రదర్శించినాడు.

---

* అ. మ. క. ii–2790–2844

వనజాక్షునెదుట జీ వనజాక్షియొకతె
యనువుగానప్పుడు మోహనముగా నిలిచి
మధ్యమాది గ్రామ మండితంబుగను
మధ్యమేళము సింహమధ్య మేళముగఁ
గీలించి యొసఁగెడు గిన్నెర సముసు
వాలు చేతుల నేఁటవాలుగాఁబూని
కుసుమంజసుల తేటగుంపువైకొనిన
సరలి కిన్నెరకాయ చనుదోయిరాయ
మేలిమియగు తంత్రి మీటి చొక్కముగ
మాళవి యొనరించె యవగడంబుగను
బెళుకు తాళముతోఁ బెరయ సొంపరయ
నలసోదరుని మీఁది పదజక్కిణియు
వన్నెగా వరుసగా వలువగా మిగులఁ
దిన్నగా సున్నగా తేటగా మించ
మిన్నగాఁ జల్లగా మీటుగా సొలసి
వెన్నుని హృదయంబు వికసింపఁబాడ"
"అలరుచు భళి భళి యనుచు నానాతిఁ
బులకింపఁదొడఁగెఁ గప్పురపు వీడియము"

ఈ పాదములలో వ్రజసుందరుడే గాక వ్రజసుందరులు కూడ సంగీతజ్ఞులుగ తిరువేంగళనాథుడు చిత్రించినాడు. కావుననే ఒక గోపసుందరి రాగమాలికలుగ గూర్చి మోహనసింహేంద్రమధ్యమ, మాళవి మున్నగు రాగములలో బెళుకు తాళము గూర్చి లయాన్వితముగ బలసోదరునిపైని పదములు పాడినదని వర్ణించినాడు. ఆ సుందరి గీతిరీతికి మెచ్చి వ్రజసుందరుడా భామినికి కప్పురంపు వీడియము బహూకరించెనట.

వ్రజవనితలే కాక శ్రీకృష్ణదేవుని చెంత చేరిన కుబ్జ కూడ యమునాసుందరి ధ్యానమునకు ప్రతిధ్వనిగ "సంగీత పంచమషడ్జమూలూర్తు లంగీకరించెనో యనఁ జెంత పలికెడిదేయైనది.

ఇక శ్రీకృష్ణదేవుని వివాహసన్నివేశములలో ముత్తైదువలు, శోభనములు, మంగళములు, ధవళములు మున్నగు పెండ్లిపాటల నెన్నిటినో దేశికగానరీతుల వెలయించి గానము చేసిరనినాడు ముఖ్యముగా సత్యభామాకృష్ణుల వివాహ పట్టమున చిత్రరేఖ, చిత్రఘోష, రంభ, తిలోత్తమ మున్నగు అప్సరోమణులు ఆడిపాడిరనినాడు. వాద్యముల గూర్చి తెలుపునపుడు వీణా వేణువులలోఁ డమరు డిండిమ ముర్ఘరాది రావములు మిన్నంది ఘూర్ణించినవనినాడు. మొత్తముమీద ఈ తిరువేంగళార్యుడు సంగీతసహృదయుడే గాక ఏతచ్ఛాస్త్ర పారంగతుడు కూడనని ఆతడు తన కావ్యములందెల్ల గావించిన సంగీతప్రస్తావనలే నిదర్శనములు. తాళ్ళపాకవారి సంగీతవిద్యాపరీపాక రుచులు ఈ తిరువెంగళనాథుని కృతులలో పచేళిమములై తరతరముల పాఠకులకు చవులూరించుచునే యుండుననుట నిత్యసత్యము.

గీతి సాహితీ సార్వభౌమ యుగము
అష్టదిగ్గజ కవి బృంహిత గానానురంజితవాణి

మధుర భక్తియుత గానామృత వర్షిణిగా
ఆముక్తమాల్యదను వెలార్చి
అష్ట కళా దిగ్గజ బృంహిత గీతిసాహితీ రాగ
ప్రబంధమాలికల ధ్వనించి
ఏకశిలారథమ్ము నధిష్ఠించి విద్యానగర
సీమల విహరించిన
శ్రీకృష్ణరాయ మధుర గానానురంజిత
వాణీ నమస్కృతులు నీకు

# శ్రీకృష్ణదేవరాయ యుగాంతరితులగు మహాకవుల సంగీత ప్రతిపత్తి

1. సాహితీసార్వభౌముని సంగీత రసజ్ఞత
2. అల్లసాని పెద్దనార్యుని జిలిబిలి పాటయందలి జిగిబిగి
3. ముక్కు తిమ్మనార్యుని ముద్దుపలుకులలో నొదిగిన సంగీతము
4. కాకమాని మూర్తికవి, మాదయగారి మల్లనల సంగీతప్రీతి
5. రాధామాధవ కవి సంగీతారాధన
6. అయ్యలరాజు రామభద్ర కవి తౌర్యత్రిక ప్రబుద్ధత
7. ధూర్జటి కవుల సంగీతార్భటి
8. రామాయణ కవుల సంగీతకము
9. కందుకూరి రుద్రకవి అందుకొనిన సంగీతకము
10. తెనాలి కవుల తెలితేనియ పాట
11. అద్దంకి గంగాధరుని కవితలో అందగించిన గానరిరంస

# సాహితీ సార్వభౌముని సంగీత రసజ్ఞత

రాయలనాడు రసికతాజీవనము ప్రాశస్త్యము నందుకొన్నది ఆ విద్యానగర సీమలో బాలకవి నుండి బ్రహ్మకవి వరకు ప్రతి అక్షరాస్యుడు కవితా రసజ్ఞతలో సంగీతరసజ్ఞతను రంగరించుకొని ఆస్వాదించినాడు. అంతదనుక నేపథ్యమున సంతరించుచున్న గీతి తెరవెడలి సాహితితో పాటు విజయభవన రంగస్థలిపై సాక్షాత్కరించి గజ్జెకట్టినది. అట్టి శుభసమయమున గీర్వాణియే వీణను చేతబూని ప్రక్వాణ(క్షణ)క్వణ వినోదముతో శ్రుతి కల్పుకొని గొంతెత్తి నట్టువాంగమును నిర్వహించినది. ఆ మధుర నృత్యగానములతో పరవశించి కృష్ణరాయలు రాజ కవి యగుటయే కాక కవిరాజై తన ఆముక్తమాల్యదను ముక్తకంఠనొసర్చి సంగీత రసజ్ఞను గావించినాడు. గురుదేవుడును సంగీత సూర్యోదయకర్తయు నైన బండారు లక్ష్మీనారాయణాచార్యుని ఆశీస్సులతో సంగీతశాస్త్ర పారము ముట్టి కృష్ణరాయలు సుమధుర గానముతో మధురభక్తిని వచేళిమ మొనర్చినాడు. అపుడది కేవల గానమే గాక నాదోపాసనయైనది.

"గీతేన ప్రీయతే దేవ సర్వజ్ఞః పార్వతీపతిః
గోపీపతి రనంతో౽పి గీతధ్వని వశం గతః"*

"విష్ణునామాని పుణ్యాని సుస్వరైరన్వితాని చేత్
భవన్తి సామతుల్యాని కీర్తితాని మనీషిభిః"**

"నాహంవసామి వైకుంఠే యోగినాం హృదయేనచ
మద్భక్తా యత్ర గాయంతి తత్ర తిష్ఠామి నారద"*** ఇత్యాది సంగీత శాస్త్ర వ్యపదేశితా శాసనముల ప్రఘోషమును ఆకళింపుచేసికొని కృష్ణరాయలు సాహితీసమరాంగణ సార్వభౌముడును సంగీత సామ్రాజ్యాధిపతియునై ముక్తి కాంతాకరావలంబనమును గూడి పొందినాడు. అనన్య సంగీత వైదుష్య సమ్మిళిత సాహితీసర్వస్వము ఆముక్తమాల్యద యనదగును. కావుననే గీతవాద్యనృత్య

---

* వ్యా. మే. క. హోధరపీ సంగీత కార్యాలయ ప్రతి

** వం. పా. ,,

*** వం. పా. షు. 11 శ్లో 16 ,,

త్రయియైన తౌర్యత్రిక విశ్వరూపమిందు సాక్షాత్కరించినది. అట్టియెడ మున్ముగా శ్రీ విల్లిపుత్తూరి విలాసినీజన చేష్టలో రాయలవారి వీణావాదనచణత్వమే ఇట్లు వ్యక్తమైనది.

"వేవిన మేడపై వలభివేణికఁ జుంటవహించ విప్పగా
బూవుల గోటమీటు తటిఁబోయెడు తేఁటుల మ్రోత కామికం
కావహమౌ కృతాభ్యసనలౌటను దంతపు మెట్ల వెంబడిం
జేవడి వీణ మీటుటలుఁ జిక్కడవించుటలు స్ఫురింపఁగన్"*

ఈ పద్యమునందలలనలు తెల్లవారిన వెనుక వీణవలె నిడుపైన వేణిని ఎడమభుజము పైనుండి క్రిందికి జారవైచి నిలచిన తీరులో వీణియను పైకెత్తి వాయించు ఒడుపు గానవచ్చినది. ఆ పిదప వామకుచోపరి భాగమున ధరియించిన వేణియందలి వాడిన పూలను గోటితో విదిలింప నారంభించిరి. అపుడా సుందరులు కృతాభ్యసనలౌట వలన వీణ వాయించుట వలెనే కొనగోళ్ళను వడివడిగా వాడించుచు పుష్పములను బారమీటిరి. చేతులనాడించెడి ఒడుపును బట్టియే కృష్ణరాయలవారు సాదరహితముగ నాచేష్టను వర్ణించిన అట మూగవోయిన వీణియయే త్రయుక్తమయ్యెడిది. వీణియను సమగ్రతనాదమును బట్టియే ప్రాప్తించును. ఇట శ్రీకృష్ణరాయలు వర్ణించిన వీణియలో నాదమెట్లు ద్భవద్ధమగును? రాయలవారు ఆ నాదోద్భూతికి తగిన అనువునే పట్టినారు: రేయంతయు విలాసినీ జనులు ధరించుటచే పూవులు రూపులుడిగినవి. కాని తావులింకిపోలేదు. కావున పౌరభతృష్ణచే భ్రమరములట మూగి ఝుంకృతులొనర్చుచునేయున్నవి. ఆ భోగినీజనుల వేణికల నుండి వికీర్యమాణములగుచున్న సుమములున్నవి. ఆ కుసుమములు సుశ్వేతములు. కావున అవి మల్లెలో జాజులో అయియుండవలెను. అవి యావిడుపాటి వేణికలలో నటనట చిక్కదంతపు మెట్లవలె భాసించినవి. అపుడా పెన్నెఱివేణి వీణాదండమువలె తోచినది. అపుడా దారిన పోవు రసికులు ఆ వింతనుగాంచి అలరిరి: ఇట్లు కుచోపరిభాగ విన్యస్తవీణతో వేణిని పోల్చుట తోడు తెల్లని పూలను దంతపు సరకట్లతో ఉపమించుటలోను వాడిన పూలను బారమీటు ఒడుపులో వడివడిగా జానప్రకల్పనము గావించునటుల వీణావాదన

* ఆ. మా. 1_62

ప్రకర్షను దర్శించుటలోను రాయలవారి స్వీయ వీణావాదనాచణత్వమే ప్రచురమై సంగీతసూర్యోదయ కర్తలగు తమ గురుదేవులనొద్ద తామభ్యసించిన సంగీతశాస్త్ర రీతి వ్యక్తమైనది.

రాయలవారికి వాద్యమందేగాక గీతనృత్యములందును అభినివేశమున్నది. ద్రష్టగా నృత్యము నభినందించుచు శ్రోతగా రాయలవారీ కావ్యమున పెక్కు తావుల రాగవివేకమును ప్రదర్శించినారు. అనంతరాగములలో రాయలవారికి మేఘరంజని వసంత మంగళ కైశికము లిష్టరాగములు. సశ్యశ్యామలముగ తన పాలితపృథివి శోభింప నిచ్ఛగించెడి ధరణీపతిగ ఆలపింపగనే వర్షము నందించెడి ఈ మేఘరంజనీ రాగమును, పరమ వైష్ణవాగ్రేసరుడుగ సద్యోముక్తిప్రదమగు మంగళకైశికీ రాగమును - రసికావతంసుడుగ వసంతర్తు శోభాదాయకమగు వసంతరాగమును రాయలవారు అభిమానించిరి. మేఘరంజనీ రాగమును గూర్చి రాయలవారు మున్నుగా గావించిన యీ వర్ణన మిగుల హృద్యమై వారి సంగీత హృదయమువిట్లు చాటుచున్నది.

"ఆ పురసౌధవీధి నధరాధర భూముల గర్జ మున్నుగా
నాపయికి వ్వినంబడవియట్లు గ్రగా(ప్రా)లఘనాళి దాల్చి లీ
లావరతన్ ఘటింపుదురు లాస్యముసేయఁగ మేఘరంజ నా
లాపముసేసి ఘోషితకలాపిఁగలాపి కలాపకుంతలల్"*

మేఘమండలి నధఃకరించిన ఆ విల్లిపుత్తూరు పురమందలి సౌధవీధిలో వసించెడు కలాపికుంతలలు మేఘరంజనీ రాగాలాపనము గావించి మేఘముల రప్పించి ఆ మేఘ దర్శనోత్సుకలైన కలాపికలనాడింతురట. అట్లే జీవేశ్వరైక్య సంధాయక మధురభక్తి విశేషసంయుతమగు ఆముక్తమాల్యదా చరిత్రమున ఈ మేఘరంజిరాగమొక విప్రలంభ సన్నివేశమున నేపథ్యగానమై ఇట్లు భాసిల్లినది.

"కామిని మేఘరంజి మధుగర్వఘడంతు నటంచులోనిజ
కేతము స్మేరి పాడి మణిచిత్ర మరుత్త్రిణతౌచితద్యుతి"** ఇంథ

---

* ఆ. మా. II - 14

** ఆ. మా. V - 145

విరహాసహమైన కామినియొర్తు వసంతసంతాపమును సైరింపలేక వర్షోదయము గావింపనెంచి మేఘరంజనీరాగాలాపమున మేఘమండలిని సృష్టించినదట. అంతట కదంబ కేతకులు వికసించినవి. తత్పరిమళ మిళితవాయు సంసర్శనము వసంతతాపము కన్న మిన్నకాగా ఆమె మూర్ఛిలినదట. ఇంతటి విరహవృత్తాంతమునకు మేఘరంజనీ రాగాలాపనము కారణమగుట కృష్ణరాయలవారి సంగీతాభిరుచులే తార్కాణమై భాసిలినది.

ఇంకొక్కచో వసంతరాగ విషయికముగ సపత్నీస్పర్ధ యిట్లు వెలయింప బడినది.

"అలరెఁ బ్రియాళునోర్తు ప్రియమౌట వసంతముఁ బాడనపుడ
వ్వెలఁది సపత్ని భక్తికిని వేల్పులు మెత్తురుగాన రాగమన్
ఫలమునఁదన్నుఁ బాడఁగ వసంతుడు దయచేసెఁగాక యా
యెలె నిజశక్తినా యనుచు నీపనకుంగొదవెట్టె నీసునన్"*

ఈ పద్యమున సన్నివేశగతమగు చమత్కృతియే గాక వసంతరాగ వివేచనము గూడ ప్రదర్శితమగుట ముదావహము. "గీత్వా ప్రియాళః" అను దోహదక్రియ వలన ఆమె గావించిన వసంతరాగాలాపనమున నిట ప్రియాళు వృక్షము పుష్పించినది.

"వసంతస్య సహాయస్తు వసంతర్తౌ ప్రగీయతే" అని వసంతరాగమును వసంతఋతువున బాడవలెనను ఆ శాసనానుసారమే గాక ఒక సుందరి ఆ రాగ మామెకు ప్రియమౌట ఆ వసంతరాగాలాపనము గావించినది. అవి సద్యోఫల ప్రదమై ప్రియాళు వృక్షమునకే గాక సపత్ని ఈర్ష్యకును దోహదక్రియయై రాగ వివేచన కాటపట్టైనది. ఇంకొక్కచో ఋతువర్ణనాద్వారమున రాయలవారు రాగ మాలికను ఒక్క పద్దియమున ఇట్లమిడించినారు.

మరుదూడ మలయాహి గరధూమ్యలను గళ
న్మనసిజ రథవదాంజన కళికలు

---

* ఆ. మా. ४ - 133

త్రాసభావచ్ఛిశిరత్యక్త బాష్పములన్
పికపంచమస్వరోద్భేద వీణ
లబ్ధాగమస్మరందాసార జంబువుల్
హిందోళసాశ్రుమ్మకుందరోచు
లభిసారికాంశుకోద్యన్నీల గుళికలు
జాత్యనుల్ల సనాత్త శాపతతులు
చైత్ర సంజీవనౌషధీజాత చేత
నాత్మజని హేతు తరువునర్యాయి యువతి
కరవిధూత హసంతి కేంగాలచయము
లళులపంక్తులు వనుల నల్లాడఁదొడఁగె*

ఈ పద్దియమంతళి మరుదూడ మలయామారుతము వలుకుబడిలో ఈ భంగ్యంతరముచే మలయమారుతము రాగముద్ర గమ్యమానమగుచున్నది. పికపంచమ స్వరోద్భేద వీణలను పదగుచ్ఛమున పంచమశ్రుతి కన్వితమైన వీణా రీతి "పికః కూజతి పంచమ"మ్మను సంగీతాభాణకమునకనుసారి యైనది. "అబ్ధాగమాసార జంబువుల్ హిందోళసాశ్రుమ్మకుందరోచులన్" అనుపాదము "శిశిరస్య వసంతస్య సంధౌ హిందోళరాగ"మ్మను హిందోళరాగాలాపన విధికనుసంధానమైనది. హిందోళము మాధవ ప్రియమైన రాగము. దానిని మా(లక్ష్మికి)ధవుడని విష్ణుమూర్తి పరముగ మాధవుడని వసంతునికి గమ్యమానమగునట్లు ఆశ్లేషించి ఉభయత్ర చమత్కృతిని రాయలవారు సాధించినారు. ఇట్టి పద్యమునందు రాగ మాలికను గూర్చి మఱియొక పద్దియమున "కోకిల పంచమ"మను రాగలక్షణము విట్లు ధ్వనింపజేసినారు.

"ద్విజతఁగాంచియు మధుసేవ విడువలేక
జాతిఁబాపిన తేంట్ల నిస్వనముఁ గూడు
కొమటవోయఁగోకిల స్వనము పెలఁగెఁ
దనకు మఱి పంచమత్వంబు తప్పదనఁగ"**

* ఆ. మా. v - 118

** ఆ. మా. v - 119

ఈ కోకిల పంచమము పంచమస్వర ప్రధానమగు సుపాంగరాగము దీని లక్షణము సంగీతరత్నాకరమున నిర్వహింపబడినది.

"పంచమే మధ్యమాజాతో కోకిల పంచమో భవేత్
పంచమాంశగ్రహః పూర్ణో మధ్యమన్యాస సంయుతః"*

ఇది పంచమాంశగ్రహ పూర్ణత్వమన్నుట వలన నిందు పంచమము ముఖ్య ప్రాణము వంటిది. మధ్యమన్యాససంయుత మనుట వలన నిందు మధ్యమము కూడ ప్రధాన స్వరమే. మధువునకు మధ్యమను నామాంతరమున్నది. ఆ మద్యమును విడువలేని లేంట్లను తడవుటలో మధ్యమము గమ్యమానమై పంచమ స్వరోదీరిత కోకిలస్వరమును సంపూర్ణముగా కోకిల పంచమరాగ లక్షణము వ్యంజితమై కృష్ణరాయుని రాగవివేకమును వెలయించుచున్నది.

ఇక మంగళకైశికి రాగలక్షణము మఱియొకచో కీలకపాత్రమైన చోట నెగడి ఏతద్రాగ మాహాత్మ్యము నుగ్గడించుచున్నది.

"కలఁడొకరుండు పేరు కొనఁగాని కులంబు మదీయ భక్తుఁడి
య్యిల మును వాఁడు వామనతనే వసియించిన పుణ్యభూమి యం
దుల కొక యోజనత్రయపు దూరపుటూర వసించి, బ్రాహ్మవే
ళలఁ జనుదెంచి పాడుమము లాలస మంగళనామకైశికిన్"**

ఈ పద్యమున మాలదాసరి గానము చేసిన మంగళకైశికీ రాగము బ్రహ్మ ముహూర్తమున గానము చేయదగినదని, కృష్ణరాయుని మాటల వలన దెలియు చున్నది. ఈ రాగమింతగా మోక్షప్రదమగుటకునిది శ్రీమహావిష్ణు ప్రీతిపాత్ర మైనదిగ కైశిక పురాణమున విట్లున్నది.

శ్రీభగవానువాచ :

"యన్మయావచితం గీతం స్వరంకైశిక సంజ్ఞితం
ఫలేన తస్య భద్రంతే మోక్షయిష్యామి కిల్బిషాత్

---

* రాగవివేకాధ్యాయః—ఉపరాగాంగాని

** ఆ. మా. vi - 3

యస్తు గాయతి సంయుక్తం కైశికం విష్ణుసన్నిధౌ
స తారయతి దుర్గాణి శ్వపాకో రాక్షసం యథా"*

భక్తిభావావేశమున గానముచేసిన పాపవశ్యము కల్గించినను రాయలవారి వక్కాణ యిది

"గండాభోగములన్మదభ్రమలహారుల్గప్పున్నతుల్పాడి యా
దండన్ వ్రేగులుడించి భక్తిజనితోద్యత్తాండవంబాడు నా
చండాలేతర శీలుడుత్పలకియై చాండాలికన్ మీటుచున్
గుండుల్నీరుగ నెండగాలి వసితాఁకుంజూడ కాప్రాహ్ణమున్"**

కృష్ణరాయనికి గానమందేగాక వాద్యమందును నృత్తమునందును అసమాన పరిజ్ఞానమున్నది. ఎన్నియో వాద్యవిశేషముల నాతడెఱుగును.

"అతఁడు తదల్ప పాపఫలమందుట సుంకము దీఱిపోయి త
చ్ఛతదళపత్రనేత్రునకు జాగిలిమ్రొక్కి రణద్విపంచియై
స్తుతికవిత ప్రబంధముల జొక్కఁగఁబాడి యసత్యబీభర
ద్రుతగతి వచ్చి రాత్రిచరుఁ ప్రతపూర్తి గతార్తి విల్లసున్"*** ఇందు విపంచియను నొక వీణావాద్య ప్రభేదమును గూర్చిన ప్రస్తావన. అట్లే

"చముఱైన తోల్కుబుసంబు తెంకియును వి
త్తళి శంఖచక్రకుండలహలసుర
మత్స్యోదరశయు మూవు పెన్నెఱకఁగు
ట్టిన యోటి తిపిరి దండెయును మెఱయఁ
జిటి తాళములు సంకపుటిక నొక్కొక్కమాటు
గతిరయంబునఁదాది కలసి మొరయ"**** అను పద్యపాదమున వీరకాయబుఙ్జతో మన్న చిన్ని వీణాప్రభేదము వ్యక్తము.

* ఆ. మా. vi - 3
** ,, vi - 7
*** ,, vi - 44
**** ,, vi - 5

గోదావిరహ వృత్తాంతమున మైనముతో మెట్లను అమర్చిన విపంచికను గూర్చి ఆలాపినిని గూర్చి ప్రస్తావితము.

"శ్రీపతిమీఁది గీతముల ప్రేమ విపంచికనంటఁబాడి సం
తాపముసోకి మెట్లమయినంబు కరంగినడించి పాడునా
లాపినిఁదాల్చి పెన్జెనుటలన్మడి తంత్రులు జజ్ఝకోఁగలా
లాపిని దానపాడును గళంబును గద్గదమైన ప్రాన్పుడున్"*

ఇంకొకచో విష్ణుచిత్తుడు వాదమునగెలచి నగరమునకేతించుచుండగా పురజనులు గావించిన ఎదురుకోల సన్నాహమునవెన్నెనో ఁ తతఘనశుషిరానద్ధ వాద్యములు వేర్వేఱు వరుసన రాయలవారు పేర్కొన్నారు.

** అబ్భాగవత పతంసము నునిచికొనుపోవు సమయంబున పరస్పర సమేతములగు పౌరజానపద జనములు గలసిమెలసి నడుచునెడ "మృదంగము, ఉపాంగము, ఆవజము, దండె, తంబుర, కిన్నెర, సన్నగాళె, వీణ, ముఖవీణె వాసెక్రోలు, డోలు.... జారుగుమ్మెట, తమ్మెటము, డక్క, డక్కి, చక్కి, చయ్యంకిలోనగు అసంఖ్యాకవాదిత్రితయ పరంపరలు మొరయునెడ.

ఇంకొకచో మురళీగానమునుగూర్చిన ప్రస్తావన గోదావృత్తాంతమునిట్లు గోచరించును.

"అభినవ కువలయశ్యామకోనుల మైన
  డామూపుమకర కుండలముఁదాల్చి
విస్తులాస్యశ్రీ పయః స్తంభవిక్షిప్త
  వింబచ్ఛద ప్రభువల్పంబు నిక్కఁ
బరువంపు మంకెన విరిదంపు నరవంపు
  వాతెర చంద్రదంపువానఁగుతియ
నందంపు మెఱుఁగు వాలారు కన్గవచూడ్కి
  శ్రవణకుండల కాంతి సవతుగాఁగ

* ఆ. మా. v - 153
** ,, v - 35

సప్తభువనాంగ నానురంజనకు సప్త
విధపరీవాహకముగ గానసుధ వెలార్చ
మాడ్కి వేణులపై వ్రేళ్ల మార్చిమార్చి
మరులు కొలిపితె గోవిందమంద సతుల!"* ఇది గోపాలదేవుని భువన మోహన స్వరూపమును దలచికొని ఆముక్తమాల్యద విరాళిగొను సందర్భమున వర్ణితము. ఈపద్యమున వేణుగానాభినందనముతోపాటు శ్యామశ్రీరాగములు రాగ ముద్రాలంకారములై భాసించినవి. సప్తభువనాంగనా స్వరూపమున ప్రవృత్త మైన ప్రకృతిని సమ్మోహితను గావించుటకు ఆ పురుషోత్తముడు సప్తస్వర ప్రవాహముల వెలార్చి రాగసుధ నొలికించుచు వేణువుపై వ్రేళ్ల మార్చిమార్చి ప్రకృతిపురుషతాదాత్మ్యకావశస్థితిని సంగీతామృత వర్షిణిగా వెలయించినాడని ఈ పరమ వైష్ణవుడిట ప్రస్తావించును. ఇట్లు సంగీతోపస్థితమగు నాదోపాసన గావించి ఆముక్తమాల్యదాకర్తగా చరితార్థుడగుటయేకాక భక్తిభరిత సంగీతో పాసనగావించిన ఆముక్తమాల్యదను ఏతన్మాహాత్మ్యమున లోకమాన్యను గావించి నాడు. గోదాదేవిసంగీతరసజ్ఞయగుట గోదాదేవి స్వరూప స్వభావావిష్కృతియందీ రాగమయముగ గావించినాడు. సంగీతకళానికేతనయగు ఆమె కంఠమున ప్రవ్యక్త మగు రేఖాత్రయమును గూర్చి ఇట్లు ప్రస్తావించి ఆమె తనువెత్తుకూడ తనివి తీరునట్లు రంగభర్త గుణగానము చేయుటకేయనునట్లు ఉద్ఘోషించినాడు.

"కమలదళేక్షణ సంగీ
తమున నిగుడు మంద్రమధ్యతారత్రిస్థా
నములకుఁదీర్చిన లేఖల
క్రమనుగు రేఖాత్రయమున గంఠంబమరున్"**

ఇంకొకచో

"విడువక మీగానము సొగ
గపిడుటయు మటిపాడుఁడనుటయగ్గే! పాపెం
బడిగినవారే పేదలె?
కొడిమెలుగట్టికుఁడి యతనిఁగొవిపవియేలా?"*** అని గోపాలదేవిముఖత,

---

* ఆ మా. v - 67
** ,, v - 18
*** ,, v - 58

ప్రశ్నించి ఆప్రశ్నతోనే సమాధానము విడువక సొగసిడవలయునని మాధుర్యము ఈ నవీనగానానుభూతికి తావలముగావలయునని సంగీతమర్మములను రాయలి మిడించినాడు.

గుడిలోని పూజారికి గుడిపెలుపలి మాలదాసరికి ఇలువెడలని ఇంతులకు ఇలనేలెడి రాజులకుకూడ సంగీతము నిత్యనైమిత్తికానుష్ఠానములలో ఒకటైనది. సంజజామున గాయకగోష్ఠి రాజునకు విహితకృత్యములలో ఒకటి గావించినాడు రాయలు. మాలదాసరివృత్తాంతమున నాదోపాసన ముముక్షుజనుల కుసద్యఃఫల ప్రదమని రాయలుదెల్పినాడు. అనాదోపసనాత్మకరుణాలవలేశ ప్రసరణమున ఘోర పాపములు సైతము సమయునని బ్రహ్మరాక్షసుని వృత్తాంతమున రాయలు తెల్పి, సంగీతమాహాత్మ్యమును ఉద్ఘోషించినాడు. అందులకే బ్రహ్మరాక్షసుడు తనపాప ఫలము సమసిపోవుటకు.

"సంగీత ఫలంబునఁగో
సంగీ సగమైన దయవొసఁగనీవే"* యని మాలదసరిని బతిమాలినాడు. ఇట ఆబ్రహ్మరాక్షసుడు సంగీతఫలమనుటకుబదులు పుణ్యఫలమిమ్మన వచ్చును. అట్లనిన ఆతడు కేవలము బ్రహ్మరాక్షసుదేయగును. కాని, సంగీతజ్ఞడగు కృష్ణ రాయలు మలచిన సంగీతమాహాత్మ్యమెఱిగిన పాత్రకాలేదు. కావున ఆతడు సంగీతఫలమిమ్మని సొగసుగ అడిగినాడు. అందులకే అతడు స్వస్వరూపము నందిన పిదప పరబ్రహ్మణ్యమూర్తియై మాలదాసరిని వలగొని "జయ జయ భక్తి సామ్రాజ్య సార్వభౌమ" అనినుతించినాడు. ఇట ఉక్తమైనభక్తి సామ్రాజ్య సార్వభౌమ అను బిరుదము సంకీర్తనా ఫలసమన్వితమగుటవలన ఇట కృష్ణ రాయని గానాభిమానమే వ్యక్తమైనది. రాగద్వేషముల మాటలలోగాక చేతలలో వ్యక్తముచేసి తనయనుయాయులచే చెప్పించురాచపుట్టుక పుట్టిన రాయలుతనదగు గానాభిమానమును తనమాటలలో చెప్పక తనకావ్యాంతరిత పాత్రాత్మచే చెప్పించినాడు.

"వహన సమయమున మహామహిళ మదీయ పూజోపచితోపచారంబుల విశేషఫలంబు గానంబయనవిని వైష్ణవిందాఁగావున"** గోదాదేవిగ జన్మించి గానో

---

* అ. మా. v - 64
** ,, vi - 90

పానమూలమునందనకు ప్రియమైనదని చెప్పించినాడు. గానముమూలముననే ఉపాధిగ్రస్తజీవునకు సద్యోముక్తి సంప్రాప్తంబగునని ముక్తకంఠముగ కృష్ణ రాయాదులు చాటుటవలనగీతిసాహితిని ఈయుగమున అతిశయించినది.

ఈ కావ్యాంతమందు సంపన్నమైన గోదారంగేశుల వివాహమంగళమున మానవసంగీతమునుగాక దివ్యసంగీతనిర్వహణ దేవుదేవులచే గావించి అద్దానిని సర్వోత్కృష్టము గావించినాడు అందు, 'విధినందన సనందనాదులు సంగీత మాంగల్యంబున అంతరంగమున కింపొనగినారట"

"శర్వాణీ వాణీముఖ
గీర్వాణీ జానకీరఘుకులదా
ఊర్వ్యాచరిత వివాహో
ఖర్వ సుగీతములు పాడగ్రావిభవమునన్"*

ఇక వివాహానంతరమున ఆశ్వాసాంతముగ ఆఖరిమ్రొక్కులు మ్రొక్కినపుడుకూడ ఈ భాగవతవతంసము తనస్వామిని "షేశలవంశీమదనా!" అని ఆవేణుగానమును తన చెవులార విన్నట్లు పరవశించి సంబోధించి తాను గీతి సాహితీ సార్వభౌముడుగ సంభావితుడైనాడు.

గీతవాద్యములందింతటి ప్రజ్ఞాభిజ్ఞతలు ప్రదర్శించిన కృష్ణరాయలు నాట్య విషయమున కేవలము అభిమానిగ, ద్రష్టగ మాత్రమేనిలచినాడు. కృష్ణరాయాభి నందితమై ఈకావ్యమున అనాహతరీతిలో మాత్రమే నాట్యము ప్రయుక్తమైనది. కృష్ణరాయలీ విషయమున విశేషప్రజ్ఞనుగాని, ఏతచ్ఛాస్త్రోదీరిత సాంకేతిక పద జాలమునుగాని ఎక్కడ తడవలేదు. ప్రదర్శించినంతమట్టు గీతవాద్యముల విషయ మునగూడ ఈకవి సంగీతశాస్త్రాంతరిత సాంకేతిక పదజాలమును ఎక్కడ ఏకరువుపెట్టలేదు. లక్షణముకన్న లక్ష్యముపట్లనే ఈతనికి లక్ష్యమున్న. మార్గరీతులకన్న మార్గికేమార్గముచూపెట్టిన దేశిరీతులకే, ఈకవిరాజు ప్రాముఖ్యత నొసగినాడు. ఇంతటి మహాగ్రంథముమ రచించికూడ నెక్కడ సంప్రదాయబద్ధ రాజాస్థాన నృత్యరీత్యభినందనమగు గానసభా ప్రకల్పనమును రాయలవారిందు

* ఆ. మా. vi - 124

గావింపలేదు. కృష్ణరాయనికి పూర్వులగు శ్రీనాథ, గోపన, జక్కనాదులు అర్వాచీనులగు రఘునాథాదులు రాజసభాస్థాన నృత్యముల వర్ణించినారు. కృష్ణరాయలు వర్ణించినంతవఱకు నృత్యరీతులను జానపదనృత్యములుగ మలచి వానిని ప్రకృతి వర్ణనమున వెలయించినాడు. ఒక్కచోవర్షర్తు సందర్భమున వర్ణితమైన నృత్యరీతి యిది.

"అలపర్జన్యుఁడు కేకిపాత్రముల గుంపాడించుచో మేఘమం
దలపున్ మద్దెలగ్రుంగలేవను మరున్మార్దంగికుండర్థినా
త్తలలిన్నెలకు వ్రాలుచున్నెగయుచుండారాడు న త్తెల్ల జ
ల్లులుఁగెంగుచ్చులు నయ్యేధారలునుదల్లోలేంద్ర గోపంబులున్*

వర్షర్తువ్యాజమున పర్జన్యుని మార్దంగికునిగ నుపమించి కేకులను పాత్రములుగ నిలిపి మేఘములను మర్దలములుగ మలచి లయానుసారిగ క్రిందికి వంగుచులేచుచు చేయు నృత్తపు సౌరును ఇట రాయలవారు వ్యక్తము గావించినారు. ఇందు నృత్తానుసారిగ మార్దంగికుడుకూడ ప్రదర్శించిన లయానుసారి అంగవిన్యాసము రాయలవారి మర్దళావాదనాభినివేశమును గమ్యమానమొనర్చి ఈ కళావేది వైణికుడేగాక మహామార్దంగికుడుఁ గూడనను జనశ్రుతిలో నున్న గాథలకిది యుపశ్రుతి, అద్దానికుపస్కారకముగ నింకొక పద్యముకూడ ఇట్లొప్పుచున్నది.

"నటనవర కేకి పాత్ర
స్ఫుట యవనికలన మొగుళ్లు పొదివెలెన్ భూభృ
త్తటుల నవియాకు దినుచిట
పటరవము సెలంగెఁదాళముల చప్పుడునై"**

ఇంకొకచో ఋతువర్ణనపు వ్యాజమున కాళికాపాత్రముగావించిన నృత్తమును రాయలవారు రక్తిగట్టించినారు. ఇందుప్రయోగమున సుసాధముగాని రంగస్థలసాంకేతిక పరిచాలనాయు తమగు సన్నివేశ ప్రకల్పనమున్నది. కాళికాదేవి

---

* ఆ. మా. iv - 92

** ,, iv - 115

స్వరూపస్వభావా విష్కరణతోపాటు ఆమెనోటినుండి నిప్పులు రాల్చవలసిన సందర్భమిట్లున్నది. కాళికయను రాగమునామముకూడ ఇట గమ్యమానమైనది.

*“గగనరంగస్థలంబున మిగులఁబ్రౌఢి
మమూనఁగాళిక నిల్చికోలము నటింపఁ
బొరి మొగంబున రాలునిప్పుకలనంగ
గుంపులై రాలె మహినింద్ర గోపతతులు”

ఆకసమను నాట్యభూమియందు మిగుల నైపుణ్యముతో కుప్పలగుంపును కాళికాశక్తి నల్లనిరంగు పులుముకొనిన వేషమును ధరించి నాట్యము గావించినది అదియును కోలమను నృత్యము.** (నృత్తరత్నావళియందు క్తమైన కోల్హాట నృత్తమునిది పోలియున్నది.) అప్పుడాశక్తియొక్క వికృతకరాళమునుండి రాలిననిప్పుకలేమో అనినట్లు ఇంద్రగోపముల గుంపులు భూమిపైని వికీర్ణము లైనవి ఇందు రాయలవారు ప్రదర్శించిన కాళికానృత్తభంగిమను నేటి కూచిపూడి భాగవతులు దేవీనవరాత్ర వేషములలో నిర్వహింతురు. కాని నోటినుండి నిప్పులు రాల్చుచు చేయు ఒడుపునుమాత్రము వారెవ్వరు నిర్వహింపజాలరు. ఇది విద్యుత్పరికర పరిచాలనావస్థితిలోకూడ ఆధునిక రంగస్థలముపై సుసాధము కాజాలదు. చనలచిత్ర గ్రాహకులు యంత్రపరిచాలనా సహకారమున నిర్వహింప గలరు. అట్టి దుర్గమమగు సాధనాప్రక్రియను కృష్ణరాయలు, నాడే తన ఊహా బలముతో దర్శించి ప్రదర్శించినాడా? లేక అంతటి అద్భుతముల నాటినటులు నిర్వహింపగలిగిరా అని ఆలోచించిన రెండును ఆహాయనిపించుచునేయున్నవి.

మొత్తముమీద కృష్ణరాయలీ ఆముక్తమాల్యదా ప్రబంధమున ప్రదర్శించిన గీతవాద్యనృత్యత్రయియగు ప్రతిభరాయలవంటి నిశితపరిశీలక చక్రవర్తికి మాత్రమే సాధ్యము. ఇందు ప్రదర్శితమైన సంగీతకరీతినిబట్టి కృష్ణరాయలు గీతిసాహితీసమరాంగణ సార్వభౌముడుగను సాక్షాత్కరించుచున్నాడు.

---

* ఆ. మా. vi - 98

** నృ.ర.ఆ. vii - 169. 52. చూ.ప్రా.ఆం.క.సం ప్ర. 'నాచనసోమన' పుట - 159. ప్ర.భాగము.

# అల్లసాని పెద్దనార్యుని జిలిబిలి పాటయందలి జిగిబిగి

గీతిసాహితీ సార్వభౌమము నెఱపిన కృష్ణరాయని విజయభువనము నలువ రాణికి కొలువుకూటమైనది. ఆ గీర్వాణివాలారుం గొనగోళ్ల వేళ్లవలసతిన్ వాయించుచో నాటకునీ మేళంబైన విపంచినుండి వినిర్గమించిన ప్రక్వాణ ప్రక్వణాత్మక నాందీనినాదము ఆంధ్రకవితాపితామహుని జిలిబిలిపాటకు అనుగతమై జిగిబిగితో మించినది. అల్లసానివారికి సంగీతపాండితి వెన్నతోపెట్టిన విద్యయని కవి గండపెండార వృత్తాంతమున తొలిసారిగా కృష్ణరాయ సమ్ముఖమున ప్రవర్తిలిన చాటుమాలిక పాటించినది.

ఒకనాడు కృష్ణరాయలు కవిమండలిని "ముద్దుగ గండపెండియర మొక్కరుం గోరగలేరు లేరొకో" అని ప్రశ్నించిరట. దానికి కవివరులు కిమ్మనకయుండిన పెద్దనార్యుడు లేచి

"పెద్దన బోలుపండితులు పృథ్విని లేరని నీవెఱుంగనే
పెద్దనకీదలంచిన పేరిమినాకిడు కృష్ణరాణ్ణృపా" అని సమాధానమొసగి తదనుగతముగ ఒకసీసమాలికను ఆశువుగపలికి కృష్ణరాయనుమెప్పించి ఆగండపెండరము నందుకొన్నారట. ఈ ఉత్పలమాలికలో కవిత గాననూన సహకృతితోపచేళిమమై పరాకోటినందుకొన్నది. ఇందు పెద్దనగారి పెద్దరికము శేవనమందేకాక గానమందును చెల్లుబడియగునన్నట్లు మృదంగ ధ్వానాత్మకములగు ముక్తాయింపులతో సెబాసనదగియున్నది. ఈపద్యమాలికలో పెద్దనార్యుడు సాహితికిచ్చినంత ప్రాధాన్యత గీతవాద్యములకిచ్చి

"కిన్నెర మెట్లబంతి సంగీతపు సన్నతంత్రి, బయకారపు కన్నడ గౌళ పంతు
రాగా తత తాన తాననలపసందిపుటాడెడు గోటమీటు ప్రతిమ్రోతలన్
బలె హరువు మొల్లముగావలె నచ్చతెన్గు లీరీతిగ" అను పలుకుబడులలో కిన్నెర సంగీతపు సన్నతీగ అందించిన కన్నడ గౌళపంతు రాగాతత తాన తాననలను, అనగా తానములతో మిళితమైన గీతికలను బయకారులు రచింపవలయునని వానివెంబడి అచ్చతెన్గుతో సమతి చవులూరింపవలయునను భావము

ప్రయుక్తము గావించినాడు. ఈ చాటుమాలికలందు పెద్దనార్యుడు సంగీత సాహిత్యములకు సమప్రాధాన్యమునొసగినాడు, ఇందలిదే "గిరికశేఖర శీతమయూఖమౌళికాపాత విధాప్రపూర బహుళంగ ఘనాంగపమూర్ఛవీ జాతకతాళ యుగ్మలయ సంతతిచుంచు వివంచికా మృదంగాతీత తేహి తత్తహిత హాధిత ధందణుధాణు దింధిమింప్రాదాంతరిత" జతి స్వరూప మొక్కటియున్నది. ఇందు లయబ్రహ్మ విరాట్స్వరూపము సాహితీకరావలంబనమంది సాక్షాత్కరించినది, దానికనుగతమై నేపథ్యమున వాదిత్రధ్వానముగ లయానుకూల పరవార కుహూద్వహాహారి కింకిణీ నూతన ఘల్లులాచరణ నూపురయూళముళీ వినాదము తమ్మిచూలిదొర కైవనపుంజవరాలిచేతి కిన్నెర మేలుబంతి సంగీతపు సన్నతంతి గౌళిపంతుకారవము మార్మోగినది.

పురాణ ప్రక్రియాంతరిత దీర్వాణివాణీగర్భమునుండి అప్పుడే వెల్వడి రేఖా మాత్రేతివ్యక్తజీవముతో చిన్నారి నిసువుగ మసలుచున్న ప్రబంధశిశువును ఈ యాళుపద్యాంతరిత గానరసాన్విత మధువునందించి పెంచి పెద్దవానిని జేసినాడు. ఆంధ్ర కవితాపితామహుడు. నాటినుండి తెలుగునాట వెల్వడిన ప్రబంధకవిత గానమోహినియై విబుధులకు ఆపాత మధురిమతో ఆలోచనామృతమునుగూడ పంచి యిచ్చినది. అప్పటినుండియే పెద్దనార్యుని రాగహృదయమును అర్థముచేసికొనిన గీతిసాహితీ విశారదులు అందు భంగ్యంతరమున ధ్వనించిన రాగనామములను రాగభావాన్వితముగ మలచుకొని ఆయావిదిత రాగములలో వానిని గానము చేయు సంప్రదాయమును అలవరచుకొనివారు. మొన్నటిమొన్నటివఱకు గురుముఖతః సంగీతాభ్యసనము గావించి ఆరీతియందు నిష్ఠాత్మృత్వమునందు ఆచరణముచే సంగీతసాధనతో సాగించి ప్రచారమునగూడ కృతార్థత్వము సాధింపనెంచిన సంగీతవిదులు సంగీతసభాకార్యక్రమములో చివరిమెట్టున మనువసుచరిత్రాంతరితములగు పద్యములను గానము చేసెడివారట. ఇప్పుడా గురుపద్ధత్యనుసారముగ మనువసుచరిత్రములందలి పద్యములను గానముచేయుటయేగాక నేర్చికొనుటకూడ మటుమాయమైపోయినది. పంచశతాబ్దులక్రిందట సంగీతాభ్యాసముగాంచిన మా అమ్మగారు సంగీతవిద్యార్థినేతలలోనే ఈమనువసుచరిత్ర పద్యములను ప్రత్యేకించి ఒకరిద్దరు సంగీతవిదులు మాత్రమే నేర్పెడివారట. ఆపద్యపఠనపాఠనము ఆనాటికే సాహితీపిపాసువులకు గురుశిష్యులకు మాత్రమే పరిమితమైపోయినదట.

అట్టియెడ ఈనాడు ఆపద్యపాఠము తామే నేర్పక పోవుటవలన సంగీత గురువు లెవ్వరు తమ శిష్యులకాపద్ధతిని దెల్పుటలేదు. ఒకసారి రెండు దశాబ్దుల క్రిందట మా అమ్మగారితో నేను ఆకాశవాణీకేంద్రమునకేగి ఆచార్య పింగళి లక్ష్మీకాంతము గారిని చూచితిని అపుడు సంభాషణవశమున మాఅమ్మగారియొద్ద కళాశాలయందు గూడ సంగీతభ్యాసనము గావించిన నేను నాసాహిత్యపరిజ్ఞానముతో ప్రాచీనాంధ్ర సాహిత్యాంతరిత సంగీతరీతిని పరిశోధనాంశముగగ్గైకొని పరిశోధన సాగింప నెంచితినని తెల్పితిని. దానికి ప్రాచార్యదేవులు సంతసించి ఈపరిశోధనమున మనువసుచరిత్రముల పర్యాలోచించునపుడు అందలి పద్యములను విధితరీతిలో గురుకుల పద్ధతిలో, విధితరాగములతో గానము చేయవలసిన పద్ధతినెఱిగిన మజ్జనయిత్రి సహకారము ననుసంధింపుమని ఆదేశించిరి. ఆ సందర్భమున నేవారు మనువసుచరిత్రముఅందలి పద్యములను కేవలము మనకిష్టరాగములనుసరించికాక అందంతరిత రాగముద్రానుసారముగ వానిని గానము చేయవలయునను విషయము గూడ నాకు ఉపదేశించినారు. ఏతత్ప్రాచార్యోపదేశానుసారము కొన్ని పద్యము లందలి రాగముద్రాలంకారముల గ్రహించుకొని మాఅమ్మను గురుకులపద్ధతిలో గానముచేయుమనినాను నాభావన మాఅమ్మ గానమునకు పరిపోయినది. ఆమె తన గురువులు గీతిసాహితీవిదులు కీ.శే. అకులకోటయ్యగారు (బాపట్ల) గానముచేయగా, తమ వీణాగురువులు కీ.శే. కటకం సుబ్రాయపీనాయుడుగారు (మద్రాసు) వీణాను గానముగనుమను వసుచరిత్రములందలి పద్యములను గానముచేయుచు వీణపై పలికించుటతనకు నేర్పినరీతిలో కొన్ని పద్యములను స్వరపరిచినది. వానిని నేను నాపరిశోధన వ్యాసమున కనుబంధముగా చేర్చినాను.

సంస్కృత మార్కండేయ పురాణమున రేఖామాత్రముగనున్న వరూథినీ ప్రవరాఖ్యమును పెద్దనార్యుడు స్వారోచిషమనుసంభవమహాప్రబంధముగ తీర్చిదిద్దుటకు గీతవాద్యసహకృతి ప్రధానవిషయమైనది.

సంస్కృత మార్కండేయ పురాణమున—

"ఇదం పరం ఇదంరమ్యమేతస్మిన్ వరపర్వతే....."* ఇత్యాదిగ సాగిన

* వెంపరాలవారి వ్యాఖ్య. సంస్కృత మార్కండేయపురాణ ప్రసక్తి. శ్లో - 12

కీ. శే. కటకం సుబ్రాయపీనాయుడుగారు మద్రాసు . వీణా ... గారను సుప్రసిద్ధ వైణికవిద్వాంసులు.

సంస్కృత శైలవర్ణనమునకు మారన మార్కండేయ పురాణమున అనువాద మిట్లున్నది.

"సురసిద్ధసాధ్య కిన్నర మనోహరకేళి విలసితకంధర విభ్రమములు"*
ఇట్టివిని పెద్దనార్యుడు

"తాపుల్ క్రేవలఁజల్లు చెంగలువ కేదారంబు తీరంబునన్
మాపుల్ క్రోవులు నల్లికిల్లగొను కాంతారంబునందైందవ
గ్రావకల్పిత కాయమాన జటిల ద్రాక్షాగుళుచ్ఛంబులం
బూవుందీవెల నొప్పునొక్క భవనంబున్ గారుడోత్కీర్ణమున్"**

ఈ పెద్దనార్యుని పద్యమున గానవచ్చిన మృదంగవిన్యాసాత్మకములగు పుత్రాయింపుల అందము వ్యాసుని రచనమున మారన కవనమున గానరాదు. శ్రీనాథ కవితాంతరిత కర్ణాటగానఫణితి ప్రాతకాత్రం [illegible] సొంపులతో చెవికింపై వినవచ్చి పితృధనముగ తె పెద్దనార్యుని కవితావిన్యాసమున నాస్యమై ఇట్టి పట్టులలో పీరీతి గోచరించినది.

అట్లే వ్యాసుని రచనలతో మారనశైలితో కల్పింపని [illegible] పరూధినీ ప్రవరాఖ్యఘట్టమిట్లు కాపించినది. సంస్కృత మార్కండేయ పురాణమున

"సఏవం చింతయన్ విపాత్ర [illegible]
[illegible]
"తం దదర్శ భ్రమంతం-తౌ"

మార్కండేయ పురాణపు తెనుగుసేత యిది.

---

* మా.పు. (తెలుగు) వెంకరాలవ్యాఖ్య పుట. 28. (ధాగమ్ముద్ర) శ్లో. [illegible] - 22.

*** మా.పు. (సం) వెంకటాలవారి వ్యాఖ్య [illegible]

"అనికడు దంతచ్ఛదము హేమాద్రితటంబున సంచరించు వి
ప్రుని మకరాంకశరవిహ్వలు వరూథిని నాఁజను"*

ఈఘట్టమున ప్రవరుడు చింతాకులుడైనను

"విలుసేర్చును హాయింటినరింపగఁజాలు సుకృతి యొకఁడౌదవ దాకో"** యని విచారించి క్రముకపున్నాగనారంగ నారికేళాది విటపికాంతర వీథిఁగెరలు పికశుకాది ద్వవిందవలోని చంద్రకాంతదరులు ప్రతిశబ్దమీను గంధర్వయక్షగాన ఘూర్ణితమగు ఒకకోనగనియొనట. ఇందు పంచషడ్జ స్వరములను కూజితములుగ వెలార్చు పికకేకుల ధ్వానములలో పాటు దరులు ప్రతిశబ్దమీను గంధర్వయక్షగానరీతియందు గంధర్వయక్షగానరీతికూడ ఘూర్ణితమగు వేవధ్యముగగూర్చుకొని పెద్దనార్యుడు వాతావరణమునుకూడ రాగరంజితముగా మలచుకొనినాడు. అపిదప "మృగమద సౌరభవ ద్విగుణిత ఘనసారసాంద్ర వీటిగంధస్థగితేతరతర పరిమళమై మగువ మోలుపుబెలుపునొక్క మారుత మొలసె"*** నని మలయమారుత వర్ణనమును కావించినాడు. ఈవర్ణనమున "అలవోకగ నామలయమారుత ప్రసరణమునఁ దేలివచ్చుచు" మలయ మారుతరాగచ్ఛాయకూడ గమ్యమానమగుచున్నది. ఈపద్యమును మలయమారుత రాగమున తాళలయాన్వితముగ పీఠానుగతముగ గానము చేయవచ్చును. తదనంతరము—

"ఆతడావాత పరంపరా పరిమళవ్యాపారలీలన్ జగ
న్నుతమిచ్చోటవసి చేరఁజో యి కొవియున్ విద్యుల్లతా విగ్రహన్
శతపత్రేక్షణ చంచరీక చికురం జంద్రాస్య జక్రస్తనిన్
నతనాభిన్ నవలానొకానొక మరున్నారీ శిరోరత్నమున్"**** అను పద్యమున్నది. ఇందలి వరూథినీ ప్రథమదర్శనమందే చక్రవాకరాగచ్ఛాయ

---

* మా.పు. ii – 18, మారిచ. వెంకరాలవారి వ్యాఖ్య. 28
** మ.చ ii – 18
*** ,, ii – 24
**** "అటచని.... కొలల మహోంతుమ్మదల్లదరాళ తరంగ మృదంగ నినద్య....వాతమైమున్" ii – 3
† మ. చ. ii . 25

నేపథ్యమునందు అనుభూతమైనది. చక్రస్తనిన్ చక్రవాకములవంటి వక్షోజములు కలది అను నాభిధేయార్థమును చెప్పికొనిన, చక్రవాకరాగముద్ర గోచరమగును. ఈ చక్రవాకరాగమును గానముచేసిన విన్నవారికి మగచక్రవాకము విధివ్రాతచే దూరమైనపుడు విలపించు చక్రవాకి (పెంటి) విరహావస్థ భరితవిషాదభావము అనుభూతమగును.

తదనంతరము వరూధినీస్వరూపము,

"తతనితంబాభోగ ధవళాంశుకములోని
యంగదట్టపుఁగావిరంగు వల్వ
శశికాంతమణిపీఠి జాజువారఁగఁగాయ
నుత్తుంగ కుచపాళి నత్తమిల్లఁ
దరుణాంగుళీధూత తంత్రీస్వనంబుతో
జిలిబిలిపాట ముద్దులు నటింప
వాలాపగతిఁ జొక్కి యరమోడ్పుఁగనుదోయి
రతిపారవశ్య విభ్రమముఁ దెలుపఁ
బ్రౌఢిఁ బలికించు గీతప్రబంధములకుఁ
గ్రమకలిత పంకరుహ రత్నకటక ఝణఝ
ణధ్వనిస్ఫూర్తి తాళమానములు గొలుప
వింపుదళుకొత్త వీణ వాయింపుచుండి"*

అన్నట్టి పద్యమున దృగ్గోచరమగును. దీనిని అనుబంధమున స్వరపరచినరీతిలో [illegible]రాగమున గానముచేసిన ముచ్చటైన మెట్టుపుతో లయాన్వితరీతిలో 'తకతకిట్ట, తకతకిట' యని నడుచు అందచ్చాపు తాళమున నర్తించును. వరూధిని వాలాయంగా [illegible] అలసతన్ వాయించుచో [illegible] విపంచిని మేళంబు గావించినది.

ఈ జిలిబిలిపాటను ముద్దులు నటింపఁజాలుటకేనని తదనంతరము ప్రసక్తమైన చెలికత్తియ పాటలవలన గమ్యమానమగును. ఈ పద్యమును గానము చేయవలసిన రాగాన్వితరీతియేగాక ఆనాటి వీణావాద్యముగతిగానరీతి కూడ ప్రస్తావితము. ఆనాటి వీణలు నేటి వీణలవంటివి కావు. నేటి వీణలకు ఉండేటియొద్ద

* మ. చ. 2 - 27

వీణాకుంభము వీణాదండమునకనుసంధితమై యుండును. దండెకు చివరన యాళి ముఖసమీపమున ఒక సొరకాయబుఱ్ఱతోనో, లోహనిర్మితమగు దానిలోనో మఱియొక కుండికముండును. కాని యానాడు వరూధిని వాయించిన వీణియకు ఉత్తుంగ కుచపాళిన త్తమిట్ల రెండుకాయలున్నట్లు అద్దాని దండి వీణాదండము కన్న చిన్నదియైనట్లు అది వరూధిని వక్షస్స్థలమునుండి ఎడమభుజముపైని అమరియుండుటవలన దెలియుచున్నది. ఇట్టివీణియలరీతి అలంపురీక్షేత్రముననున్న దక్షిణామూర్తి స్వరూపమున, మఱిరెండు అందలివీణావాదన రీతులగు దేవ మూర్తుల శిల్పమున గోచరించుచున్నవి. నేడు వీణవాయించునపుడు గానముచేయ కుండుట, గానముచేయునపుడు వీణావాదనము గావింపకుండుట వైణికగాయకులు గావించుచున్నారు. కాని ప్రాచీనాంధ్ర కావ్యములందు వర్ణితమైనరీతిలో కేవల గానమేకాక వీణానుగతముగకూడ గానము వినిపించుచున్నది. అట్లే వరూధినీ వర్ణనమున "తరుణాంగుళీధూత తంత్రీస్వనంబుతో జిలిబిలిపాట ముద్దులు నటింప నాలాపతిగ - చొక్కియుండుట"లో ప్రస్తావితము, గీతమునే రాగముతో గానము చేయదలతురో ఆరాగపుటాలప్తిని మున్నుగావింపు పద్ధతి నేటివలె నాడుగూడ ఆలాపగతిచొక్కియున్న వరూధినీ గానస్థితిలో గోచరమగును. కర్ణాటసంగీత పద్ధతిలో పాడదలచిన గీతముననుసరించి ఆరాగమునాలపించు పద్ధతియున్నది. కాని ఔత్తరాహిక సంగీతరీతిలో రాగము ప్రధానము. గీతములు తదనుగతములు ఆ రాగమునుగూడ వారు అద్దానికి విహితములగు వేళావేళల నిర్ణయించుకొని తదనుసారముగ గానముచేయుదురు. *తరువాతనే హిందూస్థానీగాయకులు ఆరాగ పుటాలప్తిని సంస్కృత గానశాస్త్ర గ్రంథములలో నుట్టంకితములైన పద్ధతులలో మంద్రమధ్య తారస్థాయిలలో అల్పత్వబహుత్వాను సంధానిత జీవస్వరచారము ననుసరించి రాగరంజనప్రయోగముల ప్రదర్శించుచు గానముచేయుదురు. రాగాలప్తి పూర్తియైన పిదపవారు ఆరాగమందలి ప్రక్రియలను మచ్చునకొకటిగ సహకార వాద్యానుగతముగపాడుదురు. ప్రబంధయుగమువఱకుకూడ మనప్రాచీన గ్రంథములందుట్టంకితములైన కొన్ని సంగీతప్రస్తావనలు ఔత్తరాహిక పద్ధతికి కొంతసంవాదులుగనే గోచరించుచున్నవి. మఱికొన్ని కేవలదేశ్యములుగ జానపద ప్రక్రియలు గన్పట్టుచున్నవి. ఈ ఔత్తరాహిక ప్రక్రియ మార్గరీతియనిపించు

* ఇది సంకేతించినవారు శ్రీమతి కోటంరాజు సీతాబాలయమ్మగారు (బాపట్ల)

చున్నది. తదనుసారిగ ఈ వరూధిని ఆలప్తియొనర్చి చొక్కియు ఆరాగమును ముగింపక గీతములతోపాటు ప్రబంధములనుకూడ గానముచేసినది. ఈ గీత ప్రబంధములనుగూర్చిన లక్ష్యవివేచన ఇతఃపూర్వము చేయబడినది. ఇంతవఱకు వరూధినీగానము ననుసరించి పెద్దనార్యుడు శ్రుతిసుభత్వమును ప్రతిపాదించి తదనుగతముగ లయాన్వితస్థితిని సముపాదించి ఆపాటకు సామగ్ర్యమును ఆమె క్రమకరపంకరుహ ఝణఝణ ధ్వనిస్ఫూర్తితో చేకూర్చుచున్నాడు. గానమున శ్రుతి మాతృస్థానమునధిష్ఠించును. అందులకే వరూధిని తనగానమునకు తానే పరవశమగుచు శ్రుతితప్పక తాళము నిర్వహించుచున్నదని పెద్దనార్యుడు ప్రత్యేకించి

''క్రమకరపంకరుహరత్నకటక ఝణఝణధ్వనిస్ఫూర్తి
తాళమానములు గొల్పనింపుదళు క్రొత్తవీణవాయింపు''* చండినదని

పల్కినాడు.

కేవల గానరీతియేగాక సంగీతశాస్త్రాన్వితరీతిలో వివేచన చేయవలసిన పద్యముగ గోచరించుచున్నదిది.

''వాలారుంగొనవేళ్ళ గోళ్ళనీవలనతన్ వాయించుచో నాటకున్
మేళంబైన విపంచి నిన్నమొదలున్ నీవంటమింజేసియా
యాలాపంబె యవేళఁబల్కెడుఁ గ్రబఖాతాయాత వాతాహతా
లోలత్తంత్రుల మేళవింపఁగదవే లోలాక్షి దేశాక్షికిన్''**

ఇందు విరహాసనమైన వేరూధినికి ఆమెచెల్మికత్తియలు ఏదేవిమిషతో మనోవికాసము కల్గింప వీణావాదనము గావింపుమని యుద్బోధించిరి. నేడు కర్ణాట సంగీతరీతిలో రాగములకు వేళాఘేళలననుసరించి గానముచేయుపద్ధతి అంతగా

* మ. చ. ii - 27
** ,, iii - 57

లేదు. *కాని, ఔత్తరాహికరీతిలో ఆపద్ధతిమీరరాని విధిగ నిలచియేయున్నది. అట్టి రాగసమయాన్విత సంప్రదాయమును ఈపద్యమున సూచించి పెద్దనార్యుడు సంగీతాభిజ్ఞుడుగ అభినందితుడగుచున్నాడు. ప్రవరుడు పాదలేపము కఱిగిపోవగ దారిపెదకికొనుచు వీణవాయించుచున్న వరూధినిని గాంచునప్పటికి మిట్టమధ్యాహ్నము దాటిపోయి యుండవచ్చును. కావుననది పగటివేళలోనంతిమ ప్రహరమనుట నిర్వివాదము. ప్రవరుడు అటకేతెంచుటే వరూధినీప్రవరాఖ్య ఘట్టమునకు నాందియగును అట్టినాందికి విహితమగురాగమునాట. ఆనాట రాగ లక్షణానుసారము దానికి విధితసమయము అంతిమప్రహరమని స్వరమేళ కళానిధి కారుడుట్టంకించినాడు. ఈ స్వమేళకళానిధికర్తయగు రామయామాత్యుడు రాయల యుగాంతరితుడు. ఇట విపంచిని వరూధిని నాటరాగమునకు మేళముగావించి తదనుసారి స్వరములను విపంచియందను సంధించినది. నేడు అన్నరాగముల వలెనోకగ పలికించుటకనువుగ రఘునాథమేళవీణయున్నది. ఆనాటికి అట్టి సౌలభ్యములేదు, రాగానుసారిగ మెట్లననుసంధించు వాద్యముగ వీణియగోచరించును. అట్లే యందు మెట్లను మైనముతో గూర్చియో లేక తంత్రులనే నేటి స్వరమండలములవలె ఆరాగమునకనుసంధించి శోధనముచేసి విపంచీనాదముగావించుట రాయలనాటి ప్రబంధములలో గోచరించుచున్నది. గోదాదేవి విపంచియందలి మెట్లుమైనము కఱిగిపోగా ఆలాపివిదార్చి పాడినట్లు ఆముక్తమాల్యదయందు ప్రస్తావితము.

ఆంగ్లేయుల హార్ప్వలె ఔత్తరాహికుల స్వరమండలమువలె వరూధిని

---

* "సంపూర్ణ స్వరసంయుక్తః షడ్జన్యాస గ్రహాంశకః
యోగీయః పశ్చిమే యామే నాటరాగః స ఉచ్యతే"
స్వ.మే.క. రాగప్రకరణః
"షడ్జాంశన్యాస గ్రహా [illegible] లోపితౌ [illegible] దేశాక్షి
[illegible] ప్రదోషే [illegible] పూర్ణః
సోమనాథకృతరాగవిబోధః
"కాంతోత్సంగ [illegible] మధ్యాహ్న [illegible] సంగమోచ్చు కాని
కఠోర [illegible] దేశాఖ్యకా [illegible] మూర్తితేక్షణా"
సంగీత పారిజాతేదేశాఖ్యకాలక్షణ వివక్ష

విపంచియందలి తంత్రులనే నాటరాగమునకు మేళముగావించుకొని అవ్యాహత
ముగ ధ్వనించు నానాదమునకనుగతముగ క్రమకర కంకణధ్వనిత లయను
ప్రకల్పించుకొనుచు నాటయందలి గీతప్రబంధములను గానముచేసి యుండ
వచ్చును. పశ్చిమయామమున ఆమె ఈప్రవరునిగాంచి ఆతమకమునబడి మేళము
గావించిన విపంచిన్లే వదలివైచినది. ఆమెయో, ఆమె చెలులో ఎట్లెట్లో ఆ
విపంచిని ఇలుచేర్చియుందురు. ఆవిపంచిక ఆనాటరాగమునకు మేళమై ఆవేళ
కూడ ప్రభాతాయాతావాతాహతయై నాటరాగమును పల్కుయుండును. అపుడామె
చెలి ఆమెను ఇక నాటరాగము నుపసంహరించి ప్రభాతమైనది గాన
విపంచికను దేశాక్షికి మేళనము చేయుమని ప్రబోధించినది.* దేశాక్షి ప్రథమ
ప్రహరమున గానముచేయవలసిన రాగము. ఇందు దేశాక్షిరాగవిహిత మేళమేగాక
తద్ధ్యానపద్ధతికూడ అనుసంధానితముగావలెను. దేశాక్షిరాగస్వరూపావిష్కృతిలో
భంగ్యంతరముగ వరూధినీమనస్స్థితి ద్యోతకమగును. ప్రవరునిగాంచిన ప్రథమ
వీక్షణమాత్రముననే వరూధిని రాగరంజితయైనది. తనంతతావలచివచ్చిన
వనితయై చుల్కనయైకూడ ఆమె ప్రవరోత్సంగకాయిని కావలెనను కాంక్షను
వీడలేదు. ఇట ఆమె మనస్స్థితికి దేశాక్షిరాగోపస్థితి పూర్తిగ అతికిపోయినది.
"ఎందేదెందము కందళించురహిచేనేకాగ్రతన్ అయింపే పరబ్రహ్మము. ఆనందో
బ్రహ్మయటన్న ప్రాచదువు అనుచు మంజుభాషిణియై వరూధిని ప్రవరునితో

---

*"సన్యాసః సగ్రహః పూర్ణో దేశాక్షిరాగ ఉచ్యతే
ఆరోహే మనివర్జోఽసౌ పూర్వయామేచ గీయతే" స్వ. మే. క. రాగ
ప్రకరణమ్.

దేశాక్షిధ్యానపద్ధతి : విపంచియందలి తంత్రులనే నాటరాగమునకు
మేళగించియుంచవచ్చునను భావన నాకేకాక V.R. కళాశాల నెల్లూరు
ఆంగ్లోపన్యాసకులగు శ్రీకుమారస్వామిగారికిని కల్గినది. వారీవిషయమును
నాతో ప్రస్తావించిరి. ఈభావనను శ్రీమంచాళ జగన్నాథశాస్త్రిగారుకూడ
అంగీకరించినారు నేను హైద్రాబాదులో కలిసికొనినపుడు ప్రస్తావించినారు.
"విభాతి చామీకరభాషితా ప్రియేణ యా క్రీడతి మనుజభాషితే
మనోజవీణావ [illegible] శంకమానపాసుదీశ వారి ప్రమదోన్నతస్తన"
సంగీతపారిజాతము - ఆహోబలకృతము

వాదించినది. దేశాక్షిరాగధ్యానానుసంధానమున ఆ రాగస్వరూపమున మంజు భాషిణిత్వమున్నది. ఆయచ్చర ప్రాంచద్భూషణబాహుమూలరుచితో పాలిండ్లు పొంగార ప్రవరుని ఆక్రమింపజూచినదని అల్లసాని కవివరుడనినాడు. తదను సారిగ దేశాక్షి రాగస్వరూపమున మనోజవేగ విశంకమానసత్వము చామీకరవేష భూషితరీతి ప్రమదోన్నత స్తనస్థితికూడ నున్నది. వరూధిని ప్రవరునిపై నంకించు సన్నివేశము నంతనంతలనుండి ఆమె చెలికత్తె చూచియేయుండును. కావుననే ఆ మనోజవేగవిశంకమానసత్వము ఆవరూధినియందు పసిగట్టిన ఆమె చెలి ఆమె మనస్స్థితికతికిపోవు దేశాక్షిరాగధ్యానము ననుసంధించుకొని ఆదేశాక్షిరాగమునకే లోలాక్షిని తనలోల త్తంత్రుల మేళగింపుమని కోరినది.

ఈసన్నివేశమున పెద్దనార్యుడు దేశాక్షిరాగలక్షణమెఱిగిన వాడగుటవలన సాభిప్రాయముగ "లోలాక్షి దేశాక్షికిన్ లోల త్తంత్రుల మేళగించుమని చెలి కత్తియ ఆదేశమున ననుసంధించి సంగీతశాస్త్రాభిజ్ఞుడుగ దర్శనమొసగుచున్నాడు. ఈ సన్నివేశమున మారనసంగీతవిదుడయ్యును పెద్దనార్యునివలె ఇట్టి రాగ విశేషమును ప్రదర్శింపలేదు. మూలవిధేయముగ మారనార్యుని వరూధిని ఒక్కతే విలపించినది. చెలుల ప్రసక్తిలేదు. కాని పెద్దనార్యుడీ సంఘటనయందు నాట్య, దేశాక్షిరాగముల ప్రస్తావించి తన రాగవివేకమునిందను సంధించినాడు.

ఇక చివరగ వెఱచమష్టాశ్వాసములలోనే సంగీతకము ప్రస్తావితము. అది యును సంగీతశాస్త్రభంగీతరంగితముకాదు.

"చిలుకలకొల్కి కల్కియొక చేడియ నాటకశాలమేడపై
నిలువుననాడు చుండి ధరణీపతిఁజూడఁదలంచి యంచునన్
విలచి రహింగనుంగొనుచు నెయ్యమునందనువల్లి యుచ్చికం
చెల తెగిపడ్డఁగౌతనము చీరచెరంగున మూపెఁజన్నులన్"** అనుటలో

ఆనాటి నాట్యశాలలస్థితి ప్రస్తావితము.

---

* శ్రీ డా. పినాకపాణిగారు సంగీతవిదులు. సాహిత్యాభిమానులు. లోలాక్షియను మాటకు సరిపోవునుగాన దేశాక్షియనుపదమును పెద్ద నార్యుడు ప్రయోగించినాడను అభిప్రాయము నాతో వెలిబుచ్చిరి. అపుడు నేను ఈ సంగీత పారిజాలాంతరిత లక్షణమును వివరింపగా వారు అది సాభిప్రాయప్రయోగమని అంగీకరించిరి.

** మ. చ. V - 63

ఇక శాష్ఠాఖ్యానమున వసంతఋతు వర్ణనమున

"హిందోళంబునఁ బాడిరి
బృందారకసతులు విరహిబృందార్తిగఁ బ్రే
చెందేటులు వాసంతిక
విందుమతి శిశువృదాది వెడలిదోచెన్"

ఈపద్యమునందు హిందోళరాగము ప్రసక్తము. "శిశిరస్య వసంతస్య సంధౌ హిందోళరాగకః" అను సంగీతాభాణకమేకాక భావముకూడ చిట ప్రస్తావితము. హిందోళము సంభోగశృంగారమున విలాపమునొలకించినట్లే విప్రలంభమున కన్నీటివికూడ చిలికించునంతటి శక్తిగలిగిన రాగము. కావుననే పెద్దనార్యుడిది భృంగార్తిగా బృందారకసతులు శిశిరాంతమున దీనిని గానముచేసిరని వాసంతికలిందున శేటులు ఆనందమునొంది ప్రేవ్చినవవినాడు. మొత్తముమీద ఈ స్వాలోచితమను పంథవమున సంగీతసాహిత్యములేక త్రోవప్తితినంది అతి నందితములై ధాతుమాతావులతో ఇందలిపద్యముల గానముచేయు సంప్రదాయమునకు తావలమేర్పడినది. గానానుకూలత పెద్దనార్యునికవనమునందే యున్నది. అందువలననే అల్లసానివారి మనుచరిత్రము రాగకావ్యమై తరతరముల వరసుల అనురాగమునకు నోచుకొన్నది. అందరి జిలిబిలిపాట పదేశమమై తిగిబిగివాచి కొన్నది.

# రాగకావ్యాంతరిత రాగానుబంధము

రాగాత్మక స్థితినిబట్టి వసుచరిత్రమును ఆలంకారికులు రాగకావ్యమని నారు. అవతారికయందలి ఇష్టదేవతాస్తుత్యాత్మకములగు అయిదుపద్యములను ఘన రాగపంచకమున గానముచేయు సంప్రదాయమున్నది. "శ్రీవక్షోజకురంగనాభ" మను పద్దియమందలి రాగముద్రాలంకారోపశ్రుతిగ ఇద్దానిని శ్రీరాగమున గానము చేయనగును. "ఉల్లమునందక్కటికమూనుట" అను పద్యమునందు ప్రవ్యక్తమైన కారుణ్యాతిశయరాగ భావాతిరేకమునుబట్టి ఇద్దానిని కరుణరసస్థాయియగు శోక రీతిలో వరాళిరాగమున గానముచేయవచ్చును. "నాలుగుమోములన్ నిగమనాద" అను పద్యమందలి గంభీరభావాత్మక కథ్యానమునుబట్టి ఇద్దానిని ఆరభియందు పాడవచ్చును. "అంకముచేరి శైలతనయా...." అను పద్యమందలి గణేశస్తుతి సంప్రదాయమునుబట్టి అద్దానిని గౌళరాగముగా గానము చేయవచ్చును"*. "చేర్చుకక్కగానిడ్డచిన్ని జాబిల్లిచే" అను పద్యమును సరస్వతీస్తుత్యనుసారము నాటయందు గానము గావింపవచ్చును**. 'గీతి'కి నాటప్రథమమైనట్లు సాహితికి శ్రీరాగము ఆద్యముగా గోచరించుచున్నది. కావున సాహిత్యరీతి ననుసరించి ప్రతి కావ్యము శ్రీరాగాదిగ శ్రీరాగముతో ప్రారంభమునొందుచున్నట్లు ఇతః పూర్వము విదితము.***

"కలశపాథోరాశి" అను చంద్రవర్ణనాత్మక పద్యమును అందలి 'కళల నెలవగువాడు' అను పలుకుబడినిబట్టి ఇది కళానిధి రాగముద్రాన్వితమని ఎఱుగ నగును.

"అబ్బురపాటు తోడ" నను పద్యమున వికసితోత్పలపంక్తులు పలుకు బడిలో కానవగు రాగముద్రాలంకారము ననుసరించి దానిని ఉత్పల రాగమున పన్నయింపవచ్చును. అట్లే "మనుపుత్రైకార్తిగ" అను పద్యమునందలి

---

* శ్రీమహాగణపతిరవతుమాం - గణపతిస్తుతి గౌళరాగము

** సరసీరుహాసనప్రియే - సరస్వతీస్తుతి నాటరాగము

*** నన్నపార్యుని అనాహతనాదమాధురి

"ఒయ్యారంబున్గన్ జంద్రికల్" అను పలుకుబడియందలి చంద్రికనుబట్టి ఇద్దానియందు చంద్రికా రాగమును గమనింపవచ్చును.

"దొంగలిరెప్పలన్ గొలగఁజేయుచు" అను పద్యమునందలి "సారంగ యుతము" అను మాటనుబట్టి దీనిని సారంగరాగమున గానముచేయవచ్చును. "అనిమేషస్థితిమాన్పి" అను పద్యమందలి "బోధనలమాన్పి మోహవిభ్రాంతి" అను పలుకులపొందికలో మోహనరాగము వ్యక్తమగుచున్నది.

"ఎక్కడివాడో యక్షతనయేందు జయంత వసంతకంతులన్" అను పద రచనతో సాగిన ఈపద్యమును కమలామనోహరిరాగమున గానముచేయవచ్చును. "ఇంతలు కన్నులుండ....", "ఏకాంతమునందునున్న జవరాంద్ర" అను పలుకుబడిలో కాంతారాగనామము గమ్యమానము. "చిన్నవెన్నెలకందు" అను పద్యమునందలి గాంభీర్యాతిశయ భావమునుబట్టి ఇద్దానిని అఠాణరాగమునగానము చేసెడి సంప్రదాయమున్నది. అట్లే "సద్యోవినిర్భిన్న సారంగనాభికా" అను పద్యమును సారంగ రాగాన్వితముగ పలుకుదురు. ఇక "ఎందేదెందము కంపళించు" అను పద్యమునందు ద్యోతకమగు "కుంభీగీత ప్రదీపకళికాగ్ర" అను పదరచనమునుబట్టి ఇద్దానియందు దీపకరాగముద్రను గమనింపవచ్చును. మొత్తముమీద ఈ ద్వితీయాశ్వాసమున కానవగు పద్యములలో దరిదాపుల యన్నిటియందు రాగముద్రాలంకారములు భాసించుటబట్టి ఈ సన్నివేశమును రాగహృదయముతో పెద్దనార్యుడుకూర్చి మనుచరిత్రమును రాధకావ్యముగ మలచినాడని తోచుచున్నది. ఇట్లే తదనంతరాశ్వాసములోను కొన్ని పద్యము లున్నవి.

పెద్దనార్యుని రాగానుబంధము: మనుచరిత్రమున కొన్ని పద్యములు రాగముద్రాలంకార యుతములుగనున్నవి. మఱికొన్ని రాగముద్రాలంకార విరహితములు, అయినను వీనియందలి భావార్థమునుబట్టి సంగీతవిదులు గానము చేసెడివారు.

"తెలివెట్టి [illegible]" అను పద్యమునందలి రాగభావాతిశయ గాంభీర్యమునుబట్టి అఠాణలో [illegible]

"అక్కడవారు...." అను పద్యమునందలి "దరిచేరగరాని వియోగసాగర మగ్నతాభావ వీచికను" బట్టి అద్దానిని "కానడ" యందు గానము చేయనగును. "ఎంత తపంబుచేసి...." అను పద్యమునందలి "శూన్యదేహమున నెత్తిన దీప కళిక" యను పలుకుబడినిబట్టి దీనిని దీపకమునగాని, భాగేశ్వరియందుగాని విన వగును. "తరుణిన నన్యకాంతను" అను పద్యమునందలి విగ్గుదేల్చిన మీగడ వంటి వియోగవ్యధనుబట్టి దానిని బేగడయందు గానముచేతురట. "ఏవిహంగము గన్న నెలుగించుచు" అను పద్యమునందలి చక్రవాకి వియోగవ్యధను పుర స్కరించుకొని అద్దానిని చక్రవాకరాగమున గానముచేయనగును. ఈపద్యములనీ రాగములందే గానము చేయవలయునని రాగముద్రాలంకారములలో భావించినచో కవ్యభిప్రేతార్థసమంచిత రాగభావవిధి గోచరించును. ఇందలి పద్యములను గాయకులు తమ అభిరుచ్యనుసారము గానము చేసికొనవచ్చును. నేను మాఅమ్మ గానముచేయు పద్ధతినిబట్టి ఆచార్య పింగళివారి అను శాసనమునుబట్టి రాగాను శీలనము గావించినాను. అది సహృదయ హృదయ సంవేద్యమై రాగాంచిత మగుటయే నాపరిశీలనావధి.

## ముక్కు తిమ్మనార్యుని ముద్దుపలుకులలో నొదిగిన సంగీతము

గీతిసాహితీ సార్వభౌముడగు కృష్ణరాయనిని తన అనాహత స్వర బృంహితాత్మకానాహత నాదమాధురితో మురిపించి అష్టదిగ్గజములలో తన ప్రత్యేకత నిల్పుకొనిన కవీంద్రుడు నంది తిమ్మనార్యుడు. ఘంటమల్లయ్య, నంది సింగనలను 'ప్రథమాంధ్ర జంటకవుల'లో మలయమారుత కవీంద్రుడని బిరుదమునందిన సంగీతవిదుడగు ఘంట మల్లనార్యునకు మేనల్లుడగుటవలన ఈ కవికి సంగీతాభిరుచి సహజసిద్ధము.* అయినను ఈ కవివరుడు లోతునకుదిగి సంగీత శాస్త్రపారిభాషికముల వల్లింపక కేవలము అనాహతరీతియందే అభివందన మొనరించినాడు.

ఈకవిదైన సంగీతాభిరుచికి తొలిపద్యమగు మంగళాశాసనమునందు పార్వతీస్తుతియందు నీతడు ఉట్టంకించిన శ్రీవైజయంతి, కౌస్తుభపాఠములందలి రాగనామములు అధ్యవిదర్శనములు.**

ఆ పిదప చెప్పుకొనదగినది. ఈతడు గావించిన వాణీస్తుతియందలి సంగీత ప్రస్తావన.*** ఇందు సరస్వతీదేవి స్వీయగానానుగతమున సఖాంకురముల నయంబున తంత్రులు మీటుచు ఇంపొనరంజేయుచున్న గానము చేతివీణియకుఁ జెక్కులు గీటుచు నేర్పుచున్న వైనముగానుపమితము. ఇందు నంది తిమ్మ నార్యుడు సంగీతశాస్త్రాభ్యసనమునందలి పైతము అధీతి, బోధ, ఆచరణ, ప్రచారణములయావశ్యకత ఎంతయున్నదో వివరించినాడు.

ఇక కథానుగతముగ నాతడు చిత్రించిన నారదపాత్రవలన కనుగవికన్న వినుకలిగలిగించి 'సరిగమపధని' స్వరములు నభోవాయునిహతిగ మహతీనిర్గత ములుగ మొరయించి వీణామేని గగనారోహణము గావించి పయనించిన తీరును ధ్వనించినాడు.****

---

* "కౌశిక గోత్రువిఖ్యాతు.... నాదివాకర తారాసుధాకరముగ" పా. జా. అ. V - 108

** "శ్రీమదికిన్.... కృష్ణరాయనిన్*" పా.జా అ. i - 1

***

**** తన వ్యాదంగీతికా.... జేయుత కృష్ణరాణ్ణృపున్
సరిగమపదని వంజుషస్వనంబుల..., కడికుతు i - 44

సత్యాదేవి అంతఃపురాంగనలు సంగీతప్రవీణలని శ్రీకృష్ణవివితర్కణమున సంసూచించదలచినాడు.* ఆమెనెచ్చెలులే వాద్యనృత్యముల నందెవేసినవారై వీణఁ బలికింప, నెమళులనాడింప నేర్చినపుడు అసలు కథానాయిక గీతమునందాఢ్యయై యుండవలయునని భావించినాడు తిమ్మనార్యుడు. అందుచేతనే ఆమెచేత వాద్య సన్నాహముతోపాటు కచ్చేరీ చేయింపక అనాహతనాదమాధురివి శోకరాగ రసాన్వితముగ "పంజకశ్రీసహమైన మోమున చేలచెరంగిడి బాలపల్లవ గ్రాస కషాయ కంఠ కలకంఠవధూకలకాకలీధ్వనిలో" ఆమెను ఏడ్పించినాడు. ముక్కు తిమ్మనార్యుని ముద్దుకూనయైన సత్య ముచ్చటగా నేర్చిన ఆయేడ్పు నాటికినేటికి గూడ మురిపములనొలకించుచు సరసులనలరించుచునేయున్నది. కావుననే కృష్ణ రాయయుగాంతరితుడైన సంగీతకళారహస్యనిధియై తేజరిల్లిన రామరాజభూషణుడు తన వసుచరిత్రమున కథానాయికయగు గిరికాదేవి విరహాసయై రోదించినతీరులో సత్యభామా శోకము నినదించి దానికనాహతమార్గమును ప్రకల్పించి కాంభోజీ రాగాన్వితముగావించినాడు.** అంభోజశ్రీనఖమైన శోభాన్వితత్వము కాంభోజీ రాగమను కొనినయెడల అందలి జీవస్వరము పంచమమని నిర్ధారించుకొనిన యెడల రామరాజభూషణుడు అంతర్గతముగ ధ్వనితమైన తిమ్మనార్యుని సత్యా రోదనమున కాంభోజీరాగమును పసికట్టి అద్దానిని తనపద్యమున కాహాటము గావించినాడనిపించుచున్నది.

తిమ్మనార్యునకు మాతృవంశక్రమాగతమైన సంగీతజ్ఞానము వివిక్తి యున్నది. అతడు పనిగట్టుకొని సంగీతశాస్త్రాభ్యాసము గావించియుండకపో వచ్చును. అందులకే ఈతడువక్కని శ్రోతగా సంగీతసహృదయుడుగా సంగీతాభినందనము గావించును. ఈకవీంద్రుడును సంగీతమందలి ఆద్యములగు విషయములైన సప్తస్వరసంజ్ఞలు, ఉత్తమరాగములు, గీతగీతికాప్రబంధాదిక ప్రక్రియలు ఎఱిగినవాడు. అట్లని వానిని లోతువకుదిగి అవాంతరప్రభేదములతో

* "కరుణాకగత్తుల మంథిర మండిరము యూతమ్ముల-అడింపకాలకో అతివ లిపుతుక్రొద్వాడి గోళ్లదంత్రుటుమీటి [illegible] భావ లిపుడు" i - 106

** "అ వాలిల్లి వెలుంగు...." వ.చ.

చర్చింపడు. సాహిత్య ప్రధానముగ తన ప్రబంధమును విర్మింపదలచినాడు గావున సంగీతమునకు ఎక్కువ ప్రాధాన్యమొసగలేదు.

శ్రీకృష్ణస్వామికి సత్యాపరిచారికలు కంకణమృదుధ్వని తాళగతింజెలగగా సంపెగసూనెయంటిరనుచు సేవ్యకృత్యములందు సైతము సంగీతధ్యానమున కవి వ్యక్తపర్చినాడు.

*ఒకచో శ్రీకృష్ణునిమేల్కొలుప నేతెంచిన వైతాళికులు ప్రాభాతిక రమణీయ రాగఫణితులలో మృదుగీతామృత వాదనలు గీల్కొలిపిరవినాడు. ఆ ఉదయరాగముల పట్టికనుడ దుపలేదు.

**ఆ పిదపనతడు గావించిన శ్రీకృష్ణనామ గానమునందు జయ, చక్రధర, కౌస్తుభ, చంద్రికాదులైన రాగనామములు ఉట్టంకితములు.

అటుపిదప అతడుగావించిన.... వర్ణనమున అలవోకగా గీతవాద్యనృత్య త్రయియైః తౌర్యత్రికరీతిని ప్రస్తావించినాడు.

***తరువాత సత్యాకృష్ణులు అమరావతికేగు సన్నాహమున మార్గమధ్యమమున కొన్ని సంగీతప్రసక్తులను గీతిరీతియందే ... గావించుటయందు కవివరుని సంగీతాభిమానమేవ్యక్తము. "వల్లకియుంబోలె లలితప్రవాళకకుభంబును" అనుటలో వీణాదండమునకు ప్రవాళమని, వీణామూర్ఛనకు కకుభమని నామము లున్నవని కవి ధ్వనింపించినాడు.

అట్లే "సంగీతంబునుంబోలె నిషాదకలితంబను"టలో సంగీతమునంతలి నిషాదము గుణ్యంహితసమమని దాని ప్రాముఖ్యమును తెల్పినాడు. వీణారావ విలసితమైన వాద్యధ్వని ప్రాముఖ్యత తెల్పినాడు.

---

* వైతాళికులప్పుడు ... ఫణితాలు పెలగెన్ - ii - 55
** [illegible] దీపకావల్లకం! ii - 56
*** [illegible] ... జయచకోర [illegible] చంద్రికా ప్రతిపమదుచ్చ్రమనగ ii - 59

అట్లే కిన్నరులగురించి శ్రీకృష్ణునిచేత సత్యకు చెప్పించు సందర్భమున ఆ కిన్నరుల గానప్రావీణ్యమునిట్లు ఉగ్గడించినాడు.* ఇట్లే విద్యాధరులు, గంధర్వులు, యక్షులుగూడ సంగీతవేత్తలుగానే ప్రశంసితులైనారు** *** ****

అట్లే పుణ్యకవ్రతానంతరము పరమాత్మునిబంటుగానేలిన నారదముని మేళవించినవి సుమదీనిమెట్లని మాంసలాంసమున మహతిజేర్చినాడని తెల్పి వైణికులకు వీణావాద్య విషయమునసుండు భక్తిశ్రద్ధలను వెలార్చినాడు.

మొత్తముమీద కావ్యాంతరితముగ విశేషసంగీతశాస్త్ర వైదుష్యము చూపక పోయినను నందితిమ్మనార్యుడు సంగీతాభిజ్ఞుడేయని నొక్కివక్కాణింపవచ్చును.

---

* "ఉత్పల గంధులఁదాము.... ఇంద్రునిమీద గీతముల్___
కిన్నరులొయ్య నొయ్యఁబలికింపుచుఁదారతరస్వరంబులన్" పా.జా.ఆ. II - 89

* ఏణీశాబదిలోలనేత్ర.... నిష్ఠావరుల్ 2 - 91 పా.ఆ.

*** తనుగొంటే! అకలేందుబింప.... గ్రామవాస్తవ్యులన్

**** "యక్షుల్ వీరలోయతివ మేళముగూడి పాడుచుందురు 2.92
దిక్పాలసభల" 2 - 93. పా.ఆ

## కాకమాని మూర్తికవి మాదయగారి మల్లనార్యుల సంగీతప్రీతి

### కాకమాని మూర్తికవి రాజవాహన చరిత్రము :

"అల్లసాని వాని అల్లిక బిగిసొంపు
ముక్కు తిమ్మనార్యుని ముద్దుపలుకు
పాండురంగసుకవి పద్యంబుపరువును
గాకమానిరాయనీకే కలదు" అని ప్రఖ్యాతిగాంచిన ఈ మూర్తికవి రాజవాహనచరిత్రము రచించినాడు. ఈతడు సంగీతాభిజ్ఞతను, వీణావాదనమునందు అభిమానమును గలిగినాడనుటకు ప్రథమాశ్వాసపీఠికయందు గావించిన పరమేశ్వర స్తుతియే తార్కాణము.

"కాయలాయా చన్నుదోయి జోడనిపాద
 ములపైచె నావీణ చెలియనిల్ప
నిడుగరంబుల ద్రొక్కి యెత్తిమీటిన మీదఁ
 జేవ్రేయ సన్నుతుల్ చేపెననఁగ
వల్లరి వల్కుల్లసిల్ల నిర్వర మొక్క
 పైయున్న జోడెవ్వరన్న జాడ
తాగాత్ర లాలనాభోగంబుఁగావింపఁ
 దాన మానంబునఁదేని గురియ

దాలునకుదాలుచెల్లుగాఁ గంపితమునఁ
గంపితమ్మయ్యె విధాతృశిరము
రాగమున రాగమబ్బెఁగా స్రష్టకనఁగ
వీణవాయించు కల్యాణి వాణిఁగొల్తు"* ఈపద్యమున మూర్తికవి వీణావాదనపై అతితోపాటు కల్యాణి రాగనామమును లక్షణమునుగూడ రాగముద్రాలంకారోపస్థితమ్ముగ తద్రాగాంచితగమకాన్వితస్థితియుతముగ వ్యక్తీకరించినాడు. రాగాలాపనమనవది మనోధర్మసంగీతమునకు చెందినదై యున్నది. ఈమనోధర్మ

---

* రా. వా. చ. 1 - 6

సంగీతావధి తానము. తానముతో పాటు రాగాలాపనముగావించి పల్లవిని నిర్వ హించు పద్ధతియున్నది. ఇట వాణి కల్యాణీరాగమును గమకాన్వితముగ ఆలా పనముగావించి తానమునుగూడ నిర్వహించినదని పల్లవిని తాళమాన సమేతముగ పలికించినదని "తానమానంబులదేనె గురియ" డాలునకు డాలుచెల్లగా చాలు కంపితమునకు కంపితమయ్యెనను పలుకుబడులు విశదీకరించుచున్నవి. రాగా లాపనమున స్వరకల్పనమున ప్రయుక్తమగు గమకములు దశవిధములని, పంచ దశవిధములని ప్రఖ్యాతములై యున్నవి. అందు

"ఆరోహమవరోహంచడాలు స్ఫురిత కంపితాః

ఆహతః ప్రత్యాహతశ్చ త్రిపుశ్చాందోళ మూర్ఛనా" అను దశవిధగమ కములు ప్రచురములు. వానిని సంగీతజ్ఞులిట్లు వివరించియున్నారు.

1. ఆరోహణము : సరిగమ పదనిస
2. అవరోహణము : సనిదప మగరిస
3. డాలు : సప సమ సగ సరి సస
4. స్ఫురితము : ససరిరి గగమమ
5. కంపితము : పాపపపప ఒక్క స్థానమందునిల్చి తంత్రి నల్లార్చుట.
6. ఆహతము : సరిరిగగమ
7. ప్రత్యాహతము : సనినిదదప /
8. త్రిపుచ్ఛము : సపస రిరిరి గగగ మమమ
9. ఆందోళము : సరిసపాప రిగరిమామ
10. మూర్ఛన : సరిగమపదని, రిగమపదనిస

తరువాత రంగతత్తమతిలోకూడ కవి సంగీతప్రీతియే వ్యావ్యఖ్యానమున నిట్లు వ్యక్తమైనది.

"తలగడ గానమర్చుకొని దక్షిణపాణిని జానువంటఁగా
నలవడఁ జాపుకొన్న పెఱహ స్తముచే....ఁడెనన్
బలువిడిఁబాట మెచ్చుచును వారదుఁదెల్పెదు వేల్పుపొల్పుగన్
కలలోనంగరుణించి నన్నుఁబలికు.... వాగ్వైఖరిన్"*

శ్రీలంకవర్ణనమున అపురము "మృదంగ కళానటికి" అనిన తీరులో కూడ అతని వాద్యశ్రీతయియే వ్యక్తమైనది.

ఇక ద్వితీయాశ్వాసమున ద్రౌపది స్వయంవరమండపమునకు "కాంచి కాఘంటికల్ కళవళింపనేతెంచిన" దనుచు ఆమెకు "కంకణ పక్వనిక్వణము జక్కిణిఁద్రొక్కఁగఱటియానయొక ర్త సురటి వీసరిన" దనినాడు. ఇట ప్రయుక్తమైన ప్రతి కదలికలోను ఘనవాద్యనినదమును విని జక్కిణి నృత్తమునుగాంచి మూర్తికవి తన సంగీత సరసహృదయముచే ప్రకటించినాడు.

ఇది ద్రౌపదీవివాహసమయమునసాగిన పెండ్లివేడుకలో కూడ సంగీతమునకే ఎనలేని పెత్తనము లభించినది.

"జోడుగఁగూడి ప్రోడఁగమిచొక్కవడన్ ధవళంబు భైరవిం
బాడిరిబాడిరిద్దఱు జపాకుసుమాధరలా ధరాధినా
థోరు కళత్రనేత్ర యుగళోత్పల్ల ముల్వికసిల్లవల్లకే
గౌడవరాళి వైఖరి కలకంఠగళోద్యదనర్గళధ్వనిన్"** ఈపద్యమున కవి

కవి అముత్తైదువలు భైరవిరాగముతో గౌడవరాళి రాగములో కూడ ధవళములను పాడినట్లు ప్రస్తావించుటనుబట్టి అతని రాగవివేకస్వాంతత ప్రవ్యక్తమగుచున్నది. అంతేకాక వారు గౌరీకల్యాణము ధవళంబు పాడరాదా లతాంగియని సరుదడి చేయుచు రాగవిషయకస్పర్థనుగూడ వహించినారని కల్యాణి లతాంగి రాగ వాచకముల తెలివి వ్యక్తీకరించినాడు.

---

* రా. చ. 1—7.

"నీకే వచ్చు సువాలయుం ధవళమింతీ యల్లోనేరేళ్ల గా
రీ కల్యాణములంచునింటికడ నీరీతిన్ విజృంభింతువే
వాకీవిచ్చటనంచు నిద్దఱుసతులు వాక్యోపవాక్యంబులన్
గాకైమ్ముందలపట్లకుందొడఁగిరా కల్యాణవేదిస్థలిన్"* ఇందు అతివలిద్దరు తలపట్లకుందొడగిరది కల్యాణవేదీస్థలియందు సాగిన గానమున ప్రవర్తిలిన స్పర్థ వలననే అనుటనుబట్టి కవికి గానమునందున్న ప్రత్యేకశ్రద్ధ ప్రవ్యక్తమగు చున్నది.

మొత్తముమీద కాకమాని మూర్తికవికి సంగీతము అభిమాన విద్యయని తన కవనమునందు సంగీతమునకాద్యమగు స్థానమొసగినాడని ఘంటాపథముగా నాతని రాజవాహచరిత్ర ప్రబంధము చాటుచున్నది.

## మాదయగారి మల్లన రాజశేఖర చరిత్రము :

కృష్ణరాయల ఆస్థానకవివరులలో మాదయగారి మల్లనయుల ఒక్కడనుట సుప్రసిద్ధము. ఈతడు రాజశేఖర చరిత్రమును రచించినాడు. కాని అంకితము మాత్రము కృష్ణరాయునికి గావింపలేదు. ఈ మల్లనార్యునకు రాయలనాటి రసికతా జీవనమును రాగమయముగావించిన సంగీతమునందు ఆనాటివారి అందరివలె అభిమానమున్నదనుటకు ఆతని ప్రబంధాల తరితములగు కొన్ని సంగీతప్రస్తావనలు తార్కాణములగుచున్నవి. ఆద్యముగ ఆతడుగావించిన వాణీస్తుతి ఇందుల కొక నిదర్శనము.

"ఏదేనొక్క పురంధ్రి గానసుధచే హేలాకరాంభోజ వీ
ణాదండం బిగించెనా నఖరుచుల్ నర్తింపమ్రోయించున
య్యాది బ్రహ్మముఖాగ్రరంగనటి విద్యాబుద్ధి సంసిద్ధిన్
మాదిండ్లప్పవికిచ్చుగాత హృదయానందంబు సంధిల్లగాన్"**

ఆ పిదపసాగిన అవంతికాఖ్యపురీ వర్ణనమునకూడ సంగీతమునకే ఆద్యమగు స్థానము లభించినది.

---

* రా. హ. చ. iv - 35

** రా. శే. చ. i - 7

"బహువిధామోద మోదితభసల కలభ
వినర విస్మృమర ఝంకార వేణునినద
సరసగాయక గానప్రసంగ సౌఖ్య
కరుణకరమగు నావంబ కాఖ్యపురము"

తదనంతరము హేమధన్వన్పృపతి సంతానహీనుడై పుత్రోద్భవాకాంక్షియై శివునినారాధింపుచు

"కించిన్మర్దళ నృత్యగీతసరస క్రీడావిధమ్ముల్ ఖుకి
చంచూ చంచదనూనరత్న ఖచిత స్తంభంబులు....
.... విలసిల్లగా నూరూరన్ భూపతి కట్టించెన్....
.... దేవతా నిలయకోటిన్ జాహ్నవీజాటికన్"

ఇక తృతీయాశ్వాసమున కాంతిమతీ విరహవర్ణనమున చెలులామెను—

"పసిడి వీణియగూర్చి పంచమ శ్రుతిమించ
మోయింపవేమిటికి మోహనాంగి" అని ప్రశ్నించినతీరులోకూడ వీణాధ్వానము పంచమశ్రుతి కన్వితమగుతీరు కవికి పరిచితమైన విషయు తెలియుచున్నది. ఇక కాంతిమతీ వివాహసందర్భమున—

"ఏ వీధిఁజూచిన నిందువింబాననల, లారితలాస్య కోలాహలంబు
.... .... .... .... .... .... ....
ఏచక్కిఁజూచిన నిర్ధపుణ్యాంగనా, కల్పిత కల్యాణగానఫణుతు"లు మొరసినవని పలుకుటలో కవి సంగీతప్రీతియే వ్యక్తమైనది.

ఈ మాదయగారి మల్లనార్యునకు సంగీత ప్రీతియున్నదిగాని ఆశాస్త్రము నందు ప్రౌఢిమలేదు. మొత్తముమీద ఇది రాయలయుగ సంబంధియైన ప్రబంధమయినను ఈ మాత్రపు సంగీతప్రస్తావనయైన నిందున్నది.

# రాధామాధవకవి సంగీతారాధన

సాహితీసార్వభౌముడై సంగీతసామ్రాజ్యము నేలుకొనిన కృష్ణరాయని విజయభువనాస్థానమున వీణాపుస్తపాణియై నలువరాణి కొలువుదీర్చినది. కవులు, గాయకులు కవిగాయకులై గాయకకవులై తమ ప్రభువుమెచ్చిన తమకునచ్చిన సంగీతారాధనాత్మకరీతిలో ఆసాహితీ సమర్చనముగావించి ధన్యులైరి.

అట్టి గీతిసాహితీసార్వభౌమునిచే సత్కృతుడై రాధామాధవ బిరుదాంచితుడైన ఎల్లనార్యుడు సంగీతసాహిత్యములకు సమప్రాధాన్యమొసగి తన రాధామాధవ కావ్యరచనమును గావించెను. తన కావ్యమున బ్రహ్మగాంధర్వకళా కోవిదుడైన కృష్ణస్వామినే గాయకునిచేసి నిలిపినాడు. ఆశ్రీకృష్ణమూర్తికి కావ్య నాయికయగు రాధాదేవికి వైవాహికాభిలాషమును కల్గించు మాధ్యస్థము వహించుటకు సంగీతకళాసర్వస్వ స్వరూపిణియగు గీర్వాణినే నియమించును.

ఇక కావ్యరచనారీతిలో సంగీతకమును నేపథ్యమున మొరయించుచు తాను సూత్రధారుడై రాధామాధవుల ప్రణయైకజీవులజేసి పాఠకమనోరంగమున ఆడించి తన నాటకీయచతురతను ప్రదర్శించినాడు. కావ్యాదిన దేవతానమస్కృతులలో కావ్యాంతరిత ముఖ్యపాత్రయగు వాణిని ఆమె నిర్వహించిన రాధామాధవుల వైవాహికమును తన వీణాక్వణనచతురిమతో సంభాషణాచణత్వముతో నిర్వహించిన తీరుగమ్యమానమగునటుల

"ఫల నఖాంశువుల క్రొత్తమెల తాజుచేఫిన
కిన్నరమీటి పాడువాణి దయజేతునాకు వాగ్విభవములు"* అని నుతించి అంతటితో ఆగక పూర్వకవి స్తుతిలోకూడ ఆవాణీవీణాకలక్వాణమును మంజా మంజీరధ్వానమునువిని పాఠకులకు వినిపించి ఇట్లు మురియుచున్నాడు.

"వాణీవధూపాణి వీణాకలక్వాణ
కలితభవస్ఫూర్తి కాళిదాసు
భారతీ మంజామంజీర ఝుళంఝుళ
శబ్దవాఙ్మధుర సార్వభౌము"** అనుచు కావ్యప్రారంభమున కృతనిశ్చయముగ పునఃప్రమాణము గావించుచు

"మాణిక్యవీణా ప్రకలోన్మీలితపక్ష్మములతోఁ బ్రత్యక్షమై భారతీ తోడగు మమ్ము" అని ఆవాగ్దేవిని మఱలమఱల సర్థించి ఆమెవలననే తనకావ్యకథ సాగవలయునను భావమును ప్రదర్శించినాడు.

తన కావ్యనాయకుడైన మదనగోపాలమూర్తి తన కలలో కన్పించినపుడు కూడ మురళికాకలనాదములు చెలగగా ఏతెంచినాడు. ఆశ్వాసాంతనకూడ ఆ గోపాలదేవుని "సమగ్రశ్రీబ్రహ్మ గానమాధురి మావిధి" యని మఱిమఱి కొనియాడినాడు. కథోపక్రమణమున పురవర్ణనమునగూడ సంగీతధ్యానము నిట్లు ప్రకల్పించినాడు.

"లీలాకిన్నరులప్పురిన్ వికటమల్లీ నికుంజ మధ్యంబులన్
కేళీశైలరవ గృహాంగణములన్ గృష్టప్రబంధావళుల్
వీణాజాతులెఱింగి వెన్నెలఁదగన్ వీణాశ్రుతుల్ సాగ
న్నాలాపంబులో జేసిపాడు హరితల్పాహీంద్ర...."*

అప్పురమున లీలాకిన్నరులు కృష్ణుని సంగీతశాస్త్ర సంబం విశేషములైన ప్రబంధములను వేళాజాతులెఱిగి వీణావాద్యానుగతముగ ఆలపిం తురనినాడు. జాతులను వేళావిశేషమెఱిగివారు గానముచేసిరని ఎల్లనార్యుడన్నట్ల లోనే ఆతని సంగీతశాస్త్రవేదిత పొందితివ్యక్తమగును.

ప్రాచీన సంగీతశాస్త్రములలో ఆద్యములగు రాగములను జాతులని వ్యవహరించుటకద్దు. వానిని విహితవేళలలో మాత్రమే గానముచేయుట అనునది మీఱరాని సంగీతశాస్త్రవిహితవిధి. నేడును ఔత్తరాహిత సంగీతజ్ఞులు వేళావేళల విచారించుకొని ఏరాగములనాలపించు నియమమును బొదలధరియింతురు. కర్ణాట సంగీతమున మాత్రమీపద్ధతిని అంతగా పాటించుటలేదు.

ఈకవికి దేవతామూర్తులనుగూర్చి ప్రసంగించు పట్టులవారి ఆగమనాదిక సందర్భోచిత సందర్భములల సంగీతధ్యానమును ప్రకల్పించుట పరిపాటి. కావుననే అట్టి రీతిగనే శ్రీహరి దర్శనకుతూహలమున ఏతెంచిన శివుని ఆగమనమును

* రా. మా. 1 - 76

పంసూచించుచు దైవదుందుభి ధ్వానములు చెలరేగగ నందితాండవగతులకు జతులను పల్కించినాడు. అట్లే మఱియొకచో "నిరవద్యుడైన హరివిజాడ నారదుఁడు నిరంతరము నారాయణశబ్దములుపలుకుచు వీణాదండ ధ్వనులు ఏపారగా ఏతెంచినాడనును. ఇంకొకచో శేషతల్పశాయిని సంగీతశ్రుతి విశేషధ్వాన నేపథ్యమును మొరయించుచు వర్ణించి ఆతని బొడ్డుదామదలోన పొదలుచు అళి పోలె ఝూంకృతి సల్పుచు నలువశ్రుతి ధ్వనులు కులుకుచుండగ నున్నాడనుచు ప్రస్తావించును. ఇంకొకచో బాలగోపాలుని తల్లికి ముద్దులుచూపుచు "వల్లవ కామినులకు వలపులుచూపుచు గొల్లలకు కూర్మిచూపుచు బాహ్యనటనవై ఖరి మెరయ నటసూత్రధారియై ఉగ్రకాళియఫణిమండలాగ్ర రంగభూమిని తాండవము పూర్వమహిమతో ఆడినాడనును.

అన్యమార్గగాములగు ముముక్షువులు అతికష్టముమీద భగవంతుని అధిగ మించగా భగవంతుడే సంగీతోపాసకుల అగాన ధ్వానముచే ఆకృష్టుడై ఏతెంచి వారి హృదయపీఠముల నధిష్ఠించునను విశేషమును ఈ రాధామాధవకవిసమ్మెను కావుననే భగవదారాధనాయత్తులై ఏతెంచెడి వారివెనుక సంగీతమయముగావించి నాడు. తదనుసారిగ పాతాళమున నాగకామినులు శ్రీకృష్ణారాధనమును వెల యించిన రీతినిట్లు వెల్లడించినాడు.

ఇట నాగస్వామి నాగకామినుల గానమునకు వేడ్కతో శిరోప్రాంతములు కదలించెనట. "శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తిగానరసం ఫణీ" అను సంగీత ప్రాశస్త్యము వెల్లడియైనది. కిన్నెరలు మీటుచు అనంత! చక్రి! అనుచు నాగాంగనలుపాడుటలో భగవన్నామస్మరణమేగాక అద్దానికుపస్కారకమగు నాదో పసనా విధానమగు తానప్రకల్పనము అందావృత్తియగు "అనంతా! అనంతా! అనంతా!" యను అనంతుని తనమునుగొనియాడు నాదాత్మకమహామంత్ర జపము ధ్వనితము.

"నాహం వసామివైకుంఠే యోగినాం హృదయేన చ

మద్భక్తా యత్ర గాయంతి తత్ర తిష్ఠామి నారద" అను భగవదాశాపనము ఇట అనుసంధానార్హము.

నాగాంగనలేకాక గరుడగంధర్వ కిన్నరాంగనలు సహితము "క్షేత్ర సహితుల నాత్మవల్లభులపాసి వల్లపీవల్లభుని వలచి తత్కీర్తి పాడిరి వర్ణసరణి" అని ప్రస్తావించినాడీ కవి.

ఇట కృష్ణారాధనమును రాధామాధవ ప్రణయవర్ణనారీతిలో గావించుటయే కాక అయ్యారాధనము తన కావ్యనాయికయగు రాధచేతనేకాక గరుడగంధర్వ కిన్నర నాగాంగనలందఱిచేతను గావింపజేసి ఈ రాధామాధవ కవి జగమే నాద మయమని అయ్యది ఆరాధనప్రపూర్ణమని ఎలుగెత్తి చాటినాడు. పరమాత్మ యొక్కడే పురుషోత్తముడనియు ఎల్లజీవులు జీవాత్మలనియు జీవాత్మ, పరమాత్మాను సంధానమందుటకు సంగీతారాధనాసంయుతమగు నాదోపాసనమే ఏకైకపథమని తెలుపుటలో పోతనాదుల సంగీత భజనానందరీతి ఈతని కవితకు సంవాది అయి నది. ఏతద్రీతిలో సంగీతము జీవాత్మపయనించు రాజబాటకాగా గమ్యస్థానము నధివసించిన పరమాత్మపయనము సాగించుచు జన్మజన్మల అవధితో తనను చేరు కొనును. ఆ జీవాత్మ శ్రుతిసుఖగానిప్రితవిలాసముతోను, లయాత్మికవిన్యాసము తోను నర్తకివలె రాగభరితలాస్యము జరుపుచు తనయొద్దకు రావలయునని నిరీక్షించునను అపూర్వభావమును రాధామాధవకవి ఈపద్యమున వ్యక్తీకరించి ధన్యుడైనాడు.

"తనియవి కాంక్ష నర్తకి విధంబున లేనగుమోముతో ఘన
స్తనమణిహార మర్మరీ.... శబ్దములు కరకంణ కంకణ
ధ్వనులు నితంబకాంచిపదవారిజ హంసకరావమ్మున"

.... .... .... .... .... ఘల్లు ఘల్లుమనగ...."* తనకై ఏతెంచు చున్న రాధను కనవలయునని కృష్ణస్వామి ఉవ్విళ్లూరుచున్నాడనుచు కవి ముముక్షువులమతూడ ఉవ్విళ్లూరించినాడు. ప్రపంచమున రాధాకృష్ణుల శృంగారో దమునకు వచ్చి శృంగారార్థము చెప్పికాని పరవశించు కాముకులతోపాటు అద్వైతపరమార్థమును భాష్యముగ వేనోళ్ల పలికి తపించి శ్రోతల తరింపజేసిన మోక్షగాములు ఉన్నారు. జయదేవుని గీతగోవిందము బాహ్యమున కామోపభోగ

* రా. మా. ii - 53

విషయాన్వితము. అంతరమునది జీవాత్మ పరమాత్మల సంధాయక మోక్షస్థితి మయము. అట్టి ఆ పరంధామమును చేరుకొను నుపాయమును తన కావ్యనిర్మితితో తెలిపి తెలుగునాట వెలుగుబాటను నిర్మించినాడు గనుకనే ఈకవి కృష్ణరాయ సార్వభౌమునిచే రాధామాధవకవిగ వ్యవహృతుడై సన్మానితుడైనాడు.

జీవాత్మయగు రాధ శ్రీకృష్ణపరమాత్మను చేరుకొనుటకు అక్రమ శృంగారమును ఉపస్కారకము గావించుట ఎల్లనార్యుని అభిమతముగాదు. కావుననే ఆత్మానుసంధానమే పరమార్థముగావలసిన దాంపత్యబంధము నా జీవాత్మపరమాత్మల సంధానమున రాధామాధవకవి కల్పించినాడు. ఈ మహా సాయుజ్యస్థితికి విశిష్టాద్వైతరీతి సంవాది. కావుననే రాధాకృష్ణుల అభిలాషా శృంగారపారమ్యముగ స్వయంవరవ్యాజమున సాలోక్యసామీప్యాదుల ఉపస్థితిని కల్పించినాడు కవి. భక్తుని భగవంతుని కలుపుటకు మధ్యవర్తిగ రాయబారిగ విపశ్చిద్వరేణ్యుడైన గురువరుని ఉపదేశమావశ్యకము. హస్తమస్తక సంయోగమున గురుశిష్యయుగళసాధన శైవమతావధి. శంఖచక్రధారణాక్రతు పురస్కృత సమాశ్రయణాత్మక నారాయణమంత్ర స్వీకరణము విశిష్టాద్వైత మత పరమావధి. కావుననే రాధారూపమగు జీవాత్మపరమాత్మాను సంధానమునందుటకు రాయబారము నడుపుటకు వారిని వీరినికాక గీర్వాణినే దివినుండి భువికిట ఎల్లనార్యుడు దింపినాడు. అపుడు దివినుండి భువికవతరించిన ఆవలుకుబడతి సంగీతవాద్య సన్నాహముతో "వలచన్నుగల వీణియ నలవరింపుచు వచ్చి విలచినదని" నాడు కవి. అట్లువచ్చిన పిదప పలుకుల తల్లిపలుకులలోకూడ గీతి సాహితికుపస్కారకమై భగవదారాధనోపయుక్తముగావలెనను నిత్యసత్యము ఇట్లు భావించినది.

నీ మోహావళీలలు నర్ణింపనోపిన పటువాచాలురు విశ్వాణడన్మత్కరపుణి వీణావినద లలితకవితల రచియింతురని గీర్వాణికృష్ణునితో పలికిన పలుకులతో నీభావమే ప్రస్తావితము. కృష్ణునియోజితయై రాధాదేవి సన్నిధమునకు శారద మధురవాణి నాయకయై "క్రొత్తముత్యాలకెంబట్టు కుచ్చులమరు పసిడివీణకరంబున బట్టి అందెలోలి మ్రోయగ పాటకురాలనగ నేగిన"దట. తరించు ప్రాప్తియున్న తరి భక్తునకు భగవంతుడే రాయబారమంపి తరింపజేయునన్న, ఈతతోపాటు

ముముక్షువులకీ సన్నివేశమున రాధామాధవ కవి సంగీతారాధనా సహకృతితో అందించుచున్నాడు.

ఈ సన్నివేశమున వాణివీణాపాణియై రాధ మ్రోలచేరి కేవలము మాటలతో కాక పాటలతో ఆమె మనస్సును రంజింపచేసి కార్యసాధనమును గావింపనిట్లు దొరకొనును.

"పుండరీకాక్షునకు ఈవిలాసవతి పత్నియగునని తలచి తనవచ్చిన కార్యంబునకు విదియవసరంబని పద్మాసనబంధనంబునఁజక్కనై వీణయందలి పట్టుగాసెన వాయందట్టి చేలాంతలములఁగాయలుతుడిచి దేవీ ఆకర్ణింపుమని పలికి"*

"కొలఁదిగ రాగభేదములకుందగు సారెలు సారెనా త్తి తం
త్రులు కొనగోళ్లమీటుచుఁజనుంగవదండె యమర్చి కృష్ణలీ
లలు ప్రకటించి పంచమకలశ్రుతి మాత్రులిగుర్వరాధకున్
వలపులు చిల్కఁగన్మధురవాణి ప్రవీణతఁబాడె వీణతోన్"**

"సరసమృదుగాన కళలం
గరగిన తచ్చంద్రకాలికా స్తంభ సము
త్కరమణి పుత్రికలమరెన్
బురుషుల కౌగిళ్లలోని నెలతులవోలెన్"***

వికసిత పంచమశ్రుతి నవీనరసస్థితిలో ఎండిన వీణెమాత్రు చిగురొత్తగా రాధాప్రాణ వల్లభాంకితమగు గీతంబులను శ్రుతిభూషణంబులు గావించి ఆగీర్వాణి పాడగ ఆమెమ రాధమెచ్చిపదట. "అతివ! మధురవాణి యనుపేరు సార్థకము

* రా. మా. iii - 62
** ,, ,, iii - 63
*** ,, iii - 64

వీకు, నిన్నుబోల నీవనేర్తుగాక. ఒరులసాటిగా చెప్పవచ్చునే" అనిగూడ శారదను రాధకొనియాడినదట. ఇట వీణలోని పొరెలను మార్చుట వీణకు సాజమైనను ఇట పంచమశ్రుతి వర్ణితమగుట సంగీతశాస్త్రోక్తియే. స్త్రీగళమునకు వీణ స్వరమునకు పంచమశ్రుతి అమరియుండుట ఇట ప్రవ్యక్తము. ఇక ఎండిన వీణెమ్రాకు చిగురెత్తుట, చంద్రశాలికాస్తంభములు సరసమృదుగాన కళలతో కలుగుట అనునవి సంగీతమహత్వస్ఫోరకములగు కించిదతిశయోక్తి అన్విత కవితాసత్యములు. ఇట్లు కథాగతముగ సరస్వతిరాయబారమును గీతవాద్యాన్విత ముగసాగించి ఎల్లనార్యుడు జీవాత్మకు పరమాత్మకు మాధ్యస్థము వహించు అనూనశక్తి గానమునకున్నట్లు అనుభవైక వేద్యముగా నివేదించెననిపించును.

సంగీతారాధనా సమాయత్తచిత్తుడైన ఈకవి తన ప్రబంధమును కవనము చేతనేకాక గానముచేతకూడ మధురమ్మొనర్చినాడు. అందుచేతనే ప్రబంధో చితాష్టాదశ వర్ణనములుకూడ ఇట సంగీతమయములే అయినవి. ప్రబంధోచితముగ రాధాదేవి విరహమును వర్ణించి ఆయమ విరహాసనయైనస్థితిలో కాముని నోమించి నాడు. రాయలనాటి ప్రబంధములన్నిటిలో ఈమన్మథారాధనాదికముల వృక్ష దోహదక్రియాసంబంధి వర్ణనలున్నవి. కాని, ఎల్లనార్యుడు సర్వము రాగమయ ముగ సంగీతమహత్వస్ఫోరకముగ విందు తీర్చిదిద్దుటకు బద్ధకంకణుడైనాడు గావున అద్దానినిగూడ సంగీతమహత్వస్ఫోరకముగ కావించి మదనోత్సవ సంగీత సంచికగ ఈసన్నివేశమును ఆవిష్కరించి నాట్యశాస్త్రాన్విత హస్తవిన్యాసాత్మక కర్తణాదికరీతుల నిట మేళవించినాడు.

అష్టాదశవర్ణనలలో మధుపానమొకటి. ఇందును ఎల్లనార్యుడుసంగీతమును విడువలేదు. ఆసవపానవివశలైన వనితలలో నొక వనితజారుడు త్రొక్కిన దనియు ఒకలలన నటనకేళి యొనర్చినదనియు, మఱికొందఱు సుందరులు మందనదీప్తి చంద్రికలు షల్లడిగొల్ప వసిండి వీణియలు కొండొకమీటుచును శ్రుతులకూడగ పాడిరి నందసూనుని అనుచు కవి ప్రస్తావించినాడు. జారుడు త్రొక్కుచు నటనకేళియొనర్చుచు మందనరీతిలో భ్రమించుచు పసిడివీణియెలు కొండొకమీటుచుకూడ ఆయింతులు ఆసవపాన వివశాత్మలు గానశ్రుతులుగూడక పాడిరని ప్రస్తావించుటలోనే ఎల్లనార్యుని శ్రుతిజ్ఞానమర్మజ్ఞత వెల్లడింపబడును. ఈ

శ్రుతిజ్ఞానమనునది ఎంతటి కళాకారునకైన క్రమస్థితిలోనున్నప్పుడు సవ్యముగ నుండుమగాని మదిరాపానాదిక వివశాత్మకులైనప్పుడుండదు. కావుననే ఎల్లనార్యుడిట ఉచితజ్ఞుడై సంగీతశాస్త్రసమయాభిజ్ఞతను ప్రదర్శించినాడు.

వివశస్థితిలో నింతలుకూడ శ్రుతులకూడక పాడిరని పలికిన నోటితోనే స్వవశస్థితిలోనున్న కొందఱి లలనల సంగీత వైదుష్యమునభివర్ణించి కవి తన రాగాభిజ్ఞతనుగూడ ఇట్లు ప్రవ్యక్తము గావించుకొనినాడు. ఇందు కవి అభివర్ణించిన రాగమములోగుండ క్రియకు రాల్గరగించు పరిమళశక్తియున్నట్లు వసంతమునకు ఎండిన మ్రాకులు నయితము చిగిరింపజేయు మహత్వమున్నట్లు సంగీతసమయములున్నవి. అట్లే మేఘరంజనికి మేఘసృజనాత్మకశక్తియున్నట్లు కృష్ణరాయాదులన్నట్లే ఈకవియునిట్లభివర్ణించినాడు.

"కలవాణియొకతె చెవికిం
బలరింపుచు మేఘరంజియని జదదశ్రీ
నెలకొలిపి సౌధవీథుల
వలరవాడించె క్రోధి నెమలి కొదమలన్"*

అట్లే పురవర్ణనమున ఒకనూత్నవినిర్మిత నగరమునుగూర్చి ప్రస్తావించుచు అది నానావిధవాద్యరావ విరాజమని యిట్లనినాడు.

"నానావిధదేవార్చన సమయసమాహిత గంభీరభేరి మృదంగశంఖకాహళపటహడిండిమాది వాద్యతూర్యనాదమేదురంబై లక్ష్మీలీలాభిరామంబును సముజ్జ్వలబాడబితేజో విరాజితంబును అనేక భూభృత్కృతంబ సమాకీర్ణంబై" విరాజిల్లుననుమ్.

అంతేకాక క్రీడాచలంబులం గ్రీడించు గంధర్వకిన్నరసతుల సంగీతకేళి—

"లాస్యో త్తమచంద్రశాలల నటించు
న ర్తకుల పాదకింకిణీ నాదగతుల
జైత్యసంవిష్టనాగరప సరస వాగ్వి
రచనముల నొప్పెనప్పుడా రాజధాని"* యనుచు అందలి చంద్రశాలల న ర్తకుల పాదకింకిణీ నాదగతుల కాలవాలమయిన రీతిని వర్ణించును.

ఇక చివరగ రాధామాధవుల అభిలాషాశృంగారము పరిణతమై పరిణయ శృంగారముగ సుసంపన్నమైనపుడుకూడ కవి ఆవైవాహిక వైభవమున సంగీతక మునకే అగ్రతాంబూల మొసగినాడు. రాధామాధవుల వివాహానంతర విహారమున తదితర ప్రబంధములందువలె సమాగమకేళీవిహారములకు ప్రాధాన్యమీక ఈకవి సంగీతమునకే ఈసన్నివేశమునగూడ పట్టముగట్టినాడు.

ఐహికరీతిలోగాక ఆధ్యాత్మికసంవిధానముతో పర్యాలోచించిన రాధామాధవ సంగమము జీవాత్మ పరమాత్మల సాయుజ్యసంధానమునకు ప్రతీకయగును. కావుననే పరమాత్మ జీవాత్మను తనలో లీనమొనర్చుటకుమున్న ఆద్దాని శంచేంద్రియములను పరవశమొనర్చును. అట్టి స్థితియందు జీవాత్మను తన సామీప్యమునకు ఆహ్వానించుకొని తన వశమునందుంచుకొని సాలోక్యమొసగును. చేరువచేరువై కడుపచేళిమమైన స్థిమితస్థితిని ఆ జీవాత్మకనుభూతము గావించును. అపుడా జీవాత్మస్థిరముగ శాశ్వతముగ పరమాత్మలో సాయుజ్యసంధానమునందు కొనవచ్చును. ఇట్టి సన్నాహమంతటిని సమగ్రముగ నిర్వహించి జీవాత్మ పరమాత్మల సంధానస్థితిని సంఘటితము [illegible] శక్తి సంగీతమునకు మన్న. కావుననే [illegible] వివాహమునకే—

---

* రా. మా. iv - 120

** "సరి సౌందర్యకియు విస్తరించె నగరగన్ సౌధాగ్ర రత్నావళుల్
తుటుడీ లొత్తె మొకర్తుకొక్కతె వసంతశ్రీ వహించి భా
స్వరగేహాంగణ దారుతోరణ లతాస్తంభంబులందు బల్లవో
త్కర సంశోభితం జేసె [illegible] రాగజాతి ప్రమోదంబంపగన్
- [illegible]

"అమృత రసోపమాన జలజాక్షమనోహర వేణుగానం
దమునవన్ భ్రమత్తబర్హిణ కదంబమము నాట్యము సల్పి....
.... .... .... .... .... .... .... ....
సుమధుర షడ్జస్వరము చూపుచుఁదన్నయనాభిరామమై" నదట.

అపుడు సర్వప్రకృతి ఆ పురుషోత్తముని మురళీరవమున పరవశింపగ వృక్షములు సయితము కలమురళీసముల్లసిత గానకళను వికసించి హరిపుష్ప మంజరులు పూజచేసినవి. మృగీమృగావళులు సులలితధీరనేత్రముల సొంపులు దేల్చినవి. సురభులు రయప్రోచలిత కర్ణములతో వరువులెత్తినవి. తన్నికట మహీధరరత్నజాలములు కఱిగి నిర్ఝరములగతి పారినది. ఇది సంగీతసమారాధనమున జడప్రకృతులగు పక్షిమృగసంతతులకుగూడ కవి కల్పించిన అవకాశము ఇట్టి యానళినాయతాక్షు మధురాధరవేణురవామృతమున వీనులునిండినది ఒక్క రాధకేకాదు ఆ మాధవారాధనావకాశము సహస్రసంఖ్యాకమగు వల్లవ స్త్రీ నికరమంతటికి లభించినది. అపుడు వేణుస్వననవ్యశ్రావ్యనినాద మధుర కథానందజగన్మానసుడై కృష్ణుడందరి నలయించుటలో కావ్యకథ ముగిసినది. ఆ ముగింపులో తరుణీకంకణస్ఫురన్నినదలు మధుకరోత్కరశ్రుతి విరాళములు వేణునాదసంవాదులై యమునలో కావ్యగతముగ ధ్వనించి పఠితృహృదయమున ప్రతిధ్వనించుచున్నవి. ఆమహాధ్వానము రాధామాధవకవి సంగీతారాధనమున నేపథ్యగానమై ఈప్రబంధమున నిండి నిబిడీకృతమైనది.

ఈ రాధామాధవకవిదే ప్రతిభోక రచన విష్ణుమాయానాటకము ముద్రితమై లభ్యమగుచున్నది. ఇంకొకటి తారకబ్రహ్మరాజీయమనునది ఉన్నదట. ఆ కావ్యము ఏలనో ఈనాటికి అపూర్వంపశ్యమై తాళపత్రాంతరములలోదాగి ప్రాచ్యలిఖితఖాండాగారములందే నిలిచియున్నది.

రాధామాధవ ప్రబంధరచనమున సంగీతరసప్లావితముగ నిర్మించిన ఎల్లనార్యుడు విష్ణుమాయానాటకమున తన సంగీతాభిరుచినే మాత్రము ప్రవ్యక్తము కావింపలేదు. సంగీతాభిజ్ఞడగు శ్రీకవియైనందు ఇతరితర ప్రముఖకవులవలనె ఏలనో అవాంతర [illegible] సంగీత[illegible] ప్రవర్తింపినాడు. కొన్నియెడల మాత్రము [illegible]లో సంగీత విషయములను ప్రస్తావించినాడు.

ఒక్కచో మలయానిల ప్రసరణమున సాగిన సంగీతప్రసక్తి అది.

*"గంధర్వ మధురగానము
బంధుర దుంధుభిరవంబుఁబైపై....
సంధుల మొరయఁగ దక్షిణ
గంధవము వీఁచె దివ్యగంధంబులతోన్"

మఱియొకచో వైకుంఠపట్టణ విలాసమునుచూచి ఆశ్చర్యపడి ఆదిలక్ష్మి యోచించు సందర్భమున దొరలిన సంగీతప్రసక్తి ఇట్లున్నది.

**"చారుమృదంగభేరి జయశంఖ విరావము లాసికాంఘ్రి మం
జీర ఝుళంఝుళం ధ్వనివిశేషము గానకళా మనోజ్ఞ వీ
ణారవముందురంగ భట నాగ చంద్రధపౌరలోక గం
భీర రవంబునుం జెవికిఁబెక్కువఁజూపెఁబయోధి కన్యకున్"

ఇందు ప్రత్యేకించి సంగీత విశేషకముగా వివరింపవలసినదేమియు కన్పట్టుటలేదు. నాగచంద్రధపౌరలోక గంభీరరవంబులన్నిటితోపాటు మృదంగ భేరీ జయశంఖవీణారవములుకూడ నిట నుట్టంకితములు. అంతమాత్రమే.

రాధామాధవ ప్రబంధమున రాధకు కృష్ణునిపై వివాహాభిలాషను కల్పింప సంగీతమును సాధనముగఁగొని వీణియమీటుచు సంగీతవైదుష్యమును ప్రదర్శించి మెప్పులుకొనిన వాణి ఇట విష్ణుమాయా నాటకమునఁగూడ ఒక పాత్రమైనది. కాని యీకావ్యమున ఆమెవరార్థముగ జూపినంతమాత్రపు సంగీతరీతిని స్వీయానుభవమునచూపి నిజేళుని ప్రేరేప ప్రయత్నించలేదు. వీణమీటినది మాత్రమేగాని రాగమయియై గొంతువిప్పలేదను విషయమీ పద్యమున వ్యక్తము.

* రా. మా. ii 143

** ,, ii - 155

"అంగజుఁడు వెల్లిగొల్పంగ సంగకముల
నెల్లఁగళవార ధైర్యంబు....
బ్రహ్మదేవునిపైఁ బ్రేమపాఃగ పిడిచి
పీణియనుమీటి పాడుచు విద్రుమోష్ఠి"

చతుర్థాశ్వాసమున తన ఆరాధ్యదైవమును నుతించు సందర్భమున ఒకచో నా దేవుని—

"నారదవీణా మధురధ్వని ముదితహృదయా" అని సంబోధించును. ఇంకొకచో ఒక దండిక మధ్యమమున.

ఇంద్రాది దిక్పాలనాళీకనేత్రిక సురస్త్రీలు గాంధర్వకాంతామణుల్ నాగకన్యల్ మహాసిద్ధ విద్యాధరాజ్ఞాననల్ దేవవారాంగనల్ వేణువీణా మృదంగాది వాద్యధ్వనుల్ తాళమానంబులన్ మ్రోయంగాఁదావకీన స్ఫురద్వంశ సంపూర్ణ సంగీత జాతస్మరస్ఫీతచేతో వికాసంబులన్ పాడుచుందురనియు నుతించినాడు. అంతకుమించి ఈ విష్ణుమాయానాటకమున తన సహజ సంగీతాభిజ్ఞతను ఈకవివరుడు వెల్లడింపకుండుట విచారణీయము.

# అయ్యలరాజు రామభద్రకవి

రామాయణేతిహాసమును ప్రబంధరీతిలో మలచి అందు ప్రబంధోచిత వర్ణనావైచిత్రితోపాటు సంగీతకరీతినికూడ కొందరు ప్రబంధకవులు ప్రస్తావించిరి.

అట్టి ప్రబంధమండలిలో అయ్యలరాజు రామభద్రుని రామాభ్యుదయము ఆతని సంగీతాభిరుచిసమన్వితమై తేజరిల్లినది. ఈ కవికి సంగీతమున విశేషాభిరుచికలదనుట సత్యసముచితము. సంగీతప్రస్తావన ఉన్నంతమట్టుకు పరిశీలించిన ఇక్కవివరునకు ఆహత సంగీతకరీతికంటే అనాహతము, మార్గ సంగీతప్రక్రియకంటె దేశిపద్ధతియందభిరుచి యున్నట్లు గన్పించుచున్నది.

కథానుగతముగ నవకాశము కల్పించుకొని ఈకవివరుడు ఒకటిరెండుపట్ల మాత్రమే గావించిన సంగీతకప్రస్తావనలో ఆద్యముగ దశరథమృగయా వినోద సందర్భమున నీకాంతాకవర్ణన ప్రవర్తిల్లినది.

"సింహనఖాంకురచ్ఛిన్న వారణకుంభ
జనితముక్తాఫల శర్కరిలము
దవ గంధవహబంధు దహ్యమానేక
కాళికాగరుధూపగంధిలంబు

పృథులషడ్జ స్వరోద్గీతభిల్ల పల్ల
వాధర గీతికావర్ణనాతిభీతి
పరవశాత్మపటీరనోపర కుటీర
లీన ఫణియగునక్కాన కాననమై"*

ఈపద్యమున రామభద్రకవి "షడ్జహంమయూరో వదతి" అను స్వర సంకేతమును చమత్కరించినాడు. దశరథుడు వేటాడబోయిన కోనలలోనున్న భిల్లపల్లవాధరలు షడ్జస్వరోదితముగ గీతికా గానముచేయగా అది మయూర

---

* రా. మా. ii - 25

కూజితమను భ్రాంతినంది కోటరకుటీరములందు ఫణులు లీనములైనవని చమత్కరించుట కవి యభిమతము. కాని యిది "శిశుర్వేత్తి పశుర్వేత్తి గానరసంఫణీ" యను ప్రఖ్యాత సంగీతాభిమానమునకు విప్రతిపత్తియై గీతికాకర్ణనాతీతితో ఫణులు కోటరాంతరితములగు కన్వయము కుదురుటలేదని కొందరు విమర్శించిరి.

ఫణులు గానాస్వాదనాలోలుపములగుట సాజమ్. కాని ఆ భుజంగములైనను నాదస్వర వాద్యానుగతముగ ప్రత్యేకించి ప్రవర్తితమగు స్వరస్తబకములతో గూర్చిన గీతనాగరాళి, పున్నాగ వరాళ్యాది రాగముల వినినపుడు పరవశించునేగాని ప్రతిస్వరమును ప్రతిరాగమును వినినపుడు వితన్మయతనందజాలవు. ఇట కవి చెప్పినది. ఆ భిల్లపల్లవాధరలు గావించినది ప్రధులషడ్జస్వరాన్వితమైన గీతికనాలపించిరని. అనగా వారాలపించిన గీతికలలో షడ్జము న్యాసస్వరముగనో, అంశస్వరముగనోయుండి ఆమ్రేడితమైయుండును. వారు పలికిన అషడ్జస్వరము అనాహతనాదయుతమై నెమలికూతవలె నినదించియుండును. అందుచే సర్పములు జాతివైరమువలన మయూరములట చరించుచున్నవను భ్రాంతినంది కోటరలీనములైనవి. ఇందు కవి షడ్జస్వరమును మయూరోదితమను న్యాయమును గడించుటతోపాటు భిల్లాంగనలు వెలార్చిన అనాహతనాదమాధురిని కూడ ప్రవ్యక్తముగావించుట మోదావహమగునేగాని గర్హణీయముగాదు.

ఇట్లు ఒక్కచో సందేహాస్పదముగానున్న సంగీతప్రస్తావన గావించినమాత్రమున కవిపూర్తిగా సంగీతానభిజ్ఞుడనుట సాహసమేయగును.

ఋష్యశృంగుని దోడ్తేర పయనమైన వేశ్యలు గొంచువచ్చిన వీణెలే మలహరులను మ్రోయుచున్నవని చెప్ప కవితనదైన వాద్యానుగతమగు మలహరీ రాగాభిమానమును వ్యక్తీకరించినాడు.*

---

*"అట్టి విరుద్ధులు గలదియుంబెట్టువిభుదు
తాపపడిరంచుఁదముఁ జేరుఁలాడ వీణ
మలహరులు మ్రోయ నాందోళికలన వచ్చి
డిగ్గిపోతగన్న వెలయాండ్రఁదరిఁజూచి" రామా. ii - 78

"అనుమతిగాంచి దండియలుపాంగ ముమద్దెల తాళమావజం
బును(గొనిమేళమై మునితపోవనికింజని నిల్చిరొక్కెడన్"*

వాద్యబృందముతో తరలిరనుచు నాట్యసన్నాహమునకు వలసిన వాద్య విన్యాసమును పేర్కొనుటలో కవివరుని సంగీతపరిచితి వ్యక్తము.**

ఈకవికి కేవల సంగీతాభిరుచియేకాక కొలదిపాటి శాస్త్రపరిచితికూడ కలదనుటకు తార్కాణముగా ఒక్కచో గాయకవేళాది దోషములగూర్చి యుగ్గడించినాడు. సంగీతశాస్త్రములందు గాయనదోషములును, రాగవేళావేళలను గూర్చి నియమములున్నవి. అట్టి మేరలనుమీఱుట సంగీతశాస్త్రకారులదృష్టిలో దోషము.***

"హరి హయాయుధరేఖలను గడల్వేయించి
యల ముధారారజ్జువుల బిగించి
జలదంబులను నీలివలలెల్లడల నిల్పి
వివిధ గర్జావాద్యరవముగొల్పి
దేవమీఁదటిన్నటి పంక్తిఁ బేరించి
నోపుగా మెఱుమలు గొనఁగఁజేసి
సరసులనొక సొంపు సంధిల్లఁగావించి
పెక్కుదిక్కుల వారిఁబెంపుచేసి
యలరెఁదొలకంతటి పేర్చి మాటవాఁడు
మీటువాటిల్లవలరాచ మెచ్చువడసి"**** ఈపద్యమున రామభద్రకవి

---

* రామా. ii - 89

** "అకళంకేందు ముఖీశిఖామణి యొకర్త్రాలాపమున్ చేసెగా
న కళాదేవతవోలెఁబల్లవిత వీణాదండ కాండంబుఁదో
దకితస్థాణువుగాఁజగత్త్రితయమున్ వాగబ్ధినోలాడగా
యకవేళాది సమస్తదోషపరిహారాకుంఠ కంఠధ్వనిన్" రామా. ii_129

*** గాయన దోషములు-రాగవేళలు_చూ. 'స్త్రా.అం.కు.సం.ప్ర.' భా._1

**** రామా. vi - 18

తోలకరితఱి పేరియాటవారు ఆడిన దేశినృత్త విశేషమునుగూర్చి వివరించినాడు. పేరియాట యనుటవలన మొదట యిది పేరిణీనృత్తమేమో అనిపించును. కాని ఇందలి నృత్తవిశేష రీతిననుశీలించినచో ఇది కోల్లాట నృత్తరీతియని నిర్ధారింప ననువుపడును.*

ఈ కోల్లాట నర్తనమున కోల్లాటమాడువారు అంచితము మొదలగు కరణములతో వింతవింతగా తోలువగ్గములమీద నడచుచు పొడవైన వెదురుగడల మీద చాలదుష్కరములైన భ్రమరులు చేయుచు ప్రాణసందేహము గలిగించు నట్లు ఆయుధములనుండి తప్పించుకొనుచు కాహలలు మార్గపటహములు మున్నగు వివిధ గర్జావాద్యరవములు లయాన్విత మ్రోయించు ఆడుదురు. ఈ కోల్లాట నర్తనమును తొలకరివేళలో వర్షములుపడిన ఆనందసమయములో గ్రామీణులు ఆడించుకొని ఆనందించెడి వారేమో! అందువలననే రామభద్రార్యుడిద్దానిని వర్షర్తువుననుసంధించి తొలకరి పేరియాటగా నుట్టంకించి యుండునని తోచు చున్నది.

ఇట్లు కావ్యాంతరిత ప్రసక్తులలో గన్పట్టిన గీతవాద్య నృత్తప్రసక్తుల ననుశీలించిన అయ్యలార్యుడు సంగీతాభిజ్ఞుడేయని నిర్ధారింపవచ్చును.

* కోల్లాట నృత్తరీతి - చూ. నాచనసోమనాథుడు ప్రా. ఆం.క.సం.ప్ర. పుట - 159. నృత్తరత్నావళి 149 - 152.

# ధూర్జటి కవుల సంగీతార్పితి

కవిధూర్జటి కవితయందలి అతులిత మాధురీ మహిమాన్వితరీతిలో వెల్లి విరియని గానరీతి;

స్తుతమతియై చెలంగిన కవిధూర్జటి పల్కులకేల గల్గెనో అతులితమాధురీ మహిమయని ప్రశంసార్హుడైన ఈకవి ఏలనో గానమహిమను తనకవనమున జూపలేదు. అట్లని యాతడు షూర్తిగ సంగీతానభిజ్ఞుడనుటకు వీలుపడని అణి ముత్యములవంటి పలుకులు కొన్ని కాళహస్తిమహాత్మ్యమున నిక్షిప్తములై యున్నవి. అందు మొదటిమాట కాళహస్తుల న్వర్థను ప్రవ్యక్తము చేయువట్ల సర్పరాజు మనోగతిని వర్ణించునపుడు ఇట్లు ప్రవృత్తమైనది.

"బహువిధ తానసంపన్న గానంబుల
నిక్కచొక్కెడు తననేప్ప వదలి"*

ఇందు ధూర్జటికవి బహుసంఖ్యాకములైన తానములను, కూటతానంబులను గూర్చిన సంగీతశాస్త్రరీతిని ఎఱిగినవారనుట నిర్వివాదము.

ఇంకొకచో వేశ్యకూతుల కథలో గానమాహాత్మ్యమునుగాని నాట్యపద్ధతిని గాని చొప్పించుటకెంతయో అనువున్నది. కాని కవి ఒకవైపు కథాకథన భారమును మఱియొకవైపు భక్తిభావావేశము వహించియున్నారుగాన మాటలతోనే అద్దానిని పోనిచ్చి

"రసికులు మీగానరసమాన వచ్చితి
పాడరె శివభక్తి పాడుగామ" అనిపించినారు. అట్లే అంతకు ముందు ఆవేశ్యమాత

"కోకిల వాణిపాడు తన కూరిమి బిడ్డలదొట్ల పెట్టికా
క్కోక కళావిలాసములంగలయర్థముఖోల పాటగా
అట్లే తనకూతుల సంగీతవిశారదలఁజేయగోరి

---

* కా. మా. II - 114

"నిరుపమకలనాద పరివాది సవీణ
    లాదిగాఁగల గానయంత్రములును
దక్షిణ భరతమాత నాంజనేయనోహళ
    మతంగప్రముఖ లాస్యాగమములు" సంతరించినదట.

ఆవేశ్యబాలికలుకూడ లోకసామాన్య వివాహగానములు ఉమాగిరీశస్తుతిగాగ పాడుచుందురట.

వాణీచతురాననుల కథలో వాణి ఝుళంఝుళం నాదంబులనీను వజ్రవిర్మిత తులాకోటి ద్వయంబునుగై నేసినదేగాని వీణాది విద్యావినోదముల నలరించలేదు. ఇంతకుమించి ఈ గ్రంథమున సంగీతప్రసక్తులు చెప్పుకొనదగినంతగాలేవు. సహజసరస సహృదయుడగు పీకవి అతులిత మాధురీమహిమాన్విత వనితాగాన వినోదముల విని ఆనందించి తనకవనమున అద్దానిని ప్రతిక్షేపించినాడేమోకాని గానరీతిగా స్థానము ప్రకల్పింపలేదు.

# కుమార ధూర్జటి సంగీతార్చితి

కుమార ధూర్జటికవి ధూర్జటి వంశాంకురము. తన వంశకర్త కవిత యందున్న అతులిత మాధురీమహిమ ఈతని యిందుమతీ పరిణయకావ్యమున సంగీతసుధామాధురీమిళితమై సంగీతార్చితిగ పరిణమించినది.

కృత్యాదిన కృతిభర్త అభ్యర్థనలో కూడ
ఇది నవ్యతరసుధయే సుమీ కాకున్న
విబుధాళి గణియించు విధముగనునె
.... .... .... .... .... ....
ఇది వింత విరిదీగయే సుమీకాకున్న
మధురసాధిక విజృంభణము గనునె
ఇది పల్కు(జెలిగుణాస్పద వీణయేసుమా
కాకున్న సద్వర్ణగరిమ గనునె

యనఁగ.... మెప్పనగు ప్రబంధమమర నొనరింపు"* మని సంగీతకథ్వా నాంచితముగనే సంభాషణము సాగినది. ఇట గీతిసాహితులకు ఏకత్ర వీణా నాదమై సద్వర్ణగరిమయైన సంగమము లభించినది.

ఇక కథోపక్రమణము జరిగినతరువాత రఘుమహాదీరుడు తనకడుకేగుదెంచిన క్షాత్రుని ఆతని గురువగు నారదుని క్షేమమడుగునపుడు వరతంతుమునీశ్వరుడని వ్యవహరించినాడు. నారదుడు వీణామునిగ ప్రసిద్ధుడగుటయే ఇట ధ్వనించినది.

ద్వితీయాశ్వాసమున ఇందుమతికథలో అజునిగాంచి విరహసహయైన సందర్భమున చెలులామెస్థితిని ఎఱుగదోరి కురిపించిన ప్రశ్నావళిలో ఆస్థా తౌర్యత్రికరీతియే ఇట వ్యక్తమైనది.

"పాటలాధర పాటవీటుఁబొండెఁగఁజాతి
గోట వీణియతంతి మీటవేమి?
మమ్మురమ్మనమని గారవము ప్రమ్ముకరమ్ము
నెమ్మినెమ్మికి ఆట నేర్పవేమి?"**

---

* ఇం. ప. i - 33
** ,, ii - 83

కుండిన పురప్రముఖుడైన శివశర్మ తమ రాకుమారి సందేశమును అజుని కడకు గొంపోయి రాయబారియగుటయేకాక తన వర్ణనానైపుణ్యమును వ్యక్తమగు తీరులో ఆమె అందచందముంతోపాటు ఆమె విద్యానైపుణ్యము వ్యక్తము చేయుటలో సంగీతముకాద్యమగు స్థానమొసంగినాడు. ఆమె తలరవ కోకిలపికా కలరవముల గెల్పులనుచెల్పి ఆమె సంగీతపాండితిని వ్యక్తముచేయుచు

"పాణి ప్రవాళ సంచరిత ప్రవాళమై
నఖరుచుల్ తంత్రుల నాట్యమాడ
కనుదోయి చూపులచ్చుచు శ్రుతులనంటి
.... .... .... .... ....
తాళగతుల నేర్పుతల జూపుటయేగాక
తాళవృత్తత కుచద్వయముదాల్ప
వాణి చందాన నానటత్పాణి కటకచటుల
కంకణ గణఘనస్వన మెనంగ
వివిధ మృదుతాన తానప్రవీణయగుచు
వీణ వాయించు నెరనాగ వేడుకలర"*

అనురాగభావమును గనుదోయి చూపుల ;
శ్రుతులనొనరించుటయందును తాళగతుల నేర్పుచూపుటయందును వివిధ మృదు తాన తాన ప్రవీణయగుచు వీణవాయించుటయందును మున్నుగాగల వేడ్కలలో ఆయెలనాగ సంగీతశాస్త్ర ప్రౌఢియే వ్యక్తమైనది. "అతులిత శ్రీవిలాసంబు శ్రుతులదాల్చు"నను పలుకుబడిలో శ్రీరాగాలాపనము వ్యక్తముకాగా కాహళములో "అమ్మవలమిన్న జంఘికలంచు" అనిన మరియొక పదవల్లరిలో కాహళావాద్య స్వరూపము కొమ్మకట్టినది.

ఇందుమతీ విషణ్ణ-విరహవేదననందిన ఆరాకుమారిని అంతరాంతరముల లోన అలజడి వసిగట్టిన రీతిలో సంగీతకమే ఇట్లుచోట్లు చేసికొనినది.

* ఇం. వ. ii - 169

"ఇదియేమీ ధరణీతిలేంద్ర తనయుండినాళ్లకీతిన్ సభా
సదులాహ్లాదముతోడ మ్రొక్కులిడగా సాహిత్య సాహిత్యనం
పదల నీగానవినోదవైఖరుల కుంభత్ప్రౌఢి వర్తించడం
చడారల్ వల్కగ మందహాసకలసన్ జూచున్ తదీయాస్యముల్"

ఇందుమతిని వనవిహారమున వినోదపెట్టి విరహమును మరపింపయత్నించి నపుడు.

"పాటలగంధులు పాటలఁబాడుచు
.... .... .... .... ....
రాగమనింగద రాగముటంటక
కిన్నరగైకొనఁగ కిన్నెర చేసెదు"* ఇత్యాదిగ గీతవాద్యములు ప్రస్తావితములైనవి.

చతుర్థాశ్వాసమున రాయబారిగానేగిన పారుడు తిరిగి పురమునకేతెంచి తాను గాంచిన అజమహారాజు నగరమును వర్ణించు సందర్భమున

"అమిత కల్యాణ మణితోరణాభిరామ
మతుల హృద్యానవద్య వాద్య స్వనంబు
ధరణి సురవేదశాస్త్ర బంధురరవంబుత
తత్పురీ వరమత్యద్భుత ప్రదంబు"** అనుచు వేదశాస్త్రబంధురవంబులో కల్యాణమయ సంగీతధ్వానమునే మేళవించి వినిపించినాడు. సూర్యోదయమునకు ముందరి వేకువ తేకువలోకూడ "మాగధవల్లి మధురగీతస్వనంబులు, వల్లకీవితానములు, తానమానంబులననూనంబగు గానంబుల జాణలగు వారల శిక్షణమున ప్రతిక్షణమునన నవిరళగతిఁజలగి బాడు గానరీతియు, విప్రవీరుల హరికీర్తన ధ్వనులను కలిగి మెలవి ఒక్కుమ్మడిగా ధ్వనించిన సంగీతమునకే అవకాశమొసంగినది.***

* ఇం. ప. ii - 95
** ,, iv - 8

పంచమాశ్వాసమున పెండ్లివేడుకలో సంగీతమునకే ప్రముఖస్థానము లభించినది. రఘునృపాలుడు అజకుమారుని పెండ్లికొడుకు గావించు వేడుకలో—

"కలకంఠీతతి పాటనీటిసయిఁ గాంధర్వమేళంబు గుం
పులు సొంపులీ వెలయింపు వాద్యరవమంభోరాశి జృంభద్వరా
వలసత్త్వాధిఁ జెలంగ నయ్యజుఁడు రేవఁ బెండ్లిపీటన్ వసించె" నట*

ఇట అజుని పెండ్లిపీటపై కూర్చుండబెట్టి ముచ్చటలనచ్చటల తీర్చు కొన్నది గీతియే

"బ్రహ్మణాశీర్వచః ప్రౌఢితో జోడుగఁ
బాట లాధరపెన్ పాటలమర
పంధిమాగధ హృద్యవాక్యారవమ్ము
శంఖభేరీ ధ్వనుల్...."**

అజుడు పెండ్లికొడుకై కాబోవు అత్తవారింటి స్వయంవరమున పాల్గొనుటకు తరలివచ్చునప్పుడు ఆతనికి వేగు నడచినదిట సంగీతకము.

"వచ్చునెడన్ నృపాలసుతవర్యుని ముందల నుపాంగ నిస్స్వనో
ద్యచ్ఛరణాంగదారవ మృదంగజతాళ జధింధిం మధ్వనుల్
మెచ్చు ఘటించ మీరమణీగణముల్ నటియించె వేడ్కన
య్యబ్బుర ముద్దుగుమ్మల క్రియల్ నయనాభినయ ప్రవీణతన్"***

అంతేకాదు ఇటుగీతిలో వాద్యనృత్తములగూడ జతగల్పి వేడుకలుపచరించినది.

* ఇం. మ.

** ,, ,, - 32

*** ,, ,, - 33

"....అయ్యైజుని శంఖారావ
గంభీర జయభేరి కావిధాన
గజ ఘంటికా ఘణంఘణనాద బృంహిత
హయహేషిత స్వనహరిహయాది
వర్జిత సుమబృంద వాసనాగత భృంగ
రవ దివ్య కామినీ రచితగీత
వివిధ జనస్తోత్ర వితతధ్వ న్యూర్జితే
కీభవించి...."*

నవఘూర్ణమాన జలధిరవము చందాన వెలసినప్పుడేమి చెప్పననుచు కవియే అనాహత నాదమాధురీ ప్రఘోషణమును ప్రతిధ్వనింపజేసినాడు.

స్వయంవరమును చూడగోరి అరుదెంచినవారుకూడ "మర్దళ విరావతాళ సమ్మర్దనినదములర నేతెంచినా"రు. అంతఃపురమునందుగల కాంతామణులు పెండ్లిపాట.

"పెండ్లిపాటలు తనరంగ ప్రియమెసంగ నొండొరుల సందడింపుచు నుచితలీల" పెండ్లికుమార్తెను స్వయంవరమండపమునకు కొనితెచ్చినారు. స్వయంవరానంతరము,

"ఉరుతర శోభన స్తవములుల్లసిల్లన్ వటుహృద్యవాద్యముల్ మొరయగ" పెండ్లిపీటపై వధువనధివశింపజేసినారు. అపుడు భేరీమృదంగగంభీరనాదంబులు వందిమాగధకీర్తనలు గ్రందుకొనగ వివిధ మర్దళ తాళీనవీరరవము మెరయ వారాంగనాతతులు నృత్యమాడ పెండ్లిపేడుకలో సంగీతార్భటి గ్రందుకొనినది. అప్పుడు దశదిశాపటల వాద్యధ్వనులు కడుమించినవవి సంగీతమేళంబు సందడించె నని తెల్పుచు కవి మొరసినాడు. ఇట్లు సంగీతము ఆర్భాటము నెఱప

---

* ఇం. వ. v - 54

**

***

****

సాహిత్యము పౌరోహిత్యము వహించి ఇందుమతి అజమహారాజుల వివాహము నిర్వహించిన కావ్యము మంగళాంతమై ముగిసినది. కుమారధూర్జటి సాహిత్య సాహిత్యములో సంగీతాకృతితో కవనమునునడిపి అతులితమాధురీ మహిమాన్వితముగ ఇందుమతి పరిణయగాథను ప్రకల్పించినాడు ఈకవికి అమేయసంగీతశాస్త్రపాండితియున్నను లేకున్నను ఆతడు కల్పించిన కథాప్రకల్పనమునమాత్రము సంగీతార్భటిని అందించి ఈతని సంగీతప్రీతిని వెలయించినది.

ఈకవి రచనమే కృష్ణరాయవిజయమను మరొక ప్రబంధమున్నది ఇందు ఈతడు సంగీతప్రసంగము నెక్కుడుగా చేయలేదు. కలిభర్త ఆర్వేటి చిన వేంకటాద్రిగారి సభాస్థానమునమున్న "సరసమృదుల సంగీతవిశారదా పరాజిత నారదముని నాయకులగు గాయకుల ప్రసక్తి" చెప్పినాడు. ద్వితీయశ్వాసమున కృష్ణరాయని పట్టాభిషేక సందర్భమున "శంఖ కాహళభేరీప్రచండ వాద్యరవములు నిండినవనినాడు. అనవద్య చిత్రవాద్య స్వనంబు తోడ భేరీవిరావము ఘోరుగలుగ రణరంగము మించినదనినాడు. ఇంతకంటె మించిన సంగీత ప్రసక్తులిందేమియు లేవు.

# రామాయణ ప్రబంధకవుల సంగీతప్రస్తావన

ప్రబంధయుగమున సంగీతకము కవనసహకృతియై రామాయణకథా కావ్యములందుగూడ శాస్త్రోదిరితప్రతిపత్తితో తేజరిల్లినదనుటకు కంకంటి పాపరాజకవి ప్రణీతమగు రామాయణము మొదలయగుచున్నది. ఈతడు విష్ణుమాయా విలాసయక్షగాన కర్తయగుటంజేసి ఈతనికి సంగీతకము వెన్నతోపెట్టిన విద్యయగుననుట నిర్వివాదము. యక్షగానము సంగీతకప్రధానమగుట ఆవశ్యకము. కాని కథానుగతముగ రామాయణమునందు సంగీతకము శ్రుతిమించి రాగమున బడుట కవకాశముండదు. అయినను కవి సంగీతచతురుడగుటవలన కథాక్రమానుసారమే ఔచితీ సహకృతముగ సంగీతసభా సన్నివేశమును ప్రకల్పనము గావించి తనదైన సంగీతప్రతిపత్తిని ప్రదర్శించినాడు. కథానుగతముగనేకాక అంకితసమయమునగూడ కవిదైన సంగీతారాధనమే ప్రవ్యక్తము.

తన కావ్యమునంకితముగ గైకొననేతెంచిన బ్రహ్మగాంధర్వ విద్యా విదుడగు మదనగోపాలమూర్తి మురళిదాచేతగల జగన్మోహనుడై కవివరుని స్వప్నసీమలో నేలుకొనినాడు * అంతేకాక కవివరుడు ఇతః పూర్వము అంకిత మొసగిన విష్ణుమాయా విలాసయక్షగానమునందుగల సుధానుసారి వాక్కులం జొక్కియున్నారమనినాడు మదనగోపాలుడు.**

---

*"తలను వలగొన్నపించెంపు దండవాడు
విమల శతపత్ర ఝైత్రనేత్రములవాడు
మురళికాచేతఁగల జగన్మోహనుండొ
కండు నాస్వప్నమునను సాక్షాత్కరించె"   ఉ. రా. పీఠిక - 19

**"శ్రీ వెలయమున్న విష్ణుమయా విలాస
యక్షగానంబు మాకె సమర్పణముగఁ
జేసితది యాడిగా మేము సీసుధాను
సారి వాక్కులఁ జొక్కియున్నార మనఘ!"   ఉ. రా. పీఠిక - 22

అవతారికయందేకాక కథానుగతముగగూడ కొన్ని పట్టుల పాపయారాధ్యుడు సంగీతప్రస్తావనను గావించియున్నాడు. సీతారాములు రావణవధానంతరము తిరిగి స్వస్థానాయాతులై, అయోధ్యాస్థితులై సుఖముగానున్నపుడు కవి తీరికగా సంగీతక వినోదమును గల్పించినాడు. అది విలాసార్థము గల్పించినదయ్యును సంగీతకళావిన్యాసముగా సద్దానివి తీర్చి దిద్దుటలో పాపరాయుని సంగీతశాస్త్రాభిర్యక్తి వెల్లివిరిసినది. ఇందు గీతవాద్య నృత్యత్రయియైన తౌర్యత్రిక విధానము ప్రస్తావితము.

రామచంద్రుడు సభాభవనమునధివసింపగ వందిమాగధులు అమ్మహామహుని కైవారమొనర్చిరి. తదనంతరము వాద్యానుగతమైన గానము వినిపించినది. ఆ పిదప నాట్యాభినయనము ప్రదర్శితము. సభాంతరమున ప్రదర్శితమైన నాట్యభంగులలో దేశ్యనృత్యహేవాకము వెల్లివిరియుటచే దేశిప్రక్రియందు కవికున్న అభిరుచి ప్రవ్యక్తమైనది.*

---

*"గవి పెనదీసి హొన్ను జిగికాయలు చన్నులఁదాఁకఁ తంత్రు
క్కావరుసదీటి మెట్టులొడికంబుగ నొత్త స్వరంబులన్నియున్
పరువువహింపఁదాళలయ సంగీతి గీతములన్....
ప్రవణత నొక్కలేమ నరపాలునకున్ వినిపించె వీణియన్"

ఉ. రా. vi - 134

"స్వరముల్లయారెమేలు శ్రుతిబాగురె మూర్ఛన కంపితంబు బా
పురె బళిరయ్యశాల్ మెఱసెఁబో నెరమీటు కులంబు తాయమ
ద్దిర స్ఫురితంబులమ్మయని తేనియలొల్కెడి జిల్గుపాటలోఁ
దరుణి విపంచిమీటె వసుధాపతి మెచ్చుకొనన్ రసజ్ఞతన్"

ఉ. రా. vi - 135

"తంబురమీటి వేతావతి తానములెంతయు విస్తరించి రా
గంబమరక్తి రాలుగరగన్ ఛిలుబ్రమోడులు పల్లవింప న
య్యంబుజపీ మనోహర కులాగ్రగణి మీదిపదంబు పాడినన్
క్రొంబులకల్ జనించె సభకున్ తలవంచిరి వైణికాగ్రవరుల్"

ఉ. రా. vi - 136, ఉ. రా. vi - 137, 138

ఈపద్యములందెన్నో సంగీతసాంకేతికపదములు దొరలినవి. కథానుగతముగ గూడ ఇట్టి పారిభాషికములు* కేవల శ్రుతిపాండిత్యముగాకాక పాపరాజుతనదైన బహునిర్మల శ్రుతమునకు ప్రతీకగా ప్రయోగించుట గమనార్హము.

తదనంతరము లవకుశుల రామాయణగానమున తన సంగీత కళా ప్రవణత్వమును ప్రదర్శించినాడు. వాల్మీకి గురువరుడు శిష్యులు లవకుశులను—

"ప్రవణతమీఱ మీరు కవపాయక రామకథాప్రపంచమీ
.... .... .... .... .... .... ....
.... చదువఁగా వలయు నీజనులందఱున్ వినన్"**

"స్వరములుఁదాళముల్ లయలు సారవుమీఱ కాలంబులేర్పడన్
జిరముగ మీకు నారదుఁడు నేసిన శిక్ష ఫలింప నింక మీ
రిరువురు వీణెలూని దినమివ్వది సర్గలలెక్క రాఘవే
శ్వరు సభఁబాడుఁడప్పుడుని చారుచరిత్రమునఖ్యలౌనసన్"***

---

"అన్యోన్య హస్తదండావృత్తులెసఁగనొం ... దొరుల
యీవలా వలవచ్చి.... .... ....
కంకణమంజీర కాంచికల్ మ్రోయస - వ్యావసన్య స్ఫూర్తిఁజూపి చూపి
తాళవాద్య రవానుకూలముగామంద - ద్రుత మృదుగతులను దిరిగిదిరిగి
యనుపమ రసోదయంబున నభినవాతి చిత్రవర్తనభంగులఁజెలఁగి చెలఁగి
విడివడిన మన్మథోన్మద విభ్రమములన సఖులు హల్లీసకము సల్పిసంతసిల్లి"
ఉ. రా. vi - 140

* స్వరము, శ్రుతి, మూర్ఛన, కంపితము, దాల్, తాయి, స్ఫురితము; తానము, పుష్పాంజలి, పదచాళిక, జక్కిణి; కొరవంజి, పేరణి, హల్లీసకము, మంద, ద్రుత, మృదుగతులు.

** ఉ. రా. viii - 46

*** ,, viii - 46

"సమయముఁజూచి యొక్క దివసంబున రాముని యజ్ఞశాలన
క్కొమరులుపోయి యందుఁగవఁగూడి విపంచికలూని తానమా
న మానములను రాగముల్ వినవినన్ జెలువై చెవులానసందఱున్
ప్రమదపయోధిలోమునఁగఁ బాడిరి రామచరిత్ర మింపునన్"*

"శ్రుతులు బెరయుట స్వరములచొప్పు విడక
చాలశుద్ధతగనుట దోషములఁబాసి
ఘన విధముగాన షడ్జంబుఁగలసిమెలసి
అక్కవలవారి గానంబు సొక్కొనర్చె"**

"జనక కుమారి కాత్మజులు సారెలు చక్కఁగఁబెట్టి మేళవిం
చిన కవవీణియల్ మొరయఁజేయుచుఁబాడిరి రంగురక్తులన్"***

"స్వరములయారె మేలుశ్రుతి బాగురె మూర్ఛన కంపితంబు బా
పురె బళిరయ్యదాల్ నెఱపెఁబో నెఱమీటు కులంబు తాయమ
ద్ధిర స్ఫురితంబులమ్మయని తేనియలెక్కుడి వారిపాట లా
దరణము మీఱఁగా వినిముదంబొదవన్ బతిమెచ్చె నెమ్మదిన్"****

మొత్తముమీద కంకంటి పాపనార్యుడు కళాయుగంధరుడై ఈరామాయణ ప్రబంధనిర్మాణమును గావించినాడనుట ధబ్బరగాదు.

మొల్లరామాయణము : కంకంటి పాపరాజువలె రామాయణ గానమును గావించిన కవయిత్రిమొల్ల తన కావ్యాంతరితముగ సంగీతప్రస్తావనను గావించుట అంత అవశ్యముగ నెంచలేదు. ఆమె లాలానప్రబోధనములను సంగీత శక్తులలో ప్రబోధనమునకే కొంత ప్రాధాన్యమిచ్చినది అదియును రావణాసురుడు

* ఉ. రా. viii - 51
** ,, viii - 52
*** ,, viii - 60
**** ,, viii - 62

రాముని ఎదుర్కొన నేగునప్పుడు వాద్యప్రఘోషణములను మెరయించినది. అట్టి యెడ ఆమె వర్ణించిన వాద్యనామములు కొన్ని కననివి విననివి కూడనున్నవి.

"భేరుల్ తమ్మటల్ పెల్లునిస్సాణముల్
బూరగొమ్ములు కంచువీరణములు
సుకిలప్రోవులు వీరమద్దెలన్ గిడుగిళ్ల
పైపైన తప్పెటల్ పిల్లగ్రోళ్ల
తారలు చమ్మటతారలు శంఖముల్
కాహళల్ పసిండిడక్కలును బిరుదులు
గాలిగొమ్ములు డోళ్లు కైవళ్ల రుంజలు
ఛత్రసంఘంబులు చామరములు

బోరుకలఁగంగ దిక్కులు బూరటిల్ల
దనుజ వర్గంబులిటవంక దవిలి కొలువ
పెడలె సన్నాహమడరంగ వీరరరవము
కరువుగట్టిన చందంబు గానఁబడఁగ"

ఇంతకుమించి సంగీతప్రస్తావనకు సమగ్రముగ గావించుటకు అవకాశమును ఆమెకు రామాయణగ్రంథమున కలుగలేదను కొనవచ్చును.

## కందుకూరి రుద్రకవి యందుకొనిన లయవిన్యాసము

రుద్రకవి కృతములగు జనార్దనాష్టక నిరంకుశోపాఖ్యాన సుగ్రీవ విజయ కావ్యత్రయమున గానఫణితి అందగించినది. రాయలనాటి సంగీతరసికత ఈతని సుగ్రీవవిజయమున రూపుదిద్దుకొన్నది. కోటలోని రాజుగారికి సంస్కృత నాటకములతోపాటు ప్రజలిచ్చగించు వీథినాటకములుగూడ సచ్చుబాటగుచున్న రోజులివి. కావున కేవలము గ్రామ్యభాషలో పామరజనులు అస్తవ్యస్తముగానాడు కొనెడి వీథినాటకములరీతిని కొంచెము సంస్కరించి ఈ కందుకూరి రుద్రకవి సుగ్రీవవిజయమను యక్షగానమును రచించియుండవచ్చును. అందువలన సుగ్రీవ విజయమే తొలియక్షగానమని సాహిత్యపరులు అభిప్రాయపడుచున్నారు. యక్ష గానమనునది గీతికి సాహిత్యకి, దేశికిమార్గికి మధ్యేమార్గమున నడుచు మధురరచన. ఇందు రుద్రకవి రాగన్యాసమును ప్రదర్శించుటకు వదలిపెట్టి లయవిన్యాసమును ఛందోవైవిధ్యముపలచికొని రచనను సాగించినాడు.

ఈ యక్షగానమున నీకవి ద్విపద, ఝంపె, అటకురుచఝంపె ఏకతాళా దికములకు అర్ధచంద్రికలు, ద్విపదలు, రగడలు మున్నగు లయాత్మక ఛందో విన్యాసముల ప్రతిపాదించినాడు. ఇవి ఒక్క తెలుగునడతగలవిగాక భిన్న గతులలోనున్నవి. మృదంగజతి విన్యాసమునననుసరించి వీనిని వింగడింప వచ్చును.

రగడలను తాళలయమానపద్ధతులకు లాక్షణికాగ్రేసరుడైన అప్పకవి అనంతరకాలమందిట్లు అను శాసించినాడు.

తుదనేడు లఘువులు తొలగించి చదివిన
 ద్విపదకు వృషభగతి పదయుగము
లరగడపలనొక్క లఘువుమానిన ఝంపె
 యగు ద్విరదగతి సమపదయుగము
గురుతగు రచ్చెరకురుదరగ వల్గనాహ్వయ
 మేకతాళమో మధుర గతికి

నంశ్రుషికిర్వదినాలుగట తాళమున మాత్ర
లోలి విశ్రాంతి పద్యాలుగింటఁ
దెలియ వర్ణంబు నర్ధచంద్రికలు పీలు
యక్షగాన ప్రబంధంబులతుకవచ్చు
రగడ భేదంబు లవియంద్రుఁదగి కవీంద్రు
లలిత నిజసేవకస్తోమ యద్విధామ"*

ఇందురచ్చెరయని అప్పకవి అనిన ప్రక్రియ పిదప రగడయని వ్యవహృతమైనట్లు భావింపవచ్చును. ఈ రగడాలోనింకను అనేక విధములైన జానపద కవితారీతులును జేరినవి. అవి, ఏలలు, జోలలు, సువ్వాలలు, ఆరతులు, ధవళములు, చందమామసుద్దులు, వెన్నెలపదములు, నివాళిపదములు, విరాళిపదములు, తుమ్మెదపదములు, గొబ్బిపదములు, కోకిలపదములు, చిలుకపదములు, అల్లోనేరేళ్లు, నీసకందార్ధములు, త్రిభంగులు, ద్విపదలు, త్రిపదలు, చౌపదులు, షట్పదులు, మంజరులు, జక్కులరేకులు మున్నగునవి.

ప్రప్రథమమున రుద్రకవి కందుకూరి జనార్దనస్వామిని కొనియాడు సందర్భమున త్రిపుటతాళములో ఒకగీతినిట్లు గూర్చినాడు.

"లలితగాత్రుడు శుభచరిత్రుడు
దలితశత్రుఁడు సుజనమిత్రుడు
నలిననేత్రుఁడు కందుకూరి జనార్దనుండతఁడు"** ఇది "తకిట, తకతక, తకిట తకతక" అను మృదంగ విన్యాసముకనువుగ సాగిపోవును. అట్టిదే ఝంపెతాళముతో గూర్చినది మరొకటి:-

"ఇనవంశతిలక నేనిభతనూభవు మంత్రి
ననిలజుఁడు నాపేరు హనుమంతుఁడండ్రు
కపులకెల్లను రాజు శౌర్యబుద్ధములు
నిపుణుడు సుగ్రీవుడ పరిమితబలుఁడు"***

---

* సు. వి. i - 2
** ,, i - 2
*** ,, i - 7

దీనికి మృదంగ విన్యాసము—

"తకతకిట తకతకిట తకతకిట తకిట" అనిన తగియుండును. కరుచ ఝంపెలో నింకొకటి యిట్లున్నది.

"వనచరోత్తములెల్ల వచ్చి
మంచిదినముచేకొని నన్ను దెచ్చి
కపిరాజ్య పట్టంబుగట్టి''*

దీనికి తగిన మృదంద విన్యాసమియ్యది.

"తకతకిట తకతకిట తకిట
తకిటతక తకిటతక తకిట"

ఆ పిదప ఏకతాళములో గూర్చినరచనలు చకచకసాగి తకతకమని మృదంగము పలికించినట్లేయున్నది.

''ముక్కులు చెక్కులు మూపులు వీపుల్
.... .... .... .... ....
గళములు శిరములు జానులు వీనుల్
కరములు నురములు కాళ్లనువేళ్లన్"**

''తకధిమి తకధిమి తకధిమి"యని సాగిపోవు నడకయిది.

ఇక ఒకే ప్రక్రియకుచెందిన అర్ధచంద్రికలను వివిధవిన్యాసములలో వేర్వేరు నడకలతో విచిత్రముగాగూర్చి రుద్రకవి బ్రహ్మణినేగాక లయబ్రహ్మము గూడమహాపించినాడనిపించుకొనినాడు. వానికుదాహరణములు కొన్ని

---

* సు. శ.
** సు. శ. 4 ప్ర. శ. 1

"చదువులు దెల్పిన జలచరపతికిన్
కుధరము మోసిన కూర్మంబునకున్
మేదినదాల్చిన యాదిమ కిటికిన్"*

దీనికి మృదంగ విన్యాసమిది.

"తకతక తకతక తకతక తకిట"

ఇట్లే వివిధ మృదంగ జతివిన్యాసములలో సాగిపోవు మఱికొన్ని యర్ధ చంద్రికలున్నవి.

"కన్నులనశ్రుల్ గ్రమ్మగ వగచున్
ఔరా విధివశమని తలయూచున్"**

"అంత నెత్తురుపేరులంతటనె వచ్చెన్
రక్కసుని ఘోషములు నెక్కసము లాయెన్"***

"స్వర్ణకుంభములందు గంగాజలము దెచ్చి
అంబుజాప్త తనూజుకభిషేకమును జేసి"****

ఇట్టి యర్ధచంద్రికలేకాక కొన్ని ధవళములుకూడ ఇట్లు కూర్చబడినవి.

"శ్రీరాముఁడు గుణధాముఁడు వారిజదళలోచనుఁడు
శూరత రావణుఁగూలిచె నారీమణిఁదేవలయున్"*****

ఈనాడు జానపదుల పాటలలోగూడ సరిగవినిపించని ఏలలనుగూడ కొన్నింటిని కందుకూరి కవి సుగ్రీవవిజయమున విశేషించినాడు.

---

* సు. వి. 1 - 1

** సు. వి. పు. 12 - 2

*** ,, 14 - 2

**** ,, 40 - 1

***** ,, 40 - 4

అట్టి ఏలకిదియొక మచ్చుతునక.

"భానువంశమునఁబుట్టి
దానవ కామినిగొట్టి
పూనిముఖము నిర్వహింపవా!! ఓ రామచంద్రా!!
మౌనివరులు సన్నుతింపగా
రాతి నాతిఁజేసి పురా
రాతి చేతివిల్లు విఱిచి
భూతలేంద్రు పెల్లమెచ్చగా
సీతను వివాహమాడవా!! ఓ రామచంద్రా!!" *

భరత వాక్యమునుగూడ లయాత్మికతో గూడిన సీద్విపదలలోమలచి కందుకూరి రుద్రకవి తనకావ్యమిట్లు మంగళాంతము గావించినాడు.

"మనుజేశ్వరుఁడు బోయె మూల్యవంతకదమునకు
కినతనూభవుఁడు కిష్కింధకేతెంచె
తారాసమేతుడై తరుణీకృతోప
బాఁడ్రై వేడ్కలు సలుపుచునుండె"**

మొత్తముమీద ఈసుగ్రీవవిజయ యక్షగానమున కందుకూరి రుద్రకవి లయకెక్కువ ప్రాధాన్యమిచ్చి ఛందోరీతికే అందమును విసూత్నరీతిలో సంతరించినాడు

ఈకవిదే నిరంకుశోపాఖ్యానమను గ్రంథమింకొకటి యున్నది. ఇందు నిగమశర్మవలె బ్రతికిచెడిన నిరంకుశునకు తండ్రిచేయించిన విద్యాభ్యాసమున సంగీతాభ్యాసముకూడ నున్నదిట్లు,

"చదివించెన్ త్రయీవాచ్యముల్ గఱపెశాస్త్రముల్ పఠింపించెన్
.... ... గానక్రియా విదునింగా నొనరించెన్"***

---

* సు. వి. 41 - 2
** సు. వి పు. - 43
*** ని. ఉ. పా. i - 94

ఇక నిరంకుశుని యౌవనప్రాదుర్భావవర్ణనలో నృత్తరీతియే యిట్లు సొబగు మీఱినది.

"బాల్యసంపూర్ణ భావంబుపాయఁబాయ
దయిణ యౌవన లక్ష్మినర్తనముసూపె
బిత్తరము జూపు పాతరకత్తెవోలె"*

అట్లే నారదుని స్వరూప స్వభావావిష్కృతిలో ఆతనితోపాటు ఆతని మహతీధ్వానమిట్లు

"ఆనంద జలధి ఘూర్ణిలు మాడ్కి మాయతా
హాతచేత మహతి మ్రోయుచుగగా"** వర్ణితమై వాద్యరీతి ప్రతిధ్వనించినది.

ఇంకొకచో

నిపుణత దీపించు నృత్యవైఖరి చేత
పెంపానహించిన పెద్దటికము
సరస సంగీతసాహిత్య పరిచయమునఁ
బ్రాదు చెందిన బహుమాన పాటవము"

ఇంకొకచో పైశాచిక చేష్టలో గూడ సంగీతకమునకే స్థానము గల్పించినాడు కవి.

"సంగీతమాధురిఁజవిదేల్చు నొకవేళ"

ఇట్లు నిరంకుశోపాఖ్యానరచనను సాగించిన రుద్రకవి గానామృతాలముగ తదనుగత నాట్యాభినయమునకు సరిపోవునట్లు జనార్దనాష్టకమునుగూడ రచించినాడు. ఈతని రచనలలో లయవిన్యాస సంగీతశాస్త్రమునకు విగ్గుదేలిన న్యాసమై సొగుబ అమరినది.

---

* ని. ఉ. పా. ii - 8

** ని. ఉ. పా.

# తెనాలి కవుల తెలితేనియ పాట

తెనాలి రామలింగకవిగా ఉద్భటారాధ్యచరిత్రము రచించి తెనాలి రామకృష్ణుడై ఘటికాచలమహాత్మ్యం, పాండురంగమహాత్మ్యములను రచించిన ఈ కవి వరుడు సంగీతమున గొప్ప ప్రజ్ఞను చూపించలేదు. అలపోకగ, ప్రసక్తాను ప్రసక్తముగమాత్రమే కొంత సంగీతప్రస్తావన ఈతని కవనమున క్వాచిత్కముగ గోచరించును.

ఈతని వంశస్థులలోని రామభద్రకవి తన యిందుమతీ పరిణయమున సంగీతప్రజ్ఞను చూపించినాడు. ఈ వంశస్థుడేయగు తెనాలి అన్నయ్య కవి తన సుదక్షిణాపరిణయమున రామకృష్ణునివలె సంగీతవిషయమును చెప్పుకొనదగినంత ప్రజ్ఞను చూపించలేదు. ఈవంశమున ఒక్కకవియందైన సంగీతప్రజ్ఞ కన్పించుచున్నది గావున ఈవంశస్థులందరు సంగీతవిముఖులనిగాని, విరసులనిగాని చెప్పలేము.

ఉద్భటారాధ్య చరిత్రము : ఈ గ్రంథము 1925వ సంవత్సరముననే ముత్యాలవారిచే మాహిష్మతీ ముద్రణాశాలయందు ముద్రింపబడినది. ప్రతి బహు పురాతనమైనది కావున పదునెనిమిది పుటలు ఉత్పన్నములైనవి. మిగినప్రతియే లభించుచున్నది.

శాపవశమున రాక్షసత్వమునొందిన ఖేచరుల వర్ణించుపట్టున వారి దుర వస్థనుగని కవి సానుభూతి చూపించునెపమునవారు సంగీతమునకు దూరమైరనియే చెప్పి విచారించుట ఈతని సంగీతాభిరుచికి తార్కాణము.

> "అలకా చైత్రరథోద్యానస్థితమణి వ్యాకీర్ణ శేషీసగం
> బులు.... .... .... .... .... .... వే
> దులపై కూర్చుండి మీటారిగత్తెలగు నింతుల్వాడ మోదించు వా
> రలకా యీ దురవస్థదైవగతి దీర్పన్ శక్యమే...."*

* ఉ. చ. 1. 134. పు. 19

"వీణా నినాదంబు వీనుల నాలించు
పనిఖాత కహకహధ్వనుల మఱపి"*

"అల కైలాసమునందు హేమమయ కూటాగ్రస్థరత్న ని
ర్మల పీఠంబున నిల్చి పార్శ్వములఁ బ్రేమన్ వల్లభుల్ తోడుగాఁ
గల రాగంబుగ మేళవించి కడువేడ్కన్ సిద్ధకాంతామణుల్
శిలకెల్లన్ గరగంగఁబాడుదురు పరిశీలించి తత్కీర్తులన్"**

ద్వితీయాశ్వాసమున మదాలసుని వృత్తాంతమున వేశ్యాబాలికను వర్ణించు సందర్భమున ఆ సుందరి

చదివెన్ గమకళారహస్యములు శిక్షన్గాంచె వీణాదులన్
బదిలంబయ్యె సమస్త నాట్యకలనా పాండిత్యహేలన్ మదిన్"***

ఇట్లామె లలితకళావిలాసములు వివరించి ఒకనాడామె బాలేందుచూడుని గుడికేతెంచి.

ప్రీతిన్ కన్నులు మోడ్చుచున్ విలసన శ్రీయొప్పనాదేవుపై
గీతంబుల్ సొబగొందఁబాడె రసముల్.... తానంబులన్"****

"కల మృదు స్వరంబుగల కంజదళాక్షులగూడి పాడనక్కలికి పాటకు
శిలలు గరంగెఁదర్వులను జేకురు పల్లవలక్ష్మి"***** అని తద్గానాభినందనము గావించినాడు కవి.

అటుపిదప గ్రంథము జీర్ణమైనది. దొరికినంతమట్టుకు సంగీతప్రసక్తి ఈ గ్రంథమున ఇంతమాత్రమే.

ఘటికాచల మహాత్మ్యము : ఈ గ్రంథమున మానససరోవర వర్ణన సందర్భమున సంగీతప్రస్తావన గోచరించినది.

---

* ఉ. చ. i - 135
** ,, i - 172
*** ,, ii - 42
**** ,, ii - 151
***** ఉ. చ. ii - 153

"తేట పూఁబోడుల పాట ముత్తయిదువల్
పచరించు సోబాన పాటగాఁగ"*

ఇట సోభనమను దేశగానరీతి సోబానమని పరివర్తితమగుట గమనార్హము.

"ఘణిఘణిల్లని పాదకటక నిక్వణముల్
ప్రతుల ధైర్యములో కాలోకలొనర్ప"** అని లలిత రూపభాజనంబగు వారణానారీజనంబుల నడలలోని లయాత్మకత వర్ణితమైనది.

ఘటికాచల క్షేత్రముల అంబుజాక్షునకు కల్యాణమహోత్సవంబాచరించు సందర్భముననే ఏతెంచిన అవనీనాయకుల వైభవవర్ణనమున వారలకు

"చామరంబులు వీఁచు చామకరంబుల
హేమకంకణరనంబింపు గులుక
పటహ భేరీశంఖ పణవమర్దళ ముఖ్య
వాద్యధ్వనుల్ దిశాపలయ మ్రదువ"*** అట వాద్యరము చెలగిన దనినాడు.

"హోమపూర్వకముఁగ నుత్తుంగ గరుడకే
తన పటంములనెత్తి తాళమాన
విధియు దప్పకనుండ వివిధ వాద్యంబులు
మొరయఁజేయు తదవసరమునందు"****

ఇందిరాదేవి మంగళాష్టకముల మలపుసెలగ హరికి తలఁబ్రాలు ప్రోసినదట. ఇంతకుమించి వాద్యాదికముల ముచ్చటలైనను ఇకలేవు.

---

* ఘ. మా. i - 5

** ,, ii - 217

*** ,, iii - 59

**** ,, iii - 62

పాండురంగ మహాత్మ్యము : ప్రథమా శ్వాసాది మంగళాశాసన పద్యమున ఈకవి 'శ్రీ, కాంతామణి' అను రాగనామములను నిక్షేపించినాడు. ఇది అ ప్రయత్నసిద్ధమని అనుకొనుటకన్న అభిప్రేతార్థసంయుతమని అనుకొనుటమిన్న. కవి వల్లమాలినంతగ పాండురంగమాహాత్మ్య స్ఫోరకములగు వైష్ణవగాథల వర్ణించు సందర్భమునను ఈగ్రంథమున తదితరములగు గ్రంథములలోనున్న పాటదైన సంగీతప్రసక్తిని తడువలేదు. ఉన్నంతమట్టుకు నిగమశర్మ కథలోనే కొలదిగ సంగీతమును గూర్చిన ప్రస్తావనము ప్లవకన్యావర్ణనమున** ఆమె పంచత్వమునొందిన పిదప నిగమశర్మగావించిన పరిదేవనమున గోచరించినది.

ఈ ఆశ్వాసాంతమున కృతిపతి సంబుద్ధిలో ఆతనిని "సారసంగీతఘోషా!" అనినుతించుట గమనార్హము. ఇంతకుమించి సంగీతప్రసక్తియే యిందులేదు.

---

* "శ్రీకాంతామణిఁగనొ్మలంగి ధాత్రిన్ మించినన్ దక్షతి
శ్రీకాందని మీఁది కుబ్బెనన్ఁగ శ్రీవత్సముందాల్చి ము
ల్లో కంబుల్పొదలించు కృష్ణుడు దయాళుండేలు శ్రీవైష్ణవ
స్వీకారార్హు విరూరి పట్టణపతిన్ వేదాద్రి మంత్రీశ్వరున్"

** "కాఁపుంగెంటిగురాకుఁబోఁడి పరలోకంబంత ప్రాపింపుచున్
వ్యాళపాదంబున నాతఁడొండు గడ రూపాజీవరాజాననం
బాపించచ్చడుగుచ్చ పచ్చవి మదాంధన్ బంధురశ్రోణి వీ
ణా పాణింధమపాణి నొక్క ప్లవకన్యంగూడి క్రీడింపఁగన్
పాం. మా. iii - 88

"సన్నపు సిబ్బెముల్గలుగు చన్నులఁబయ్యెదకొంగ వాలఁగాఁ
గిన్నెర వీణమోపి శ్రుతిగీల్కొన సారెలు చక్కనొత్తియు
ద్యన్నఖర ప్రమాణములఁదంత్రులు మీటుచు నాలపించునీ
తిన్ననియెల్గు నాచెవులఁదేనియలొల్కుచవుల్ దలంచెదన్"
పాం. మా. iii - 64

## ఇందుమతీ పరిణయము - తెనాలి రామభద్రకవి

ఈతడు ప్రథమమైన మంగళాచరణపద్యమునందే శ్రీఘనరాగమని స్ఫురింప జేయుటలోనే సంగీతజ్ఞుడనుటకు ప్రబలతార్కాణము లభించుచున్నది.

శ్రీలలితాంగి వక్షమునఁజెన్నుగఁగెం ప్రేల తాళి లీలనౌ
వేళఁబొసంగ రంగలరు వేంకట భూమిధరానేత యా
నీలఘనాఘన ప్రతిమ నిర్మల దేహుఁడు శౌరినిత్యమున్
బాలచరీకులాబ్ధి హిమభామనిఁగృష్ణనృపాలుఁ బ్రోచుత"*

దేవతాస్తుతులలోగూడ ఏదోయొక సంగీతరీతియో, ప్రక్రియయో ప్రస్తావనగ ధ్వనింపజేసినాడు. రామభద్రకవి.

"ధవళతరస్మేర తరుణ ముఖాంభోజి
తారకాంచిత దృగ్వితానమౌ హరిణాక్షి
చంద్రికావరపింఛ సదృశమోహన వేణి
సర్వమంగళ మంగళాచరణ మహిత"** యని. ఇందు ధవళము, మంగళాచారగీతములనునవి ప్రబంధప్రక్రియలు. కాంభోజి, చంద్రిక, మోహన రాగముల ప్రసక్తి వినవచ్చినది. అట్లే సరస్వతీస్తుతిలో ఆమె

"అవని నాదబ్రహ్మమౌ తానే తనర్చుట్లు
వీణియఁ బల్కించు జాణయనగ
రస భావభావుక రసనాగ్రమందిప
స్థలిలపైనాడు నర్తకియనఁగ"*** మెఱయునట.

ఇందులో గీతవాద్యనృత్యత్రయిఅయి సంగీతకము సరస్వతీస్వరూపమున మెరసిన్నది.

---

* ఇం. వ. i. - 1
** ,, i. - 4
*** ,,

కవియేకాక పాలచూరి కృష్ణధాత్రీవిభుండుకూడ సంగీతాభిమానియైనట్లు ఆతని కొలువులో హృదయానంద సంధాయక బృందమున్నదనుటలోను వీణా వాదన ప్రవీణతా తృణీకృత వాణికులగు వైణికులున్నారనుటలోనే తేటతెల్లమగు చున్నది. కృతికర్తకు కృతిభర్తకుకూడ సంగీతము హృదయానందకరమే అయినది. ఇది కేవలము ఊహాగానముగ త్రోసికటానికి మూదలగనొక పద్యమున సుట్టకించినాడు.

"....    ....    ....    ....    ....    ....
....    ....    ....    ...    ....    ....

గాయకాఖిల కవినాయకాప్త సుధీని
కాయకాంక్షిత ప్రదాయకుఁడు

నసినమాన్య ప్రభాంసదవన రాజి
గేళహీ శంఖమర్దళ కాహళీద్ధ
రవ హరిద్దంతి నిభగజ నివహహయుఁడు
విష్ణునిభవుండు పాల్చూరి కృష్ణవిభుఁడు"*

ఇక శాలిగోప్యోషముల గాలిపాటలలోగూడ రాయములను ప్రవకల్పించిన దిట్ట ఈతడు.

"తాయిన్ పాటలవాడ నన్యకలకంఠ క్రాంతిచేఁగోయిలల్
డాయల్బూని యదల్ప హస్తములు లీలన్ జూచుచోఁబల్లవ
శ్రీయంచున్ గడుఁజేరఁజెంత,దలుచై చెల్వొందు చెంగల్వలన్
ప్రేయంబూయవి ముగ్ధభావమున వావిన్ శాలిగోవ్యోషముల్"**

ఇక కథలోపడిన పిదపకూడ అజమహారాజు వెడలిన స్వయంవర ప్రస్తావనలో కవి సంగీతసాహిత్యములరెంటేని ఒక్కచోటనే రచించినాడు.

---

* ఇం. వ. i - 61

** ,, i - 110

"భాసురామ్నాయ విద్యాసురాశీర్వాద
వారముల్ బిరుదుకై వారములను
శోభన గాయక స్తోమ నవీన స
ద్గేయముల్ స్తుతి వాఙ్నికాయములను
భేరికా మర్దళ ఘూరికాహళ్యాది
వాద్యములనవద్య పద్యములను"*

ఆ పిదప ఘూనాయకుడు వృషవన్నామక గిరిని కనుగొన్నాడట. అద్దాని వర్ణనమునగూడ సంగీతమునకు స్థానమిట్లు లభించినది.

"పొదలు కిన్నర వధూమృదుగాన సరణిలో
మధుపాంగనల పాట మాటుమలయు
.... .... .... .... అప్సరసల

రసలలిత తతమణితభరము గముల
గలసి విలసిల్లు శుకపిక కలకలముల
కలవరములను శ్రుతిసుఖగరిమ వినుచు
ధరణి ధరమౌళి యాయద్రితట వనాళి"**

"అతుల వనమాలికా సం
యుత ముఖ్యతటీనటన్మయూర కలాపాం
కితము నవవేణూ నాదాం
చితమిగ్గిరి కృష్ణమూర్తి జెలఁగెడు గంటే"*** అని అనుకొనినాడట. అంతేకాక ఆగిరి మహాత్మ్యభినందకముగాగూడ సంగీతకమే యిట్లు జాలువారినది.

గంధర్వ గానసంగతులకు ననిలపూ
రితకీచకములు శ్రుతులు గూర్ప
దివ్యలోక మృదంగ ధింధిమిధ్వనికిబం
ధురవిర్ఝర ధ్వనుల్ తోడుసూప

* ఇం. వ. ii - 87
** ,, ii - 100
*** ,, iii - 130

నటదప్సరోజన నయనావళికి దృష్టి
పాత్రములై శిఖిప్రతతులొలయ
బంధుర గీతప్రబంధ సద్భావంబు
ననిలకంపిత శాఖాలభిఁ యింప

స్నిగ్ధ శశికాంతమణి కాంత శిఖరసీమ
రచ్చ సేయుచుఁజూచు సురప్రభులకు
నాట్యసాహాయ సామగ్రి ననువుకొల్పు
నరవరోత్తమ యీధరాధర వరంబు"*

ఈకవి వతంసునకు నాయిక ఏడ్పులోగూడ కలకంఠీ రాగవిన్యాసమే ఒక్కచో నిటుల వినిపించినదట.

"ఆలావణ్యవతీ వతంసము మనోజాభీల వహ్నిజ్వల
జ్వాలా జ్వాలముమెచ్చ నేడ్చెఁగను ప్రేకల్‌దొట్టి బాష్పాంబువుల్
డాలింగు బ్జఁబొర్లి పారఁగలకంఠ శ్రీకలారావ వీ
జాలోల స్వరమాధురీరసము శ్రవ్యంబై విరాజిల్లగన్"**

తుమ్మెదరొద సహింపలేక విరహాసహయైన నాయిక ఉపాలంభించుటలో కూడ గీతికయే యిట్లు చోటుచేసికొన్నది.

"నెమ్మిప్రియమూడ రానఁ
ఝుమ్మను రావమున గీతచాతురి మెరయన్
గొమ్మలిపుడడ్డగిర్గమత
తమ్మెదని గేలిసేయ దోసముగాదే"***

---

* ఇం. వ. iii - 132
** ,, iii - 136
*** ,, iii - 137

నాయిక వలపు వందులిరులిటులుండగ అటనాయకుని తలపు తందనాలును కొంతగ గానమయములే అయినవి.

"ఆత్మహుంకారమునఁదేఁటి ఝుంకార. మొనరింప బ్రమయుఁగోకిల వాణి పాటలనుచు"* నిటుల మెచ్చనూర్చినాడట నాయకుడు. ఇట్లు రాగనామముగ అనురాగరీతిని వెలార్చుటయందీ రామభద్రకవి దిట్టయనుటకు ఈతనిప్రబంధమున ప్రస్తావనలు మఱికొన్నియున్నవి.

ఈతడు పెండ్లిలో తలయంటుట పెండ్లికి తరలివచ్చుట మున్నగు ముచ్చటలలోకూడ రాగతాళరీతిని వాద్యసహకృతిని వినినాడు.

"జడవిప్పి తావి. నూనియఁ
దడఁబడ హారములో త్తవెౌఁదలయంటెన్
గడగడ వడక వలగ్నము
కడియమ్ముల రవము తాళగతులకు మెరయన్"**

ఇందు పెండ్లికొడుకునకు తలయంటిన ముచ్చటలో కడియముల రవము వాద్యసహకృతి నినదించి తాళగతులకు మొరయుట గమనార్హము.

"అజుడు సురేంద్ర గౌరవంబు....
దాల్చి గంభీర భేరీమృదంగ శంఖ
వేణు వీణాదిరవములు వేడ్కసేయఁ
బ్రకటతరవంది బృందపావశ్యమాన
విజ జయోన్నిద్ర బిరుదాంక నికరమడల"***

ఇట పెండ్లికి తరలినపుడు. అజుడుదాల్చిన సురేంద్రగౌరవము అతివేడ్క సేసిన భేరీమృదంగ శంఖ వేణువీణాదిరవములతో గమ్యమానమైనది.

---

* ఇం. వ. iii - 140

** ,, iv - 180

*** ,, iv - 109

"కాకల్యంచిత కోకిలారవముఖోకస్ వీఁకలస్మితి వీ
ణా కంఠుల్ మునుమున్నుగ వరుస వెంటంబాడ ప్రవీణావతుల్
గాకల్‌దీరెడి బెళ్కు చూపుగమినంతమర్యి కోధింప గౌ
రీ కల్యాణ పుఁబాటఁబాడిరి ధరిత్రీలేఖ రేఖావతుల్"*

ఇందు గౌరీకల్యాణమును గౌరీరాగమున పాడిరనియును, కాకలోయినచ్చో కాకలీస్వరాంచితముగ కోకిలారవ రాగమున పాడిరనికూడ ఊహించుట కవకాశమున్నది.

ఇట్టి వేడుకలు ఘటిల భోజునితో రఘువు వియ్యమందుట ఇతర రాజకులమునకు కన్నెఱ్ఱయై కయ్యమునకు కాలుద్రువ్వేరి. వియ్యముతోపాటు కయ్యముసుగూడ నిర్వహించికొనిన పిదప అజుడు ఇందుమతితో బయలుదేరి తమ రాజధాని చేరినాడు. అటు పురజనులు, ఇటు రాజబంధువులు గీతిసాహితుల జంటపోలె ఎదురుకోలు దీర్చినారు. అందు సాహితితోపాటు సంగీతకముకూడ ఇట్లు వినవచ్చినది.

"బిరుదులును ఛత్రచామర బృందములును
బాణవిద్యలు నాట్యముల్ పాఠకాళి
గద్యపద్య స్తవంబులు గానములును
సానికూతులగని పురస్థలిని దనర"**

*"శ్రవణానందన రీతినగ్రసరణిన్ సంగీతమేళంబుతో
గవగఁబోటులు పాఠకుల్ధవళముల్ కాంభోజీరాగమునన్
**పూదండల్** పైపైచుచుం జదువగుంపుల్ గాఁజులన్ గొల్చిరా
చివురుంబోఁడుల మిన్న యిందుమతి వచ్చెఁబచ్చతావల్లకిన్"

ఈ పద్యమున అత్తింటి గృహప్రవేశమునకు తరలివచ్చుటకు పెండ్లికూతుప దుఃఖించుటతోపాటు సంగీతకరీతులలో విస్మృతమైపోవుచున్న ధవళ

---

* ఇం. ప. iv - 128

** ,, iv - 197

మను ప్రక్రియ ఇట రాగాన్వితమై కాంతిల్లినది. ధవళములు, శోభనములు మున్నగు జానపద గేయరీతుల ప్రసక్తులు అటనట ప్రబంధములలో గోచరించును. కాని వానిని ఏరాగమున ఎట్లు చదివెడివారో యథాతథముగ వినిపించిన కవి ఈ రామభద్రుడగుట సవిశేషము. ఈ తెనాలి కవీంద్రుడిట ధవళము కాంభోజీరాగమున పాడెడివారనితెల్పి ఆప్రక్రియకు జీవముపోసి వెదికి తెచ్చిన ట్టివాడైనాడు.

మొత్తము మీద 'ఇందుమతీ పరిణయము' సాహిత్యావాప్తికేగాక సంగీత ప్రాప్తికికూడ నోచుకొనినదై అలరారుచు సంగీతస్థానమే తెనాలిగడ్డపై సంగీత ధ్వానమును ఆనాడే దశదిశలకు ప్రతిధ్వనించినదనుట దబ్బరకాదు.

---

* ఇం. ప. iv. 14

# తెనాలి అన్నయ్య సుదక్షిణాపరిణయము

ఇందు ప్రథమమున వాణిస్తుతిలో కిన్నర వాద్యప్రసక్తి ఇట్లున్నది!

"ఉదురు గుబ్బలమీదిగదియించి సరకట్ల
కిన్నెర పలికించు కిసలయోష్ఠి"*

ద్వితీయాశ్వాసమున దిలీపపట్టాభిషేక సంరంభమున—

"ఎట నాలకించిన హిమశైల కన్యకా
కమనీయ కల్యాణ గానరవము
ఎచ్చోటఁదెలిసిన హృద్యవాద్య
గంభీర నిర్ఘోష కలకలంబు
లెచటనిలచిన గాయక ప్రచుర విచల
దచల వీణా సముత్కర్ష హర్షవేళ"** అని సంగీతమునకు ముచితస్థాన మొసగినాడు.

మఱల చతుర్థాశ్వాసమున ఒకయింతి తనను గూర్చి తాను పరిచయము చేసి ను సందర్భమున నిట్లనినది.

"నేర్తునొక కొంత గానవిద్య"*** అనుచు ఆమె గానవిద్య ప్రదర్శనా నములగూర్చి ప్రసంగించినది.

"వాణీసభ గౌరీసభ హరిరాణిసభన్ సంచరింతు రాజిత వీణా
క్వాణోల్లాస విలాస ధురీణ కళాకలిత మాధురీ సాధురీతిన్"****

ఆ రోజులలో మానవులేకాక చదువగఁబాడగ నేర్చిన రామచిలుకలుండెడివని వి యనినాడు.*****

మామూలు మాటలతో అభిమానముతో సంగీతముగూర్చి ప్రస్తావించుటయేతప్ప ఈకవి సంగీతశాస్త్ర ప్రజ్ఞయున్నట్లనిపించదు.

---

* ఇ. వ. i - 5
** ఇం. వ. ii - 117
*** ఇం. వ.
**** ఇం. వ. iv - 64, 65. పు 67
***** ఇం. వ. iv - 10

## అద్దంకి గంగాధరుని కవితలో అందగించిన గానరిరంస

ఈ గంగాధర కవి తపతీసంవరణ ప్రబంధమును రచించి మల్కిభ రాముడను మహమ్మదీయ ప్రభువునకు అంకితమిచ్చెను. కృతిభర్త మహమ్మదీయుడైనను హైందవసంస్కృతిని అందున ఆంధ్రసాహితిని ఆదరించి గీతిరీతిని ఆరాధించినవాడుగుటకు ప్రథమాశ్వాసాంతమందలి పద్యమొకటి ప్రబలతార్కాణమై భాసించుచున్నది.

"శృంగారవతీ మన్మథ
సంగీత రసైకలోల సాహిత్యకళా
రంగస్థల జిహ్వారణ
రంగస్థలనిహత శత్రురాడ్గజసింహ"*

ఆతడేగాక ఆతని అంతఃపురముకూడ సంగీతరసికతా సంపన్నమని ఈ క్రింది పద్యము వ్యక్తము గావించుచున్నది.

"కాళాంజి ధరియించెఁగాళింగ పుత్రిక
యడపంబుఁదాల్చెవంగాన తాంగి
వీజనంబులు వీచె భోజేంద్రనందన
పసిఁడి పావలు వట్టెబాంఢ్యతనయ
కేరళేంద్ర కుమారి గిండికేల ధరించెఁ
గేకయతనయ ............
".... .... .... .... ..... ....
.... .... .... .... .... ....

వాంధ్ర కామిని వీణియనాలపించె
గానమొనరిచె కర్ణాట కమలగంధి
సాంద్రవిభవంబుతోడ దేవేంద్రుఁడనఁగ
వరసుదైయున్న మలకేంద్రు సమ్ముఖమున"**

---

* త. సం. 1 - 99

** ,, 1 - 13

ఇవికాక రాగనామములను నిక్షేపించి మఱియొక పద్యమును ఇభరామ ప్రభువుని ఇల్లాండ్రను సూచించి ఆతని సంగీతరసికతను ఇట్లాలపించినాడు.

"కాంభోజ రాజన్య కన్యకా రత్నంబు
చేరె వీక్షింపు చిత్తేశ దేవ
కుంతల నీలాళికుంతల కొలువున
కరుదెంచెనిప్పుడే మరకుమయ్య
ఘూర్జర మదవతీ కులతిలకంబిదె
ప్రణమిల్లెఁదొడగె వరాకుస్వామి"*

ఇందలి కాంభోజ, రత్న, కుంతల, ఘూర్జరి, తిలకములను పలుకుబడులు రాగనామములు. వీనిని కవి అభిప్రేరితార్థ సమ్మతముగనే ఇట నిక్షేపించినాడనుట నిర్వివాదము.** ఇంతటి సంగీతసహృదయుడు కృతిభర్త యగుటవలననే కవి సంగీతధీవిభవమును ఎత్తుగడనుండి చూపించు శ్రీరాగనామమును మంగళాచరణ పద్యాదిలో నిక్షేపించి అది ఘనరాగమగుట సూచించినాడు.

కవి తాను సంగీతజ్ఞుఁడనని ఆసంగతి కృతిభర్త ఎఱుగునని వ్యంగ్య రీతిలో మనకిట్లు సంసూచించినాడు.

---

* త. సం. i - 12

** "శ్రీసతి మించుగాఁగఁదులసీ దళమాలిక కౌస్తుభోజ్జ్వలం
బై సురచాపలీలఁ జెలువందఁగ నీలపయోదవర్ణ గర్జితం
బై సొబగొంద శౌరిమనుజై కరుణారస వృష్టిచే విలా
యాసతఁ ద్రోచు గావుత నృపాగ్రణి మల్కిభరాము శాశ్వతున్"

శ్రీరాగము శుభప్రదమైన సంపదుద్దామమై చెలువొందుతీరు ఉట్టంకితమైనది. అంతియేకాక ఈ శ్రీరాగము విష్ణుప్రీతికరమగు ధార్మిక్యగుణ శాస్త్రీయమతని నుతింపబడుటనుబట్టి ఈ రాగము ఘనపంచక రాగములందొక్కటియగుట సంసూచితమగుచున్నది యిందు.

"గంగాధర సు కవీంద్రయ
భంగుర భవదీయ వాక్యపద గుంభనముల్
గంగాధర మౌళినట
ద్గంగాతటినీతరంగ గంభీరంబుల్"*

ఇక కథారంభముగావించిన పిదపసంవరుణుని గుణౌద్ధత్యము తెలుపుటకు గూడ సంగీతమునే సాధనముగాగైకొనుటలో ఈతడు సంగీత సరసహృదయుడని చెప్పక చెప్పినట్లై కాళిదాసుని రఘుగుణ గానముజ్ఞప్తి కెలయించి ఇక్షుచ్ఛాయా నిషాదిన్యః అను రఘువంశ శ్లోకమిట ఆలపింపబడినట్లైనది.

"శాలివసంబులందిరుగు శాలికలన్ రొద జేసిరొప్పుచున్
జేలఁబడింజరించి నను జేలచెరంగున నానన శ్రీయాం
భోలవముల హరించుచు నృపుంగవు నాతనిఁబాడు చుందురా
బాలవయః కథానుగుణపద్ధతిఁబామర కామినీ జనుల్"**

కవి యేదేవి ప్రస్తావింపవలసినప్పుడు దానివి కేవలము సాహితీపరము గానేకాక సంగీత సహకృతితోడ నెడనెడగావించుట ఈ కావ్యమునందు గానో నగును. తపతీదేవి పెంపుడు రాచిలుక సంవరుణుని దరిజేరినపుడు అద్దానివి గాంచిన సంవరుణుని భావనలో సంగీతరీతికూడ ఇట్లు చోటు చేసికొనినది.

"కలిగెఁటో మనకేళి కనకపంజరిశారి
కలనెల్లఁజరివింపఁగడుఁగునాజ్ఞ
.... .... .... .... ....
.... .... .... .... ....
చేరెఁటో మత్సభోది విలుక చేడియలకు
[illegible] నేర్పు దాయకుండు
"[illegible] గృహాంతర మయూరములకు
నాట్యంబు శిక్షించు నటవిభుండు"***

---

* [illegible] వం. [illegible] 16
** [illegible] 76
*** ,, ii - 5

అట్టిదే తృతీయాశ్వాసమునందలి అంధకారవర్ణన. ఇందు నాట్యముగూడ చోటుచేసికొనుట యొకవిశేషము.

"చటుల తాండవనటన్నిటల నేత్రునియందె
పలుకుల గతిమించెఁ బక్షిరవము.
భ్రమణలాస్య వికీర్ణభవజటా పటలంబు
తతి సంజకెంజాయ గానుపించె
నుత్థాన సమయ సముద్యదీశ్వర గాంగ
జలకణచ్ఛాయఁజుక్కలు చెలంగె
నట నవేశోద్దీర్ణపటు గర్భనేత్రాగ్ని
కణములోయన దీపకళిక లెసగె

గహకహారాగ భిన్నదిక్తటము గాఁగ
నట్టహాసంబుతో నాట్యమాడు హరుని
కంఠకాకోల రుచులపై గప్పినట్లు
బెట్టిదంబుగఁజీఁకటి పిక్కటిల్లె"*

ఇక వసంతర్తు వర్ణనమున కవి తన రాగవివేకాన్విత మహత్త్వమిట్లు ప్రవ్యక్తము గావించుకొనినాడు. ఇట "శిశిరస్య వసంతస్య :సంధౌ హిందోళ రాగక"మ్మను ఆభాణకము పద్యభావము నందిమిడి పోయినది.

"కేళివనాంతరాళమునఁ గేసరనూనప్మరన్మరందముల్
గ్రోలి విటీవిటుల్ శిశిరకుంజములందు వసంతవేళకున్
బాళెమెఱిలగి కిన్నెరత (కిన్నరులు) బంగరు వీణె మేళవించి హిం
దోళమొనర్చి పాడిరి మనోభవు దిగ్విజయాంక గీతముల్"**

ఒకవచనమున కవి కొన్నిరాగములను స్మృట్టంకించి హృదయము రాగమయమైయున్నపుడు మాటలుగూడ రాగభావిప్లావితములై వ్యక్తమగుటను భంగ్యంతరముగ ఇట్లు ప్రవ్యక్తమొనరించినాడు.

* త. సం. iii - 18

** ,, iv - 18

"అయ్యవసరంబున రసాలకిసలయ గ్రసనోత్కంఠ కషాయ కంఠ కలకంఠికాకుంఠ కుహూకార కుహూకాకలీ కోలాహలధ్వాన బధిరిత పథిక జన సహస్రంబులగు వసంత ఘస్రంబులేతెంచిన మలయమారుత వ్యాజంబున వన దేవతలు వసంతంబులాడఁదలంచి వెదజల్లిన తత్ప్రీతికారంబుగ మకరంద రసంబులు చిందుచు సరవిరి నెత్తపునెత్తమ్మి చిమ్మంగ్రోవింబూఁదేనె సోనలు చిమ్మఁదలంచిన"

ఇందు రాగనామములగు కలకంఠ, కోలాహల, వసంత, మలయ మారుతములు గమనార్హములు. చిమ్మంగ్రోవితో పూఁదేనెసోనలు విరజిమ్ము టీపులో రాగరస భావన ప్లావితమగుతీరునుగూడ గమనింపవచ్చును.

ఇక శబ్దాలంకారములలో స్వరాలంకారముల విశేషించురీతి నన్నెచోడ పోతనార్యులనుండి ఉన్నదియే. అదియును గంగాధరుడు తనకవనమున తప్పి పోనీయలేదు.

"హరి నీలములచాలు నలజాలములడాలు
　　కడుదేలునడఁగప్పు బడఁతి కొప్పు
పగడంబుల మెరుంగు జిగికెంపుల హొరంగు
　　గెలువంబరగుకేవి చెలువమోవి
....　....　....　....　....
　　....　....　....　....　....
చిలుక పలుకుల నమృతంబు చిలుకుఁబలుకు
మరలు తలపులు మరువు మరులుకొలుపు
చరివేలుఁగు కళలను మాపు చెలదిరూపు
కుసుమగంధివాసవలవీను బొలఁతిమేను"*

కొన్నిచోట్ల గంగాధర కృతి విశేషణమును సంగీతశాస్త్రవిహితరీతితో గావించి మహత్త్వానుభావమగునట్లు ఈరీతిగా సమర్థించును.

* త. సం. iv - 56

"భాస్వరంబైన మదకోకిల స్వరంబు
పంచమంబని పెద్దలు వల్కువిందు
నీమధురభాషిణీ మధ్యసీమదెల్ల
మధ్యమంబౌట యాశ్చర్యమహిమయెపుడు"**

మఱికొన్ని చోటుల గంగాధరకవి సంగీతకమందలి దేశ్యగానరీతినిగూడ పట్టంకించినాడు.

"గౌరీ కల్యాణంబట
నారీమణువెల్లఁబాడ నవ పుణ్యకళా
పారీణుండైన వశిష్ఠుం
దూరీకృత నియతిధారవోసెన్ దపతిన్.

ఈ అద్దంకి గంగాధర కవి వసుచరిత్రకారునకు ప్రాచీనుడనుచున్నారు గావున గీతిసరస్వతి తెరవెడలకముందు కైసేసికొనిన తీరు ఇట కవి నిర్వ చించిన నేపథ్యపుసౌరులో గోచరించుచు సంగీతసంప్రదాయ ప్రకటనాపూర్వక నాట్యాతిశయ ప్రదర్శనమునకు ఇది పూర్వరంగమై భాసించుచున్నదనుట అతిశయోక్తి కానేరదు.

---

* త. స. iv, 61

# రాగరస సార్వభౌమ యుగము రామరాజ భూషణకృత గీతికాశ్రేణి

మోహనాంగి నర్తనపుటందియల్ ఘల్లు
        ఘల్లుమనగ ధారుణి ఢిగ్గురనినట్లు
కల్యాణిక్రమ వీణానుగత గానమ్మున దశ
        దిశల్ పరవశించి ప్రతిధ్వనించినట్లు
గిరికాహృదయ కందరమ్ము వనుమయమ్మై
        కమలాలయమ్ముగా రూపొందినట్లు
విలసిల్లిన రామనృపభూషణయుగ రాగరస
        మంజు వాణి నీకు నానమన్సు

# రామరాజ భూషణయుగానువర్తులగు
# మహాకవుల సంగీతప్రతిపత్తి

1. రామరాజభూషణుని సంగీత కళారహస్య నిధిత్వము.
2. చంద్రికా పరిణయగానరిరంస.
3. చరికొండ ధర్మన్న సంగీతాభిజ్ఞత.
4. తరిగొప్పుల మల్లనార్యుని ఒప్పారిన వీణాసాధన.
5. పింగళి సూరనార్యుని కళాప్రపూర్ణత్వము.
6. ఎడపాటి ఎల్లనార్యుని నృత్యసంగీత భావన.
7. దామెర్ల వేంగళభూపాలుని తౌర్యత్రికప్రజ్ఞ.
8. మట్ల అనంతభూపాలుని సంగీతపరిచితి.
9. కాచవిభుని మల్లారెడ్డి సంగీతరీతి.
10. ప్రౌఢకవి మల్లన సుదృఢ గానసాధన.
11. బాణాల శంభుదాసుని సారంగ కావ్యరాగవైచిత్రి.
12. అప్పప్పకవి, బొడ్డుచర్లతమ్మయ్య, ఘట్టుప్రభువుల సంగీతాభిమానము
13. సారంగ తమ్మయామాత్యుని వైజయంతీ గానము.
14. చదులవాడ మల్లయ గానాభిమానము.
15. అయ్యలరాజు నారాయణామాత్యుని తౌర్యత్రికప్రీతి.

## రామరాజ భూషణుని సంగీత కళారహస్యనిధిత్వము

శ్రీనాథకవిసార్వభౌముడు స్థాపించిన ప్రాజ్యగాన సామ్రాజ్యమహనీయ స్థితికి రాయమార్తాండుడు మూలమై నిలచినాడు. అపుడు ఆంధ్రకవితా పితామహుండు అద్దానినిప్రోవ తదాస్థానస్థ కవిప్రముఖులాయౌన్నత్యమును వెలయింప ఆగీతిసాహితీ సామ్రాజ్యము తెలుగునాట విస్తరిల్లినది. కాని విధివశమున నారాయణభాస్కరుడస్తమించిన పిదప ఆప్రాజ్య గానసామ్రాజ్యమున చీకటులలముకొన్నవి. అట్టియెడ గీతిసాహితీ రహస్యకళానిధియై తేజరిల్లి రామరాజభూషణకవి చంద్రుడాయంధకారముల తొలగించి వెన్నెలలు కురిపించినాడు. అమ్మహాగాయక కవిచంద్రోదయ ప్రముదిత స్వాంతముతో సంగీతార్ణవము ఉప్పొంగినది. సాహిత్యాంబరము జ్యోత్స్నావికాసముతో తేజరిల్లినది. అట్టియెడ,

> "....శ్రీరామ పదారవింద భజనానందున్ జగత్ప్రీణనం
> దనకారుణ్య కటాక్షలబ్ధ కవితాధారా సుధారాశి సం
> జనితైకైనదిన ప్రబంధ ఘటికాసద్యశ్కృత గ్రంథక
> ల్పను సంగీతకళారహస్య నిధి"* యైన

రామనృపభూషణ కవీంద్రుని బిల్వంబంచి వసుచరిత్రమును రచింపుమని అభ్యర్థించి కర్ణాటరాజ్యపునరుజ్జీవకుడగు తిరుమలయశౌరిశ్రీనాథప్రోక్త కర్ణాటకవన గానరీతికిగూడ పునర్వ్యవస్థాపనము గావించినాడు.

సాహితీవిదులచే మహోత్కృష్ట ప్రౌఢప్రబంధమని ప్రశంసింపబడునీ వసుచరిత్రము గీతికోవిదులచే రాగకావ్యముగ కొనియాడబడుచున్నది. ఇందలి ప్రతిపద్యము రాగరసనిష్యందియగుటి విశేషము అయ్యాదినాన్యతో దర్శనీయము. ఇందలి ధారాశుద్ధి శ్రుతిలయాన్వితము. ఇతివృత్తము సంగీతరసోపపన్నము ఈకవి కోలాహలుడు తనకావ్యకన్యకు గానరసమును రంగరించిన తెలితేనెలుగ్గులిడి గీతిసాహితీ విజయాంక గేయసుధారసమున నలరించినాడు. తన కావ్యసుందరిని

---

* వ చ. i - 16. ఇట ప్రబంధమునకు సాహితీపరమైన అర్థమేకాక సంగీత ప్రక్రియాన్వితార్థముకూడ గమ్యమానము.

గేయవిశారదనుచేసి కిన్నరమీట వీణవలికింపగ గీతములు ప్రబంధములు వన్నియు పాడచెప్ప అని వారితచాతురి గలుగెనట్లుగ విద్దెలుమప్పి పెద్దదానిని గావించినాడు. అంతేకాదు.

"వీణావాదనవేళలన్ ఘుమఘుమావిర్భూతి నింపన్ జగ
త్ప్రాణాచంచల తైలశూన్య నవదీపశ్రేణి కాపాదియై
రాణింపన్ ముఖలక్ష్మికన్ ముకురమై రంజిల్ల"* తనలేబట్టికై ఒక మాణిక్యాయతనమును స్వీయకవన గానసామ్రాజ్యమున నిర్మించియిచ్చినాడు. నాటి నుండి నేటివఱకు ఆకావ్యకన్యక గానమోహినియై వాద్యసుందరియై వసుచరిత్రాంతరిత ప్రాజ్యమాణిక్య భవనరాజోపరితలమున నిలిచి తరతరాల సంగీతరసజ్ఞులను యుగయుగాల సాహిత్యాభిజ్ఞులను అలంచుచునేయున్నది.

## సంగీత కళారహస్య నివేదనాత్మక రచనాప్రణాళిక :

ఇట్టి గీతిసాహితీ సముచితభవ్యగుణోపేతమగు వసుచరిత్రా మహాప్రబంధ నిర్మాణ ధురంధరుడైన రామరాజభూషణ కవీంద్రుడు కవనకళా రహస్యనిధియే గాక ప్రత్యేకించి తాను సంగీతకళారహస్యనిధినని అవతారికాంతంతముగ స్వీయాత్మానుభవసంవేదము గావించుకొనినాడు. ఇద్దాని సార్థక్యానుశీలనమే ఇమ్మహాకవి సంగీతప్రతిపత్తి నవగాహనము చేసికొనుట.

ఈతని అనన్య సంగీతశాస్త్రపాండితీ ప్రకర్షణ వరమావిధిగ దర్శనీయమగు ప్రథమ పరిశోధనావధి రాగవివేకము. రెండవది తచ్ఛాస్త్రాంతర్గత ప్రక్రియా పరిశీలనాత్మకమగు గీతప్రబంధాదికనామాదిక క్షేపణము. మూడవది సంగీతమాహాత్మ్యాభినందనము.

ఈ మహాకవివర్యుడు సంగీతకళావేదియై తేజరిల్లుచు రాగవివేకాన్విత రాగ నామ వ్యక్తి క్షేపణమును గోదారీతిలో ప్రబంధాంతరితముగ ప్రస్తావించిన తీరు ప్రథమముగ అనుశీలనార్హమగును. అద్దానిని గుర్తింపవలయుననిన ఈక్రింది

* వ. చ. iii. 83.

సహజసిద్ధమగు ద్వ్యర్థఘటనా చమత్కృతిని ఆద్యముగనవగతము గావించుకొన వలెను. ఈతని రాగనిక్షేపణము సామాన్యదృష్టికి సాహిత్యపరముగ, సన్నివేశ గతముగ ప్రస్తుతార్థమువలెనే గోచరించును. వనిగట్టుకొనియందలి సంగీతభావన నరయవలెనని రాగహృదయములో సూక్ష్మేక్షికతో దర్శించి తరింపవలెను. ఇందలి రాగనిక్షేపణాత్మక గూఢరీతి నెఱిగి నెమకిన సంగీతహృదయులకు సాహితీసరసాంతఃకరణులకు మాత్రమే. ఈ సంగీతపరమార్థము అప్రస్తుతార్థ సంయుతధ్వనియై మనోహరమగురీతిలో గోచరించును. రామరాజభూషణార్య కృతములగు ఈరాగ రహస్యచమత్కృతులన్నియు ఇట వివరించి ఈ పరి శోధనవ్యాసము అపారమగు గ్రంథవిస్తరమగునను భీతివలన, ఇద్దానినిముగించిన పిదప ఈకవీంద్రుని సంగీతరహస్యనిధిత్వమును ప్రత్యేక గ్రంథముగ వెలయింప వలెనను ఉద్దేశ్యముతోడను నేనిందుకొన్ని రాగరహస్యముల మాత్రమే సంవే దించుచున్నాను.

కాపురము చేయుతీరు కన్యాముఖావలోకన సన్నివేశముననే కాన్పించు నటుల అవతారికయందే మంగళాచరణమైన ఇమ్మహాగాయక కవివరుని సంగీత పాండితి పరిపూర్ణమైన రాగవివేకాన్వితస్వాంతము బహిర్గతమైనది. ఇట్టి దేవతా స్తుతులలో మొదటి రెండుపద్యములయందు ఈతని రాగవివేకము, తరువాతి రెండు పద్యములయందు సంగీతశాస్త్ర సాంకేతిక పదజాల ప్రక్షేపణ నైపుణ్యము వ్యక్తమగుచున్నది. తరువాతి పద్యములలో తద్గానామృత మాహాత్మ్యాభివంద నముతోపాటు మహాగాయకాభినందనతజ్ఞుల, పురస్కృతి, గాయకాధమకుట్టికారాదుల గూర్చిన తిరస్కృతి గోచరించును. తదనంతరములగు కృతిపతి వంశావళి లక్షణాత్మకములగు పద్యములకూడ కేవల మీయొక్క ప్రయోజనమునకే ఉద్దిష్టములు గాకుండునట్లు కవివరుండిందు కొన్ని ప్రబంధ నామాదికముల నిక్షేపించుట సవిశేషము. అనితర సాధ్యము.

ఈరీతిగా నీసంగీత కళారహస్యనిధిత్వమును, తన ప్రబంధ ప్రణాళికను అవతారికయందే నిక్షేపించి తనరచనా విధానమంతయు ఈతీరులోయుండునని తజ్ఞులకు ఎఱిగించినటుల దోచుచున్నది.

రాగవివేకము : భంగ్యంతరముగ, వ్యంగ్యరీతిలో అప్రకృతార్థసంయుతముగ వెలయించినను పెల్లడిఅయిన ఈతని రాగవివేకమునకు మూదలగ మంగళాచరణ గీతికయే నిలుచుచున్నది. ఈపద్యమున శ్రీరాగము రాగముద్రాలంకారోపస్థితినంది ధ్వనించుచున్నది. శ్రీరాగము శుభాస్పదము సంపత్కారకమగుటవలన కృతికర్తకు కృతిభర్తకుకూడ శ్రేయోప్రతిపాదకమై కావ్యాదిలో మంగళాచరణ సంయుతమై నిలుచనర్హతకు నోచుకొన్నది.

"శ్రీభూపుత్రి వివాహవేళ నిజమంజీరాగ్ర రత్నస్వలీ
లాభివ్యక్తివరాంఘ్రి రేణుభవకన్యాలీల యంచున్ మదిం
దా భావింప శుభక్రమాకలనచేఁదద్రత్నముంగప్ప సీ
తా భామావతి ప్రోవుతందిరుమలేంద్ర శ్రీమహారాయనిన్"*

నాట, గౌళ, వరాళి, ఆరభి, శ్రీరాగములతో గూర్చిన ఘనరాగపంచకమున శ్రీరాగము చివరిది. ఈ ఘనరాగస్తబకమున ఆద్యమగు నాటరాగము దృశ్యకావ్యప్రపంచమున తత్ప్రయోగమున నాందియై ధ్వనించిన చివరిదయైన శ్రీరాగము శ్రవ్యకావ్యజగత్తులో మంగళాచరణమున వినవచ్చుననుట నన్నపార్యువి కవనాంతరిత గానరీత్యనుశీలనమునందే వివృతము. రామరాజభూషణుడు తనకు సహజసిద్ధమైన ప్రకృతాప్రకృతశ్లేషాన్విత చమత్కృతితో శ్రీరాగస్వరూపము ఇట వెలయించినాడు. ఆద్యములగు పురుషరాగములలో శ్రీరాగమొకటియనుట ప్రాచీన సంగీతశాస్త్రకారులగు హనుమదాదుల మతమని సంగీతదర్పణమున పురుషరాగములగూర్చి రామరాజభూషణుడు ఈ పద్యమును

---

* వ. చ. 1 - 1
చూ.పా ఆం.క.సం.ప్ర.ప్రభా. 'నన్నయ' - పుట

** "భైరవో కైశికశ్చైవ హిందోళో దీపకస్తథా
శ్రీరాగో మేఘరాగశ్చ షడేతే పురుషాహ్వయాః"
"అష్టాదశాబ్దః స్మర చారుమూర్తిః - ధీరోల్ల సత్పల్లవకర్ణపూరః
షడ్జాది సేవోఽరుణవస్త్రధారి శ్రీరాగరాజః క్షితిపాలమూర్తిః"
సం ద. రాగాధ్యాయము - 243 - 245

అప్రకృతార్థ సంయుతముగ శ్రీరాగస్వరూప స్వభావావిష్కరణము గావించుట ముదావహమగు విషయము. కల్యాణవేళలో ప్రత్యక్షమైన సీతాభామావతిదగు ధీరోల్లాసమూర్తి అష్టావధాట్ట మాత్రమగు శ్రీరామరాజక్షితిపాలమూర్తికి సంవాది. ఇది సంపదుద్దామము శుభాస్పదము, ఇందు వర్ణితమైన కల్యాణశుభసమయ మద్దానికి అనువాడి. ఈపద్యమందు శ్రీరామచంద్రుని పరముగ ప్రయుక్తమైన స్వలీలాభివ్యక్తియను గుణవిశేషము షడ్రుషరాగమునకు సహజలక్షణమగుట స్వభావికము. ఇట్లు రామరాజభూషణ కవీంద్రుడు ఆద్యమగు మంగళాచరణ పద్యమున రాగధ్యానలక్షణమును పద్యాంతరితముగ ఆవిష్కరించిన తనఉపాస్య దైవము శ్రీరామచంద్రుని రూపమునద్దానికి సముపాదించి ఆ కల్యాణరాముని పతిత్పహృదయరంగమున ప్రతిష్ఠాపించి కృతకృత్యుడైనాడు.

ఈ రాగధ్యానములనునవి నాదోపసనా విషయికముగ అంతర్ముఖత్వము వహించిన ఋషితుల్యులగు గాయకమౌనులచే దర్శింపబడును. భగవద్ధ్యానాను సంధానమునుబోలిన అనంతస్మరణాత్మకమగు తానమును నిర్వహించుచునో రాగమును ఆలాపనము గావించుచునో లేక మంత్రభజపమువలె పల్లవి నను సంధించుచునో యుండినపుడు ఆరాగమూర్తివారి అంతర్దృష్టికి గోచరించినతీరు ఆరాగస్వరూప స్వభావిష్కృతిగ ధ్యానశ్లోకరూపముగ బహిర్గతమగును. అట్టి రాగధ్యానానుసంధానమును తన కవనవిధానమున మొట్టమొదటగా ఆవిష్కరించిన ఘనకీర్తి పెద్దనార్యునకు దక్కినది.* అన్నిట పెద్దనకు అనుమాయియై సంగీత సమారాధనమున వారసుడై నిలచిన రామరాజభూషణుడు ధ్యానానుసంధాన విషయమునగూడ గ్రహించి తన కవనమునందు పలుతావుల ఈరీతిని విశేషించినాడు. ఎత్రగీతికి మనోహరమగు మటియొక ఉదాహరణముగ నిలుచునది రెండవ పద్యమునదోచు జనకాబ్ధిసీమ నవతరించిన సిరియగు సీతాభామా స్వరూపా విష్కరణము.

సకల లోకాభివంద్యకలా కలాపంబు
దొరయు నెమ్మోము చందురునితోడ

* "వాలాయమ్గొనగోళ్లపేళ్ల ..." షట.

బహుదివ్యఫలపరిపాక సౌభాగ్యంబు
నెరపు కెమ్మోవి మానికముతోడ
నవయవశ్రీనిధానంబునై తగు నురో
భవ సుధా పూర్ణకుంభములతోడ
నమ్లాన సుమమాలికాభిరూప్యము దాల్చు
లలిత భుజాకల్పలతలతోడ

నడరి జనకాబ్ధిసీమ రామాభిధాన
హరి కహీనగుణప్రోత హారళరాస
గిరిమథన యత్నమునఁదోఁచు సిరియశేష
రాజ్యము లొసంగుఁదిరుమల రాయమణికి"*

ఈపద్యమున ఈ సంగీతకళారహస్యనిధి లలితారాగధ్యానానుసంధాన రూపకముగ భూపుత్రి పెండ్లికూతురై నిలచినప్పటి సుకుమార సుందర సలలిత స్వరూపమును మన కనులకు పంటగ మనోరంగమున ప్రతిష్ఠింప దొరకొనుచున్నాడు.

లలితము స్త్రీరాగములలో ఒక్కటి. ఇట్టిదానిని ఔత్తరాహ సంగీతశాస్త్ర విదులు రాగిణియందురు. ఇది హిందోళమను పురుషరాగమునకు వరాంగన యట.*** ఇద్దాని స్వరూపము.

"ప్రఫుల్ల సప్తచ్ఛరమాల్యయుక్త గౌరీకృశాంగి చపలేచలాక్షీ
వినిశ్వసత్పాదవశాత్ప్రభాతే విలాసవేషా లలితోపదిష్టా"** అను శ్లోకమున ఉట్టంకితము. పెండ్లి కుమార్తెగనున్న సీతాభామామణి విలాస వికాసాన్వితస్వరూపమును ఈ సంగీతకళాచణుడిట తలచినాడు. సిరికి అవతార తారయగు సీత గౌరవర్ణభాసితోజ్జ్వలయగుట స్పష్టము. ఆమె స్వయంవర మండప

---

* వ. చ. 1 - 2

** సం. ద. రా. అ. 233

*** "వేళావళీరామకరి దేశాఖ్యా పటమంజరీ
లలితా సహితా ఏతాః హిందోళస్య వరాంగనాః" సం.ద.రా.అ. 263

స్థితయగుటవలన హరశరాసన గిరిమథన యద్నునఁదోచు సిరిగనుపమింపబడినది. కావున ఆతరుణి సిగ్గుదొంతరలమధ్యన భాసించుట ఇట "తరణీచలాక్షీ" యను లలితరాగ ధ్యానమున ప్రయుక్తములైన విశేషణములకు ప్రతీకయగుచున్నది. ఇట లలితాధ్యానమునఁదోచిన సప్తచ్ఛదమాల్యయుక్తయగు గౌరవర్ణభాసితోజ్జ్వలాంగి స్వరూపము స్వయంవర వధువుఅయి వరమాల చేతధరించి నిలచియున్న సీతాభామామణికి సంవాదియగుటకు అభ్యంతరములేదు. కావున సీతాస్వరూపమున అమరినంతవరకు లలితారాగలక్ష్మి రూపమును ప్రత్యక్షము గావించి రామరాజభూషణుడిట రాగవివేకమును ప్రదర్శించి తన సంగీత కళారహస్యనిధిత్వమును సార్థకము గావించుకొనినాడు.

"అరిగాఁబంచమ మేవగించి నవలాలవ్వేళ హిందోళ పై
ఖరి సూపంబికజాత మాత్మరవభంగ వ్యాకులంబై వనీ
ధర నాలంబిత పల్లవ ప్రతవిధుల్ తాల్పందడీయధ్వనిన్
సరిగాఁగై కొనియెన్ వసంతమ మహాసంపూర్ణభావోన్నతిన్"*

"చివురుంగై దువువేల్పు చైత్రమున నక్షీణధ్వజోత్క్షేప పై
భవుఁడై తెమ్మెర తేరిపై గదలిరాఁ బ్రత్యంగ్ర సాలాగ్రహ
ర్మ్య విటంకంబులు ప్రాఁకి వల్లివనజాస్యల్ నల్లిరుత్ఫుల్ల ప
ల్లవ హస్తంబుల భావిభావుక ఫలోల్లాసంబుతోఁ గ్రొవ్విరుల్"**

ఇది రామరాజభూషణుని రాగవివేకమునకు తానకమగువట్టు. ఈపద్యమున వసంతావిర్భావ సంసూచితము. శిశిరస్య వసంతస్య సంధౌ హిందోళకమ్మని సంగీతబుతువేళావిధి. ఈ హిందోళవసంతముల ప్రసక్తిని శ్రీనాథుడు ఆయనకు అర్వాచీనులగు కవులు పెక్కురు గావించిరి. కాని సర్వాతిశాయిగ రామరాజభూషణుడు రాగనామమును రాగవేళనుదడవి యూరుకొనక రాగలక్షణ వివేచనమునుగూడ చేసియున్నాడు. ఇది సంగీతశాస్త్ర పారంగతుడగుట ఈతనికే తగినది. హిందోళ రాగలక్షణము రామరాజభూషణునికి పూర్వులగు సంగీత

* వ. చ. i - 130

** ,, i - 132

శాస్త్రజ్ఞులచే నిర్వహింపబడినదీస వేయి. అతని కర్వాచీనులగువారు మాత్రమే రామరాజభూషణుని ఈరాగసిద్ధాంతమున కనుగుణముగ చెప్పిరి. సంగీతరత్నాకరమున హిందోళ రాగలక్షణము

"ధైవతార్షభికావర్జః స్వరనామజ జాతిజః
హిందోళకోరిధత్యక్తః షడ్జన్యాసగ్రహాంశకః
ఆరోహిణీ ప్రసన్నాద్యే శుద్ధమధ్యాఖ్య మూర్ఛనః
కాకలీ కలితో గేయోవీరరౌద్రాద్భుతేరసే
వసంతే ప్రహరీమధ్యే మకరధ్వజవల్లభః
సంభోగే వినియోక్తవ్యో వసన్త స్తత్సముద్భవః"* ఈ రీతిగ చెప్పబడినది.

రామరాజ భూషణుని సమకాలికుడగు రామయామాత్యుడు నైతము-

"హిందోళవో రిధత్యంతః ఔడవః సంగ్రహాంశకః
సన్యాసః శుభయోగేపి సరాగః సర్వకాలికః"** అనినాడు.
సంగీతరాజమను ఉద్గ్రంథమును రచించిన నృపతి కుంభకర్ణుడును—
"దైవత్వార్షభికా వర్జ్యళ్ళుద్ధజాతి సముద్భవః
గ్రహాంశన్యాస షడ్జన్య దైవతార్షభ వర్జితంః
.... .... .... .... .... ....
వీరస్యాద్భుతరసో వియోజ్యో వాసరాంతిమే
యామేవ సంతకాలేన శంబరారి ప్రియంకరః
సంభోగేచ విశేషేణ హిందోలః స్యాదిహాదువః
కేచిత్ ఋషభలోపేన హిందోలం షడ్జ సంశ్రితం"*** రాగలక్షణము ఇట్లేయన్నాడు.

---

* సం. ర. (రా. వి.) 93, 94, 95
** స్వ. మే. క. ని. రాగవివేచము (చౌకంభాప్రతి)
*** సం. రా. 499 - 502

ఇక సంగీతదర్పణకారుడును దరిదాపుల రామరాజభూషణునికి సమకాలికు డగు చతుర దామోదరుడు కూడ హిందోళమును,

"హిందోళరిధత్యక్తః సత్రయః కథితో బుధైః
మూర్ఛనా శుద్ధమధ్యాస్యాత్ ఔడవః కాకలీయుతః"*

ఇతః పూర్వసిద్ధాంతానుసారము నిర్వచించినాడు. ఇక కవిచక్రవర్తియగు జగదేకమల్లుడు సంగీతచూడామణియందు ఈ హిందోళమును సంగీతసమయ సారోద్ధరణముగా నిట్లనినాడు.

"మార్గ హిందోళరాగాంగ హిందోళోవేతి సంజ్ఞకః
అంశే న్యాసేగ్రహే షడ్జః తస్య తారేతి మధ్యమః
షడ్జ స్వరోణవేత్మంద్రే తాడితోరిధ వర్జితః
స వయోఃకపితశ్చైవ శృంగారే వినియుజ్యతే"**

చతుర్దండీ ప్రకాశికాకారుడగు వేంకట మఖి రామరాజభూషణునకు అర్వాచీనుడు. అతడు హిందోళరాగలక్షణమును రామరాజభూషణు మతానుసారముగ నిట్లు నిర్వచించినాడు.

"హిందోళస్త్వౌడవో రాగః పంచమర్షభవర్జితః
షడ్జగ్రహేణ సంయుక్తో గాతవ్య స్సర్వేణ బుధైః"***

ఏవం విదోక్తముగ సంగీత గ్రంథములన్నిటియందు హిందోళము ఋషభధైవత స్వరవర్జ్యమగు ఔడువ రాగమని వ్యక్తము. కాని మూర్తికవి ఈహిందోళ రాగలక్షణమును అరిగా పంచమ మేవగించి హిందోళమైశరి అవ్వేశ నవలామణులు చూపిరనినాడు. ఇందరుపూర్వులు సమకాలికులగు సంగీతకారులు హిందోళమును ఋషధైవత స్వరవిరహితమనుచుండగ రామరాజభూషణుడు ఈ హిందోళమును ఋషభత్యక్తమగుచు పంచమవర్జ్యమునిగూడ ఎందులకనినాడను

---

* సం. ద. 222

** సంగీత చూడామణి రా. కి. (చౌకంభాప్రతి)

*** సం. సం. ప్ర. హిందోళమువివేచనా.

విచికిత్స ఉదయించుట సాజము. నేడు హిందోళమును ఆనాడు మూర్తికవి అనినట్లే ఋషభపంచమ వర్జ్యరాగముగానే సంగీతవిదులు గానము చేయుచున్నారు. ఈతనికించుక అర్వాచీనులగు సంగీతపారిజాత, సంగీతచూడామణి కారులును, తదితరులును ఈ హిందోళమును ఋషభపంచమ వర్జ్యమనియే నిర్వచించినారు. కావున ఈరాగమునుగూర్చిన అభిప్రాయద్వైవిధ్యము సంగీతకారులలో రామరాజ భూషణుని కాలమునకే యుండయుండును కావున సంగీతకళానిధియగు ఈకవి స్వానుభవపురస్కృతముగ వివేచనగావించుకొని తనకునచ్చిన లోకముమెచ్చిన రీతిలో ఇద్దాని రాగరంజకస్థితిని అనుశీలించి ఈ హిందోళమును ఋషభపంచమ వర్జ్యముగనే తన గ్రంథమున నిక్షేపించియుండును. ఇట్టి రాగలక్షణములను శ్లేషానుప్రాణిత ధ్వనియుతముగ మంత్రమువలె మహారహస్యముగ తత్ పద్యములలో ఇమిడించుట వలకనే వసుచరిత్రము మహాప్రౌఢ ప్రబంధమైనది లేనియెడల ఇదియు తదితర సంగీతగ్రంథములందొకటై పరిగణింపబడి గీతి సాహితీ సమంచితమై ఉభయతారకమైన మహారాగప్రబంధమను ప్రథనందెడిది గాదు. రామరాజభూషణ మతానుసారముగ సంగీతపారిజాతకారుడగు అహోబల పండితుడును సంగ్రహచూడామణికారుడగు గోవిందాచార్యుడును హించోళ రాగ లక్షణమును నిర్వచించినారు. ఈ అహోబలుడే హిందోళమును మార్గహిందోళ మును వేర్పఱచి హిందోళము 'రిప' త్యక్తమని మార్గహిందోళనము 'రిప' యుక్తమని నిర్దేశించినాడు.** రామరాజభూషణుని "అరిగాపంచమమేవగించిన" హిందోళము అహోబలుడు సంగీతపారిజాతమున తదనంతర కాలమున వ్యక్తీక రించిన హిందోళమునకు సంవాదిగానున్నది. ఇట్టి ఏకాభిప్రాయము రామరాజ

---

* "నటభైరవీ మేళాచ జాతో హిందోళనామకః
వన్యాపం పాంస్యకంశ్చైవ షడ్జగ్రహముచ్యతే
వక్రాఽరోహేఽవరోహేచ 'రిప' వద్యం విదుః బుధాః
సరిగమ దనిప పనిదమ గరిస"
—"హిందోళేఽథ'రిపౌ'చ ద్వ్యే కోమలౌ దైవతోద్భవేత్"

సం.పా.రా.ప్ర. 6 - 420

** "హిందోళో రిపయోగేన మార్గహిందోళకో భవేత్"

సం.పా. రాగ. 422

భూషణాహోబలులకు ఏర్పడుటకు కారణము వారిద్దఱు ఒకే కోవకుచెందిన హనుమన్మతానుయాయులగుటయే.

హిందోళ రాగవిషయమున ఈసిద్ధాంతమిటులుండ వసంత రాగలక్షణమున ఇంకొక రాద్ధాంతమున్నది. భూషణునకు పూర్వము సమకాలికముగగూడ వసంతము సంపూర్ణరాగము. నేడది ఔడవ షాడవమనుటకద్దు. మాయామాళవ గౌళజన్యమని కొందఱు, సూర్యకాంత రాగజన్యమని మఱికొందఱు భావించుచున్నారు. దీని ఆరోహణావరోహణములు.

"సగమదనిసా
సనిదమగరిస"

సంగీతరత్నాకరమున దీని లక్షణమిట్లున్నది.

"వంసంతే ప్రహరేతుర్యే మకరధ్వజవల్లభః
సంభోగే వినియోక్తవ్యో వసంతః తత్సముద్భవ.
పూర్ణః తల్లక్షణో దేశీహిందోళోఽపేక్ష్యతధ్యతే
వసంతం లక్షయతి వసంత ఇతి పూర్ణః సప్తస్వరః
ఏతావతా కారణాదభూత్ పూర్ణహిందోళాత్ భేదః"*

ఈ వసంతమునే నృపతి కుంభకర్ణుడు.

"షాంశన్యాసగహః పూర్ణోమన్ద్రనిః స ఏకమిశ్రితః
భూయిష్ఠ రిససౌద్రైమే వశ్చిమే ప్రహరే బుధైః"**

"రాగః శుద్ధః వసంతాఖ్యః సన్యాసః సగ్రహోప చ
గీయతే సర్వయామేషు సర్వదామంగళ ప్రదః"*** అని భూషణుని సమకాలికుడగు రామయామాత్యుడు స్వరమేళకళానిధి యందవినాడు. ఈమూర్తి

---

* సం. ర. 96. రా.వి.అ.
** సం. రా. జ. 78. రాగాంగము.
*** స. మే. క శుద్ధరాగవివేచన చౌఖంభాప్రతి).

కవికి సహోద్యోగియైన చెరుకూరు లక్ష్మీంద్రుని పుత్త్రుడగు చతుర దామోదరుడు ఈ వసంత లక్షణమునిట్లు నిర్వచించినాడు.

"వసంతా స్యాత్ సంపూర్ణా సత్రయా కథితాబుధైః
శ్రీరాగ మూర్ఛనైవాత్ర గేయరాగ విశారదైః"*

తదితరములగు అర్వాచీనలక్షణ గ్రంథములైన సంగీతపారిజాత సంగీత చూడామణులయందు.

"అంతర గాంధార కాక స్వరేతర శుద్ధారోహ 'రిప' వర్జితావరోహ'ప' వర్జిత సంగ్రహన్యాసాంశము"గా నుక్తమైనది.

సంగీత పారిజాతమున నీవసంతము—

"షడ్జాది మూర్ఛనే మాస్తేగనీ తీవ్రౌ వసంతకే" అని నిర్వచింపబడినది ఇద్దాని వివేచనమున సంగీతసమయ సారోద్ధరణముగ.

"శ్రీరాగసంభవః సోఽయం వసంత సముదీరితాః
మన్యంతే రాగిణీ కేచిత్ వాసంతీస్తచ్ఛ్రియప్రికా
స్యాత్తంత్రి కృత్రిమత్వంవై ఋషభే మధ్యమద్వయోః
పంచమేన సుహీనా సాయుక్తా స్యాద్వక్ర షాడవా
ఆరోహే ఋషభన్యస్తా వాదీస్యాత్ మధ్యమస్తథా
సంవాదీ షడ్జ ఏవాత్రాఽఽరోహణే క్లిష్టమధ్యమా
స్యాత్తాం త్వారోహేచ దివసే ప్రథమే దశే"** ఇట్లు ఇద్దానిని నుట్టంకించి మఱి తన మాటలుగ నీపారిజాతకారుడు ఈ రాగలక్షణమును ఇట్లవినాడు

* సం. రే. 240

** "కణాన్వరేః ద్రుతే యుక్తో రక్తిఘ్నశ్చ నవర్జితః" అని భరతానుశాసనము.

"వివాదీ తానక్రియాత్మకః ద్రుతగీతో నరక్తిఘ్నః" అని కీ.శే. విష్ణుదిగంబరుల వక్కాణ్ణి. దీనినిబట్టి వివాదిస్వరమును క్వాచిత్కముగ ప్రయోగింపవచ్చుననుట స్పష్టము.

"పూర్వాః మేళేతు వాసంతి సంపూర్ణా ... కోమలా
మధ్యమే చాపి క్లిష్టత్వం గాంధారేణ చవాదినీ
సంవాదినీ మధ్యమేన వివాదీ పంచమస్వరః
చతుర్థే ప్రహరే రాత్రౌ గీయతే గీతకోవిదైః"

ఇద్దాని వ్యాఖ్యానమున మతాంతరముగ రాగచంద్రికయందు

"మృదు రీరిత రేతీవ్రా షడ్జైశ్చ ద్విమధ్యమః
షడ్జవాదీ సంవాదీ వసంతర్తౌ వసంతకః"* శ్లోకము నుదాహరించినాడు.

ఈ మతాంతరములన్నిటిని పరిశీలించి పిండితార్థముగ వసంతమున్నుగా సంపూర్ణరాగమై భాసించినదని ఆనాటికే ఈరాగమునఋషభము మృదుతరము పంచమము వర్జ్యముగను లేక చ్యుతమగనోయున్నట్లు భాసించునను మతము గమ్యమానము. కావున నీసంగీత కళారహస్యనిధి ఈవాదములన్నిటిని పరిష్కరించి నడిమివాటముగ పికజాతమాత్మరవ భంగవ్యాకులంబై పల్లవవ్రత విధిఁ దాల్చెననిసరిగా ఇద్దానిని ప్రస్తారమున సంపూర్ణభావోన్నతిని చూపినాడు. పంచమ మిందు వివాదియగుటవలన ఈపంచమస్వరమును దృఢముగ పల్కరాదు ** పలికినట్లు పలుకనట్లుగా కణస్పర్శమాత్రమున వివాదిస్వరమును అనవచ్చునవి, అది రక్తిఘ్నముకాదని కాన పంచమమును లవలేశమాత్రముగనని తదనంతర స్వరమగు మధ్యనుమున నూనిక చూపవలయునను సంగీతరహస్యమునీ గానకళా నిధి (పల్లవ=పత్+లవ) పల్లవ విధియందు గమ్యమాన మొనర్చినాడు. ఈ రాగభావావిష్కృతిలో పికజాతమునకు అగ్రతాంబూలమీబడినది. హిందోళముమ గానముచేసినవారు నవలామణులుకాగా వసంతమును పికజాతము సంపూర్ణ భావోన్నతి గల్గించురీతిలో గానముచేయ బద్ధకంకణత్వము దాల్చినది. ఇందీ పికములకంతటి ప్రాధాన్యత నొసగుటకు ఆరాగధ్యానముల ప్రయుక్తములైన శ్లోకార్థము మూదలయగుచున్నది. ఇది సంగీత పారిజాతముననున్న వసంత రాగ ధ్యానము.

---

* రా. అ. రా. చ. 229

** సం. పా. 439 రా. ప్ర.

"శిఖండి బర్హోచ్చయబద్ధచూడః పుష్టావికం చూతలతాంకురేణ
భ్రమన్మదా వాసమనంగ మూర్తిస్మితో మతంగస్థ వసంరాగః
మయూర పక్షోచ్చకిరీట భూషితః సమావృతాశ్చాళికులైః సమంతతః
కరే ధృతం యేనరసాల మంజరీం సువేషవానోరసికో వసంతః"*

రాగవిబోధమున వసంతధ్యాన మీరీతిగనున్నది.

"కేళగ కింశుక ఏష ప్రమేతంతామ్రాంకురపికస్య ముఖే
అరుణ వసనో వసంతో గౌరసువేషో రసాలగతః"**

సంగీతరత్నాకరమున ఈ వసంత రాగధ్యానమిట్లు ఉపస్థితము.

"శిఖండ బర్హోచ్చయబద్ధ చూడా కర్ణావతంసాస్ఫురదామ్రపత్రా
ఇందీవరశ్యామ తనుః మనోజ్ఞా వసంతికాస్యానం మంజులశ్రీః"***

సంగీతరాజమున ఈవసంత రాగధ్యానమిట్లున్నది.

"షడ్వదనో దళకరో వశంతో విద్రుమప్రభః
సుతాలశంఖ ఖట్వాంగః ఫలచక్రాబ్జ భృత్కరః
సవీణేచ కరౌ యస్యవరదా భయదౌతథా
వాహనం కోకిలా చైత్రవైశాఖే గీయతే స చ"****

ఈధ్యాన శ్లోకములన్నిటియందు వసంతరాగమూర్తితోపాటు పిక స్మరణ మున్నది. పికజాత ప్రసక్తిలేనియెడల కోకిలకులమునకు ప్రధానకబళమగు చూతలతాంకురములను, రసాలమంజరులను, తామ్రాంకురములను గూర్చిన స్మరణమైన ఉన్నది. కావున వసంతరాగాధిష్ఠాన దైవతమునకు పికమువాహనమని అద్దానిపక్షమే పోషించి పాలించునని గమ్యమానము. అందువలననే ఈ సంగీత

*
** శా. పి. రా. ప్ర. 943
*** సం. ర. రా. ప్ర. 462
**** సం. రా. రాగోల్లాసః 643

కళారహస్యనిధి పికజాతమునకంతటికి ప్రాధాన్యతనిచ్చి అయ్యవి ఆత్మరవభంగ వ్యాకులంబులై వనీస్థలి నాలంబిత పల్లవవ్రత విధుల దాల్చినవనినాడు. "ఈ అరిగా పంచమమేవ" అను పద్ధియమునందలి పూర్వార్ధమున హిందోళమున ఉత్తరార్థమును వసంతమున గానముచేసెడి పద్ధతి సంగీతగురుకుల క్రమాయాత మగు సంప్రదాయమునమున్నది.

ఈ గానరసజ్ఞశేఖరుడు వసంతరాగలక్షణమును సమగ్రముగ గమ్యమానము గావించిన తదనందరము ఆవసంత రాగధ్యానమును తదుపాస్యమూర్తి స్వరూప స్వభావావిష్కృతినిట్లు గావించినాడు.

> "చివురుంగైదువు వేల్పు చైత్రమున నక్షీణ ధ్వజోత్క్షేపవై
> భవుఁడై తెమ్మెర తేరిపై గదలిరా బ్రత్యగ్రసాలాగ్ర హ
> ర్మ్య విటంకంబులు ప్రాఁకి వల్లివనజాస్యల్ సల్లిరుత్ఫుల్ల ప
> ల్లవ హస్తంబుల ఖావిభాపుకఫలోల్లానంబుతోఁ గ్రొవ్విరుల్"*

ఇంతదనుక వసంతరాగ సౌభాగ్యానుశీలనము గావించిన వసంతధ్యానమున ఆ రాగమూర్తి అనంగమూర్తిగ అధ్యవసితము. కొందఱు ఆ అనంగమూర్తికి వాహనముకోకిల అన్నారు. కాని అతని తేరునుగూర్చి ఎవ్వరును ప్రస్తావించ లేదు. కావున మన కళానిధి ఆ వసంతరాగమూర్తికి రథోత్సవమును వసంత రాగవేళనుబట్టి చైత్రమున గావింపనెంచినాడు. ఏతదుత్సవ వైభవమునకు తగిన రథముగ తెమ్మెరను ప్రకల్పించినాడు. తెమ్మెరను సంస్కృతీకరించినది అనిల మగును. అనిలమునకు సంగీతమునకు సన్నిహిత సంబంధమున్నది.

"నకారం ప్రాణనామానం దకారం అనలం విదుః
జాతః ప్రాణాగ్ని సంయోగాత్ తేన నాదోభిధీయతే" అనునది చతుర దామోదరోక్త విషయము. ఇట్లే గాయకకుల గురువైన త్యాగరాజస్వామి ప్రాణానిలసంయోగమున ప్రణవనాదము సప్తస్వరములై వరగువన్న్సారమతి రాగాన్విత మగు మోక్షముగలదాయను కృతిలో అనినాడు. వాయువు జగత్ప్రాణము.

---

* వ. చ. i - 133

తద్వాయు ప్రేరకములగు సుషిరవాద్యవిశేషములు సంగీతవాద్యములందు ప్రధానములగుటబట్టి సంగీతమున ప్రాణానిలమునకున్న ప్రాధాన్యత గమనీయము అట్టి జగత్ ప్రాణసంభూతుడగు ఆంజనేయుడు నాదోపాసకులలో ఆద్యుడు. ఆ జగత్ప్రాణనందన కారుణ్యకటాక్షలబ్ధ కవితాసుధారాశియైనవాడు గనుకనే రామరాజ భూషణుడు వసంత రాగోపాస్యమూర్తికి తెమ్మెరనుతేరు గావించి రథోత్సవముగావించి ఆరాగధ్యానముకొక క్రొత్త అందమును ప్రతిపాదించినాడు

ఇక తరువాతి పాదములలో "పల్లవ వనజాస్యలు ఉత్ఫుల్ల పల్లవముల సల్లిరవి" నాడు. ఈపల్లవమునచ్యుత పంచమము వసంతమున ప్రయుక్తమగు ననుట దూరాన్వయముగాక తజ్ఞులకు సమీరస్థితమై భావుకోల్లాసంబగునేగాని సుదూరము గాబోదు.

ఈరీతిగ సంగీతకళారహస్యవిధి హిందోళవసంతరాగముల రెంటిని అనుశీలించి భావిభావుకఫలోల్లాసంబులైన ఈరాగములు రెండు భాసించుతీరును ప్రతిపాదించి క్రాంతదర్శనుడైన కవిగాయకుడై నిలచినాడు.

అనంతర పద్యమందల్లి—

"మహిళామండల భ్రమరకా మర్దంబు శ్యామాముహు
ర్మహారుక్మీలిత పత్రభేద నిపుణంబు"* అను పలుకుబడిలో శ్యామా రాగనామము ప్రసక్తము. ఈ శ్యామరాగమునే పూర్వసంగీతశాస్త్ర గ్రంథములలో [illegible]రాగమనిపించుచున్నది.

ఆ పిదప—

"కలకంఠార్భటి నొందెడుంభిలుభుమల్ గాఢచ్ఛదాచ్ఛాదికల్"** ఇత్యాదిగ [illegible] పద్యమందు [illegible] రాగనామముట్టంకితము.

"ఒక చోయనవపాయ పికగేయసముదాయ
మొకసీమ నానామయూర నినద

---

* వ. చ. i - 132

** ,, i - 133

మొకవంక నకలంక మకరాంకహయహేష
లోక క్రేవ వనదేవయువతి గీత
మొకచెంత సురకాంతలకరాంత తతనాద
మొకదారి నవశారి కోదితంబు
లోకయోరఁబటుచారణ కుమార ఫణితంబు
లోకదండ నలిమండకల గాన
మొక్క మొగిఁ బ్రమోయఁగదళీ గృహోపపన్న
కిన్నరీ బృంద బృంద సంగీతరీతి
సమము నతివేల కోలాహలాముల కలిమి
నధిప యీయద్రి కోలాహలాఖ్యమొక్క"* అనునీ పద్దియమున
అతోద్య సమ్మేళనాత్మకమగు కోలాహల విజృంభణమున ధ్వనితమైన కోలాహల రాగలక్షణానుసారి కోలాహలముగూడ వినిపించును. ఆపిదప పరిశిష్టమగు రాగ లక్షణమైన కలహారీతిని తరువాతి పద్యములో వసురాజు కోలాహల గర్వాప నోదముగావించిన ప్రస్తావనలో గమ్యమాన మొనర్చి తదనంతరము కోలాహలుని మాటలలో ఈ రాగలక్షణమునిట్లమర్చినాడు.

"నను సుప్రెత్తుగఁబాఱు మీటితివి నానాధైర్యసామగ్రి మ
జ్జనకుస్ మున్నె తృణీకరించి కృపా స్వాంతంబునంబ్రోవు మిం
కనరేంద్రాయని గట్టువేఁడెడి నినుంగంటే తృణగ్రాహి మా
తన నీలాశ్మదరీముఖాగ్ర నిచలద్వాతూల మంద్రధ్వనిన్"** అనుచీ
పద్యమున కోలాహలరాగమునందుఁబ్రవర్తిలు స్వరసమూహమ్మొ యమును అనూన రాగ వివేకస్వాంతుడై వివరింపఁదొరకొను చున్నాడు.

సంగీతరత్నాకరమున ఈకోలాహల రాగలక్షణమిట్లుట్టంకితము.

"కోలాహలాటక్క భాషా షడ్గ్రహాంశావ వర్జితా
స ధపంద్రామభూయిష్ఠా కలహే గమకాన్వితా"***

---

* వ. చ. ii - 7

** వ. చ.

*** సం.ర.రా.వి.అ. 242

"కోలాహలష్షడ్జ్ఞభవ స్తదంగం సాంశగ్రహో మధ్యమ మంద్రహీనః
నిషాదతారః సకలైః స్వరైశ్చ తారైర్యుతః షడ్జగానారభ్యః
వర్ణానుగేయః స్వనినాదవచ్చ నిరూప్యతే వర్తనికాస్య సమ్యక్"*
ఇది సంగీతరాజ లక్షణము.

ఇక సంగీతపారిజాతమున—

"మోహీభూతో కోల్లహాసం స్యాద్గాంధారాదిక మూర్ఛనః
అవరోహే దవర్జ్యః స్యా దౌడవః పరికీర్తితః"**

ఈ కోలాహలరాగము వివాదవిశేషమున ప్రయుక్తమగుటకు తగినట్లే ఇందలి స్వరప్రస్తారము నైతము వివాదగ్రస్తము. ఈ కోలాహలమే కోల్హాస మనియు వ్యవహృతమగుచున్నట్లు పారిజాతకారుడనినాడు. ఒకచో ఈరాగము 'వ' వర్జితమనియున్నది. వేరొకచో ధవర్జ్యమని యున్నది

అట్లే సంగీతరత్నాకరపాఠమున ఒకచో 'రిమ' మంద్ర యని యున్నది. వాటినన్నిటిని పర్యాలోచించిన రామతాజభూషణు మతము నిర్ధారితమగును: స్వర సంగీతరహస్యముగ సప్తవిధరత్నములు సప్తస్వరప్రతీకలుగ నిర్దేశితములు: అందు ముక్తాఫలము షడ్జమునకు నీలము ఋషభమునకు సంకేతములనుట స్పష్టము. కావున నీ సంగీతకళారహస్యనిధి సప్తరత్న సంకేతమున గూఢముగ నీకోలాహల రాగలక్షణమును వ్యంజితము గావించెను. ఏవం విధ గూఢరాగ రత్నాన్వేషణమే ఈవసుచరిత్రమున సాగక రాగలక్షణములు వాచ్యములు గావించినచో ఇయ్యది ప్రౌఢప్రబంధము గాక ఏసంగీతశాస్త్రగ్రంథమో ఆయెడిది. కావ్యాంతరిత కాంతా సమ్మితియందలి ఇష్టార్థోపగూహనము రమణీయమై సహృదయ సంవేద్యమగును. కావుననే ఈమహాకవి గాన కళావేదిమై అభిప్రేతార్థమును గూఢముగనేయుంచి ఆవశ్యకతయున్న వారద్దానిని అన్వేషణకై యత్నింపుదురనున్నట్లున్నది. కావుననే ఇందలి సంగీతరహస్య రత్నవిధికై గవేషణము గావింపగోరువారు. ఈఅపార ప్రబంధపారావారమున

* సం. రా. ఫి. అ.
** సం. పా. రా. అ. 242

తలమున్కలుగ మునిగితేలి పీఠైనంతవఱకు ఆ రాగరత్నాన్వేషణము గావించిరి, అట్టి ఘశులగు పరిశోధకులకు తదంతర్గత సంగీతాదిక శాస్త్రవిషయికరత్నములు కొంతవఱక లభ్యములైనవి. ఇట్లుగాక ఈశాస్త్రగవేషణము ఈతకుమించినలోతు అనుకొనెడి వారీ ప్రబంధపారావార తీరమున విహరించి తృప్తినందిరి. అట్టి వారికిందలి గూఢశాస్త్ర విషయములవగతముకాలేదు ఏవంవిధశాస్త్రవిషయకరీతిలో గరిష్ఠములైన పద్యములలో కోలాహల రాగలక్షణ సంయుతమగు "నను నుప్వైత్తుగ" అను పద్యము ముఖ్యము. ప్రాచీన సంగీతశాస్త్రగ్రంథములగు సంగీతరత్నాకరాదులందుఁగూడ ఈకోలాహల రాగలక్షణము నిర్దేశితము. ఇయ్యది పంచమ వర్జ్యరాగము కావుననే ఈపంచమ స్వరలోపము "ఉప్వైత్తుగాఁ బాఱమేటితివి" అను పలుకుబడిలో "పా" (పంచమము) పాఱమీటుటలో నిర్దేశిత మైనది. వీణావాదన రీతిలో పాఱమీటుట యనగా దాటు స్వరముగ స్వరచంక్ర మణము గావించుటయే. 'అతోద్యమేళనమున నందగించు కదన కుతూహల రాగ విన్యాసము స్వరసంయుత గానముగ తదనుగత వాద్యసమ్మేళనములో వినినయెడల సేనావాహిని కదనకుతూహలముతో సమరాంగణమున కురుకుచున్నట్టి భావన కలుగును. అట్లే కోలాహల రాగముకూడ "కలహే గమకాన్వితా" యను తల్లక్షణానుసారము ప్రచోదనా శక్తియుతమనిపించుచున్నది. ఇది రామరాజ భూషణుని కాలమున గానవ్యవహారము ప్రచలితమైయుండి యుండును. కాని ఈనాడీ రాగము అపూర్వరాగముగాకూడ వినబడుటలేదు. అయినను ఏతద్రాగ లక్షణాన్వితముగనిది ఉత్తేజభావ ప్రతిపాదకమగు ప్రచండ రాగమనుట స్పష్టము.

ఇక ఇందలి స్వరప్రవృత్తి ననుశీలించిన ఇందు పంచమము వర్జ్యస్వరము కాగా మధ్యమము భూయిష్ఠధ్వన్యుపేతమై ధైవతఋషభములు మంద్రస్థాయి ప్రయుక్తములని గమ్యమానమగుచున్నది. షడ్జమిందు గ్రహస్వరము అంశ స్వరముగాకూడ ప్రయుక్తమగుచున్నది.

ఇట్టి ఈరాగలక్షణమును సంగీతకళారహస్యనిధియగు ఈకవి గూఢరీతిలో ఇందు విశేషించినాడు. సంగీతశాస్త్రమున షడ్జఋషభాదులకు ముక్తాఫలనీల వజ్రాదిక రత్నరహస్య సంకేతమున్నదని ఇంతఃపూర్వము వివృతము. ఏతత్సంకేతాను సారము ఋషభమునకు నీలాశ్మము సంకేతమగుచున్నది. అయ్యది మంద్ర

స్థాయిలో ప్రయుక్తమగు "గట్టువేడెపు తృణగ్రాహినూతన నీలాశ్మదరీముఖాగ్ర విచల ద్వాతూల మంద్రధ్వనిన్" అనుపలుకుబడిలో వ్యక్తము. నీలాశ్మముతృణ గ్రాహియనుటలో గడికరచి డీంపతి ధైర్యసామగ్రి తృణీకృతముకాగా వేడు కోలునక్కుత్తమగుట సంవేద్యమగుచున్నది. ధైవతమునకు సంకేతముగ ధైర్య సామగ్రియందలి 'ధై' ధైవతమునకు సంకేతమగుట తచ్ఛాస్త్రజిజ్ఞాసువులకు అన్యులకువలె దూరాన్వయమనిపించదు. ఇట్టి కోలాహలరాగలక్షణమును పద్యము నందిమిడించి రామరాజభూషణుడు వ్యక్తీకరించిన దాన్నికన్ని విధముల తగ్గి పోవునట్టి రాగలక్షణమును శైవసంగీత సారోద్ధరణముగ సంగీతపారిజాతకారుడు ఇట్లొసగినాడు.

"ధైవత్యాంశభితాయుక్త శుద్ధజాతి సముద్భవః
షడ్జన్యాస గ్రహాంశశ్చ కోల్లాసో రిధ దుర్బలః"*

కోలాహలమునకు కోల్లాసమని కొల్హాసమని నామాంతరము ఉన్నట్లు సంగీతపారిజాతకారుని వక్కాణ.

ఈ కోలాహలరాగము విస్తృతపరిధిని గలిగి తానప్రకల్పనకు స్వర రచనకు రాగాలాపనమునకుఁగూడ అనువగు రాగమని రామరాజభూషణుడే తరువాత ఇట్లు సంసూచించినాడు. ఈవచనమున కోలాహలరాగము తాన ప్రకల్పమునకు అనువైనదని తజ్ఞులు గ్రహింపవలెనని తానమగు సంగీతపారి భాషికమును ఆమ్రేడించి "కోలావల సంతానంబు సంతాన కుసుమవాసనా సమాగతసారంగ సంగీతభంగీతరంగంబులు పొంగంబులుగాఁబాడ వేల్పుగాణీల పాణిరిత మాణిక్యవీణా మధురరాణామృతంబులఁగరఁగి" యను పదవల్లరిలో సూచించినాడు. ఇది బృందగానపద్ధతి. కోలాహల రాగాన్వితమగు ఈ బృంద గానము కోలాహల పర్వత ప్రథమదర్శనమునందె నేపథ్యగానముగా—

"ఒకచాయనసాయ పికగాయ సముదాయ" అను పద్యమున ప్రారంభము నొందినది.

---

* సం. పా. రా.అ. 252

బృందగానమనునది నేడు క్రైస్తవులు గావించు ప్రార్థనాసమారోహమున నెక్కుడుగ గోచరించుచున్నది. గాన నేటి యువత ఈబృందగానరీతి పాశ్చాత్య నాగరికత వరప్రసాదమని భావించుట కద్దు. అదికేవలము భ్రమాపతితము. మనకీ బృందగాన నేపథ్యగానాదికరీతులు ఆద్యములనుటకు భరతనాట్యశాస్త్ర సంగీత రత్నాకర నృత్తరత్నావళ్యాదులందు ఆకరములున్నవి.

"గాతృవాదకసంఘాతో బృందమిత్యభిధీయతే
ఉత్తమః మధ్యమశ్చో కనిష్ఠమితి తత్త్రిధా"*

"కృతానాం వాద్యకవిభిః వాద్యానా మాశుశిక్షణం
శ్రుతిజ్ఞాన పరత్వంచ స్వవాద్యగ్రహ మోక్షయోః
తాలానుగత్వమై కాగ్ర్యముభయో (గ్యంపుటయో?) ర్మేలనజ్ఞతా
వామ దక్షిణ దక్షత్వ మన్యోన్యస్తుతి కారితా
సుఖానువృత్తి (వర్తి?) తాచేతి వాద్యబృందగుణాహితాః"

ఇదుయేగాక ముఖ్యగాయక బృందగాయక లక్షణములుగూడ నుట్టంకితములైనవి.

"ఒక చాయ ననపాయ పికగేయ" అను పద్యమునందు పికగేయ సముదాయముల పంచమస్వరధ్వనులు నానామయూర నినదములగు షడ్జస్వరధ్వనులు చిలుకల పలుకులను వంతపాటలతో కూడియున్న ప్రధానగాయక బృందమున నున్న వనదేవతల గీతములు సురకాంతల కొనగోళ్ల వేళ్ల మీటబడుచున్న తంత్రి

* సం. ర. iii - 203

** పీనులవిందై యమృతపు సోనల పొందై యమంర సుమచలదళినీ.."
వ. చ. ii - 14

*** నానాగాయన గాయనీమణులు గానంబుర్వి నాలింపమో
నానాటన్ నగభేది పీటగల గంధర్వావ్సరో గీత వి
ద్యా నైపుణ్యము లెన్నియెవి వినమో యందైన నిందైన విం
దైె నావంటి నగూర్చనే మనకి బ్లానంద సందోహమున్" ii - 46

స్వనములకు అనుగతములైన చారణకుమార ఫణితంబులగు పురుషకంఠ స్వరములతో సముపస్థితమై ఒక్కవరి కిన్నరీబృంద బృందగీతరీతి ఆ కోలాహలాద్రిపై ధ్వనించి అయ్యది కోలాహలాఖ్యమని సార్థకనామధేయ మందుటకు సహకరించినదనినాడు. ఇందు వాద్యసంఘాతము స్త్రీపురుషగాయకుల శ్రుతి వైవిధ్యమునుబట్టి నిర్ణీతమైన తార మంద్రస్థాయి ప్రభేదములలో ఒక్కుమ్మడిగా నొవిగిపోయినది. అట షడ్జ పంచమాది....మంజుల కర్ణాటమగు ధ్వానము ప్రవర్తిలి వాద్యానుగతమగు బృందగాన పద్ధతియందుండవలసిన మాధుర్యమంతయు వెల్లివిరిసినది. ఈ బృందాగానరీతి రామరాజభూషణాస్వనకు బాగుగనలవాటువడిన పద్ధతికావచ్చును. అందువలననే ఈ బృందగానమును కోలాహల రాగాన్వితముగ వాద్యసంఘాత సహకృతముగ ఈ సంగీతకళా రహస్యవేది సలక్షణముగనిట ప్రతిపాదించినాడు.

వసురాజు దవుదవ్వులనుండి "నవ్యామృతా వ్యాహతస్వాదంబైన నాదంబు" వినినాడు అది షట్పదీనాదంబో, కలకంఠనాదమో మరున్నారీ వల్లకీ నాదంబోయని నిర్ణయించి చెప్పుటకు వలనుపడని ఒక అవ్యక్తమధుర నాదముగ వీనులవిందొనగూర్చి పరమానందాను సంధాయకమై భాసిల్లినది. ఈ మహామృత రసోపమాన నాదమిట వినవచ్చుటలో గిరికావసురాజుల కల్యాణ నాటకమున నాందీగానము ప్రారంభమైనది. నాట్యశాస్త్ర సంప్రదాయ సిద్ధముగనాందిని నాట రాగమున గానము చేయువలయుననుట ఒక విహితవిధి కాపుననే ఈకవి మహా నాటక సూత్రధారియై వీనులవిందైన నాందీగానమును నాటయందే ఆరంభించి నాడు. ఏదేని గానమును ఒక సంగీతవిదుడు వినినయెడల అతడు ఆగానాభి నందనము గావించుతోపాటు ఆరాగనామమును పోల్చుకొని అందలి రాగ

---

* అనవిని కేళితా సచివుఁడాస్వనపల్లన నాలకించి యో
జనవర వల్లకీరవము సంగతిఁబాడెదారెవ్వరొ వినూ
కనగతి నిమ్మహాద్రిపయిఁ దన్మృదు పంచమ షడ్జళయ్యకొ
య్యన నెఱిఁగిచ్చెవింతె ప్రమదాకుల కోకిల కేకిలోకముల్" అనుసీ
పద్యసంఘాతమున నీసంగీతకళాభిజ్ఞుడు నాటరాగలక్షణానుశీలనగ ఇట్లు
గానించినాడు.

లక్షణమును స్వీయానుభావముతో సమన్వయించుకొనును. అదే విధముగ ఇట వసురాజు "నానా గాయక గాయనీమణులు గాసంబుర్వి నాలింపమో నానాటన్ నగ భేదివీటగల గంధర్వాప్సరో గీతవిద్యానైపుణ్యములెన్నియేని వి౦మో అందైన నిందైన విందై నాదంబొనగూర్చునే మదికి నిట్లానంద సందోహమున్" అని వితర్కించుటకు ఆరంభించినాడు. ఈ వితర్కణమునందె రాగముద్రాలంకారోప స్థితినంది "నానాటన్ నగభేది వీటగల" అని పలుకుబడిలో నాటరాగ ప్రస్తావన వినవచ్చుచున్నది. ఇట్టి నాటరాగనామమును వినిపింపజేసి ఈసంగీతకళారహస్య

---

మధ్యమోదీచ్యవా జాతోర్నాట్టస్తార స్థ షడ్జకః
మధ్యమాంశగ్రహన్యాసః సంపూర్ణశ్చ సమస్వరః
సంగీతరత్నాకర రాగవివేకాధ్యాయః - నిరుపపదరాగః
ఛాయానట్టాతు సట్టైవ మంద్రపంచమ భూషితాః
నట్టోపాంగం నిషాదేన గాంధారేణచ కంపితా" రా. అ. 242
"తజ్జా సమస్వరానట్టా తారగాంధార పంచమా
సన్యాసాంశగ్రహా మంద్రనిషాదా తారదైవతా" 224.
భరతశ్లోకోద్ధరణముగ సంగీతసమయ సారోదాహృతముగ సంగీత చూడా మణికర్త నాటనిట్లు వివరించినాడు.

షడ్జాంశ - గ్రహన్యాసా సంపూర్ణా చ సమస్వరా
తథా తారాచ మంద్రాచ యావద్గాంధార పంచమే
భాషాయామంజరీ తన్యఅంగక నాటాభిధీయతే జగదేకః (భరతకోశః)

షడ్జాంశాచ గ్రహన్యాసా సంపూర్ణాచ సమస్వరా
తథా తారాచ మంద్రాచ యావద్గాంధారపంచమే పార్శ్వదేవ సంగీత సమయసారం:

సంగీతపారిజాతమున నాటరాగము.

రిస్తు తీవ్రతరో యస్మిన్ గాంధారస్తీవ్ర సంగకః
ధస్తు తీవ్రతరం ప్రోక్తో నిషాదస్తీవ్రనామకః
ఆవరోహేఽథ గానుస్తొ నాటే రీస్వరమూర్ఛనః" సం.పా. రా అ.

విధి ఇక నాటరాగలక్షణ వివేచనమును గావింప బోవుచున్నాడు నాట రాగము ప్రాచీనతమము. ఇది సంగీతరత్నాకరమున 'నట్ట' గావ్యవహృతము. రామయామాత్యుడు రామరాజభూషణునికి సమకాలికుడు. ఈతడు తన స్వరమేళ కళానిధి రచనమున సంగీతరత్నాకరమును ప్రాముఖ్యముగ గ్రైకొనవలెనని తద్వ్యాఖ్యాకారుని వక్కాణ. రామరాజభూషణుడుగూడ అటు వేమనాడు సంగీత సంగీతరత్నాకరమును అధికారిక శాస్త్రగ్రంథముగ గ్రైకొనక ఇట సమకాలికులగు రామయామాత్యాదుల వక్కాణమునే నిక్కచ్చిగ స్వీకరింపక శ్రీనాథుని 'కర్ణాటబాణి' వలె మధ్యేమార్గముగ తన రాగవివేక సమన్వయమును గావించు కొనినాడు.

నాటరాగమున తీవ్రగాంధార సంయుతమగు తీవ్రతర ఋషభము ప్రయుక్త మగును. ఈరాగమున తీవ్రనిషాదసంయుతమగు తీవ్రతర ధైవతము కలదు ఆరోహణమున ధైవతగాంధారములు వర్జ్యస్వరములు, భూషణునినాడు నాటకు ఆరోహణము సంపూర్ణముగా వచ్చును. నేడా రోహణముగూడ సంపూర్ణముగాదు, ఋషభవర్జ్యముకూడ. అనాడీ రాగము సంపూర్ణౌడవ జాతికిచెందినది. ఇందు ఋషభస్వరాత్మకమగు అభిరుద్గత యూర్చ్నకలదు. ఇందు ఋషభమే గ్రహ స్వరము. గాంధార నిషాదములు ఇందు శుద్ధములగుటవలన ఇది శుద్ధమేళమగునని ప్రాచీన సంగీతశాస్త్రముల వక్కాణము.

రామరాజభూషణునికి సమకాలికుడగు రామయామాత్యుడు,

"శుద్ధ స్వరస్తు సపపాః షట్ శ్రుతర్ష్యభ ధైవతే
....చ్యుత మధ్యమగాంధారచ్యుత షడ్జనిషాదకః
స్వరైరమీభిః సంయుక్తః శుద్ధనాట్యశ్చ మేళకః
శుద్ధనాట ప్రభృతయోరాగా అతోభవంతి చ"* అనినాడు.

ఈ రాగమున సమపలు శుద్ధములు. ఋషభము షట్ శ్రుతియుక్తము ధైవతము షట్ శ్రుతి సముంచితము. చ్యుతమధ్యమ గాంధారములు చ్యుతషడ్జ

* స్వ. క. శుద్ధరాగవివేదన

నిషాదములు ఈరాగమునందు ప్రయుక్తములగుననుచు రామయామాత్యుడు ఇద్దాని లక్షణమును వక్కాణించెను. మన రామరాజభూషణుడు రామయామాత్యునకు ధీటైన సంగీతకళారహస్యవేది కావున ముందటి పద్యమున రాగనామమును ఉట్టంకించి తద్వాచియగు నీపద్ధియమున కేళీసచివుని మాటలుగ వల్లకిస్వన సంగతిలో ఎవ్వరో ఈనాటరాగమును పాడుచున్నారని ఆరాగమందలి స్వరసంభూతిని స్వీయాభూతితో వివేచించి" తన్మృదు పంచమ షడ్జశయ్యాకోయ్యాన నెలుగిచ్చె వింటె ప్రమదాకుల కోకిల కేళిలోకమున్" అనుచున్నాడు.

ఇటులపూర్వము ఉక్తములైన సంగీతరత్నాకరాది శాస్త్రగ్రంధములందలి నాటరాగలక్షణమున వినబడని చ్యుతపంచమషడ్జనిషాదములు షట్ శ్రుతి ఋషభధైవతములను స్వరములస్మరణము రామయామాత్యుని నాటరాగలక్షణమందు రామరాజభూషణుని నాటరాగ వివేచనమునందు వినబడుచున్నవి. రామయామాత్యునకు రామరాజభూషణుడు సమకాలికుడగుటచే స్వరమేళకళానిధియందాతడు ఉట్టంకించిన వికృతిస్వర విపక్షను అవగాహనము చేసికొని యుండుననుట స్పష్టము.

"సప్తానాం వికృతానాంతు సోద్దేశం లక్ష్మ చక్ష్మహే
చ్యుతః షడ్జశ్చతో యశ్చచ్యుతః స్యాత్ పంచమస్తథా
స్యాత్ సాధారణ గంధారోఽంతర గాంధార ఏవచ
స్యాత్కైశిక నిషాదోఽధాస్యః కాకలీనిషాదకః"*

"చ్యుతషడ్జస్వరో లక్ష్యే నిషాదత్వేన కీర్తితః
చ్యుతషడ్జ నిషాదాభిధానం తస్యవిధీతే
చ్యుతస్య మధ్యమస్యోపి గాంధార వ్యవహారతః
చ్యుత మధ్యమోగాంధార సంజ్ఞాఽ స్వక్రియతేమయా
చ్యుత పంచమమాచష్టే లోకామధ్యమ సంజ్ఞయా
అస్మాభిః కథ్యతేసో తచ్చ్యుత పంచమ మధ్యమః
శుద్ధగాంధారకే తత్ర పంచశ్రుతి ఋషభోఽభిధా
సాధారణేపి గాంధారే షట్ శ్రుత్యృషభ నామాచ"**

---

స్వ క. వికృతస్వరవివక్ష

**

నిధి ఇక నాటరాగలక్షణ నివేదనమును గావింప బోవుచున్నాడు నాట రాగము ప్రాచీనతమము. ఇది సంగీతరత్నాకరమున 'నట్ట' నామమున ప్రఖ్యాతము. రామయామాత్యుడు రామరాజభూషణునికి సమకాలికుడు. ఇతడు తన స్వరమేళ కళానిధి రచనమున సంగీతరత్నాకరమును ప్రామాణికముగ గ్రహించెదనని తద్వ్యాఖ్యాతయని వక్కాణ. రామరాజభూషణుడుకూడ నాటి ప్రసిద్ధ సంగీత సంగీతరత్నాకరమును అధికారిక శాస్త్రగ్రంథముగ గ్రహించిన ఇతర సమకాలికులగు రామయామాత్యాదుల వక్కాణమునే నిక్కచ్చిగ పరిగ్రహించినట్లు శ్రీనాథుని 'కర్ణాటబాణి' వలె మధ్యేమార్గముగ తన రాగనివేదన సమన్వయమును గావించు కొనినాడు.

నాటరాగమున తీవ్రగాంధార సంయుక్తమగు తీవ్రతర ఋషభము ప్రయుక్త మగును. ఈరాగమున తీవ్రనిషాద సంయుక్తమగు తీవ్రతర ధైవతము కలదు ఆరోహణమున ధైవతగాంధారములు వర్జ్యస్వరములు, భూషణునినాడు నాటకు ఆరోహణము సంపూర్ణముగా వచ్చును. నేడా రోహణముగూడ సంపూర్ణముగాదు, ఋషభవర్జ్యముకూడ. అనాడీ రాగము సంపూర్ణౌడవ జాతినిచెందినది. ఇందు ఋషభస్వరాత్మకమగు అభిరుద్గత యున్నది. అందు ఋషభమే గ్రహ స్వరము. గాంధార నిషాదములు రెండు శుద్ధములగుటవలన ఇది శుద్ధమేళమగునని ప్రాచీన సంగీతశాస్త్రముల వక్కాణము.

రామరాజభూషణునికి సమకాలికుడగు రామయామాత్యుడు,

"శుద్ధ స్వరస్తు సపమాః షట్ శ్రుతి ఋషభ ధైవతౌ
....చ్యుత మధ్యమగాంధారచ్యుత షడ్జనిషాదకః
స్వరైరమీభిః సంయుక్తః శుద్ధనాట్యశ్చ మేళకః
శుద్ధనాట ప్రభృతయోరాగా అత్రోద్భవంతి హి"* అనినాడు.

ఈ రాగమున సమపలు శుద్ధములు. ఋషభము షట్‌శ్రుతియుక్తము ధైవతము షట్‌శ్రుతి సమంచితము. చ్యుతమధ్యమ గాంధారములు చ్యుతషడ్జ

* స్వ. క. శుద్ధరాగనివేదన

నిషాదములు శంకరాభరణమునందు ప్రయుక్తములగుననుచు రామయామాత్యుడు ఇద్దాని లక్షణమును వక్కాణించెను. మరి రామరాజభూషణుడు రామయామాత్యునకు దీటైన సంగీతకళారహస్యవేది కావున మంచటి పద్యమున రాగనామమును ఉట్టంకించు [illegible]యగు సీసపద్యమున కేశిసచివుని మాటలుగ వల్లకిస్వన సంగతిలో ఎవ్వరో శంకరాభరణరాగమును పాడుచున్నారని ఆరాగమందలి స్వరసంభూతిని స్వీయానుభూతితో వివేచించి" తిమ్మరుడు పంచమ షడ్జశయ్యకొయ్యన నెలుగిచ్చె ఎంత ప్రమదావహ కోకిల పేరులోపమున్" అనుచున్నాడు.

ఇంతకుపూర్వము ఉక్తమైన సంగీతరత్నాకరాది శాస్త్రగ్రంథములందలి నాటరాగలక్షణమున వినబడని చ్యుతపంచమషడ్జనిషాదములు షట్ శ్రుతి ఋషభ ధైవతములను స్వరములస్మరణము రామయామాత్యుని నాటరాగలక్షణమందు రామరాజభూషణుని నాటరాగ వివేచనమునందు వినబడుచున్నవి. రామయామాత్యునకు రామరాజభూషణుడు సమకాలికుడగుటచే స్వరమేళకళానిధియందాతడు ఉట్టంకించిన వికృతిస్వరవివేచనను అవగాహనము చేసికొని యుండుననుట స్పష్టము.

"సప్తానాం వికృతానాంతు నోద్దేశం లక్ష్మ చక్ష్మహే
చ్యుతః షడ్జశ్చ్యుతో యశ్చచ్యుతః స్యాత్ పంచమ స్తథా
స్యాత్ సాధారణ గంధారోఽంతర గాంధార ఏవచ
స్యాత్కైశిక నిషాదోఽథాన్యః కాకలీనిషాదకః"*

"చ్యుతషడ్జస్వరో లక్ష్యే నిషాదత్వేన కీర్తితః
చ్యుతషడ్జ నిషాదాభిధానం తస్యవిధీతే
చ్యుతస్య మధ్యమస్యోఽపి గాంధార వ్యవహారతః
చ్యుత మధ్యమోగాంధార సంజ్ఞాఽ స్యక్రియతేమయా
చ్యుత పంచమమాచష్టే లోకామధ్యమ సంజ్ఞయా
అస్మాభిః రక్ష్యతేనో తచ్చ్యుత పంచమ మధ్యమః
శుద్ధగాంధారకే తత్ర పంచశ్రుతి ఋషభోఽభిధా
సాధారణేపి గాంధారే షట్ శ్రుత్యృషభ నామాచ"**

---

* స్వ. క. వికృతస్వరవివక్ష
**

నిధి ఇక నాటరాగలక్షణ వివేచనమును గావింప దొరకొనుచున్నాడు నాట రాగము ప్రాచీనతమము. ఇది సంగీతరత్నాకరమున 'నట్ట' గావ్యవహృతము. రామయామాత్యుడు రామరాజభూషణునికి సమకాలికుడు. ఈతడు తన స్వరమేళ కళానిధి రచనమున సంగీతరత్నాకరమును ప్రామాణ్యముగ గ్రైకొనలేదని తద్వ్యాఖ్యాతాని వక్కాణ. రామరాజభూషణుడుకూడ అటు లేవలను సంగీత సంగీతరత్నాకరమును అధికారిక శాస్త్రగ్రంథముగగైకొనక ఇరు సమకాలికులగు రామయామాత్యాదుల వక్కాణమునే నిక్కచ్చిగ వ్యక్తీకరింపక శ్రీనాథుని 'కర్ణాటబాణి' వలె మధ్యేమార్గముగ తన రాగవివేక సమన్వయమును గావించు కొనినాడు.

నాటరాగమున తీవ్రగాంధార సంయుతమగు తీవ్రతర ఋషభము ప్రయుక్త మగును. ఈరాగమున తీవ్రనిషాదసంయుతమగు తీవ్రతర దైవతము కలదు ఆరోహణమున దైవతగాంధారములు వర్జ్యస్వరములు, భూషణునినాడు నాటకు ఆరోహణము సంపూర్ణముగా వచ్చును. నేడా రోహణముగూడ సంపూర్ణముగాదు, ఋషభవర్జ్యముకూడ. ఆనాడీ రాగము సంపూర్ణౌడవ జాతికిచెందినది. ఇందు ఋషభస్వరాత్మకమగు అభిరుద్గత యూర్చనకలదు. ఇందు ఋషభమే గ్రహ స్వరము. గాంధార నిషాదములు ఇందు శుద్ధములగుటవలన ఇది శుద్ధమేళమగునని ప్రాచీన సంగీతశాస్త్రముల వక్కాణము.

రామరాజభూషణునికి సమకాలికుడగు రామయామాత్యుడు,

"శుద్ధ స్వరస్తు సమపాః షట్ శ్రుతశ్చర్షభ దైవతే
....చ్యుత మధ్యమగాంధారచ్యుత షడ్జనిషాదకః
స్వరైరమీభిః సంయుక్తః శుద్ధనాట్యశ్చ మేళకః
శుద్ధనాట ప్రభృతయోరాగా అతోభవంతి చ"* అనినాడు.

ఈ రాగమున సమపలు శుద్ధములు. ఋషభము షట్ శ్రుతియుక్తము దైవతము షట్ శ్రుతి సమంచితము. చ్యుతమధ్యమ గాంధారములు చ్యుతషడ్జ

* స్వ. క. శుద్ధరాగవివేచన

నిషాదములు ఈరాగమునందు ప్రయుక్తములగుననుచు రామయామాత్యుడు ఇద్దాని లక్షణమును వక్కాణించెను. మన రామరాజభూషణుడు రామయామాత్యునకు ధీటైన సంగీతకళారహస్యవేది కావున మునుపటి పద్యమున రాగనామమును ఉట్టంకించి తదాపాదియగు నీపద్దియమున కేళీసచివుని మాటలుగ వల్లకిస్వన సంగతిల్ ఎవ్వరో ఈనాటరాగమును పాడుచున్నారని ఆరాగమందలి స్వరసంభూతిని స్వీయానుభూతితో వివేచించి" తన్మృదు పంచమ షడ్జకయ్యకొయ్యన నెఱిగిచ్చె వింటె ప్రమదాకుల కోకిల కేకిలోకమున్" అనుచున్నాడు.

ఇటీఃప్రాచ్యము ఉక్తములైన సంగీతరత్నాకరాది శాస్త్రగ్రంథములందలి నాటరాగలక్షణమున వినబడని చ్యుతపంచమషడ్జనిషాదములు షట్‌శ్రుతి ఋషభ ధైవతములను స్వరములస్మరణము రామయామాత్యుని నాటరాగలక్షణమందు రామరాజభూషణుని నాటరాగ వివేచనమునందు వినబడుచున్నవి. రామయామాత్యునకు రామరాజభూషణుడు సమకాలికుడగుటచే స్వరమేళకళానిధియందాతడు ఉట్టంకించిన వికృతిస్వరవివక్షను అవగాహనము చేసికొని యుండుననుట స్పష్టము.

"సప్తానాం వికృతానాంతు సోద్దేశం లక్ష్మ చక్ష్మహే
చ్యుతః షడ్జశ్చుతో యశ్చచ్యుతః స్యాత్ పంచమ స్తథా
స్యాత్ సాధారణ గంధారోఽంతర గాంధార ఏవచ
స్యాత్కైశిక నిషాదోఽథాన్యః కాకలీనిషాదకః"*

"చ్యుతషడ్జస్వరో లక్ష్యే నిషాదత్వేన కీర్తితః
చ్యుతషడ్జ నిషాదాభిధానం తస్యవిధీతే
చ్యుతస్య మధ్యమస్యోపి గాంధార వ్యవహారతః
చ్యుత మధ్యమోగాంధార సంజ్ఞాఽ స్వక్రియతేమయా
చ్యుత పంచమమాచష్టే లోకామధ్యమ సంజ్ఞయా
అస్మాభిః కథ్యతేసో తచ్చ్యుత పంచమ మధ్యమః
శుద్ధగాంధారకే తత్ర పంచశ్రుతి ఋషభోఽభిధా
సాధారణేపి గాంధారే షట్ శ్రుత్యృషభ నామాచ"**

---

స్వ క. వికృతస్వరవివక్ష

**

చ్యుతషడ్జ స్వరము నిషాదమే కావున దీనిని చ్యుతషడ్జనిషాద మనియు అనవచ్చును. చ్యుతమధ్యమము గాంధారమే యగును. కావున దీనిని చ్యుత మధ్యమ గాంధారమని వచ్చును. చ్యుతపంచమము మధ్యమమే యగును. కావున దానిని చ్యుతపంచమ మధ్యమ మనవచ్చును. శుద్ధగాంధారము పంచశ్రుతి ఋషభ మగును. సాధారణ గాంధారము షట్ శ్రుతి ఋషభమగును. కావున ఈనాటరాగ మునకు సమగ్రలక్షణముగ సంగీతచూడామణి ఉద్ధరణమగు నిద్దానిని గ్రహింప వచ్చును.

"షట్ శ్రుత్యృషభ అంతరగాంధార షట్ శ్రుతి ధైవత స్వరకా
కలేనిషాద ఇతరశుద్ధ స్వరారోహావరోహే గద వర్జితంః చ
సాన్యాసాంశ" అని నాట రాగలక్షణము గోచరించుచున్నది. దీనినిబట్టి ఈనాటరాగమున ఋషభముకన్న రెండు అంశములెక్కువగు షట్ శ్రుతి ఋషభము సాధారణ గాంధారమికన్న నెక్కుడుగ అంతరగాంధారముండునని తెలియుచున్నది. చ్యుతపంచమము శుద్ధమధ్యమముకన్న నొక అంశమెక్కుడుగ నుండి మధ్యమముగనేనిట వల్కును. షట్ శ్రుతి ధైవతము చతుశ్శ్రుతి ధైవతముకన్న రెండంశములు ఎక్కుడుగనుండును. నిషాదము కాకల నిషాదము కన్న నెక్కువ అంశలో చ్యుతషడ్జముగ వల్కును. ఇక పరిశిష్టయగు షడ్జమ మునకు వికృతిలేదు. ఈసంగీత శాస్త్రాంతరిత లక్షణముల గమనించి పద్యమున నించినాడు కవియనుట స్పష్టము. ఆద్యములగు ఘనపంచకమార్గి రాగములలో నాటమొదటిది ద్రుహిణోద్దిష్టములగు అనాదిరాగములు మార్గిరాగములు. కావున ఇది దేవలోకాయాతములనుట స్పష్టము. ఇట నాటనామమును "నానాటన్" అను పదమున నిక్షేపించి ఆ గానము నగభేది పీటగల గంధర్వాప్సరో గీతవిద్యా నైపుణ్యములకు సంవాదిగామున్నట్లు ఉపమించినాడు. అంతేకాక ఈరాగము నందలి స్వరసమామ్నాయమును వ్యక్తముగావించి కవి వల్లకీరవ సంగీతిన ఇద్దానినెవరో గానముచేయుచుండగానందు అంతరితమగు మృదుపంచమషడ్జ శయ్యకు కోకిలకేకి లోకములు వెలుగునిచ్చుచున్నవనుచు ఆకూజితములందమరి యున్న పంచమ షడ్జస్థితినిట్లు వివేచినాడు.

"షడ్జం మయూరో వదతి .... పుష్పసాధారణే కాలేపికః కూజతి పంచమ"మ్మని షడ్జ పంచమాదులగు సప్తస్వరములకు ప్రతీకలయిన పశుపక్ష్యాది

రవములు ఉత్తమములు. తదనుసారిగ ఇట కోకిలములు కేకులు తాము స్వకపమగు పంచమషడ్జముల పల్కుచుండుగా నీరాగమునందలి పంచమషడ్జములు చ్యుతములై ధ్వనించినవని ప్రమదాకులములైనవియై విజయగర్వముతో ప్రముదితములైనను తమరవములు చ్యుతములైనందులకు ఆకులములై ప్రతిధ్వనులీనినవని రామరాజ భూషకవీంద్రుడిట సన్నివేశగతముగ ప్రస్తావించి తన అసాధారణ రాగవివేకము ప్రదర్శించినాడు.

"నానాసూన వితాన వాసనల నానందించు సారంగమే
లా నన్నాల్లదటంచు గంధఫలి బల్కాక్రకం దపంబంది యో
షానాసాకృతిఁదాల్చి సర్వసుమనస్సౌరభ్య సంవాసియై
పూనెం బ్రేక్షణమాలికా మధుకరీ పుంజంబు లిర్వంకలన్" అనునీ పద్దియ

---

* నాట రాగారోహణ - సగామ పనిసా
నాట రాగావరోహణ - సనిపా మరీసా

"పామపా మగమ - గామగామ రిస - రీసరీస సనిపా - పిసరీ - ససనీ రిసా" ఇత్యాదిగ ఈ నాటరాగసంచారము సాగును.

పారిజాతకారుడు—

"అతి తీవ్రతమోతః స్యాన్మస్తు తీవ్రతరో మతః
ధస్తు తీవ్రతరోనిః స్యాత్తు.... షడ్జాది మూర్ఛనే
సన్యాసే మధ్యమా.... చ రాగే సారంగసంజ్ఞకే
వాచస్పతీ సుమేలశ్చ సారంగః సముజాయతే" పారిజాతిః రా.ప్ర. 402

సన్యాసం సాంశకం చైవ సషడ్జః గ్రాహముచ్యతే
ఆరోహణేషు సంపూర్ణమవరోహే గవర్జితమ్
సరిగమ పదనిస - సనిదపమగరిస" తృతీయ - 4

ఇది ప్రతి మధ్యమ రాగము.

ఇక మధుకరీ రాగలక్షణము సంగీతచూడామణి (జగదేకమల్ల) యందు గన్పట్టుచున్నది.

ఖున సారంగమధుకరీ రాగనామము ధ్వనించి తద్రాగలక్షణ సమన్వయముగూడ నీ గానకళాధురీణుడు గావించుచున్నాడు.

సారంగమునకు సాలంగమనియు నామాంతరము దృష్టము. ఈ సారంగ రాగలక్షణము గోవిందాచార్య కృతమగు సంగ్రహ చూడామణియందుకూడ వివృతముగుటవలన నిదియెన్నడు ప్రచురితము కాలేదనుట స్పష్టము. రామరాసు రాగస్వరూపమున విప్రతిపత్తి మాత్రము గోచరము.

సంగీతశాస్త్రమున సారంగరాగమునము గాంధారస అవరోహణమున వర్జ్యమని వ్యక్తము. నేటి గానకోవిదులు ఈరాగస్వరూపము ఆరోహణావరోహణలలో మారిపోయినను రాగసంచారమును ఇప్పుడీ విధము గావించు చున్నారు.

సరిసపామ దాపా సాస నీదాపాదపమరీ - గమరీసా
పమద పాపమ నిపాపమ - సనిదపమ - రినినిదపమ
దాపమ పమమ రీసా

సాసా నిద పదపమ దపాపమ రిగ మరిస అని ఈరాగసంచారమంతటి యందుటను గాంధారము క్వాచిత్కముగ గోచరించుచున్నది.

"నానాసూన వితానవాసనల" అనగా నానావిధ సూనవర్ణవితాన సంకేతములగు వితతస్వరముల నానందించి సారంగము ఏలనో తన అవరోహణమున ఒల్లదంచు గంధఫలి గాంధారస్వరము సంకేతము ఆదిగాలఁగుటేకాక తద్గత స్వర్ణ పర్ణములలనుగూడ గాంధారమునకు సంకేతమగు కనకచంపకము-(సంపెంగపువ్వు)

---

"గతారా మంద్రమధ్యాశ్చ గ్రహాంశన్యాసధైవతా
సపస్వరాచ్చ పూర్ణాచ మతా మధుకరీతిసా" (మతంగ ప్రోక్తబృహద్దేశి)

"మధ్యము మంద్రతార గాంధారాంశక గ్రహన్యాసా
సంపూర్ణం సమశేషా మధురరవ మధుకరీప్రోక్తా" (భరతకోశః)

మనమునగుంది తపంచాచరించి సుమనస్సౌరభ్య సంవాసమై తారాగాంధారమై మధుకరీరాగమున నిర్వ్యంకలన్ అనగా ఆరోహణావరోహణముల రెంటియందు ప్రేక్షణీయమైన గాంధారస్వర ప్రవృత్తిపై మన సంగీతకళారహస్యనిధి ఇట చమత్కరించుచు సారంగమధుకరీ రాగములరెంటిని వివేచించినాడు.

"ఇది సంధింపంగ వేళయంచు వసురాజేంద్రుండు నీరంధ్రనీ
రదవార ప్రతిసీర కల్పాడిన తారాభర్తలీలన్ లతా
చ్ఛదసంబాధికఁబాసి నిల్చెనెదుటన్ సారంగరాగభ్రమ
న్మద భృంగీరుతి వందిమాగధ కథామాధుర్యముం జెల్వగన్"*

సారంగ రాగలక్షణమును సంగ్రహ చూడామణికారుడు,

"వాచస్పతి సుమేలశ్చ సారంగో సమజాయత
న్యాసం సాంశకంచైవ స షడ్జ గ్రహముచ్యతే
ఆరోహణే సంపూర్ణమవరోహణే గవర్జితః"** అనినాడు.

రాగవిబోధకర్తయగు సోమనాథుడీ రాగలక్షణమును—

"సారంగరాగమేళే తీవ్రతర రితీవ్రతమగ మృదుపాశ్చ
తీవ్రతమ దా మృదుసా శుచి.... న్మఖరాగః
"సంపూర్ణ సారంగః సాంశన్యాసగ్రహోఽపరాహ్ణరుచిః"*** అని రాగవేళనుకూడ సంసూచించినాడు.

ఇక సంగీతపారిజాతకారుడగు అహోబలపండితుడు—

"అతి తీవ్రతయోగః మస్తుతీవ్రతరో మతః
దస్తు తీవ్రతరో నిః స్యాత్తీవ్రః షడ్జాదిమూర్ఛనే
సన్యాసీ మధ్యమాంశేచ రాగే సారంగసంజ్ఞకే"**** అని తెలిపినాడు.

---

* వ. చ. iii. 45

**

***

****

ఈ సారంగరాగము భూషణుని కావ్యమునుండి ప్రథితమై అర్వాచీన కావ్యములందు ప్రాచుర్యమునందియుండును. ఈ సారంగరాగనామము ప్రాచీన మగు సంగీతరత్నాకరమున నాపరిశోధనమున కందలేదు. ఈకవి కర్వాచీనులగు పైవారి వక్కాణములలో మాత్రమే ఈరాగలక్షణము కన్పట్టినది. ఈ రాగమునకు గాంధారము అవరోహణమున వర్జ్యస్వరమని యొకవాదమున్నది. మరల నీ రాగమునకే తీవ్రతమయగు ఋషభ పంచమములతోపాటు గాంధారముగూడ తీవ్రతరమని మఱియొక వాదమున్నది. సహజముగ రాగవిషయకముగనున్న మతప్రభేదమ్ములను పరిశీలించి చెవికి ఇంపనిపించిన తనకునచ్చిన శ్రోతలు మెచ్చినరీతినే భూషణకవి అటనట సముపాదించుననుట ఇతఃపూర్వము "అరిగా పంచమమేవగించి" అను పద్యమున దృష్టము. అదేరీతిగ "నానాసూన వితాన వాసనల" అను పద్దియమున సారంగ రాగాంతరితస్వర ప్రవృత్తియందలి గాంధారస్వరలోపము ఒకవంక చూపినాడు. ఇపుడీ పద్దియమున సారంగరాగ స్వరూపమునందలి మంతారమగు గాంధారప్రాముఖ్యతను సంసూచింప దొరకొను చున్నాడు. సంగీతశాస్త్రములందు స్వరగతాధిష్ఠాన దేవతారీతి యున్నది. ఏత ద్రీత్యనుసారముగనిట ఈ సంగీతవేది గాంధార స్వరసంబంధియగు శశాంకుని (రాజు) వసురాజేంద్రుడునుటలో రాజు=చంద్రుడు అను నుపమానముగ తారా భర్తను రూపించి తీవ్రతర గాంధారచారమునిట సంకేతించినాడు. నీ రంధ్ర నీరదవారప్రతిసేర యందలి మదభృంగిత్వమునందలి అసితప్రభయందు పంచమ స్వరప్రవృత్తినికూడ సంకేతించి మధ్యాహ్నవేళలో గిరికాప్రథమ దర్శనము వసురాజునకు కల్పించి ఈరాగము అపరాహ్ణమున గానోపయోగియని తెలిపి నాడు.* అదియేకాక ఇది బిరుదుకైవారాదికములను వంది మాగధగీతరీతిలో గానముచేయుట కనువైనదను రాగభావనను గూడ తెలిపినాడు. ఇది అపరాహ్ణ కాలమున గానము చేయదగినది గావున మధ్యందినకృత్యములను నృపతి నెరవేర్చ వలయుననా హెచ్చరికలోనిది గానము చేయబడినదేమో! ఈరీతిగ ఈపద్యమున సారంగరాగభావోత్కర్షను వ్యక్తీకరించి ఈ సంగీతకళారహస్యనిధి తన రాగ రత్ననిధిలో సారంగరత్నమును నిక్షేపించుట ముదావహమగు విషయము.

---

* ఇతి సారంగః ద్వితీయప్రహరోక్తం సం. పా. 99

"తనకప్పు నెఱిగప్పునన నెఫూనిగౌరీ స
మాఖ్యమించఁజనించి షట్టియార్య
తన చాపలము చూపుల నెచూపి సిరులెల్ల
కడఁజల్లవచ్చిన కమలపాణి
తన పాండిమము నవ్వులనెయుంచి గాంధర్వ
మవనికిఁదెచ్చిన హంసయాన
తన యదృశ్యత నడుమనెదాల్చి సాంగమై
మొనసినయతనున మ్మోహలిద్య
గావఁయు నీపెలఁది దీనికాంతి గుణకళాభి
రూప్యము లెఱిగించి యామహేశు
నానగోద్ధారకుని నాప్రజాధినాదునా జగన్మో
హనుని దెత్తునసుచు చనియె...."* అను పద్యమునందు గౌరీ
లక్షణ సమన్వయంబు గావింపనొరకొనినాడు. గౌరియనునది సంగీతశాస్త్రమున
ఒక రాగముగ, ఏలాపదదేవతగ వృత్తముగ దృశ్యమానము. గౌరీరాగము
మార్గిసంగీతరీతిలో ప్రముఖమగు రక్తిజనకమగు రాగము. దీనికి గౌడియను
నామాంతరముకూడ దృష్టము—

రాగవిషయకముగ నిది ఋషభస్వరాదికము.

"రిస్వరాది స్వరారంభారి కోమలధ కోమలా
గతీవ్రాసాని తీవ్రాచ గౌరీగాంశ స్వరాత్మనా
దారోహే అవరోహేచసాని కంపన మనోహరా
ఆరోహే యది గాంధారో మధ్యమవిధి మూర్ఛనా"**

ఇందు ఋషభధైవతములు కోమలములు గాంధారనిషాదములు. తీవ్రములు
ఇందువాది స్వరమునిషాదము సంవాది గాంధారము. ఆరోహణమున గాంధార
ధైవతములు వర్జ్యములు, కావునవిది ఔడువ సంపూర్ణజాతికి చెందినది.

---

* వ. చ.

** సం. ర. అకాదమ్ప్రతి.

ఆరోహణము 'రిగమ పదనిస' అవరోహణము. 'సనిద పమ గరిస' మధ్యమ స్వరావధి పర్యంతసంచారము ఈరాగమునునుండును. గోధూళివేళ ప్రయుక్త మగు పార్వతీప్రియంకరమగు రాగమిది. రత్నాకరమున నిది యిట్లు నిర్వచితము.

"హిందోళభాషా గౌరీ స్యాత్ షడ్జన్యాస గ్రహాంశికా
పంచమోత్పన్న గమకా బహుళాధరి వర్జితా
షడ్జ మంద్రాప్రయో_క్తద్యా ప్రియ సంభాషణోబుధైః"
"గౌరీచ వక్రా సంపూర్ణాయ స్వాం వాదీచ పంచమః
సంవాదినీ చ షడ్జేన కృత్రిమర్షభ ధైవతా
మధ్యమా ఖ్యాగతా త్రాఽవ్యవరోహే క్లిష్టమధ్యమా
శుద్ధే స్వాదు_త్తరాన్మే చ యామేతుర్యగ తేదినే"*

"పార్వత్యాః రాగినీ చైషా తస్మాద్గౌరీత్యుదీరితా" దీని ధ్యానముద్రా స్వరూప స్వభావమునిట్లు గమ్యమాన మొనర్చుచున్నది.

"శ్యామా మదోన్మ_త్త కళేబరా కరా విభాతి తంత్రీకరయోః సుగాయికా
వితానతయ_త్తాన విభూషిత గతిర్గీత స్వగౌరీరసికాది నాంతరే"** సంగీత దర్పణమునందీ గౌరీ రాగధ్యానము.

"నివేశయంతీ శ్రవణేవసంత సమామ్రాంకురం కోకిల వాదరమ్యా
శ్యామా మధుస్యందిత సూక్ష్మనాదా గౌరీ యము_క్తా కిలకోహలేన"***

రామరాజభూషణ కవింద్రుడొక్కొకచో రాగసమన్వయమును స్వరూప ధ్యానమునుబట్టిచేసి స్వరసమన్వయమునుకూడ చేయుటకద్దు. అదే పద్ధతిలో నిట గౌరీరాగ స్వరూపమున గిరికా సౌందర్యోత్కర్షను రాగవినోదమునందలి ఈ గౌరీస్వరూపధ్యానములో సంగీతపారిజాత, సంగీత దర్పణములందలి ధ్యానరీతిని సమన్వయించి గమ్యమూచు మొనర్చిచున్నాడు.

---

* సం. ర. అకాడమీప్రతి
** సం. పా. (బొరంభాప్రతి)
*** సం. ద. 226 (బొ.ప్ర)

"క్షీరోద్గారి వా సా సహజ సుహాసా ప్రలంబ బాహులతా
కర ధృతీ సాహిచ్ఛత్రా గౌడీ గౌరీ సరోజాక్షి"*

గౌరీ రాగ స్వరూపిణిగ నీసంగీతరహస్యనిధి రాగధ్యాన స్పృహతో వెలార్చిన గిరిక సుశ్యామ కేశపాస వీణాపాణి నితాంత తానవిభూషిత గానరసిక, కోకిల నాదరమ్య, మధుస్యందిత సూక్ష్మనాదక్షీరోద్గాసిత శుభ్రవస్త్రాన్విత సహజ సుహాసిని. ఏవం విధగుణ గరిష్ఠగా గిరికను రామరాజభూషణకవీంద్రుడు తన పద్దియమందు నిట్లు నిక్షిప్తమొనర్చెను. ఈ లక్షణములను తనకవ్పు నెఱి గొప్పననెపూని గౌరీసమాఖ్యను మించుటయందు పాండిమను నవ్వులనెయుంచి అవనికి తెచ్చుటయందు వీణావాదన ప్రౌఢిచే చెలులరంజిల్ల చేయుటయందు సంసూచించినాడు. ఇక స్వరసంచారవిహిత స్వరరీతినే పద్దియమున నీ సంగీత కళారహస్యనిధి గూఢరీతిలో నిట్లు పగూహనము గావించును.

ఈ రాగమున సంవాది గాంధారము. గాంధారమునకు 'గ' సంకేతము కావున గాంధార సంవాదిత్వము అభంగశ్లేషమున విరిచి నెఱి, గ+ఒప్పు+నెఱి గొప్పు 'గ' సాధిలచి ఈరాగము గౌరీసమాఖ్య జనించినట్టి ఆర్య (మార్గి) రాగ మని సంసూచితముగావించెను. అట్లే ఋషభస్వరమందు కోమలముగాన సిరిలలో 'ని' ని పలికించి అద్దానికోమలత్వమును శృతిమర్దభత్వమును చాపలముచూపులనే చూపిసిరులెల్లకడ జల్లుటలో సంకేతించును ఇక పంచమమునకు సంక్షేపరూపము 'మ' లేకపాయును గావచ్చును. గౌరీచ వక్ర సంపూర్ణయసాంవాదీచ పంచమః" కావున పాండిమమున పంచమస్వర సంకేతమగు 'పా' ను ధ్వనించి అద్దానినామె నవ్వులనెయుంచి దేవలోక స్థితమగు గాంధర్వమునే అవనికి తెచ్చినదనినాడు. ఇట్లు పీఠైనంతవరకు ఈ సంగీతకళారహస్యనిధి ఈరాగస్థిత స్వరచారము ఆ రాగమున గమ్యమానమొనర్చి గౌరీరాగాత్మికయగు గిరికాకాంత గుణకళాభి రూపంబుల వెలార్చినాడు.

---

* సం. ద. 226 (బొ. ప్ర)

"ఆ జాబిల్లి వెయింగు వెల్లికలడాయన్ లేక రాకానిశా
రాజశ్రీ సఖమైన మోమునంబిటాగ్రంబొత్తియెగ్గెత్తి యా
రాజీవాననయేడ్చె గిన్నరవధూరాజత్కరాంభోజ కాం
భోజీ మేళవివంచికారవ సుధాపూరంబు తోరంబుగాన్" ఈ పద్దియమున ధ్వనించిన కిన్నర వధూరాజత్కరాంభోజ కాంభోజీ మేళవివంచికారవ సుధా పూరంబు రామరాజ భూషణార్య సంచితసంగీత స్వర్ణనిధీ స్వారస్యమునకు నికషోపలము. ఈ కాంభోజీరాగము నేడు హరి కాంభోజి జన్యముగ వ్యవహారముననున్నది. కాని రామరాజభూషణుని కాలమునాటికిది కాంభోజీమేళరాగ మని విఖ్యాతము రాగములలో జన్యజనక విధానము రామరాజభూషణుని కాలము నాటికున్నదియే సంగీతరత్నాకరముననిది కకుభజనిత భాషారాగముగ మాళవ కౌశికభాషా రాగముగ వివిధరీతులలో నుట్టంకితమైనది.

సంగీత పారిజాతముననిది,

"కాంభోజీ తీవ్ర గాంధారాగాంధారాదిక మూర్ఛనా
ఆరోహే మని హీనా స్యాన్మధాంశ స్వరభూషితా
యదా గాంధారహీనా స్యాన్మూర్ఛనా చోత్తరాయతా"* అని వివృత మైనది ఈ కాంభోజినే కామోదియని యందురని పారిజాతకారుడనిరాడు.

---

"కాంభోజీ కకుభస్యస్యాద్భాషా ధాంశగ్రహాంతిమా - సద సంవాదినీ పూర్ణారిఫ సంవాదినీ తథా అనునది కకుభభాషారాగమగు కాంభోజీరాగ లక్షణము, అట్లే

పాద్యాన్తాంశాని బహుళా గమత్తారి ప్రోజ్ఝితా - కాంభోజీ మంద్రషడ్జాది భాషామాళవకౌశికే" అనునది మాళవ కౌశిక విభాషా రాగలక్షణము సంగీత రాజమునినది.

"ఖాన్తగ్రహాంశాసని దైశ్చభూరిః కాంభోజీ కేయం కకుభస్యసూతా
భాషాంగకం యాష్టిక సమ్మతస్య కాంభోజికా తుల్యవరాచపూర్ణా
ఇమాం శ్రీషడ్జాం విధరిం విభోధి హిందోల జామామః అతద్వి లోక్య
ఋచౌ వియుక్తా కరుణే రసేచ సంచారివర్ణప్రగుణాం వదంతి" అని ప్రోక్తమైనది.

* సం. పా. 420

పారిజాతకారునికన్న పూర్వుడైన చతుర దామోదరుడీ కాంభోజిని కామోదియనియే వ్యవహరించి

"ధాంసన్యాసగ్రహా పూర్ణా పౌరవీ మూర్ఛనామతా
మల్లారని కటే గేయా కామోదీచ నిగద్యతే
శివభూషణ కేదారయుక్తా సర్వసుఖప్రదా"* అనుచు అద్దాని ధ్యానమును

"పీతం వసానా వసనం సుకేశా వనేచరంతీ పికనాదధూనా
విలోకయంతీ విదిశోఽతి భీతా కామోదికా కాంతమనుస్మరంతి"** అని ప్రవ్యక్తము గావించినాడు.

సంగ్రహ చూడామణియందు కాంభోజీమేళలక్షణము. హరి కాంభోజిరాగ జన్యమగు కాంభోజీరాగలక్షణముకూడ వేర్వేరుగనుక్తములైనవి. ఈ రెండింటిలో రాగరసప్రవృత్తినిబట్టి కాంభోజీమేళలక్షణమే రామరాజభూషణోక్త రాగలక్షణ సంవాదిగనిట్లు గోచరించుచున్నది.

"చమత్కృతశ్రుతి షభాంతర గాంధారభూషణభూషితాః
చతుశ్శ్రుతి ధైవతా చ సకైశిక నిషాదితా
లసంత తర శుద్ధాచ పూర్ణారోహావరోహతా
షడ్జన్యాస గ్రహాంశ్చ........బేర్జశోభితా
కరుణరస సంపూర్ణా మహీ సౌభాగ్యధాయినీ
హరి కాంభోజి కావ్యాష్టవింశోఽయ మధికారకః"***

రామరాజభూషణాఖ్యుని సమకాలికుడు సహోద్యోగివియగు రామయామాత్యుడీ కాంభోదీరాగమును మేళమనక జన్యమనక ప్రకృష్టమగు రాగముగనిట్లు ఉట్టంకించినాడు.

---

* సం. పా. 420
** ,, 420
*** సంగ్రహ చూడామణి (టౌ.ప్ర)

"సన్యాసా స్గ్రహసాంశా సంపూర్ణాపి క్వచిత్ క్వచిత్
ఆరోహేమని వర్జ్యాఽసౌ కాంభోజీ సాయమీరితా"

ఏవంవిధ ప్రోక్తములగు కాంభోజీరాగలక్షణముల వివేచించిన రామరాజ భూషణోదితము కాంభోజీ మేళరాగమనియే స్పష్టమగుచున్నది. ఈ కాంభోజి అత్యంత ప్రాచీనమగు సంగీతరత్నాకరమున తదనంతర సంగీతశాస్త్రములందు కకుభభాషారాగముగను మాళవకౌశికా విభాషారాగముగ నుట్టంకితమై తదనంతర కాలమున భాషాంగ రాగముగగూడ ప్రవర్తితమైనది. రాగప్రక్రియా వివేచన ఎట్లున్నను రాగభావవిషయమున మాత్రము చాలవఱకు కరుణరసస్యందిగనే యిది సంగీతశాస్త్రకారుల భావవీథిలో ధ్యానాను సంధానాదికములు నిలచినది. చతుర దామోదరుడు రాగధ్యానమున ఒసగిన—

"వనే వదంతీ పికనాద రూనాకామోదికా కాంతమనుస్మరంతీ" యను రాగమూర్తి మోమున పట్టాగ్రంబొత్తి యెగ్గెత్తి ఏడ్చిన విరహ సహయైన గిరికా స్వరూప స్వభావములకు సంవాది. అట్లే సృపతి కుంభకర్ణుడు వివేచించిన "కువే నియుక్తాం కరుణే రసేచ సంచారివర్ణ ప్రగుణాం వదంతి" యను కాంభోజీ రాగోదీరిత కరుణరస నిష్యందితత్వము శోకరూపిణియై ఎగ్గెత్తి ఏడ్చిన గిరికా హృద్గత భావమునకే దర్పణము పట్టుచున్నది. పూర్వసంగీతకారుల భావనలో కాంభోజీ కరుణరసస్యంది యగుచుండగా అధునాతన సంగీతవిదులు ఈకాంభోజీ గంభీర రాజస గుణోత్కర్షాత్మకమగు రాగమనుచున్నారు. వీరు త్యాగరాజార్య రచితమగు "మా జానకిని చెట్టపట్టగా మహారాజు వైతివి" అను కీర్తనను మూదలగజూపి త్యాగరాజస్వామి ఆ కీర్తనమందు వ్యక్తీకరించిన గాంభీర్య భావాతిశయమును ఉట్టంకించుచున్నారు డా॥ శ్రీపాద పినాకపాణిగారు కూడ కాంభోజి కరుణరస స్యందియగు రాగమెంత మాత్రము కాజాలదని ఇతి గంభీరముగ దర్పయుతముగ తీవిగ సంతరింపవలసిన సన్నివేశముల గానము చేయదగినదని ఉపాలంభనయుత భాషణమునది ప్రయుక్తమగుట కనుపై నడచు దృఢాభిప్రాయమును కర్ణాలకేగి నేను వీరితో సంభాషించినపుడు వ్యక్తము గావించినారు. అర్థవంతమగు వీరిభావనకు ఉపస్కారకముగ గిరికాశోకఘట్ట మును అన్వయించుకొన వచ్చును. నిస్సహాయస్థితిలో సర్వస్వమును కోల్పోయిన

రీతిలోగాక గిరిక విప్రలంభావస్థలో భవిష్యజీవితమున ప్రియసమాగమము ఆకాంక్షించియు తత్కాలికమగు ఎడబాటును ఓపలేకరోదించినది. కావున ఇది మానవిప్రలంభావస్థయగునేగాని కరుణవిప్రలంభము కాజాలదు. మహాశ్వేతయు రతిదేవియు భర్తను గోల్పోయి రోదించిన సన్నివేశము వేఱు. గిరిక సత్యభామాదులగు ప్రబంధనాయికలు ఏడ్చిన బుడిబుడి ఏడ్పులు వేఱు. కావుననే ఇట్టి మానవిప్రలంభములందలి కరుణరసగంధితములగు సన్నివేశములందే కాంభోజియే ప్రయుక్తము కాదగియున్నది. రామరాజభూషణుని గిరిక కాంభోజీమేళ విపంచికారవ సుధాపూరంబు తోరంబుగా ఎడ్చినతీరు నచ్చి మెచ్చి కీ.శే. పద్మశ్రీ స్థానం నరసింహారావుగారు సత్యభామ నిర్వేదమును వ్యక్తముచేయు సన్నివేశముననున్న "ఇకనే గీచిన గీటుదాట" అను పద్యము కాంభోజియందే గానముచేసెడివారు. అదే రీతిగ విచేచించిన గిరికాదేవి యిట చంద్రుడు తన సోదరుడగుట వ్యక్తముగావించి పిదప సోదరునికుండవలసిన ఆత్మీయతా వాత్సల్యాదిక భావములాతని యందు లుప్తములైనవని—

" ఈ వఙ్గుండవు నీటఁబుట్టితిఁజు మీయేనంచు మోమోటపుం
ద్రోవ ల్పెప్పఁగ సిగ్గుగాదె మఱి నీతోఁబుట్టు శ్రీదేవి లీ
లావాసంబు సిరుల్ హరింతువనుచో నయ్యో కళాదుండు చే
తోవీధిన్ సహజాధనాపహరణోద్యోగంబు నెగ్గించునే"* అనుచు నుపాలంభించెను. ఇట రాగలక్ష్మియైన గిరికాదేవి తెలివిమీఱి రాగతనమునే చూపించినది. చీరలు సారెలిచ్చి తనను బుజ్జగించుటకు బదులు తన సోదరుడు ఏచుచున్నాడని పుట్టినింట మారాముచేయు ఆడపడుచువలె స్వంతగోడును సుంత వెళ్లబోసికొని గోముగా కాంభోజీరాగభావ సంయుతముగ ఏడ్చినది. కావుననే ఈ కాంభోజీ రాగభావమున కేవలశోకమేగాక మారాముతోకూడిన మానవిప్రలంభాదిక సన్నివేశానుగుణమగు కరుణరసభావముకూడ నిష్యందమానమగుచున్నదను కొవిన ప్రాచీనార్వాచీన సంగీతవిదుల అభిప్రాయ వైవిధ్యమునకు ఏకాభిప్రాయత కుదురును.

---

* వ. చ. iv - 34

రామరాజభూషణ ప్రోక్త కాంభోజీ రాగభావమునకు ఆలప్తి అమసను.

"గండశైలములకుఁ గరపాదములు వచ్చె
నోయని మెఱయు నాగాయుతములు
హరిణజాతికి మరున్నిరసనోద్ధతి గల్గెనో
యనఁదగ సైంధవోత్కరము
సంభోదములకుఁ బాయనిమించు లొదవెనో
యని మించు మణిమయస్యందనములు
నవలతావళికి యాన విలాస మెసఁగెనో
యనఁబొల్చు సరస కన్యాయుతంబు
లాత్మమణి హేమరజతంబులపుడ యుచిత
తనువులు వహించెనో యనఁదనురు వివిధ
శయన పాత్రాసనములు భూజాని కొసఁగె
హరికృపాలబ్ధశుభశాలి యగలమౌళి"* ఈపద్యము సంగీతరహస్యకళా విధియైన రామనృపభూషణకవి సైంధవీ రాగవివేచన గావించుచున్నాడు. ఈ సైంధవీరాగము ప్రాచీనతమమగు సంగీతరాజరికముల పలుపోకదలలోనున్న భాషారాగముగ వరాటి ఉపాంగముగ పంచమభాషారాగముగ, భాషాంగరాగముగ భిన్నషాడ్జి భాషారాగముగ మాళవకైశిక భాషారాగముగ వివిధ విధములుగ నుట్టంకితములైనవి. ప్రాచీన తమమగు సంగీతరత్నాకరమున ప్రథమ ద్వితీయ తృతీయ చతుర్థ సైంధవములను పేరులతో అసంపూర్ణరాగముగ నుగ్రాతమైనది. సంగీతదర్పణ సంగీతపారిజాతములందు సైందవీనామకముగకూడ అసంపూర్ణ రాగమే. ఏక ప్రక్రియమాత్రముగనే ప్రోక్తమైనది. రామరాజభూషణాచార్యుండిదేదో ఒక పద్ధతికి చెందిన సైంధవీ రాగలక్షణమును వివేచించియుండును.

సంగీతదర్పణోక్తమగు సైంధవీ రాగలక్షణము.

---

* వ. చ, vi , 36

"షడ్జ గ్రహాంశక న్యాసా సంపూర్ణసైంధవీ మతా
మూర్ఛనోత్తరమంద్రాద్యా కైశ్చిత్షాడ వికామ తా
రిహీనాతు భవేన్నిత్యం రసే వీరే ప్రయుజ్యతే"* ఇది.

సంగీతపారిజాతీయమగు సైంధవీరాగలక్షణమిది.

"శుద్ధమేళోద్భవః పూర్ణోధైవ తాదిక మూర్ఛనః
ఆరోహే గనివర్జ్యః స్యాద్రాగః సైంధవ నామకః
ఆమ్రేడితస్వరైరుక్తః స్ఫురితేనచ శోభితః"**

పై గ్రంథములందుక్తమైన సైంధవి సంపూర్ణస్వర సమన్వితముకాదు. సంగీతరాజమున ఉక్తమైనటక్క సైంధవీరాగమొకటి యున్నది. అది దేవరాజ ప్రియాంకరమనికూడ నుట్టంకితమగుచున్నది. ఈ పద్దియములందలి సందర్భము ఇంద్రుడు వసురాజేంద్రునకు వివాహ శుభవేళాపురస్కారముగ ఉపాయనముల నొసగుట. కావున సన్నివేశానుసారము ఇందలి సైంధవీరాగమున టక్క సైంధవీరాగమై ఉండనోపుననిపించుచున్నది. అద్దాని లక్షణమే ఏవంవిధోక్తమై దేవారాజప్రియాంకరమౌ రాగమని తెలియుచున్నది

"షడ్జగ్రామ సముద్భూతః షాడ్జీ దైవతకోద్భవః
గ్రహాంశన్యాసషడ్జశ్చ కాకలీకలనిస్వనః
షడ్జాది మూర్ఛనః పూర్ణః తథాంతర విరాజితః
ఆరోహేవర్ణ రుచిరో మంద్రాద్యంత విభూషితః
స్వల్పపంచ మని స్యాత్ రసేవీరే వియుజ్యతే
టక్క సైంధవరాగోఽయం దేవరాజ ప్రియంకరః"***

---

* సం. ద ((రా.అ) 206
** సం. పా. (రా.ప్ర)
*** స. రా.

ఇమ్మహాకవివరుని రాగవివేకాభినందనానంతరము ఆతడుగావించిన సంగీత శాస్త్రపారిభాషిక పదజాల ప్రక్షేపణమునుగూర్చికూడ ఇట అనుశీలించుట అవసరము అందులకు అద్యమగు నుదాహరణమిది—

"సకలామోదక తాళవృత్తగతులన్ సంగీత సాహిత్యనా
మక విద్యాయుగళంబు పల్కఁగెలికిం బాలిండ్లజోడై సిరుల్
ప్రకటింపన్ నఖరేఖలందు నలఘుప్రస్తారముల్ సేయు స
ర్వకలాకాంతుఁడు ప్రోచుఁబిర్మల మహారాయక్షమావల్లభున్"

ఈ పద్యమున రామరాజభూషణుడు గీతిసాహితిమూర్తిణియగు గీర్వాణికి పతియగు బ్రహ్మదేవునినుతించి ఆదంపతుల సుమానుషస్వరూపా విష్కృతిని గావించుచున్నాడు. ఈ రామనృపభూషణుని సంగీతకళానిధిత్వము రాగవివేకముతో పాటు సంగీతశాస్త్ర పారిభాషిక పదజాల ప్రక్షేపణమునగూడ అనన్యరీతిలో తేజరిల్లినది. సంగీతశాస్త్రములన్నింటిలో ఈసంగీత పారిభాషికములు వివిధాధ్యాయములలో వివరింపబడినవి. అట్టివానిని ఈకవివరుడు పిరివిగ తన సంగీత పాండితికినిధానముగ తనకు సహజసిద్ధమగు ద్వ్యర్థఘటనా సామర్థ్యసంభావితముగ గూఢరీతిలోనీ ప్రబంధములో నిక్షేపించినాడు. కన్నుగలిగి నెమకిన అయ్యవి విశేషార్థసంయుతములై తేజరిల్లును. లేనియెడల అవి సామాన్యార్థ ప్రతిపాదకములై మాటువడియుండును.

ఈపద్యమున కవి సాహిత్యకృత సౌహిత్యుడై సంగీతకళారహస్యనిధియై సరస్వతీస్తుతి వ్యాజమున అవినాభావసంబంధముతో అలరారుచున్న గీతిసాహితుల పరస్పరానుబంధమును ప్రవ్యక్తము గావించుచున్నారు.

"సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయం
ఏక మాపాతమధురం అన్యమాలోచనామృతమ్" అను అభాణకమున సంగీతసాహిత్యోపాసనమున శిశుతుల్యులై నిరంతర స్తనంధయ ప్రాయజీవులై మాతృకరుణాకటాక్షలేశప్రసరణమైన చాలునని ఎడతెగక ఎదురుతెన్నులుచూచు కవిగాయక షత్రులను ఆజగన్మాతయగు వాగ్దేవి అక్కునజేర్చుకొని తనకిరుగడల పొంగిపొరలు గీతిసాహితీస్తన్యమును గడుపార నొసగి తనివార పరిషోషించురీతి ప్రవ్యక్తము గావింపబడినది. అద్దానివిట కేవలము శారదా తనయుడైగాక

* వ. చ. i - 3

బ్రహ్మమానసపుత్రుడు కూడనై విధాతృ స్తవవ్యాజమున ధ్వనించి రామరాజ భూషణ కవివరుడు ఈపద్యమును మలచినాడు.

సంగీతసాహిత్య నామక విద్యాయుగళము సకలామోదకము. అందు ఒకటి ఆపాతమధురము మఱియొకటి ఆలోచనామృతము. ఆరెంటిని కడుపారగ్రోలిన కవిగాయక శిశువు గీతిసాహితీ ప్రపంచమున తుష్టిని, పుష్టిని పొందినవాడగుట వలన అజరామరుడై ఆజానుబాహువై వర్ధిల్లును. ఆతనికి సంగీతమార్గమున తాళము, కవితాధ్వమున వృత్తము ఉపాధేయము, పాధేయముకూడనగును. అది ఆతనికి సంక్రమించిన మాతృప్రసాదము. అట్టి సిపులను ప్రకటించి గీతి సాహితులను ప్రస్తావించు చల్లనితల్లి సర్వకళాదేవి. ఆ జగన్మాతకు తగిన భర్త విధాత ఆతడు నఖరేఖలందు అలఘుప్రస్తారములు చేయగలనేర్పరి. తిరుమల మహారాయాది కృతిభర్తలను ప్రబంధనిర్మాణ ధౌరీయులకు రామరాజ భూషణా దులగు కృతికర్తలను కాచిరక్షింపగల తీర్పరియునతడే. కావుననే అయ్యాది దంపతులకు తగిన కొమరుడై గురులఘు నిర్మాణముతో కవనమును స్వర ప్రస్తారముతో గానమును ఏకత్ర నిర్వహింపగలిగినదక్షుడును తల్లిదండ్రుల ఆస్తిని సంరక్షింపగలిగిన సమర్థుడగు పుత్రుడుగను రామరాజభూషణుడిట నిలచినాడు. కావుననే ఈకవివరుడు ఆదంపతులకు తగిన బిడ్డయై ఈరాగప్రబంధ నిర్మాణధురంధరుడైనాడు. ఈ పద్యమునందలి తాళవృత్తగతులలో సంగీత పారిభాషికము తాళము. సాహితిసంబంధియగు ఛందోపద్ధతికి చెందినది వృత్తము. ఇక అలఘుప్రస్తారములలో గానశాస్త్ర సాంకేతికములు అలఘువు, లఘువు ప్రస్తారములుఅనునవి. లఘుగురుప్లుత కాకపాదాదులు తాళదశప్రాణాంతరితములగు అంగప్రాణ సంబంధులగు షడంగములు. ఇట అలఘువను దానిని లఘువు కానట్టిది గురువుఅను నర్థ ప్రతిపాదకముగ భావించుకొననగును. ప్రస్తారము అనునదికూడ తాళదశప్రాణములలోఒక్కటియే. ఇక సాహితీపరముగఆలోచించిన లఘువు, అలఘువులగు గురులఘువులు ఛందశ్శాస్త్రమున కీలకస్థానముల నిలచు నమట అందరెరిగినదే. ఇక తాళవృత్తగతులన్ అనుటలోని తాళసంబంధియగు ఆవృత్తమును గతియనుదానినికూడ సంగీతసంబంధులుగనే వ్యాఖ్యానించుకొన వచ్చును. ఈ తాళగణనమునందలి అక్షరగణనియమమును చుట్టివచ్చుకాలమును ఆవృత్తమందురు. ఇక గతియనునది స్వరాక్షరనియమమునకు సంబంధించినదై త్రిశ్రచతురశ్ర ఖండమిశ్ర సంకీర్ణగతులకు చెందియుండును. ఇక తాళము

అనునది సంగీతశాస్త్రమున బహువిధవిస్తృత వ్యాఖ్యానార్హము. శ్రుతిలయలు శ్రుతిర్మాతా లయఃపితా అని కీర్తితములై సంగీతమున మౌళికమగు స్థానము లందు నెగడియున్నవి. శ్రుతిగానమునకు లయతాళమునకు ముఖ్యప్రాణసమము. ఈ సువిశాల ప్రపంచమందలి ప్రత్యణువు గ్రహతారాదికముల గమనము పంచ భూతముల అవస్థితి అంతయునొక అనిర్వచనీయమగు లయాత్మికతకు లోబడి తాళబద్ధముగ మసలుచున్నది. ఈతాళమునకు తలధాత్వర్థ ప్రోక్తమగు సూత్రామాధారము.

"తాళ స్తల ప్రతిష్ఠాయామితి ధాతోర్ఘ యిస్మృతః" తలయనెడి ధాతువు ప్రతిష్ఠయందు ప్రవృత్తమగును. ఆ తలయనెడు ధాతువుమీద 'ఘఞ' ప్రత్యయము, ఆది వృద్ధియును రాగా తాళయను రూపమేర్పడును. అద్దానికి సుప్పిత్యయముచేరగ "తాళః" అను శబ్దము ఏర్పడును. దీనిని వ్యుత్పత్తిని "తలంతి గీతవాద్య నృత్తానిఅత్రేతి తాళః" అని బుధులు వ్యక్తీకరించుచున్నారు. ఈ తలంతి ధాతురూపమునకు తిష్ఠంతియను పర్యాయ ధాతురూపమునుగూడ చెప్పికొనవచ్చును. ఇదేకాక "తల్యంతే ప్రకాశ్యంతే నృత్తగీతవాద్యాదయేన తాళః" అని మఱియొక వ్యుత్పత్తిసంగీతకోవిదులచే చెప్పబడుచున్నది. సంగీత రత్నాకరాంతర్గతమైన శార్ఙ్గదేవప్రోక్తమగు వ్యుత్పత్తియిది.

"తాళ స్తల ప్రతిష్ఠాయామితిధాతో ప్రయోగతః
నృత్తం గీతం తథావాద్యం యతస్తాళే ప్రతిష్ఠితః" ఇద్దానికి అర్థసమన్వయ మిది. తలప్రతిష్ఠాయాం అనుధాతుభవము తాళముగాన నృత్తగీతవాద్యములు తాళ మందే సుప్రతిష్ఠములగుచున్నవని ఎఱుగనగును. అంతేకాక—

"తకారశ్శంకరః ప్రోక్తో లకారశ్శక్తిరుచ్యతే
శివశ్శక్తిసమా యోగాత్తాళ నామాభిధీయతే" అభికూడ ప్రోక్తమై శివ శక్తిసంయోగమగు అర్ధనారీశ్వర త్వమందలి కుడియెడమలనున్న హస్తద్వయ సంయోగమున తాళస్వరూపము సముద్భవమగు చున్నదని గమ్యమానమగు చున్నది. ఈ తాళమునకు,

"తాలోమార్గో క్రియాంగాని గ్రహో జాతిః కళాలయః

యతిః ప్రస్తారకశ్చేతి తాళప్రాణాః దశస్మృతః" అని దశవిధములగు తాళప్రాణములున్నవి ఇట్టి తాళదశప్రాణములలో అంతరితములైనట్టివియగు లఘ్వ లఘువులు అంగప్రాణసంబంధులు. కళయనునది ప్రస్తారమనునదిగూడ ఈదశ ప్రాణములలో చేరినవియే. ఈ తాళదశప్రాణములను గురించి ఇతఃపూర్వము వివరముగ చరిగొండ ధర్మన్న సంగీతవిద్యాభిజ్ఞలనుగూర్చి చర్చించునప్పుడు చెప్పబడినది. ఆద్యములగు సప్తతాళములు మువ్వదియైదు తాళములు నూటొక్క తాళములీయంగ కళావిత ప్రాణసంభూతములు రామరాజభూషణుని కాలమునాటికి తాళసంబంధియగు పద్ధతియంతయు ప్రచలితమైయుండవచ్చును పంచప్రింశత్తాళ పద్ధతిలో ఏకోత్తర శతసంఖ్యాకతాళ పద్ధతిలో సమకళావిన్యాసము గోచరించును. ఈ సమకళకే రామరాజభూషణప్రోక్తమగు సర్వకళ పర్యాయము గానవచ్చును. కనుకనే సర్వకళాశబ్దము నిట రామరాజభూషణుడు పద్యాంతరితముగ ద్వ్యర్థ సమన్వితముగ నిక్షేపించి యుంచవచ్చును. రామరాజభూషణ కవివరుడు సంగీత కళారహస్యనిధిగాన* లయాస్వరూపుడు జగత్పితయునైన విభాత్మ స్వరూప స్వభావావిష్కృతిలో తాళపద్ధతినంతటిని ఇముడ్చి నాదనిపించుచున్నది.

"రమణీయాక్ష సరాకృతింబొలుచు వర్ణశ్రేణి వీణానులా
పముచేతం గరంగించియుండు నిజబింబొప్పనచ్చా మృత
త్వము నాత్మప్రతిపాదకత్వమును దద్వర్ణాళియం దెల్లంబూ
ర్ణము గావించినవాణి తిర్మలమహారాయోక్తిం బొల్పుంగృపన్"*

"శ్రుతిర్మాతాలయః పితా" అను ఆభాణకమునకు అనుశ్రుతిగ ముందటి పద్యమున లయాస్వరూపుడుగని జగత్పితమునగు ఎరించిని నుతించి ఈపద్యమున శ్రుతి స్వరూపిణియగు జగన్మాతయగు సరస్వతిని సుప్రతిష్ఠితను గావించి సమర్పింప సన్నద్ధుడగుచున్నాడిట. రామరాజభూషణ కవిచంద్రుడు. ఆ ప్రయత్నమున వీణాపాణియైన బ్రహ్మాణియైన ఆ సాహితీసమంచితమహత్వము సమ్యక్సం స్థాయమానమైయుండు ఉపాసనాసిద్ధిని అందుకొన్నది. ఈపద్యమున

---

* వ. చ. 1 - 4

** శ్రుతిర్మాతాలయః పితా అనునాభాణకము జగత్ప్రసిద్ధము

రామరాజభూషణుడు ప్రస్తావించిన రీతికి ఇట్లు భాష్యము చెప్పుకొనవచ్చును. వాణీ వీణానులాపనమున ఓంకారాదికమగు అక్షరత్వముతోపాటు సప్తస్వర సమన్వితమగు రాగప్రపంచముకూడ కరగినీరైనది. అయ్యది జంత్రగాత్రముల రాల్గరగించు విమలగాంధర్వ విద్యామహాత్మ్యము. దానిని రామస్వభూషణుడు వాణీవీణాలాపమహత్వమున ద్రవీభూతమై అక్షరాకృతియందు ప్రతీయమానము గావించినాడు. అంతటితో ఆగక సంగీతమహత్వమున ఆర్ద్రమై అచ్ఛామృతత్వమునునొందిన అక్షరనీరమున మటల ఆవాణీస్వరూపమే ప్రతిబింబించి ఆత్మ ప్రతిపాదకత్వము నందినదనినాడు. అనగా అచ్ఛామృతత్వమున సంగీతము ఆత్మ ప్రతిబింబమున సాహిత్యము ఏకత్రావస్థితినందె భాసించినవనుట కవ్యభిప్రేరితార్థము. ఇందు సంగీతకళారహస్యనిధియై సాహిత్యవిధాయకుడైన రామరాజభూషణునకు సంగీతసాహిత్యానుబంధముపైని ఆరెండింటికినున్న అవినాభావ సంబంధముపైనున్న విశ్వాసము ప్రదర్శితము. సంగీతముసాహిత్య స్ఫూర్తినందినప్పుడు భావవ్యక్తితో రసస్వరూపమును సంతరించుకొనును. అట్లే సాహిత్యము సంగీతకరావలంబనమునంది కొనినప్పుడు రాగవిస్ఫూర్తిని పొంది భావస్ఫురణతో అలరారి రసబ్రహ్మ సాక్షాత్కారమను యోగమున సిద్ధినంది తరించును. ఇట్టి ఈగీతిసాహితుల అన్యోన్యాశ్రయత్వమును గ్రహించియే రామరాజభూషణుడు రాగకావ్యముగ తన ప్రబంధమును మలచుటకు వలయుశక్తికై వీణాపాణియైన గీర్వాణినిట ప్రస్తుతించినాడు. కృతికర్తృత్వమున తనకేగాక కృతిభర్తృత్వమున తిరుమల రాయనికిగూడ ఆవాణీవీణాను లాపనాసేవధ్యమే రక్షణొసగవలెనని భావించినాడు

ఈపద్యమున రామరాజభూషణుడు నాదస్వరూపుడైన శంకరుని స్తుతించుచున్నాడు. శివుడు 'నాదమయుడని యాజ్ఞవల్క్యస్మృతియందు యాజ్ఞవల్క్య మహర్షి—

పిదప "ఆ మందాకిని యూళియాని సనునర్ధాంగీ కృతంజేసి తా
నౌ మేల్మేలని యార్యయగ్గిబిణతుండై తత్పదాంభోజయో
గామర్షంబున గంగయున్ మొనయంజూడ భోగ సమ్యక్క్రియా
సామర్థ్యంబున పేడు శంభుడు గృతిస్వామిం గృపాంబోపుతన్"

"దేహమధ్యగతో జీవః
జీవమధ్యగతో ధ్వనిః
ధ్వనిమధ్యగతో నాదః
నాదమధ్యే సదాశివః" అని యుట్టంకించినాడు.

ఇందుక్తములైన నాదధ్వనులు పరస్పరపోషితములు, సంగీతసాహిత్యములకు జన్మభూములు, నాదోద్గతమై శ్రుతిసంపన్నమగునది సంగీతము. ధ్వని సముద్భవమై ఛందోమయమగునది సాహిత్యము. ద్వావింశతి శ్రుతులగు తీవ్ర, కుముద్వతి, మంద, ఛందోవత్యాదులు సంగీతమునకు జీవతుల్యములు. ఆర్య అనుష్టుప్, బృహతి, గాయత్ర్యాదులగు ఛందములు సాహిత్యమునకు జీవ సదృశములు. ఈపద్యమున ఈ రెండింటికి భర్తృత్వమును నెఱపు దక్షిణ నాయకుడైన శివుడు స్తుతింపబడినాడు.

ఆ పరమశివుడు మౌళిఁబూనిన మందాకిని సంగీతసర్వస్వ శ్రుతి స్వరూపిణి. ద్వావింశతిశ్రుతులలో మందాకిని మందశ్రుతి సంబంధిగ చెప్పికొన వచ్చును. మందాకినీ శబ్దమునకు "మందం అకతీతి మందాకినీ" అనునది వ్యుత్పత్తి. అకతీతియనగ గచ్ఛతీతియని అర్థము. కావున మందశ్రుతి సమంచితముగ ప్రవ్యాప్తమగు సంగీతవిశేషమును శంకరుడు మౌళిదాల్పగా ఛందోవిశేషసంపన్నయగు ఆర్యారీతియగు సాహిత్యమిట స్పర్థనువహించి అల్గినదను చమత్కారావహమగు అర్థమును ఇక్కడ ప్రతిపాదించుటకనువున్నది. అంతే! ఆహత, అనాహత నాదరీతులలో తీవ్రమంద కుముద్వత్యాది ద్వావింశతిశ్రుతులు సామగానాన్వితానాహత నాదసంబంధులై ఉపాసనారీతిలో నుపాదేయములగును. ఇక ఆహత నాదమూర్తులు ఛందోరీతులనగు ఆర్యాదులు ఛందోబద్ధములగు ఆర్యాది ప్రబంధములు జనరంజనోద్దిష్టములై రక్తిమంతములగును. శంకరునిచే అర్ధాంగీకృతయైన ఆర్యాఆహత నాదస్వరూపిణికాగా అనాహతనాదమయియగు గంగ ఆమహేశ్వరుని మౌళినెక్కి సంపూర్ణాంగీకృతిని బడసినది. కావున నాదమయుడు ధ్వనిస్వరూపుడు, శ్రుత్యాద్యభ్యర్చనీయుడగు దక్షిణామూర్తి ఇట దక్షిణనాయకుడై అనాహతాహతరీతులకు ప్రతీకలయిన గంగాపార్వతులిరువురిని సమముగ సమ్మానించుచున్నాడనుట గమ్యమానము. ఇట సంగీతసాహిత్యములకు

అనాహతా హతనాదరీతులకు సమప్రాధాన్యము నీకవిశేఖరుడు ప్రకల్పించి నాడనుట స్పష్టము. ఇట్టి రసమయ సన్నివేశమును సృజించి గీతసాహిత్యకళా చణుడగు రామరాజభూషణుడు ఇందు మందాకినియను సంగీతశ్రుతిద్వైన విన్యాస మును, ఆర్యయను ఛందోవిశేషమగు సాహిత్యరీతి నాణ్యమును ఏకత్రసంఘటించి నాడు. ఆర్యయను ఛందోరీతికాక ఆర్యయను ప్రబంధవిశేషముకూడ మఱి యొకటియున్నది. ఇట్లు కేవలము సంగీతశాస్త్రప్రవర్తకుడుగానేకాక సంగీతశాస్త్ర భాష్యకారుడుగాకూడ రామరాజభూషణ కవివరుడిట ప్రవర్తించి తన సంగీతకళా రహస్యనిధిత్వమును సార్థకము గావించుకొనినాడు.

"తరుణార్క కబళనోద్ధతిఁజూపె నెవ్వాఁడు
రుచులచే ఘనమోహరుచులచేత
సకలంక రామముద్రికఁబూనె నెవ్వాఁడు
శయముచే హృత్కుశేశయముచేత
మున్నీరు పల్వలంబుగ దాఁటె నెవ్వాడు
జవముచే గుణగణార్ణవముచేత
నక్షశిక్షప్రౌఢి నలరారె నెవ్వాడు
రణముచే నియమ ధారణముచేత

ధరణినెవ్వాఁడు దానవద్విరదళన
విహృతిఁదన కేసరి కిశోర వృత్తిఁదెలిపె
నతని మత్కావ్య భవ్యవాగమృత ఘటన
మాంజలస్వాంతు హనుమంత మదిఁదలంతు"

ఈ పద్యమున రామరాజభూషణ కవీంద్రుడు గావించిన హనుమత్స్తుతి వలన ఆతనినింతటి భవ్యవాగమృత ఘటనాస్వాంతుని గావించినది ఆంజనేయో పాసనమునని ధ్రువపడినది. కవనరీతియందేగాక గానరీతియందు ఈ మహాకవి ఆంజనేయమతానుయాయియే. హనుమానుడు సంగీతశాస్త్రవేత్తగా హనుమన్మత కర్తగా సంగీతగ్రంథమున గూర్చిన ప్రస్తావన అహోబలుని సంగీతపారిజాతము తరువాత కన్పట్టుటలేదు. అహోబలుడు తన సంగీతపారిజాతమున ప్రాచీనసంగీత శాస్త్రకారులందఱినిగూర్చి ప్రస్తావించినవారిలో మహాకవివరుడగు ఆంజనేయునిపేరు గూడ పట్టింకించి తానమ్మహాకవివరుని అనుసరింతునననినాడు, అహోబలునకు

భూషణకవికి ఏకాభిప్రాయముగల సంగీతశాస్త్ర విషయములు వసుచరిత్రమునందు కొన్నియున్నవి. ఇద్దానికి కారణము వీరిద్దఱు ఆంజనేయోపాసకులు అగుటయేకాక విశేషించి సంగీతశాస్త్రమున ఆంజనేయ మతానుసారులగుటయే.

ఇక నీపద్యమున రామరాజభూషణుడు ఆంజనేయుని వీరోచితకృత్యములను ప్రస్తావించినాడేగాని ఆతని సంగీతపాండితీ విశేషమును తడవలేదని స్థూలదృష్టికి గోచరించును. సూక్ష్మేక్షికతో దర్శించిననేగాని అందలి సంగీత పరమార్థము అవగతముకాదు ఈ పద్యమున ఆ కపివరుని పాండితీ విశేషమును ప్రస్తుతించి అద్దానిని తనకు దయసేయుమని వేడికొనుట గోచరించును. కవనముతోపాటు గానముకూడ వాగ్విలసనమే అగునుగాని అన్యము కాజాలదు. ఈపద్యమునందుక్తమైన భవ్యవాక్కు కవనమైన వాగమృతము గానమగుటకు సంగీతవాగ్విశేషము ఆపాతమధుర మగుటయేగాక అమృతోపమానమగుటకు కారణమగుచున్నది. అందువలననే రామరాజభూషణ కవిచంద్రుడు ఇంతటి మహాప్రబంధనిర్మాణమునకు ప్రథమసంభారమైన వాగ్విశేషము అమృతధారోపమము గావలెనని ఆ మంజులధ్వానుని హనుమానుని ప్రార్థించినాడు. హనుమంతుడు మహాగాయకుడగుట జగత్ప్రసిద్ధము. మంజులధ్వానయుత సుశరీరముగాయకునకు అత్యంతావశ్యకము కావుననే మంజులధ్వాను హనుమాను మదిదలంతునన్నటులే మంజులస్వాంతు హనుమంతు మదిదలంతునని ఈ కపివరుని ప్రార్థించినాడు కవివరుడు.

అంతేకాక "దానవద్విరదళన విహృతిఁదన కేసరికిశోర వృత్తిఁదెలిపె" నను పదవల్లరిలోని కేసరమనునది చతుష్పదిగీతభేదముగ భాసించుచున్నది. అందే రాగముద్రాలంకారోపస్థితినంది కేసరి, కిశోరములను రాగనామములు వినిపించుచున్నవి కేసరి రాగప్రసక్తి ప్రాచీనతమములగు సంగీతశాస్త్రగ్రంథములందు కన్పట్టదు. రామరాజభూషణునికాలమున నియ్యది నవోదితరాగమైయుండును. కావుననే సంగ్రహ చూడామణీ, సంగీతకౌముది, సంగీరస్వరప్రస్తారసాగరాదికములగు అర్వాచీన గ్రంథములందు మాత్రమే ఇద్దాని ప్రసక్తి గోచరించుచున్నది. ఇది మారరంజనియను పంచవింశతి మేళరాగమునకు జన్యము.

ఆరోహణము : సరిగప వమ దవస
సరిగమ పమద వదస

అవరోహణము : సానిదప మగరిస" దీని ఆరోహణము ద్వివిధరీతులలో గన్పట్టుచున్నది, సంగ్రహచూడామణి కారుడిద్దాని లక్షణము నుట్టంకించినాడు.*

ఇక కిశోర రాగమునుగూర్చిన ప్రస్తావన బృహద్ధర్మ పురాణమలదున్నదని అది విభాసమను ప్రాచీనరాగ సంబంధియని ప్రొ॥ సాంబమూర్తి గారు ఉట్టంకించిరి.

ఇట్టి పద్దియమున ఈ సంగీతకళారహస్యనిధి సంగీతశాస్త్రకళానిధియగు హనుమానుని ప్రస్తుతించుటలోపాటు రెండు అపూర్వరాగములనుకూడ పరిచయము గావించినాడు.

"భావంబక్కరలేక వృత్తనియమాపాయంబుఁజంతింప కెం
దేవర్తించి పదార్థవంచనలచే దీపికచ మూర్ఛాళి సం
పై వన్నెల్పచరింప దానిఁదిలకింపఁ బోరు ధీరోత్తముల్"**

ఈ పద్యమున సంగీతశాస్త్రకళావేత్తయైన రామరాజభూషణకవీంద్రుడు కుకవినిందతోపాటు అధమవాగ్గేయకార గాయకాధముల లక్షణములనుగూడ ధ్వనింపసజేనాడు. ఉత్తమ వాగ్గేయకారుడు—

వాగ్మాతురుచ్యతే గేయం ధాతురిత్యభిధీయతే
వాచంగేయంచ కురుతేయః సవాగ్గేయ కారకః"*** అనినట్లు బయకారుడు భయకారుఁడై ధాతుమాతునిర్మాణదక్షుడేగాక సర్వగుణగరిష్ఠుడు గావలెనని. సంగీత శాస్త్రములన్నియు నిట్లు ఘోషించినవి.

---

* "మారరంజనీ మేళాచ్చ కేసరీరాగ ఇష్యతే - సన్యాసం సాంశకంచైవ సషడ్జ గ్రహముచ్యతే
వివర్జ్య వక్రమారోహే పూర్ణవక్రావరోహణం - సనుగావ రిగామపాదస దాని దపామా" సంగ్రహచూడామణి - 3

** వ. చ. i - 11

***

"శబ్దాను శాసనజ్ఞానమభిదాన ప్రవీణతా
ఛన్దః ప్రభేదలేదిత్వమలంకారేషు కౌశలమ్
రసభావ పరిజ్ఞానం దేశస్థితిరస చాతురీ
.... .... .... .... ....
అనుచ్ఛిష్టోక్తి నిర్బంధో నూత్నధాతు వినిర్మితిః
పరచిత్త పరిజ్ఞానం ప్రబంధేషు ప్రగల్భతా
ద్రుతగీత వినిర్మాణం పదాంతరవి దగ్ధతా
త్రిస్థాన గమకప్రౌఢి వివిధాల ప్తి నైపుణమ్

అవధానం గుణై రేభిః వరో వాగ్గేయకారకః"* అనినట్లు ఇటప్రయుక్తమైన సర్వసద్గుణములు ఆయుత్తమ వాగ్గేయకారునకుండి తీరవలయును. ఆతని కన్ని రీతులలోను వ్యత్యస్తమైన అప్రౌఢుడు అధమ వాగ్గేయకారుడు. అతఁడు కుకవివంటివాడై కుట్టికారుడనబడును. ఆతడు—

"అన్యథాతో మాతుకర్తా కుట్టికారోఽధమో మతః"** అని చతుర దామోదరులచే గర్హితుడైనాడు. అట్టి అప్రగల్భుడై తదితరావగుణానిరతుడైన అధమాధముడైన కుట్టికారునకు భూషణకవి ప్రతిపాదిత లక్షణకారుడైన కుకవి ప్రతిజోదు కాగలడనుట స్పష్టము.

సంగీతము రాగభావాశ్రితము. అధమ వాగ్గేయకారుని రచనమున ఈరాగ భావాతిశయస్వరూపము భ్రష్టము. ఇట్టి అధమాధమ గానరచనా స్థితికల్గినవాడు వాగ్గేయకారుడేకాక గాయకుడుగూడ అయినను లేక కేవల గాయకుడేయైనను ఆతని గానమున భావోద్దీపకత్వము నశింపగా అది శుష్కమై వినసొంపుగనుండ కుండుటయేగాక కర్ణహింసనుగూడ గల్గించును. ఇక గానమున భావము తరువాత పరిపోషకము గావలసినది తాళము. ఈతాళ ప్రవృత్తియందు ముఖ్యమైనది సక్రమావృత్త పరిగణనాత్మక జ్ఞానము. అధమ గాయకునియందు అధమవాగ్గేయ కారకునియందిది లుప్తమగును. వారు వృత్తనియమాపాయంబును చింతింపక

* సం. ర. ప్రతిజ్ఞోల్లాసః

**

ఎందే వర్తింతురు. పైపెచ్చు వారు పండితామోదమును పొందుటను లెక్కింపరు. కుకవిప్రణీతకృతివంటి అధమాధమ రచనమునుగైకొని దానికి మాన్యతను అపాదించి పైపైపెవన్నియలద్దానికి పఃరింతురు. ఆ పైపైపెవన్నియలను ధీరోత్తములు తిలకింపరు. ఇట్లు సాహితీపరముగ కుకవినిందార్థమునేగాక సంగీతరీతిలో కుట్టికారాది అధమవాగ్గేయకార గాయకాధముల లక్షణములనుగూడపై పద్దియమున గ్రహించుటకు తగిన అవకాశమును గల్పించి ఈ సంగీతవిదుడు తజ్ఞులను ఇట్టి దోషయుతులగావలదని ఆదేశించినాడు.

"ఘన ఘనా ఘనలక్ష్మి నెనయుకొప్పిరుగడ
నిరుగడఁదరుణాట్టకృత వతంస
మురుచిత్ర కాగ్నిశిఖోన్మేష మిరువంక
నిరువంకఁగుండలి స్ఫురితకర్ణ
ముడివోని మిన్కులీనెడు వేరులిరుదెస
నిరుదెసఁగమల బంధుకరంబు
నెఱిమించి చిఱుతవన్నియచేల మిరుమేన
నిరుమేన రతిమనోహర విభూతి

యమర నన్యోన్యవేషభేదా సహిష్ణు
భావ విభవంబుఁదులుపఁ పరమ మైత్రి
మగనిసామేన నిలిచిన యగతనూజ
ప్రథన జయమిచ్చుఁదిరుమల రాయమణికి"*

ఈ పద్యమును రామరాజభూషణ కవీంద్రుడు తన సంగీతశాస్త్రకళావైదుష్య మును సార్థకమొనరించుచు సంగీతశాస్త్రరీతులలో సానలుదీరిన జాతిరత్నముగా వెలార్చినాడు. ఈ మహాకవికి ద్వ్యర్థ ఘటనాసామర్థ్యము సహజసిద్ధము. అది గీతి సాహితీరీతులలో నిరువంకలనీ ప్రబంధమున పండి ప్రచేశిమత్వమునందినది. వన్నివేశగతముగ ఈకవితో నిరుమేన ఏకత్వము సాధించి సామేననిలచిన అగ

---

* వ. చ. i - 6

తనూజ ఇట ప్రస్తుతింపబడినది. పద్యమున అగతనూజగ సంస్తూయమానమైన పరమేశ్వరికి పార్వతియనుపదము పర్యాయము. సంగీతరాజమున పార్వతియను నామముతో ఒక రాగమున్నది. ఇందు పార్వతిగా వ్యవహృతమైన ఈరాగము రామరాజభూషణుని కాలమునాటికి తత్పర్యాయ పదములతోకూడ గుర్తింపునంది యుండును. సంగీతరాజమును రచించిన నృపతికుంభకర్ణుడు పార్వతిరాగమును ప్రేక్షకజనితమగు రాగమనినాడు. ఆతడు హిందోళమును ప్రేక్షకమని వ్యవ హరించును.*

ఇట్లే పద్యమున పార్వతీభాషాలక్షణమును పర్యాయరాగనామముతో సంసూచితము గావించుటతోపాటు కొన్ని ప్రబంధనామములను మఱికొన్ని సాంకేతిపదములనుగూడ ఈ సంగీతకళారహస్యనిధి యుట్టంకించినాడు. అట్టి వివరణా పేశలగు సాంకేతికపదములలో ఘన, చిత్ర, కమల, రతి, మనోహర, విఖ్యాత, జయమను పదములను "ఉడివోని మిన్కులీనెడు పేరులు" అనెడి పల్కుబడియు వివరణార్హములు. రాగములలో ఘనరాగములని గ్రామరాగములని దేశ్యరాగములని రక్తిరాగములని రాగప్రభేదములున్నవి. అందొక రాగప్రక్రియా భేద సంసూచికమగు పారిభాషికము ఘనమనుసాంకేతికము. అట్లే చిత్రయను పదముకూడ సంగీతశాస్త్రాంతరితమగు పారిభాషికమే. ఇది వివిధార్థ సంయుత ముగ ఏతచ్ఛాస్త్రమున పలుతావుల కొన్నిపదముల కూడలితో గోచరించుచున్నది. గ్రంథవిస్తరభీతివలన కొన్నిమాత్రమేయిట వివృతములగును. తాళాధ్యాయమున చిత్ర, చిత్రతర, చిత్రతమములను మార్గములు తాళాక్షరగణనమునందున్నవి.

ప్రబంధాధ్యాయమున చిత్రానామకమగు ఝూంబడ ప్రబంధమున్నది. అది సంగీత రాజమున చతుర్వింశతి ఝూంబడ ప్రబంధాంతరితముగ విర్దేశితము. అద్దానిలక్షణమిది.

"చతుర్గణైః క్రమాఖ్యైశ్చ గద్యైః పంచమభిరంచితః
షడ్భిః క్రమవిలాసః స్యాచ్చిత్రః స్యాత్సప్త భిర్గణైః"**

* "పార్వతీ ప్రేక్షకే భాషాషడ్జన్యాస గ్రహాంసికా
సంపూర్ణా షడ్జగానార్హ గమ కాలప్తివేళలా" సం. రా. రాగోల్లాసము.

** సం. ప్రబంధోల్లాసము - 247

ఇవియేకాక చిత్రగీతి, చిత్రపదావృత్తం, చిత్రపాటం, చిత్రప్రబంధం, చిత్రకరణం, చిత్రగద్యప్రబంధం, చిత్రమండల నృత్యం, చిత్రలేఖావృత్తం, చిత్రవర్ణగద్య, చిత్రమాత్రేశ్రీలా, చిత్రమూర్ఛనాతాన, చిత్రవాదకాదికములు సంగీత రాజాదికములగు సంగీత శాస్త్రములందు ఆయా ప్రకరణములందు వివృతములు.

ఇట్టి సాంకేతిక పదమునము వలన అట్టివానిని స్మరింపననువగునట్లు కవి ప్రయోగించినాడనుటకు ప్రయోజనమేమని ప్రశ్నింపవచ్చును. ప్రాచీనులు తమ సమకాలికములగు విజ్ఞానరీతులనన్నిటిని ఏలయినంతవరకు స్వోపజ్ఞకము లగు గ్రంథరాజములందిమిడ్చినారు. ఇప్పటి విజ్ఞాన సర్వస్వములవలె ఆనాటి గ్రంథములే సమకాలిక సంస్కృతి నిక్షేపములై అలరినవి. ఇట్టి రచనములలో కొందఱు సర్వశాస్త్రపరిచితిని ప్రతిక్షేపించిరి. మఱికొందఱు సంక్షేపముగ తమ అపార వైదుష్యసముంచితములగు ఇష్టకళలను శాస్త్రములను మాత్రమే తమ కావ్యములందు ప్రతిష్ఠించిరి. ఇట్టిరీతిలో తన అభిరుచ్యనుసారముగ అపార పాండిత్యప్రకర్షతో రామరాజభూషణ కవిచంద్రుడు సంగీత జ్యోతిష విద్యా సారస్వతముల అపారనిధిని తన వసుచరిత్రమున నిక్షేపించినాడు. ఈ పద్ధతి మున్నుగ ప్రాచీనకవులగు నన్నెచోడుడు పాలుకుర్కి సోమన శ్రీనాథుడు కొరవి గోపన కృష్ణరాయలు అల్లసానిపెద్దన మున్నగు కవివరులుముందే తమకవనము నందు ప్రతిష్ఠించినారు. రామరాజభూషణుడు అపారవైదుష్యముతో అనన్యశాస్త్ర విజిగీషతో వీరందరికి ప్రతిస్పర్థియై నిలచి సంగీతశాస్త్రపు లోతులు తఱచి తన పంతము నెగ్గించుకొనినాడు. ఈ కవిచంద్రునకు సంగీతకళారహస్యనిధియను బిరుదము ఇందువలననే సార్థకమైనట్లు "పదమెత్తం గలహంసలీల", అరిగా పంచమమేవగించి...." ఇత్యాది పద్యముల వివేచనమున విమర్శకులుగుర్తించిరి. పరిశోధకులు ఆమోదించిరి.

ఇక "ఉడివోని మిన్కులీనెడి వేరుల"నెడి వల్కుబడిలో బ్రహ్మ కపాలములగూర్చిన ప్రస్తావనయున్నది. ఇది కపాలరాగములుగ సంగీతరత్నాకర సంగీత రాజాదులందు స్పష్టపరచి ప్రకటితములైయున్నవి. ఈ కపాల గాన ప్రసక్తి ఇతఃపూర్వము తిక్కనగాన పాండితిలో ప్రస్తావితము.* ఇక కుండలి

---

* ప్రా. ఆం. క. సం. ప్ర. [illegible] పు. 77

స్ఫురితకర్ణమనుపలుకుబడియందలి కుండలియనుపదము* కుండలినీశక్తిసంబంధిగగమనింపవలెను. సంగీతమును రాగనిధిగాకయోగావధిగ సాధనగావించు మహర్షిప్రాయులగు గాయకులు సాధింపవలసిన మహత్తరశక్తులతో కుండలిని శక్తి ఒకటని ఇద్దాని సాధనారీతినిగూర్చి స్వరతానక సందర్భమున సంగీత రాజమున నృపతికుంభకర్ణ ప్రోక్తముగ గన్పట్టుచున్నది.*

ఇక కమలబంధుకరంబగు పదస్తబకమునున్న కమలపదసార్థక్యమును వివేకించిన ఇదియొకచో ధ్రువాప్రబంధముగ మఱియొకచో మంత్రప్రబంధముగ వివృతము. అంతేకాక కమలసంభవమనునది మోంబశప్రబంధమని కమలా ఎర్జెలా ప్రబంధముకూడా కలదని కమలాకరమనునది ద్విపదభేదముగకూడ నున్నదని ఎఱుంగనగును.

ఇక "రీతి మనోహరవిభూతి" యను పలుకుబడిలోని మనోహరమను పదము రాగనామము - రతియనునది ఛందోభేదముగ రతికమనునది శ్రుతి ప్రభేదముగ ఆయాప్రకరణలయందు గన్పట్టుచున్నది. ఇక విభూతియనినదిగూడ ద్వావింశతి శ్రుతిప్రభేదములలో ఒకటియై యున్నది.

ఇక "ప్రధన జయమిచ్చుఁదిర్మల రాయమణికి" అను పలుకుబడిలోని జయశబ్దాంచితములగు సంగీతసాంకేతికములు కొన్నియున్నవి. జయంతమనునది కందచ్ఛందోగీతికగ ధ్రువాప్రబంధముగఁగూడ గోచరించుచున్నది. జయ, జయశ్రీ, జయమంగళ, జయరామములు తాళాధ్యాయమున వివృతములైన తాళ ప్రభేదములు. జయమంగళమనునవి తాళప్రభేదముగానేగాక ధ్రువప్రబంధ ప్రక్రియగగూడ గోచరించుచున్నది. జయప్రియయనునది యొకమంత్రప్రబంధము. జయ, చతురాభేదము జయావర్ణవిశేషములు ప్రబంధ ప్రక్రియలు. జయ ఏలా

---

* "పయోర్లింగస్య చాంతర్యుగ కవితం చక్రమాధారా సంజ్ఞం
తస్యాః కస్యాశ్చ శక్తేర్గృహమిహగదతం కుండలీశ్యాః కవీంద్రైః
యా సాక్షాద్దేశికోక్తేః సువచన నికరైర్యాగిభిస్తత్త్వనిష్ఠైః
ఆనీతా బ్రహ్మరంధ్రావధి పరమ్మదుతాం మోక్షసౌఖ్యన్యదాత్రీ"

పదదేవత. జయగీతము వీరాలాపనముసందు ఉపయుక్తము. జయఘంట, జయభేరి, జయశృంగములు యుద్ధసంబంధులగు వాద్యములు. జయ, జయవంతి, జయశ్రీ, జయమంజరి, జయంతశ్రీ, జయమనోహరి, జయమోహన, జయానంద, జయనారాయణి; జయసింధు, జయరామ, జయశ్రీకాంత, జయసాక్షి, జయశుకాదికములు రాగనామములు. ఇట్టి విస్తృతార్థసంయుతములగు అపార సాంకేతిక పదజాలములను జ్ఞప్తికెలయించురీతిని పద్యాంతరితముగ నిక్షేపించి రామరాజభూషణుడు తన సంగీతకళారహస్యనిధిత్వమును సార్థకముగా వించి కొనుటేగాక సంగీతశాస్త్రజిజ్ఞాసువులకీ శాస్త్రపరిచితిని కల్గించి పాండితీప్రకర్షక్తె యత్నింపుడని ప్రోత్సహించుచున్నాడనుట నిక్కమైన నిజమేగాని అతిశయోక్తి కాజాలదు.

"వసుమతీ భారభూర్వహతనెవ్వని యుర్వ
రావరాహాంక మర్థము వహించుఁ
గరగతచక్ర విక్రమశక్తి నెవ్వాని
రామానుజత్వంబు రమణకెక్కు
జీర్ణ కర్ణాటలక్ష్మి పునస్సృష్టి నె
వ్వానిలోకేశ్వరత్వము వొసంగు
జటుల శార్వరమగ్న సర్వవర్ణోద్ధార
పటిమనెవ్వని రాజభావ మెసంగు

నతఁడు వీరప్రతాప రాజాధిరాజ
రాజపరమేశ్వరాష్ట దిగ్రాజకుల మ
నో భయంకర బిరుద సన్నుతజయాభి
రామగుణహారి తిరుమల రాయశౌరి"* ఇది కృతిభర్త గుణగుణాదికముల నభివర్ణించు పట్టు. ఇట్టిదికూడ సంగీతమున కాటపట్టగుట సవిశేషము. పద్యమందలి ప్రథమపాదమునఁగన్పట్టి వసుమతియను పదము భూదేవికి పర్యాయమగుటయేగాక మాత్రైలా ప్రక్రియయగుట ఇట గమనార్హము. ఈ మాత్రైలా

* వ. చ. i. 13

లక్షణము "మాత్రాగతైర్యా రచితా సామాత్రైలా ప్రకీర్తితా" అని చెప్పబడినది. ఇట్టి మాత్రైలా ప్రక్రియలు నాలుగని అవి "మాత్రాసంఖ్యా పరిజ్ఞాప్తా మాత్రైలా స్యాచ్చతుర్విధా, త....ద్వేందుమతీ జ్యోతిర్మతీ చైవ నభస్వతీ, తతో వసుమతీ త్యేతాశ్చతస్రో నందిగోదితా" అని సంగీతరాజప్రోక్తము.

అట్లే "కరగత చక్ర విక్రమశక్తి" అను పలుకుబడిలో గానవచ్చు చక్ర పదము రాజలాంఛనమగుటయేగాక సంగీతప్రక్రియా లాంఛనాయుతమగుట సవిశేషము. చక్రానామక ఆర్యాప్రబంధమొకటి యున్నది. చక్రాళవాళమనునది ఆళిక్రమ ప్రబంధమని చక్రేశ్వరము అనునది ఏరఝోంబడ ప్రబంధప్రభేదమని తెలియుచున్నది. అట్లే రామ, రమణ యనుపదములుకూడ ప్రబంధనామములగుట గమనార్హము. రామ అనునది వానవీఝోంబడ ప్రబంధప్రభేదము. రామక్రియ అనునది క్రియాంగ రాగవిశేషము. ఇక రమణపదముకూడ రమణీశబ్దవ్యవహృతమగు వర్ణైలప్రబంధనామముగ గోచరించుచున్నది. జయరామ అనునది తాళప్రభేదమనీ ఇతఃపూర్వము ప్రోక్తము. ఇక జయ, రామములను వేర్వేరు నామములతో ప్రబంధములున్నవి. ఇక తరువాత గానవచ్చు కర్ణాట, లోకేశ్వర, శార్వర, ప్రతాపములు రాగనామములుగ వినవచ్చుచున్నవి.

ఇట్టి పద్ధియమున సంగీతకళారహస్యవేదియగునీ కవిచంద్రుడు తన గాన కళానిధియందు కొన్ని ప్రబంధనామములు మఱికొన్ని రాగనామములు నిక్షిప్తము గావించుట ముదావహమగు విషయము. ఇట్లే ప్రబంధనామములను రాగనామములను గ్రంథస్థము గావింపవలసిన ఆవశ్యకత ఈరామరాజభూషణునికేల గల్గినదని వితర్కించిన సమాధానమునాతడే చెప్పికొనినాడు. దీనికి ఆద్యమగు సమాధానము తాను సంగీతకళారహస్యనిధిననుట, తరువాతిది ఆతడు రాగప్రబంధ నిర్మాణ ధౌరేయుడగుట. సాహితీప్రక్రియలగు ప్రబంధములనేగాక సంగీతప్రక్రియా విశేషములగు గానప్రబంధ సహస్రనిర్మాణదక్షుడై రామరాయతిరుమలరాయాది

ప్రభువులచే సన్మానితుడైనాడట. దీనికి మూదలలగు అతని వాఙ్మాలములవంటి ఈపద్దియములే యున్నవి.*

"పదమెత్తం గలహంసలీల యధరస్పందంబు సేయన్ శుభా
స్పదమౌ రాగకదంబకంబు శ్రుతిచూపన్ శ్రీవిలాసంబు కే
ల్గదలింపన్ సుకుమారపల్లవనవైలా లక్ష్మి వీక్షింప ష
ట్పదియుం బొల్చె(దర)బె కన్నె(గానియాడెన్ గేయవాక్ప్రాధిపన్" **

ఈ పద్యము అద్యముగ రామరాజభూషణ కవనమార్గమగు గానప్రబంధ రాగతాళనామాదిక నిక్షేపణముల గ్రంథస్థము గావించు రీతిని తెలుగులోనికి తెచ్చినది. సంగీతశాస్త్రకోవిదులగు సాహితీరసజ్ఞులు కొందఱు. ఈ పద్యాంతరితముగ నున్న ప్రబంధనామములను కొన్నిటిని గుర్తించినాము. ప్రబందనామములను

---

* "నను శ్రీరామపదారవింద భజనానందున్ జగత్ప్రాణ సం
దన కారుణ్య కటాక్షలబ్ధకవితా ధారాసుధారాశి సం
జనితైకైక దిన ప్రబంధ ఘటికా సద్యశ్కృత గ్రంథ క
ల్పను సంగీతకళారహస్యనిధి( బిల్వించి పల్కెంగృపన్" i-16

"శ్రీరామ క్షితిపున్మదగ్రజు జయశ్రీలోలు నానాకళా
పారీణున్ బహుసంస్కృతాంధ్ర కృతులం బల్మాఱు మెప్పించి త
త్కారుణ్యంబున రత్నహారహయ వేదండాగ్రహారాది స
త్కారంబందితి రామభూషణకవీ ధన్యుండు పీవన్యటన్" i - 17

ఇట రామక్షితిపుడు జయశ్రీలోలుడై అలరుట సంగర సంగీతసాహితీ రంగముల మూడింటియందు అనుకొనవచ్చును. ఇట గోచరించిన బహు సంస్కృతాంధ్రకృతులందు సంగీతప్రక్రియా విశేషమగు జయశ్రీ యను గాన ప్రబంధముకూడ నున్నదని భావింపవచ్చును. రామన్నృపుడు సహజ జయశ్రీ లోలుడుగాన అతనిని జయశ్రీ ప్రబంధ విశేషరచనమున రామరాజభూషణుడు మెప్పించి సవృతినంది యుండవచ్చును.

** వ. చ. iii - 59

గుర్తించినవారు ఇందంతరితమైయున్న రాగతాళ నామములను గుర్తించలేదు. లేదు. 'విద్వజ్జనరంజని' నామక వసుచరిత్ర ప్రఖ్యాత వ్యాఖ్యానమును ప్రతిపాదించిన సోమకవి యంతటివాడుగూడ ఈపద్యాంతరితమును రాగతాళప్రబంధ రీతిని గమనింపకపోవుట శోచనీయము. మొత్తముమీద వీరందరు అన్నిటిని గాకపోయినను కొన్నిటినయినను గుర్తింపగలుగుట ఇట ముదావహమగు విషయమెగాని అన్యముగాదు. నా పరిశోధనమున కందినంతమటుకు కలహంస మను పదమున కలహంసమను ప్రబంధము రాగనామము హంసలీలయను తాళ నామము గోచరించుచున్నది. అట్లే రాగకదంబకమనుదికూడ ఒక ప్రబంధ నామమే యగుచున్నది. ఇక శుభాస్పదములగు తదితరరాగములలోగూర్చిన రాగమాలికలో నలరు ప్రబంధవిశేషమగు రాగకదంబముతోపాటు శ్రీవిలాసమను నామముతో మఱియొక ప్రబంధవిశేషముకూడ గన్పట్టుచున్నది. అందు రాగవిలాసముకూడ యున్నదని తోచుచున్నది. ఇక సుకుమార పల్లవనవైలా లక్ష్మి యను పదవల్లరిలో సుకుమారమైన పల్లవితో సంయుతమగు ఏలాప్రబంధసంవద గమ్యమానమగుచున్నది. ఇక షట్పదియను పదమునకు గాథాప్రబంధముగ ధ్రువాభేదముగ ప్రకీర్ణ ప్రబంధముగాకూడ ప్రబంధవిశేషములనిట ప్రతిపాదింప వచ్చును. ఇట వీక్షింప షట్పదియనుటలో గోచరించు షట్పది ప్రబంధమిదియే. ఈ పద్యమందలి కలహంసమను పదమునకు రాగనామమనికూడ గుర్తింపున్నది గాన నీకలహంస రాగలక్షణమునుగూర్చి ఇట వివేచించుట ఆవశ్యకమేయగును.

యాగప్రియ మేళముగ కటపయాదిమా సంఖ్యాగణన సౌలభ్యాదికములకై నామపరివర్తనమందినప్పుడు కలహంస మేళముగ నుదీరితమైన రాగలక్షణము ఇందు వివృతము కాదగును. ఈ కలహంసము యాగప్రియకు నామాంతరముగ సంగ్రహచూడామణియందు దృష్టము. ఈకలహంస రాగము సంగీతరాజ, పారిజాత, సంగీతదర్పణములందు ఉక్తముకాకపోయినను రామరాజభూషణుడు పలుమారులు కలహంసమును ప్రబంధవిశేషముగ రాగనామముగూడ ఎడనెడ స్మరించినట్లు తేటపడుచున్నదిగాననిది ఈతని కాలమునాటికే యాగప్రియనుండి కలహంసముగ ప్రవర్తితమై యుండనోపును. ఈ కలహంసమేళ లక్షణము సంగ్రహచూడామణియందు ఇట్లున్నది.

"షట్ శ్రుత్యృషభయుక్తాఽంతర గాంధారేతరశుద్ధయుక్
పూర్ణారోహావరోహేచ షడ్జన్యాసాగ్రహాంశకః
వాయుబీజాక్షరవతీ శాంతస్వర కదంబినీ
యాగప్రియేతి కథితా హ్యాశ్వమేధాధ్వరోదితా
సంగీతపండితైరేక త్రింశోఽయమధికారకః"* అని గోవిందపండితుడిద్దానిని నిర్వచించినాడు. అట్టియెడ రామరాజభూషణుడు తనకు పూర్వము సంగీతశాస్త్ర గ్రంథములందు ప్రోక్తముగాని ఈ కలహంస రాగలక్షణమునెట్లు పద్యాంతరితముగ నిక్షేపించినాడో అరయవలయును. ఇది షడ్జమునే.... సగ్రహాంశ స్వరముగగూడ గలిగియున్నది. మంత్ర శాస్త్రోప్రయుక్తరీతిలో నిది వాయు బీజాక్షరసమన్వితము. అంతియేకాక ఇది అశ్వమేధయాగమునందు గానముచేయ దగినది కావుననే దీనికి యాగప్రియ అను రాగము అన్వర్థమై వైదికగానమున నెలకొని తదనంతకాలమునందిది లౌకిక గానమునందు వయుక్తమైయుండనోపును.

ఇందు షట్శ్రుతి ఋషభము అంతరగాంధారము ప్రయుక్తముగాగ మిగిలినవి శుద్ధస్వరములైయుండును. ఇది సప్తస్వరపూర్ణమైన సంపూర్ణరాగము. కావుననే ప్రప్రథమున నీరాగము అశ్వమేధక్రతుగానోపయోగియైనదిగాన శాశ్వత స్వర్గావాస సౌఖ్యదమనుట తేటతెల్లము కావుననే గిరికాకరావలంబనమునందిన పృథ్వీపతి అశ్వమేధాది క్రతువులపనిగట్టుకొని ఒనర్పకపోయినను తత్క్రతు ఫలమగు స్వర్గసౌఖ్యమును భువియందే చవిచూడగలడని ఆమె పదమెత్తి అడుగు పెట్టి మెట్టినచోటు స్వర్గతుల్యమగునని కవియిట సంసూచించినాడు.

ఇక ఆమె శ్రుతిచూపిన అనగా శ్రుతికలిపిన దాంపత్యగానము శుభాస్పదమై శ్రీరాగభావ లక్షణాసంయుతముగ విరాజిల్లు ననుటకుకూడ రామరాజభూషణ కవిచంద్రుడే ఇట సంసూచించినాడు.

కావుననే మొత్తముమీద ఇన్నిమాటలనవలసిన పనిలేదు. గిరిక శుభాస్పదస్వరూప స్వభావరీతిని కొనియాడు వ్యాజమున ] ఇందలి గీతిసాహితీ ప్రక్రియానుశీలనముగావించుట గేయవాక్ప్రౌఢిమతో గూడ పరమానట్టిది కాదనవ

* సం. చూ. 62

రామరాజభూషణుడు సంగీతకళారహస్యవేదియయ్యును మరికొన్ని గీతిసాహితీ రీతులను పాఠకులవివేచనకే వదలినాడనిపించుచున్నది.

కావుననే విమర్శకులు వివిధరీతులలో నీపద్యానుశీలనము గావించినారు. కేవల ఉహాగానముకాక ఈపద్ధియముగ ఉదీరితములైన ప్రబంధనామముల వివరణమును ప్రాచీన సంగీతశాస్త్ర నిర్వచనానుసారము గావించిన కీ.శే వంతుల రామచంద్రశాస్త్రిగారీ విషయములన అభినందనములు. కావుననే వారి వివేచనము భూషణ కిరణావళినుండి యథాతథముగ ఉద్ధృతమై ఇట అనునంధింపబడినది. దీనికి మూదలగు శార్ఙ్గదేవప్రోక్త రత్నాకరీయ లక్షణములు అథస్సూచికలలో ఒసంగబడినవి.

గిరికా సౌందర్యపరముగను సంగీత ప్రబంధపరముగను అర్థశ్లేషముగల పద్యరత్నములను ఈ మహాకవి రచించి తన సంగీతకళావిజ్ఞానమును ప్రదర్శించెను. రామరాజభూషణుని కాలమునాటికి ఆతడుట్టంకిన ప్రబంధ విశేషముల రచన గానవిన్యాసాదికములు సాగుచుండెననుటకు మూదల ఆతని సమకాలికుడును ఆతనితో సమముగ రామభూపాలకృత సన్మానాదికములనంది స్వరమేళకళానిధి రచించిన రామయామాత్యుని వక్కాణయున్నది. అట్టి విశేషార్థ సంయుతములగు పద్యములలో ఒకటైన "ఈపదమెత్తన్" అను పద్యమున రామ రాజభూషణుడు చూపిన సాహిత్యపరమైన ప్రబంధపరమైన అర్థము పణతులవారి భావనలో నిట్లు విశ్లేషింపబడినది.

---

"సైలా, రాగకదంబమాత్రక లసద్గద్యప్రబంధావిమ
ద్వాత్రింశద్ వరసూడ కానధిగత శ్రీపంచతాళేశ్వరాన్
శ్రీరంగద్విపద స్వరాంక నహితాన్ స 'శ్రీవిలాసా'ది కాన్
త్రింశత్ భామరవి ప్రకీర్ణక మహానర్త ప్రబంధాదికాన్"
"చేతోరంజన షోడశధ్రువ ముఖానేకార్థ గంభీర షట్
చత్వారింశ దుదార సాలగ మహాసూడ ప్రబంధాన్వితాన్
అన్యాన్ వింశతిరాగ విశ్రుత తమ శ్రీపంచరత్న స్ఫురన్
గీతాలంకృత సాక్షరాలపన పర్యాయైరు వేతానపి"
స్వ. క. ఉపోద్ఘాత ప్రకరణము – 20 – 21

గిరికాదేవి పాదము నెత్తి నడువగనే రాజహంసనడకయందలి ఒయ్యారము తోచును - ఇత్యాదికము సాహిత్యార్థము పదము+ఎత్తన్=సంగీతప్రబంధమగు కలహంసమున కంగమగు రసభావాదులలోఁగూడిన (అర్థవాచక) మాతురూప పదమును, పలుకుటకారంభింపగానే కలహంసలీల, కలహంసమను (అలిక్రమ గీత) ప్రబంధము తోచునని సంగీతపరమైన సమన్వయము. అధర స్పందంబు సేయన్-పెదవి కదుపగానే, ప్రబంధగత రాగాంగమగు స్వరముల నుచ్చరించుట కారంభింపగానే శుభస్పదమౌ=మంగళమునకు ఆశ్రయమగు రాగకదంబకంబు = రాగకదంబమను ప్రబంధమును, శ్రుతిచూపన్=స్వరమునకు అవయవమగు (కారణమగు) శ్రుతిచూపగానే, శ్రీవిలాసంబు=శ్రీవిలాసమను ప్రబంధమును, కేల్గదిలింపన్=రెండు పతాకహస్తములు మణికట్టుటయొద్ద స్వస్తికాకారముగనున్న చోనవి పల్లవహస్తమనబడును (నాట్యశాస్త్రము) పల్లవహస్తమున ప్రబంధాంగ మగు బిరుదము నభినయించుటకు చేయికదలింపగానే సకుమార పల్లవవైలా లక్ష్మి = సుకుమారమను పదప్రాణముగల ధ్రువరూపమగు పల్లవముతో (పల్లవితో) గూడిన ఏలాప్రబంధసంపదయు, వీక్షింపన్=ప్రబంధమునకు నేత్ర రూపమగు తేన్నకము అనునంగమునుపయోగింపగానే; షట్పదియున్=షట్పదియను సంగీతప్రబంధమును, తోచున్=స్ఫురించును. కావున గానము చేయదగిన ప్రబంధావయవములగు ఉద్గ్రాహాది ధాతువుల యొక్కయు, వాగ్రూపమగు పదాదిప్రబంధాంగముల యొక్కయు నైపుణ్యమునందు కన్నెన్=కన్యకయగు గిరికాదేవిని, కొనియాడన్=పొగడుటకు, తరంబే=శక్యమా? శక్యముకాదని యర్థము. ఈ పద్యమునందలి సంగీతపరమగు నర్థమునెఱుగుటకుముందు ప్రబంధ సాధారలక్షణములు దెలిపి కలహంస రాగకదంబకాది ప్రబంధముల విశేషలక్షణముల నెఱుగవలసియున్నది. కనుక 'సంగీతరత్నాకరాది శాస్త్రముల యందు ప్రవచింపఁబడిన సాధారణ విశేషలక్షణములను ఇచట సంగ్రహముగ దెలుపుదును.

ఆంధ్రభాషయందు మనుచరిత్రము వసుచరిత్రము మున్నగునవి ప్రబంధ ములని చెప్పబడును సంగీతప్రబంధములు వీనికంటె భిన్నములైయున్నవి. సంగీతశాస్త్రము ననుసరించి గానవిశేషముగల సాహిత్యము ప్రబంధమని చెప్ప బడును. చతుర్విధములగు ధాతువులతోను, షడ్విధములగు అంగములతోను

నిబంధింపబడిన రూపకము ప్రబంధమని చెప్పబడును. సంగీతమునందలి యీ ప్రబంధమునకు గేయరూపమగు ధాతువు అవయవమని చెప్పబడును. ఈ ధాతువు చాతుర్విధము. 1. ఉద్గ్రాహము 2. మేళాపకము 3. ధ్రువము 4. ఆభోగము అనునవి ధాతువునకు (గేయమునకు) నామములు. ధాతువునకు గేయమని పేరు గలదు. గేయమునందలి ప్రథమభాగము ఉద్గ్రాహము. ద్వితీయభాగము మేళాపకము. తృతీయ ఖండము ధ్రువము. చతుర్థఖండము ఆభోగము. ప్రబంధమునకు అంగములు ఆఱు. 1. పదము 2. తేన్నకము ఈరెండును ప్రబంధపురుషునకు నేత్రములు, రసాదులతో గూడిన అర్థమును దెలుపునది పదము. తేన అనుదానికి వికృతియే తేనకము. ఇవి మాంగల్యసంపాదకము. 3. తాళము 4. స్వరము. ఇవి ప్రబంధ పురుషునకు పాదములు 5. పాఠము 6. బిరుదము. పాఠము వాద్యములందువచ్చు 'తధిగిణతోం' ఇత్యాది శబ్దస్వరూపము. ఇది హస్తాభిఘాత ప్రభవము గనుక హస్తమగుచున్నది. బిరుదము హస్తాభినయముచేత తెలుపబడినది గనుక ఇది మఱియొక హస్తమగుచున్నది.

మీది అంగములు ఆఱుకలది మేదినీజాతి ప్రబంధము.

మీది అంగములు ఐదుకలది ఆనందినీజాతి ప్రబంధము.

మీది అంగములు నాలుగుగలది దీపినీజాతి ప్రబంధము.

మీది అంగములు మూఁడుకలది పాభ్రావనీజాతి ప్రబంధము.

మీది అంగములు రెండుకలది తారావళిజాతి ప్రబంధము. షడంగయుక్తమగు శ్రుతియే జాతియని మతాంతరము.

ప్రబంధములు : సూడక్రమస్థితములు
ఆలిక్రమస్థితములు
విప్రకీర్ణములు అని త్రివిధములు.

---

సంగీతరత్నాకరాది శాస్త్రగ్రంధములందు వివృతములై రామరాజభూషకవిచంద్ర ప్రోక్తమగు ప్రబంధలక్షణములను కీ.శే. వఱతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారి వివరణమునసుసరించి సమ్యక్పంశోధితమై విపులమై భావించుచున్నది. కావున ఇట నుద్ధరించి ఉదాహరించుచున్నాను.

రాగకదంబకము కలహంసమనునవి సంగీతప్రబంధములు. ఆలిక్రమ స్థితములు. శ్రీవిలాసము షట్పది అనునవి ప్రకీర్ణప్రబంధములు, ఏలయనునది శుద్ధసూడక్రమస్థితమగు ప్రబంధము. ఈప్రబంధములకు వస్తువు, రూపకములను నామాంతరములున్నవి.

**కలహంస లక్షణము :** సంగీతరత్నాకరమునందలి ప్రబంధాధ్యాయమున ఇది వివరింపబడినది. జగతీఛందమునుండి జనించిన హంసమనువృత్తమే యిట కలహంసమని పేర్కొనబడినది. కలహంస వృత్తముచేత ప్రబంధింపబడినది కావున ఇది కలహంస ప్రబంధమాయెనని వేంకటమఖి చెప్పినాడట.*

దీనియందు ప్రతిపాదాంతమందును స్వరప్రయోగముండును. ఝంపాది తాళముచేనిది గానము చేయబడును. ఇది గానానుగతమగును. ఛందము, తాళము నియమితమగుటవలన ఇది నిర్యుక్తమని (నిబద్ధమని) చెప్పబడును. స్వరము, పదము తాళము అను ప్రబంధాంగములు మూడుండుటవలన నిది భావనీజాతికి సంబంధించును. ఇది పద్యరూపమునను గద్యరూపముగను ఉండును. గద్య రూపమగు ప్రబంధముగూడ పద్యరూప ప్రబంధమునకు సమానమైన మాత్రలు గలిగియుండును. మొదటిది వర్ణమనియు రెండవది మాత్రికమనియు చెప్ప బడును. గద్యరూపమగు కలహంసమున ప్రతిపాదమునందును మొదట స్వరములనుపయోగించి పిదవ పదములుపయోగింపవలెను. దీనియందు మొదట ప్రథమార్థమున ఉద్గ్రాహము ఉత్తరార్ధమును ధ్రువమును (పల్లవి) ఉండును. కావుననిది త్రిధాతుకము.

**రాగకదంబకము :** నంద్యావర్తము, స్వస్తికమని రాగకదంబకము ద్వివిధము నంద్యావర్తనము నాలుగు వృత్తములను నాలుగుతాళములను-డును. ప్రతిపాదమునకు రాగము మారుచుండును. అర్ధభాగముగకాక రాగముమాఱు

---

* దీనియుగణ IUI UIU UII UIU అనురీతిగా జరభర యను గణము లుండును. దీనికి భరతుని హంసవృత్తమునుగూర్చి తెలిపిన "ద్వితీయ షష్ఠ....శ్చ" అను శ్లోకము మూదల

భూషణ కిరణావళి - సంగీతసారహావ్యబోధి

చుండవలయును. అర్థభాగమునకు ఒకరాగముండినను ఉండవచ్చును. వృత్తమున కొక రాగమైనా ఉండవలెను. ఏ వృత్తమునకేతాళము సరిపోవునదో ఆ తాళ ముండవలెను. స్వస్తికమను రాగకదంబకమున వృత్తములు ఎనిమిది. తాళములు ఎనిమిది. రాగములు ఎనిమిది యుండవలెను. వృత్తలు పదునారు తాళములు పదునారు రాగములు పదునారనునవి అబ్జపత్రమను రాగకదంబకము దేనిపేరే అబ్జగర్భము. భ్రమరాభ్రమేడితము అను రాగకదంబకమున ముప్పది రెండు వృత్తములు, ముప్పది రెండురాగములు ముప్పది రెండు తాళములుండును. ఇవి గద్యమునందుగూడ నుండును. ఇది ద్విధాతుకము మేదినీజాతి కలిగియుండును. దీనియందు పద్యమంచైనను పూర్వార్థమున ఉద్గ్రాహము, ఉత్తరార్థమున ధ్రువ ముండును. ఉద్గ్రాహధ్రువములు మాత్రమే ఉండుటవలన ఇది ద్విధాతుకము. ధ్రువము పల్లవివలె ఉద్గ్రాహము అను పల్లవివలె నుండును. ఇది రాగకదంబక మను మహాప్రబంధముగ చెప్పబడుచున్నది. ఇందు ఆభోగమను ధాతువు లేక పోయినను అంతిమవృత్తమున రాగయుక్తముగ గాతృనేతృప్రబంధనామములను నిలుపవలెను.

వివిధరాగములు ఇందొక స్తబకమువలె కదంబమువలె ప్రయుక్తములగును గాన దీనిని రాగకదంబకమనినారని తోచుచున్నది. నేడు మనకు గోచరించుచున్న రాగమాలికలకు మూదల ఈ రాగకదంబకమేమో అని ఊహించుటకనువున్నది.

**శ్రీవిలాసము :** ఇది విప్రకీర్ణప్రబంధము సుప్రసిద్ధము. దీనియందు ఐదు తాళములు ఐదురాగములును పంచఖండములుండును. ప్రతి ఖండమునందును ఒక్కొక్క రాగమును ఒక్కొక్క రాగమును ఒక్కొక్క తాళమునుండును. ప్రతి రాగమునను స్వరప్రయోగముండును. ప్రతిఖండిక చివరను పదము లుండును. స్వరములు మున్నగునంగములుకూడ నుండవచ్చును. దీనియందు ఉద్గ్రాహాదిధాతువులు, ప్రబంధనామము, ప్రభునామము, కవినామము రాగ కదంబకమునందువలెనే యుండును. ఇది త్రిధాతుకము. ద్విధాతుకమని వేంకట మఖి చెప్పెను. సంగీతరత్నాకరమునందలి ప్రబంధాధ్యాయమున దుగఅ రెండువందల అరువదియైదవ శ్లోకమున శ్రీవిలాసప్రబంధలక్షణమును జూడ నగును.

సవైలాప్రబంధలక్షణము : ఏలలు, సూడ (గీత) క్రమస్థితములగు ప్రబంధములు ఇవి శుద్ధములు (శుద్ధసూడ ప్రబంధములని) అని చెప్పబడును. ఏలయందు పదునారు పదములుండును. దీనియందు ఉద్గ్రాహము అను పల్లవియు ధ్రువము అను పల్లవియు ఆభోగమను చివరి చరణమునుందును. ఇవి గేయములని చెప్పబడు ధాతువులు. దీనివి స్వరరచనలని చెప్పవచ్చును. ఏలయందు ఉద్గ్రాహము ధ్రువము ఆభోగము అను ధాతువులు (స్వరరచనలు) మూడుండును. కనుకనిది త్రిధాతుకమగు ప్రబంధమగుచున్నది.

ఉద్గ్రాహమని చెప్పబడు అను పల్లవియందు మూడు పాదములుండును. అందు ప్రథమ పాదమునందును, ద్వితీయ పాదమందునుగూడ మొదటి రెండేసి ఖండములుండును. ఆఖండములు రెంటియందును ధాతువు (స్వరములకూర్పు) ఒకే విధముగనుండును. మాతువు అనగా సాహిత్యము వేరుగానుండును. మొదటి ఖండము, రెండవ ఖండముకూడ అనుప్రాసముతో గూడియుండును. ఈరెండు ఖండములను మొదటిపదమని చెప్పుదురు. తరువాత గమకములతో గూడినదియు అక్షరములు లేనిదియునగు ఆలప్తి (ఆలాపమను ప్రయోగము) ఉండును. ఈ ప్రయోగము ద్వితీయపదము (రెండవపదము) పిమ్మట పల్లవములను పేరుగల మూడుపదములుండును. ఇవి మూడవది నాల్గవది ఐదవదియునగు పదములు. మీద తెలుపబడిన ఐదుపదములు ప్రథమపాదమునందుండునట్లే ద్వితీయపాదమున నుండును. కాగా ప్రథమపాదమున ఐదుపదములు, ద్వితీయపాదమున ఐదు పదములు కలసిన మొత్తం పది పదములగుచున్నవి. తృతీయపాదమున పల్లవములను పేరుగల పదములు మూడునుండును. రెండే పదములుండును. ప్రథమ ద్వితీయ పాదములందువలె అనుప్రాసముతో గూడున రెండుఖండములు గలదియగు ఒక పదమును సంబోధనముతో కూడిన ఒక పదమును ఉండును. కాగా ద్వితీయాపాతమున రెండుపదములే యుండును. మొత్తము ఉద్గ్రాహమను స్వరరచనయందలి మూడుపాదములలోను పన్నెండు పదములుండును. ధ్రువమని చెప్పబడు పల్లవియందు మూడేపదములుండును. ఆ భోగము (చరణము) నందు ఒకే పదముండును. ఇచట 'పదము' అని చెప్పబడినది. వాచకములగుపదముల సముదాయముగాని ఒకేపదముగాదు అని తెలియవలయును. మొత్తముపద సముదాయరూపములగు పదములు పదునారు ఏలయందుండును. ఈపదములు

పదునారింటికిని పదునారు పేళ్లుగలవు. ఈపదములకు జీవనహేతువులగు ప్రాణములు - పదియున్నవి. అందు వాసవ మనునది పదమూడవ పదమునకు నామమైయున్నది సుకుమారమను ప్రాణము వర్ణనమునందును, ధ్వనియందును మూర్ఛనయందును కోమలముగా నుండునిదియగు ప్రాణము. వాసవమను పేరు గల పదమూడవ పదము ధ్రువఖండమునందలి వల్లవియందలి ద్వితీయపదమగు చున్నది. ఆ పదమున ఈసుకుమారమను ప్రాణముండవలెను. అట్లుండినయెడల ధ్రువము (వల్లవి) సుకుమారముగానుండును. "సుకుమార వల్లవనవైలాలక్ష్మి" అని భూషణకవి ఈవిషయమునే దెల్పెను. వల్లవికి వల్లవమని పేరుగలదు. వల్లవి వల్లవము సమానార్థకములు. ఈమూడు పదములుగల (ధ్రువమునందే) ఏ పదమునందైనను స్తుతింపదగిన దేవతనామమునో, ప్రభునామములో నివేశింప వలెను. ఆభాగము (చివరి చరణము) నందు వాగ్గేయకార (బయకార) నామాంకితమగు పదముండవలయును. ఈ పదునారు పదములను రెండుసార్లు గానముచేసి చివరను ధ్రువమును (వల్లవిని) గానముచేసి న్యాసమునొనర్పవలెను. ఏలలు గణమాత్రా వర్ణభేదయులవలన చతుర్విధములై అవి తిరుగ అవాంతర భేదములతోగూడి మూడువందల యేబదిఆఱు భేదములు గలిగియున్నది. సంకీర్ణ భేదములు అనంతములుగానున్నవి.

"షట్పంచాశదుక్తం ప్రోక్తమిత్యేతానాం శతత్రయమ్" అని సంగీత రత్నాకరమునందలి ప్రబంధాధ్యాయమునందలి నూటముప్పదిరెండవ శ్లోకమున చెప్పబడెను. సంగీతరత్నాకరమునందలి ప్రబంధాధ్యాయమునందలి అరువది యాఱవ శ్లోకము మొదట నూటముప్పదిమూడవ శ్లోకము వఱకును ఏలలు తెలుప బడినవి.

ఏలలు త్రిధాతుకములు. మతాంతరమున చతుర్ధాతుకములును అగు చుండును. ఇది ఏలా సాధారణలక్షణము. నాదావతి, హంసావతి, నందిని, చిత్రిణి, రీతిరేఖ, మాలతి, మనోరమ, లలిత, భోగవతి, ప్రభావతి, సురస, కుముదిని, విద్యుల్లత, విపుల, విమల, నలిని, విశాల, సరల, తరల, స్వరలేఖిత మున్నగు రమణీయ నామములుగల ఏలలనేకములున్నవి. వానికిగల విశేష లక్షణములు అనేకములున్నవి. నేడికాలో అందు వినబడు లలితసంగీతమందలి

గేయములుకొన్ని వీనిని బోలియుండును. సినిమాలయందలి కొన్నిగేయములు వీనిని బోలియుండును. రామరాజభూషణుడు "నవైలాలక్ష్మి" అను పదమున నీ యేలలను పేర్కొనియుండెను. "నవైల" అను పేరుగల ఏలకూడనొకటి అనంతరములగు ఏలలలో నుండినచో నుండవచ్చును. అప్పుడీ మహాకవి దానినే పేర్కొనియుండెనని చెప్పవచ్చును. సంగీతరత్నాకరమున ప్రబంధాధ్యాయము నందలి—

"గుణాన్వితం దోషహీనం నవం రూపకముత్తమమ్" అను 365 శ్లోకము నుండి 365 శ్లోకము వఱకునుగల శ్లోకములందు సూడాది ప్రబంధములందు నవత్వమునుగూర్చు నుపాయము తెలుపబడియెను. అదెట్లనిన, పూర్వులచేత నేర్పరుపబడిన రూపకమునగల రాగము స్థాయాంతరములచేత నవమగునట్లు చేయుట, అట్లే మాతువును (సాహిత్యమును) గూడ ఛందోభేదముచేతను ప్రతిపాద్యమగు వస్తుభేదముచేతను శృంగారాదిరసభేదముచేతను అనుప్రాసోపమాద్యలంకారములచేతనే నూతనమగునట్లుచేయుట, పూర్వగీతగత తాళముకంటె భిన్నమగు లయగ్రహముగల తాళము నాశ్రయించుటచేత తాళము నవమగునట్లు చేయుట మున్నగు నవత్వమును గూర్చునుపాయములు పెక్కులు వివరింపబడినవి. దీనిననుసరించియే ఈమహాకవి పతాకాయుక్తమగు పల్లవాభినయముచేత చేయికదలింపగానె నవ+ఏలాలక్ష్మి=నవైలాలక్ష్మి, నూతనమగు ఏలాప్రబంధ శోభతోచుసని తెలిపెను. ఏలాసంపద అనంతముగాన ఏలాలక్ష్మియని వాకొనెను. షట్పది : దీనియందు ఆఱుపాదములుండును గావుననే దీనికీ పేరుకలిగెను. ఇది విప్రకీర్ణ ప్రబంధములయందున్నది. దీనియందలి మూడవ పాదమునందును

---

సంగీతరత్నాకరోక్తమగు ప్రబంధలక్షణములివి.

కలహంస : "ఛందసః కలహంసస్య.... దైరంతైస్స్వరాన్వితైః॥
కలహంసః స్వరే న్యాసే గేయోయుంపాది తాళతః॥
వర్జితో మాత్రికశ్చేతి కలహంసో ద్విధామతః
గద్యాత్మాచేత్ స్వరాన్ గీత్వాతతః పాద వినేశనమ్"

వృషభ కలంభకస్తుతం కూడా. సంగీతరాజమున

ఆఱవ పాదమునందున మూడేసి గణములుండును. మూడేసి గణములగలవియగు మూడు, ఆఱు పాదములలో రెండేసి మన్మథగణములు (మూడవ ఛందమున బుట్టిన మగణాదులు) ఒక్కొక్క బాణగణము నుండును. (నాలుగవ ఛందమున బుట్టినవి బాణగణములు) మిగిలిన చరణములయందలి వన్నియును మన్మథ గణములే యగును.

---

"ఛందసా కలహంసేన తాళైః ఝంపాదిభిశ్చయః
నిబధ్యతే ప్రబంధేఽసౌ కలహంసః స చద్విధః
గద్యపద్యోపాధి వశాత్ తత్రస్యాత్ గద్యదే విధిః
మాత్రాభవో వర్ణజస్య ప్రత్యేక తావుభౌద్విధ
ఆదౌగీత్వా స్వరాన్ పశ్చాత్ పాదానాం స్యాన్నివేశనమ్
పద్యజీతుపదం పూర్వం గీత్వాపశ్చాత్ స్వరావళిః
పదైరన్యైః స్వరాంతైః స్యాదత్రాభోగ చతుష్వపి
తథా చతుష్వప్యేతేషు స్వరైరన్యై యశ్శ్వివిధీయతె"

రాగకదంబకప్రబంధః

నంద్యావర్తతః స్వస్తికశ్చ ద్విధారాగ కదంబకః
చతుర్వావృత్తిన్చతుస్తాళో రాగరాజి విరాజితః
నంద్యావర్తో భవేత్తస్య తాళమానద్వమేనవా
ఉద్గ్రాహిణాధవన్యాసో గద్యే పయసం పరేజగుః
తాళేనైకేన కేచిత్ స్వస్తికో దిగుణస్తతః
అబ్జపత్రోఽబ్జగర్భశ్చ భ్రమరాభ్రమేడితే మతే
కేషాంచిత్ పూర్వపూర్వస్యాద్ద్విగుణః స్యాత్ పరంపరః

శ్రీవిలాస ప్రబంధః

"స్వరాంతః శ్రీవిలాసః స్యాత్ తాళైః రాగైశ్చవంచ[illegible]"

స్థాయిస్వరమును సరిగ ఇత్యాది స్వరసంజ్ఞలతో నుచ్చరింపక నాద రూపమున నుచ్చరించి న్యాసము (ముగింపు) నొనర్పవలెను. ఇందు మూడు పాదములలో ఉద్గ్రాహము (అనుపల్లవి) యుండును. తరువాత ధ్రువము (పల్లవి) యుండును. తదుపరి ఆభోగముండును. కనుక ఇది మూడుధాతువులు కలిదిగనున్నది. పదము, స్వరము అను రెండంగములుండుట వలననిది తారావళి జాతికి చెందినది అగుచున్నది. దీనియందు తాళము లేకున్నను గణభాషనియమ మున్నదిగనుక్తనిది బద్ధము) అని చెప్పబడును.

---

ఏలాప్రబంధః

"అంఘ్రౌ ఖండద్వయం సానుప్రాసమేకేనధాతునా
తతః ప్రయోగ స్తదను పల్లవాఖ్యం పదత్రయం
ద్వేస్తో విలంబితే తత్ర తృతీయం ద్రుతమానతః
ఏవం పాదత్రయం గేయం ఉద్గ్రాహే తుల్య ధాతుకమ్
కేవలంతు తృతీయాంఘ్రౌ సంబోధన పదాన్వితః
ప్రయోగోఽన్యో విధాతవ్యో న పల్లవపదస్థితిః
అముం ప్రయోగం మేళాపం ప్రాహుః సోమేశ్వరాదయః
స్తుత్యానామాంకితో మధ్యసిక్షింబిత పదత్రియః
ధ్రువ స్తత స్తత్ర పూర్వమేకధాతు పదద్వయం
భిన్నధాతు తృతీయం స్యాదాభోగ స్తదంతరమ్
గేయో వాగ్గేయకారేణ స్వాభిధాన విభూషితః
పునర్గీత్వా ధ్రువే త్యాగో గృహస్తు విషయేభవేత్
ఏలా సామానలక్ష్మః తత్ పూర్వాచార్యైరుదీరితమ్"

ఏలాపదప్రాణాః

సమానో మధురః సాంద్రః కాంతోదీప్తిః సమాహితః
అగ్రామ్యః సుకుమారశ్చ ప్రసన్నోజస్వినా వితి
మాంధాత్రాది పదేషుస్యుః ప్రాణాదశాదశాస్మిమే
సమానోఽల్పాల్పాక్షరధ్వానో మధురః స్వల్పనాదయు
అల్ప మూర్ఛనయాయుక్తః సాంద్రస్తునిబిడాక్షరః
.... .... .... .... .... ....
సుకుమారో వర్ణనాద మూర్ఛనా
ప్రసన్నః స్యాత్ పదస్థాన స్వరాదీనాం ప్రసాదతః

షట్పదీప్రబంధః

షష్ఠ తృతీయత్రిగణః పృథగ్ద్విద్విగణాః పరౌ
చత్వారశ్చర బాసాత ప్రాంతౌషష్ఠ తృతీయకౌ

"అకుటిల సౌమ్యమాన నిలయస్ఫురణంబును నాతిమాత్రతా —
రకపరివర్తనంబు శుభరాగ మిళత్స్వర పల్లవాంకము
ద్రికయును బెంపుమీఱ నిజదృష్టుల బోలిన సింధుకన్యకా
ప్రకట వివాహగీతికలు పాడిరి పుణ్యపురంధ్రికామణుల్"

ఈపద్యముకూడ భూషణుని సంగీతకళాచణత్వమును పలువురు విమర్శకుల దృష్టిలోనికి తెచ్చినది. ప్రఖ్యాత వ్యాఖ్యాకారుడగు సోమకవి ఈపద్యమందలి నిషాద స్వరస్థితిని "అకుటిల సౌమ్యమాన నిలయ స్ఫురణంబున" అతిశయము గాని ఉచ్చైస్స్వర సంచారమును నాతిమాత్రతారక పరివర్తనమున కొంతవఱకు గుర్తించినాడు. కాని సమగ్రవ్యాఖ్యానము గావింపలేదాయెను. ఇందలి సింధు కన్యకా ప్రకట వివాహగీతికలను పలుకుబడినిబట్టి ఇందు సైంధవీ రాగచ్ఛాయను ప్రఖ్యాత విమర్శకాగ్రేసరులగు శారదాపుత్ర శ్రీపుటపర్తి నారాయణచార్యుల వారును వారిశిష్యవరేణ్యులగు రాజన్నకవిగారును ఇందు సైంధవీ రాగచ్ఛాయ ననుమానించిరి. నా పరిశీలమున నిందున్నది సింధునామక రాగమని గుర్తింప బడినది. పణతులవారు ఇందు లక్ష్మీ వివాహగీతికా గానము వెలయింపబడినది గావున ఇద్దానిని భోట్టరాగప్రభవమగు మాంగళీ రాగమున గానముచేయదగుననచు ఇందంతరితమైయున్న మంగళాచార ప్రబంధలక్షణమును వివరించినాడు అ ప్రబంధ విశేష వివేచనమిట వారు వివరించిన లక్షణానుసారముగ అనుసంధా వింపబడుచున్నది.

---

శేషస్తు మన్మథగణాం యస్యాం సాషట్పదీ మాతా
కర్ణాట భాషయా తాళవర్జితనాదముక్తికా
భేద వేద్యత్రేపద్యాదే ఛందోలక్ష్మణిభూరయః"

ఈపద్యమున ఈ మహాకవి పేర్కొన్న వివాహగీతికలుకూడ సంగీత ప్రబంధ విశేషములేయగుచున్నవి.

దీనియందు పుణ్యస్త్రీరత్నములు లక్ష్మి (గిరిక) వివాహగీతికలు పాడినట్లు చెప్పబడినది. "ఆ వివాహగీతికలు తమ దృష్టుల వలెనున్నవి" అవి నిజ దృష్టులకును వివాహగీతికలకును అర్థశబ్దశ్లేషములచేత సామ్యము ప్రతిపాదింపబడె

నది. దృష్టిపరమగునర్థము మొదటిది. ఆ పుణ్యస్త్రీల దృష్టులు కుటిలతలేక సౌమ్యములై అభిమానమే ఆలయముగాగలవి. వానికి సంబంధించిన కనీనికలు (దృష్టికి హేతువులగు నల్లగుడ్లు) ఒయ్యారుల కనీనికలవలె విశేషించిచలింపక ఇంచుక కదలిక కలిగియుండునది. ఆ పుణ్యాంగనలు లజ్జాకలితలు గనుక నిజ శీర్షములవంచి కెంజిగుళ్లవంటి తమ పాదములయందే దృష్టులను ప్రసరింపు చుండిరి. కనుకనవి పదపల్లవాంకముద్రగలవి యగుచున్నవి. పుణ్యస్త్రీల దృష్టులవంటివిగా చెప్పబడిన గీతికాపరమైన అర్థము నిట్లెఱుగునది. శుభవివాహ గీతికలు (పుణ్యస్త్రీల దృష్టులవలెనే) సరళములు (తిన్ననవి) సౌమ్యములు (లలితములు) ప్రమాణగతి యుక్తములగు నిషాదాంత్యములగు స్వరముల యొక్కయు స్ఫురణముగలవియు తారస్థాయియందు ఎక్కువగా సంచరింప నిదియు (ఉచ్చైస్స్వర సంచారములేనివి) శుభప్రదములగు రాగవిశేషములతో గూడినవియు శుభవాచక పదములును దేవతాంక ముద్రికయుగలవి ప్రసిద్ధము లయినివి.

మీద తెలుపబడిన శుభవివాహగీతికలు అకుటిలములు (సరళములు) సౌమ్యములు (లలితములు) మాననిలయములు ప్రమాణగతి నాశ్రయించునది అగు నిషాదము చివరిదిగాగల స్వరములు గలదిగా చెప్పబడినది గనుక, అవి శుద్ధ గీతినాశ్రయించినవిగ నూహింపవలసియున్నది. మీది పద్యమునందలి విశేషములు శుద్ధగతియందున్నవి.

"గీయతః పంచశుద్ధాచ - శుద్ధాస్యాదవక్త్రైః లలితైః స్వరైః

భిన్నా వక్రైః........" " సం. ర. రాగవివేకాధ్యాయము 2 - 3.

గీతుల శుద్ధభిన్నాది జాతులచే పంచవిధములగుచున్నవి. అందు శుద్ధగీతి వక్రములు (కుటిలములు) కాని లలితములగు స్వరములతో గూడియుండును. భిన్నగీతి వక్రములగు స్వరములతో గూడియుండును. కనుక వివాహగీతికలు అకుటిలములు లలితములు. సరియగు (సమమగు) ప్రమాణముగలవిగు శుద్ధ గీతి స్వరములతో గూడియుండునవి ఊహింపవలసియున్నది. ఇందు నిషాదము

చివరిదిగాల స్వరములన్నియు శుద్ధగీతి నాశ్రయించి యుండునని చెప్పదగి యున్నది.

శుద్ధగీతి స్వరముల నాశ్రయించి పాడదగిన వివాహగీతికలు సంగీత ప్రబంధములలో ఏ ప్రబంధముచేత, ఏ శుభరాగములచేత పాడదగినవి అను విషయముమీది పద్యమున వాచ్యముగా జెప్పబడుటలేదు. కాని స్ఫురింపజేయబడి నది. కనుక మహాకవి అభిప్రాయమునిట ఊహింపవలసియున్నది.

విప్రకీర్ణ ప్రబంధములలో చివరిదియగు మంగళప్రబంధమున ఆపుణ్య స్త్రీలు వివాహగీతికలను పాడిరని చెప్పవలసియుండును. దీనియందు ధ్రువమనగా పల్లవముండును. ఉద్గ్రాహము (అనుపల్లవము) ఉండును. ఆభోగము (చివరి చరణము) నందు అంకముద్రికగా దేవతానామాదికముండును. ఈ సంగీత ప్రబంధమును శుద్ధపంచరాగమునకు సంబంధించిన భాషారాగమగు కైశికీరాగ మునగాని భోట్టరాగమునగాని గానము చేయవలయును అని చెప్పబడినది.

మంగళాచార ప్రబంధలక్షణములతోఁగూడిన మంగళప్రబంధ లక్షణము నిట్లెఱుఁగునది. మంగళవాచకములగు ఖండ చక్రాదిపదములతో గూడియుండు లఘుద్రుతాదులగు సంగములతో గూడిన తాళము దీనికావశ్యకముగాదు. తాళాంత రానువర్తియగు లయయే చెప్పబడినది. భోట్టరాగము ఉత్సవములందు పాడదగి నది. సప్తస్వరములను గలది. దీనికి గ్రహము అంశము, ప : న్యాసము, మ : కాకలి, ముఖ్యముగానుండును. పగటిలో నాలుగవజామున గానముచేయ బడును. గాంధార ప్రయోగమల్పయుగ నుండును. (సం.ర. రాగ.వి. అ. 50, 51, 52) తారాస్థాయియందు మధ్యమమువఱకు మాత్రమే పాడదగినది. హాస్య శృంగారములయందు వినియోగింపబడును. ఈ భోట్టరాగమునుండి జనించిన 'మాంగలి' రాగమునగూడ దీనిని పాడదగును. ఈ మంగళప్రబంధమును మంగళవృత్తము చేతగూడ గానము చేయవచ్చును

"పంచ తకారగణాః ప్రతిపాదగతిశ్చేత్।
మంగళమాహురిదం సుధియః ఖలువృత్తమ్॥"

మీది శ్లోకము మంగళవృత్తమునకు లక్షణమును లక్ష్యమునుగూడ నగుచున్నది. దీనియందుగూడ పదాంతమునందుగాని అర్థాంతమునందుగాని స్వరముల నుపయోగింపవచ్చును. ఇది భావనీజాతికి చెంది త్రిధాతుకమైయున్నది.

"అకుటిల సౌమ్య మాననీయము, నాతిమాత్రతారక పరివర్తనము శుభ రాగమిశ్రత్వద, వల్లవాంకముద్రిక" అని ఈ కళానిధి యుద్దేశించిన ప్రబంధ మిదియేయగునని యూహింతును.

ఇట్లీ ప్రబంధాకాహ్వయుడు ఎడనెడ గావించిన ప్రబంధలక్షణ వివేచనమును స్థాలీపులాక న్యాయమున నాకుతోచిన రీతిలో గావించితిని. పిదప నీమహాకవీంద్రుడు సంగీతకళారహస్యనిధియై తేజరిల్లుటకు నీతని రాగవివేకాన్విత మగు రాగరహస్య నిక్షేపణము గూఢరీతిలో గావించుట ప్రథమార్హతయై భాసిల్లగా సంగీతమాహాత్మ్యభినందనము ద్వితీయము నద్వితీయముకూడ నగుచున్నది. ఈ రాగవివేకమునీతడు తన అపార సంగీతశాస్త్ర పాండితీవిశేషముచే మెఱుగులుదిద్ది తన గ్రంథమున తనకు సహజమగు ద్వ్యర్థఘటనావిశేషమున ప్రదర్శించినాడు. ఇది సామాన్యదృష్టికి సాహిత్యపరమగునర్థముతో ప్రస్తుతార్థము వలె సన్నివేశగతముగ గోచరించును. సూక్ష్మేక్షికతో నిందలి రాగనిక్షేపణాత్మక గూఢరీతిని నెమకినవారికి ఇందలి సంగీతపరమార్థము అప్రస్తుతార్థ సంయుతమై చమత్కారావహమగు రీతిలో గోచరించుట ఇతఃపూర్వము వివృతము.

గ్రంథ విస్తరభీతివలన రామరాజభూషణ కవివరుని సంగీతరహస్య నిధిత్వమును ప్రత్యేక గ్రంథముగ వెలయించునుద్దేశముతోడను నేను కొన్ని రాగరహస్యముల మాత్రమే ఇట నిక్షేపించినాను. శాస్త్రాభిజ్ఞతకు మూదలలైన కొన్నిటిని మాత్రమే ఉపలక్షించినాను. ఇట్టి సంగీతకళారహస్యనిధి కవసాంతరిత సంగీతరీతిని ఆతడు రాగవివేకమున శాస్త్రాభిజ్ఞతయందు సంగీతానూన మహాత్మ్యభినందనములందు గాంచవచ్చునుగాన ఇంతదనుక స్థాలీపులాక న్యాయముగ ఈతని రాగవివేక శాస్త్రాభిజ్ఞతానుశీలనము గావింపబడినది. ఇక మిగిలినది ఈ కవివరుని సంగీతమహాత్మ్యభినందనరీతి,

"సంగీత సాహిత్య కళా౽భిజ్ఞః

సాక్షాత్పశుః పుచ్ఛవిషాణహీనః" అను ఆభాణకము జగత్ప్రసిద్ధము అందలి ఉపాలంభమునెఱిగియు సంగీతాభినందనము నెఱుంగని అరసిక శిఖామణు లెందరో యున్నారు. అట్టివారు కొందఱు తాము సంగీతప్రియులమని చెప్పి కొనుట తమ రజజ్ఞతకొక అలంకారమని భావించి సంగీతసమారోహముల కేగి అభినందనార్హమగు సంగీత సంగతిగలిగినపుడు చెప్పిన చప్పట్లు కొట్టగల మందురు. వారిసంగీతరసిక హృదయమట్టిది. అట్టియెడవారిని సాక్షాత్పరబహ్మయే కొనిపోయి బ్రహ్మాణియొద్ద సంగీతము చదివించి మార్చలేడనుట నిజము సంగీత హృదయము సహజసిద్ధమై వాసనాసంయుతమై జన్మతః రావలయునుగాని చెప్పిన అబ్బెడి విద్యగాదు. మన ప్రాచీనాంధ్ర కవులలో నూటికి తొంబదిమంది సంగీతమునకు దగ్గరివారేగాని దూరపు బంధువులుగారు. వారిలో పెద్దన్నగారి స్థానము పెద్దదైన కవిగాయక సోదరమధ్యముడు కృష్ణరాయలుకాగా కడగొట్టు గారాబు తనయుడు రామరాజభూషణుడగు చున్నాడు. తల్లికి కడగొట్టు చంటిబిడ్డ వలె ఈ కవివరుడు ఆచదువుల యమ్మకు సంగీతసరస్వతికి ముద్దులబిడ్డడై స్తనంధయ శిశువై ప్రతిపద్యమును తానప్పుడే కడుపారద్రాగిన గీతిసాహితీ స్తన్యమునందలి అమృతత్వమును అరిగించుకొని త్రేంచినాడు. అందులకే ఆతని కవనమున ఆ సంగీతామృతపు రుచి వేయివిధముల అభినందితమైనది. ఈసంగీత కళారహస్యనిధి గావించిన సంగీతమాహాత్మ్యాభినందనమునగూడ సంగీతసమగ్ర స్వరూపమైన తౌర్యత్రికరీతిగ గీతవాద్యనృత్య కుతపరీతులు వ్యక్తమగుట గమనార్హము. ఈ కవివరుని గానాభినందనమునకు ప్రత్యేక ప్రతీకగా "అనవిని కేశికాసచివుడు" అను పద్యమునందలి నాటరాగాభినందనము ప్రథమో దాహరణమగుచున్నది. ఆటు పిమ్మట "అరిగా పంచమమేవగించి" "ఇది పంధింపగ వేళయంచు" మున్నగు పద్యములు ఉదాహృతములగుటకు రాగ వివేకమేగాక గానాభినందనముగూడ కారణమగుచున్నది.

---

1) వి. చ. సోమకవి వ్యాఖ్య. ii - 30. 2) భూషణకిరణావళి. పం.రా. 3) సంగీతకళారహస్యనిధి. 4) వ. చ సాహితీ సౌరభము - పుటవర్తి 5) నాట్యకళ. డిసెంబరు 1970. ఎల్లాప్రగడ వెంకట నారాయణశర్మ.

ఇక తరువాతియగు ఇమ్మహాకవివరుని వాద్యాభినందనమునకు "వలుద గుబ్బలు ప్రసేవకవృత్తి" అను పద్యము, "ఒక చాయసనపాయ" అను పద్యము బృందగానరీతికి వాద్యసమ్మేళనమునకు "వైణిక వల్లకీశ్రేణి నిమ్మల మీటె" నను పద్యము చక్కని సంకేతములగుచున్నవి. ఈ రెండు పద్యములలో వసుచరిత్ర వ్యాఖ్యాకారుడగు సోమకవికూడ సంగీతపరమైన సమగ్రవ్యాఖ్యను సంతరింపగ మిగిలిన పద్యములకు వణతుల రామచంద్రయ్యగారు, పుట్టపర్తి నారాయణాచార్యులవారు, ఎల్లాప్రగడ వేంకట నారాయణశర్మగారు సమ్యక్సంశోధితభాష్యమును పచరించిరి. వీరిందరింతగ చెప్పినమీదట నేనింకను చెప్పబూనుట ఆంజనేయునిముందు కుప్పిగంతులువేయుట. అందువలన సమగ్ర పరిశోధనము జరిగిన పద్యములగూర్చి నేనింకను చెప్పి గ్రంథమును పెంచుట అనావశక్యకనను కొనుచున్నాడు. కావున ఇమ్మహాకవివరుని నాట్యశాస్త్రపరిచితినిగూర్చి ఆ మహామహులు ఎక్కువగా చెప్పలేదు గాన నేనావిషయమునుగూర్చి అనుశీలించదలచితిని. కవి సంగీతకళారహస్య నిధియగుటవలన "గీతం వాద్యంచ నృత్యంచత్రయం సంగీతముచ్యతే" అని తజ్ఞులు వక్కాణించుటవలన ఈకవివరునకు తౌర్యత్రిక ప్రజ్ఞయుంట యుండవలయుననుకొనుట సాజము. గ్రంథాంతరిత ప్రస్తావనలనుబట్టి వివేచించిన రామరాజ భూషణునకు గీత వాద్యముల మీదనున్నంత అభిమానము నాట్యశాస్త్రమీద లేదనిపించెడివి. అట్లని ఈతడు సంపూర్ణముగ నాట్యవిషయమున పరాఙ్ముఖుడు. ఇమ్మహాకవి తనకు నచ్చిన తామెచ్చిన నాట్యమునకు శాశ్వతత్వము గల్గింపదలచి ఆ నాట్యరీతిని వసుచరిత్రాంతస్థము గావించిన పట్టులు రెండేరెండున్నవి. ఒకటి పురవర్ణనమునందలి నాట్యశాలాభివర్ణనము. రెండవది ప్రకృతివర్ణనాంతరితమైన చంద్రోదయ వర్ణనలో నిమిడ్చిన భామాకలాప నాట్యహేవాకము.

అందు ప్రథమమగును నాట్యశాలాభివర్ణనమున తన నాయికలు నాట్య ప్రావీణ్యమున అప్సరాంగనల నధః కరింపవలెననెడి కవి కామన ప్రవ్యక్తము గావింపబడినది. గానము వాద్యసంయుతమై నృత్యానుగతమైనప్పుడు తిర్యగ్జంతుజాలములలోని మయూరములనేకాక దివ్యయోషిత్తులనుకూడకూడ పరవశింపజేయు అవశత్వస్థితిని కల్గించి సజీవచిత్రములుగా నొనరించునను నిత్యసత్యమునిట

ఉద్ఘోషించి రామరాజభూషణ కవివరుడు తన సంగీతకళావేతృత్వమును నాట్యకళావిలాసమునుగూడ మరియొకసారి ధ్రువీకరించుచున్నాడు.

"అన్నగర నాట్యశాలలఁ
జెన్నగు మురజముల రవళిచేనటియించున్.
గన్నియలకన్న మిన్నగఁ
బన్నగభు క్తులు దృష్టిపాత్రములగుచున్"

"చందనగంధులిందుమణి సౌధతలంబుల గొంటి సల్పగా
నందలి దివ్య చిత్రములయందొకరై యని మేషభామినుల్
కందళితాద్భుతస్ఫురణఁగన్గొని తన్నటనాంత గీతని
ష్యంద సజీవచిత్రముల నందడి నేఁగుదురప్పురంబునన్"

ఇక రెండవది ఈకవివరుడు చంద్రోదయ వ్యాజమున ప్రతిపాదించిన భామాకలాప నాట్యరీతి. ఈ భామాకలాప నాట్యరీతియందు సత్యభామావేషము దాల్చిన శైలూషి రంగప్రవేశము గావించురీతియందొక వైలక్షణ్యమున్నది. సహజముగ అటుప్రక్కనుండి ఇట ప్రక్కకులాగు యవనిక రంగస్థలమున నవతరించుట యవనుల సంప్రదాయమని అద్దానిని మనమువారియొద్దనేనేర్చితిమని నాటకకళావిదులు కొందఱనుచున్నారు. కాని ఏది యెట్లైనను ఈయవనికారీతిని తదితర నాట్యనాటక విశేషముల ననుసరించుచున్నను భామాకలాపమునమాత్రమే ఆపద్ధతి అనుసరింపబడుటలేదు. భామవేషమునుదాల్చి వచ్చిన 'నాట్యకర్త్రియె' కాని, నాట్యకారుడుగాని రంగస్థలమును ప్రవేశించినపుడు ఇరువురు హంగుదారులు ఆపాత్రమునకు నిలువెత్తు తెరను పట్టియుంతురు. అపుడు ప్రథమముగ భామవేసికొనిన పెద్దపూలజడ ముందు తెరపైనుండి వెలుపలకు వేయబడి ప్రేక్షకులకు దర్శనీయమగును. ఆపాత్రము ధరించిన పూలజడలో కుట్టిన వివిధ వర్ణసుమముల సంఖ్య ఆశైలూషి నేర్చిన నాట్యప్రభేదముల పరిగణనప్రదర్శక మగు నీపద్ధతి దరిదాపుల ఏబది సంవత్సరములకు పూర్వము గావింపబడిన నాట్యప్రదర్శనము ఆ సిద్ధేంద్రయోగి రచనముగా ప్రసిద్ధమగుటకు మున్దే దేశ్య నాట్యరీతులలోకూడ ఉండియుండవచ్చును. అది వక్రకమమైన రూపురేఖలు

దిద్దుకొని సర్వాంగ సుందరముగ దేశీనాట్యహేవాకముగ ప్రదర్శితమగుట రామరాజభూషణాచార్యుని కంటబడియుండవచ్చును. దానికా సంగీతవేది పరవశించి గ్రంథోపస్థితిని కలిగించియుండును.

ఈ భామాకలాపనాట్యమున తెరదించు పద్ధతి. ఇటుప్రక్కనుండి అటుప్రక్కకు లాగుటకాకపైనుండి మెల్లమెల్లగ దింపబడగ అలలాటపాదమై విలక్షణమై శోభించును. హంగుదారులు తెరనుదించు పద్ధతిలో ఆనాట్యపాత్రపుటాహార్యము అభినయముకూడ క్రమపద్ధతిలో ప్రవ్యక్తమగును. ఆరీతిని రామరామభూషణుడు ముఖపర్యంతముగ సంసూచించు ముఖజాభినయ రీతిని ధ్వనించి తన్నాట్యహేలా దర్శనమును పాఠకుల మనోరంగమునందిట్లు అవతరింపజేసినాడు.

"హరిదంభోరుహలోచనల్గగన రంగాభోగ రంగత్తమో
భరనేపథ్యము నొయ్యనొయ్య సడలింపన్ రాత్రిశైలూషికిన్
వరుసన్ మౌక్తికపట్టమున్ నిటలమున్ వక్త్రంబునుం దోంచెనా
హరిణాంకాకృతి వొల్చెరేకయి సగంబై బింబమై తూర్పునన్"*

ఇందు వర్ణితమైన మౌక్తికపట్టముతో నందగించిన నిటల ప్రస్తావనమున లలాటసౌందర్యము. భ్రూవిన్యాసము గమ్యమానము. అట్లే వక్త్రప్రసక్తివలన నాసా నేత్రోష్ఠ సౌందర్యముతోపాటు ముఖజాభినయాంతరితమగు నేత్రాభినయనము నాసికాచలనము ఓష్ఠచాలనము సంవేద్యమగును. ఇట వర్ణితమైనది హరిణాంకాకృతిగాన ఆ చంద్రునిలోని చల్లదనమున సాత్త్వికాభినయనము ఆ చంద్రహాసమజన శైలూషిప్రదర్శించిన మందహాసముకూడ ఊహింపగలిగిన రసజ్ఞుల కవగతమగును.

ఈ మహాకవి గావించిన సంగీతాభినందనమునకు నుదాహరణములివ్వుచుపోయిన దానికంతుండదు. గ్రంథమంతయును నుదాహరింపవలసియుండును. కావున సర్వాతిశాయియై సంగీతమాహాత్మ్య వివేదికమైన చిన్నిపద్యమున ఈ మహాసంగీతకళా వేదిదైన నాదబ్రహ్మోపాసనమును గమనింపవచ్చును.

* వ. చ. iv - 17

"వీనులవిందై యమృతపు
సోనల బొందై యమంద సుమచలదళిసీ
గానము క్రందై యాస్వన
మానంద బ్రహ్మమైన నధిపతి వల్కెన్"*

కవి యింతటి నాదోపాసకుడు గాపుననే గానానూన మహాత్వమును వసు చరిత్రమున నింతగచాటి కృతకృత్యుడైనాడు. ఆతనితోపాటు తనకృతి సంగీత గౌరవమున అనూనమై అపారమై అనితరసాధ్యమై అనన్యమై ధన్యమై కృత కృత్యతాభావము నొందినది.

ఇక ఇద్దాని అనుశీలనమును సమగ్రముగ సాధించి సంగీత విశేషములను సంపూర్ణముగ వెలయించి కృతార్థత్వమునొంది ఏకైక విమర్శకాగ్రేసరత్వముతో విలువ గలిగినవారు మాత్రమై ఇంతవఱకు ఒక్కరును బయల్పడలేదు. నేను కూడ నావేర్చినంతమట్టుకు కొందవఱకు ఇందలి సంగీతరహస్యాన్వేషణమును రెండదశాశాబ్దులపై బడిన కృషి గావించితిని. పరిశోధక వ్యాసనమగ్రరచనమున సంతర్భాగముగ ఒక ప్రకరణము మాత్రమే యిట అను శీలింపవలసినదగుట వలన గ్రంధవిస్తరభీతిలో ఇంతవఱకు విషయ నివేదమిందు నిక్షేపించితిని. మజ్జనని గురుకుల సంప్రదాయరీతిలో సాధనగావించి స్వీయవీణానాదనాను లాలనము వినదించిన వసుచరిత్రాంతరిత పద్యములను కొన్నింటిని స్వరపరిచి యిచ్చినది. వానిని అదేరీతిలో అనూచానపద్ధతిలో ఆమె స్వరపరచిన మఱికొన్ని వసుచరిత్ర పద్యములనుకూడ కలిపి అనుబంధమునందను సంధించితిని. దీని వలన ప్రాచార్యవర్యులు కీర్తిశేషులు పింగళి లక్ష్మీకాంతంగారు మాకొసగిన ఆదేశము అనుసరణీయమైనది.

ఈపరిశోధన వ్యాసరచనాంతరము సమగ్ర సంగీతానుసరణాత్మకముగ రామరాజభూషణుని సంగీతరహస్యకళానిధిని వెలయింపవలెనని నిశ్చయించు కొంటిని. ఈశ్వరేచ్ఛ, గురుకృపాకటాక్షము రామరాజభూషణ కవివరుని కవితావేశము పన్నివనియందు నియమించి కృతకృత్యత నొసంగునుగాక.

---

* వ. చ. ii - 14

# చంద్రికా పరిణయ గానము

సంగీతకళారహస్యనిధియైన తామరాజభూషణ కవీంద్రుని సమకాలికులై సంగీతాభిరుచిని ప్రబంధముల ప్రదర్శించిన కవివరులలో సురభిమాధవరాయలు చెప్పికొనదగినవాడు. ఈకవి ఎన్నుకొనిన కథాగమనమునందే సంగీతము నెరపుటకు అవకాశముండుట విశేషము.

మంగళాశాసన పద్యము శ్రీరాగాంచితముగా తెలుపుటయేకాక ఆశ్వాసాది పద్యములలో చాలవఱకు రాగనామములను రాగముద్రాలంకార ఫణితిలో నీకవి పొందు నిక్షేపించినాడు.

కథాగమనము ననుసరించి వచ్చిన సంగీతప్రస్తావనలలో ఆద్యము హేమకూటవర్ణనము. ఇందు గీతవాద్యోభయయుతముగ సంగీత ప్రసక్తియుండుట గమనీయము.

---

* "శ్రీవక్షోజధర ... సమస్తలోకముల కామోదప్రదబియ్యెడిన్"
చం. ప. I - 1

"విలసత్కమలా పదయుగ
లలితా నుపమాన దివ్యలాక్ష లక్ష్మో
జ్జ్వలతర కౌస్తుభమణి పి
చ్ఛిల రుచి వక్షోవిశాల! శ్రీగోపాలా!"

చం. ప iii - 1. లలితకౌస్తుభ విశాలశ్రీలు రాగనామములు.

"కమలా కుచకలశ తటీ
విమలాంచిత మృగమ దాభివిలస న్ముద్రా
కమలాఘతి కృల్లాంఛన!
విమలా ళన రిపు విభేదవిధ! గోపాలా!" చం. ప. iv — 1

"సుభగంభావుక భువకొ
స్తుభ పాద్వ్యభన సహకృత్య దుర్దమ చక్రా!
ప్రభవాసుర సర్వంకష
విభవమ్మన్య ప్రతాపవృత! గోపాలా!" చం పరి. v — 1

"అలవతికాంచెఁ ఘన హైమమహాగృహవాసి కిన్నరీ
కులవాణీవల్లకీ సమనుకూల మనోహర గీత్యుపాంగము
జ్జ్వల సురజాల సుమవల్లవికావిచరన్మిళిందని
ర్మల రవభగ్న పాంథజన మానికవాటము హేమకూటమున్"*

ఆ పిదప చెప్పికొనదగినదేకాక మెచ్చుకొనదగినదిగాగనువట్టు తౌర్యత్రిక ప్రస్తావనము చిత్రరేఖావృత్తాంతము"నున్నది. ఇందు వసంతముదిని మోహింప నేతెంచిన చిత్రరేఖ స్వరూపమునందే సంగీతవిభవము వెల్లివిరియింపజేసిన కవి సంగీతాభిరుచి ప్రశంసార్హము.

"ఘనమార్గ విభవంబు వనితవేణినెగాదు
    శ్రుతిపర్వరాగ సంతతి నెసంగె
సమతాళవిస్ఫూర్తి సరిగుబ్బలనెకాదు
    నవ్య గీతప్రతానములు నెనసెఁ
గలహంస వైఖరి చెలిగతులనె కాదు
    సరస ప్రబంధ పుంజమునఁదోఁచెఁ
బల్లవంబుల పెంపు పదతికేలనె గాదు
    సొగసైన పదపాళి సొంపుహూనె

ననను వనదేవతా జనంబభినుతింప
రక్తివిధమును దేశీయరాగ గతియు
జిత్రతరమంద్ర రాగజశ్రీలు వెలయ
వింతమని చెంత వీణవాయించెనంత"**

మాధవార్యుడు ఘనమార్గరాగవిభజనమును సమతాళవిస్ఫూర్తిని కలహంస రాగతాళవైఖరిని, గీతప్రబంధ ప్రక్రియారీతిని, పల్లవ పదపాళిసొంపును నాయికా సౌందర్యవర్ణనమందే గాక సంగీతశాస్త్రరీతిలోకూడ పొందుపరచినాడు. ఇది ప్రశంసనీయము.

---

* చం. ప. i _ 167

** చం. ప. ii 97

ఇక తరువాత ఈకవి వాద్యాభినందనము గావించుచు గౌళరాగమును, పంతువరాళి రీతినిగూడ కిన్నెరపై ఆకన్నియపలికించిన తీరును స్వరాన్వితముగా ప్రవ్యక్తము గావించినాడు. తరువాత ఆయోషామణి ప్రదర్శించిన అపురీతిని, పదాళికాభినయనమునుకూడ కవి వర్ణించి తనదైన గానాభిరుచిని వ్యక్తము గావించెను.

*"సరసత్వంబున గేలనూని యల యోషామౌళి చక్కన్ రిరి
మ్మరి గా మారియటంచు రిప్ప నిమగా మమ్మారియం చున్విభా
స్వర నానావర క్తిఁదానతతి మించన్ గౌళివాయించి ని
బ్బరపున్ వేడుకఁజేయు పంతు విధమున్ పల్కించెనప్పట్టునన్"

"బళిరే వైరి సిరితీర్థ నిల్కడలు సేబాసయ్యే పేరణీ
కలనంజీర పదాళికాభినయవైర్యంబు మజ్జారెనో
పులవై చిత్రి యహా కరాభోజాత విన్యాస సమం
చలవేణుల్ విసుతింప సల్పెనటసంబా కొమ్మ తత్సన్నిధిన్"

"తాన చామరి కద్పుతముఁదాల్చు పోలిక
వరమణి పుత్రికల్ శిరములూప
ఘన గానసుధఁగ్రోలిత వొంది బయలూన్చు
గతిశిలాతతిజలౌ ఘమ్ముఁగురియ
యతిలయశ్రుతుల విస్మృతి తత్త్వమూనిన
చాయనాటులు వివిశ్చలతఁదాల్ప
చిరరక్తిలో నిండి పట్టుఁజాలక వెలు
వడి దారివల్లికల్ కడుఁజి గుర్ప

వసుచరిత్రమున నాయకుడు నాయికా గాన సమాకృష్టుడై ప్రణయోప విష్టుడైనట్లుకనే ఈ చంద్రికాపరిణయమునఁగూడ నాయికా నాయికుల సమా గమనమునకు సంగీతమే నేపథ్యమును సంతరించినది గిరికవలనే చంద్రికగూడ విపంచికావాదన చతురయగుట సవిశేషము.

చం. ప. ఆ. ii – 99, చం. ప. ఆ. ii – 100, చం. ప. ఆ. iii – 44

హరివసు పీఠికాసీనయై విపంచి
గలసి గానము సేయు భూకాంతపుత్రిఁ
గనకనిభగాత్రిఁగాంచియయ్యనకులుండు
వాలనాశ్చర్య జలరాశిఁదేలెనపుడు"

కవి యసాధారణ రాగవివేకస్వాంతుడనుటకు మూదలగ ఒకసన్ని వేశమున నాతఁడు రాగముద్రాలంకారోపస్థితముగ వొదివిన రాగనామములను గమనింప వచ్చును.

"అనుపమ రాజహంస భరణాదరణాత్మతఁ తత్సరోవరం
బున నలరాజహంస సుతబోటులు మించిరి పూర్వవైరముల్
వన భృతరాజహంసత నెసంగు దివాక్షణదాధి చేవులా
నని వనరాజహంస నమనాళిమనంబున సమ్మతింపగన్"

"వాసంతి యనఘాళి వరరసంబునఁగప్పి
వాసంతియన సముజ్జ్వలతఁబోల్చె
సారంగియన పాయ జలజాంబు తతి నాని
సారంగియనఁ జాల సంభ్రమించె
శశిరేఖయన సారచక్రాళి నలయించి
శశిలేఖయన శుభచ్ఛాయదోఁచె
చక్రాంగియనవద్య చారూర్మికల నూగి
చక్రాంగి యనె హృద్య చర్యమనలె
చూత కళికయనర్ఘ్యరణో వృత్తిఁగని
చూత కళికయనంగడుఁ జూడనొప్పె
హరిణియన రాళకములైక వరిచితిఁగతి
హరిణియన నవ్వనాస్థానినప్పు డలరె"*

ఈపద్యములందలి రాజహంస, హంస, వనరాజ్య హంప్స, వాసంతి, సారంగి, శశిరేఖ, ఊర్మిక, చూతకలిక, హరిణి, కమల మొదలైనవి రాగ

* చం. వ. iv — 74, iv — 75

నామములు. చక్రాంగి, ఆస్థానియనునవి చక్రవాక, రాజధానులను రాగములకు పర్యాయములు. రాగనామములను రాగముద్రాలంకారములుగ పరిశీలించుట, పర్యాయ పదములుగ ధ్వనించుట రామరాజభూషణాచార్యుని కవితయందు సహజము. ఇది ఈకవియందు క్వాచిత్కమునైన గోచరించుట ఈతని రాగ వివేకమునకు సంగీతాభిరుచికి తార్కాణము.

వివాహమంగళ కౌతుకమున కొన్ని గీతికానామములు, రాగనామములు కవిత యందు చోటు చేసికొన్నవి.

"యువతులు పాటఁబాడఁగ నవోత్కలికన్ శుభమంత్ర జాలకం
బవని సురాళికల్దెలుప........"*

"కనకాంగి మణియాత్మ ద్భృగిపు మహాకంఠావళిమెట్టు తీరు"**

"వనజాక్షన్ ధవళంబుఁ బాడఁగ మహావాదిత్ర నాదంబుబోరన్"***

ఇందలి ఉత్కళిక ధవళములనునవి గీతిప్రభేదములు కనకాంగి రాగ నామము. వాదిత్రనాదము గీతవాద్య నృత్యవిశేషషాన్వితము.

మొత్తముమీద ఈ సురభిమాథవార్యుని సంగీతాభిరుచి ప్రశంసార్హమగుట యేగాక ఈతడు రామరాజభూషణుని సమకాలికుడగుటయు గమనార్హము.

---

* చం. వ. vi — 61
** ,, vi — 65
*** ,, vi — 66

# చరికొండ ధర్మన్న సంగీతాభిజ్ఞత

ఈ ధర్మనార్యుడు తననగూర్చి సర్వవిద్యాభిజ్ఞుడనని తానే చెప్పుకొనిన మాట దబ్బరకాకుండ ఈ చిత్రభారతమున సకల విద్యలతోపాటు అతని సంగీతాభిజ్ఞత వెల్లడి ఆయెను. ఈకవి యీగ్రంథమును మానభూపాల చిత్తా ఖానుని మంత్రియైన ఎనుమలపల్లి పెద్దయామాత్యునకు కృతియొసంగినాడు. చిత్రభారత కృతిపతియు, పాండురంగమాహాత్మ్య కృతిపతియు సమకాలికులైనట్లు ఏక గురుశిష్యత్వమునందినట్లు తేటపడినందున ఈకవి తెనాలి రామకృష్ణకవికి సమకాలికుడని వ్యక్తము.

పీఠికలోని ఏకశిలానగర వర్ణనయందు ఆద్యముగ నీకవి నృత్యప్రీతిని ఇట్లు ప్రకటిత మొనరించినాడు.

"సంతతోత్సవ తోషిత శంభులింగ
సమ్ముఖేందు శిలానంద చారుమండ
పస్థలి నృత్యదంగనా పాదరణిత
నూపురంబగు నేకశిలాపురంబు"*

ఈ సకలకళాభిజ్ఞుడు తనను సర్వవిద్యాభిజ్ఞుడవని గారవించి కృతినిమ్మని అడిగిన నృపతినిట్లు వర్ణించినాడు.

"లలిత శాస్త్రాభినయామలాలంకార నాటక వ్యాఖ్యాన దక్షవిద్వజ్జనంబులు, అత్యంత మధురవాక్య ప్రౌఢి కావ్యనిర్మాణ బంధుర కవి గ్రామణులును, శ్రవణ సమ్మోద సంజనకానన హృద్య గానవిద్యాభిజ్ఞగాయకులును, దత్తిల భరతమతంగాది మునికృత నాట్యకళాప్రాజ్ఞ నర్తకులును...."**

గొల్వగ మణిమూర్త్న చంద్రకాంత శిలాసద్మసౌధరత్న పీఠికాపీఠమునై కూర్చొనియున్నట్లు కృతిభర్త వర్ణింపబడినాడు. ఆతడు మంత్రివర్యుడైనను

* చి. భా. i - పీఠిక. 10
** ,, i - ,, 16

ఏకాదువలేదు. ఆతని అంతికమున కవులతోపాటు గాయకులు, నర్తకులుకూడ పరివేష్టించియున్నారని తెలుపుటతోనే సంగీతరసికత గోచరించును. కావుననే అంతటి సంగీతరసికుని మనము వల్లవింప భవ్యభారత రచనమున సంగీతమునకు ఆద్యమగు స్థానము లభించినది. కథాగతిలో రతుల్యుడను యోగీశ్వరుని తపము చెరుప ధరణికి పొమ్మని ఇంద్రుడు రంభను మదనసహాయగ నొనర్చినాడు. అప్పడారంభాద్యప్సరోంగనలు అటకేగి "కరతాళగతులకనురూపముగమలగుచు రాయంచలగతి చిరించిరని"* వాడు కవి. అనగ ఆనాటి రాయంచలు నయితము కరతాళగతుల కనురూపముగ నడువగలిగిన లయాత్మికతను అలవరచుకొనెడివి కాబోలు.

"ఇంతులు తమలో నేలలుపాడుచు తగనుయ్యాలలు గావించి
యూ గరితముద మొదవన్"**

ఏలలు ఉయ్యాలలూగుచు పాడుట ఆనాటి అలవాటు. ఈ ఏల దేశిరీతిగా గన్పట్టినను సంగీతలక్షణగ్రంధములందు సలక్షణముగ మార్గిగ లక్షితమైన ప్రక్రియయైనది. ఇంద్రుని మోసమున రంభ ఆయోగివరుని తపముచెఱుపగానము నారంభించినదని వర్ణించుపట్టున కవిచేసిన వర్ణన ఆతని వీణావాదన పరిచితినిట్లు వ్యక్తపఱచుచున్నది.

"చెలియదెచ్చిన వీణఁగెంజేతనంది
కొవి మెఱుఁగు గవియగ గవిసెన యొదుర్చి
తీగెలు బిగించి పారలుదిద్ది శ్రుతులు
గూర్చి యుత్తరతుంబికఁగుచము జేర్చి"***

ఇచ్చట వీణ వర్ణనమునుబట్టి ఆనాటి వీణాస్వరూపముమనకు అవగతమగు చున్నది. పెద్దనార్యుడు వర్ణించిన వరూధిని వీణ, రాయలవారు వర్ణించిన

---

* చి. భా. ii . 123

** భి భా. ii . 143

*** చి. భా. iii . 33

అముక్తమూల్యర వీణయునిట్టివే. ఆనాటి వీణకు రెండుతుంబికలుండునని రెండును తుంబీఫల నిర్మితములని తెలియుచున్నది. నేటి వీణకు ఒక కుండికదారు నిర్మితమై యుండగ రెండవది మాత్రము తుంబీఫల నిర్మితమైయుండును. శ్రుతిచేయునప్పుడు తీగెలుబిగించి పారెలుసర్ది. వీణావాదనము గావింపనప్పుడు వీణియకుగవిసెన గప్పియుంచుటయనునది ఆనాటి వీణావాదనకారులుందరు అనుసరించెడి వారు గావుననే గవిసెన యొడల్చియని కవులు ప్రత్యేకించి చెప్పియుందురేమో!

ఇక ఆతరువాతి పీసములోని సహజములగు కవి సమయములలోకూడ గానమాహాత్మ్యమును వర్ణించినాడు ధర్మనార్యుడు.

"తన భూషణంబుల తనరెడు మాణిక్య
గణములొక్కుమ్మడిఁగరఁగి పార
నీ రసాకృతిఁబోల్చ్బ విస్ఫురత్ప్రాణువుల్
భాసుర లీలఁగ్రొమ్మోసులెత్త
నా సమీపంబున నల్లల్లఁజరియించు
మృగపక్షి జాతంబుమేతలుడుగఁ

చైతన్యమొంది వస్త్రంబులఁగనుపట్టు
చిత్రరూపంబులు శిరము లూచ....
నొకవు చెమరింప దివ్య పంకజనేత్ర
గ్రామములు మూఁడు నిఖిల మూర్ఛనల తెఱఁగు
మంద్రమధ్యమ తారకంబు మెఱయఁ
బాడె రెండవ శారద భంగిఁబొంగి"*

గ్రామము, మూర్ఛన, మంద్ర, మధ్యతారక్రమంబులు ఇవియన్నియు సంగీతశాస్త్ర సిద్ధములైన పరిభాషలు. ఇవి యన్నియు ఇతఃపూర్వము వివృతము లైనను మఱింతవిపులముగ కైలాసవర్ణనా సందర్భమున వివరింపబడును.

---

* చి. భా. iii - 34

యోగీశ్వరుని తపముచెరుప యత్నించి విఫలమనోరథయై శాపోపహత యైన రంభ అశ్వయై ఒక నృపాలునకు తత్తడి వారువమైనది. ఒకనాడు ఆవారువము నృపాలుని మోచుకొని ఆకాశమునకెగిరి సకలలోకములు చూపించు సందర్భమున ప్రవృత్తమైన ఇంద్రలోక వర్ణనము సంగీతమయముగ నిట్లు గోచరించుచున్నది.

"గాత్రమున్ పూనిన గాత్రనిద్యలనంగ
గంధర్వకాంతులు గదిసి పాడ
నంగంబుఁదాల్చిన శృంగార రసమన
నూర్వశి నటనలను అభినందించుచునట"*

ఇంద్రుడు నిండు కొలువున్నాడట. ఇంద్రుని కొలువు నిండుగ అప్సరోంగ నల గీతావాద్యవర్ణనము సాగుటయే ఇట సవిశేషమై గోచరించినది.

"భూషణ మాణిక్యములు నీరమైపారఁ
గిన్నరుల్ మోహన క్రీడఁబాడఁ
దాలసంఘ ప్రభేదంబుల గతులచే
యక్షకామినులు నాట్యంబులాడ"**

పెద్దకొలువున మాణిక్యపీఠియందుచితవైభవ మేర్పడ కిన్నరేశ్వరుండుండ అశ్వాధిష్ఠితుడైన అన్నృపుడు అతనిని గాంచినాడుట. ఇక్కడకూడ సంగీతమునకే ప్రాధాన్యతయొసంగబడుట గమనార్హము.

ఇక కైలాసవర్ణనమున ధర్మన్నకవి తన సంగీతశాస్త్రపాండితీ విభవమును విశేషించినాడనుటకు ఇదియె తార్కాణము. "ఇవ్విధంబున గడచ గంధర్వ కిన్నర కింపురుషాదులు కొలువంబేరోలగంబున్న పన్నాగాభరణుండగు అప్పర మేశ్వరుండు మనఁబున మెచ్చునట్లుగా మణికుండల హయగ్రీవులు కుంభినపరా కుమారులు సుదంచిత స్వయంభూస్వరా మొదలగు పరివాదినుల ధరించి సమ్మో

* చి. భా. iv - 59

** చి. భా. iv - 50

నంబుచేసి .... .... .... .... .... .... ... షడ్జ గాంధార మధ్యమ నామంబుల ప్రసిద్ధంబులగు గ్రామత్రయమును* స్థాయ్యారోహ్యవరోహి సంచారి భేదంబులనొనరు నలంకార విధంబులఱువది మూడును 2) జనసమ్మోహనకారులగు మూర్ఛనలున్నలువదియు, తచ్చతుర్గణితంబులగు శుద్ధంబులిరువదివేలు న్నూటయిరువదియు ననేకంబులగు కూటతానంబులును(3) ద్వావింశతి శ్రుతిభేదంబులుగల షడ్జాది సప్తస్వరంబులందనరు సప్తగ్రహ విశేషంబులం జెన్నొందు షాడవౌడవ సంపూర్ణంబులనంబరగు రాగంబులు మున్నూటపవది నొల్గ దత్తన్మిశ్ర సంయుక్తంబుగా నప్పరమేశ్వరు ప్రబంధంబులు పాడ చిత్రసేన మణిపూరులను గాంధర్వనాయకులు తాళంబులు ధరించి(4) త్రుటిక్షణలవ కాష్ఠానిమేష కళాచతుర్భాగాను ద్రుతాద్రుత లఘుగురు ప్లుతంబులను కాల భేదంబులను(5) ధ్రువచిత్ర వార్త్తిక దక్షిణ చిత్రతరంబులను మార్గచతుష్టయంబును(6) నిక్షేప ప్రవేశనిశ్శబ్దాది క్రియాభేదంబులును(7) ద్రుతలఘు గురుప్లుత కాకపాదికంబులగు షడంగములు(8) అతీతానాగత సమంబులగు గ్రహంబులను 9) చతురస్రత్ర్యస్ర మిశ్రఖండ సంకీర్ణ జాతులను(10) చతుర్విధంబులంబరగు కళలను(11) ద్రుత విలంబితాదులగు లయలను(12) గోపుచ్ఛ స్రోతోవాహపిపీలి కాయువాది భేదంబులగు యతులను(13) తత్తత్ప్రస్తారంబులు ప్రాణదశకంబునందనరు(14) చంచత్పుట చాచపుట షట్పితాపుత్రక సంపద్వేష్టానోద్ఘట్టాది తాళదర్పంబులు మొదలగు నూటొక్క తాళములనొత్త భృంగీశ్వరుండు పతాకాత్రిపతాకార్ధ చంద్రకటకాముఖాద్యసంయుత హస్తంబు లిరువదినాల్గును* స్వస్తిక గజదంతాది సంయుత హస్తంబులు ఏడుమూడును** స్థాయిసంచారి వ్యభిచారి భేదంబులందనరు దృష్టులు ముప్పది తొమ్మిదియు*** గుంచితావనత కంపిత సమంబులనం బొల్చు శిరోభేదంబులను**** వృశ్చికచ్ఛిద్ర మయూర మండలాది కరణంబులు***** జక్రాది భ్రమణ విశేషంబులుగల తాండవంబు బహువిధ గతులంజూపెనట.

---

* "క్రమాత్స్వరాణాం సప్తానామారోహశ్చావరోహణంచ మూర్ఛనేత్యుచ్యతేబుధైః"

(సం. ర. గ్రామమూర్ఛనా క్రమతానాః) 204 పు. ....

ఇట ధర్మనార్యుడు సంగీశాస్త్ర సంబంధియగు సాంకేతిక పదజాల సమంచితపాండితిని ప్రదర్శించినాడు అవియన్నియు ప్రత్యేక వివరణాపేక్షులు. పన్నగాభరణుని మెప్పింప కుంభీనస రాజకుమారులు గానము చేయనారంభించిరి. వారు గానమునకు శ్రుత్యుత్కర్షను ప్రకల్పింప ఆలాపిన్యాదులగు పరవాదినుల ధ్వనించిరి వారి గానమున షడ్జ, గాంధార, మధ్యమ, గ్రామములుమూడును ప్రవృత్తములైనవట. కుంభీనస రాజకుమారులు దివ్యత్వ సమంచితప్రభావులు గాన దేవలోక విశ్రుతమాత్రమైన గాంధార గ్రామమునుగూడ నెఱపగలిగిన వారు కవిత్వమునందలి శబ్దాలంకారములవలె సంగీతమునందు స్వరాలంకారములున్నవి. ఈ స్వరాలంకారములు ఇతఃపూర్వము పోతనార్యాదుల కవనవిశేషములందు ఉట్టంకితములు మూర్ఛనయనునది శ్రోతృచిత్తమునకు శ్రవణమాత్రమున ఈ అశేషమగు స్వీయానుభూతిని ప్రకల్పించుచు అవశమగు సమ్మోహస్థితిని ప్రతిపాదించు సంగీతరీతి* ఇదియు ఇతఃపూర్వము వివృతము. తానము, తన్నృత్తరణే అనుధాత్వర్థానీతమగు వ్యుత్పత్తినొంది సమాయాతమగును. ఇది రాగాలాప మూర్ఛనాతాన సంఖ్యాపరిగణనము సంగీతశాస్త్రవిదులకు పరిచితమైన విషయము. సంగీతశాస్త్రములలో రాగప్రక్రియా విశేషములు ఇరువది రెండని చెప్పబడినవి. సప్తస్వరసంపూర్ణమగు ఆరోహణావరోహణములతో నమరినవి సంపూర్ణ రాగములని, షట్స్వర సంపుటిని మాత్రమే కల్గినవి షాడవరాగములని పంచ స్వర ప్రవృత్తిని మాత్రమే కల్గినవి ఔడవరాగములని వ్యవహృతములగును. ఇవి మున్నూట అఱువదినాల్గని ధర్మనార్యుడు లెక్కించినాడు.

ధర్మనార్యుడుట్టంకించిన సాంకేతిక పదజాల వివరణము :

"యోయం ధ్వని విశేషస్తు స్వరవర్ణ విభూషితః
రంజకో జన చిత్తానాం సరాగః కథితో బుధైః"

---

సంగీత పారిభాషికములు వివరణాత్మక శ్లోకములు :

సం. స్వ. ప్ర. సా. పుట 120 - 134
సం. వి ద పుట 12 - 24
గా. క. ప్ర. పుట 1 - 12

రాగమనగా స్వరవర్ణములచే అలంకరింపబడినది. జనుల చిత్తమును ఆనందింపజేయునట్టి ధ్వనివిశేషము రాగమనంబడును.

"స్థాయ్యారోహ్యవరోహీచ సంచారీత్యధ లక్షణమ్
స్థిత్యా స్థిత్వాప్రయోగః స్యాదేకైకస్య స్వరస్స్వయః"
"స్థాయీవర్ణః సవిజ్ఞేయః పరాదస్వర్థనామకౌ
ఏతత్సమ్మిశ్రణాద్వర్ణ స్సంచారీ పరికీర్తితః"

రాగము స్థాయి, ఆరోహి, అవరోహి, సంచారి అని నాలుగు విధములు. అందు ఒక్కొక్క స్వరస్వరూపమునబముగా నిలిచి పాడుట స్థాయి అనం బడును. స్వరములు 'సరిగపమపధనిస' యని క్రమముగా హెచ్చుట ఆరోహియనంబడును. 'సనిధపమగరిస' యని క్రమముగా తగ్గుట అవరోహి యనబడును ఈ మూడింటియొక్క చేరిక సంచారి యనంబడును.

"షాడవౌడవ సంపూర్ణ భేదాద్రాగస్త్రిధా మతః
ఔడవః పంచభిః ప్రోక్తస్స్వరై షడ్భిస్తు షాడవః
సంపూర్ణ సప్తభిః జ్ఞేయః ఏవం రాగస్త్రిధామతాః"

రాగములు షాడవము, ఔడవము, సంపూర్ణము అని మూడు విధములు. అందు ఔడవము ఐదు స్వరములును, షాడవము ఆఱు స్వరములును సంపూర్ణము సప్తస్వరములును గలిగియుండును.

## శ్రుతి లక్షణము

ప్రథమశ్రవణాత్ శబ్దః శ్రూయతే హ్రస్వమాత్రకః
సాశ్రుతి స్సపరిజ్ఞేయా స్వరావయవ లక్షణా
శ్రుతిభ్యశ్చ స్వరాషడ్జరిషభ గాంధార మధ్యమాః
పంచమోధైవతశ్చాధ నిషాద ఇతి సప్తతే
శ్రుతిభ్యఃస్యుః స్వరాస్సర్వే స్వరేభ్యో గ్రామసంభవః
గ్రామేభ్యో జాతయో జాతః జాతిభ్యో రాగసంభవః

ప్రథమ శ్రవణమున శబ్దము స్వల్పముగా వినబడును షడ్జము మొదలగు స్వరావయవ లక్షణముగల హ్రస్వమాత్రక శబ్దవిశేషము శ్రుతి యనంబడును. అట్టి శ్రుతులవలన షడ్జము, రిషభము, గాంధారము, మధ్యమము, పంచమము, ధైవతము, నిషాదములను సప్తస్వరములు గలిగెను. ఈ సప్తస్వరముల వలన గ్రామములవలన జాతులు జాతులవలన రాగములు బుట్టుచున్నది.

## స్వరోత్పత్తిప్రధాన శ్రుతులు

"దీప్తాయతా చ కరుణా మృదుర్మధ్యేతి జాతయః
శ్రుతీనాం పంచ తాసాం చసర్వేష్వేవం వ్యవస్థితిః"

దీప్త, ఆయత, కరుణ, మృదు, మధ్య అని శ్రుతి ఐదుజాతులు గలది యగుచున్నది. ఆ జాతులు ఇరువదిరెండు భేదములై సప్తస్వరములయందు వ్యవస్థితి కలిగియుండును.

## ద్వావింశతి శ్రుతులు

"చతుశ్చతు శ్చతుశ్చైవ షడ్జమధ్యమ పంచమాః
ద్వేద్వే నిషాద గాంధారః త్రీరితిఋషభ ధైవతాః"

షడ్జమునకు నాలుగు శ్రుతులును, ఋషభమునకు మూడుశ్రుతులును, గాంధారమునకు రెండుశ్రుతులును, మధ్యమమునకు నాలుగు శ్రుతులును. పంచమమునకు నాలుగు శ్రుతులును ధైవతమునకు మూడుశ్రుతులును, నిషాదమునకు రెండు శ్రుతులును ఇవ్విధమున స్వరములేడింటికి శ్రుతులు ఇరువది రెండు కలిగి యుండును.

## ద్వావింశతి శ్రుతులు పేర్లు

"తీవ్రా కుముద్వతీ మందా ఛందోవత్యస్తు షడ్జగాః
దయావతీ రంజనీచ రతికా ఋషభె స్థితాః
రౌద్రీ, క్రోధీ చ గాంధారా వజ్రికాథప్రసారిణీ
ప్రీతిశ్చ మార్జనీత్యేతాః శ్రుతయో మధ్యమాస్థితాః

"క్షితి రక్తా నందీపిన్యాలాపిన్యపి పంచమమ్
మందతి రోహిణీ రమ్యేత్యేతాస్థి స్త్రసుధైవతేః"
"ఉగ్రాచ క్షోభిణితిద్వే నిషాదే వసతః శ్రుతి
ఇత్యేతావత్యస్సుప్రోక్తా సర్వేషు శ్రుతయోబుధైః"

షడ్జమునకు తీవ్ర, కుముద్వతి, మంద, ఛందోవతియను నాలుగు శ్రుతులును, రిషభమునకు దయావతి, రంజని, రతికయను మూడు శ్రుతులును, గాంధారమునకు, రౌద్రి, క్రోధియను రెండును, మధ్యమమునకు వజ్రిక, ప్రసారిణి, ప్రీతి, మార్జని యను నాలుగు శ్రుతులును, ధైవతమునకు మదంతి, రోహిణి, రమ్యయను మూడుశ్రుతులును, నిషాదమునకు ఉగ్రక్షోభిణియను రెండు శ్రుతులను కలిగియుండును.

## శ్రుతి జాతి భేదములు

"దీప్తాయతా మృదుర్మధ్యేషడ్జస్యా ఋషభే పునః
సంస్థితా కరుణా మధ్యేమృదుర్గాంధారకే పునః
దీప్తాయతా మధ్యమేచ మృదుర్మధ్యేచ సంస్థితే
మృదుర్మధ్యాయతేఖ్యాతా కరుణా పంచమే స్థితాః
కరుణాచ యతారా మధ్యధైవతే సప్తమే పునః
దీప్తామధ్యేతి తాసాంచశ్రుతీనాం బ్రూమహేభిదామ్"

షడ్జమునకు దీప్త, ఆయత, మృదు, మధ్యజాతులందును, ఋషభమునకు కరుణ, మధ్య, మృదు జాతులందును, గాంధారమునకు దీప్త, ఆయత, జాతుల యందును, మధ్యమమునకు దీప్త, ఆయత, మృదు, మధ్యజాతులందును, పంచమమునకు మృదు, మధ్య, ఆయత, కరుణ జాతులందును, ధైవతమునకు కరుణ, ఆయత, మధ్యజాతులయందును, నిషాదమునకు దీప్త మధ్యజాతులందును శ్రుతులు గలిగియుండును. ఈపదునేను సంగీతసాంకేతికముల విపుల వివరణము అధోయానమందు గావింపబడినది. ఈవివరమంతయు సంగీత విద్యాదర్పణోద్ధృతము.

## గ్రామమూర్ఛనల లక్షణము

"గ్రామః స్వరసమూహస్స్యా మూర్ఛనాదేస్సమాశ్రయః
షడ్జగ్రామ భవేదాదౌ మధ్యమ గ్రామ ఏవచ"

"గాంధార గ్రామ ఇత్యేతద్గ్రామత్రయముదాహృతమ్
షడ్జమధ్య మానామానౌ గ్రామౌగాయంతి మానవాః
సతు గాంధార నామానం సంభోగ్యే దేవయోనిభిః
గాంధారగ్రామ మాచష్టత భూతానం నారదోమునిః
ప్రవర్తతే స్వర్గలోకే గ్రామౌ సౌసమహీతలే
క్రమాత్స్వరాణాంచన సప్తానాం ఆరోహశ్చావరోహణమ్
మూర్ఛనేత్యుచ్యతే గ్రామద్వయోతాస్స ప్త సప్తచ
క్రమాద్గ్రామత్రయే దేవ బ్రహ్మవిష్ణుమహేశ్వరాః
హేమంతగ్రీష్మ వర్షానుగతవ్యాస్తై యదాక్రమమ్"

స్వరసమూహ మూర్ఛనలతో కలిగియున్నది గ్రామమని తెలియును. అది షడ్జగ్రామమనియు, మధ్యమ గ్రామమనియు, గాంధారగ్రామమనియు మూడు విధములు. అందులో షడ్జమధ్యములు జనుల వాడుకయందున్నవి. గాంధార గ్రామమును నారదుడు అభ్యసించి దేవతలకుపదేశించెను. అందువలన గాంధార గ్రామము స్వర్గలోకమునందేగాని భూతలమందు వాడుకలోలేదు. సప్తస్వరముల ఆరోహణ అవరోహణము మూర్ఛన. అటువంటి మూర్ఛనలు ఏడుచేరి గ్రామమగును. ఒక్కొక్క గ్రామమునకు ఏడేసి మూర్ఛనలుండును. కావున షడ్జమధ్యములకు మొత్తము పదునాలుగు మూర్ఛనలుండును ఈ షడ్జమధ్యమ గాంధారములకు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు అధిదేవతలు. అవి హేమంత గ్రీష్మ వసంతములందు పాడదగినవి. వీని గ్రమగణనము సంఖ్యానిర్ణయము సంగీత శాస్త్రవిదులకుకూడ నేడు అవశక్యముగాదు. ఇవన్నియు నేడు అపరిచితములు.

## తాళము

"కాలో మార్గక్రియాంగాని గ్రహోజాతిః కళాలయః
యతిః ప్రస్తార కశ్చేతి తాళ ప్రాణా దశస్మృతాః

తాళమునకు కాలాదులు పది ప్రాణములు. ఇందు కాలప్రాణమునకు క్షణలవత్రుటినిమిష కళాద్రుతానుద్రుత లఘు గురు ప్లుతాదికములు అవాంతర భేదములు. ఇందు ఇవి వివృతములు.

"ఉపర్యుపరి సన్యస్య సర్వ పద్మపత్ర శతం సకృత్
యః కాలః సూచిసంభేదాత్ క్షణః చ పరికీర్తితః
లవ క్షణైరష్టభిః స్యాత్ కాష్ఠా హ్యష్టలవాత్మకైః
అష్ట కాష్ఠనిమేషస్స్యాత్ నిమేషైః అష్టభిః కళాః
కళాభ్యాంతు చతుర్భాగో చతుర్భాగమను ద్రుతమ్
అనుద్రుతాచ బిందుస్స్యాత్ బిందుభ్యాం చలఘుర్భవేత్
లఘుద్వయం గురుశ్చైవ త్రిలఘుప్లుత ముచ్యతే
చాతుర్లఘుంచ కాకపాదం ఇత్యేతత్కాల లక్షణమ్"

నూఱు తామరరేకులను ఒకటిమీద ఒకటి చొప్పున దొంతరగాచేర్చి సూదిచే పొడవగా రేకులన్నియు తెగినంతకాలము పేరుక్షణమనబడును. అట్టి క్షణములు ఎనిమిదియైనచో ఒకలవమని పేరు. లవములు ఎనిమిదియైనచో ఒక కాష్ఠము. ఆకాష్ఠములు ఎనిమిదియైనచో ఒక నిమిషము. ఆనిమిషములు ఎనిమిది యైనచో ఒక కళ. ఆకళలు రెండైనచో ఒక చతుర్భాగము. ఆచతుర్భాగములు రెండైనచో ఒక అనుద్రుతము. అట్టి అనుద్రుతములు రెండైనచో ఒక లఘువు. ఆ లఘువులు రెండైనచో ఒక గురువు. ఆ లఘువులు మూడైనచో ప్లుతము. నాలుగైనచో కాకపాదము. వీని చేత తాళము నిర్ణయింపబడును. మఱి ఇప్పుడు అనుద్రుతము మొదలుగాగల ఆఱుఅంగములు మాత్రము వాడుకయందున్నవి. కొందఱు చతుర్భాగమును ఏడవ అంగమునుసహా వాడుచున్నారు. ఇది కాల ప్రాణము. ఈ కాలప్రాణము తాళముతో ప్రత్యక్షసంబంధమును కలిగియుండును. ఇది తాళమునకు నిర్వాహకమగును.

## మార్గప్రాణ లక్షణము

దక్షిణో వార్తికశ్చిత్ర స్తత్ర చిత్రతరస్మృతః
తథా చిత్రతమశ్చస్యాదతి చిత్రతమోమతః
షడేవం కథితా మార్గాస్తత్స్వరూపం నిరూప్యతే

దక్షిణము, వార్తికము, చిత్రము, చిత్రతరము, చిత్రతమము, అతి చిత్రతమము అని మార్గములు ఆఱు విధములు.

"తత్ర దక్షిణమార్గస్య మాత్రాష్టక ముదాహృతమ్
వార్తికేతు చతుర్మాత్రా శ్చిత్రమార్గో ద్విమాత్రకః
ఏకమాత్ర శ్చిత్రతరో ద్రుతశ్చిత్రతమే మతః
అతిచిత్రతమే మార్గేస్వద్రుత పరికీర్తిః"

దక్షిణ మార్గము : ఏ తాళమునకైనను తాళాక్షరకాలమునకు ఎనిమిది మాత్ర కాలము నడుచునది.

వార్తికము : తాళాక్షరకాలమునకు నాలుగుమాత్రల కాలము నడుచునది.

చిత్రమార్గము : తాళాక్షరకాలమునకు రెండుమాత్రల కాలము నడుచునది.

చిత్రతరము : తాళాక్షరకాలమునకు ఒకమాత్రా కాలము నడుచునది.

చిత్రతమము : తాళాక్షరకాలమునకు ద్రుతకాలము నడుచునది. ద్రుత కాలమనగా రెండక్షరముల కాలము.

అతి చిత్రతమము : తాళాక్షరకాలమునకు అనుద్రుత కాలము నడుచునది. అను ద్రుతకాలమనగా అక్షరకాలము. ఇటుల ఏతాళమునకైనను ఒక్కొక్క తాళాక్షరమునకు పై చెప్పబడిన ప్రకారము అక్షరము మొదట మొదలు అక్షరమువఱకు జరుగుకాల దీర్ఘమునకు మార్గములని చెప్పబడుచున్నవి. ఇది మార్గమనెడి ప్రాణము. ఈ మార్గమనెడి ప్రాణము తాళజ్ఞాపకమైన క్రియాగాన ధాయమునకు ఆశ్రయమగుటచేతను, తాళసంబంధియైన క్రియతో సంబంధించెను గానమార్గముకూడ తాళమునకు ముఖ్యప్రాణమని తెలిసికొనునది.

క్రియా ప్రాణలక్షణమునిట్లు తెలిసికొనసగును.

## క్రియాప్రాణ లక్షణము

"మార్గదేశిగతత్వేన తత్రాద్యస్య క్రియాద్విధా
నిశ్శబ్దాశబ్దయుక్తాచ నిశ్శబ్దాతు కళోచ్యతే"

క్రియలు మార్గక్రియలని దేశిక్రియలని రెండువిధములు. ఆ మార్గక్రియలు నిశ్శబ్దక్రియలని శబ్దక్రియలని రెండు విధములు. అందు నిశ్శబ్దక్రియకు కళయను పేరు చెల్లునుగనుక అనిశ్శబ్దక్రియలు చెప్పబడుచున్నవి.

## నిశ్శబ్ద క్రియలు

"తత్రావాపో ధనిష్క్రామో విక్షేపశ్చ ప్రవేశనమ్
చతుర్విధాశ్చ విజ్ఞేయో నిశ్శబ్దాశ్చ క్రియాబుధైః"

"ఆవాపము, నిష్క్రామము, విక్షేపము, ప్రవేశము" అనునీ నాలుగు నిశ్శబ్దక్రియలు.

## నిశ్శబ్దక్రియల లక్షణము

"ఆపావ స్తత్ర హస్తస్యోత్తానస్యాంగుళి కుంచనమ్
నిష్క్రామోథ స్తలస్య స్యాదంగుళీనాం ప్రస్తారణమ్
తస్యదక్షిణ విక్షేపో విక్షేప ఇతి కథ్యతే
వివర్తనంచ హస్తస్య ప్రవేశోఽథోమాఖస్యచ"

ఆవాపము : వెల్లికలగా ఎత్తబడిన పతాకహస్తముయొక్క తర్జన మొదలగు వ్రేళ్లను ముడుచుట.

నిష్క్రామము : ఆముడిచిన వ్రేళ్లను విప్పుట.

విక్షేపము : ఆ హస్తమును వెలుపలికుడి పార్శ్వమునకు విదిలించుట.

ప్రవేశము : ఆహస్తమును అప్రదక్షిణముగ క్రిందుగా ముందరికిరావిచ్చుట.
ఈ నాలుగును నిశ్శబ్దమార్గక్రియలు.

## సశబ్ద క్రియలు

"ధ్రువో శయ్యశ్చ తాళశ్చ సన్నిపాత ఇతిస్మృతః
ఇతి శబ్దేన సంయుక్తో విజ్ఞేయశ్చ చతుర్విధమ్"

"ధ్రువము, శయ్యము, తాళము, సన్నిపాతము" అనునీ నాలుగు సశబ్ద క్రియలు.

## సశబ్దక్రియల లక్షణములు

"ధ్రువో హస్తస్య పాతః స్యాత్ చుటికాశబ్దపూర్వకః
శయ్యో వామనిపాతస్తు తాళోదక్షిణఘాతకః
ఉభయోర్హస్తయోర్ఘాత సన్నిపాత ఇతిస్మృతః
ఏతా మార్గక్రియాశ్చైవ కథితా భరతజ్ఞకైః"

ధ్రువము : శబ్దపూర్వకముగ చిటికవేయుట.

శయ్య : కుడిహస్తమందు ఎడమచేతి ఘాత వేయుట.

తాళము : ఎడమ హస్తమందు కుడిచేతి ఘాత వేయుట.

సన్నిపాతము : అభిముఖముగా నిలిపిన రెండు హస్తములచే సమముగా ఘాత వేయుట.

## అంగప్రాణ లక్షణము

"అనుద్రుతో ద్రుతశ్చైవ లఘుర్గురు ప్లుతస్తథా
కాకపాదం తథా ప్రోక్తే తాళాంగాని చ షడ్విధమ్"

తాళసంఖ్యను తెలియుటకు సాధనమగు సంజ్ఞా విశేషము అంగము. అనుద్రుతము, ద్రుతము, లఘువు, గురువు, ప్లుతము కాకపాదము అని అంగములు ఆరువిధములు.

### అంగముల స్వరూపము

"అనుద్రుతస్య రూపంచ అర్ధచంద్రకళాత్మకమ్
ద్రుతస్తు వలయాకారో లఘురర్ధకళాకృతి
గురుర్వక్ర ధనుర్జ్ఞేయం ప్లుతస్తు శిఖరోగురుః
ఊర్ధ్వరేఖాచ తిర్యంచో కాకపాదః ప్రకీర్తితః"

అనుద్రుతము అర్ధచంద్రునివలె నుండును. "U"
ద్రుతము వలయాకారముగ నుండును. "O"
లఘువు అర్ధబిందువువలె నుండవలెను.
గరువు ఎక్కుపెట్టిన విల్లువలె నుండవలెను.

ప్లుతము
కాకపాదము.

అతీతానాగత సమములగు గ్రహములగూర్చి కూడ కవియిట తెలిపినాడు.

గ్రహమనునది గానసంబంధియైన ఎత్తుగడ. గానము తాళానుగతమగు నపుడు తాళముతో సమముగ గానపుటెత్తుగడ సాగినఎడల అది సమగ్రహమగును.

---

గ్రహముల వివరణము :

"గీతా తీతేత్వ తీతస్యాత్తాళాతీ తేత్వనాగతః
గీతాయా తాళసంయుక్తో సమప్రగ్రహమితీరితమ్
ఆద్యంత యోకనియమో విషయశ్చ ప్రకీర్తితః
మాత్రాధిక్యంచ తస్యైవ క్వచిత్కేచిత్ప్రచక్షతే"

గీతము నడచిన పిమ్మట తాళమునడచుట అతీతమనబడును. తాళము నడచిన పిదప గీతము నడచుట అనాగతమనబడును. తాళగీతములు సమముగా నడుచుట సమమనబడును. ఈ మూడువిధములుగాక నడచునది విషమగ్రహమన బడును. మఱియు గీతాదులకన్నను తాళమాత్రలు రెండుగాని మూడుగాని నాలుగు గాని అతీతమైనచో అది అతీతగ్రహమనియు ఈమాత్రమే అనాగతమైనచో అది అనాగత గ్రహమనియు, కాలము. 5, 6, 7 మాత్రలు గీతముకంటె అతీత మైనను అనాగతకమైనను అది విషమ గ్రహంబనబడును. ఇటుల రంగరాజులోల్ల భట్టులు మొదలైన భరతభాష్య వ్యాఖ్యాకారులు నిర్ణయించినారు.

తాళమునకు ముందు వెనుకలుగా గానపుఎత్తుగడ ప్రవృత్తమగుట అతీతానాగత గ్రహంబులనంబడును. ఇక స్వర సంఖ్యాగణనమునుబట్టి జాతులు ఏర్పడు చున్నవి. నాలుగు అక్షరముల కాలవ్యవధిలో నడదునది చతురశ్ర జాతియని మూడక్షరముల కాలవ్యవధిగలదు త్రిశ్రమని ఏడు, ఐదు, తొమ్మిది, అక్షరముల గడింపునొందిన ఎడల అది మిశ్రఖండ సంకీర్ణజాతులకు చేరినదగును. తాళగతి యందలి ప్రచండ వేగాన్వితత్వమును, సామాన్యవేగమును, సమాహితమై విలంబనమునొందిన వేగాన్వితత్వమును ద్రుత, మధ్య విలంబితగతులని వ్యవ హరింతురు.

## జాతిప్రాణ లక్షణము

"అను గాయాయతే ధర్మం కారణం జాతిరుచ్యతే"

అనుగత బుద్ధికి కారణమైన ధర్మము జాతియనబడును. అనగా లోకమందు అనేక మనుష్యులందు వీడు మనుష్యుడనెడి అనుగత బుద్ధిచేత మనుష్యత్వ మనెడి జాతిసిద్ధించెను ఆ రీతినే అనేక తాళములయందు నిదియును తాళమనెడి అనుగత బుద్ధిచేత తాళత్వమనెడి జాతికద్దని తెలిసికొనునది. ఇప్పుడు సకల మనుష్యులయందును మనుష్యత్వమనెడి ఒక జాతియున్నను ఆమనుష్యులయందు బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రావాంతరజాతులు గలిగినట్లు సకల తాళములయందును తాళత్వమనెడి వ్యాపకజాతి యుండియున్నను చతురశ్ర త్రిశ్ర మొదలైన అవాంతరజాతులు మతభేదములచేతకలవని చెప్పబడెను.

## జాతుల వివరణము

"చతురశ్ర త్రిశ్ర మిశ్రాఖండ స్సంకీర్ణక స్తథా
పంచధా జాతయః సర్వే తత్స్వరూపం వివుచ్యతే"

## కళాప్రాణ లక్షణము

ఏక కళాచద్వికళా త్రికళా చ చతుః కళా
ఏవం.విధాచ విజ్ఞేయం తాళలక్షణ కోవిదైః
ఏకస్యాంచ కళాయాంతు లఘుః కళేతి కీర్తితః
ద్వికళాయాం గురుశ్చైవ త్రికళాప్లుతముచ్యతే
నిశ్శబ్ద చతుష్కంచ కళాచతుష్కాభిదే

"ఏకకళ, ద్వికళ, త్రికళ, చతుష్కళ" అని కళలు నాలుగుగలవు. అందు లఘువునకు ఒక కళయు, గురువునకు రెండు కళలును, ప్లుతమునకు మూడు కళలును, కాకపాదమునకు నాలుగు కళలును గలిగియుండును. చచ్చత్పుట, చాచత్పుట, షట్పితాపుత్రిక, సంపద్వేష్ట ఉద్ఘట్టములనునీ ఐదు తాళములు కళలనబడును.

## లయప్రాణ లక్షణము

"కళాంత రాళవర్తీయః కాలోసౌలయ నామకః
ద్రుత మధ్యవిళంబాశ్చ భవేయస్త్రి విధాలయాః
ద్రుతోమధ్య విళంబాశ్చ ద్రుత శ్శీఘ్రతమోమతః
ద్విగుణా ద్విగుణోజ్ఞేయో తస్మాన్మ ధ్యవిళంబితే"

తాళము నడుమ నడిచెడి కాలము లయయనంబడును. అది అతిద్రుతము, మధ్యము, విళంబితము అని త్రివిధము. అందు మిక్కిలి శీఘ్రమైనది ద్రుతము. దానిని ఇనుమడించిన మధ్యము. దానిని ఇనుమడించిన విళంబితము.

ద్రుతలయ : పాడుటకు ఎంత త్వరగా తాళమువేసికొని పాడనగునో అట్లు తాళము వేసికొని పాడుట.

మధ్యలయ : ద్రుతలయకు రెట్టింపు విళంబము చేయుట.

విళంబితము : మధ్యలయకంటె రెట్టింపు విళంబము చేయుట.
"గీత తాళాదీనాం ఏకత్ర విరమోలయః" అనియు,
"శ్రుతిః మాతాః పితాలయః" అనియు చెప్పియుండుటచేత లయ ముఖ్యప్రాణమని తెలియవలెను.

## యతిప్రాణ లక్షణము

"లయః ప్రవృత్తి నియమో యతి ఇత్యభిధీయతే
సమస్రోతోవహాఖ్యాతా గోపుచ్ఛచ పిపీలికా
మృదంగికాచ విషమో షడ్విధాయతిరుచ్యతే"

లయ ప్రవృత్తియొక్క నియమము యతి. అది సమయతి, స్రోతోవహ యతి, గోపుచ్ఛయతి, పిపీలికయతి, మృదంగయతి, విషమయతి అని యతులు ఆఱు విధములు.

తాళాంగములగు గురులఘు ప్లుతద్రుతాను ద్రుత కాకపాదములగు షడంగముల విశేషణము సమస్థితితో సాగినయెడల అది పిపీలికయతి యగును. చీమల బారువలె ఒకదానివెనుక అట్టిదే మరియొక అంగము సాగిపోవుట యిందు గానమగును.

ఉదా॥ UUUU లేక IIII

గోపుచ్ఛయతి యందు తాళాంగవిక్షేపమున క్రమానుసారిగ తగ్గుదల గోచరించుచుండును. ఉఐ - I. OU =

"త్యాగరాజయోగ వైభవమ్
అగ రాజయోగవైభవమ్
రాజయోగ వైభవమ్
యోగ వైభవమ్
భవమ్
వమ్" అనునీ ముత్తుస్వామి దీక్షితుని ఆనందభైరవి రాగమందని కృతిలో కానవగు పదవల్లరి ఈగోపుచ్ఛయతికి చక్కని లక్ష్యము.

ఇక గోపుచ్ఛయతికి స్రోతోవహయతియనునది పరిణతమగు స్వరూపము. ఇందు తాళాంగములు మొదట అల్పముగ గోచరించి చివరకు అనల్పముగ పరిణతమగును.

ఉదా : UOI+ఒ+

దీనికి లక్ష్యము ముత్తుస్వామి దీక్షిత ప్రణీతమనిపైని చెప్పిన కృతియందే ఇట్టి కానవగును.

స్వ
ప్రకాశమ్
స్వరూప ప్రకామ్
తత్త్వ స్వరూప ప్రకాశమ్
సకల తత్త్వ స్వరూప ప్రకాశమ్
శివశక్త్యాది సకల తత్త్వ స్వరూప ప్రకాశమ్

డమరుయతి : ఇందు డమరమునందు ఇరుప్రక్కల అనల్పముగనుండి మధ్య అల్పపరిణామము గోచరించునట్లే తాళాంగపరిణామము గోచరించును. (విక్షిప్తముగా)

ఉదా : ౩౩lOUOl౩౩ = సా,నీ,దా,పా, ని,పా,దా,నీ,సా, =

# తరిగొప్పుల మల్లనార్యుని యొప్పారిన వీణాసాధన

సంగీతసాధనావిష్కృతియే ప్రధానధ్యేయముగ తరిగొప్పుల మల్లనార్యుడు వెలయించిన కావ్యరాజము చంద్రభానుచరితము. కవికి సంగీతోపజ్ఞతయుండుటయే కాక ఈకావ్యమున కథాగతముగఁగూడ సంగీతరీతికి అత్యంత ప్రాధాన్య మున్నది. సంగీతవిషయికమైన అత్యంత ప్రాముఖ్యమైన అనంతమగు స్పర్ధ శ్రద్ధ ఈకావ్యమున గురుశిష్యులగు నారదప్రద్యుమ్నుల ప్రాముఖ్యతతో ఇట ప్రవ్యక్తము గావింపబడినది.

దత్తాత్రేయుని కృతిభర్తగ నొనరించి కవి దైవాంకితముగ నీకృతిని రచించుటవలన ఇద్దానిరచనమునందున్న పరమ ప్రయోజనము కళావిలాసమేగాని అన్యముగాదని తేటతెల్లమగుచున్నది.

కావ్యాదిలో గావింపబడిన దేవతాస్తుతులలోని వాణీస్తవమునందే కవివరుడు గీతిసాహితీసమంచితరీతి తన కావ్యగతమై భాసించుట ప్రవ్యక్తము గావించినాడు.* కావ్యమున కథయంతయు సంగీతప్రధానముగనే నడచుటకై నారదుడు సంగీతాచార్యుడేగాక సూత్రధారుడై కథను నడిపించినాడు "స్పర్ధయా వర్ధ· విద్యా" యను సూక్తి యిందు ప్రద్యుమ్న చంద్రభానుల సంగీతాభ్యసన స్పర్ధలో సారకమైనది.

ప్రప్రథమమున ఏతెంచిన నారదుడు కృష్ణునిజూచి పరస్పర కుశల ప్రసంగానంతరము—

"జనార్దనా! ఇప్పుడేను నవనవగా నేర్చిన పాటయొక్క గీతమును విని పించెదనంచు చేతి వీణచెలంగన్—"

---

* పరమప్రౌఢి నశేష వర్ణ రచనా పారీణుఁడౌ భక్తిహృ
త్సరణిందాయుదునేనయౌనయను నోజన్ వర్ణసంధాన భా
స్వర వృత్తిస్వమమూర్తులై మెరయు నాసంగీత సాహిత్యబం
ధుర వక్షోజములూను తల్లినిభజింతు తత్ప్రసాదాప్తికిన్
చం. భా. చ. I. 4

"సరిగమపధని సమాఖ్య
స్వర సందర్భంబు మెఱయ సారెలమీఁదం
గరమిడి గమకము తేర్పడ
మొరయించుచుఁ గొన్ని గీతములు పలికించె"* నట చం.భా.చ. i.124.
దశవిధములగు గమకములందలివి కంపిత, ఆందోళితాదులు. అలంకార గీతాదులు సంగీతప్రక్రియలు. గౌళినాట వరాళికాదులు ఘన రాగ పంచకమందలివి.

ఆ వీణాముని గాననైపుణ్యమునకు అపుడటనున్న "పూర్ణేందుముఖులు సహితము ఆశ్చర్యవశరవ సాంత్వలైనారట". మఱియు ఆ తపోధనుని మహతీరవామృతమును కన్నులుగూడ చెవులుచేసికొని ఆలకించెనట. దీనినిబట్టిచూడ ఏకాగ్రభావనలో మనసును లయించుకొని కన్నులనుగూడ చెవులు చేసికొని వినవిదే అది సమ్యక్సంగీతాభినందనము కాదనుట కవి భావనయనిపించును.

ఇక తరువాత ప్రవృత్తమైన శ్రీకృష్ణుని నారదగానాభినందనములో మల్లనార్యుని సంగీతాభిజ్ఞత ప్రదర్శితమైనది.* అదివట్టి ఆహా ఓహోలతో కాక సంగీతశాస్త్రసారమును తరచి చూచిన ప్రజ్ఞతో సాగిన గీతవాద్యస్ఫూర్తితో మొరసినది. అపుడు హృద్యతర విపంచికా వాద్యవిద్య నభ్యసింప మనః కుతూహలముపూనిన తన వైదర్భికూర్మిసుతుని, సత్యాతనూభవుని చూపివారలను శిష్యులుగా పరిగ్రహింపుమని నారదుని కోరినాడు హరి. దానికి నారదముని అంగీకరించి సంగీతాభ్యసనైక తత్పరులైన ఆయిద్దఱిని దగ్గరకుపిల్చి మంగళాచరణంబొనరించి వీణలగూర్చి పాఠము ప్రారంభించినాడట.

---

* "ఔరామీటు బళిరె కంపిత మహాయాందోళిత స్ఫూర్తియో
హోరే మూర్ఛన బాపురే శ్రుతులు మేలుల్లాసితప్రౌఢి మ
ఝ్ఝారే లీనము బాగురే స్ఫురితమున్ శాబాసుధాలంచున
త్యాదూఢ ప్రమదోన్నతి న్మురహరుండాలించి వర్ణించుచున్" I.127

"సప్తస్వరముల మూర్ఛనలు తప్పకయుండ
 గుఱుతు పట్టుటకు కొన్నినాళ్లు
సూళాది తాళములొప్పఁగ నలంకార
 గుంఫ నంబొనగూర్పఁ గొన్నినాళ్లు
ప్రాగ్గేయ కారవిరచిత గీతంబులు
 గ్రుక్కపట్టుటకునై కొన్నినాళ్లు
గౌళి నాట వరాళి కాముఖ్యరాగముల్
 కొదలేక పలికింపఁ గొన్నినాళ్లు

పన్నియు ప్రబంధములు మీటఁ గొన్నినాళ్లు
గౌరి గాయంబు లొదలింపఁ గొన్నినాళ్లు
గాంగవారల కాజిగ రాగత పసి
నిపమ విపంచికాప్రౌఢి నేర్పియపుడు"*

మున్ను రుక్మిణీ సత్యలకు పారిజాతమునకై కల్పించిన కలహజ్వాల మెల్లమెల్లగా శమించి అరిపోయినట్లుండుటగమనించి మఱల దానిని ఎగసన్ద్రోపి తద్ద్వార తన జాఠరజ్వాలా శాంతి గావించుకొననెంచి అబ్బాయిలు ఇమ్మగువల సుతులొంట ఎంచినాడట. ఆ హరి సూనులిద్దరు సంతతోత్సవముతోడ ఒండొరుల చందము మెచ్చక వల్లకీకళాదోహలులై చెలగగని వారికి విద్యాస్పర్ధను గల్పించి వాదుపెట్టగ నూహించి మరునొక్కని (ప్రద్యుమ్నుని) పెద్దజేసి వీణనేర్ప మొనపెలివి చంద్రభానుని (సత్యాసుతుని) తక్కువచూపు చూచినాడట.

సారెలు బెళకినఁ జక్కఁ జేయుమటన్న
 ఇదెవత్తు నిలుమని నదికినేగుఁ
దంత్రులూడిన యని తగఁగట్టియిమ్మన్న
 జపవేళయనుచు నిశ్చలతనొందు
శ్రుతులెల్ల దిగ్గఁ జొప్పఁదూర్చి యిమ్మన్న
 దేవపూజావిధిఁ దీర్చెదన్న

* చం. భా. ద్వి. i - 131

నాలాపరక్తికి మేళవింపుమటన్న
ధ్యానవేళ యొకింత తాళుమనును

మఱియు నేమాట యడిగిన మమతలేక
చెంగి చెంగి చరించు నాచెష్టలెల్ల
మౌనివరు పక్షపాతంబుగా నెఱింగి

చంద్రభానుడ సూయా విచారుండగుచు"* అసలు కీలుగుర్తెఱిగినాడట. గురుదేవుడు లతాంతసాయకుని పట్టి వల్లకీవాద్యములు నిద్రస్థితిం దెల్పక తనను సయ్యాటంబుల నిద్రపుచ్చినాడని వాపోయి తనకుగూడ ఏతత్సంగీతశాస్త్రకళా రహస్యములు చెప్పుమటంచు ప్రాధేయపడినాడట. ఆనాడు సంగీతశాస్త్ర విషయమున రహస్యములను కొన్నింటిని గుప్తముగగొందరు మంత్ర రహస్యములవలె కాపాడియుందురు కావుననే మల్లనార్యునకించుక ప్రాచీనుడైన రామరాజభూషణుడు సగర్వముగ తనసుగూర్చితాను సంగీతకళారహస్యనిధినని చెప్పుకొన్నాడేమో!

అట్టి చంద్రభానుని ప్రార్థన కలహాశనముని ధూర్త స్వభావముక్రింద జమకట్టి తనయత్నము కడుఫలించెనని యలరి రిక్తకోపముడిగొవి తెచ్చికోలు కోపముతో సమాధానమిచ్చినాడట. నారదుడిట చంద్రభానుని ప్రశ్నకువిచ్చిన ఉత్తరముకూడ 'సంగీతబాణి' లోనే సాగి సంగీతరీతికళ్యంత ప్రాధాన్యమునొసగ గూర్చినది.

"తగునయ్యానమునిట్లు పల్కుటకు సత్యానంద నానీవు ము
న్నుగ నీవీణియ మీటి యీశ్రుతుల సంధూల్గూర్చి యీశుద్ధసా
గళ భేదంబులెఱింగి యీ సకలమేళ ప్రాప్తముల్నేర్చియుం
బెగడా పెక్కులు పల్కనేల బళిరే నీశిష్యతల్ చేకురెన్"**

---

* చం. భా. చ. i - 135

** ,, i - 141

"చెల్లఁబో నీచేతి వల్లకీరత్నదం
డముదాల్పు యోకదండంబెమాకు
నయ్యయో నీచేతి యసమవిపంచిక
గవిసెన ల్కాషాయకముబెమాకు
నక్కట నీచేతి యల పరివాదినీ
తంత్రీలతలు జన్నిదము లెమాకుఁ
గటకటా నీచేతికప్పు వీణియకాయ
సలిలపూరిత కమండలుబెమాకు"* అని నారదుడు శ్రుతిమీఁటి చిలికిన పని
లేని పాటకు కటకటపడి సత్యభామ పుత్రుడు ఇట్లు ప్రతీకారము వెదుకుకొనినాడు

"అరయస్వీణకుఁదానె బ్రహ్మకొడుకే హుంకారముల్గాక తుం
బురు విశ్వావసు కంబళాశ్వతరులుదాము ప్రభావోన్నతు
ల్వరికింపం దనుఁబోల వీరె యిఁకనేలా యీవితా జోలియే
పెరనైనంగని కాంతు నింద్రొకరిచే వీణాప్రవీణత్వమున్"** అనుచు
చంద్రభానుడు ఇల్లువెడలి సంగీతవిద్యార్జనోత్సాహియై తుంబురునియొద్ద విద్య
నేర్వవలయునని ఏగినేడు.

చంద్రరేఖయను అప్సరస రుక్మబాహుహాత్మ చక్రేశు కుమార్తెగాగ ఆమెకు
శుభగీతులు నేర్పగ విబుధనాథుడు తుంబురుని వియోగించినాడని ఎఱింగికొని
అతనియొద్ద సంగీతరహస్యములు రాగప్రౌఢిమీర గీతములుగానేర్వ వేడ్కవడి
నాడట సత్యాసుతుడు. నాటికి నేటికిగూడ నిజమైన రాగప్రౌఢిమ గీతబాహుళ్యభ్యా
సనమువలనే అలవడును కావుననే ఆప్రక్రియలను రాగగీతములందురను సంగీత
సంప్రదాయము ఇట కవిముఖతః వెలువడినది.

ఈకావ్యేతివృత్తిమందలి మలుపులన్నియు గానానూన విచిత్రవిలాసములను
వంతరించుకొనియే తిరుగుట గమనార్హము. తుంబురునియొద్ద విద్యనేర్చిన
చంద్రరేఖయను అప్సరస జన్మాంతరము కుముదినియై నాయకుడగు చంద్ర

---

* చం. భా. చ. i – 143

** ,, i – 147

ఖానుని చూచుటకుగూడ సంగీతమునే కారణము గావించుట కవిగావించిన ఒక అపూర్వకథనము.

"కాంచియచటం దదీయనమాంచలి సంచరణ చంచదళి గానకళా
వంచన చంచు విపంచీపంచమ నాదంబు చెవుల పండువు సేయన్"*

"ఇది నాయన్న విపంచీ నాదమగుఁజుమ్మీ మెచ్చిలతా
సదనంబులఁ ప్రీతి నాదమూనఁదొడంగెఁ జర్చింతమే" అంచు మొదట సహోదరుని గానరతుఁగావించి ఆతని యుపకంఠక్షోణిలో

"మేరు సంగతి గేయసారవాహిని మూఁడు
తెగలాయె నెనఁగఁదంత్రికలు మెఱయ
స్వరదేవతారోహ సమావరోహ క్షోణి
నట్టు మెట్టికలునా పెట్టులమరఁ
గరిపె ఫణంబుగా గానలోలిత దాయు
చిలువ రాజన పెండి మొళవుమీఱ
శ్రుతితంత్రికా సౌహృతికి నేతెంచిన
కవజక్కవలు నాగఁగాయ లొలయఁ
దనరు వీణియఁజేఁబూని తంత్రిమీటి
బిరడలు బిగించి శ్రుతిగూర్చి కళివెనివిరి
జారుగామీటి సారెలు చక్కనొత్తి
సారెఁచిలకించు సత్యాకుమారుగనియె"**

కథానుగతముగ ఇట కుముదినికి సత్యాకుమారుని చూపించుటతోపాటు మల్లనార్యుడు సంగీతాభిమానులకు ఆనాటి విపంచీ స్వరూపమునిట చూపించి నాడు. వీణియ, వల్లకి, విపంచికలు మూటిని ఆనాడు వాద్య వినోదమున ఉప యోగించినట్లు గోచరించుచున్నది.

---

* చం. భా. చ. iii - 115

** ,, iii - 118

ఇతి వృత్తానుసారము నాయికానాయకులు ప్రథమ దర్శనమునకు వారి యిరువురి ప్రేమవృద్ధిపొందుటకు మఱల మఱల వారిరువురు పరస్పరము చూచికొనుటకుకూడ సంగీతమే ఇట సాయపడినది.

"ఎరడలు బిగియించుకరణి నెమ్మొగ మెత్తి
చొక్కుటతోఁ గ్రేగంటఁ జూచి చూచి
శ్రుతిమీటి యాలకించు తెరంగుతో ముద్దు
దనరు మాటకుఁజెవిఁదార్చి తార్చి
థాలు పల్కున మెచ్చు లీలరూపమునకు
నుడివోని తమిఁదలయూచియూచి
యలసతచే నూరుపురవుచ్చు తీరునఁ
గ్రొమ్మించు మేత్వాఁగ్రోలి గోలి ప్రియ
సఖి చెంగటనున్కి విశ్చలుని రీతిఁ
గొంత సైరించి యాయదు కుంజరుండు"*

"తన వీణ ప్రతిఫలించిన వనజాననఁజూచి సౌఖ్యవారిధిలోఁదె
ప్పునఁదేలి యాత్మగతమున న్వినుతి యొనర్చి" నాడట.**

ఇట సత్యాసుతుడు నాయిక ప్రతిఫలితమును జూడ కల్పించుకొనిన వీణా వాదన వ్యాజమున ఏమాత్రము వీణావాదనమునైన ఎఱుగని కవి తెల్పజాలడు. కావున ఈమల్లనార్యుడు గానలోలుడేకాక వీణావాదన చతురుడనియు ఘంటాపథముగ చెప్పవచ్చును.

ఇక కథాంతమున శుభ ప్రసంగమగు వివాహయత్నమున "మృదంగ కాహళ .... .... నాదములెసంగ సతుల్కవగూడి పాడగన్" అనియును "కువలయలోచనల్పవిక్రకుంగొని తెచ్చిరి వెంట నైదువల్ ధవళముపాడ భోజ వసుధావర తనూజ నత్తరిన్" అనియు గాయక నర్తకాదులు హితములు గరపిరని ఇత్యాది సంగీత ప్రసక్తులు దొరలినవి.

---

* చం. భా. చ. iii - 129

** ,, iii - 130

కథను సుఖాంతము గావించుటకై భరతవాక్యమును పలుకునపుడుగూడ. ఏతత్కథా బీజమైన గానానూన స్పర్ధ కృతార్థత్వమును బొందిన ప్రసక్తియే ఇట ప్రవృత్తమైనది. "శిష్యాదిచ్ఛేత్ పరాజయమ్" మనది ఆచార్యుడు ఆకాంక్షింప వలసిన స్వర్ణావకాశమను సూక్తియిట సార్థకమైనది. తనయొద్దనేగాక తన ప్రత్యర్థివలనగూడ పరిశిష్టుడగు విద్యనభ్యసించి గురువునుమించిన శిష్యుడై తనను చేరవచ్చిన అంతేవాసిని ఆచార్యుడభినందింప వలయునను విశాలభావమును మల్ల నార్యుడిట ఈపద్యమువ వేనోళ్ళ జాటినాడు.

"ఖామానందను దొక్కనాఁడు హరియున్ ప్రద్యుమ్నుఁడు న్మెచ్చవీ
ణా మౌనిం బచరించి తుంబురు నివల్లంగన్న గాంధర్వవిం
ద్యామాహాత్మ్యముఁజూపి తద్వినుతుఁడై తాల్చెం గృతార్థత్వమున్"*

ఇట్లు కవి కథానుగతమగు సంగీతకరీతినేగాక సన్నివేశవర్ణనమునందు కూడ తౌర్యత్రికరీతిని జొప్పించి తన సంగీతాభిరుచిని వెలయించినాడు. చంద్ర భానుడు వేటకేగిన సందర్భములో ప్రచోదనార్థము ఘన, సుషిరానద్ధ వాద్య ప్రభేదముల పేర్పేర్వరుసన పటహ, ఢక్క, జయకాహళ, భేరీ, పణవ, శంఖ, హుడుక్కాదులుగా భయదార్భటిలో ప్రయోగించుట యిట్టిదే.

ఇక కావేరీనదీ వర్ణనమున తీరమున ప్రాలిన హంసలతీరును నాటక ప్రయోగరీతిగా అభివర్ణించుటలోనే నేపథ్య వైభవము ఇట్లు ప్రవ్యక్తము.

"తెరసంధించి ప్రవ్లు హల్లకశిఖాదీపచ్ఛటల్నించిలోఁ
గరమర్థిన్ జలమానుషీ ప్రతిమలంగ్రైనేసి యీసింధుసుం
దరి గంగావతరణ ప్రసంగ కథానాట్యంబు సూపన్సురలే
సరవిన్ వైచు నొసంగులో యనఁగనంచల్ ప్రాలెడింజూచితే"**

ఇంకొకచో ఆనాటి రంగమండపముల కేళికా ప్రదర్శనము సాగుచుండగ తత్ప్రదర్శనాదిదృక్షులై ఏతెంచిన ప్రేక్షకుల అవిరళోత్సాహము శ్రీరంగపుర వర్ణనమున ఇట్లు ప్రస్తావితము.

---

* చం. భా. చ. v - 206

** ,, ii - 99

"వీణావేణు మృదంగనాదముల నువ్విళ్లూరుచున్మండప
స్థాణుల్ ప్రాఁకియు మెట్టులెక్కియును సచ్చోఁగేళికల్పల్పున
య్యేణీనేత్రలఁ జుట్టువారుకొని కంటే కాంచుచున్నారు గ్రామీణుల్"

కావ్యకథాగతమగు ప్రసక్తులనుబట్టి చంద్రభానునికి ప్రద్యుమ్నునితోను నారదునకు తుంబురునితోను సంగీత విద్యాస్పర్థయున్నట్లు అనుమానించుట కాస్కారమేకాక చంద్రభానునకు ఆ విద్యార్జనమునందు నారదతుంబురుల ననరించి వారిమన్ననలనంది కృతార్థత్వమునందు కామనయున్నట్లు గోచరించును. అదే రీతిగ ఈ తరిగొప్పుల మల్లనకు తన సమకాలిక కవులైన దామెర్ల వేంగళ భూపాలుని, మట్ల అనంతభూపాలుని, చరిగొండ ధర్మనార్యుని, సురభి మాధవ రాయని కావ్యాంతరితముగ నిక్షేపింపదగిన సంగీతపాటవమున మించవలెనని ఆకాంక్షయు, గురుతుల్యులైన పెద్దన, భట్టుమూర్తుల సంగీతపాండితిని ఆరాధించి ఆచరింపవలయుననెడి ఆశయము ఉన్నట్లు ఈ చంద్రభాను చరిత్రంపులోతులు తడవి చూచిన వ్యక్తమగును.

# పింగళి సూరనార్యుని సంగీత కళాప్రపూర్ణత

పింగళి సూరనార్యుని కళాపూర్ణోదయ కథాసంవిధానము సంగీత కళాప్రపూర్ణము. ఇందు కథానాయికయగు కలభాషిణీ నాయకుడగు మణికంధరుడు వైణిక గాయకశేఖరుడగు నారదునియొద్ద సంగీత విద్యాభ్యాసము గావించుటయే కాక నారదుడును నాయికయుగూడ శ్రీకృష్ణుని అష్టమహిషులతో గానకళాచతుర యైన జాంబవతీదేవియొద్ద సంగీత విద్యాభ్యాసము గావించినారని కథాగతమగు నొక కల్పనము గావించినాడు. అట్టియెడ నారదుని గొంపోయి శ్రీకృష్ణుడు తన సతియగు జాంబవతి——

"గాన చాతురిఁ దానుగడుఁ బ్రౌఢ యయ్యుఁదుం
బురు మీఁది మత్సరంబునను జేసి
.... విద్యసాధింతునని పూనినాఁడిది
యొందు నెవ్వరు మున్నెఱుఁగ కునికిఁ
గావున విశేషములు నీకుఁగలవి పరునఁ
దెలిపి నీనేర్చినట్లెల్ల దిద్దుమనుచు" అప్పగించినాడు. అట్టియెడ నంతటి గురుతర బాధ్యతను స్వీకరింపబోవు జాంబవతి తనదైన సంగీతపాండితిని శ్రీకృష్ణపరమాత్మునకు మచ్చుతునకగా జూపినది.* ఆమె గానచాతురి వీణాను గతమై సంగీత శాస్త్రోక్తరీతి రీతిలో నొప్పగొందినది. ఇందలి సంగీత సాంకేతికములు ఇతఃపూర్వము వివృతములే.

సూరనార్యుడేగాక కృతిపతిగూడ గానచతురుడగుటన విశేషము. విశ్వావసు తుంబరు నారదాంజనేయ భరతమాతంగ కోహల దత్తిల ప్రభృతి గాంధర్వకౌశల గౌరవస్మరణ కారణ గాన మాధురీధురీణలౌ ప్రేణితబుధ శ్రేణికులగు వైణికులను ... పరివేష్టించిన సభాస్థానమున నున్నారనుటవలన కృతిభర్త సంగీతాభిమానము వ్యక్తము.

---

* "ప్రౌఢిలో సరిగమపధని స్వరంబుల - ప్రతినియత శ్రుతిక్రమము లెఱిఁగి
రాగభేదముల వర్జ్యములు దొలగించి - లయతాళ శుద్ధినెంతయుఁదలర్ప
గ్రామ విశేషమూర్ఛన లేపడ...." క. పూ. ii - 34.

కలభాషిణి పాత్రచిత్రణమును గావించుచోకవి ఆయమ—

"కీర్తన పాత్రచిత్ర మృదుగీత కళాకుశల ప్రవీణతన్

నర్తన నైపుణీ విలసనంబుల పెంపున నృత్యపూర్వ" రీతిలో ప్రవర్ధమానయగుచున్నటుల వర్ణించినాడు.

మణిస్తంభుడు కలభాషిణితో సంభాషించిన తీరులోగూడ సంగీతకమే ప్రధానాంశమై భాసిల్లినది.* ఈ సంభాషణమున గానవిద్యామహత్వము ప్రస్తుతింపబడి అది మోక్షదాయకమనిగూడ వ్యక్తమైనది.**

కథారీతి పచేళిమత్వము నాచికొని రసవత్పాకమున పడిన సన్నివేశములగు మాయారంభానల కూబరాదుల వృత్తమున, ఒక్కచో అప్సరసల వనవిహారమున కవిదైన రాగవివేకము ప్రవ్యక్తము. ఇందు సంగీత సమయోచితమగు వసంత

---

* "తడవులనుండియుఁ దపము సేయఁగఁబూని
మణికంధరుడు పాటమానియునికి
నుపవాస ఖేదంబునపనయింపఁగ లేక
వ్రేగుచున్నవి నాదు వీనులిపుడు
వీణె వాయింపుమో వెలది యింకొకనఁదు
ష్టిగ విని పారణ సేయుఁగాని" ii - 55

"నీ సంగీత విశేషా
భ్యాసము సఫలముగ విష్ణు
న్యాసక్తి తోడఁబాడుచు
వేసరక భజింపుమెల్ల వేళలయిందున్" ii - 61

** "ఆ దేవున కెంతయుఁబ్రియ
మై దురితవినాశ హేతువగు నిదియనియే
నాదరమున నామోక్షా
పాదికన్ వీణియ ధరించి పాడుదునెపుడున్" ii - 62

"బృహతి సమాఖ్యతోఁబెంపు మీఱెడు వీణె
నర్పితంబగాకేది యేమవి వాదింతు" ii - 63

హిందోళ రాగప్రసక్తి రాగప్రవృత్తికి రాగ ఋతువేళా సముచితమై దోహదము నొడగూర్చినది.* కలభాషిణితో మణిస్తంభుడు సంగీతకవిషయ ప్రస్తావనము గావించినట్లే కలభాషిణితో ఆమెసహాధ్యాయి వీణాజీవన సహచరుడు గాఁదగిన వాడైన మణికంధరుడుగూడ సంగీతవిషయకముగనే సంభాషణమును సాగించినాడు. ఆతని స్వరూపవర్ణనమునందాతడు వీణాయుతుడుగా చిత్రింపబడుట సవిశేషము.**

---

* చిగురాకుఁబోఁడి.... .... .... ....

"సను పలుకువెంతయును హాళాహాళిఁ జెలంగ
రహివసంత హిందో రాగకలిత
గానములు మీఱ భూషణ మమర
నమర కాంతులు విహరించునవసరమున" iii - 18

** "బంధుర వీణా సహిత
స్కంధముతో రత్నమాలికా ... జటా
బంధముతో నంత మణి
కంధరుఁడచ్చటికి వచ్చె గంభీరగతిన్" iii - 135

"మన వీణియ లడంచుకొని భ్రమయించున్
.... .... .... బోనిపుడు కలదె" iii - 139

"సంగీతవిద్యా ప్రసంగంబునందైన
మముఁదలంతువో లేదో మనమునందు
దనుజారికే నొనర్చిన దండకంబున్
ఎంద్దైన మతినెల యించితొక్కొ
యిప్పుడు నారదుండప్పుడప్పురికివ
చ్చునొ రాదో .... ....
విడిచిపెట్టితి వీణపై వేడ్కలెల్ల"

ఈ ప్రబంధమునందు జంటగానున్న ప్రతి రెండు పాత్రలలో ఒక్కరికి గాని ఇరువురికిగాని సంగీతాభిజ్ఞతనొడగూర్చుట విశేషము. కలభాషిణీ మణి కంధరులు, నారదతుంబురులు, జాంబవతీ కృష్ణులు, అభినవకౌముదీ మధుర లాలసలు ఇట్టి జంటలు. సుగాత్రీశాలీనుల జంటలో మణిస్తంభుడుగా పరిణతి చెందిన సిద్ధుడు గానాభిమానమును ప్రకటించి కలభాషిణిని ఆకర్షించినాడు.

ఇక మణికంధరుడు కళాపూర్ణుడుగా కలభాషిణి మధురలాలసగా అవ తరించిన పిదపసాగిన కథలో కూడా గానామానస్పర్ధ సవతీస్పర్ధకు దోహదము గావించుట గమనార్హము. ఇందు కళాపూర్ణుడు అభినవ కౌముదీ వీణానుగత గానము వినుచు మధురలాలసనుగూడ ఆవీణను పుచ్చుకొని గానము గావింపుమని యడుగును.

"అడుగుటయున్ విపంచి నమంచిత శ్రుతి
ప్రకాండములకు జగతీతలేంద్ర
మామకస్వర పటిమ సమానమగునొ
కాదొయని యెడుశంక యొకటి జనించె"*

"నా వినియందులకేమి స్వ
భావ గతింబాడు మనిన భామిని గాన
ప్రావీణ్యముఁ జూపెను గడు
నావీణియ శ్రుతులగతులన ధరితములుగాన్"**

"విభుఁడపుడా కంఠస్వర
విభవమునకు నేరుపునకు వెఱగొందెఁగడుం
త్రిభువన దుర్లభమిది యని
యభినవ కౌముదియు మిగులనద్భుతమొందెన్"***

---

* క. పూ. vii - 192

** క. పూ. vii - 193

అపుడు మేదినీనాథుడు మధురలాలసను చూచి—

"నీ వాయించు విపంచికఁ
దేవలయున్ దాని కొలఁది దెలియుదము"నగా ఆమె

"మత్స్వరోదీరణ మెత్తికోలునకు నీడుగఁబల్కెడు వీణలేద" నినదట
ఈవిధముగ సూరనార్యుడు కథానుగతముగ ప్రస్తావించిన వీణా శ్రుత్యుత్కర్ష
యందలి న్యూనతాధిక్యములనుబట్టి చూచిన ఈకవి వీణావాదన చతురుడో వీణా
ధ్వనతత్త్వజ్ఞుడో అయియుండవలెనన తోచెడిని.

కళాపూర్ణోదయేతి వృత్తము కవి స్వకపోలకల్పిత మగుటవలన అందు
లోని ప్రతి అవాంతర కథావిధానము నందునుగల సంగీతప్రస్తావనము కవివరుని
అపార సంగీతాభిరుచికి, అతని సంగీతశాస్త్రాభిజ్ఞతకు నికషోపలమైనది.

ఈ కవివరునిదే మఱియొక ప్రబంధము ప్రభావతీ ప్రద్యుమ్నము.
కథానుసారిగ ఈ కావ్యమునగూడ సంగీతమునకు ప్రాధాన్యతయున్నది.
భద్రనటుని రూపులోనున్న ప్రద్యుమ్నుడు వజ్రనాభుని పురికి వైణిక .... ....
జనాది నాట్యసామగ్రి సహితముగ వెడలెను. అతడట తన నట్టువాంగముతో
కలసి వజ్రనాభునకు వినోదముగల్పింప గంగావతరణాది నాటకముల నాడినదట.*

---

* "సం విహితరంగ మంగళాచారుఁడగుచు
సురహితముగ మాయానాట్య సూత్రధార
వృత్తిగైకొని శంశరద్వేషి యొనరెఁ
బూర్వరంగ ప్రవర్తన పొందుపరుప" ప్ర. ప్ర. iv - 96

"గాంధార ప్రముఖ శ్రుతికళా గంభీరతారాంగనా
గాంధర్వంబు ఘన స్వనంబుతతనిక్వాణంబు వంశాప్తి సం
బంధి స్వాన పరంపరా మహిమమున్ మద్దెళ్ల ధింధిం ధిమిం
ధింధోదిక్క ధిమిక్కశబ్దభవమున్ దీపింపనా పూర్ణతన్"
ప్ర. ప్ర. iv - 98

అట్టియెడ ప్రవర్తిలిన సంగీతప్రస్తావనము తౌర్యత్రికరీతి సమన్వితమగుటయే కాక దృశ్యకావ్య లక్షణానుశీలనము గావించుట గమనార్హము. ఇట్టియెడ కవి వరుడు నాట్యప్రయోగాదికములందు చతురుడని తేటపడుచున్నది.

ఈ సందర్భమునందీ కవి ఆనట ప్రముఖులొనరించిన సంగీతకమునందలి తాళప్రభేదములను ప్రక్రియాభేదములను వ్యక్తీకరించి తన అపార సంగీత వైదుష్యమునే ప్రదర్శించినాడు. ఇందు సంగీతకమున క్లిష్టతరములగు తాళములు, అత్యంత సకృత్ప్రవర్తితములగు మర్దళ గీతభేదములు, ప్రబంధ విశేషములు కూడ ప్రస్తావితములు. దీనినిబట్టి సూరనార్యుని సంగీతప్రతిపత్తి ప్రశస్తమని చెప్పుటలో అతిశయోక్తిలేదు.

---

"సరవిఁ జం చత్పుట చాచపుటోద్ఘట్ట
షట్పితాపుత్రక సంజ్ఞలమర
వెలయు చుండెడుసమ విషమ తాళప్రవృ
త్తులునాల్గు ప్రస్తారకలన వలనఁ
గలుగునా నా తాళములు యథోక్తస్ఫూర్తిఁ
బరగునేలాది ప్రబంధచయముఁ
దత్తవర్ణస్థాన దత్తపదాక్షర బిరుదాదికాంగ
బిరుదాదికాంగ విస్ఫురణఁదనర

క్షితి చతుర్దశమాదిక గీతభేద
ములుదు రావములందు వర్తిలెనవియును
నిఖిల కళలునుగల ఠౌక్కిణీయు శిక్ష
వలనఁదనాట్య కర్మ ప్రవర్తనమున" ప్ర. ప్ర. iv - 99

"ఆ వనజాక్షినందనుఁడు నంతటనాంది తగం బఠించి యిం
పావహిలంౘ ప్రరోచనమునా ముఖమందనరాకనొప్పు ప్ర
స్తావనతో ముఖాదులగు సంధులు పొంగతఁబెంపు మీఱగం
గావతరణాచి నాట్యములాడె ననేకములద్భుతంబుగన్" ప్ర. ప్ర. iv - 100

# ఎడపాటి ఎల్లన నృత్యసంగీత భావన

ఈ ఎల్లనకవి శృంగారమల్హణ చరిత్రమును కృష్ణరాయని కాలముననే రచించి ఏలనోదానినా రాజకవికి అంకితమీక చుండి కాళమంత్రి కద్దానిని అంకితమిచ్చెను. ఈ కాళమంత్రియు సంగీతకోవిదుడను విషయమును ఆతని సభావర్ణనమే చాటుచున్నది.* సాహితిని పార్శ్వమున ఆసీననుగావించి గీతిని అగ్రభాగమున నిలుపుకొనినాడను కవివక్కణచే కృతికర్తతోపాటు కృతిభర్త కూడ తమ ఆదరణమున గీతిసాహితులిద్దరిమధ్య అహమహమికతో స్పర్ధను రవళించినాడనునది కావ్యమున రూఢికెక్కినది.

అందులకే ఆశ్వాసాదిలో మంగళాశాసన పద్యపుటెత్తుగడలోనే ఈ కవి రాగముద్రాలంకారోపస్థితముగ శ్రీ, లలిత, గౌరీరాగములనుంచి కృతియంతటిని ఇట్లే రాగమయము గావింతునని బాస చేసినాడనిపించుచున్నది.**

ఈ కవి తాను సరస కవితాచతురుడనని చెప్పుకొనినాడు. ఆతని కవితా చాతుర్యము సరసముగా సంగీతరసనమంచితముగా నిర్వహింపబడుట ముదావహమగు విషయము. ఇందలి ఇతివృత్తము శివమాహాత్మ్య ప్రతిపాదకమై సుప్రఖ్యాత గీర్వాణ కవిచంద్రుడగు మల్హణుని కథగ పండితారాధ్య చరిత్రమున నుట్టంకితము.

---

* "కవిగురు శేషవాక్కాం తాధిపులబోలు - సత్కవీశ్వరులు పార్శ్వములఁ జెలగ
తుంబురు నారదాదుల గెల్వజాలిన - గాయకులగ్ర భాగముల మెఱయ"
కృ. మ. చ. i - 6

** "శ్రీలలితంబు సానునయసీతగుణంబును జారుపాద
.... .... .... .... ....
బోలును గౌరి తండ్రి బడిఁబుట్టిన దంచు హసించుశంభుడే
వేళని జూరడి కాఱనకు వేడుకనీవుతకాము తార్థముల్"
కృ. మ. చ. i - 1

ఈ కావ్యనాయిక సహజసౌందర్య సమంచితయు గీతిసాహితీ పారీణయు శీలవతియునై వేశ్యాకుల సంభవయగుట సవిశేషము. కథానాయకుడగు మల్హణుడును నాయికయగు పుష్పగంధియు సంగీత సాహిత్యాభ్యసనమున సహపాఠులగుట వలన కథాంతరితముగనే ఎల్లనార్యునకు గీతిసాహితీ ప్రజ్ఞను ప్రదర్శించుట కనువుచిక్కినది. మల్హణుని మెప్పింప పుష్పగంధి గావించిన విద్యాభ్యాసమున సంగీతనాట్యములే ప్రధానములై ఇట్లు భాసించినవి.

"మొగవరి కట్టడు మొనవుకోలాటంబు
చొక్కంపు మురువులు చిక్కిణీలు
దరువు బారబడు దేశిబహుళరూపు
బంధురగీత ప్రబంధ వితతి
వరుస పద్యదేశిబంగాళకంబు కంచి
కొరుతి కట్టడ చిందు కొఱియకాఁడు
పరుశురాముడు వీరభద్రుండు కల్యాణి
చౌపదంబు నెకతాళ శద్దమాది

దేశి శుద్ధాంగంబులయందుఁ దీగఁబోఁడి
పటుతరంబుగ నిజపాద కటకయుగళ
కఖిల పాత్రమ్ములును బొమ్మలగుచు ప్రేలఁ
బూన్కివహియింప పొగడంగ పుష్పగంధి"

"నఖియు రేపును మాపును సాముసేయు
పగలు రేయును చదువుపైఁబాళినుండు
పెలయు సంగీతసాహిత్య విద్యలందుఁ
గమలలోచన నిస్సీమగానెఱింగె" *

---

* శృ. మ. చ. i - 3

ఈ వాద్యప్రక్రియల వివరణము పుష్పగంధి ఆలయమందు గావించిన రంగప్రవేశ నృత్యసందర్భమున వివరింపబడును.

ఇందు మొగవరి, కట్టడ, కోలాటము, జక్కిణి, చిందు, బహురూపము మున్నగు దేశాంగ నాట్యములు ప్రసక్తములైనవి. ఈ నాట్య ప్రక్రియలు ఇతఃపూర్వము నృత్తరత్నావళ్యాదుల ఆధారముల వివృతములే. నాట్యసంగీత సాధనను కేవలము పుష్పగంధియేకాక మల్హణుడు పుష్పగంధియుగూడి మాడి సహచరులై కావించినారనికూడ కవి ఇట్లు వివరించినాడు.

"స్వరమండలంబును జంత్రంబు నొకవేళ
నింపు మీఱంగ వాయించుచుండ్రు
కిన్నెర వీణయుఁగేళిమై నొకవేళ
ముట్టి చూతురు జగన్మోహనముగ
సొంపుగా దండెలు శ్రుతిఁగూర్చి యొకవేళ
పదములుఁ జిందులుఁ బాడుకొండ్రు
గీతప్రబంధముల్ కేళి జక్కిణివంతు
లను కొందురొక వేళ మనములలర

నాట్యహస్తంబును జా.... కావళియును
మక్కువరలంగ రాణింతురొక్కవేళ
మంజరులను, ద్విపదలును సమంజసముగ
చదువుకొను చుందురొకవేళ సరసలీల"*

ఇట స్వరమండలమను తంత్రీవాద్యమునుగూర్చిన ప్రస్తావన వినవచ్చి నది. ఈ స్వరమండలమునకు ఆంగ్లేయుల 'హార్ప్' అను వాద్యమునకు కొన్ని పోలికలు ఉన్నవందురు. దీని తంత్రులనే రాగానుసారిగ ఆయా స్వరములకు మేళవింతురు. దీనిని శ్రుతివాద్యముగ, రాగానుసారిగ మేళవించి గానమునకను గతముగ ప్రయోగించుచుందురు. 'కిన్నర, వీణ' అను వాద్యములుకూడ ఈ పద్యమున వేర్వేరుగా చెప్పబడినవి. నాయికా నాయకులు దండెలను శ్రుతిగూర్చి కొనెడి వారవియు నుక్తమైనవి. దండెయనగా తంబురవంటి శ్రుతివాద్యమను

---

* శ్రా. మ. చ. 1.

కావచ్చును. ఆలాపినియు, చాండాలికయు ఇటువంటివే. ఈ దండెనుగూర్చి కృష్ణరాయలు తన ఆముక్తమాల్యదయందు మాలదాసరి కథలో ప్రస్తావించినాడు.

ఇక కథానుసారిగ ఒకచో సంగీతావిర్భావమును వర్ణింపవలసినచోట సంగీతక తౌర్యత్రిక సమగ్ర విలసనమునకుగూడ అవకాశమిట్లు లభించినది.

"అలి ... .... .... .... ....
కలరవ హంసకేకిరవ కాహళ మర్దళమండి తధ్వనుల్
చెలఁగగ గ్రాడు నర్తనము చేయఁగఁబువ్వొడి రంగవల్లికల్
వొలచిన నాట్యశాలలనఁబోత్రృగఁబూఁ బొదరిండ్ల నొంపునన్"*

ఇట్లు వసంతాగమనముతోపాటు కథానాయికకు యౌవనోదయమైనది. ఆమెకు కన్నెతికము గావింప సమకట్టినదామెతల్లి. కావున ఆమె,

"తొలు వినికిన భవుముందట
నలికుంతల పుష్పగంధియాడెడు ననుచున్
గలయంగఁ బురములోవలఁ
మెలతుక చాటించె దిశలు భోరునఁగలగన్"**

అపుడామె పిలుపున—

"వావికా మధురికా పావకాహళ ముఖ
తుండి కాళంఖాది తూర్యవిదులు
ఢమరుక ఝల్లికా ఢక్కాళ మర్దళ
ఝల్లరీ ఝంకార చతురమతులు
చిత్ర వీణావిపంచీ మత్తకోకిల
లాద్యైన కిన్నరలాక్షణికులు
ఘంటికా జయఘంటికా క్రమఘన తాళ
నవ్తవద్యాది ప్రస్తార చణులు

* కృ. మ. చ. ii – 1
** ,, ii – 2

సఖిలవాచాభినయ కళాప్రకటనటులు
గాయకులు నంకనులు నాదిగాఁగలుగు
మేళముల వారిఁగూడి సమేళ మొసఁగ
శంభునగరికి వేంచేసి సంభ్రమమున"* సన్నద్ధులై నిలచిరట.

శ్రుతులకు నింపుగా శ్రుతికదంబముఁజేసి
లీలనా రావముల్ మేళవించి
మంద్ర మధ్యమ తారమానంబులడరంగ
గమకించి నిఖిల తాయములు మట్టి
షాడవౌదవ శుద్ధ సంకీర్ణములు చూపి
వివిధ రాగంబుల వేళనెఱపి
యాహత ప్రత్యాహతాదుల సమకొల్పి
స్థానమానంబులు సరణినిల్పి

తాళమడరంగ నర్థంబుఁ దప్పకుండ
నొప్పిరంజిల్ల రసములు నుప్పతిల్ల
ఘటనలేర్పడ నన్నింట వన్నెగలుగఁ
జతుర గతులను పాడంగ శంభునెదర"** నిలిచి పుష్పాంజలులు ఇచ్చి ముఖచాతుర్యములు నటించి....

"ఇందు ధరుండు మెచ్చఁదరలేక్షణ పుష్పసుగంధి నల్పె వే
డ్కందగు నృత్యముల్ మురజకాహళ మర్దళడిండిమధ్వనులు
గ్రందుగ నెల్లవారలకుఁ గౌతుకమీనఁ బదాంబుజద్వయిం
బందెలు గల్లుగల్లన విటావళి గుండెలు జల్లుజల్లనన్"***

---

* శృం. మ. చ. ii — 62
** శృ. మ. చ.
*** శృ. మ. చ. ii 63 ష

"చారణ చాగడ చర్చరీ బహురూప
దండ లాసాదిక ఖాండికములు
కందుక కోలాటిక నాట్యతానవి....
ప్రేరణ కుండలీ ప్రేక్షణములు
శూళముల్ కుహుడక శుద్ధపద్ధతి చిత్ర
పద్ధతీఘన దేశ పద్ధతులును
కైలోట లంబక కరణైక తాళికో
ల్లాసాది గీత హల్లీసకములు

నాదిగాగల్గు నృత్య నృత్త్యైక ముఖ్య
నాట్యవిధములు సూచించినయ మెలర్ప
జనులకెల్లను లోచనోత్సవముగాఁగ
నాడెనా యిందుముఖి కొనియాడె జగము"***

ఈ పద్యములలో సంగీతక తౌర్యత్రిక సమగ్ర స్వరూపమె ఈరూపముగ బహురూప నృత్యమును సల్పినది. పుష్పగంధి గావించిన రంగప్రవేశ నృత్యమున తత, ఘన, సుషిరానద్ధాది సకల విధవాద్యములగు వావిక, మథురిక, కాహళ, తుండిక, శంఖ, డమరుక, ఝల్లిక, ఢక్కౌళ, మర్దళ, ఝల్లరి, ఝుంకార, చిత్రవీణ, విపంచి, మత్తకోకిల, కిన్నర, ఘంట, జయఘంట, ఘన తాళ, సప్తవద్యాది వాద్యములన్నియు ఒక్కపరి ఆ నట్టువాంగమున వాద్య సమ్మేళనమునొంది మొరసినవి. ఈవాద్య ధ్వానమంతయు ప్రవర్తితమైన పిదప గీతమారంభమైనది. గానమునకు ప్రాణభూతము శ్రుతి. ఆ శ్రుతిని శ్రుతులగు వేదములకే ఇంపుగొలుపునట్లు వారుగూర్చిరట. ఇట "సామవేదాదిదంగీతం సంజగ్రాహ పితామహః" అను సంగీతరత్నాకర సూక్తి స్మరింపదగినది. ఇక శ్రుతిని శ్రుతికదంబముగగూర్చి మంద్రమధ్యతారమానములలో అరావములను మేళవించిరట. అనఁగా మంద్రములో క్రింది షడ్జమును, మధ్యస్థాయిలో పంచ మమును, తారాస్థాయిలో పైషడ్యమును ముట్టిచూచియుందురు. ఆపద్ధతి ఆనాడే

* శ్రీం. మ. చ. ii — 64 పు.

కాదు ఈనాడుకూడ ప్రతి సంగీత సభాప్రారంభమున గాయకులు సాపా సాపాసా పట్టి శ్రుతి చూచుకొని వాద్యములను తదనుగతములుగ శ్రుతి చేసికొనెడి రీతిగ నేటికిని సాగుచునేయున్నది.

పిదప నట్టువాంగమువారు గమకములను పలికించి నిఖిల తాయములను స్వరస్థానములను స్పృశించిరనికూడ కవి అనినాడు.* ఆ పిదప వివిధరాగముల వేళలనెఱపి అనగ ఆయావేళల ననుసరించి పాడదగిన ఆలాపములనుగూడ వారు గావించిరట.

ఆ పిదప వారు ఆహత ప్రత్యాహతాదుల ననుసరించినట్లుగాకూడ ప్రస్తావించబడినది.** అనగా ఆహత, అనాహత, సమగ్రహములగు గీతాంగపు ఎత్తుకోలునకు సంబంధించిన తాళదశ ప్రమాణములలో ఒక్కటియగు గ్రహప్రాణరీతిని అనుసరించిరని అనుకొనవలయును. అనగా స్వరస్థానమును, తాళమానమును వానిసరణిని విల్చి నిర్వహించుట అక్కడ జరిగినదని తెలుసుకొననగును. కావుననే గానము "తాళమదరంగ అర్థంబు తప్పకుండ" ప్రవర్తితమై యొప్పి భావోద్దీపకమైన సంగీతరీతి అపరంజిల్లినదనినాడు కవి. ఇంత శాస్త్రోక్తరీతిలో నిర్వహింపబడిన ఆగానమున ఆసాంతముగ రసములుప్పతిల వరుసలేర్పడి అన్నింట వన్నెగలిగిదనుటలో అతిశయోక్తి ఏమున్నది? ఇట్లా గాయకులు చతురగతిని పాడినపిదప ఆపుష్పగంధి శంభునెదుటనిల్చి పుష్పాంజలి యొసగుటలో నాట్యము ప్రారంభమైనది. అఖిల దేవతలకు అలరులతోడ పుష్పాంజలియొసగి నాట్యమును ప్రారంభించుటయనునది దేశ్యనాట్యపద్ధతి.***

---

* రాగవేళానిర్ణయము — చూ. ప్రౌఢకవి మల్లన. పు.
"అథవక్ష్యేమీహ....పరరాత్రౌదిన్ దినే"

** తాళదశ ప్రాణముల వివరణము - చూ. 'చరిగొండ ధర్మన్న' పు.
"గీతాతాలేత్వ తీత......."

*** చూ. శ్రీనాథకర్ణాటరీతి. పుట -
"కేనచిచ్చి శ్రవాద్యేన.... పుష్పాంజలి రితి స్ఫుటమ్"
నృ. ర. vii - 74 - 75

పుష్పాంజలి నొసగు దేశిపద్ధతిని జాయాపసేనాని నృత్తరత్నావళియందు వివరించినాడు. దేశివిద్యావిశారదులు పుటిలముతో పుష్పాంజలి గావింపవలెనవిరిగాన దీనికి లోకవ్యవహారమున పుష్పాంజలి యనుపేరు ఔపచారికముగ అన్వర్థమైనదట. ఇట్లు పుష్పాంజలినొసగిన పిదప ఆనాయిక ముఖచాతుర్యములు అనగా ప్రథమమున పుష్పాంజలియిచ్చుతీరులో స్థానకస్థితిలోనిలిచి అంజలించిన పిదపముఖమందు మందహాసమునుచిందించి కనులనుత్రిప్పుచు నేత్రాభినయనము గావించుచు మెడను కదలించుచు గ్రీవాభంగమును అభినయించుట గావించినది అని తెలిసికొనదగును. ఇట్టి పద్ధతినేటికిని నాట్యప్రారంభమున నట్టువరాంధ్రు గావించుచునే యున్నారు. ఇట్టి సుకుమారలాస్య ప్రభేదములగు ముఖజాభినయనాదుల ముగించిన పిదప తతఘన ఆనద్ధ వాద్యములు ఒక్కపరి ఘోరున మొరపినదట. అప్పుడా పుష్పగంధి ఇందుధరుండు మెచ్చుతీరులో మాహేశు లొనరించు తాండవరీతిలో పదాంబుజ ద్వయమందున్న అందెలు ఘల్లుఘల్లుమన నృత్యము గావించినదట.

అటుపిమ్మట ఆపుష్పగంధి ప్రదర్శించిన నాట్యహేవాకములలో ప్రక్రియా వైవిధ్యము ప్రకటితమైనది. ఆనాడు వాడుకలోనున్న నాట్యవైవిధములనన్నింటిని

* ఈనృత్తములలో కోల్లాటనర్తనము, ప్రేరణి, ప్రేక్షణములు ప్రా. ఆం.క.సం.ప్ర. భా - 1 నాచనసోముని నాట్యవినోదమున వివరింపబడినది. పుట. 157 - 161. ఖాండిక, కందుక, దండలాస్యములు పినవీరభద్రుని సంగీతభద్రతలో వివృతములు భా. 1 ప్రా.ఆం.క.సం.ప్ర.

ఇక చారణనృత్తము :

"నానామ ప్రాసమధురాన్ దోహకాన్ రసనిర్భరాన్
రసోచితేన రాగేణ గాయంతో దేశకాకుభిః
వాద్యాపి కరణైః వర్తితైః (భీభూ) కృతోత్తరైః
ఉద్ధతైః పాదవిన్యాసైః భ్రమరైరపి భూషితైః
హస్తాభ్యాం బహుభంగిభిః తాపైః చందమనోహరైః
యత్రభిషౌరాష్ట్రి దేశీయాః చరణాః లలితోద్ధతమ్
త్రియశ్చ దంతకీయాణాం పల్లవైరవగుంఠితాః
నృత్యంతి మండలావృత్యా తత్స్యాత్ చారణనర్తనమ్"
నృ.ర. vii - 135 - 138 చూ. చిందునృత్య వివరణము. 11 పు

ఇట ఎల్లనార్యుడు అనుభవసాక్షికముగా నుట్టంకించియుండును. కాని వానిలో కొన్ని నేడు వాడుకలో కానబడనందున వాని నామములే ప్రాంతుబట్టికున్నవి. వీనిలో సుప్రసిద్ధములైన చారణ, బహురూప, దండలాక్ష్య, భాండిక, కందుక, కోలాట, ప్రేరణి, కుండల, ప్రేక్షణికల లక్షణములు నృత్తరత్నావళ్యాది గ్రంథములలోనున్నవి. వీనిరో అచ్చుతప్పులో, లేఖకప్రమాదములో అనుకొన

---

అథబహురూప నృత్తమ్ :

బహురూపస్య లోకస్య తత్త్ద్రూప ప్రదర్శనాత్
వేష చేష్టిత భాషాభిః బహురూపం నిరూప్యతే
సర్వ (చీవ - చిది) రవాదేదిం.... మువగమ్ (ప్రకల్పకః)
రంజకోమంజు వాగ్వాగ్మికల్యః కైవారకోవిదః
సురేఖో రసికో రూపభాజనం భావతో యువా
౩ (వాయవేనేనితంవో) నాత్యుచ్చో నాతివామనః
సంస్కృతాదిషు భాషాసు నానాదేశోద్భవాసుచ
దక్షః సదస్యతాభిజ్ఞః బలవాన్ విజితక్రమః
ఆళువేషాంతర గ్రాహే ప్రస్థానోచిత పాఠకః
స్వ తుల్యాను చరైర్యుక్తో మండిత శ్మశ్రు మూర్ధజః
మధురధ్వని శారీరో బహురూపి నిగద్యతే
గుణై రేభిః యతాస్త్రీవా మతా ముండన వర్జితైః
త్రివిధాభినయే నాథ్యం లోకధర్మముపేయుషా
సాత్త్వికేన పరిత్యక్తం హావభావైరలంకృతమ్
ద్వి చతుశ్చరణాపాద సంజీవాభినయాంచితమ్
ప్రథమమం ప్రవిశేత్ పాత్రం సకలా లోద్యసంయుతం
వాద్య ప్రవర్తితైః (పాత్రైః?) నృత్తైరపి మనోహరమ్
నృప వంతేన వా లోకప్రసిద్ధ చరితేన వా
యన్నాట్య (వర్జితం)ఽ సాక్షాత్ తత్కుర్యాదత్ర కృత్రిమమ్
అత్యంత గ్రామ్యభాషాఢ్యమనిష్టం యత్ సభావదామ్
.... .... ౩ యచ్చ బహురూపం న తన్మతమ్"

దగినవి రెండున్నవి.. అవి చాగడ, దండలాసకములు. వీనికి దగ్గరివైన పదములున్న నాట్యపద్ధతులు నృత్తారత్నావళియందు కలవు. చాగడకు బదులు చావడగ, దండలాసకమునకు బదులు దండరాసకముగ గోచరించుచున్నవి. అట్లే నాట్యతాసమును నాట్యరాసకమని యనుకొనవచ్చును. ఇందలి చర్చరీసూళములను నవి గీతప్రబంధ భేదములు. చర్చరీ నాట్యవినోదమన్నదికూడ వేఱుగానున్నది. ఇక శుద్ధపద్ధతి, చిత్రపద్ధతి, ఘనదేశ్యపద్ధతులు, మార్గిదేశిపద్ధతులు కలగలుపగు శ్రీనాథుని కర్ణాటబాణీవలె ప్రవర్తిలిన నాట్యప్రభేదములై యుండవచ్చును. ఇట్టివి ఆదిగాగలుగు ముఖ్యనాట్య విధములను ఆపుష్పగంధి ప్రదర్శించి సభాసదులను మెప్పించినదట. ఇవికాక ఎల్లనకు ఆముఖ్యనాటకములుకూడ కొన్ని తెలిసియుండును. వానినన్నిటిని పేర్పేర వచనన చెప్పలేదు. చెప్పినవానిలో కొన్ని వివరణమునకు అవకాశము లేకుండయున్నవి.

ప్రథమాశ్వాసమున పుష్పగంధి నాట్యసాధనగా నేర్చినవి ....... .... మొగ, వరి కట్టడ మొనవు మురగును, బారబడు, కొరతిపుహంకడ, హల్లీసక ప్రక్రియల స్వరూప స్వభావములంతు పట్టుబలేదు. ఈ హల్లీసకమును శ్రీనాథుడు కూడ భీమేశ్వర పురాణమున స్మరించినాడు. వీనిలో కొన్నింటిని మాత్రమే నేడు వాడుకలోనున్నవానికి దగ్గరగా ఊహించుటకు అనువగుపడుచున్నది. ఆ ఊహ ఇదమిత్థమని నిర్ణయింప పరమార్థమని చెప్పలేము చిక్కి, దరువు, బంగాళకము, కంచి, పరశురాముడు, వీరభద్రుడు, కల్యాణి, చౌపదము, ఎకతాళి, కైలాట, అంబిక కరణాదికములట్టివి. వీనితో చిక్కిణియనునది యక్షిణి, జక్కిణి, చిక్రిణియని జక్కుల పురంధ్రులాడెడు నాట్యప్రభేదములై యుండును. ఇక దరువు అనునది నేటి హరికథారచనమున గానబడెడి దఱువనుదానికి ఆద్యమగు నాట్యసంగీత రూపమైయుండవచ్చును. బంగాళకంబను దానిని వంగ దేశాయాత మగు నాట్యప్రభేదరీతిగా ఊహించుటకనువున్నది. కంచియనునది తమిళ దేశపు కట్టుబాట్లుతో కూడిన నాట్యరీతిగావచ్చును. కొరియకాడనునది దక్షిణాంధ్ర సాహిత్యమున గానబడు కొరవంజి నాట్యప్రక్రియ ఏమో! పరశురాముడు వీర భద్రుడు అనునవి ఆనాట్యసుందరి పురుషవేషములు ధరించినటించిన తాండవ ప్రభేదములు గావచ్చును. కల్యాణి చౌపదమను కల్యాణి రాగమునగూర్చిన

నాలుగు చరణముల పదరీతియగు చతుష్పది (పదచాళిక) యైయుండవచ్చును. ఎకతాళియనునది ఉద్గ్రాహధ్రువములను రెండింటిని పాడి ఆభోగధ్రువముల రెండింటిని గానముచేసి సమాప్తము చేయవలసిన ప్రబంధప్రకియ యిది. ఏక తాళోపస్థితివలన *దేసకి (దేశికకు ప్రాకృతిభాషా రూపము) ఎకతాళి - అను నామముతలిగెనదురు. ఇక కైలాటమనునది కోల్లాట నృత్తభేదముగావచ్చును.* లంబకమనునదిగూడ ప్రతంభకమను నామాంతరముగల ప్రబంధవిశేషమే.**

ఉద్గ్రాహమును తాళరహితముగ రాగాలాపనమువలె పాడి ధ్రువ స్థానోద్గ్రాహమై పిదప ప్రథమోద్గ్రాహములోని మాతువును అన్యధాతు బంధము వలె పాడవలెను. ఇందు భాగలంభము, లంభపదము, అనులంభము, ఉప లంభము, అనాభోగము విలంభము అను ప్రభేదములు ఎనిమిది రీతులలోనున్నవి. ఇది తారావళిజాతికి చెందినది.

కరణప్రబంధము : ఇది స్వరాద్యము, పాటపూర్వకము, బంధాదిమము, పదాద్యమము, తేనాద్యము, బిరుదాదిమము, చిత్రాద్యము, మిశ్రకరణము అని యివి ఎనిమిది విధములు. ఉద్గ్రాహధ్రువములు సాంద్రసరబద్ధములు రాస తాళమున ధృతలయయందు ఇది నడుచును. ఈ నాట్యప్రభేదములనన్నింటిని పేర్కొనుటనుబట్టి ఎల్లనార్యునిదైన నృత్యసంగీతప్రజ్ఞమన కవగతమగుచున్నది.

ఎల్లనార్యుడు ఈగ్రంథమును శృంగారమల్హణ చరిత్రమనినాడుకాన పేత ద్రబోపస్థితకై కొన్నియెడల కామశాస్త్ర ప్రసంగముల గావించినాడు. కాని ఒక చోట మాత్రము సురతమును తాండవముగ నుత్ప్రేక్షించి తద్రీతిని నాట్య ప్రక్రియవలె తానే ప్రయోక్తయైనట్లు ప్రకటించినాడు. కాని ఇట నన్నెచోడుడు గావించిన ఇట్టి వర్ణనమే స్మరింపదగినదైనది.***

---

* దేశికకు ప్రాకృత భాషారూపము.

* కోల్లాట నర్తన వివరణము. చూ. చాచన సోమున నాట్యవినోదము భా. 1. పుట - 157

** ఏకతాళి, కరణ, లంబ ప్రబికధముల వివరణములకు ఆధారము శ్రీ రజనీ కాంతరావుగారి ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము పు. 63 - 64.

*** ప్రా.ఆం క.సం.ప్ర భా - 1. "నన్నెచోడుడు" పుట. 70.

"కరమణి కంకణ క్వణము
　　కంఠరవంబులు కొంచి కాసము
కరమణి కింకిణీధ్వని ప
　　దద్వయ నూపురరావ మింపుగ
సురతనవీన తాండవముఁ
　　జూచి మరుండనునొజ్జ ప్రేయుపెన్
దరువన వేణి వీపుననను
　　దార్కొసె నాట్యపు బొమ్మయోయునన్"

ఇది శృంగార మల్హణచరిత్రమగుట వలన శృంగారము తొణికిసలాడినట్లు రచితము కావలెనుగాన ఏతద్రసోద్దీపకమై సంగీత తౌర్యత్రిక సమగ్రస్వరూపము ఎల్లయెడల ఎల్లనార్యుని రచనలో భాసించినది. ఈ కవివరుని నాట్యసంగీత భావన రాగరంజితమై రసోద్దీపితమైనది.

చిందు నృత్యమ్ :

తాలచ్ఛందానుగైః పాతైర్యతి ప్రహరణాదిభిః
కరతాల తరోపేతైః వాద్యవక్త్రిభవైః స్పృహ
పాదైర్లలిత సాల్యాంగైః చారీభిః గతిభిస్తథా
త్రవైః ద్రవిడ దేశీయైః కల్పైః తత్కాకు రీతిభిః
గీతార్థాభినయోపేతైః ద్విపదైః చింతు సంజ్ఞకైః
ప్రయోగైశ్చాపితైః కిత్తు ప్రచురైః సులభైర్మహాః
నృత్యయః ప్రమదాయత్ర సువేషాః నవయోవనాః
సు కలాసంవి తన్వంత్యః పత్యుర్మధ్యేమనోహరమ్ .
చింతు నృత్తమితి ప్రోక్తమిదం ద్రవిడ వల్లభమ్"

నృ. ర. iiv - 1114 - 117.

## దామర్ల వెంగళ భూపాలుని తౌర్యత్రిక ప్రజ్ఞ

కాళహస్తి ప్రభు పరంపరలోనివాడై బహుళాశ్వచరిత్ర రచయితయైన ఈకవి తన ప్రబంధాశ్వాసాంతగద్యలలో తాను సరస సంగీతసాహిత్య సకల కళావిచక్షణ సమాశ్రిత విద్వత్కవిరక్షణదక్ష వీక్షణుడనని చెప్పికొనినాడు. తాను చెప్పికొనినమాట దబ్బరగాకూడ కావ్యాంతరితముగ సంగీతాదిక కళావైలక్షణ్యము ప్రదర్శించినాడు. ఈతడు సాహిత్యకృతసౌహిత్యుడై సరససంగీత సహృదయుడై తన తౌర్యత్రికరీతిని కావ్యరచనమున ఇష్టదేవతా స్తుతినుండి గ్రంథాంతము వఱకును ప్రదర్శించుచునేయున్నాడు. ప్రప్రథమముననున్న మంగళాచరణ పద్యమును శ్రీరాగాంచితముగానిట్లు కూర్చినాడు.

"శ్రీమద్భూమి తనూభవాకబర భూసీమంత సీతాలలం
తీ ముక్తామణిపేరి విత్తువకు జ్యోత్స్నకాంత కాంతిచ్ఛటా
భూమంబుంబయిఁజిల్కు తళ్కు నునుఁజూపుల్పూచు శ్రీరాముఁడీ
దామర్లాన్వయ వేంకటాద్రి విభునిన్ ధన్యాత్ముఁగాఁజేయుతన్"*

ఆ పిదప గౌరీస్తుతియందు రాగముద్రాలంకారోపస్థితముగా సింధు గౌరి రాగము నిక్షేపించి రాగమాలికనే యిట్లు గూర్చినాడు.

"అమరినదీ సమేత కమలాప్త భవారుచి శీతభూధరో
త్తమ రమణీయనీలలజదద్యుతి వైఖరి వెల్లదీనిపై
నమరిన సింధురాజ తనయాధిప దీపిత దీప్తిమీఱుచున్
రమణుని యర్ధదేహమున రంజిలుగౌరి శుభంబులీవుతన్"**

ఇక చతురాస్యుని స్తుతించుటయందును, వాణీనుతియందును తనకుగల వీణావాదనాభిరుచిని సాహితీ సరసత్వముతో మేళవించి ఆవాణీ బ్రహ్మణీశుల అన్యోన్య దాంపత్యజీవనమునకే ఒక చక్కని ఊహాచిత్రమును సంగీతసహ

---

* బ. చ i - 1

** బ. చ. i - 4

కృతితో నిర్మించినాడు. చిత్రకారుడై తన "నవరస సంగీతసాహిత్య సకల కళావిచక్షణ" బిరుదమునకు సార్థకమునొదగూర్చి కొననాడు.

"వాణిపాణి విపంచికాకల కలక్వాణాప్తికిం జొక్కి వా
క్ప్రాణేశుండె వీణ కాయకుచ విశ్రాంతి న్నఖంబొత్తి బ్ర
హ్మాణి హాసముఁగాంచి కచ్ఛపి సమాఖ్యందానిపై వ్రాయు గీ
ర్వాణజ్యేష్ఠుఁడు ప్రోచు వేంకటనృప ప్రద్యుమ్ను నెల్లప్పుడున్"*

"జగముల్మెచ్చ విపంచి మీటితివి నీ సంగీతసాహిత్యము
ల్మొగడ నేర్చునె యొక్కరుండు కఠినంబుల్తత్పరీ పాకము
ల్మగఁడొక్కింత యెఱుంగ నేర్చునమ బ్రహ్మాణీకు నర్మోక్తికి
న్నగుచుంబయ్యెదఁ జక్కఁ జెక్కుకొను వీణాపాణిఁబార్థిరచెదన్"**

తనకుగల సంగీతప్రీతి చందురునకుగూడ ప్రకల్పించి ఒక సన్నివేశమును నగరవర్ణనమునందు ఇట్లుగూర్చినాడు.

"నగరీ సౌధశిఖావధూ మధురగాన శ్రీద్రవద్రత్న సౌ
రగణంబాత్మ శిలా గృహంబవియ గీర్వాణీ తతుల్వానక్రిం
దుగృహాభో గతుఁడించుఁడైందవ శిలాతోయంబుగాఁద స్పైరించి
గి గణించున్పరిగూడుమే తనదు చక్కింబాడున క్కామ్మలన్"***

అంతటితోనాగక ఈసంగీత సరసహృదయుడు ఉపేంద్రుని అంతిపురీ రహస్యమునిట్లు చిత్రీకరించి దానిసీరీతిగ రాగమయము గావించినాడు. మునివరులుకూడా శ్రీకృష్ణుని లక్షణావీణాకళావాంఛనమున్నదోయని ఊహింతురని తెలుపుచు తన భావనలో శ్రీహరివిలాసమునిట్లు చిత్రించినాడు.

---

* బ. చ. i – 5

** ,, i – 6

*** ,, i – 84

"వీణావాద్యము గద్యపద్య కవితా విద్యావినోదంబు క
ల్యాణీ కన్నడ పారసీ ముఖముఖాలాపంబులా నద్దక
ల్యాణీ భూత విచిత్రలాస్యము ప్రశంస్యాంభోద హాస్యామణుల్
త్రాణంజూప మురాపహారి హరియుద్యానోర్వి నుండెం దగన్"*

ఇక చతుర్థాశ్వాసమున ప్రవృత్తమైన పెండ్లి వేడుకలో ఈ సరస సంగీత సాహిత్య సకలకళా విచక్షణునకు తగినంత అవకాశము లభించినది. శౌర్య ప్రతిక ప్రఘోశణాయుత సంరంభముతో ప్రహ్మాండమే నిండిపోయినది.

"వింజామర.... బిరుదులున్ బ్రహ్మాండమున్నిండగన్
ఢక్కానినాద భేరిహుడుక్కా పటహచ్ఛటాపటు ధ్వనులును స
మ్యక్కాహళ కారవములు దిక్కాండము ప్రక్కలించె ధిక్కార
మునన్"**

రణరంగధీరుడైన ఈరాజకవి ప్రచోదనాయుత ప్రచండభేరీ ఝాంకార రవములనేగాక లాలనాసంయుతమైన లలనా గానముసందలి మొడుపులనుగూడ బాగుగా నెఱిగినవాడనుటకు ఈపద్యము తార్కాణము.

"జవరాంద్రుడుగారొకతెగా యనిపించినయొక కంఠిచే
నవమొక యింత వత్తుమను సామజయానలయాన నాజ్ఞముల్
ధవళరుచుల్ గనందమకు దైవత యౌవతమీడు జోడుగా
ధవళము వాడిరిద్దఱు సుధాకర బింబముఖీ శిఖామణుల్"***

ఇట పెండ్లిలో ధవళము పాడుటయను దేశిక గానరీతిని వ్యక్తముచేయుచు యుగళగీతిని గానము చేయునపుడు ఇరువురి కంఠములు సమశ్రుతిలో మేళవింపబడి ఒకరే పాడుచున్నారన్న భ్రాంతిని శ్రవణసుఖమును కల్గింపవలెనను సంగీత

* బి. చ. ii - 73
** ,, iv - 82
*** ,, iv - 78

శాస్త్రన్యాయమును వెంగళభూపాలుడు సంగీత సరసహృదయుడై వ్యక్తము చేయుచున్నాడు.

"ఆ కల్యాణంబున గౌ
రీ కల్యాణంబుల రఘు హరింబొగడిరినా
నా కల్యాణులు కోకిల
కాకల్యాణ పదకంఠక్రమ ధ్వనులన్"* పచారించుచు ముత్తైదువులు పాడిన రఘురామ, గౌరీ, లక్ష్మీ కల్యాణగీతికలను పాడినతీరును వ్యక్తీకరించి కల్యాణము వేడుకలను ముగించినాడు.

ఇక పంచమాశ్వాసము వెంగళనాథునకు అభీష్టకళయైన నాట్యవినోదమును ప్రవృత్తము గావించుటతో సంపన్నమైనది. మణిమంజరి యనునొక నర్తకి నాట్యము : ప్రవర్తించుటలో వెంగళ భూపాలుడు తన నాట్యకళాభిజ్ఞతనంతటిని ప్రదర్శించినాడు.

"కెంజిగురుటాకు పదవింజిదుమ వాదపద కంజ మదసీల మణులం
జాలుకు గెంపుల్
పింజి గొమనూపురము మంజుల ఝళం ఝళకుం జౌరఁగరాబ్జమవరంజి
చిలుగంట
రంజిలెడు మేఖల పయింజలచి మంజుతర శింజిత ఝణంఝణల పుంజి
గనుపింపన్
లంజెల శిరోమణియనంబెలఁగు లోకశుకపంజరి తపాసమణి మంజరి
నటించెన్"**

"అలతి యలంతఁ దీర్చికొననంత వసంత పికాను లాపికా
పలికి మఱుంగుఁగోరి మవువల్పులకోరి గతింధురీలు న
న్నేలువడెఁ డళమ్ంటి తన విల్కాడకోపు నయంబురేఖయు
న్నెళ కొమరంపు సొంపెసఁగ విత్తరి పాదరసంబు కైవడిన్"***

* బ. చ. iv - 97
** ,, v - 69
*** ,, v - 70

"తిగుడుత తత్తర త్తకిట ధిక్కిట ధిక్కిట ధిక్కతో తఝుం
జగ జగ ఝుక్కు ఝుక్కు కిణ ఝుంకిణ యంచులతాంగి రంగముం
పగఁ జొరఁబాణికై మొరఁబదబుఁగదల్చె పతత్పదోద్ధత
న్నిగళముఁద్రెంచుకొన్న రతినేతృ మహోగ్ర మహావళంబనన్"*

"అర్ధాభినయవేళ నంగరేఖా రూఢి
గల్లగిల్ల విజాతి గానికోపు
కడకట్లెడు తత్తకార గౌరవము
మొరయుగ్గడించుచో ముద్దుఁబలుకు
లయగలు కొనుచోటి లాస్య హావప్రౌఢి
యాదిగూడిన చోటి యందగింపు
జతి యెత్తికొలుచో జతగన్న పొదలిక
తీరు మానముచోటి తేటసొంపు

కాంక్షఁగనువారి నీరుగాఁగరఁచి వైచె
నన్నునన్నాట్యపాట నంబుంతనిమ్మ
పాట లామోద మొకపాటఁబాటపాడ
మాటకమ్మరో ప్రమోటుమన్ తేటలొత్తై"**

"చరణానుచిత వాద్యమురజి నెట్టఁగఁజూచు
వాల్జూపు మరుతూపు వాఁడిదిద్దిఁ
దెత్తెయ్యటంచు ధాత్రికిఁ జూపువడ ఘాత
నెత నైష్ఠికుండైన నెదకుఁగోర"***

---

* బ. చ. v - 71

** ,, v - 73

*** ,, v - 74

"పదవాక్య దృశ్యార్థ బహాభినయ లీలఁ
దముఁబిల్పు టయెగాఁగ క్రమము లెంచ
కదలెనో కదలదో సుదతి పుటాలమే
ళపురంచుఁ బ్రదచూడ్కి కవుఁగలింప
కేటికాళయ కాటికానద గళితల
లత తాళానసానొల్ల లత్కి వోల
ధర్మజ జకణ కైంకర్య .... ...."*

ఇట వేంగళ భూపాలుడు నాట్యశాస్త్రవేత్తగానేగాక నాట్యప్రయోక్తగ సరస సమంచిత నాద్యాభినయ రిరంసువుగ గోచరించుచున్న మణిమంజరీ నాట్య ప్రదర్శనమును నిర్వహించినాడు. తన యాస్థానమున తానుగాంచిన వివిధ నాట్య ప్రదర్శనములయందలి నిగ్గునుదేల్చి మణిమంజరీ నాట్యముగకూర్చి ఇట ప్రదర్శించి కృతార్థుడైనాడు కవి. ఈ నాట్యాభినయాభినందనమును తన మాటలలోగాక ఆనాటి సామాజికుల ప్రశంసా పరంపరలలోగూర్చి నాట్యసన్నివేశమును రసానంద పారవశ్యప్లావితము గావించినాడు. దానికీ పద్యము తార్కాణము.

"నిలచిన నిల్కడెల్ల గణనీయము చూపిన చూపులన్నియుం
దొలకరి మించులించుక మనుం దళుకిచ్చగఁజూచు చూడ్కియుం
గలువల కోరికోల కడకట్లను మెట్లపై యెత్తు శబ్దమ
వ్వల జగజెట్టి పాత్ర తలవంపని మెచ్చిరి జాణలచ్చెలిన్"**

ఇట్లా సుందరి నాట్యమును మెచ్చిన సభికులలో ఒక వైశ్యయువకుడు ఆమెను కామించి తన ధనమంతయు ఆమెకు ధారవోయుటకు సన్నద్ధుడైనాడు. అతడాయింటికేగగా ఆమె ఆతనిముందు వీణ వాయించినదట. ఈ వీణవర్ణనలో వెంగళ భూపాలుని నాటికి ఇప్పటి వీణ స్వరూపమునకు దగ్గరగా పరిణతిచెందిన వీణారీతి వ్యక్తము.

---

*

** భ. చ. V — 70

"కవచె మెఱుంగు కొప్పనగ కాయలు కాయల కొప్పు దండముం
జొప్పడు దండమట్లు రహిం జూపిన మేరువు మేరువుం బలెం
దప్పని మెట్ల మెట్లకొక దారిగ నేర్పడు శిల్ప తంత్రులుం
జెప్పగ రాని వీణెఁ దన చేతికిఁ దమ్ముఁడు తెచ్చియిచ్చినన్"

"కోమటి చూడఁగాంత యొకకొంత వదంబొక కొంత పల్లవిం
జామెర వల్లిచూపి గురుచెంతకు వీణియఁ జేర్చి దీనిపా
టే మహిపాలకుం డెఱుఁగునే యని వైశ్యుని కాన్కగన్గొన
న్వేమఱుఁ గాంచి యమ్మఁ బిలువేయుని చేటిని బిల్చినంతటన్"

ఇట్లు వెంగళ భూపాలుడు సన్నివేశగతముగ తౌర్యత్రిక ప్రజ్ఞను ప్రదర్శించిన రీతినిబట్టి ఈతనికి గీతవాద్యములకన్న నృత్యముపైని మక్కువ ఎక్కువయని భావింపక తప్పదు. రాజైన ఈకవి సంగీత సరసహృదయుడని వాద్యప్రియుడని నాట్యవినోదకల్పిత మానసోల్లాసుడని బహుళాశ్వచరిత్రము చాటుచున్నది.

## మల్లి అనంత భూపాలుని సంగీతపరచితి

దామర్ల వేంకట భూపాలునకు స్థాపత్యాది కళావిలసనములందు ప్రతి స్పర్థిగా నిలచిన సమకాలికుడు మల్లి అనంత భూపాలుడు. ఈతడు ఆలయనిర్మాణాదిక శిల్పకళాసృష్టిలో వేంగళభూపాలుని మించినను కావ్యనిర్మాణ దక్షతయందును సంగీతాదిక కళావిలాస వ్యక్తీకరణమునందును దామర్ల భూపాలుని మించలేదు. ఇతని కకుత్స్థ విజయమున ఒకటి రెండు సంగీతప్రసక్తులున్నవి. అవియును యదాలాపముగ, ఆలవోకగా దొరలినవి మాత్రమే అని చెప్ప వచ్చును. ప్రథమాశ్వాసమున తననుగురించిన ఆస్థానుల భావనలను వ్యక్తీకరించు సందర్భమున—

"కరుణాగరిష్ఠులు కమలాక్షుఁడనియును
వీరాగ్రగణ్యులు విజయుఁడనియు
.... .... .... .... ....
భోగసంపన్నులు పురుహూతుఁడనియు
వైణికాగ్రేసరుల్వాణి యనియు
.... .... .... .... ....
.... .... .... .... ....
వెనరఁగొనియాడఁగాఁ బురం బుండునేమొ
దయయు శౌర్యంబు నీగి సత్యవ్రతంబు
విభవ సంగీతపాండిత్య విష్ణుభక్తి
లనఁగ దనరుఁగుమారుఁడనంత విభుఁడు"* అని చెప్పుకొనినాడు. కాని ఆ సంగీతపాండితిని కావ్యమునందెచ్చటను ఓహో యనునట్లు ప్రదర్శించలేదు.

కథసాగిన పిదప రంగశాయి రంగధామమునుజేరిన శుభవేళలో దివిజకోటి భువికేతెంచినపుడు వనమయూరము—

---

* క. వి. i. 23

"అత్తరిని దివ్యమురజానకల ధిందిం
ధిత్తిమికిఁ జిత్తము దేలనల నృత్తా
యత్తమగు మెచ్చునకు నచ్చరలతోడన్
బొత్తుగలపెన్ నృప తపోవనమయూరుల్"* అనుచు అనాహత సంగీత రీతిని ప్రస్తావించినాడేగాని అవకాశమును వినియోగించుకొని తన సంగీత పాండిత్యమును ప్రవర్త్తము గావింపలేదు. అట్లే మఱియొక్కచో

"శ్రీమద్ధర్మింగ విమానమానిత శిరశ్శృంగారుఁడా రాజయో
ధ్యామార్గంబున వచ్చె దుందభి మృదంగారావముం గాహళ
గ్రామారావము దిక్కుడుంగ జనితారావం సేవింప రం
డో ముందోడక వచ్చె రంగపతి యించుద్దండమై"** అనుచు రంగనాథసేవార్థుల అహ్వానించు సందర్భమున ప్రవర్తిలిన పద్యమున సుషిరావద్ధ వాద్య గ్రామారావమునుగూర్చి ప్రస్తావించినాడేగాని అద్దానిని తన సంగీతపాండితీ సహకృతిలో సమన్వయింప యత్నించనేలేదు.

ఇంకొకచో రంగధామ నిర్మాణసందర్భమున అమరశిల్పాచార్యుడు ఒక ప్రదక్షిణవిధినుభయ నాట్యంబుల మేళంబులకుఁ జంద్రశాలలునిచి నాడనినాడేకాని నాట్యప్రదర్శనా వైవిధ్యమును మాత్రము వెల్లడించలేదు. అలవోకగ—

"బలియఁగ మద్దెల తాళము
వెలగగ నాణజము మెరయ సేవావేళం
గెలఁకుల బొమ్మల కొమ్మల
కొల కొలమను క్రందుగ్రిందు కోవెలయందున్"***

ఈ మాటలను పలికి ఆస్వామి అంగరంగవైభవము దెలిపినాడు. మఱుకనో నారదమౌనిని సుకుమారుడు కలసికొని పరామర్శించి పన్నివేశమున అమహర్షి చేతివిపంచీలతనందుకొని అతనిని—

* క. వి. i — 218
** ,, ii — 5
*** ,, ii — 16

"తివిచి చూడలేదె గవిసనయెన్నండు
నొళవు దుమ్ము గప్పియొప్పుడాఁగి
తంత్రులూడి విననఁదన మొందెనిదియేమి
మహతియినయునికి మౌనిచంద్ర"*

అని కుశలప్రశ్నము గావించినాడనినాడు. సంగీతపాండితీ విశేషస్వాంత దగునీకవి రణరంగధీరుడైన బహుకార్యవ్యాపృతుడైన రాజకపియగుట వలన తన సంగీతసాధనకుగూడ అట్టిస్థితినే ప్రకల్పించుకొని స్వీయానుభవ సంవాది ఘట్టమునిట చిత్రించినాడెమో అనిపించుచున్నది. కావుననే కొన్నినాళ్ల గావించిన అవిరళ సంగీతసాధనాంతరము అద్దానిని మఱచిన వైణికుని చేతివీణాస్థితి ఇట సాజముగ వ్యక్తీకరింపబడినదేమో! తిరుపతియందలి గోవిందరాజస్వామి ఆలయ నిర్మాణమునీ మట్లు అనంతభూపాలుడే గావించినాడు.** అట నిర్మింపబడిన ఈ ఆలయనిర్మాత ప్రతిమలలో ఒకదానియందీతడు వీణాధారియై గోచరించుటనుబట్టి ఈతడు వైణికుడని వీణానాదానుగతమగు గానమునకు మర్దళానాద సహకృతిని ఈతడభిమానించునని అలవోకగా అనిన మాటలనుబట్టి భావింపవచ్చును. ఈ కవివరుని సంగీతపాండితి అంతర్నిహితమై ఒదిగియుండి కావ్యముఖమున బహిర్గతము కాకుండుట విచారణీయము.

---

* క. వి. ii – 46

** ఈ విషయము నాకెరింగించినవారు మాగురుదేవి ప్రముఖ చరిత్రా పరిశోధకురాలు కుమారి డా॥ వై. పద్మావతి MA. Ph.D. గారు, (Principal K.V.R. Govt. College Kurnool).

# కాచవిభుని మల్లారెడ్డి సంగీతరీతి

ఈ మల్లారెడ్డి షట్చక్రవర్తి చరిత్రా ప్రబంధ నిర్మాత. ఈతడు సంగీత పరిజ్ఞానమును వీణావాదనా పటుత్వము కలిగినవాడని కావ్యాంతర్గత సంగీత ప్రసక్తులనుబట్టి నిర్ణయించుట కనువున్నది. ఈ షట్చక్రవర్తి చరిత్రమును సుజనరంజనీ ముద్రాక్షరశాలవారు వేర్వేరుగా ఆఱుగురు రాజులకథలను 1899 లోనే ముద్రించినారు కాబోలు. అందు హరిశ్చంద్రుని చరిత్ర నలమహారాజు చరిత్రములు క్రిమిదష్టములై కొంతగమాత్రమే లభ్యములైనవి. ప్రథమాశ్వాసము అవతారిక మున్నగునవి లభ్యములయిన ఎడల మఱింతగనీతని సంగీతపరిచితినను శీలించుట కవకాశముండెడిది.

దొరికినంతలో గావించిన పరిశోధనలో హరిశ్చంద్రునిగాథలో మతంగ కన్యలు ప్రదర్శించిన సంగీతశాస్త్రంపు విన్నాణము ఈతని సంగీతశాస్త్ర పాండితికి తార్కాణమై నిలచియున్నది.

"జీవాళి బొందించి జిగిచేసి తంత్రుల
    శ్రుతుల కనురణన సంగతిగూర్చి
వేళలు పరికించి యాలాపములకును
    జాలుగా సారెలు మేళవించి
ముప్పది రెండ్రాగముల్ వాని మిత్రముల్
    తద్భేదముల్ సమస్తము నెఱింగి
సరిగమపదని యన్సంజ్ఞా స్వరంబుల
    జంత్ర గాత్రము కొక్కచాయఁదనర

బహు చూడాది గీతప్రబంధ తతుల
నఖ శిఖాంకుర ముఖరీతి నైపుణముల
రంగు వినఁగ రాలు గరగంగ వట్టి
మ్రాకు లిగురింపఁబాడి రమ్మగు వలపుడు"*

* ఇందుకొన్ని యెడల పద్యసంఖ్యాదికములు కీటదష్టములు. ఈ ప్రతులు నెల్లూరు పురమందిర గ్రంథాలయమున జీర్ణస్థితిలో లభ్యములు
ష. చ. ii - 131

ఇందు వీణావాదన వైఖరితోపాటు రాగరాగిణీలక్షణములు వేళావేళల గీత ప్రబంధాదులగు ప్రక్రియలు స్మరింపబడుటనుబట్టి ఈకవికి సంగీతశాస్త్రముతో నున్న పరిచితి వ్యక్తము. ఆపిదప సాగిన కాశికాపురీవర్ణనమున ప్రవృత్తమైన ఈసీసమున ఈకవి రాగవివేకస్వాంతుడై రాగముద్రాలంకార సహకృతితో కొన్ని రాగనామములుంచుట ప్రశంసార్హము.

"మహితయై కాంభోజి మాలికా విస్ఫూర్తి
సలలిత చామరచ్ఛత్ర పటలి
ద్విజవరాళి స్ఫురద్వేద ఘోషార్భటి
కాశికాగరు ధూపగంధపాళి
భాసుర శ్రీరాగ పంచవాద్య ధ్వని
భూరి ఘంటారవ స్ఫుట నిరూఢి
యతులిత నీరాజనాభి రామక్రియ
ప్రకట మోహన వృషభధ్వజంబు

నడుమఁ జిత్రంబైన.... నహరహంబు
కుజ్యయంబైన రాగభోగోత్సవములు
వింపుదళు కొత్తుచున్న విశ్వేశరునగరు
జేరి దండప్రణామముల్ చేసి నిలచి"*

ఇక కాంభోజి, లలిత, ద్విజవరాళి, శ్రీరాగ, ఘంటారవ, రామక్రియ మోహన మున్నగు రాగములు ప్రసక్తాను ప్రసక్తములుగా పద్యాంతరితములై వికీర్ణ ప్తములైనవి.

...ఆ పిదప చతుర్థాశ్వాసమున నలమహారాజు కథలభ్యమైనది. ఇందు వసంత వర్ణనమున సంగీతమునకవకాశము లభించినది.

"ఆళిగానంబు సరస్తరంగ వాద్యధ్వానముల్మ్రోఁగా
వలయ గ్రామ మరున్నటుండు మలయన్ మాకందవాటిన్ లతా
లల నల్పాంగ నాట్యము ల్పలుపనుల్లాపించి పైపై చెదఁద
ద్విల సత్కోరక తారహారములు శీవిన్ మాధవుండెం తయున్"*

అట్టియెడ "నాడుంగొమ్మల పాండురచ్ఛదము రాన్వయముతోడుల్చి వాఁడట గాడ్పు దుండుగపు మన్నేడు" అపుడు చిత్తములకు మత్తుగొల్ప జూచిన మత్తాళులు పాడుచున్న సమయమున ఒక పాండువనపాలుని విధంబున జన పాలుని కడకేతెంచి ఉద్యానవిహారమును చేయరమ్మని ఇట్లాహ్వానించినాఁడట.

"ఆరామాభిరాను విశేషంబు కలకంఠ నాదమేదురంబు, కలహంసయాన విరాజమానంబును మదాళ్యానేక గీతవినోదంబును" గావున "మున్నెవిరి జన్యజనకమే కంబంచు" ఈపలుకుబడులలో దొరలిన కలకంఠ కలహంసములను పదములు రాగనామములును అగుట గమనార్హము.

ఇందు వీణావాదన వైఖరితోపాటు రాగరాగిణీలక్షణములు వేళావేళల గీత ప్రబంధాదులగు ప్రక్రియలు స్మరింపబడుటనుబట్టి ఈకవికి సంగీతశాస్త్రముతో నున్న పరిచితి వ్యక్తము. ఆపిదప సాగిన కాశికాపురీవర్ణనమున ప్రవృత్తమైన ఈసీసమున ఈకవి రాగవివేకస్వాంతుడై రాగముద్రాలంకార సహకృతితో కొన్ని రాగనామములుంచుట ప్రశంసార్హము.

"మహితయై కాంభోజి మాలికా విస్ఫూర్తి
సలలిత చామరచ్ఛత్ర పటలి
ద్విజవరాళి స్ఫురద్వేద ఘోషార్భటి
కాశికాగరు ధూపగంధపాళి
భాసుర శ్రీరాగ పంచవాద్య ధ్వని
భూరి ఘంటారవ స్ఫుట నిరూఢి
యతులిత నీరాజనాభి రామక్రియ
ప్రకట మోహన వృషభధ్వజంబు

నడుచుఁ జిత్రంబైన.... నహరహంబు
కుజ్యయంబైన రాగభోగోత్సవములు
నింపుదళ కొత్తుచున్న విశ్వేశరునగరు
జేరి దండప్రణామముల్ చేసి నిలచి"*

ఇక కాంభోజి, లలిత, ద్విజవరాళి, శ్రీరాగ, ఘంటారవ, రామక్రియ మోహన మున్నగు రాగములు ప్రసక్తానుప్రసక్తములుగా పద్యాంతరితములై నిక్షిప్తమైనవి.

ఆ పిదప చతుర్థాశ్వాసమున నలమహారాజు కథలభ్యమైనది. ఇందు వసంత వర్ణనమున సంగీతమునకవకాశము లభించినది.

"అళిగానంబు సరస్వరంగ వాద్యధ్వానముల్మీఱఁగా
వలయ గ్రామ మరున్నటుండు మలయన్ మాకందవాటిన్ లతా
లల నల్పాంగ నాట్యము ల్పలుపనుల్లాపించి పైపై చెదఁద
ద్విల సత్కోరక తారహారములు తీవిన్ మాధవుండెం తయున్"*

అట్టియెడ "నాడుంగొమ్మల పాండురచ్ఛదము రాన్వయముతోడుల్బి నాఁడట గాడ్పు దుండుగపు మన్నేడు" అపుడు చిత్తములకు మత్తుగొల్పు జూచిన మత్తాళులు పాడుచున్న సమయమున ఒక పాండువనపాలుని విధంబున జన పాలుని కడకేతెంచి ఉద్యానవిహారమును చేయరమ్మని ఇట్లాహ్వానించినాఁడట.

"ఆరామాభిరాను విశేషంబు కలకంఠ నాదమేదురంబు, కలహంసయాన విరాజమానంబును మదాళ్యానేక గీతవినోదంబును" గావున "మున్నెవిరి జన్యజనకమే కంబంచు" ఈపలుకుబడులలో దొరలిన కలకంఠ కలహంసములను పదములు రాగనామములును అగుట గమనార్హము.

ఇక భోజభూజాని గావించిన విలాసాది వినోదములలో రంభాద్యప్సర కామినీ నాట్యరామణీయకంబులకు వియ్యంబులగు వారాంగనా విచిత్ర తౌర్యత్రికా వధానంబులో నారదతుంబురు గానధిక్కారులగు గానవిశేషంబును ప్రవర్తిల్లి నవట.** ఇక నలదమయంతుల కేళీగృహము కూడ యాతాయత వాతాహత వల్లకీసంగీత భంగీతరంగిత యగుట విశేషము.*** ప్రాతఃకాలమున నలదమ యంతులకు మేలుకొలుపులుపాడు సందర్భములోకూడ సంగీతము రాగాంచితమై ప్రవర్తిల్లుట కవిదైన రాగవివేకమునకే తార్కాణమగుచున్నది.

"భూపాలాధిప మేలు కొమ్మనుచు నేర్పుల్మీఱఁగాఁ బాఠకు
ల్భూపాలాది దినాదిరాగముల వింపుల్మింపగాఁబాడ నా
క్ష్మా పశ్రేష్ఠుఁడులేచి తేర్చె శుచియై కాల్యోచిత ప్రక్రియల్"****

* ష. చ. iv - 15
** ష. చ. v - 73
*** ష. చ. v - 82
**** ష. చ. v - 87

దమయంతి తన ప్రాణేశ్వరుడైన నలునకు—

"ఒక కొన్ని దినములు ప్రకట వీణాగాన
తాన మానములఁ జిత్తములఁగఅచి

వలచి వలపించుకొనె" నని* వర్ణించుటలో కవికిగల వీణావాదనాభిరుచి తాళమాన ప్రకల్పనాభిరుచియే యిట ధ్వనించిదనుకొనవచ్చును.... మొత్తము మీద దొరికినంతవఱకు ఈ షట్చక్రవర్తి చరిత్రమునుబట్టి మల్లారెడ్డి సంగీతశాస్త్ర కోవిదుఁడని వీణావాదనాభిరుచి కలవాడని నిర్ణయించుటకు తగినంత అవకాశ మున్నది.

* ష. చ. ౫ - ౧౦.

# ప్రౌఢకవి మల్లన సుదృఢ గానసాధన

ప్రౌఢకవి మల్లనార్యవిరచితము ఏకాదశీమాహాత్మ్యము. దీనిని 1862 లో ఆది విద్యావిలాస ముద్రాక్షరశాలవారు ముద్రించిరి. ఇది బహు పురాతన ప్రతి యగుటవలన ఉత్పన్నమై ప్రథమాశ్వాసాంత షష్ఠ్యంతముల నుండియున్నది మాత్రమే లభ్యమైనది ఈ గ్రంథము దైవాంకితము. కృతిభర్త దాక్షారామ భీమేశ్వరుడు. ఈ భీమనాధేశ్వరేశ్వర స్వామిమూర్తి శ్రీనాథకవి సార్వభౌముని ఇలవేల్పుగాన ఆస్వామికే కృతినొసంగిన ఈ మల్లనార్యుని వాణిలో కూడ శ్రీనాథునివాణి ఎడనెడ గోచరించుచున్నది.

"తరుణీ విరచిత నవీనతరగానకళాసరస నవలాస్య కేళీపరమానందునకున్ అతి మహోత్సవ సమయప్రమదాజన వాద్యమానపటు మురజ ధిమింధిమి మేఘనాదనర్తిత నమదమయూరునకున్"*

ఈ షష్ఠ్యంతమున తరుణీవిరచిత నవీన గానకళా లాస్యకేళియందు మార్గి దేశిరీతులకు మధ్యేమార్గమున నడచు కర్ణాట నృత్యరీతి గోచరముకాగా దానికను వైన ప్రమదాజన వాద్యమానపటు మురజ ధిమింధిమి ధ్వానముగూడ అనుగత మగుటలో గీతవాద్య నృత్యత్రయీ స్వరూపమే యొక్కచో దర్శన మొనగినది.

ఇక కథానుగతముగ సాగిన రుక్మాంగదుని కొలువుతీరులో "కవి గాయ కార్థిమాగధ సంఘశోభితమ"ని ఆతని పురమున రాగాతిశయ వికారము గాయకు లందే గోచరించుననని వర్ణితము.** అట్టి రుక్మాంగద ప్రభునివలచి వలపింపనె తెంచిన చతురాననుని నిజపుత్రియైన మోహినీ స్త్రీయసామర్థ్యము సంగీతప్రభావ ప్రభావితమగుట గీతికి విజయపతాక నెత్తినదైనది.

"వీణారవంబుచే వేడ్కలు నిగుడించి
మధురగా నంబుల మర్మములుగ (అచి)
.... .... .... .... ....

---

* ఏ. మా. i — పుట - 5

** ,, i — పుట - 8

పటు తరమగు మద్వీణాస్ఫుట మధురవం
బుచెవుల సోకిన మాత్రన్....
విట రాయఁడై నగానిఘట దాసుఁడు గాఁడె
రెండు ఘడియల లోనన్.... ...''* అని జగన్మోహిని పంత గించినదట. పిదప "నా మోహినీ కన్య తనచేతిరత్న విపంచి మ్రోయించుచు షడ్జ మధ్యమ పంచమస్వరంబున ననేక రాగతాళ సంకీర్తనమున** సూళాది*** గీతము బాడుచుండె"నట.

ఆమె పాడిన సూళాది గీతములలో సంకీర్తనములలో రాగతాళ వైవిధ్యమును ప్రదర్శించినదనుట గమనీయము. ఇట ప్రక్రియా వైవిధ్యమునేగాక ఆమె గానప్రదర్శనమున శ్రుతివైచిత్రినిగూడ గనుపర్చుచు మంద్రమున షడ్జశ్రుతిని మధ్యమమున మధ్యమశ్రుతిని అతితారమున పంచమశ్రుతినిగూడ ఆధారముగావించుకొని పాడుటవలన ఆగానము అత్యంతసాధనా ప్రయుక్తము, అనితర సాధ్యమునగుటవలన ప్రశంశసార్హమగుచు మల్లనార్యుని శ్రుతిజ్ఞానమునకు నికషోపలమగుచున్నది.

---

* ఏ. మా. ii పు - 33

** సంకీర్తనము : నుతికీర్తన అని నేడు పిలువబడుచున్న సంగీత రచనకు అన్నమాచార్యులనాడు పదమని సంకీర్తనమని వాడుక.

"పదముల యర్థము పల్లవి
పదలక యన్నిటికి నేక వాక్యతచేతన్
గురిగ్రుచ్చినట్లు తగులై
పదము తగిన మరియు మరియు పల్లవియమురున్" సంకీర్తనతత్వ. తాళ్లపాకచిన్నన

*** సూళాదిగీతము : సూడోపి త్రివిధః శుద్ధమిశ్రసాలగభేదతః - అ.... క్రమతః తేషాం.... కృష్ణభూభుజాః" సం. రా.

"అష్టభాషాపదైర్యుక్తం అద్యం అపదైర్యుక్తం
స్వరరాగైః ప్రగాయంతి గీతమిత్యభిధీయతే"

"..... వీక్షించి వక్షోరుహంబు గదియ
రత్నవల్లకి నిలిపి ప్రయత్నమలర
తంత్రులు నూనెచేఁదగ బిగించి జీవాళి
పొందించి సారెలు పొందుపఱచి
సరిగమపదని స్వరసప్త భేదసం
గతులకు లక్ష్యలక్షణము లెఱింగి
మంద్రమధ్యమతార మధురిమ శ్రుతులెత్తి
గరిమస్త్రీ పురుషరాగము తెలిసి
భావసంకీర్ణవేళావేళ వీక్షించి
జంత్ర గ్రాతములొక్క సరణిఁదనర

వీణె మ్రోయించి వరివరి విధములందు
నాలతులసేసి మృదురీతి నాలపించి
యమృతహరి ప్రకారంబులతిశయిల్లఁ
బాడె నమ్మోహినీ కాంతభవుని మ్రోల"*

"శంకరుని శుద్ధసాగళ సంకీర్ణ ప్లుతలయ ప్రసారణలీలన్, వీణాదండము మిగుర్పఁగ రాణను నదువదియునాల్గు రాగంబులు సప్రాణములై నర్తింపగా నేణంబులు నొగియనామృగేక్షణ పాడె"ను.**

ఈ సన్నివేశమున మల్లనార్యుడు గాయకుడేగాక వీణావాదనారీతిని ఎఱిగిన వాడని తోచుచున్నది. తంత్రులను బిగించి వీణకు శ్రుతిచేయవలెనని అపుడు తైలమునట పొందించుపద్ధతి నేడునున్నది. ఇక జీవాళిని పొందుపరచి సారెలు విల్పుట నాటివీణెకు అవసరముగాని నేటి వీణెకక్కరలేదు. ఇక తరువాతి పాదములలో స[illegible] కేతిక పదములుకొన్ని వినవచ్చినది. సప్తస్వర సంహితనుబట్టి ఏక్స్వర ప్రస్తారముమ మూర్ఛనలను తానములను వింగడించుట సంగీతశాస్త్రాంతరితమగునొక గొప్పప్రక్రియ. దీనికై మూర్ఛన తానకూట

* వి. మా.

** ,, iii - పు. 48

తానాదిక ప్రకరణమని సంగీతశాస్త్రములందు ఒక ప్రత్యేక ప్రకరణమున్నది. అది ఈనాటి సంగీతవిదులకే అర్థముగాని గందరగోళము గానదానినిట వివరించుట అనావశ్యము. ఇక మంద్రమధ్యమ తారములనెరుగుట వానికవాంతరములను అను మంద్ర అతితారములను పంచవిధస్థాయి భేదములను గ్రహించుట యనునది గూడ సంగీతశాస్త్ర విదితప్రక్రియయే. ఈ నాదభేదములు ద్వావింశతి శ్రుతులు స్వరజాతి స్థితులకు మూలములైనవి. స్వరములు ఆయాస్థానములలో నిలచి గానార్హములగుటలోనే జాతులు. జాతులనుండి రాగములు, ఆరాగములలో శుద్ధఛ్ఛాయాలగ (సాగళ) సంకీర్ణరాగములు వాని అవాంతర భేదములైన సంపూర్ణ షాడవ ఔడవ రాగరీతులేర్పడినవి ఒక్కొక్క రాగమునకొక్కొక్క పద్ధతిలో సప్తస్వర విశేషములందలి స్థానవైవిధ్యమును పురస్కరించుకొనిన స్వరములు ప్రయుక్తములగును. ఆ స్వరస్థానములు షడ్జము, శుద్ధఋషభము చతుశ్శ్రుతి ఋషభము, సాధారణ గాంధారము, అంతరగాంధారము, శుద్ధ మధ్యమము, ప్రతిమధ్యమము, పంచమము, శుద్ధదైవతము, చతుశ్శ్రుతి దైవతము, కైశికినిషాదము, కాకలినిషాదము అను స్వరములలోనే ఏదోయొక రీతికి చెందిన స్వరములు ఆయారాగలక్షణములనుబట్టి ఏడుగనో ఆరుగనో ఐదుగనో ప్రయుక్తములగును. ఇవిగాక షట్శ్రుతి ఋషభ చ్యుతపంచమాదిక వికృతి స్వరములు క్వాచిత్కములుగా ప్రయుక్తములగును నాట రాగమున షట్శ్రుతి ఋషభము వసంతరాగమున చ్యుతపంచమము ఈషత్స్పష్టముగ విన వచ్చుట ఒక ప్రత్యేకత. ఇట్లు రాగరీతులు రూపుదిద్దుకొనిన పిదప ఆద్యములగు సంగీతశాస్త్రములలోవివి స్త్రీపుంనపుంసక రాగములని. ఆ పిమ్మట వింశంతిరాగ మేళములని విభక్తములైనవి. భరతాచార్యులు చెప్పిన ఆద్యములగు ఈ స్త్రీపుం నపుంసకభేదములను, రాగతాళ చింతామణియందు పోలూరి గోవిందామాత్యుడు గూడ వివరించినాడు. ఈ రాగతాళ చింతామణి తెలుగున రచితమైన ఏకైకమగు సంగీతశాస్త్ర విషయకమగు పద్యసంహిత.

ఈ పోలూరి గోవిందామాత్యుడు రాగములకు లింగవివక్ష తెల్పినాడు.

వానికి భార్యాభర్తృ సంధానానుగత కుటుంబసభ్యరీతి భరతాచార్యోపబృంహితము * దీని నాధారము గావించుకొని గోవిందామాత్యుడు వెలయించినరీతి యిది.

---

* ప్రియ మెప్పఁబురుష రాగంబులు శ్రీరాగ
 ములు నపుంసకరాగములు నెఱుంగ
వలయును వినిపింతు వనుసతో వినవయ్య
 భైరవి రాగ భూపాలరాగ
ములను శ్రీరాగంబు ముసపైన రాగంబు
 ఫల మంజిరనామరాగ వసంతరాగ
మాళవరాగ బంగాళక రాగము
 నాట రాగంబుననంగనిట్లు
పురుష రాగము లెనిమిది పొసఁగియుండు
 ననుచు భరతుపైన మహాత్ములంఁడు" రా.తా.చిం. iv - 151.
"అట్టి పురుషరాగంబులకు శ్రీరాగంబు లెవ్వియనిన
 మేఘరంజి కురంజి మేలుదేవక్రియ
ముగురుభైరవి రాగమునకు సతులు
 మఱియు బలాహరి మలహరి జాతియు
భామలు ముగురు భూపాలమునకు
 దేవగాంధారియు దిర మెప్ప బిలహరి
సావేరి శ్రీరాగ జాతులరయ
 లినపొంచు దేశాక్షి లలితము పొంధియు
రమణులు ఫలమంజరషున నెప్పుడు
 శుద్ధ రామక్రియాఖ్యము శుద్ధబాము
ఘనవరాళియు మంగళకైశికియనఁ
 గాంతఁలు ముగురు శుద్ధవసంతమునకు
రామభూపాల జగదేక రమ్యశీల" రా. తా. చిం. iv - 153.

ఇంతటి సంగీతశాస్త్రచోదిత వివరణాపేక్షులైన పలుకుబడులను ఒకటి రెండు పద్యములలో నిమిడించిన కవి మల్లన ప్రౌఢకవియేగాక ప్రౌఢిమాధాక మానసుడగు సంగీతశాస్త్రజ్ఞుడుగూడ నగుచున్నాడు. ఈకవి పైని చెప్పినవేగాక భావసంకీర్ణ వేళావేళలను గూర్చి పలికిన పలుకుబడులుకూడ వివరణార్థములే ఆ రాగములుకొన్ని వేళావేళలనుబట్టి గేయార్హములగుట కాకుండుటకూడ విహిత మైనది.

---

"ధన్యాసియు, ముఖారితగు మాళవశ్రీయు
మాళవ గౌళకు నువిదలిట్లు
నెనమండ్రు పురుషుల నెన్న నొక్కొ కారి
ముయ్యొర్గు లెనయుకతన

అథవక్ష్యామి హే... తాత కాలరాగాను క్రమాత్
దేశాక్షీ దేవగాంధారీ భాండీ ధన్యాసి మురువాః॥
దేవక్రియాచ బంగాళగౌరీ భూపాలపీవచ।
స్వస్వైశ్చ ప్రవర్తంతే ప్రాతః కాలే దినేదినే॥
కురంజీ సాహంకీ ఘంటారావ రామక్రియా తథా
బిలహరీ మలహరీ ముఖారీ యమునా తథా
రేగుప్తి భైరవశ్చైవ వర్తంతే సంగమేదినే
మేఘరంజీ చ సారంగా భల్లాతీ మధ్యమావతీ
దేశీ నీలాంబరీ చైవ తథా మంగళదేశికా
శ్రీరాగశ్చతుః మధ్యాహ్నే వర్తంతేసు
మోహనాచైవ కల్యాణి కావే ఘూర్జరికా తథా
శంకరాభరణా పూర్వీ వసంతశ్చవరేదినే
నారాయణీచ హిందోళి సౌరాష్ట్రాతోడి రాఘశీ
శివరాశివంతు ఉపే నీమాళవస్తథా
ప్రవర్తంతే లలితా చతథైవచ
కాంభోజీ సావేరీ బేగడ తథా

ఆ పిదప మోహినీ కన్యక శుద్ధసాళగ సంకీర్ణ రాగరీతులలో ఆలతులు అనగా ఆలప్తులు నిర్వహించుట ప్రస్తావింపబడినది. వానితోపాటు ప్లుతలయ ప్రసారణలీలను లయాత్మికతను నిర్వహించినట్లుకూడ ఉక్తమైనది తాళదశ ప్రాణములలోని షడంగములగు ద్రుత, అనుద్రుత, లఘు, ప్లుతకాకపాదములలో నివి యివి. దీనినిగూర్చిన వివరణ యింతకుముందు చరికొండ ధర్మనార్యుని సంగీతభిజ్ఞతనుగూర్చి వివరించినపుడు చెప్పబడినది. ఇక ఈపాదములలో చివరివియగు అరువదినాల్గురాగంబులు సంప్రాణములై నర్తించుట అనుబలుకుబడి

---

పూర్వరాత్రౌ ప్రవర్తంతే పున్నాగో నాటకాదయే
గుండక్రియా మనోహారీ తథామంగళ కైశికీ
కేదార్యాహిర్య సావేర్యః బంగాళో జౌళికా తథా
ఏతేరాగాః ప్రవర్తంతే మధ్యరాత్ర్ దినేదినే
జోగినీ చిత్రవేళా చ కర్ణాట సూరటా తథా
మంజరీ చ ప్రవర్తంతే పరరాత్రౌ దినేదినే"
సం. వి. ద. రా. వ. iv - 287 - 88.

"రాగమేళములలో రహికెక్క మొదటిదై
యాముఖారి మేళమమర నవల
మాళవ గౌళక మేళమనఁగ శ్రీ
రాగమేళంబు సారంగనాట
మేళము హిందోళ మేళము శుద్ధరా
మక్రియా మేళంబు మఱియు నవల
దేశాక్షి మేళంబుఁ దిన్నని కన్నడ
గౌళమేళంబును ఘనతఁగాంచు

శుద్ధ నాటయు మేళమై నొబగుమీఱు
నాహిరీ మేళమనఁగఁ జెల్వొందునిట్లు
మేళన శకంబు విలసిల్లు మీసరముగ
లాలితౌదార్య రామభూపాలవర్య" రా. తా. చిం. iv - 4.

ఆలప్తి - నన్నెచోడుడు ప్రా. ఆం. క. సం. ప్ర. పుట.

ఇంతటి సంగీతశాస్త్రచోదిత వివరణాపేక్షులైన పలుకుబడులను ఒకటి రెండు పద్యములలో నిమిడించిన కవి మల్లన ప్రౌఢకవియేగాక ప్రౌఢిమాధాక మానసుడగు సంగీతశాస్త్రజ్ఞుడుగూడ నగుచున్నాడు. ఈకవి పైని చెప్పినవేగాక భావసంకీర్ణ వేళావేళలను గూర్చి పలికిన పలుకుబడులుకూడ వివరణార్థములే ఆ రాగములుకొన్ని వేళావేళలనుబట్టి గేయార్హములగుట కాకుండుటకూడ విహితమైనది.

---

"ధన్యాసియు, ముఖారితగు మాళవశ్రీయు
మాళవ గౌళకు నువిదలిట్లు
నెనమంద్రు పురుషుల నెన్న నొక్కొ-రి
ముయ్యార్గు లెనయుకతన

అథవక్ష్యామి హే... తాత కాలరాగాను క్రమాత్
దేశాక్షీ దేవగాంధారీ భాండీ ధన్యాసి మురువా॥
దేవక్రియాచ బంగాళగౌరీ భూపాలఏవచ।
స్వస్వరైశ్చ ప్రవర్తంతే ప్రాతః కాలే దినేదినే॥
కురంజీ సాహాళీ ఘంటారావ రామక్రియా తథా
బిలహరీ మలహరీ ముఖారీ యమునా తథా
రేగుప్తి భైరవశ్చైవ వర్తంతే సంగమేదినే
మేఘరంజీ చ సారంగా భల్లాతీ మధ్యమావతీ
దేశీ నీలాంబరీ చైవ తథా మంగళదేశికా
శ్రీరాగశ్చతుః మధ్యాహ్నే వర్తంతేను
మోహనాచైవ కల్యాణి కావే ఘూర్జరికా తథా
శంకరాభరణా పూర్వీ వసంతశ్చపరేదినే
నారాయణీచ హిందోళి సౌరాష్ట్రాతోడి రాఘళీ
గౌరీవరాళివంతు ఉపే నీమాళవస్తథా
సాయంకాలే ప్రవర్తంతే లలితా చతద్దైవచ
మేళావళీచ కాంభోజీ సావేరీ బేగడ తథా

ఆ పిదప మోహినీ కన్యక శుద్ధసాళగ సంకీర్ణ రాగరీతులలో ఆలతులు అనగా ఆలప్తులు నిర్వహించుట ప్రస్తావింపబడినది. వానితోపాటు ప్లుతలయ ప్రసారణలీలను లయాత్మికతను నిర్వహించినట్లుకూడ ఉక్తమైనది తాళదశ ప్రాణములలోని షడంగములగు ద్రుత, అనుద్రుత, లఘు, ప్లుతకాకపాదములలో నివి యివి. దీనినిగూర్చిన వివరణ యింతకుముందు ధరికొండ ధర్మనార్యుని సంగీతభిజ్ఞతనుగూర్చి వివరించినపుడు చెప్పబడినది. ఇక ఈపాదములలో చివరివియగు అరువదినాల్గురాగంబులు సంప్రాణములై నర్తించుట అనుబలుకుబడి

---

పూర్వరాత్రౌ ప్రవర్తంతే పున్నాగో నాటకాదయే
గుండక్రియా మనోహరీ తథామంగళ కైశికీ
కేదార్యాహిర్య సావేర్యః బంగాళో జౌళికా తథా
ఏతేరాగాః ప్రవర్తంతే మధ్యరాత్రౌ దినేదినే
జోగినీ చిత్రవేళా చ కర్ణాట సూరటా తథా
మంజరీ చ ప్రవర్తంతే పరరాత్రౌ దినేదినే"

సం. వి. ద. రా. వ. iv - 287 - 88.

"రాగమేళములలో రహికెక్కి మొదటిదై
యాముఖారి మేళమమర నవల
మాళవ గౌళక మేళమనఁగ శ్రీ
రాగమేళంబు సారంగనాట
మేళము హిందోళ మేళము శుద్ధరా
మక్రియా మేళంబు మఱియు నవల
దేశాక్షి మేళంబుఁ దిన్నని కన్నడ
గౌళమేళంబును ఘనతఁగాంచు

శుద్ధ నాటయు మేళమై సొబగుమీఱు
నాహిరీ మేళమనఁగఁ జెల్వొందునిట్లు
మేళన శకంబు విలసిల్లు మీసరముగ
లాలితౌదార్య రామభూపాలవర్య" రా. తా. చిం. iv - 4.

ఆలప్తి - నన్నెచోడుడు ప్రా. ఆం. క. సం. ప్ర. పుట.

వివరణాపేక్షయై నెగడుచున్నది. ఈ కవులకు అర్వాచీనుడైన రఘునాథ నాయకుని గురుపుత్రుడైన వేంకటమఖి జనకరాగములను డెబ్బదిరెండు మేళకర్తలుగా విభజించి జనక జన్యరాగపద్ధతిని స్థిరీకరించినాడు. అంతకు పూర్వములగు సంగీతశాస్త్ర గ్రంథములలో వింశతి రాగమేళములు ఉదీరితములు. వాని ననుసరించి తెలుగులో సంగీతశాస్త్రము రచించిన పోలూరు గోవిందామాత్యుడుకూడ వింశతి రాగమేళములనే గ్రైకొనినాడు.

---

"నాద నామక్రియా నవమేళ శుద్ధవ
రాళి కామేళములోలి మెరయు
లలినొప్పు రీతి గౌళవసంత
భైరవిమేళ కేదార గౌళ
మేళ హిజ్జిజికామేళ సామవరాళి
కామేళములు చాలఁగ్రాలు నవ్వ
లను రేవగుప్తిమేళంబు సామంతమే
ళంబు కాంభోజి మేళంబు వెలయుఁ

బదియు మేళంబులిట్టయ్యెఁబదియు నవియు
నివియు గూడగ మేళము లిరువదయ్యె
వరుస నీరాగ మేళావళులనఁ గలిగె
రాగవర్గము రామభూరమణిలినుము" రా. తా. చిం. iv - 5.

వెండియునిట్లు వింశతిమేళంబులయందు జన్మించిన రాగసమూహంబులోన నుత్తమ మధ్యమాధమ రాగంబుల నేర్పఱచి తెలిపెద ఆకర్ణింపుము.

"ఆదియందు ముఖారియను శుద్ధనాటయు
మాళవ గౌళము మహితమైన
శుద్ధవరాళియు [illegible] గుజ్జరి
[illegible]రాగంబులుత్తమమైన

ముత్తముమీద గోవిందామాత్యులు మొదలగు సంగీతశాస్త్రజ్ఞుల పరిగణ మును కలిపిగణించిన ఇరువది+పదునేను+పదునెనిమిది+పదమూడు కలిపికూడిన అరువదియారు రాగములగుచున్నవి. వీనిలో ఒకటి రెండు రాగములు అటు నిటుగాకూడ నుండవచ్చును. కావున గురికి బెత్తెడు దూరముగాకపోయినను దరిదాపులుగానైనను ఈకవి సంఖ్యాగణనమున లక్ష్యశుద్ధి సాధించినాడనియే అన వలయును. ఏది యెట్లుయినను కవియైనవాడు సంగీతశాస్త్రజ్ఞుడు కూడానై రాగ

---

శుద్ధ రామక్రియ శుద్ధ వసంతంబు
భైరవి హిందోళ భవ్యరాగ
మవల శ్రీరాగాఖ్యమనఁగఁగన్నడ గౌళ
రాగంబు సామంత రాగమనఁగఁ

బరగు దేశాక్షి ధన్యాసి గౌళకయును
నహిరీ రాగమన మలహరి యనంగ
రమ్య మాళవశ్రీయు సారంగనాట
లమరు నిరువది రాగముల్ రామభూప" రా. తా. చి౦. iv - 54.

"క్రమమెప్ప కేదార గౌళాఖ్య కాంభోజి
కన్నడ బంగాళకములనంగ
మఱియు బేలావళి మధ్యమాగధియు నారా
యణి యనంగ రీతి గౌళయనంగ
నాద నామక్రియ నలుపైన బౌళియ
భూపాల దేవగుప్తులును మఱియు
గుండక్రియా హిజ్జిజి నొనరు వసంతంబై
రవియును సామవరాళియనఁగ

నిట్లు పదియేను విధముల నెసగునట్టి
మధ్యమాహ్వయరాగముల్ మహిని వెలయు
నతుల గీతప్రబంధ - యోగ్యమగుచు
రామ భూపాల మహనీయ రమ్యశీల"

మఱియు సధమ రాగంబులెన్నియనిన—

"సౌరాష్ట్రి భౌళిమేచక రాగమునుచ్ఛ
యాగౌళియు కురంజియనగ సింధు
రామక్రియము గౌడరాగంబందివిరాగా
మంగళ కైశికి మహిపూర్వ
గౌళలు సామరాగంబు నాందోళియు
కలమంజరీ రాగ భవ్యశంక
రాభరణాఖ్యంబు లాదేవగాంధారి
యాదీవకనట నారాయణములు
చక్కని శుద్ధభైరవి భిన్న షడ్జమనఁగా
నిట్లు పదియునెన్మిది చూడ నెన్నఁదగిన
సధమ రాగములనుచు మహాత్ములైన
గీతవిదులంద్రు రామభూమహితలేంద్రా"

"క్రమముగ కుంతలాఖ్య వరాళియనగ సా
రంగభైరవి యవరంగు గల్గు
శుద్ధబంగాళంబు సొబగుమీఱు నాగధ్వని
ఘంటారవాఖ్య రాగంబు మార్గ
హిందోళకాఖ్యచే నెనఁగు రాగంబు ఛా
యానాట దేవక్రియాఖ్యమవల
నారాయణీగౌళ చారు తోఁట వరాళి
యనగ దురక తోడియనగ మఱియుఁ

తెలఁగు సావేరి యార్ద్రదేశియు ననంగ
నిట్లు పదమూడు రాగములనియు మొదలు
గల్గు రాగంబుల ధమరాగంబులంద్రు
రామభూపాల జగదేక రమ్యశీల" రా. చిం. V - 59.

ఇట్లు పదమూడు ఇంపైన లెక్కచే సమరిన యధమ రాగములాయెననినాడు కోల్హారి గోవిందామాత్యుడు.

లక్షణాదికములనుడుపుట ప్రశంసార్హమగు విషయమేగాక అన్యముగాదు. అందు వలన ఈ మల్లనార్యుని సంగీతపాండితి కేవలము శ్రుతపాండిత్యమనుటకు వీలు లేదు. పైపెచ్చు "శ్రుతంచ బహునిర్మలమ్మ"ని నట్లు ఈప్రౌఢకవి మల్లనార్యుని సంగీతపాండితి నిగ్గుదేలిన శ్రుతమని సోపపత్తికముగానొక్కి వక్కాణింప వచ్చును.

-

# బొబ్బిలి శంభుదాసుని సారంగ కావ్యరాగ వైచిత్రి

ఈ శంభుదాసుడు ద్విపదకావ్యముగ సారంగధర చరిత్రను రచించినాడు. అందరివలె ద్విపదలను కావ్యరీతిలో కథానుసారిగ రచించుటగాక వానికి రాగ ప్రకల్పనముతానే గావించుట ఈకవిదైన ప్రత్యేకత.

రాజుల సమక్షమున కోటలో ప్రదర్శింపదగిన సంస్కృతనాటకములవలె పేటలోని ప్రజకు చవులూరించు రీతిలో ప్రదర్శించు తీరును కల్పింపదలచి కవి యిందలి ద్విపదలకు రాగప్రకల్పనము జేసియుండ వచ్చుననిపించుచున్నది.

ఈకవి ద్విపదలకు రాగములు గూర్చుటలో అనూచానముగ అనుసరింప బడుచున్న రాగగానపద్ధతిని ఇసుమంతైనను అనుసరింపలేదు. సంస్కృత నాటకములందు వైతమునాందిని నాటయందు గానముచేసి భరతవాక్యమును మధ్య మావతిలో పాడి నాటకమును వద్ధతియున్నది. కాని యీకవి కావ్యాంతమున ప్రకల్పించు మధ్యమావతిని కావ్యపారంభమున మధ్యలోకూడ ప్రతిపాదించి నాడు. కావ్యాదిలో గానము చేయవలసిన నాటను కావ్యాంతమున బాడించినాడు. ఈ కవిగూర్చిన రాగములు వరుసక్రమములో నీకీతిగనున్నవి. 1. మధ్యమావతి 2. కేదారగౌళ 3. సారంగ 4. మధ్యమావతి 5. బేగడ 6. సావేరి 7. కేదారగౌళ 8. తోడి 9. నాట.

ఇంకొకచో చిత్రాంగి విరాళిలో ఆమె మనోవ్యాధిని వర్ణించువట్ల రాగము కూర్చలేదు. ఇట్లు రాగప్రకల్పనము గావించునపుడు ఈకవి పరంపరాపద్ధతిని ఎందులకు వమ్ముచేసినాడో మధ్యమావతిని కార్యాదిలో నాటనుకావ్యాంతమున ఎందులకుంచినాడో అంతుబట్టుటలేదు. అదియే ఈకావ్యమందలి ప్రతేక్యత, వైచిత్రి అనుకొనవలెనేమో! ఇంతగా రాగరీతిని తారుమారుచేసిన ఈకావ్యమును వేదము వేంకట రాయశాస్త్రి కవివర్యులభిమానించి తమ స్వీయముద్రణాలయమున ముద్రించుట ఈ బొబ్బిలి శంభుదాసుని రచనా విన్యాసమునందలి ప్రత్యేకాకర్షణమై

యుండవచ్చును. సంగీత విషయమునందు మాత్రము ఈతడొక క్రొత్త పుంతను త్రొక్కినాడనుట మాత్రము స్పష్టము. ఈతనికి చాల సంవత్సరముల పిదప శ్రీకృష్ణపారిజాతమును (యక్షగానము) రచించిన తరిగొండ వెంకమాంబ యను రచయిత్రిగూడ ఆదియందు మంగళాచరణమును మధ్యమావతియందే గావించుట ఈ శంభుదాసుని ఒరవడియే కారణమైనదేమో! ఏది యెట్లైనను ఈసారంగ కావ్యవైచిత్రి చిత్రాతిచిత్రముగానే నిలిచిపోవుచున్నది.

## అప్పప్పకవి బొడ్డుచర్ల తమ్మయ్య ఘట్టు ప్రభువుల సంగీతాభిమానము

**అప్పప్పకవి శశిరేఖాపరిణయము :**

ఈకవి తండ్రి సంగీతవిదుడని ఆతనితోపాటు మఱికొందరు ఈతని వంశ కర్తలు సంగీతము నెఱిగినవారున్నారని ఈ కవి రచించిన శశిరేఖా పరిణయా వతారికవలన వ్యక్తమైనది. ఈతని కావ్యమున కవియే చెప్పుకొనిన తాతలనాటి సంగీతప్రజ్ఞయేగాని కవిదైన స్వకీయసంగీతప్రజ్ఞ ఏమియు వ్యక్తము కాలేదు. ఈ కవికి ఇంటి విద్యగ సంగీతమున్నను పెరటిమందుగానది వంటపట్టలేదు. కావ్యమున ఒకటి రెండు ప్రకరణములలో తప్ప మిగిలిన కావ్యమునందెక్కడ సంగీతప్రస్తావన లేనేలేదు. అందు మొదటి పద్యమగు చతురానన స్తుతియిది.

"వెలయగ భారతీయువతి వీణెఁగు చంబులఁజేర్చి హాయిగా
సలలిత రాగవైఖరులఁజక్కఁగ గానము సేయ వేగమే
వలపుల గౌగిటఁదిగిచి వాణి మనమలరారఁ జేయునా
జలజభవుండు మాకెపుడు సత్కృపతోడఁజిరాయు వీవుతన"*

ఆ పిదప తన జనకునిగూర్చి ఇట్లు చెప్పినాడు.

"భట్టుమూర్తికి సరియనఁబరగు నతడు
ఆంజనేయుఁడు వీర హన్మప్పమఱియు
హనుమదాసను .... .... ....
.... మదీయ జనకులు కీర్తించి" రనుచు,

"ఇలలోన నాంజనేయుల వాచకస్ఫూర్తి
మంజుల స్ఫురణతో మధురమగుచు
నేయే రసంబుననే రాగంబొప్పిన నా
రాగమున రసంబమరఁ జదివి

---

* శ. రే. ప. i - 4

యాలకించిన వారి నానందాబ్ధిలో
మగ్నుల గావించి మరులుకొలిపి
బంధు జనాళి నాభరణ భావంబునఁ
గన్నాకుగానెక్కి ఘనతకెక్కి"*

ఈపద్యములలో అప్పప్పకవిదైన సంగీతప్రజ్ఞ మనకేమి కన్పించదు. కాని, రామరాజభూషణునిపైని అర్వాచీనులకున్న అభిమానము, ఆతని సంగీత ప్రజ్ఞపైనన్ను ఆరాధన వసుచరిత్ర పద్యముల నాయారాగముల చదివిని హాయి గూర్చునను అభీప్సితమును ఇట వ్యక్తమైనది. ఏది యెట్లున్నను ఈ అప్పప్ప కవి సంగీతమున పండితపుత్రుడేగాని పండితుఁడగు పుత్రుఁడు గాడనుట అసహజముగాజాలదు.

## బొడ్డుచర్ల తమ్మయ ప్రసన్న రాఘవ నాట్యప్రబంధము :

ఇది నాటకపద్ధతిలో వ్రాయబడిన ప్రబంధమయినను గానప్రసన్నత ఉండ వలసినంతగలేదు. ప్రధమాంకమున కృతినాయకుని నుతి సందర్భమున నాతడు,

"సంగీత సాహిత్య సంగరాంగణ సార్వ
భౌమునిశ్శంకాంక బంధురుండు
.... .... .... .... ....
దీప్తి జనరాజునందేల తిమ్మరాజు" అని నుతింపబడినాడు.

ఇక ప్రస్తావనలో ఒకచో ఘమ్మని ఒకనాదము వినవచ్చినది.

"ఇది యెట్టుర గగనంబున
విదితంబయ్యెన్ ప్రవీణ వీణాధ్వని నీ
రదము గాబోలుఁ బ్రియం
బొదవ మదాచార్యుఁబరమ యోగీంద్రుఁ గనెన్"**

---

* శ. రే. వ. i – 7

** ప్ర. రా. నా. ప్ర. i – 157

"…. నీవినదము మహతీ
జనిత క్వాణంబుగాదు చదలంబొదలన్"*

"తుమ్మెదలు మ్రోయుచున్నవి
ఝుమ్మని యివేరెండు కుసుమసాయకు జయ గీ
తమ్ములు వాడెడు గతి….
నమ్మాధురి చెవులగ్రోల సాళ్చర్యండై"**

ఈ పద్యములలోని ఇందిందిరాద్వయధ్వానము వీణా నినాదముతో నుపమింపబడినవి.

ఇక శివధనుర్భంగ సమయవర్ణనమున కొలదిగ నిట్లు సంగీత ప్రస్తావన యున్నది.

"హరి నిద్రందోలు చుంబాయఇ భుజగ ధరశౌర్యంబు గూర్కింపుచున్
…. …. …. …. …. కూర్మ రాజున్
తిరుగల్ గావింపుచున్ ధింధిమిధిమియని వాదిత్రమున్ ముజ్జగంబుల్
మొరయన్ జృంభించెఁబెల్పం బురమథన ధనుర్ముఖ్య భంగోత్థగర్జల్"***

ఇక పరశురామగర్వాపహరణ సందర్భమున—

"సంగీతభంగీకృత వినుతయశః ….నమమ్మై రఘురాముశరము విలు పాపిన"దని వర్ణితమైనది. ఇట్టివి ఒకటిరెండు వంగీతప్రసక్తులు తప్ప పేరున బట్టి నాట్యప్రబంధమైనను ఇందు సంగీతము ప్రముఖస్థానమాక్రమింపలేదు.

---

* ప్ర. రా. నా. ప్ర. i – 156
** ,,
*** ,, iii – 158
**** .

## ఘట్టుప్రభువు కుచేలోపాఖ్యానము :

ఈ గ్రంథము చాలచిన్నది. అందునను సంగీతప్రసక్తులు స్వల్పము, కృష్ణుడు మురళీరవగాన విమోహరవుండని స్తుతింపబడుటయు, శ్రీకృష్ణుని పురమున నేచెంత చూచిన బిందుబింబాస్యలు నటించు రంగస్థలములేయున్న వనుటయు గనవచ్చును. భేరీమృదంగ కాహళనాదంబులట మొరయుచుండునని శ్రీకృష్ణుడు సాళ్వయవనాదుల జయించిన విజయముల నుట్టంకించు జయ గీతములట వినవచ్చునని కవి అనుటకంటె (వావిళ్ల ప్రతి. ii - 36, 37, పు.) చెప్పుకొనదగిన సంగీత ప్రసక్తులే ఈగ్రంథమున లేవు.

# సారంగ తమ్మయామాత్యుని వైజయంతీగానము

విప్రనారాయణ చరిత్రమును ఇతివృత్తముగాఁ గైకొని సారంగు తమ్మయామాత్యుడు వైజయంతీ విలాసమును రచించినాడు. ఈ వైజయంతీ విలాస తౌర్యత్రిక విలసనము కథాగతముగ సహజసిద్ధము. కావ్యనాయిక ఆటపాటల నేర్పరియై మురిపింగలుగుట ఇందలి విశేషము.

కవికి సంగీతమనిన ప్రాణప్రదముగ చూచికొనవలసిన విద్యయను భావమున్నది. దనికి మొదలగ ఆతడు వాణిస్తుతి వ్యాజమున గూర్చిన పద్యము నిల్చును *

కథానాయికయగు దేవదేవి అక్క "బహునృత్య గీతవాద్య కళల పెన్నిధి" యట. అట్టియెడ,

"అర్థినయ్యక్కయును జెలియలును నృత్త
గీతవాద్య నిరూఢిఁ బ్రఖ్యాతమైన
మేళమొనరించు నిజప్రౌఢి మెఱసిచోళ
విభుని విభుతాధిపతిఁ గాంచు వేడ్కనరిగి"** అనుటతో వైజయంతీ విలాసమున నృత్యగానకళావిలాసము ఆరంభమైనది. అక్కచెల్లెంద్రు ఇరువురు గావించిన సభాస్థాన నృత్యమున గీతవాద్య నృత్యత్రయియైన తౌర్యత్రిక విన్యాసము విజృంభించి ఆనందతాండవ మొనరించినది. ఇద్దానికి నాందిగా ఆరాజబింబాననలు గావించినకైవారమే "వసంతసమయ వికస్వరపికస్వర

---

* "వీణాపుత్రి లసద్గుణంబులు ముదావిర్భావముం జేయఁగాఁ
ప్రాణంబున్నలె తొమ్మిడించక సుధాప్రాయానులాపంబులం
బాణింగూర్చుచు సారెసారెకు రుచుల్వాదింపఁ బల్కించున
వ్వాణీ దేవినటించు మద్విమల జిహ్వారంగ మధ్యంబునన్"
వై. వి I - 8. పుట. 4

** వై. వి. i - 2

మాధురీరమాధుర్య నిరాఘాట.... వాగ్వైఖరీ సుధాపానంబునఁదోరంబైన సభ నలరించినది. ఆ పిదప దేవదేవియు ఆమె అక్కయు నెఱపిన వాద్యానుగతి గాన విన్యాస వర్ణనమున కవిదైన గీతవాద్య ప్రతిభయే ప్రవ్యక్తము.

"నవరని వీణెఁగైకొని భుజంబుననొండొక కాయమున్నిజాం
కవసతి నొక్క కాయముఁదగం బొసంగించిన రెంటి సందునం
గువలయ పత్రనేత్రకుచ కుంభము వోల్చు ధృతోత్తరీయమై
గవిసెన తోడికాయ గమకంబునఁ దత్పదపృగోజ్జ్వలా కృతిన్"

ఆ యక్కచెల్లెండ్రు అట అధివసించి గావించిన వీణావాద్యానుగత సంగీతక రీతియందు కవివరుని సంగీత ప్రావీణ్యమే సంభావితమైనది. ఇంత

---

"శ్రవణ సంకుమదంబు నంధించి మునిద్రేల
మృదురీతిఁబైతీఁగె మెఱుఁగు సేయుఁ
శ్రుతులు విజ్జుండైనచోఁ దంతి బిగువుగాఁ
బీడించి గిటగిట బిరుడ ద్రిప్పు
గోట నూనంబుగాఁబాట లోపలఁదేల్చి
చిటిద్రేలఁ దాళిసంఘటన నడుపుఁ
బివగించు నప్పటప్పటికిని గద్దైపై
గెంటనంబైన క్రీగంటి చూపుఁ

బొసగనిడి హస్తములను నింపొలయఁ జిత్ర
భంగి వినిపించు గీతప్రబంధతతుల
చేతనా చేతనములు సంప్రీతిఁ గరఁగఁ
జంచలేక్షణ వీణె వాయించునపుడు" వై.వి. I - 1. పుట. 27 - 28.

"వీణాయుతలోచన స - ప్రాణాయవచిత్ర గాత్రపాంచాలికయై
వాణియ ఈ రూపోయన - వీణియ వాయించెనొగిఁ ప్రవీణత మెఱయన్"

నర్తన సన్నాహంబునఁ దదనుకూలంబైన మేళంబుతోఁ జమదెంచి నృపాలునింగాంచి నిజోచితస్థానంబున నిలచిన___

వఱకు వాద్యానుగత గానవిద్యావిన్యాసము సంపన్నమైన పిదప బృందగాన విన్యాసముతో నాట్యవిన్యాసహేవాకము మాపున ప్రారంభణమందినది. అందు ప్రదర్శితమైన వాద్యప్రతిభ, కవివరుని స్వీయబృంద విన్యాసప్రతిభను నికషోపలము.

తరువాత ఏతద్వాద్యానుగతముగ దేవదేవి గావించిన నృత్యప్రాశస్త్యమభివర్ణితము. ఇందు వివిధాభినయ రీతులు ఉదీరితము. ఇయమ గావించిన భుజంగినీ నృత్యపు సొరుసు కవి ప్రదర్శించుటలో అతని నృత్యశాస్త్రపాండితిప్రవ్యక్తము.

---

"అరుదుగ వాద్య విద్యబిరుదందిన వాయిద కారులత్తటిం
గరములు రెండు నొక్కసరిగా మురజంబులు మట్టిదెమ్మన
న్మొరయఁగఁ జేసి కాంస్యరవముల్చెలఁగన్నియ తావధానులై
సరి వినిపించి రుక్తగతి జంపె ధృవాద్యట ముఖ్యతాళముల్"

అంత,

"రంజిత పదమంజీరక – శింజితము చెలంగ రంగశిమ నిలచి పు
ష్పాంజలియు వసుమతీపతి – కంజలియు నొనర్చె సభికులభినుతిసేయన్"

"లోలసమీరు కిశోరక – లాలన విస్ఫూర్తి క్రియాచలాచల దీప
జ్వాలిక పోలిక నిలిచెన్ – బాలిక నృత్యాదిఁదత్ప్రభాగారమున్"

ఇట్లు నిలిచి,

మహాస్రగ్ధర :

"తపణింపన్ ముమ్మరంబై తపణీమణిహారున్ దాకి తాండవస్ఫూ
ర్తి విజృంభింపంగ రంగోర్విని బిరుదు పచారించి యద్భాటుకారున్
హాపుదప్పా పాత్రః రామారుహాహాజకిణి యంచుఁబెల్లెచ్చరింపన్
రవలి న్నర్తించెఁ గాంస్యారవమురజ ముఖారావ భావానువృత్తిన్"

"నాగస్వరంబు గానము భుజంగియుఁబోలె
గీతమంగమున సంగీకరించి
హస్త విన్యాస విభ్రమములు
నయమెప్ప వర్ణాభినయముఁజూపి

మొత్తముమీద పర్యాలోచించిన సారంగు తమ్మయార్యుడు తౌర్యత్రికరీతి యందభిజ్ఞుడనుట మాత్రము కల్పనకాదు.

---

వివిధవీక్షణ విలాస విచిత్రనటనలఁ
        బాటించి భావంబు తేటపఱిచి
చరణ నూపుర ఝుణంఝుణ నినాదంబులఁ
        దాళమానము దీపితంబు జేసి

లాస్యమొనరించె నక్కమలాస్యయపుడు
కోపునోపున ధొరలెల్ల దోఁషలొసఁగ
నాయకుఁడు మెచ్చి బిళిబాపురే యటంచుఁ
గట్నముల పైడి కొర బాగాయెనంప"

"సవ్య హస్తం బర్ధచంద్రాభినయముతో
        గానంటి కటితటిఁ గదియఁజేర్చి
కొనగోళ్ల నుదుటఁగ్రమ్మిన లేఁజెమట మీటి
        మాటికిదిఁ దిగిచిణో మీటికొనుచుఁ
జమ కట్టు విప్పఁ జుట్టును ఘనస్తన కాంతి
        చల్లించి యురముపై వెల్లివిరియఁ
గోష ఘూర్ణితమైన కొదన్ను న్నాగమువోలె
        నలఁత చిట్టూర్పి లందందనిగుట

నలస వళితంబులైన కటాక్షవీక్ష
[illegible]చలంబులయ్యు యువ ధైర్యకంచుకములు
ఛించి ఛీకాకుపఱిచి విసంచుఁజేసె
రామ నర్తన కేళివిభ్రామవేళ" వై. ఖి. పుట. 30. వ. 2.

# చదలవాడ మల్లయ గానాభిమానము

ఈ మల్లయకవి రచన విప్రనారాయణ చరిత్రము. ఇందీ కవి సరస్వతీ నమస్కృతి సందర్భముననే తగినట్లుగ సంగీతకప్రసక్తిని కల్పించుటలోనే ఈతని గానాభిమానము ప్రవ్యక్తమైనది.

"తాయిం బద్మభవాపదానముల పాటల్ తేటలుప్పొంగ జం
దోయిం గచ్ఛపిఁజేర్చి గోర్మొనల కాంతుల్ వింతలై వెన్నెలల్
గాయం దంతులు మీటి తాలు గరగంగా గానముంజేయు భా
షాయోషామణి తత్కృతీశ్వరునకున్ సంధించు వాగ్వైఖరుల్"*

ఇక శ్రీరంగపురమందలి నిసర్గప్రకృత్యభిరామ వర్ణనమునఁగూడ సమగ్ర సంగీతస్వరూపమే ఇట్లు భాసించినది.

"మృదంగంబులఁ బెల్లెగయు ధింధిమిధ్వానంబులకును, చంచరీక గానంబులకును, బహువిధావధానంబులఁ గమలహస్తాభినయనంబులతోడ నాడు పడ్మినీనికరంబులంగని భక్తియందు మునిగియున్న విప్రనారాయణుని రక్తి యందుఁదేలించుటకు దేవదేవి గానసహకారమునే ఇట్లు వినియోగించుకొనినదట.

"విద్దురరాదు విష్ణుగాథావద లీలలన్ గడిపెదనని కోకిలధ్వనియెంతయు వింతసేయగ నాలాపము"** సేయ నారంభించినదట. దేవదేవి చేసిన ఆలాపనమున మాటవరుసకనినను కోకిలధ్వనిరాగమే రాగముద్రాలంకారభాసితమై ధ్వనించుట ఇందొక సొగసైనది.

తన తల్లి విప్రనారాయణుడంపిన బంగరుగిన్నెగొందుకొనిన వెనుక ఆతనిని పిల్వనంగవ ఆతడు వచ్చునంతలోనే దేవదేవి వాసకసజ్జికయై "తాన మాన సంపన్న నవీన గానరసమాధురి వీనులవిందుసేయ తంబురమీటుచుండి వరికించుచు [illegible]నికులావతంసమును నిరీక్షించిన"దట.

---

* వి. నా. చ. i - 6

** ,, iii - 83

ఇక విప్రనారాయణునితో గడిపిన రాత్రి—

"ఇమ్ముల శంఖదుందుభి సమీహితమంజుల ఘోషముల్" ధ్వనించు చుండగ నేగినదట.

ఈ చదలవాడ మల్లయ సంగీతానుకూల్యతగల కథను చేపట్టికూడ శ్రోతగ సంగీతాభిమానమును ఎడనెడ ప్రదర్శించినాడేగాని పేతచ్ఛాస్త్ర ప్రవచనమును మిగిలిన కవులవలె జేయుటకు బూనుకొనలేదు. కావుననే కవికి సంగీతకళయందు అభిమానమేగాని అభిజ్ఞత లేదనిపించెడిని.

## అయ్యలరాజు నారాయణామాత్యుని తౌర్యత్రిక ప్రీతి

ఈకవి రచించిన గ్రంథము హంసవింశతి. ఈ గ్రంథమందలి మొదటి సంగీతప్రసక్తి వివిధ వాద్యనామములనేకరువు పెట్టిన రీతిలోనిట్లున్నది. ఇందలి వాద్యనామములేకానివాని ఆకారవికారముల సౌకరములుకూడ కొన్నింటికి లేవు.

* "డమరువు, రభీష్ట, మరుసహచర, భయదఢక్కా, హుండుక్కా.... కలహపటహ, తమ్మట, మురజ, నిస్సాణ, ఝల్లరీ, మర్దళ.... తుత్తుంభక, జర్ఝరీపాళ. క్రోశక్రోలు, మోరీభేరులును, డోలు, గేరుగుమ్మె, తమ్మెట, వీరణ, యురమ, పంచి, జుముడిక, తప్పెట, గిడివడి, తుడుముచుక్క, చుయ్యంకియును యాళమహత్తాళంబులును, జేగంట, చిటితాళములు, చిటికెలు, ముఖవీణ, కుంభకాంస్య, శృంగకాహళంబులును, సన్నగాలె, సఫీరు, కరకొమ్ము, నాగకేసరమును, సుతి, చెంగు, చేసన్నాయి, సింగినాదము, పిల్లన గ్రోవి, మోయిబీకలును, వీణె, మనోహరవీణ,నారదవీణ, బాణవీణ, సరస్వతి వీణె, స్వరమండలంబు తంబుర రావణహస్తంబు, రవాలు, కిన్నెర, తిపిరి కెన్నెర, శుద్ధకిన్నర దండె మున్నగు హృద్యానవద్య వాద్యవిశేషంబులు దిక్కులు పిక్కటిల్ల మొరసిన" వని నాడు కవి.

** ఆ పిదప రతిసేన కథలో ఆమె సంగీతవైదుష్యమును కవి యిట్లు ప్రశంసించినాడు. ఆమె ధావడంబును శుద్ధపద్ధతి బహురూపలక్షణంబులు, దండలాస్యములును, జక్కిణిపద్ధతి, పేరణిపద్ధతి, కుండలీవృత్తంబు, ఖాండికమురాసకాఖ్యము, నాట్యరాననంబు, చిత్రపద్ధతియును, దేశపద్ధతియును, చర్చరీ, కందుక, బానరి, కోలాటమునాదిగ తగుజేళ్లగలుగునట్టి నృత్తంబుల చొలవలెఱిగి సరవిచంచుపుటంబును, చాచపుటంబును, ధ్రువము, మధ్యమము, రూపక, త్రిపుట, ఝంపె, ఏకతాళ, అటతాళాదులెల్లనెఱిగి.... భైరవి, మాళవ, బంగాళ, హిందోళ, రాగమంజరియు, శ్రీరాగ, గౌళ, భూపాళములను ఎన్మిది పురుషరాగంబులు, దేశాక్షి, ఘూర్జరి, తోడి, దేవక్రియ, ఆందోళి, దేవ

---

* హం. వి. 29

** ,, ii - 122 - 126

గాంధారియు, గౌళగుండక్రియ, ఆహిరి, లలిత, బిలాహరి, కురంజి, ధన్యాసి, పూర్వగౌళ, వరాళినాట, భల్లాతకి, మలహరులును, సారంగనామక్రియలనునంగ గన్నడమనంగ, మంగళకైశికి యనవెలయు నారాయణియన చతుర్వింశతి విధముల తనరారు స్త్రీరాగములును మఱియు కాంభోజి, కేదారగౌళ, శోకవరాళి, పున్నాగ, గుమ్మ కాంభోజి, కేదారగౌళ, శంకరాభరణము, మేఘరంజితోడి, వరాళి, నాదనామక్రియ, నాట, రీతిగౌళ, రామక్రియ, మేళరామక్రియ, గౌళ, నారాయణగౌళ, మధ్యమావతియు, ముఖారి, మలహరి, దేశాక్షి, శ్రీవరాళి, మాళవియుఁబాడి సింధురామక్రియము వసంతసామంత శుద్ధవసంత, గుజ్జరియు, హిజ్జిజ్జి, నీలాంబరియు ననంగబొసగు ముప్పదిరెండు నపుంసకములు మాళవ శ్రీయనంగను మలహరియన దేవమలహరి రేగుప్తిదిరము కుంద మల, హరవనైదు మిశ్రములు మర్మమరసి షడ్జగాంధార మధ్య, మర్షభనిషాద, పంచమ, ధైవతాఖ్య సప్తస్వరములు మంద్రమధ్యమతారక మహిమ లెఱిగియాడఁబాడఁగ నేర్చు నయ్యబల నెఱింగి".

"స్వరమండలంబులు కిన్నెరలు, రుబాబులు, దండవీణలు, రుబాయి, తల్వర, రావణహస్తంబులు, మఱితంత్రులు, తంబురలు సమస్తముగావియెన్ అని వివిధములైన నృత్యరీతులు రాగనామములు సంగీతశాస్త్ర వ్యపదేశిత రీతిలో ప్రస్తావించిన ఈ అయ్యలరాజు నారాయణామాత్యుడు సంగీతవేదికయని విదిత మగుచున్నది.

—o—

# కవన గానాభినయ సార్వభౌమ యుగము
# రఘునాథ నిర్మిత తౌర్యత్రిక వేణి

"విధి విధానమున విద్యానగరేంది రానుగతయై వలస వచ్చిన
తెలుగు శారద నాదరించి తంజపుర నృత్యమంది రస్థనౌనర్చి
క్రమతౌర్యత్రికారాధనమున దేర్చి కవన సుమన సమస్రజంబుల
జస్రంబు సమర్పించి అర్పించిన రఘునాథయుగవాణి! నీకునాజోత"

# రఘునాథనాయక యుగాంతర్గతులగు మహాకవుల సంగీత ప్రతిపత్తి

1. రఘునాథనాయక గీతిసాహితీ సుధామాధురి.
2. చేమకూరి వేంకటకవి గానపరీపాకము
3. రంగాజమ్మ ఉషానురాగరమ్యత.
4. చెంగాల్వకాళకవి గానకళాభిమానము.
5. పుష్పగిరి తిమ్మనార్యుని గానసమీరము.
6. గణపవరపు వేంకటకవివరుని వేంకటేశ్వర విలాసగానము.
7. ముద్దుపళని సంగీతకపు ముచ్చట.
8. కాళింది కన్యాపరిణయ గానము.
9. రాఘునాథ తొండమానుని సంగీతలక్ష్యలక్షణ పరిజ్ఞానము

# రఘునాథ నాయకి గీతిసాహితీ సుధామాధురి

విజయనగర సామ్రాజ్యపతనానంతరము సాహితీవిహాయస పథమున చీకటులలముకొన్నది. కవివర గాయకులు గూడులేని పక్షులవలె ఎవరినెవరినో ఆశ్రయించి జీవనము సాగించిరి అట్టియెడల కవితావనితకూడ నిరాశ్రయయై అరవగడ్డ నడిబొడ్డుననున్న తంజపురమునకు రఘునాథ నాయక కవిరాజ కరావలంబనమునొంది వలసపోయినది. కవితతోపాటు గీతియు అవినాభావ సంబంధముతో నలదుసుగాన ఆమెనే అనుగమించినది.

అట్టియెడ సాహిత్యాంబరమున నలముకొన్న గాఢాంధకారమును తొల గించి సంగీతసుధాకరుడై సాహిత్యాంబరమున తరపి వెన్నెలలు ఒలికించిన రఘు నాథనృపశేఖరుడు కవిరాజై కవిపములకు, గాయకశేఖరులకు బాసటయైనిలచినాడు. ఈరాజకవిరచనలుగ "రఘునాథ రామాయణము, వాల్మీకిచరిత్ర, శృంగారసావిత్రి" అను మూడు కావ్యగ్రంథములు మాత్రమే లభ్యములు.

అపార సంగీతపాండితి ఈ కవివరుని కవనమున సహజరీతిలో పర్యవ సించినది. తెలుగు కవితలో రాగసంప్రదాయ నిక్షేపణము నన్నయ తిక్క నార్యుల కవనపద్ధతియందుగూడ పొడగొంది. శ్రీగౌరీ రాగాదిస్మరణముగ పట్టంకితమగుట తదనంతరార్వాచీన కవులనుసరించుట రఘునాథరాయాదులకు కూడ పరిపాటియైనది. కావుననే దక్షిణాంధ్రకవి మండలికి నాయకమణియైన ఈ రఘునాథభూపుడు ఆ సంప్రదాయమునుకూడ చిట ప్రస్తావించినాడు. అందు వలననే ఈతని రామాయణకావ్య మంగళాచరణమున శ్రీలలితాకల్యాణిరాగ త్రయము సంశోభించినది.*

---

* "శ్రీ సీతా లలితాంగి యంకమున రంజిల్లంగ సంగాంగలీ
లాసంగంబునఁ జెంగలించుమను గల్పద్రుమస్ఫురచ్ఛాయమ
ద్యాపి ప్రోన్నతరత్న పీఠమున మోదంబొప్పఁగా మంత్రులా
కౌసల్యా సుతుఁడిచ్చు మాకు నెప్పుడుం గల్యాణ సాకల్యమున్"
ర. రా. i - 1

శ్రీరాగము శుభప్రదమగు పురుషరాగము. లలితము సురుచిర మనోజ్ఞ స్వరూపిణియగు రాగిణి. కావుననే శ్రీలలితరాగముల రెంటినిగూర్చి నాయికా నాయక భావమును సంగీతకళారహస్యవిధియగు రామరాజభూషణుడు వసుచరిత్రాదిలో సంఘటించినాడు. రాగవిదుడై సంగీతసుధయను శాస్త్రగ్రంథ రచనమున ఒప్పారిన ఈ గాయక కవి ఆరెండు రాగములకు కల్యాణమునుగూడ జోడించినాడు. ఈ రాజకవికి అనుయాయియై ఆరాధకుడై చెలగిన చేమకూర కవివరుడుకూడ శ్రీరాగ స్వరూప స్వభావావిష్కృతిని శ్రీరామచంద్ర ప్రార్థనమున ప్రతిపాదించినాడు.

తన కవనము గానరీతినేగాక నాట్యశోభనుగూడ సంతరించుకొనవలెనను నాకాంక్షను కవిప్రవ్యక్తము చేసిన తీరులోనె అద్దాని పచేళిమత్వమునుగూడ ప్రవ్యక్తముగావించుట ప్రశంసార్హము.

సాహితీ ప్రపంచమున పార్వతీపరమేశ్వరులు మాతాపితరులుగ సంభావితులైనట్లే సంగీతజగతిలో వాణీబ్రహ్మలు శ్రుతిలయలకు ప్రతీకలుగ తల్లిదండ్రులై విలసినారు. "శ్రుతిర్మాతా లయః పితా" అను నాభాణకము ఇద్దానికి మూదల. శ్రుతిసుఖ ప్రతిపాదకమగు వీణాలాపమును వాణిచేపట్టగా లయాత్మకతా సర్వస్వమగు మృదంగ ధ్వానమును బ్రహ్మ మొరయించుననియు కవితయందచందమై అందగించిన లయవిన్యాసమే బ్రహ్మస్వరూపమగుటయు జగత్ప్రసిద్ధము. ఆదియందు అన్యోన్యాశ్రయమై సొబగొంది అనంతరము అవినాభావము వాచికొని ఆ పిమ్మట అద్వితీయమై భిన్నత్వమునధిగమించి ఏకత్వమునమించిన ఉత్తమోత్తమ ధర్మమునుద్ఘోషించునది దాంపత్య జీవనము. అట్టి దాంపత్య ధర్మమున కృతార్థతనొందిన దంపతులు వారువీరుగా అరితేరుట సాహజమ్ము, అభిలషణీయము కూడ. కావుననే ఆ బంగారుకలను పండించి రఘునాధభూపుడు

---

"పదమంజీర ఝుళంఝుళార్భటి జటాబంధామృతాంధస్తటి
న్యుదయద్భంగ ఘుమంఘుమస్వనము త్యదూద్యన్మృదంగ ధ్వనిం
బొదలింపంగ నటించునాఁటి నటుఁడింపుల్మీఱ నాడించుఁగా
తదయన్మద్రసనాగ్ర రంగమున వాగ్ధాటీ నటిన్మాటికిన్" ర. రా. i - 4

అయ్యాదిమదంపతుల దాంపత్య ధర్మమును వీణానులాపనావ్యాజమున ఈ రెండు పద్యములందిమిడ్చినాడు.*

ఇందు వీణాంచితసామగానమందలి యోరలను వాణికి బదులుగ బ్రహ్మ దిద్దుట దివ్యమునులతో శాస్త్రార్థచర్చను గావించి యొద్దికలనుసర్ది విరించి స్థానమును శారద యధిష్ఠించుట దాంపత్య భావమునందలి తాదాత్మ్యమునకు ఉపస్కారకముగనుండుట గమనార్హము.

---

* వదనాంభోజ విహారి వాగ్వరత తనూ ద్యావల్లదంఘ్రి ద్వయాం
గదనాదంబుల భంగి వేదములు వక్కాణించుచుంబ్రేమ నా
రదవీణాంచిక సామగానముల యోరల్దిద్దు పెన్వేల్పుభా
రిదయన్మాకుఁ జిరాయురభ్యుదదయ సుశ్రీ సంభ్రమంబీవుతన్"
ర. రా. i - 6

"చదివిన యాకులంజిలుక చక్కగ ముక్కునడిగ్గఁ ద్రోయఁగాఁ
బొదలు సువర్ణ శోభఁదగు పుస్తకముంగమనీయశయ్యఁ చేఁ
జదువుచు దివ్యమౌనులకు శాస్త్రములన్నియు నర్థసంపదం
బదరక తెల్పు భారతి యభంగుర వాఙ్మయభంగులీవుతన్" ర.రా. i-7.

"వారు సత్వరంబుగ మదన తంత్ర సిద్ధాంతమణి పేటియగు దళవాటికింజని యచ్చోట హాటకమయంబులగు శ్రీమ కూటంబులు మణిఘటిత తులాకోటి రణితంబులగు
మృదంగ ధింధిమధ్వానంబులతో సంబంధింపఁబసిఁడియంచు కాసెలు ప్రకాశింప మేళకం
బులుగూడ వివిధ తాళంబుల మత్తనృత్తంబులు సలుపువారును మణికంకణ క్వణంబులు
రాణింప వీణలు పలికించువారును దిపిరిదండియలు గైకొని గాణదండి మెఱయ మంద్రమధ్యమ తారస్వరంబులు సుధారసంబులాగురియ గానంబులు పేయువారున్"
ర. రా. ii - 105

ఇక తదనంతర పురవర్ణనమునందలి నాటకశాలలనభివర్ణించునప్పుడు అచ్చ "నగర "నగరవధూటి కోటి తులాకోటి ధ్వనిమాటికి గుబ్బతిల మబ్బులతోన బర్వె" నని అద్దాని సార్థక్యమును ఋష్యశృంగ చరిత్రమున వర్ణించినాడు. తన నాటి వారాంగనా సముదాయ తౌర్యత్రిక పాండితినే అలనాటి రీతిగా మలచినాడు. వారలు ఋష్యశృంగుని కొనితేరనరుగు నపుడుకూడ

"బంగరు పల్లకులెక్కి మృ
దంగ హుడుక్కాదికంబులగు వాద్యంబుల్
ముంగల మొరయఁగ నభినవ
శృంగారము మెఱయఁజనిరి చెలువలు వేడ్కన్" బయలు వెడలిరనినాడు. ఇట పల్యంకికాది రాజలాంఛనములను బిరుదు వాద్యములను

"గాంధర్వ సర్వ స్వకళఁగళంకము లేక
జాణలౌ జగజెట్టిగాణలుకును
దత్తిల భరత మతంగాది మతముల
వఱలెడి నాట్యతత్త్వజ్ఞలకును" ప్రౌఢిమించిన కవిరాజులకును ఈయవచ్చునను సాంఘిక మర్యాదను జనవాక్యముగ వెలార్చినాడు.

ఋష్యశృంగుని గవిన పిదపవారలు ఆతనిని తమ గానంబు చేతఁజొక్కగ జేసి యిట్టటుఁజనకుండ చేసెదమని పంతంబులాడిరనియు అనినాడు. ఈ రామాయణకావ్యము అసమగ్రముగాన కొంతవట్టు మాత్రమే సంగీతకరీతి ప్రస్తావితమై ఉపలభ్యమైనది.

వాల్మీకి చరితమునందుగూడ మంగళాశాసనము శ్రీరాగ రాగాంచితమై భాసిల్లుచున్నది.* తరువాత విరించి స్తుతికూడ వాద్యాంచిత రాగప్రపంచనమున

* ** ర. రా. ii - 122 - 125

* "శ్రీవైదేహి యురోజ పూర్ణకలశ శృంగం బులిం బల్లవ
శ్రీ విన్యాసముచూపు హస్తములచేఁ బ్రేమ మంత్రకాళంబుగా
శ్రీవిద్యుల్ పతకోటికిచ్చు నలరాజీవాక్షుఁడిక్ష్వాకు వంశా
శా విర్భూత మహార్ఘరత్నము మదీయాభీష్టముల్ సేయుతన్"

వా. చ. i - 1

కనువైయొప్పుచున్నది * కథాక్రమమున వర్ణితుడైన తత్త్వబోధ విశారదుడగు నారదుడు "నారాయణుని దివ్యనామావళును పల్కు మహతిఁదామూఁపునరహి వహింప వేఁపువహించుననని వర్ణితుడైనాడు.

** పిదప కథానుగతముగ వాల్మీకి చరిత్రమును వర్ణించునపుడు ఆతడు విరక్తుడై పిదప తపశ్శాలియై యున్నపుడు ఆతని మరల్ప ఆలుబిడ్డలు కులము వారు యత్నించిన తీరుతో సంగీతకము చోటు చేసికొనినది.

తృతీయాశ్వాసమున రఘునాథుడు తన సంగీతాభిమానమును, నృత్త పాండితినిగూడ చాటినాడు. దానికనువుగ రంభోర్వశుల విద్యాస్పర్థను ఇట కల్పించినాడు.

*** "రంభసచ్చునత నాట్య సంరంభమగుచు
ఝళ ఝళం ఝూళనాదహాళ హాళితంబైన
బిరుదు వజ్రపుజల్లి పెండె మమర
సమరవల్లభు కొలువున కరుగుదెంచి" న దనినాడు.

---

**. "పంచినరీల రాగము ప్రపంచితమై చెలఁగన్ విపంచివా
యించి తనున్నగించి యెలయించిన ప్రేయసి వల్లదించి మో
దించి ప్రవీణవౌదని నుతించి కవులగిట నుంచి ప్రేమయూ
రించి వరించి మించిన విరించి మముం గరుణించిప్రోవుతన్"
వా. చ. i - 7

* "టోయ మిటారి గుబ్బెతలు పున్నమ వెన్నెలబైట నీవయిం
బాయని బాళి కిన్నరలు మాటికి మీటుచు నీప్రతాపమున్
హాయని చొక్కిపాడ వినవా కనవా మనవారిఁబాపి నీ
వీయెడ నొంటినుండఁదగవే చనుదెమ్ము వీటికిన్"
వా. చ. ii - 4. పు. 72

** వా. చ. iii - పుట 82. ప. 3

* "శృంగార ఫణి శణాభంగిఁ దయేతుచట్లఁ
గమ్ము మీఱెడు సామగొప్పు దనర....
నెమ్మేని జిగి దొలంక నృత్తదేశంబు మిగుల న ర్తింపవచ్చె" అ

ఊర్వశిని వర్ణించుటలో కవివరుడు ఊర్వశిరూపులో, చేతలోగూడ గీతవాద్య నృత్యత్రయియైన సంగీతపరిజ్ఞానమును ప్రదర్శించినాడు.

ఆ పిదప కవివరుడు ఊర్వశి మాటలో వ్యక్తీకరించిన స్వీయనాట్య ప్రతిభకు ఈపద్యము మూదల—

"శివుఁడొక్కనాడు దేశికిమెచ్చి నాకిచ్చెఁ
బెద్ద వజ్రపుఁగచ్చు బిరుదు వీణె
నాతంత్రి హరి యభినయము వేళనిచ్చె
హరినీలముల కడియాల జోడు
చతురాననుడు సరస్వతియు గానము మెచ్చి
యొసఁగి రంచలయంచుఁబసిఁడి కాసె
విత్తాధిపతి తాళవిజ్ఞాన మరసి ప్రే
మఁజెలంగి యుభయ చామరములిచ్చె

నెన్నియేనియుఁగలవని యెన్ని చూడఁ
బెట్టఁబెట్టెఁడు బిరుదులు గట్టి పెట్టి
యున్నయవి వానినే చూడ నొక్కనాఁడు
బిరుదులేటికి విద్యయే బిరుదుగాదె"*

రంభ ఊర్వశితో వన్నిదము సరచినట్లు వినిపింపుమని కోరినదట. అందులో రఘునాథుని యపారసంగీతపాండితి తాళాధ్యాయముగ వెల్లివిరిసినది.

**ఆది తాళము ద్వితీయకమంతర క్రీడ
జయమంగళమ్మను జంపెలీల

---

* వా. చ. iii - 88 పుట వ. 2

** వా. చ. iii - పు 88

చాచపుటంబు చచ్చత్పుటంబును షట్పి
తాపుత్రకంబు విద్యాధరంబు
రతిహంసలీల శ్రీరంగంబు రంగంబు
కంకాళఖండ కాకాధములును
కోకిల ప్రియము విలోకింతంబు కుడుక్క
డెంకి త్రిభంగి మట్టిగ విజయము

నందినందన జయసింహ నందనములు
మొదలుగాఁగల తాళముల్ మొనసినున్న
గూడి కవచట్టముగఁ గొనియాడి తేవి
బిరుదులిచియిత్తు నీకునే బిరుదంచు"*

"పేరణి దండలాస్యమును బెక్కణి కుండలి నాఁజతుర్విధో
దారములైన నాట్యముల యందము నెల్లనెఱింగి యందునే
పాయచునంద ముందు విధులాఱునవై తగు నంగహారముల్
రా రసభావ దృష్టులలరన్ నటియించదె మాటలేటికిన్"**

"సంయుతా సంయుత సంజీవ హస్తముల్
పదమూఁడు నొక యిరువదియునాల్గు
త్రింశద్గణంబున నృత్తహస్తంబులు
నైదువక్షంబులు నైదుఘటలు
స్కంధంబులాఱును గంధరల్తొమ్మిది
జానువులేడు పార్శ్వంబులేఁడు
మొత్త మంగంబులేకోన వింశతిదళ
బహుల్త్రికుక్షులఁ బదములాఱు

---

* వా. చ.

** వా. చ. iii - 92

స్థాయి దృష్టులెనిమిది సంచారిభావ
దృష్టులిరువది రసదృష్టులెనిమిదియును
బొంకముగఁ జూపి వింతకోపులు పెలంగ
నాడఁగలిగినఁ గలహించఁ బాడినీకు"*

రంభోర్వశులిరువురు వాల్మీకి తపము చెరుప యత్నించుటలోకూడ నాట్య సంగీతపరిజ్ఞానము ప్రస్ఫుటమైనది.

"వీణియలు, దండియలును దాళముల్వేణు వాద్యములు, నార జంబులు, ముఖవీణ, తానకములు, స్వరమండలములు, మద్దెలలు, మున్నుగా సాపామంచు తరుణీమణి యొకర్తు తంబూరా మొరయించుచు వచ్చె" నట**

"వెలదియొక్కతె ముఖవీణయూన
సరసిజాక్షి యొకర్తు స్వరమండలము....
బోఁటి యొక్కతె దండ మీటి పాడ
విమలాంగి యొకర్తు వీణియ పలికింపఁ
గలికి యొక్కతె యుపాంగమ్ము పూనఁ
గి సలయాధర యోర్తు కిన్నర మీటంగ
లోలలోచనయోర్తు తాళమెత్త
మఱియుఁగొందరు సుదతులు మద్దెలయును
నాదజము మొదలైన వాద్యములుపట్టి
శ్రుతులు ఘుమ్మని హవణించెనతివ దేశి
నృత్తవైఖరి చూపె మునీంద్రునెదుట
ఇటుల మిగుల నేర్పు ఘటిల్లఁజూపి
నృత్తగీత వాద్య నిపుణమార్గ
పటిమ చెవిటిముందఱ శంఖమూదిన యట్లు
ఫలములేక పోవ విదవరంభోర్వశుల్***

* వా. చ. iii - 93
** వా. చ.
*** వా. చ.

ఇట ఊర్వశి సంగీతవిద్యతో తన వాద్యపరిజ్ఞానమును కవి వెల్లివిరియింప జేసినాడు.

తళుకు నీలపు దట్టములు వోలె నీడలు
గానంగఁదగు గుబ్బకాయలమర
రతనాల పూసల రాజిల్లెడు సితాజి
పగడంపు మెట్టుల జిగి దొలంకఁ
బ్రచురరాగ లతాంకురములఁ బ్రాకినలీల
మెఱుఁగారు తంత్రుల మీటు చూప
ఘుమ ఘుమధ్వని నించు క్రొల్విన యవరంజి
కళుకుల యస్తువుల మోళుకుదనర

జీవ రత్నంపు మేరువు చిఱ పెంపు
చిరమలను గరుడ పచ్చల కరివెజీని
వ్రాత హంబట్టు గవిపెన రాణదనరు
వీణ నొనయించి........"*

"గవిపెన సడలించి కరపంక జద్యుతి
గడులువోఁజీని పావడలు దుడిచి
చిలతం.... మెఱుఁగు గుచ్చుల మీఁడిఁదళ్ళు ఘ
మ్మన నఖంబులు శ్రుతిలంటి మీటి
జవ్వాదిఁబదవిచ్చ పారణుల్పూరించి
సరసతఁబిరడలు చక్కనొత్తి
మంద్రమధ్యమ తారమహిమ మీఱంగఁద్రి
స్థానంబులను ముట్టి తాళగతుల

* వా. చ.

సతుల కంకణ ఝుణఝుణత....తులు వెలగ
మాయురే యనరాగము లాతాయములను
గీతములు ప్రబంధములు రక్తిఁగనుపించ
వీణె మీటెను నా నీలవేణియపుడు"*

"ఔరా! రాగము బాపురే యొదుగు తాయంబుల్ బళీస్థాయి సం
చారీ ప్రాపులు లెస్స కంపితముమై చా....హా మేలమ్మయ
య్యారె మీటు కొలంబు పాడఁదగు నాహా రక్తియంచున్ సభా
స్తారుర్లేరిట మెచ్చ నీజడుఁడు మెచ్చన్ నేర్చునే గానమున్"**

ఇట్టి గీతవాద్య నాట్యవిశేషకప్రజ్ఞను చూపించుటవలన రఘునాధుఁడు సమ్యక్ తౌర్యత్రిక పాండితీవిశేషస్వాంతుడని వెల్లడియగుచున్నది. వీణావాదన మందీ కవి ఆరితేరినవాడని రఘునాథమేళ వీణాప్రకల్పనమున వ్యక్తమగుట జగత్ప్రసిద్ధము.

ఇక మిగిలినది శృంగారసావిత్రి. ఇందు రఘునాధుని గానపాండితి కావ్యాంతరిత పాత్రలవలన వ్యక్తము. కవి కావలెనని నృత్య సంగీతపాండితీ సహకృతరీతిని వెలయుంపవలెనని మేనకానారదాది పాత్రములనిందు ప్రవేశ పెట్టినాడు.

మేనక విశ్వామిత్రునితో తననుగూర్చి చెప్పికొనిన మాటలివి.

సలువ దానెక్కి నందలమంపి పిలిపించి
వీణియ నాచేత విన్నమాట
హరుఁడు నేవినిపించు దురు వదానకు మెచ్చి
తొడమీద కూర్చుండ నునినమాట

* వా. చ. iii - పుట. 117

** ,, iii - 118 పుట

హరిపిల్చి నాచేత నభినయంబును జూచి
తనయొద్ద కొలువుండుమనిన మాట
నారద పార్వతుల్ కోరితన్ లయకోస
మై తార తమ్యములడుగుమాట
మున్ను విని యుందురేకదా ననునేను
పొగడుకోరాదు.... అమరనాథుడు జూచు పాత్రములకెల్ల గుండెలో గాల మనిపించుకొంటి నేను. తంబురలో తుంబురుడే అట నేతెంచి గోటివాద్యమే లేకయుండి మఱియున్ మఱియున్ వినిపించి వింతగా (గోటివాద్య మేనేమో!)*

"ఘనమును రక్తియుందొలఁకఁగాఁదగు గీతముల్రచించి ఛందముల్ మునుపుగ రాగముల్ పదములుంచియు మీటుచు జంత్రగాత్ర" సమ్మిళితముగా గానము చేసినాడట. ఆతనిని మనమున మెచ్చినను మేనకపైకి తలయూచనేలేదట. దానితో నీవెంతని నీవెంతని దేవేంద్రుని సమ్ముఖములో మేనకకు తుంబురునకు గానవాగ్వివాదము తీరనిపోరై పరిణమించినదట. దానితో తుంబురుడేతగ్గి మేనక యింటికివచ్చి నన్నునీవంటి రసజ్ఞురాలివి దివంబునగాననికేల నన్నునీబంటుగ నేలుకొమ్మని రాజీపడి గాయకుడవుటను అన్నింటను గాయకుడై ఆ అప్సరసను కళలతో కరిగించినాడట.

* శృంగారసావిత్రిలో సావిత్రికడకుతె నారదుంచినపుడు ఆదేతనిచేతిలో వీణను సావిత్రియంతకుముందు పర్వతుని దగ్గర చూచినట్లు అందలి వలుకుమెచ్చి నట్లు గుర్తుపట్టినదట. ఎవ్వరి వీణాప్రత్యేకత వారికుండుట ఆనాటి ఒక వైచిత్రి. అప్పుడు నారదుడు ఎదురు వీణెలుపూని వాయించునపుడు మావీణెలు మూప పడినవనినాడట.

నారదుడు కల్పించికొని సత్యవంతుని పరిచయము చేయవలయును గావున "సత్యవంతుడల వీణను బ్రహ్మయటంచు నెంతయు అంతకుమించి నేర్చితివి సరస్వతిదేయని మెచ్చుకొని తన చేతివీణె యొసంగి వాయింపుమ"న్నాడట.

---

* శృం. సా. పుట. 15 - 19

** శృం. సా. పుట. 60

సావిత్రి వీణావాదనలోని పటిమను శ్రుతిచేయుట మొదల్గొని వర్ణించినాడు కవి. కాని యిందు సారెలు మెట్లుసరిచేయుట చూపలేదు. అందులోనే రఘునాథ మేళ వీణవలె కన్పట్టినది. ఇందు వరూధిన్యాదుల వీణారీతి కానరాక ఒకేపరి 24 మెట్ల రఘునాథ మేళవీణ అమరిక యిందు గోచరించుట గమనార్హము.

సావిత్రి ఎత్తికోలులోనే వీణను,

"తఖికేలంగొని మున్ను నుద్గ్రహము మీఁదన్ స్థాయిసంచారముల్
క్రమ మొల్వన్ ఘ్నురి తంబు కంపితముడాల్ గ్రామంబులున్ మూర్ఛలం
దముగా నౌడవ షాడవంబులు తగన్ రాగాది గీతప్రబం
ధములిం బొందంగ గాత్రమింపొదుగనంతన్ వీణవాయించినన్"

"మేలు లతాంగి, ఛాలనిను మెచ్చగవచ్చును నత్యవంతుఁడే
మేళముగూర్చి షర్వతుని షేలిమి చూడఁగ జూవంబంపెమున్
వేళలెఱింగి తీవవ్రుర నీమది వాని మనంబునొక్క పైన
ఖోలిక అతవికిఁదెల్పవలెనని అనినాడట

"గీతము షూత్రము మేమత్తలికిన్ మడినేర్పుట. ఈ కవిత్వమాతనిచే గ్రహించితిమి. అందునగాదె ప్రబంధముల్పైతము చేయగోరితిమి ఛాయకళోక న్వతంత్రకీర్తికిదన్" అని సత్యవంతుని సాహితీచణత్వమును, గీతవిన్నాణమును గూడ మెచ్చుకొనినాడు. ఇక్కడ ప్రబంధమునకు గీతప్రబంధమని, ఛాయకు రాగచ్ఛాయయనుటకు అర్థము చెప్పుకొనవచ్చును.

సరస్వతికి బ్రహ్మకు వీణావాదనమున వాదుగలికి నారదుని పిలిపించిరట. అది రఘునాథనాయకుని కథాగతిలో చోటుచేసికొనినది.

ఇట్టిది రఘునాథనాయకుని గీతిసాహితీ సుధామాధురిగ విలసిల్లినది.

# చేమకూరి వేంకటకవి గానపరిపాకము

రఘునాథ రాయని ఆస్థానకవియై అలరిన చేమకూర వేంకటకవి "సారంగధర చరిత్ర, విజయవిలాసము" అను గ్రంథములను రచించెను. ప్రథమకావ్యమైన సారంగధర చరిత్రమున చేమకూర గానాభిమానమును చూప లేదు. చేమకూరకు మహాకవియశస్సును ఆర్జించిపెట్టినది విజయవిలాసము. అందులో ఈతని సకలకళావిలాసములతోపాటు సంగీతకమ కూడ చోటు చేసికొన్నది.

ఈ మహాకవి రఘునాథనాయకుని ఆశ్రయదాతగాకాక ఆరాధ్యదైవముగ భావించి సేవించి తరించినాడు. కావుననే మంగళా శాసనముగావించిన తొలి పద్యమున రామమూర్తిని ధ్యానించి రఘునాథమూర్తికి ఆవాహనము గావించి శ్రీరాగధ్యానమూర్తిగ నాతనినే ప్రదర్శించినాడు.

వసుచరిత్రకారుడు ఈ వేంకటకవికి కవనరీతియందు గురుతుల్యుడు. ఆతనివలెనె ఈకవియును గ్రంథాదిలో శ్రీరామచంద్రునిలో శ్రీరాగ స్వరూప స్వభావావిష్కృతిని గావించినాడు. శ్రీరాగము కావ్యప్రపంచమున నాటరాగము నాట్యాకారంగమున ప్రప్రథమమున వినదించు సర్వత నాచికొనినవవి ఇతః పూర్వము వివృతము ఏతద్రీత్యనుసారిగ మన ప్రాచీనాంధ్ర కవులందఱును శ్రీకారముచుట్టియే కావ్యప్రారంభణము గావించినారు. వారట కావ్యాదిలోవిలిపిన శ్రీకారమునుబట్టి పౌరాణికులు, కావ్యరసికులు శ్రీరాగాన్వితముగ శ్రవ్యకావ్య పఠనమును ప్రారంభించుట అలవాటు చేసికొనినారు. రాగవిదులైన కొందఱు కవులు శ్రీకారముచుట్టి శ్రీరాగముద్ర నిట నిక్షేపించుటతోపాటు శ్రీరాగభావా విష్కృతిని ఆడి ఘనరాగము, శుభప్రదము, సంపదుద్ధామముఅను లక్షణములను బట్టి యిచ్చు పదముల పద్యాంతరితముగ నుట్టంకించిరి. ఇక సంగీతశాస్త్రపు లోతులు తడివిన మహామహులగువారు మాత్రమే పద్యమందలి ఉపాస్యమూర్తికి అభేదాధ్యవసాయమును సాధించిరి. ఇట్టి రీతిలో శ్రీరామమూర్తికి శ్రీరాగధ్యాన మూర్తికి అభేదాధ్యవసాయమును మొట్టమొదటిగ మహాసంగీత కళారహస్య వేదియైన రామరాజభూషణు గావించినాడు. ఆతనికి అన్నిట అనుయాయియు, అంతేవాసియునైన చేమకూర కవికూడ ఇట అట్టిరీతినే ప్రదర్శించినాడు.

ఈ పద్యమున చేమకూర వేంకటకవికి ఉపాస్యమూర్తిగ రఘునాథ నాయకునకు ఆరాధ్యమూర్తిగ నిలచిన రఘురాముడు సీతాలక్ష్మణ సహితుడై విల్లూని నిలచియున్నాడు గాన ఈతడు—

"అష్టాదశాబ్దః స్మరచారుమూర్తిః ధీరోల్లసత్పల్లవ కర్ణపూరః
షడ్జాదిసేవ్యోఽరుణవస్త్రధారీ శ్రీరాగరాజః క్షితిపాలమూర్తిః"

అను చతుర దామోదరకృత సంగీతదర్పణాంతరిత శ్రీరాగధ్యానమూర్తికి దర్పణ ప్రతిబింబమగుచున్నాడు. అట శ్రీరామచంద్రుడు సీతాలక్ష్మణ సేవ్యుడైన ఇట శ్రీరాగమూర్తి షడ్జాది సేవ్యుడగుచు రాగరాజై రామభూపాలునివలె క్షితిపాల మూర్తియై దర్శనమొసగుచున్నాడు.

ఇక తరువాత సంగీతప్రసక్తులు విజయవిలాసమున క్వాచిత్కముగనే కన్పట్టును. నిక్కమైన మంచినీలము ఒక్కటి చాలదా! తక్కెడు తళుకుబెళుకు రాళ్లెలభింపక పోయినను ఆయున్నవి మాత్రము సంగీతశాస్త్ర సంబంధులై వేంకటకవివరుని సంగీతశాస్త్రపరిచితికి నికషోపలమగుచున్నవనుట దబ్బరకాదు.

ఉలూచీ విజయవిలాస సన్నివేశమున ఉలూచి విజయునితో వాదునకుదిగి ఆతనిని—

"విను గీతిసాహితీ మోహనజాణలు చెవులు వట్టియాడింపగాఁ
గనియుండి "కాముకుఁడఁ గానని" పల్కిన నాకునచ్చి కానెన్నపాలా!"*

అని హెచ్చరించినది.

ఆ హెచ్చరికలో పార్థుడు గీతిసాహితీ చణుడనియేగాక ఆ విజయుని రూపునావహించుకొనిన రఘునాథనాయకుడు "గీతి మధురవాణీ సమంచితమోహన రూపుడను విషయము ప్రవ్యక్తము.. ఇందలి మోహనయన పదము మోహన రాగనామ సంసూచకము. గీతి, రీతి నాకళించుకొనిన సీకవి తన ఈపద్యమును మోహనరాగమున గానము చేయవలయునని ఆదేశించినాడనుకొనుటకు ఇద్దానిని మోహనరాగమున గానము చేసికొనియో, వినియో అనుభూతిసాక్షికముగ

* వి. వి. i - 155

అనుభవైక వేద్యముగా నిర్ణయించుకొనవచ్చును. రఘునాథనాయకుని నాటికి 'రేగుప్తి'* యను ప్రాచీననామమునుండి పరివర్తనమై మోహనసమ్మోహన జనకమై భాసిల్లుచుండినదనుట నిర్వివాదము.

"ఆ యెలనాగవేణి మెఱుఁగారుకటారికి మావటీఁడగుం
బోయనవచ్చు నమ్మెఱుఁగుఁబోఁడి పిఱుందు సమస్త భూమికిన్
రాయిడసంగవచ్చు నలరాజనిభాస్య యెలుంగు గట్టివా
కోయిల కంచు కుత్తికలకున్ బయకాఁడనవచ్చు నెచ్చెలీ!"**

ఈ పద్యమున కవివరుడు "గట్టివా కోయిల కంచుకుత్తికలకున్ బయకాఁడనవచ్చు" ననుచు ధాతుమాతువులను ఉభయప్రక్రియా రచనమునొక్కచో కూర్చి ఉభయకారకుడగు వాగ్గేయకారుని స్మరించినాడు.

"నలుగడ హృద్యవాద్య నటనం మెలయంగపురం పుటారతుల్
నెలయ ద్విజశ్రుతుల్ చెలఁగ విప్రవధూ శుభగానలీల శో
భిలఁగ వివాహవేదికకుఁబెండ్లి కుమారుడు వచ్చె నిట్టులా
వల నల పెండ్లికూతురును వచ్చెరణచ్చరణాంగ దంబులని"**

ఈ పద్దియమున హృదవాద్యరీతితోపాటు ఆరతియను ప్రబంధవిశేష స్మరణము వినబడినది. అట్లే

"నీకు కల్యాణమౌ రమణీయరూప
నీకు వంశాభివృద్ధియౌ నృపకలాప
నీకు జయమగు సాహస నీతిభరిత
నీకు సామ్రాజ్యమౌ మహనీయ చరిత"***

అట్లే ఈపద్యమున కల్యాణీరాగనామము వినిపించుచున్నది. ఇంకొకచో-

"ఎదుట గౌసెన వేయకడినారు. తెమ్మని వీణె యిపుడె మేళవించవలె" ఇందు ప్రసక్తమైన వీణ రఘునాథుని మేళ వీణెయే అయి వుండనోపును. ఇట్లు ఇందు సంగీతప్రసక్తులు కొందిగనున్నను కవి సంగీతాభిజ్ఞుడమటకివి చాలును

---

* మోహనరాగము ప్రాచీనతమ సంగీతశాస్త్రములందు రేవ్యప్తి వ్యవహృతమైనదని ఆచార్య సాంబమూర్తిగారు సోపపత్తికముగ నిర్ధారించిరి.

** వి.వి. i–187. *** వి.వి. ii–15 **** వి.వి. ii–74.

## రంగాజమ్మ ఉషానురాగ రాగరమ్యత

ఈ కవయిత్రి తన పతియు, కృతిపతియునైన విజయరాఘవ నాయకుని సంగీతసాహిత్యప్రియుడని స్తుతియించి ఆతని చెంగట శృంగారవతులు రంగు రక్తులుమీఱ సంగీతమేళంబు గావింప ఆతని సభాభవనము చెన్నుమీఱునని వర్ణించినది. ఈమె తనను గూర్చి శృంగార రసతరంగితపద కవిత్వమహనీయమతి స్ఫూర్తినని చెప్పుకొన్నది. ఈమె రచనావిశేషమున భాసించిన పదకవిత్వము శృంగార సంకీర్తమువంటిదై సంగీతరస తరంగితమై కాంతిల్లినదనుట చెప్పక చెప్పినట్లయినది.

కథసాగిన పిదప పార్వతీవరమున జనించిన కథానాయిక ఉషాకన్య బాల్యమునందే "మృదుకోకిలాలాపసరణి మీఱ" "వీణ వాయించు చెవులకు విందుగాగ" అని నుట్టంకించినది.

ఇక ద్వితీయాశ్వాసమున విరహాసహయగు ఉషకు మానసోల్లాసము గలిగింప ఆమె చెలులు,

"దండె తంబుర స్వరమండలంబురబాబు
 వేటు గజ్జెలు ముఖవీణఢక్క
చెంగుకామాచి యుపాంగంబు కిన్నెర
 వీణె తాళంబునుఁ బిల్లఁగోవి
చిటితాళము రమయు శేషనాదంబు రా
 వణహస్తమును జంద్రవలయములును
మురజంబు వావజంబును మొదలుగఁగల్గు
 కమనీయ వాద్యముల్ గరిమెఁదాల్చి" సంగీతకము నెఱపిరట.

ఇక ద్వారకలో అనిరుద్ధునంతఃపురమున ఆతని పరివేష్టించిన సుదతులలో "రమణియొకతె బహురాగ భేదంబుల నింపుగా వీణవాయింపుచుండి" చిత్రరేఖ కాంచినదట.

తృతీయాశ్వాసమున శోణపురమున ఉషానిరుద్ధులు కలసికొనిరని ఎఱుగక ద్వారకాపురమున అనిరుద్ధుని మేల్కొలుప నేతెంచిన అంతఃపురస్త్రీలు ఉదయ గానమునిట్లు గావించినారట.

"అరుణోదయంబున హరి పౌత్రు మేల్కొల్ప
నెప్పటి క్రమమున నిందుముఖులు
పడక యింటికివచ్చి బాగుగా నెంతయుఁ
దంబురల్ శ్రుతిఁగూర్చి తనరువేడ్క
దేవగాంధారియు దేశాక్షి మలహరి
గుండక్రియ లలిత గుజ్జరియును
మొదలుగాఁగలయట్టి యుదయరాగంబులు
వినుతింపఁ గోఁరఱ వింతవగల"*

ఈ రంగాజమ్మ రసతరంగిత పదకవిత్వ మహనీయమతిస్ఫూర్తి యగుట వలన గీతిసాహితీ సర్వంకషమనీషా విశేషశారదయైయుండుట నిర్వివాదమగు విషయము. ఈమె సంగీతశాస్త్రాన్విత రాగవివేక స్వాంతయగుటవలననే దేవ గాంధారి, దేశాక్షి, మలహరి, గుండక్రియ మున్నగునవి ఉదయరాగములని చెప్ప గలిగినది.

"దేశాక్షి దేవగాంధారీ, భాండీ, ధన్యాసీ మరువాః
దేవక్రియాచ మందాళిర్గౌరీ భూపాల ఏవచ
స్వ స్వాశైశ్చ ప్రవర్తంతే ప్రాతఃకాలేదినేదినే" అను సంగీతదర్పణము నందు నుట్టంకితమగు కాహళోక్తి ఇట రాగవేళా నిర్ణయమున మూదలగాగ్గై గొన దగుచున్నది.

తంజాపుర సరస్వతీమహల్ ప్రచురణముగా వెలువడిన ఈ ఉషా పరిణయమున. నాలుగాశ్వాసములు మాత్రమేయున్నవి. మిగిలిన కథ గ్రంథ పాతమై లుప్తమైయుండును దొరికినంతమట్టుకు లభించిన సంగీతప్రస్తావనము నందే గీతవాద్యములకు సంబంధించిన బహుళమైన ప్రసక్తిలభించి అది ఈ కవయిత్రి సంగీతాభిజ్ఞతకు చెరగనిముద్రమై రాణించుచున్నది.

---

* ఉ. ప. iii - 100. ఉ. ప.

# చెంగల్వ కాళకవి గానకళాభిమానము

కాళకవి విజయరాఘవుని ఆస్థానకవి. ఆయాస్థానము సంగీతసాహిత్యాదిక కళావిలాసములన్నింటికి ఆటపట్టు. కావుననే ఈకవి తన రాజగోపాల విలాసకావ్యమున తననాటి నృత్యసంగీత కళావిశేషములను నిక్షేపించినాడు. కవి సంగీతవేదియని రాగరస భావరంజిత హృదయుడని విశేషించినాట్యకళా విలాస తోషితచిత్తుడని పీఠికయందలి ఎత్తుగడయందే వ్యక్తము.

ఈకవి మంగళాచరణమునందు శ్రీలలితారాగమననము గావించుట ఈతని రాగాభిమానము ప్రదర్శితము.* విజయరాఘవభూపుని సభానాట్యవర్ణనమును ప్రత్యేకించి ఈకాళకవి తన కావ్యమున నిక్షేపించినాడు అందువలన ఆనట్టువరాండ్రు ఆ మహాకవి కొలువున మని చనినవారయ్యును ఈ మహాకవిరాజు కావ్యమున చిరస్థాయిగా నిలచిపోయినారు.**

---

* శ్రీలలితాంగియున్ ధరయుఁజెంగటనే మెలఁగంగ నున్న గో
పాలుఁడ నన్నమాటకు నపార ధనంబు లొసంగి రాజగో
పాలుని చేసెనీతఁడని భావము లోవల నుబ్బుశౌరి హే
రాలపు భాగ్యముల్ విజయరాఘవ శౌరికి నిచ్చుఁగావుతన్"

రా. గో. వి. I - 1

** "భరత సంగీతసాహితీ ప్రముఖవిద్య - లాకృతుగన్న చందాననబ్జ
ముఖులు
సరసముక్తాతపత్ర చామరములలర - వివిధ బిరుదాంక వాద్యముల్
వెలయవిల్వ"

"తీగె మెఱుంగులు తీరువవిరుగడ - వరస బంగారు పావడలు మెఱయ

.... .... : .... .... ....

నెమొఖమువవిల్చ యామద్దు చంద్రరేఖ - వివిధ విద్యలు వింత
యనఁగ" I - 22

ఆ నర్తకీమణుల వెనుక ఆనాడు ఆడువారే సకలవాద్యముల మొఱయించి దిట్టలై తేజరిల్లిరి.* ఆ వాద్యబృంద విన్యాసమందలి వివిధధ్వానమును మన మనోకుహరమ్ము ప్రతిధ్వనులీనినవి.

అందలి వివిధవాద్య ప్రభేదానుగతముగ ఒక రాజకీరవాణి పాడిన రాగ ప్రబంధగీత తాయములు శాశ్వతముగ అటధ్వనించి ధన్యములైనవి. కథసాగిన వెనుక నాయికావిభ్రమ విలాసముల వర్ణించుపట్టున ఒకచో దేశ్యగీతికా విన్యాస ములగు నేలలు చందమామ పదములు వినిపించినవి.*** ఇంతకుమించి ఈ కావ్యమున చెప్పుకొనదగిన సంగీత ప్రసక్తులేమియు కన్పట్టుటలేదు. ఈసంగీతిక విన్యాసమే చాలును కాళకవివరుని సంగీతకళా వేత్వత్వమును చాటుటకు.

---

"చొపదకేలికఁ రూపవతిఁ కాంత - శబ్ద చూడామణి 'చంపకాఖ్య'
చెలువగు జక్కిణి చెలువ 'మూర్తివధూటి' - కొరవు 'కోమలవల్లి'
గురునితంబ నవపదంబులు లోకనాయికా లోలాక్షి - యనిదేశి 'శశిరేఖ' కాబ్జనయన
దరుపదంబులు 'రత్నగిరి' నితంబినియును - పేరణివిధము 'భాగీరథి' యును
మదనపద దూత్య నవరత్న మాలికాది - బహువిధలక్ష్య నాట్య ప్రపంచ మెల్ల
ఘనత విలసిల్ల తక్కిన కాంతలెల్ల - నభినయించిరి తమ నేర్పులతి శయిల్ల" రా. గో. వి. I - 22

* వీణ వాయించెను శోణాధర యొకర్తై — కిన్నరఁబలికించె కన్నె యొకతె
చపలలోచనయోర్తు ద్విపదలు చదివెను — తత్రృసంగము చేసె తరుణి యోర్తు
ముఖవీణచేనొక్క మదిత రాగమునిపె — కొమ్మయొక్కతె పిల్లఁగ్రోవి యూఁదె
తంబురా మొరయించె ధవళాక్షియొక్కర్తై — స్వరమండలము మీఁటె సతి యొకర్తు

యక్షగానంబు రావణహస్తముఖుకు — దండెమీటులు చెంగులు తాళములును
జోలసువ్వాల ధవళంబులేలలచుర — కొందఱతివలు వినిపించిరంద
ముగను" రా. గో. వి. I - 24

"విద్యామూర్తి మలాగుటెత్తు విధముల్ విద్యాధరుల్మెచ్చఁగా
విద్యుద్వల్లులు మింటనుండి విని యుర్విన్ డిగ్గిమేలైన యా
విద్యల్ తాము నభ్యసింపరమణీ వేషంబులం చూనె నా
వాద్యంబుల్ మెఱయంగఁదక్కిన సతుల్ వర్తిల్లరాలాగునన్"
రా. గో. వి. I - 24

** "దండె మీటుచు భళిగాణ దండియనఁగ
నొదుగు గమకంబు రక్తియుఁబొదివి కొనఁగ
గీతముంబాడె నొక రాజకీరవాణి" రా. గో. వి. I - 26

*** "ఏలలు వాడుచో విపుడేటికో చందమామమీది పదాలుమానినార
ధిధికంబుగాఁగూర్చిరది యేమొ?" రా. గో. వి. iii - 66

# పుష్పగిరి తిమ్మనార్యుని గానసమీరము

పుష్పగిరి తిమ్మనార్యుని రచనము 'సమీరకుమార విజయము'ను ప్రబంధము. కథానాయకుడగు ఆంజనేయుడు సంగీతాచార్యులలో ఆద్యుడు, ప్రపూజ్యుడు అందువలన సంగీతశాస్త్రచర్చ ఇందావశ్యకమైనది. అద్దానికి ఆంజనేయుడు కృష్ణుని పనుపున తుంబుర నారదుల గానవిద్యాస్పర్ధా విషయకముగ మాధ్యస్థము వహించుట కవకాశము లభించినది.

శ్రీకృష్ణుడు ఆంజనేయునుగాంచి,

"ఓయనిలాత్మ జన్మ మమునుల్లము లోపలనెల్ల వేళలం
బాయక చింతసేయుచుఁదపంబు నెపంబుననున్న నిన్ను నేఁ
డీయతి చంద్రగాయకుల యిద్దఱి పాటలు మేలుదెల్పఁగా
నాయెదనెంచి పక్షికులనాధునిఁ బంచితిఁదోడి తేరఁగన్" *

అనగా ఆంజనేయుడు మహావిద్వాంసుడయ్యును పరమవినీతుడై ఆపర మాత్మునకు ....

"..... పతి సన్నంబాద పీఠంబు చెం
త వినీతిన్ వసియించి తుంబురుని వీణామాని వీక్షించుచున్" **

"గాయక చంద్రులార త్రిగన్నుత తామకహృద్యగావి
ద్యాయత తారతమ్య గతులారయ శక్యమెయైన జానకీ
నాయకు దివ్యపాదనలినద్వయ సన్నిధిఁ దీరు నిర్ధుటన్
తాయిగనొక్క రాగమనఁదాపరి వాదివినున్న వారలున్" ***

---

* స. కు. వి. vi — 195

** ,, vi — 198

*** ,, vi — 199

"గవిసెనల్ సడలించి కచవీణెలూని తం
　　త్రులుదీటి మటి బిరడలు బిగించి
యిను రాగమున రాగమున కనుసారిక
　　గా శ్రుతులొనఁగూర్చి కవిలె నివిరి
జాలువాటుగ నొక్కసారిమీటి యొకింత
సరస సప్తస్వర సందర్భ విస్ఫూర్తి
　　మీఱఁగా గమకంబు వేఱుపడఁగ

సారెమొ రయించి తగునలంకార సరణిఁ
గొన్ని గీతప్రబంధముల్ గులుకతేనె
లొలుకఁబలికించి ఠాయంబు లొదవఁదాన
మానములు రాగముల రక్తిగానుపింప"*

"స్వర సందర్భమయారె మేల్ శ్రుతులు మజ్ఝారయ్య ఠాయంబులా
పురె యాలాపస్థాయమౌర గమకంబుల్ మమ్మగీతంబుల
ద్దిర ముక్తాయము బాగురెయని మరుద్దేవాత్మ జన్మండు తుం
బురు దేవర్షుల మెచ్చి గానరస మింపున్ సొంపు గావింపఁగన్"**

అమ్మహా కపివరుఁడు నారదతుంబురుల గానముమెచ్చి తనదైన గానరీతిని కొంత పరమాత్మని కెఱిగింతునని—

"దేవర్షి చేత వల్లకిఁ
దా వినయమునం గ్రహించి తంత్రులు మొరయన్
జీవాళిఁగూర్చి రక్తిగఁ
బావని పలికింప సారెంబరమ ప్రౌఢిన్"***

"క్రమమొంద నాభజావళి — గమకముగా శుద్ధ సాళగములును సంకీ
ర్ణములొగి పుంజింపఁగ మంద్రము మధ్యతార యత్యుదారతమీఱన్"****

---

* వి. కు. వి. vi — 200
** ,, iv — 201
*** ,, vi — 204
**** ,, vi — 205

"ఘనవిత మురక్తి విధమునఁ
దనరఁ గ్రియా సావధాన తానంబులచేఁ
గనిపిం పనింపు సరళియు
మునుగాన వారి కొన్ని గీతముల్ పలికింపన్"*

"శ్రుతుల బెరయుట స్వరముల చొప్పువిడక
ఘన విధము గాన షడ్జతఁగలసి మెలసి
సాల శుద్ధతఁగనుట దోసములఁబాసి
వానం స్వామిగానమ సూనమయ్యె"**

అయ్యనూన ఘనసౌఘరంజక మేఘరంజి మంజులానూన బహుతాన మానములను మెచ్చిన పరమాత్ముడు భామతో గూడి ఇట్లభినుతింపనారంభించినాడు.

"మేటి.... మజ్జారె మీటుమీటు వహించె
నింపయ్యె నయ్యారె కంపితంబు
నానంద ముందించె నాందోళి తంబొర!
బళిబళి మూర్ఛన బాగుమీతె
శ్రుతులగతుల్ మమ్మ శ్రుతుల హితవయ్యె
మేలుడాలు విరాళిఁగీలు కొలిపెఁ
జిల్లినె యోహానె? యుల్లాసిత మొసంగె
స్ఫురిత విస్ఫూర్తి బాపురెస్ఫురించె"***

ఆ పిదప అట అయ్యనిలసుతుడు త్రిలోక మోహనముగాగ మేఘరంజి మొరయింప అమేయ తానలహరితో వెంగటి గందోపలముల గరగెనట. ఆ పిమ్మట.

---

* స. కు. వి. vi — 206

** ,, vi — 208

*** ,, vi —

"చండింపక తాళంబులఁ
దండెని కొనికరఁగు రాతిమెడినిడి ప్రౌఢిన్
గుండు క్రియంగావించిన
గండోపల మెప్పటట్ల కఠినంబయ్యెన్* ఇట్లు అఘటనాఘటనా పటుడగు వటుడు రాగరసంబందించి మరుజట్టి చేతికి వల్లకి ఎప్పటి వటిమనొసగి

"ఈ గుండు కరగిపోవక రాగంబని తాళములు గొనంగలవారొకో గాన విద్యకునధికులు నాగ విజృంభించి యనడు" అనినాడు. అప్పుడు నారదుడు "ఘనవిధము పంజరంబును బెనగొన బలికింప మఱియబిగి యుండదొడగెన్"నట అరాయి. అపుడు తుంబురుడు తన కాస్తియైన తానములవి యనియును పసగాన లేకపోయెనట. ఆ విస్మితా ప్రతిస్పర్థులిరువురు ఆంజనేయుని గ్రావములు గరిగింపనోపిన కల్యాణసంగీత విద్యాస్ఫూర్తిని, రారూపులు నీరుసేయగల గాన రూఢిని ప్రస్తుతించి గుండక్రియా రాగాలాపమున కఠినముగావించిన యుపలమున చిక్కిన తమ తాళములప్పింపుమని వేడుకొనినారు. అపుడా మహాగాయకశ్రేష్ఠుడు

---

కవిప్రయోగించిన సంగీత పారిభాషికములందు కొన్ని :

అనుసారిక : వీణపై రాగానుగుణముగ ననుసంధించు సారిక (మెట్లు).

జీవవాటు మీటు : వీణావాదనమున ఒక స్వరమునుండి మఱియొక స్వరమున జారువాటుగా చేతిని కదలించి మీటురీతి.

అలంకార సరణి : చూ. 'ప్రా. ఆం. క. సం. ప్ర' పుట.

గీతప్రబంధము : చూ.

తాయము : ఆలాపము (ఆలప్తి) తానము.

ముక్తాయము : తాళవింత ప్రక్రియ

గమకము : చూ. చరిగొండ ధర్మన్న. పు.

జీవాళి : చూ. 'ప్రా. ఆం. క. సం. ప్ర' పుట.

కంపితము, ఆందోళితము, మూర్ఛన, దాలు, యుల్లాసితము, స్ఫురితము

మేఘరంజి రాగలక్షణము } చూ. సంగీతపారిజాతము రాగప్రకరణము.
గుండుక్రియ రాగలక్షణము }

వారిని కరుణించి ఆయువలమును మేఘరంజితో మబల కరగించి మరితాళములు నిపుణత పుచ్చియిచ్చినాడు. ఆపిదప ఆకపినేత గానప్రౌఢిని సమఖ్యాతిని ప్రవర్తిల్లియు హీనాధిక్యములు ఎంచుకొనుచున్న ఆ ప్రతిస్పర్థుల మందలించినాడట. నారదతుంబురుల గానవిద్యాస్పర్థతో ప్రారంభమునొందిన యీ కథాభాగము గానానూన మహోత్సాభినందనముతో ముగిసి తిమ్మనార్యుని సంగీతశాస్త్ర ప్రౌఢిమను ప్రవ్యక్తము గావించినది.

ఈ ప్రకరణమున తిమ్మనార్యుడు సంగీత పారిభాషికములనెన్నిటినో యుగ్గడించినాడు. వీనిలో జాలమట్టుకన్నియు నితఃపూర్వము వివృతములగుట వలన వానినన్నింటిని వివరింప పూనుకొనలేదు.

## గణపవరపు వేంకట కవివరుని వేంకటేశ్వర విలాసగానము

రఘునాథనాయకుని యుగాంతరవర్తియై తేజరిల్లిన వేంకట కవివరుడు సంగీతవిదుడుగ గోచరించుచున్నాడు. అతని రచనమగు ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము వివిధ కళావిలాసములతోపాటు సంగీతకళా వినోదమునకుకూడ ఆస్కారమైయున్నది.

ఈ కవి ప్రథమముననే ప్రబంధమున వేంకటేశుని సమ్ముఖమున ఒక సంగీత సభావిధానమును ప్రకల్పించినాడు. ఆద్యముగ జతివిన్యాసముతో కొలువు నడిపించి వాద్యబృంద విలాసముతో సంగీతకవిశేషమును ప్రతిపాదించి నాడు. ఆపిదప కవివరుడు వారలుగావించిన రాగప్రభేదములను వానిలక్షణములను వ్యక్తముగావించి తనదైన రాగవివేకమును ప్రకటితము గావించుకొనెను.

---

* "సంగీతపు మేళపుజత - సంగతి తాళములు నాగసరములు ఢక్కీల్ చెంగులు ముఖవీణియలును - పాంగము తప్పెటలు గజ్జలందుక చేరన్"

** "ఎక తాళంబున వీర మర్దళరవంబేరంబు గానట్టువుల్
ధికతోంత త్తక ఝుంకు ఝుంకుకిణ తాందిత్తాంకియలోథికు
ద్ధితు తెత్తెయ్య ధిమిక్కు ధిగుతాంధి త్రాత్త తాళంబులన్
గకుబంతంబులు మాఱుఁబల్కు కొనుగోల్పట్ట నప్పట్టునన్"

"భైరవ శ్రీరాగ బంగాళ హిందోళ - మాళవులును రాగమంజరియును
భూపాళ గౌళల స్పురుషరాగాష్టకం - బాహిరి లలిత బిలాహరులును
గుజ్జరీ మలహరి గుండక్రియ వరాళి - దేవగాంధారియు దేశతోడి
దేవక్రియ కురంజి దేశాక్షిరామక్రి - యాంధాళి నాటధన్యాసి పూర్వ
గౌళసారంగ మంగళ కౌశికములును - కన్నడయును బాయగౌళకడు నపూర్వ
మైన భల్లాతకియును నారాయణియును - గ్రమత నిరువది నాల్గు స్త్రీరాగములను"

గణపవరపు వేంకట కవివరుడు చర్చించిన సంగీతశాస్త్ర విషయముల ఆతని ప్రాండిడీప్రకర్షకు నిధానమై భాసించుచున్నది. సంగీతవాద్యములందేకాక ఈ కవి నాట్యపాండితియందుకూడ అందెవేసిన చేయి. ఈ నాట్యవిన్యాసమున ముఖరాగనేత్రాభినయ హస్తప్రభేదములెన్నిటినో చూపినాడు.

---

"కాంభోజియును గుమ్మకాంభోజియును సింధు — రామక్రియయు నాద
నామక్రియయు
రామక్రియయు మేళరామక్రియ వసంత — సామంత శుద్ధవసంత మధ్య
మాదులు సామంత మలహరులును చెంచు - మలహరి ముఖారిమాళవియును
గౌళనారాయణ గౌళవసంత వరాళి పున్నాగ వరాళి శంక
రాభరణమును శోక వరాళి మేఘు — రంజి గుజ్జరి పంతు వరాళినాట
బౌళి దేశాక్షితోడి వరాళి శ్రావ — రాళి హెజ్జజ్జ కేదార గౌళపాడి"

"రీతి గౌళము నీలాంబరియును ఘనము
దనరుహంవీర నాటయునని నపుంస
కములు ముప్పది రెండు రాగములు మఱియు
దేవ మలహరి సాహరి రేవగుప్తి"

"మాళవ శ్రీయు సాకొండు మలహరియును
కోనమలహరి నాసైదుగూర్చి పంతు
లాదిగాఁగల మిశ్రంబులన్ని మదికి
నరిది గన్పట్ట వినికి సేయంగఁదెలిపి"

"గానంబునకుఁ బ్రతిగాన మెందునఁజతు - ర్దశ రాగదోషముల్ రహివిడిచి
సరవి ముప్పది రెండు సంచారము లెఱింగి - పదునాల్గు మూర్ఛనల్ పరి
హరించి
దైవత షడ్జగాంధార నిషాద పం - చమ మధ్యమ ఋషభస్వర గణముల
క్రమముతో మంద్రమధ్యమ తారకంఠుల - మేళయింపుచును శత్రు
మిత్రరాగ

ఇందీకవి వ్యక్తపర్చిన నర్తనవిలాసములు ఈతని నాట్యశాస్త్ర కుశలతను ప్రకటితము గావించుచున్నది. ఈ నాట్యమునకు నేపథ్యమున మొరసిన నట్టువాంగము, వాద్యవిన్యాసముగూడ నిరుపమానము.

---

విధములను వేళలను జతుర్విధ సులక్ష — ణముల భరతము ఛందః క్రమమును దెలిసి
పోసఁగఁ జంచత్పుటము చాచిపుటముఖముల - మేరమాటొక్క తాళంబు వేఱుపఱచి"

"ఘుమఘుమ మధుర నిర్ఘోషంబు రాణింప — ననురాగమున మైత్రులను సరింప
స్థాయిక్రమ గ్రామసరణి నిరూపించి - ఘనదేశ్య శుద్ధపైఖరి నటించి
సమయోచిత ప్రాణ సంవిధాన మెఱింగి - యంగ చేష్టా గోషమపనయించి
పవనజయవ్యాప్తి భావంబు సమకూర్చి - ముఖవికాసారూఢి మొనయఁజేసి
ఛత్ర కర్త జౌధారణి ఝంకెసరళి - పాట పైసిక యుపఝంకెమీటు కంపి
తాహతంబులు హుళియుఁ బత్యాహతమును - స్ఫురితములు వాద్యముల నయ సరణిమీఱ"

"సొలపుగ నిర్వదైదు విడిచూపులు నాల్గు మొగంబు త్రివ్వతీ
దల వడ బొమ్మనన్నలొక యర్వదినాలుగు హస్త చేష్టలున్
వలనుగ కెకిహంస వృషవారణ కేసరి శుద్ధంగతుల్
వెలయుచు మట్టనేర్చి సరిలేమలలో బిరుదంది పొందికన్"

"తనమ్రోల డిండిమధ్వని మ్రోయ నలుగడ
 బెళుకు చూపుల భుజంగులను గారఁ
గులుకు నెన్నడల రాగిలుకుటందెల నద్దు
 నటుల కావి మతాపటిమఁజూపఁ
జెలులకు నర్మోక్తిఁదెలుపుచు చేయుకేల్
 కదలిక తచ్ఛాస్త్ర గరిమ నెఱప
నీటు సంగారపు నెమ్మేనిమై సరి
 విరిఖింటి దొరనైన మరులు కొలుపఁ

బట్టు చాలని అరివిక చన్గట్టు దెగడు
బిగువు సిబ్బెపు గుబ్బచన్నుఁగవయు బిగి
పైఁట జార్పఁగ నుడిగపుఁబడతి దిద్ద
మురువుగ నెసంగె నొక జగన్మోహనాంగి"

"....  .... వారపు
నెఱికలు కొనఁగోరఁదీర్చి నీలాంబుద భా
సుర చంచలయుసఁ దనరుచుఁ
దెరలోన న్నర్తనాధి దేవత లీలన్"

నిలచిన,

"మునుమున్ను భువన మోహనరంగ మర్దళ
ధీర స్వరమ్ముల ధిమ్మమనియె
నా వెంబడిగను గాయనగాయనీమణి
గానమ్ము ఘుమ్మన గ్రమ్మ కొనియె
నావెంటనె విచిత్ర యనినికాగ్ర వసంత
కుసుమముల్ ఝల్లన ముసురుచూపె
నావెనుక నటి పదాంగుష్ఠ విన్యాస
మున గజ్జియలు ఘల్లుమనుచు మ్రోసె
నంతఁగను పట్టెఁగల్ప శాఖాగ్రకి సల
నవ్యమణి ముద్రికా కంకణ ప్రదీప్త
కోమల కరాంగుళీ కటకాముఖైక
చతుర లీలాభినయము విస్మయముగాఁగ"

"తెరయించుక వంచినఁ జం
దురుకావిరు మూలముసుఁగుతో నింటి మొగఁ
బరతోఁచ నపుడు తళతళ
మెఱుపుందీఁగె యనఁగాను మేసిరి యమరన్"

"సొగసు తెలివాలు నును సోఁగ సొంపు తళుకు
వెళుకు చికిలి యొయారంపుఁబేరెముదుట
సొలఁ విడియంబు దేలింపు చుఱుకు హోర
కలికి బెదరెచ్చు చూపుల కలికిఁజూచి"

"హరుని మున్నెయ మఱచిన యరిది శరము
మరుఁడు సమ్మోహ మంత్రాభి మంత్రితముగ
నేసెనో యనఁదెరమోరఁజేసి వెడలెఁ
దన్మయావస్థ జనుల చిత్తముల ముంప"

"లయకోపు దృష్టియును సభి
నయ ముదుటుదరమ్ము మోడిన యహున్నతిరే
క యును ప్రమాణము హరువున్
మెయిసిరి యవళఘము ముసువు మెలకువ యహరున్"

"దిర దిరఁజక్రంబు దిరుగు చందంబున
అగుపు గన్పడ నడ్డలాగు లెత్తి
కదలినీటను పెంటికరుడు బొల్లువిధాన
కుఱుచగా ముంగలి మెరుముప్పైచి
కీల్బొమ్మరము జాట గిఱ్ఱున ద్రిమ్మరు
తెఱఁగున వీడెపు తెరువుగట్టి
నేల యురుమురుము లీల పేరిణి వగ
పదఘాతమున శబ్ద మొదవఁజేసి

యొరపుగాళిదీగె మెరుసాని మెఱయ కరణి
కోపు పొదలిక విడుదల కోపుదీటి
తమ్మి చరువలిగదలు విధానమే నా
కింత యిటునటు బెళికించి యోరాళ హుళియు"

ఆ పిదప మరియొకచోట ఈకవి స్వీయానుభవ సంవేదులుగా వివిధగీతి ప్రభేదముల కొన్నిటిని రాగాన్వితములుగను మఱికొన్నిటిని తాళాన్వితములుగను మలచినాడు అందు 1. బహువిధ తాళవృత్తము, 2. ధవళము, 3 శోభానము, 4 హారతి, 5. త్రిపుటరేకులు, 6. ఝంపెగీతిక, 7. అర్థచంద్రిక, 8. సువ్వాలి, 9. లాలి, 10 ఏల, 11. మంజరి, 12. సమతా డిండిమ తాళవృత్తములనునవి తాళాన్విత ప్రభేదములు, 13. ఇక ఆహిరీరాగదరువు, 14. ముఖారిరాగదరువు, 15. ఎఱుకల 16. కాంభోజి, 17. రాగదరువు, 18. కాంభోజీరాగదరువు, 19 కన్నడరాగదరువు, రేవగుప్తదరువు, సావేరీరాగదరువు, బిలహరిరాగ దరువులు తాళములనుగూడ గూర్చబడుట సవిశేషము.

బహువిధ తాళవృత్తము అష్టకము ధవళము శోభనహారతియనగా నార త్రికము జంపె త్రిపుటరేకులు అర్ధచంద్రికసువ్వాల లాలి ఏల మంజరి సమతా డిండిమ తాళవృత్తము ఆహిరీ రాగదరువు ముఖారి రాగదరువుఎఱుకల కాంభోది రాగదరువు - రూపకతాళము కాంభోది రాగసమపదదరువు కిన్నెర రాగసాంగత్య దరువు పదము కొరవంజి దళ రేవగుప్తరాగసమపదదరువు సావేరి రాగైకతాళ దరువు బిలహరి రాగతాళసమపద దరువు ఆయా తాళములనుగూడ గూర్చబడుట సవిశేషము. మొత్తముమీద ఈ గణపువరపు కవివరుడు నాట్యశాస్త్రజ్ఞుడై గీతి సాహిత్యులరెంటిలో నిష్ణాతుడగుటముదావహము.

---

''కయ్యెడ కట్టిన క్రమముల విసుషించి
దేశి శుద్ధాంగముల్ దేటపఱచి
శౌలుత మూళాదుల కొలనణి మెప్పించి
జక్కిణి గతుల నొసంగులంది
కుండళ్ల నృత్త సంభ్రమ సంగతులు చూపి
చిందుల వంధముందంద నెరపి
తిరువుల లాగుల తర్తిత్తపు గల్పించి
దళ చంచుగతుల బిత్తరము మెరవ
దండపాద వినోదావధాన కరణి
విభ్రమములన నాయాస విధము దాల్చి
మూయురే యనవాడె రంభా తిలోత్త
మా ఘృతాచి ముఖుల కవమాన మొదవె'' ప్ర. శే. వి. 106 - 110

## ముద్దు పళని సంగీతకవు ముచ్చట

ఈ కవయిత్రి సంగీత సాహిత్యభరతశాస్త్రాది విద్యాపారంగతయని ఆమెదైన ఆశ్వాసాంతగద్యయే ప్రమాణముగా నిల్చుచున్నది.* ఆమె గావించిన మంగళాశాసనమునందు రాగముద్రాలంకార పద్ధతినంది శ్రీ, మోహన రాగములు గలవు.**

ముద్దుపళనియేకాక ఆమె మేనత్తయగు తంజనాయకికూడ సాహిత్యము నందు, గీతవాద్య నృత్యత్రయమునందు ప్రౌఢయని కవయిత్రియే ఇట్లు ప్రశంసించినది.

"వీణవాయించెనా వివిధ చిత్రాద్భుత - ప్రతిమలెల్లను తలల్ పరఁగనూచు
తీవి నటించెనా దేవలోకపురంభ - కొంచక మొదల్వంచుకొనును
గానంబు వినిపింపఁబూనెనా యామహా — గిరిరాజిర్ద్రైనను గరఁగి పోవు
సభలమాటాడెనా చల్లగాఁబన్నీరు - చిలికిన తేవను జెలువుమీఱు
నని.... దొరలెన్నఁగా ఘనతకెక్కె - ప్రౌఢ చేడెలలో సీడుజోడులేక
తత సుగుణపేటి దివ్యసౌందర్యవాటి - యతనుమద ఘోటి తంజనాయకి వధూటి"

ఆమె చిన్నికృష్ణుని స్వప్నముగాంచి ఆతనికి తన కృతినంకితమీగోరి వీరరాఘవ దేశిక సార్వభౌమునకా ఉదంతము విన్నవించిన ఆతడు మెచ్చి ఆమె గుణములను—

"ఘటియింపనేర్తువు కవన జాతులెతింగి - పలుకులకల్కివెల్వవెలఁబార
.... .... .... .... ....
నటియింప నేర్తువు నవరసంబులనంటి - తగరంభ యనిమిషత్వము వహింప" అని శ్లాఘించినాడట.

---

* ఇది చిన్నికృష్ణ కరుణాకటాక్షవీక్షణ క్షణప్రవర్ధమానానూన శృంగార రస ప్రధాన సంగీతసాహిత్య భరతశాస్త్రాది విద్యాపారంగత....

** శ్రీలఁజెలంగు రాధికను జెల్వరో నిన్నిల రూపురేఖలన్ - పోలుదురే పడంతులన మోహపుటాలిని నిప్పుడెన్నదో"

*** రా. పా. i - 20. (పీఠిక)

ఇక కథాక్రమానుగతముగ కావించిన శ్రేవపల్లెవాడ వర్ణనమునగూడ ఈ కవయిత్రి అందలి వనితా జనంబులు సంగీతసాహిత్య ప్రవీణలని పలికినది.*

తరువాత ఇళాదేవిని రాధాదేవి సకల విద్యామహనీయ నొనరించు పట్టుల నామెను సంగీత సాహిత్యప్రవీణను గావించినదని తెల్పుచు నిట్లనినది.

"పాడించు నొకవేళ బహుదేశ్యరాగము - ల్పాగించునొకవేళ జంత్రవాద్య
మెఱిగించు నొకవేళ భరతశాస్త్రప్రౌఢిఁ బట్టించునొకవేళ భావరసము
నెగడించునొకవేళనెరి కావ్యసంగమ - ల్గనిపించు నొకవేళఁగవసరీతి
బోధించు నొకవేళఁబూవిత్తు శాస్త్రంబుఁ - జదివించునొకవేళ శయ్యలోలి
నూఱిపోయు మఱొకవేళ నారజంబు - వచ్చెననిపించునొక వేళ వాద్య
విధము
నెపుడు జూతునో యిదె శౌరి ననుచు - దయనపుడు పొంగి యిళకు
రాధాలతాంగి"**

ఆ పిదప ద్వితీయా శ్వాసమున వర్ణింపబడిన రాధాదేవి ………… ఆమె చెలులేకాక యంత్రపాంచాలికలుగూడ వీణెలు, మఱిరాగములు పలికింపగల ప్రత్యేకతగలవని కవయిత్రి పలికినది. ఆపిదప గోపాలబాలుడు ఇళారాధాతుల్యుల ……… అమర సంగీతరసికుడై నృత్యగాన వినోదముల మురిపినాడట. ఈ సందర్భమున ప్రవృత్తమైన సభాస్థాన నృత్యములివి.

---

* ఏవంకఁజూచిన నేణీవిలోచనాచనారీతి కూజితావిర్భవ రావచయము
ఏ చాయఁజూచిన విందుబింబనగా - నవల్లకీ వాదన వైభవంబు
లేతావు చూచిన నిభరాజగామినీ - సంగీతసాహితీ సంభ్రమంబు
ఏదిక్కు చూచిన నింద్రనీలాలకా - భరతశాస్త్రోక్త భావాభినయము
శ్రేవపల్లెవాడ"

** రా. సా. i - 59

"తంబురమీటి గీతంబుపాడుచు నొక్క - మధురోక్తి సరిగమపధని యనగ
జగ్గు చేకట్లనుగ్గడింపుచునొక్క - చక్కెరబొమ్మ తద్ధిక్కుడనగ
గుజరాతి జక్కిణి.... లాడుచునొక్క - భామిని జీవుసల్లామనంగ
బిరుదులై వాదము పేర్మి పేయుచునొక్క — సరసిజానన జయజయ
యనఁగఁ
జంద్రబింబాస్య యొకతె హెచ్చరిక తెలుపఁజెలియ యొక్కతె సందడిఁ
దొలగఁజేయు
నందఱకు నన్నివగల నానంద మిడుచు — నిండుకొలువుండె యదువంశ
మండనుండు"*

దక్షిణాంధ్రయుగమున సంగీతమున మార్గిపద్ధతికన్న దేశిరీతి మిన్నయను నభిప్రాయము రసికులకు కలిగినది. అయ్యది గీతనృత్యముల బహుభంగుల నమరినది. జిన్నచేకట్లు, గుజరాతి జక్కిణీకోపులు, బిరుదై వార నృత్యములు, హెచ్చరికలు ఇవన్నియు ఆనాటి నృత్యగాన విశేషములలో దేశీయరీతులని వ్యక్తము. ఇలా.... కథ రుచిమించి పాకానబడిన పిదప రాధ విరహాసహాయై చిలుకతో రాయబారంమంపి అది దడవుసేయగా గోపాలబాలునిగూర్చి పలవరించిన కలవరింతలలోగూడ సంగీతకమే చోటుచేసికొనుట కవయిత్రి సంగీతాభిమానము చాటును.

"గళుకుహారంగు పెండమము ఘల్లున నాయెడలెల్ల ఝల్లనన్
దులదుల శౌరి వచ్చిగతి దోఁచియుఁ దోఁచకయున్న దేలకో"

అంతేకాదు సవతిపైఁబూనిన ఈర్ష్యాసూయలలోకూడ సంగీతకమే చోటు చేసికొన్నది.

"తెలియదో నాచేతి దేశ్యంపు గుజరాతి
వింత మెఱింగిన నాఁటి వేఁడుకోళ్లు
ఎంచదో నాచేత నిలజత్ర గాత్రంబు
లభ్యసించన నాఁటి యణకులెల్ల"

* రా. పా. ii – 15

ఇళ ఇట్లు రాధవలన సకల విద్యలను సంగీతముతోపాటు నేర్చి ప్రవీణయై గురువునకే నామము పెట్ట సాహసించిన జాణయై రాధను విడనాడుమని కృష్ణుని ప్రార్థించి పట్టుకూడ వేయించుకొనినది. అది చాటుగామాటుగా చూచివచ్చిన చిలుక రాధతో చెప్పనే చెప్పినది.

ఆశుకవిత్వంబులల్లి తేనే సరా
        చిత్ర ప్రబంధముల్వ్రేయ వలదె
గోటి చేతను వీణ మీటి తేనేసరా
        కొంచక రాల్గరఁగించ వలదె
పదచాళి రాగముల్పాడితేనే సరా
        హితవొప్ప వర్ణంబు లెత్తవలదె
అల నాట్యభేదంబు లాడితేనే సరా
        నవరసంబునంటి నడువవలదె"*

సంగీత సాహిత్యములలోని నిగ్గులుదేల్చి ఆనాటి విమృశ్యకారిత్వమును చాటినది. ఆ సవతి మాత్సర్యములో దొరలిన దేశ్యములు, సామెతలు, జాతి వ్యార్తాచమత్కృతులు కొన్నిటి నిట ఉదాహరింతును.

"ఈఁక తోకలేని శ్రీకృష్ణుమాటలు వొలతినమ్మి నాసర్బోసికొనియె"
"కుమ్మరికిఁజూడ కొకయేడు గుదియకు నొక్క పెట్టెటన్నట్లు"
"అత్తనెత్తిఁ జేతురంగడిలోఁగన్నులు"

---

మగరాల కంబాల నొడి యంత్రపాంచాలి - కలు మీటి వీణెలగులుకురాగ ముల నొక్క తలఁచు జిలుఁగు బంగరుసీమ - పాత్ర చిత్తరు బొమ్మలను గిఁచితిని" ii – 12

"కిలకిల నవ్వుచుం దివిరి కిన్నర మీటుచుఁబాట పాడుచున్
జిలుగు రుమాల చెంగు నెనుభేరక దుప్పటికింతఁజాఱగాఁ
గళుకు హొరింగు పెండియము ఘల్లన నాయొడలెల్ల ఝల్లనన్
దులదుల శౌరివచ్చు గతిదోఁ చియుఁ దోఁచకం...."        ii – 107

* రా. సా. iii - 14

సంగీతప్రసక్తి నిజముగా యెళముల్ మొరయించి మేళమై వినదించినది చూడుడు.

"తగులు డాకను మేళమగపడ్డ దాళముల్"* ఇట్లాడి ప్రోసిక్కాని ప్రాణములపైని ఆళదిగనాడి చావునకుగూడ సిద్ధమై తన వీణకొఱకు ఆరాటపడినది. సంగీతముతో ఆనాటివారికంతటి ప్రాణాలతో లంకె కాబోలు.

"ఏయెడ నాతొమ్మ(బాయని వీణనే
పాట లాధరగాట మీటు నొక్క"**

ఇంతలో ఆశౌరికే రాధపై గాలిమళ్లినది. అణచిన తలపులు తిరుగబడినవి. దాచిన వలపులు వడ్డికి జారినవి. తన రాధ తనయందెంతటి అనురక్తయో ఆ ముచ్చటలు ధూర్తగోపాలునకు జ్ఞాపకము వచ్చినవి. అపుడుగూడ సంగీతమే ఆతని అంతరాంతరములలో వీణాప్రక్వాణ ప్రక్వణ వినదమై మాఱుమ్రోగినది—

"వినఁగ నొల్లదు రుద్రవీణారవంబైనఁ
గలికి నాగరవంబులినె కాని" అని వేణుగానలోలుడు వీణారవంబును పెద్దచేసి మన్నించినాడు. అలనాడు పాల్కురికి సోమన పలికించిన రుద్రవీణానాదము ముద్దుపళని కావ్యములలోగూడ ప్రతిధ్వనించినది. అంతేకాదు రాధ మాధవుని దృష్టిలో కుసుమాస్త్రిచేతక్కయట. ఆశ్వాసాంత గద్యలలో కూడ పళని పనిగొని తననుగూర్చితానే "సంగీతసాహిత్య భరతశాస్త్రాది విద్యాపారంగతనని" చెప్పికొనినదియేచాలును ఆమె సంగీతప్రతిపత్తి చాటుటకు.

---

* రా. సా. iii - 30

** ,, iii - 61

# అహోబలుని కాళిందీ కన్యాపరిణయ గానరిరంస

ఈ కాళిందీ కన్యాపరిణయ ప్రబంధము అభినవ నన్నపార్య బిరుదాంచితు డైన అహోబలపతి రచనము. సంగీతపారిజాతకర్త అహోబలపతి ఆతడు ఆంధ్రుడని ప్రతీతి. వీరిద్దరును ఒక్కరేనేమో! ఈ గ్రంథమందు లభ్యమైన ప్రథమ భాగమునుబట్టి ఈకవి సంగీతాభిజ్ఞుడని చెప్పవచ్చును. అంతేకాక వ్యాకరణ జ్యోతిషములందుగూడ మేటియని చెప్పవచ్చును.

"సంగీతమపి సాహిత్యం సరస్వత్యాస్తన ద్వయమ్
ఏకమాపాతమధురం అన్యదాలోచనామృతమ్" అను సుప్రసిద్ధాభాణకమును రామరాజభూషణాది కవులెందరో చమత్కరించిరి. వారివలె నీకవియు ఆ శ్లోకసంవాదిగా అభావమును విధాతృ స్తవమున నిక్షేపించినాడు.

"కనదతి చిత్రతనమ్మృదుల గాత్రము నందొకగుబ్బ కర్కశం
బన దృఢ సాహితీమయత నందుట మార్దవవాసగీతమై
తనరెడుగుబ్బ రెండవది దాల్చెదృఢత్వము చాల (వింతయో)
ననుచను మాటబోటి కుచమంటెడు నల్వమదిందలంచెదన్"*

పురవర్ణనమున ఈకవి "గొంగ్లిడిసేయు తరుణుల దివ్యగానము ముదంబున వించుఁ పయోజ బాంధవరథాయత దృక్ప్రతిరశ్మలు చలింపకుండినట్లు,** ఇంపుః మణివేదికలయందొనరి ఇందు ముఖులందమగు గానముల ఇందుమణులెల్ల పొందుగు కరగినట్లు వర్ణించెను*** అచటి లీలావనములు అంగీకృతస్వాన సంగీతమత్త సారంగయుత సరోవిరాజితములైనట్లు వర్ణించెను ఇందు కవి సంగీతాభిరుచి ఎంతేని వ్యక్తము.

---

* కా. క. ప. I. పుట. 2

** ,, I. ,, 10

*** ,, I ,, 11

ఈకవి వీణావాద్యమందలి వివిధాంగములను బాగుగ నెఱిగినవాడని అతడు గావించిన వీణానుగతమగు ఆపురి గాయనుల గానమువలన వ్యక్తము.* అంతే కాక పురవర్ణనమందు శ్లేషధోరణులుగలిగిన పట్టులగూడ రాగరాగిణీ విధానోక్త సంగీతరీతి చోటుచేసికొనుట సవిశేషము. అట్టి ద్వారవతీనగరమును కళాస్వర సహితమైన గాంధర్వవిద్యంగరిపించుచు అస్తోక హస్తలక్షణ మధురంబై........ పురుషోత్తముడు పరిపాలించుచున్నాడట.

ఇట నాయికయగు కాళిందీకన్యయు సకల విద్యలతోపాటు సంగీత శాస్త్రాభ్యసనము గావించినదనుచు ఆమెకు సాక్షాద్గీర్వాణియే సంగీతసాహిత్యముల మర్మముల నెఱిగించినదనినాడు.**

ఈకవి రామరాజభూషణుని ఒరవడిలో ఈసందర్భమున కొన్ని పద్దియ ములలో రాగముద్రాలంకారముల నిక్షేపించినాడు.

కవి కాళిందీకన్యను సరస్వతికే అంతేవాసిని గావించి సంగీతపాండిత్య నిధినొనరిలచిన పిదప ఒకనాడామెచే తండ్రి సమక్షమున ఒక సంగీత సభాకార్య క్రమమును నిర్వహింపజేసినాడు. కాని సరిగా ఈసన్నివేశముననే కొంత గ్రంధ పాతము జరిగియుండుటచే కవిదైన సంగీతాభిజ్ఞత తేటపడవలసిన పట్టున లుప్తమైనది.

జగడంబుకూటి జడదారి తదనూన వీణాగానామృతంబు కర్ణకూపంబుల నిండారనబ్బురపడి చేతివీణియ వదలి కదలక మైమఱచి ఆగీతములందలి లెక్కింపగరాని మాధురీగుణమును వినుతిలచి సూర్యునకు కృష్ణుదేవుని గుణముల విన్పించి, కాళింది మనసును కృష్ణపరమాత్మయందు ఘటించినాడు.***

---

* నానాట.... మదన, అనుపమ, లతిక, లావణ్య.... క్రొమ్మెఱుంగు, లలిత, మోహన, కళానిధి (బాలశశి) రాగనామములు. పుట. 27

** కా. క. ప. పుట. 35, 37

*** ,, పుట.

"కృష్ణునందు పరాగత గిలుకొన్న
యింతి కపరాగ సాంగత్యమెట్లు పొసఁగు
నెన్నఁగఁబరాగ మెపుడు సహించునింత

కిపుడు దాని సహించుట యెంత అరుదు"*. అను పలుకుబడులలో కాన వచ్చిన పరాగాపరాగములలో సంగీతవిషయకమగు రాగపోషణ. రాగసాంకర్య ములను సదసత్సంప్రదాయపద్ధతులు వ్యక్తములు.

విరహాసహయైన కాళింది పలవించుచు నిఖిల గాయనగాయనీ దుర్లభంబైన ఇంపులపాట............"** దీనినిబట్టి కవి తన నాయికయగు కాళింది తదితర గాయన గాయకులగు నారదతుంబుర, మణికంధరాదుల. అను భావనను వ్యక్తము గావించనట్లగపడుచున్నది.

మొత్తముమీద ఈకాళిందీ కన్యాపరిణయకర్త లభ్యమైన గ్రంధభాగమును బట్టియే సంగీతాభిరుచి కల్గిన కవియని ఘంటాపధముగ చెప్పవచ్చును

---

* క్రా. క. ప. 20 - 21

** ,, పుట. 53

# రఘునాథ తొండమానుని సంగీతలక్ష్యలక్షణపరిజ్ఞానము

ఈ రఘునాథ తొండమానుడు దక్షిణాంధ్ర కవియగుటయేకాక రాజకవి యగుటవలనకూడ గీతిసాహితీరీతులందు ఈతనికి రఘునాథ క్షితిపుడు ఆదర్శ ప్రాయుడగుట గమనింపదగిన విషయము. ఈకవి కవనమందేకాక వ్యాకరణ జ్యోతిషసంగీతములందు కూడ సిద్ధహస్తుడు. ఎడనెడ ఈతడు గావించిన సంగీత ప్రసక్తులు ఈతనికి సంగీతమందున్న లక్ష్యలక్షణ పరిజ్ఞానమును, వివిధ వాద్య రీతులను వెలయించుచున్నవి.

వివాహానంతరము ఏకాసనస్థితులై వేడుకలగాంచునచ్చు శర్వాణీశర్వులతో రంభ చదురున నాచే నటనమునఁజూడఁగావలె ద్రుటికాలమటంచు—

"స్థానకమ్ములు పాంగ జాతములు మ్రోసి
　　గ్రమ్మమంచు నఖండ నాదమ్ము గ్రమ్మ
దృక్స్వరో భేదముల నెల్లఁదెలియఁజేసి
　　నవరసస్ఫూర్తి వెలయించి యవలమటియు
తిరుగుడుల లాగులను మైసరిచేనంద
　　మగు కోపు సాదులనెల్లన్
దురుకసును బరుసు తెలంగఁగ మతిమతి
　　యగ్గలికఁబట్టి మళ్లియు విడవన్
శంభో! పాలయమాం శంభో యనుచు
పల్లవి నెత్తుకొని"* అభినయించినదట.

ఆపిదప సప్తతాళేశ్వరంబను జతియొకఁడు మూడుకాలాల ననులోమమును తదన్యమును ఒకింతగ వినిపింతునని—

"తకతఝం ఝరితరిత తరిత తధిమిత మితవచో బహుశాస్త్ర
శాస్త్రగ్రంథపారంగత పధీమతధీనుత తధిన్నాను తకతక తకిటతఝుతఝు
ఝుకు తఝుంతాది తకాంపు సరోజ సేవానియత మానస సుజన తద్ధిత"

---

* పా. ప. పుట. ఉత్పన్నము

అను జతిని సప్తతాళములతోఁబట్టి బిరుదులిమ్మని వేడుకొనినదట. ఆరంభకు వత్తాసుగా "ఒసగవచ్చు అర్థంబని ధనదసుతుడు నొక్కి వక్కాణించినాడట. ఆ యిర్వురి మాటలను విని ఊర్వశి స్పర్ధను వహించి—

"తకిట తకతక యంచని యొకజతి యేడక్షరాలనున్నది యాదికి సరివడ నటింపుము గోరికైన బిరుదుగొనుమావెస్క్రన్" అని హెచ్చరింప ఆ రంభ అజ్ఞతను తన సంగీతపాండితిని ప్రదర్శించుచు ఇట్లాక్షేపించినదట.

"పదమతీత గ్రహప్రాప్త పల్లవమయ్యె - శమమని యాడిన చానయెవతె
షట్పితా పుత్రంపు జతులకాడుమటన్న - నుద్ఘట్టితంబెత్తునువిద యెవతె
....స్వరాలు చిత్రతరాన నడువంగ - వార్తికంబనియాడు వనితయెవతె
అట తాళచాపున నటుడుగ్గడింపరూపక - చాపుననాడు పడతియెవతె"

అనును పైపెచ్చు ఎట్లువేడెదు బిరుదులిమ్మంచునని రంభతోవాదునకు చొచ్చినదట. ఈ సందర్భమున దొరలిన ఆది, షట్పితాపుత్రము, ఉద్ఘట్టితము, అట తాళచాపు (చాపు) రూపకచాపు చాపు) అనునవి తాళనామములు. అతీతగ్రహము, సమగ్రహము అనునవి తాళదశప్రాణమునందలి మార్గప్రాణ ప్రభేదములు. ఇవి చరిగొండ ధర్మనాట్యుని సంగీతప్రజ్ఞను ప్రదర్శించుతటి వివృతములు. ఇవియే కాక మఱికొన్ని సంగీత సాంకేతికములుగూడ ఊర్వశి గావించిన రంభను గూర్చిన అధిక్షేపణమునసే ఇట్లు దొరలినవి.

గ్రామంబులెన్నని కలసినేనడుగంగ
　　మూళ్ల షేళ్లన్న ప్రేళ్లయందు
మూర్ఛనలెన్నని మొనపినే నడుగంగ
　　తొలుఁగవే యొక్క ప్రొద్దులనటంచు
శ్రుతులెన్నియని నేను సూటిగానడు
　　గంగఁజెప్పవే రెండని జెవులఁబట్టి
గమకము లెట్లంచుఁగలసినే నడుగంగఁ
　　బలుకవాయని మన బ్రతుకులనుచుఁ

బాట యెఱుఁగని.... పడుచు సభల

నెల్లు పదచాలి వినిపించునేటిమాట" అది అమరకున్న నావలమఱిమాట కనగ నదివింతె దొమ్మరి గంతులంతె. ఊర్వశి వచ్చి యీ చదురునుండఁగ కన్గొని యేలయంటి పీగర్వపుమాట ... అనుచు దృక్పర్వముగా ఊర్వశి నటి యింప సభాసదులెల్లరు మేలుమేలు వాసివాసి యనినారట. ఈ సందర్భమున చొరలిన గ్రామము, మూర్ఛన, శ్రుతి, గమకములనునవికూడ సంగీతపారి భాషికములే. ఇవి ఇతఃపూర్వము వివృతములు.

ఇక్కడ చిరివగా చెప్పుకొనదగిన సంగీతపుముచ్చట శివపార్వతుల ఏకాంతమునవారి నర్మసంభాషణమున వినిపించి మురిపించుచున్నది.

"శ్రుతులంగూడుక రాగముల్ దెలుపవే శుద్ధంబుగాఁ గంతమా
గతిఁగన్నుగవ యొప్పెను మమతనౌఁగా తాళజాత్యంగ సం
గతి దప్పించి బదాల దారిఁజనుతేరీతిన్........

ఇందలి శ్రుతులంగూడం రాగములు శుద్ధంబుగా బాడవలయుననుట సంగీత సంప్రదాయము. తాళజాత్యంగ సంగతి తాళదశాంగములకు సంబంధించినది.

ప్రతి అసమగ్రముగానున్నది. సమగ్రముగానున్న ప్రతిలో మఱికొన్ని సంగీతప్రసక్తులుండవచ్చును. మొత్తముమీద ఈ రఘునాథ తొండమానుడు కవియేకాక గాయకుడును, సంగీత శాస్త్రాభిజ్ఞుడునుకూడ అయి ఉండుట ముదావహము.

—o—

# మను వసుచరిత్రాంతరిత పద్యస్వర రాగ సుధా రసధుని

"ఎబది యేండ్లనాడు సంగీతసభలయందెల్ల నెడల
        వీణాగానమున వీనుల విందొనర్చిన
మను వసుచరిత్రాంతరిత రాగమయ పద్యరీతి
        మనియుంటివా జీర్ణవృక్షంబు భాతి
అజ్ఞాత సరస్వతివై అణగియుందు వదేల
        అందుకొనుమమ్మ మా సంపూజనమ్ము
మఱల రావమ్మ సవరింపుమమ్మ శ్రుతిని అలరింపుమమ్మ
        మమ్ము మఱలనీ అమృతగానమ్ము పల్లవింప"

# యేసు చరిత్రము - రాగానుబంధము

1. శ్రీరాగము. 22 మేళకర్త. ఆరో : సరిమపనిస
అవ : సనిపధని పమరిగారిస

రిమపా పాపా మమపా మాపమమపా పనిసాస నినిసానిసా
శ్రీవక్షో జాఁ కురంగ నాథమెదపై జెన్నొంద విశ్వంభరా
రీగరిసా రీరీసరీ రిసాససాస రీరిసరీ రీగరీరీ రీ రీగరి
దేవిన్ తత్కమలా సమీపమున బ్రీతిన్ నిల్పినా, డో యసం
రీసరీ సారీసస నీనీపానీపా రిమపానీ సానిపదని పాపమ రీగారి
గాఁఁ వందారు సనందనాది నిజభక్త శ్రేణికిన్, దోఁచు రా
నిసా రీగరి రిసారి రీగరి రీసరీమామా పాపమామ రీరి గారిగ
జీవా ఖుండు కృతార్థు జేయు శుభదృష్టిన్ కృష్ణరాయాఁధి పున్

సారి నీసపా పానిమాపా మారీ
రిమపనీ పీపానీపాడా నీపా
మారి గారిసా

2. వరాళిరాగము : 4.39. మేళకర్త. ఆరో : సరిగమపదనిస
అవ : సనిధపమగారిస

సానిద పావ మాపాప నీనస సానిద పాప మపా మావ
ఉల్లము నందు నక్కటిక మూనుట మీకుల మందుఁ గంటి మం
దనిస నీససానస నినిసానస సానిసారీ పావ మమమ
చల్లన మేలమాడు, నచలాత్మజ మా, టకు లేఁత నవ్వున
పాపా నిదాప నీసా ససనిసరి నిపానిధపా పాసా నిసా
ధిల్లఁ గిరీటిఁ జాకు పతదివ్య, శరాధ్యునిజే యుశాం భరీ
నీసనిదపా సానిదా పపమ పావ పాపపమ సానిదాపామాగారీసా
ఖిల్లుఁడు,, కృష్ణరా యలక భీష్ట శుభప్రతి పాదిగాశుతన్ ,,
సనిధప నిదప దపమపమ గాగారీరీసా

3. అరభిరాగము : 29 మేళకర్త. (శంకరాభరణము) ఆరో : సరిమపధస
అవ : సనిదపమగరిస

దాసద పాదపా ,, మమప మపమ పాపమపా దసాస రీ
నాలుగు మోముల న్నిగమ నాదము లుప్పతిలం బ్రచండ వాతా

రీరీ మాగరీ రిసాస దదపాస ప మపాపప మపమాగరి
తులా హతిం జనించు రొదతో, డి గుహావళి నొప్పుమేరుపుం

రీసా మపాధ సాసా ధసదధపా దదదస దాద పాప దాధా
బోలెఁ బయోజ పీఠి మునిముఖ్యులు గొల్వఁగ వాణి గూడి పేరో

సాస రీరి మాగరి పాప మాగరీ రీసని దాప మాగరీసా
లగ మున్న ధాత, విభ వోజ్జ్వలుఁ జేయుతఁ గృష్ణ రాయనిన్

4. గౌళరాగము : 15 మేళకర్త. (ఒ) ఆరో : సరిమపనిస
అవ : సనిపమరిగమరిస

రీపమ రీరిస రీరిస నిసా రిమపనిసా రీరీసాసా సా
అంకము జేరి శైలత నయా స్తనదుగ్ధము లానువేళ బా

సాసా రీరీరి సాసరీరీ నీసరి సరిసా నినిసా సారి రీ
ల్యాంక విచేష్ట తొండమున వ్వలి చన్గ బళింపన బోయి యా

సనిపా పరిరీ పాపమరీ రీరిసప పారిస సానిపా మరీ
వంక కుచంబు గానకహి వల్లభు హారము గాంచివే మృణా

సాసస రిరిమమ పపపపా మమమరీ సనీమప రిగమరిసా
ళాంకుర శంకనం బెడుగజా స్యునిగొల్తు నభీష్టసి ద్ధికిన్,,

5. సింధూ రాగము : 29 మేళకర్త. ఆరో : సరిగరిమపస
అవ : సనిధపనిధపమగరిస

మాపపాసపా నినిదా నినిధాపమ గారిసా
(i) చేర్పుకక్కఁగా నిద్ధ చిన్నిజాబిల్లి చే,,

సరిగా గగరీ మమపాసా పనిదాపా నిదాపామాగరిసా
సింధూర,, తిలకంబు చెమ్మగిల్ల ,, ,,

వసంతరాగము 15 మేళకర్త. ఆరో : సరిగమపదనిస
అవ : సనిదమగరిస

(ii) మగమామ దమదాది సనిసాస సనిదామ
నవతంస కుసుమంబు నందున్న యెలదేఁటి
మమధామ దానిస దనిసరిరి_ సానిదామాసీ
రుతికించి దంచిత శ్రుతులనీన ..........

హిందోళరాగము : 20 మేళకర్త. ఆరో : శమగమపదనిస
అవ : సనిధమగస

(iii) దనిసాస సని సాసా మగమామ గాసాస
ఘనమైన రా, రాపు చనుదోయి రాయిడీఁ
నినిసాస నినిసనిదా సానిదమా గాగాసా
తుంబీ, ఫలంబులు తుందుడుకుఁ జెంద
నీసాదానీసాసాసా నీదామాగా

శ్యామరాగము : 28 మేళకర్త. ఆరో : సరిమపదస
అవ : సదపమగరిస

(iv) దదసాస రీరీరి దాససరి రీరీరి
తరుణాంగు శ్ఛాయ దంతపున రకట్టు
రిరిరిమాగరీ పసరీ సాదా పామా గారీరీపా
లింగలీకపు వింత రంగు లీన ........

సరస్వతిరాగము : 64 మేళకర్త. ఆరో : సరిమపదస
అవ : సనిదపమరిస

(v) మమప మమప దాదసా సీదసాసా
సుపని శత్రులు బోటులై యొలగింపఁ
రీమమమ పాపావప దాదసాసా రిరిమ
బుండరీ కాసనమునఁ గూర్చుండి మదికి
మామరిసా ససపానిదా డాదసాసా సానిదపా
నించు, వేడుక,, వీణవాయిం చు చెలువ
మమమపావ పపామరీ రిరిరి సాసా
నలువరాణి మదాత్మలో వెలయు గాతఁ
సరి మామమ మాపద సానిద దపమరీసా

కేదారరాగము : ఆరో : సమగమమపనిస
అవ : సనిపమగరిస

పాపా సపాపా సనిపామగా గమపపా సానినిపామగా సానిపాపా
కేదా ,రేశు భుజించితిన్ శిరమునన్ గిలించితిన్ హింగుళా
గాగమగా సనిపా పాసానిపా మగాసా పాసావసాససాసా సాని పామా
పాదాంభో రుహముల్ ప్రయాగ, విలయుం బద్మాక్షు సేవించి తిన్ ........
సాపాసాస ససానిపావ గమపాసా పామగా గామగాసా
యాదోనాథ సుతాకళత్రు బదరీనా రాయణుం గంటినీ

సాపా పాసా సనిపాపా సాసాసా ససాహ నిపాహుగా రీసాసాసా సమగమ....
యా దేశంబుననేలా చూచితి సమస్తాశావకాశం బులన్, పసపాపా

సారంగరాగము : ఆరో : సరిగమపదనిస
అవ : సనిదపమరిగమరిస

ససధా పమపమాపమరీరీ సససా పాపామ రిరీసాసా
గంగా స్వచ్ఛతరంగిళంగి కయకో గాఢచ్ఛ విచ్ఛన్నాసా
పాపాపానిద పావపావపమరీ మామాపపా మారిరీరిసా
రంగాంక ని రంకుశప్రతికళా ప్రౌఢిప్రియం భావుకా,,

మామమా పావప సానిదావమా రిసా పాపామరీరీ సాసాసా
గాంగే యాచల చాపనూపుర వచో గాంభీర్యలీ లాస్పదా

బంగాళరాగము : ఆరో : సరిగమపమరిపస
అవ : సనిపమరిగరిస

పపసా రీరీరీ సరిమాగ సరిససా నిసమరీ రీగరిసా
బంగా ళాంగ కళింగభూ పసుభటా భ్రశ్రేణి ఘుఉరూనిలా
సరిగమ పమ రిపసా సానీపమారీ గరీసా

కుంతల వరాళిరాగము : 28 మేళకర్త. త్రిసజాతి ఏకతాళము
ఆరో : సమపధనిధస
అవ : సనిధపమప

ససస మామ పధనిపాము దానిదాద పాపమా
కురుకు కాళ కురుకరూళ కోసలాంధ్ర సింధు బా
ధస దపాప సాససాస దానిదాదా పాపమా
హ్లీక శకాంగ వంగసింహ శేళకన్య కామణీ
ససస మామ మమమసస సానినీద దాపమా
ప్రకరపాణి ఘటితరత్న, పాదుకాక లాచికా
మమమసాసని నీనిదాద సమపాదానీదా మామమా
ముకురవీటి, కాకరండ ముఖ్యరాజా,, లాంఛనా।
స్వా. మ. చ. i – 83.

మలయమారుత రాగము : (చక్రవాకరాగజన్యము) 16 మేళకర్త.
ఆరో : సరిగపధనిస
అవ : సనిదపగరిస

దనిసస సారిస సససస
మృగమద సౌరభ విభవ,

నిదనిస సరిగాగగాగ పాగారీసాసా
ద్విగుణిత ఘనసారసాంద్ర వీటిగంధ
ధనిసానిద దనిదదపా
స్థగితేతర పరిమళమై
గపధని దమ నిదధపగప గాగప గరిసా
మగువవౌలుపు వెలుపునొక్క, మారుత మెలసెన్

చక్రవాకరాగము : 16 మేళకర్త. ఆరో : సరిగమపదనిస
అవ : సనిధపమగరిస

పపగారీసా గమామమా పపపహ దానీదపాప పాపాపా
అతడావాత పరంపరా పరిమళ వ్యాపారలీలన్ జనా
ధనిసాసా రీరీరీరీ గగమా పామగా గరి
న్విత మిచ్చోటని చేరబోయి కనియెన్ విద్యుల్లతా విగ్రహన్
సనీదాదప నిధపాపాప పగమగా మాపాపా దానీదదా
శతపత్రేక్షణ చంచరీక చికురన్ చంద్రాస్య చక్రస్తనిన్
దపపాప దధపా పపామపా గారీ నీదపమా గరీసా
నతనాభిన్ సవలా నొకానొక మరు న్నారీ శిరోరత్నమున్
స్వా. మ. చ. ii - 25

కేదారరాగము : 29 మేళకర్త. ఆరో : సమగమపనిస
ధీరశంకరాభరణ జన్యము అవ : సనిపమగరిస

పామగమ పాపప సాసససపసస పాపామాగా సాసాససా
తావున్, క్రేవలఁ జల్లుచెంగలువ కేదారంబు తీరంబునన్
పాసాసా సాపసస సాని పామ గమ పామాగారీ సాససాసా
మావుల్ క్రోవులు, నల్లి బిల్లి గొను కాంతారంబు నందైందవ
గామా పాపప నీపాసాసప ససస సానిపామరీగారీనీ సాసస
గ్రావా కల్పిత కాయమానజ ట్వల ద్రాక్షాగుళుచ్ఛంబులం,,

సాసాపా సస సగరి సాసాసాసానిపామా గా సానిపామా గారీసా సససా
బూవుం దీవెల నొప్పునొక్క భవనంబున్ , గారుడో, త్కీర్ణమున్,,
స్వా. మ. సం. ii - 22

నాటరాగము : 36 మేళకర్త. ఆరో : సరిగమపదనిస
అవ : సనిదపమగరిస

ఆరోహణ, అవరోహణసంపూర్ణము.

మదమపా పాపాపా పనిసా,సా సనిపామా
తతనితం బాభోగ ధవళాంశు కములోని

గామపా పామ గాగసాసా ససాససా సస
యంగద ట్టపు గావిరంగు వలన , ,,

పపపాసాప సాససాస సాసాస గాగ సా సా సా సాసా
శశి కాంత మణిపీఠి , , , జాజు వా ఱంగ గాయ

గాసాస సనిపాపపా మాగాగానీ సాసా
లుత్తుంగ కుచపాళి, న త్తమిల్లఁ , ,

సాగాగా మామామా పాపాప పామామగాసాసా
తరుణాంగుళీ ధ్వాత తంత్రీస్వనంబుతో

సగసస ససీనిప సని ప మ మాగాసా
జిలిబిలి పా,,ట ముద్దులు, నటింప

గగా మామ పప పాప రీరీ మామా రిరి
,నా లాప గతిఁజొక్క యర మోడ్పుఁ గను

పాసా గమపాప పాపప మమమ ససస
దోయి రతిపార వశ్యవి భ్రమము దెలుప

పాస గమపాప పామామ రీరీరీ సా స సా
ప్రౌఢిఁ బలికించు గీత ప్ర బంధ ములకుఁ

గామ గమ పావప ప పా పపాపా రిపమరి రిస
గ్రమ కర పంకరు, హ రత్న, కటకఝణ ఝ

స గ మ పాప నీపా మామ మమ రిరిసా
జధ్వని స్ఫూర్తి తాళమాన ములు గొలుప
సాస గమపాప పామ రీ రీ రి సా సా
నింపు దళుకొత్త వీణ వాయింపుచుండి

నటభైరవి రాగజన్యము : 20 మేళకర్త.
జయంతశ్రీరాగము :

ఆరో : సగమదానిస
అవ : సనిదమపమగస

సగమ దానీ సా సాసనీనిదాదమామ గాగాగా సానిదమనీదమ
ఎక్కడి వాఁడొ యక్షతనయేంద్రు, జయం । । । । । । త

వసంతరాగము : 15 మేళకర్త

ఆరో : సగమదనిస
అవ : సనిదమగరిస

ని దామ నిసాససా
వసంత కంతులన్

మమమ దాదదా ని సస నీనిని సాసస నిదా ద మామగాగగా
జక్కద నంబునన్ గెలువ, జాలెడు వాఁడు మహీ, సురాన్వయం
సాగగ దా దమా సాసపాస గాగమామ గాగగ సానిదా గమా
బెక్కడ యీతనూ విభవ, మెక్కడ, యేలని బంటుగా మరం
మదా ద మ మామామా గగమా మదాదాదా దానీనిసాళసాససా
దక్కఁగొనం గరాదె యకటా నసువీఁడ, పరిగ్రహించినన్

సంపూర్ణ నాటరాగము : 36 మేళకర్త.

ఆరో : సరిగమపదనిస
అవ : సనిపమరిస

గామపాపా పమగాగ సాస గమ పపా పాసాససా పామగాసా
వాలారుం గొనగోళ్ల నీ వలసతన్ వాయించుచో నాటకున్

గామపాపావస మపా వ సాగ గగా పామామగా సాససా పా
మేళంబయిన విపంచి నిన్ని మొద లున్ నీవంట మింజేసి యా
సా మమపాపా స నీ వ మ రీరి రీ సా స పామా పామాగాసా
యాలాపంబె యవేళఁ బల్కెడుఁ బ్రభాతా యాతవాతాహతా

దేశాక్షిరాగము :

సాస ని ద ప మాగగరిస సపసా రీమాగరి సారీగప ద స
లోల త్తంత్రుల మేళవింప, గదవే లోలాక్షి, దేశాక్షికిన్ ,
సపనినిదద పపామామాగరి.

# వసుచరిత్రము - రాగానుబంధము

1. శ్రీరాగము : 22 మేళకర్త. ఆరో : సరిమపనిస
అవ : సని పదని పమరిగారిస

రీపా మరీ రీ స నీసీ పసీసానిస రి రిమామామపా పపా
శ్రీ భూపుత్రి , , వివాహవేళ నిజ మంజీరాగ్ర రత్నస్వలీ
పానీ సాసస సా సరి గ ణ రిసరీరీ రీగ రీ రీ స రీరీ
లాభి వ్యక్తిప రాంఘ్రిరేఖ భవ కన్యాలీలయంచున్మదిం
రీప మరీరిరి స రిసాససా సనిపమా నీపామదీ రీరీరీ
దా ఖా,వింప, శుభక్రమా కలనచే దద్రత్నముం గప్పుసీ
పామాపామరీ రీమామపా రిమమపాపా పపాపపామ రీరీరీనీ
తాభామావతి ప్రోవుతం దిరుమలేంద్ర , శ్రీమహా , రాయనిన్

వ. చ. i – 1

2. నాటరాగము : 36 మేళకర్త. ఆరో : సరిగమపదనిస
అవ : సనిపమరిస

పా మాపా పాపమా పామమగా గగస గామాపాపా పపాపపాపపా
నా నా , గాయన గాయనీమ ఖల గానంబుర్వి ,నాలింపమో
పాపాసా సాగాగాగగ సాససాసనస గాముపా పాపాపాపా స
నానాటన్ నగభేది పీటగల ,, గంధర్వోప్సరోగీత వి
మామ గగ నస గాగ సాసా సాససా సనిపాప పనిపాపపమ
ద్యానై పుణ్య,ముల్నెయేని వినమో యంద్రైన నింద్రైన విం
మామాగాగగగ గాపాసా పమమ పమామామగా సాసాసా
ద్రైనాదంబొన, గూర్చునే మదికి నిట్లానంద సంధోహమున్

వసుచరిత్ర ii – 16

3. కాంభోజిరాగము : 28 మేళకర్త జన్యము ఆరో : సరిగమపదస
అవ : సనిదపమగరిస

పాదాసా సనిదాదాదా దాపాపప పాదాసాసాస దాపాపపా
ఆజాబి ల్లిపెలుంగు పెల్లికల దాయన్లేక రాకానిశా
దాపాపా పద సాసా దానిదపాపపప పదాసాసాసా సపస పదసానీదా
రాజశ్రీ సఖమైన మో ,, ,, మునః బటాగ్రంబొత్తి , , యెగ్గెత్తియా
గారీసాసస దాపప మగ పదసాసా మాగపదాసాసా సాసా
రాజీవానన యేడ్చెః గిన్నరవధూ రాజత్కాంభోజ కాం
రి నీదా సాసాసస నీద పదదా దాపాపసా మాగపాదాసాసా
భో, జీ మేళవిపంచి కారవసుధా పూరంబు తో , రంబుగన్

వ. చ. iv – 52

హిందోళరాగము : ఆరో : సగమదనిస
అవ : సనిదమగస

సగమా గగమప దానిసాస సనిదాదదాదదా నినిసా ససా
అరిగా పంచమ మేపగించి సవలాలవ్వేళ హిందోళ, లై
గగ మ మాప మగ గసాస నీసనినిప నినిసగా ససస నీససా
ఖరిఃబూ న న్ బికజాత మాత్సరప భంగవ్యా కులం బైపనీ
నినిసా సా ససా గగ సప సస నినిసా సహస దదాదదమా
ధరనా లంబిత పల్లవ వ్రత విధుల్ దాల్పం దదీయధ్వనిన్

వసంతరాగము : ఆరో : సగమదనిస
అవ : సనిదమదురిస

సరి దామా దనిసా నిదాద దమ ససాదనిదామ గారీ రిసా
సరి గాగై కొనియెన్ వసం తము మహాపంపూర్ణ భావోన్నతిన్

# రాగాన్విత ధ్యానమ్

శ్రీరాగము :

ఆరో : సరిమపనిస
అవ : సనిధనిపమరి గారిస

రీగారిసా సారిమామ పావనినిసా ససరిని
శ్రీనా టాద్యనంత రాగసహితాం స్వరవర్ణ
సస రీసరీ
సం శోభితామ్

రీసామా రీరి రిసా నిసాన సనిపా
శ్రీనాధా - ది మహా కవీంద్ర వినుతాం
దనిపా మపా రీగరిసాస
వందే సదా భారతీమ్

కల్యాణి :

ఆరో : సరిగమపదనిస
అవ : సనిదప మగరిస

గాగ రిరి గగ మా పధనిసా సీరీరి సరిగాగమగా
కావ్య ప్రబంధగీత బహుళా, మాంద్రీం కళ్యాణప్రదామ్
మాపామాగా రిగాగ గరీస పసరీ గరిగా సానిసా
వీణా వేణు మృదంగ గ్నాన రసికాం వందే ........
నిదాద పదా మగారీసా
చ్ఛంద ప్రదాం శారదాం

మధ్యమావతి :

ఆరో : సరిమపనిసా
అవ : సనిపమరిసా

పనిసా సాస రీరి సరీ రీపామ రీసా ససా
రఘునాథాది కా, వ్యశ్రీ కల్హార మాలా ధరాం
రీపా నిపా నినిపా మమపా సానిపా సీసా మాపనీసా
అం బిబ్బా మనిశం వెౌ, మి సాహిత్తి గీతి సంగతామ్

రాగము : సురటి
తాళము : ఆది
ఆరో : సరిమపనిస
అవ : సనిదమగపమరిస

పల్లవి

రీమా పానీసా నీదపా
ఆం ధ్రవాణీ మంగళం
మమప పమరీ మరీ రిసా
అమృతవర్షిణీ మంగళం

అనుపల్లవి

నీదపాపా నీదనీ సాససా
నాట్యరాజ్ఞీ నాదస్వరూపిణీ
నీదానీసరి నీదపా మమారి మామ పనీ
కాంతామణి కమలా జగన్ మో, హినీ

చరణం

నిదపమాప మపా నిదపనీనిపా
కవనగాన సుధా కలితక్షీరదే
నిదనిసీస సగసరి సానిదపామా మమపనీ
కవిగా, యుక్ ప్రి యునాదసునా ద, ప్రియే ॥ఆంధ్ర....॥

మిగిలిన చరణములన్నిటికి స్వరరచన ఇదియే. ఇటులనే పాడుకొన దగును.

# వరివస్యీతానంత రాగాలాపిని

"ఆలపించిన అనంతానంతానంత యనుచు
    పల్లవించెడి రాగఝురుల భాతి
కొనగోట మీటిన శ్రుతిగూడి పల్కెడి వీణా
    ప్రక్వాణ ప్రక్వణ ధ్వానలహరుల మాడ్కి
అనంతశైలాలయ గోపురస్థిత సప్తసర్వకలశముల వోలె
    గ్రంథాలయౌజ్జ్వల్యమును చాటు మదుపలాలిత
పరిష్కృత సహస్ర గ్రంథరాజమ్ములారా! స్వరాక్షరమూర్తులారా!
    జన్మజన్మల మిమ్ము అర్చింపనిండు"

# ఉపయుక్త గ్రంథసంకేతిని

| | గ్రంథనామము | గ్రంథ సంకేతాక్షరములు | గ్రంథకర్త నామము |
|---|---|---|---|
| 1. | అష్టమహిషీకల్యాణము | అ.మ.క. | తాళ్లపాక తిరువేంగళనాథుడు |
| 2. | ఆముక్తమాల్యద | ఆ మా. | శ్రీకృష్ణదేవరాయలు |
| 3. | ఇందుమతీపరిణయము | ఇం ప. | కుమారధూర్జటి |
| 4. | ఇందుమతీపరిణయము | ఇం ప. | తెనాలి రామభద్రకవి |
| 5. | ఉత్తర రామాయణము | ఉ.రా. | కంకంటి పాపరాజు |
| 6. | ఉద్భటారాధ్యచరిత్రము | ఉ.రా.చ. | తెనాలి రామకృష్ణకవి |
| 7. | ఉషాకల్యాణము | ఉ.క. | తాళ్లపాక తిరువేంగళనాథుడు |
| 8. | ఉషాపరిణయ | ఉ ప. | రంగాజమ్మ |
| 9. | ఏకదశీమాహాత్మ్యము | ఏ.మా. | ప్రౌఢకవి మల్లన |
| 10. | ఔమావతము | ఔ.ప. | ఉమాపతి |
| 11. | కకుత్స్థ విజయము | క.వి | మట్ల అనంతభూపాలుడు |
| 12. | కళాపూర్ణోదయము | క.పూ. | పింగళి సూరన |
| 13. | కావ్యాలంకారసంగ్రహము | కా.సం. | రామరాజభూషణుడు (మూర్తి కవి) |
| 14. | కాశీఖండము | కా.ఖం. | శ్రీనాథుడు |
| 15. | కాళహస్తీరమహాత్మ్యము | కా.హ.మా. | ధూర్జటి |
| 16. | కాళిందీకన్యాపరిణయము | కా.క.ప. | అహోబలపతి |
| 17. | క్రీడాభిరామము | క్రీ.రా. | వల్లభామాత్యుడు |
| 18. | కుచేలోపాఖ్యానము | కు.పా. | ఘట్టు ప్రభువు |
| 19. | కృష్ణరాయవిజయము | కృ వి. | కుమారవిజయము |
| 20. | గానకళాప్రవేశిక | గా.క ప్ర. | ఏకా సుబ్బారావు |
| 21. | ఘటికాచలమహాత్మ్యము | ఘ మా. | తెనాలి రామకృష్ణకవి |
| 22. | చంద్రభానుచరితము | చం భా.చ. | తరిగొప్పుల మల్లన |
| 23. | చంద్రికాపరిణయము | చం ప. | సురభిమాధవరాయకవి |
| 24. | చిత్రభారతము | చి.భా. | చరిగొండ ధర్మన్న |
| 25. | జైమినీభారతము | జై.భా. | పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు |
| 26. | తపతీసంవరణోపాఖ్యానము | త.సం.పా | అద్దంకి గంగాధరకవి |

| | | | |
|---|---|---|---|
| 27. | దత్తిలము | దత్తి. | దత్తిలాచార్య |
| 28. | ద్విపదభాగవతము | ద్వి భా. | మడికి సింగన |
| 29. | నవనాథచరిత్రము | న.చ. | గౌరన |
| 30. | నాట్యవేదము | నా.వే | జమ్ములమడక మాధ |
| 31. | నాట్యశాస్త్రము | నా.శా. | వరాయశర్మ |
| 32. | నాట్యశాస్త్రము(తెనుగు) | నా.శా. | భరతముని పోణంగి శ్రీరామ అప్పారావు |
| 33. | నాసికేతూపాఖ్యానము | నా.కే.పా. | దగ్గుపల్లి దుగ్గన |
| 34. | నిరంకుశోపాఖ్యానము | ని.పా. | కందుకూరి రుద్రకవి |
| 35. | నృత్తరత్నావళి | నృ.ర. | జాయపసేనాని |
| 36. | పద్మపురాణము | ప.పు. | జాయపసేనాని |
| 37. | పరమయోగివిలాసము | ప.వి. | తాళ్లపాక తిరువేంగళ నాథుడు |
| 38. | ప్రభావతీప్రద్యుమ్నము | ప్ర.ప్ర. | పింగళి సూరన |
| 39. | ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము | ప్రరా.వేం.వి.వి. | గణపవరపు గంగాధరకవి |
| 40. | ప్రబోధ చంద్రోదయము | ప్ర.చం. | నందిమల్లయ—ఘంటసింగన |
| 41. | ప్రసన్న రాఘవ నాట్య ప్రబంధము | ప్ర.ప్ర. | బొడ్డుచర్ల తమ్మయ |
| 42. | పల్నాటి వీరచరిత్ర | ప వీ.చ. | శ్రీనాథుడు |
| 43. | పాండురంగమహాత్మ్యము | పాం.రం.మా. | తెనాలి రామకృష్ణుడు |
| 44. | పార్వతీపరిణయము | పా.ప. | రఘునాథ తొండమానుడు |
| 45. | పారిజాతాపహరణము | పా.ప. | నంది తిమ్మన |
| 46. | బహుళాశ్వచరిత్రము | బ.చ. | దామర్ల వేంగళభూపాలుడు |
| 47. | భీమేశ్వరపురాణము | భీ.పు | శ్రీనాథుడు |
| 48. | భోజరాజీయము | భో.రా. | అనంతుడు |
| 49. | మనుచరిత్ర | మ.చ. | అల్లసాని పెద్దన |
| 50. | రాగతాళచింతామణి | రా.తా.చిం. | పోలూరిగోవిందామాత్యుడు |
| 51. | రాగవిబోధనము | రా.వి. | సోమనాథుడు |
| 52. | రాజగోపాల విలాసము | రా.వి. | చెంగల్వకాళకవి |
| 53. | రాజవాహనచరిత్రము | రా.వా.చ. | కాకమాని మూర్తికవి |
| 54. | రాజశేఖరచరిత్రము | రా.శే.చ. | మాదయగారి మల్లన |

| | | | |
|---|---|---|---|
| 55. | రాధామాధవము | రా.మా. | చింతలపాటి ఎల్లనార్యుడు |
| 56. | రాధికాసాంత్వనము | రా.సా. | ముద్దు పళని |
| 57. | రామాభ్యుదయము | రామా. | అయ్యలరాజు రామభద్రుడు |
| 58. | రామాయణము | రామా. | రఘునాథనాయకుడు |
| 59. | రామాయణము | రామా. | మొల్ల |
| 60. | వరాహపురాణము | వ.పు. | నందిమల్లయ<br>ఘంట సింగయ |
| 61. | వసుచరిత్ర | వ.చ. | రామరాజభూషణుడు |
| 62. | వాల్మీకిచరిత్రము | వా.చ. | రఘునాథనాయకుడు |
| 63. | విక్రమార్కచరిత్రము | వి.మా.చ. | జక్కన |
| 64. | విజయవిలాసము | వి.వి. | చేమకూర వేంకటకవి |
| 65. | విప్రనారాయణచరిత్ర | వి.నా.చ. | చదలవాడ మల్లయ |
| 66. | విష్ణుపురాణము | వి.పు. | వెన్నెలకంటి సూరన |
| 67. | వైజయంతీవిలాసము | వై.వి | సారంగు తమ్మయ |
| 68. | శశిరేఖాపరిణయము | శ.రే.ప. | అప్పప్పకవి |
| 69. | శివరాత్రిమహాత్మ్యము | శి.మా. | శ్రీనాథుడు |
| 70. | శ్రీరంగమహాత్మ్యము | శ్రీ.మా. | కవిభైరవుడు |
| 71. | శృంగారనైషధము | శృం.నై. | శ్రీనాథుడు |
| 72. | శృంగారశాకుంతలము | శృం.శా. | పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు |
| 73. | శృంగారమల్హణచరిత్రము | శృం.మ చ. | ఎడపాటి ఎల్లన |
| 74. | శృంగార సావిత్రి | శృ.సా. | రఘునాథనాయకుడు |
| 75. | సకల నీతికథానిధానము | స.నీ.క.ని. | ఎఱయ |
| 76. | సంగ్రహ చూడామణి | సం.చూ. | గోవిందార్య |
| 77. | సంగీత శబ్దార్థచంద్రిక | సం.శ.చం. | అరిపిరాల సత్యనారాయణ |
| 78. | సంగీతదర్పణము | సం.ద. | చతురదామోదరుడు |
| 79. | సంగీతసంప్రదాయ ప్రదర్శిని | సం.సం.ప్ర. | సుబ్బరాయదీక్షితులు |
| 80. | సంగీతరాజము | సం.రా. | నృపతి కుంభకర్ణ |
| 81. | సంగీతసుధ | సం.సు. | రఘునాథనాయకుడు |
| 82. | సంగీత స్వరప్రస్తార | సం.స్వ.ప్ర.సా. | వాదముని వందితుడు |
| 83. | సంగీత సమయసారము | సం.స.సా. | పార్శ్వదేవుడు |
| 84. | సంగీత విద్యాదర్పణము | సం.వి.ద. | ఏకా సుబ్బారావు |

| | | | |
|---|---|---|---|
| 85. | సంగీత మకరంద | సం.మ. | నారదముని. |
| 86. | సంగీత పారిజాతము | సం.పా. | అహోబలపండితుడు |
| 87. | సంగీత చూడామణి | సం.చూ. | జగదేకమల్లు |
| 88. | సంగీతరాజము | సం.రా. | కుంభరాణ |
| 89. | సంగీతరత్నాకరము | సం.ర. | శార్ఙ్గదేవుడు |
| 90. | సమీర కుమారవిజయము | స.కు.వి. | పుష్పగిరి తిమ్మన |
| 91. | స్వరమేళ కళానిధి | స్వ.క. | రామామాత్యుడు |
| 92. | సారంగధర చరిత్రము (ద్విపద) | సా.చ. | బాణాలశంభుదాసుడు |
| 93. | సారంగధర చరిత్ర | సా.చ. | చేమకూర వేంకటకవి |
| 94. | సింహాసన ద్వాత్రింశిక | సి.ద్వా.త్రి. | కొఱవి గోపన |
| 95. | సుదక్షిణాపరిణయము | సు.ప. | తెనాలి అన్నయ్య |
| 96. | సుగ్రీవవిజయము | సు.వి. | కందుకూరి రుద్రకవి |
| 97. | షట్చక్రవర్తి చరిత్ర | ష.చ. | కాచవిభుని మల్లారెడ్డి |
| 98. | షోడశ కుమారచరిత్రము | షో.కు.చ. | వెన్నెలకంటి అన్నయ్య |
| 99. | హంస వింశతి | హం.విం. | అయ్యలరాజు నారాయణామాత్యుడు |
| 100. | హరవిలాసము | హ.వి. | శ్రీనాధుడు |
| 101. | హరిశ్చంద్రోపాఖ్యానము | హ.పా | గౌరన |
| 102. | "Universal History and music" Chow.. sans, Studies Vol. xxxi. | | S.M. Tagore |
| 103. | "Hindu music from Various Authars" Vol. xiix | | |
| 104. | 'Dictionary of South Indian music musicians and instruments" | | |
| 105. | History of Indian music. | | Pingle |

# నీ రా జ న మ్

ఆంధ్రవాణీ మంగళమ్
అమృత వర్షిణీ మంగళమ్

నాట్యరాజ్ఞీ నాద స్వరూపిణీ
కాన్తామణీ కమలా జగన్మోహినీ

కవన గాన సుధా కలిత క్షీరదే
కవిగాయక ప్రియనాద సునాదప్రదే

నన్నపార్య జనయిత్రీ సారమతీ నవనీతే
శ్రీనాథ సుత ప్రియా హిందోళ రాగాంకితే

కృష్ణరాయకృత కవన కుతూహలా
పెద్దనార్య సంభావిత దేశాక్షీ కోలాహలా

రామరాజభూషణ రచిత వకుళాభరణే
రఘునాథ పూజిత లలితారుణచరణే

నవయుగోదిత కవిగణ బృంహిత
స్వాతంత్ర్యోద్ఘోషిత సద్గేయ సహితే

స్వరబ్రహ్మనందిత శారదా వందిత
పురుషోత్తమాను మోదిత సత్యవతీ మాతః॥

ఇతి
బుధజనాత్మీయా
బూదరాజు వేంకట శార